# శాతవాహన సంచిక



ఆంధ్రేతిహాస సంశోధక మండలి

★ గుంటూరు ★

# సాతవాహన సంచిక

సంపాదకుడు:
మారేమండ రామా రావు, ఎం. ఏ., పి. హెచ్. డి.,
చరిత్రాచార్యుడు, నైజాం కలాశాల, ఉస్మానియా విశ్వవిద్యాలయము



Presented to
Sri. Rallabandi Subba Rao Garu
with best respects
M. Rama Rao.
16-2-1956.
Hyderabad



(205)

ఆంధ్రేతిహాస సంశోధక మండలి
గుంటూరు * 1950



*

# అంకితము

బొబ్బిలి సంస్థానాధీశ్వరులగు

శ్రీ రాజా రావు శ్వేతా చలపతి రంగా రావు

బహద్దరు వారికి

*

# విషయ సూచిక

# ప్రస్తావన

మా మండలివారు ఆంధ్ర సామ్రాజ్యోత్సవమును జరపి, తత్ఫలితముగ నీసంచికను ప్రకటింప వలె నని 1947 వ సంవత్సరము జనవరి నెలలో తీర్మానించిరి. ఉత్సవము ఆ ఏప్రిలు నెలలో అమరావతీ- ధాన్యకటకమున జరిగినది. ఈసంచికను ఇప్పుడు ప్రకటింప గలిగితిమి.

ఉత్సవకాలమునకు కొన్ని వ్యాసములు మాత్రము వచ్చినవి. తక్కినవి మాకు చేరుటలో కొంత ఆలస్యమైనది. ఈసంచికప్రకటనకు ప్రభుత్వమువారి అనుమతి వచ్చుటయు, అవసర మగు కాగితమును సంపాదించుటయు మరికొంత ఆలస్యమునకు కారణములైనవి. నేను ఆకస్మికముగా గుంటూరు వదలి హైదరాబాదుకు వెడలి ముద్రణమును అక్కడనుండి సాగించుటవలన నింకను కొంత ఆలస్యమైనది.

ఇందు కొన్ని చిత్రములను మాత్రము చేర్చితిమి. మరికొన్ని చిత్రములను, పటములను అకారాదిసూచికను ప్రత్యేకముగ త్వరలో వెలువరింతుము.

శ్రీ జయపుర మహారాజా వారును, శ్రీ బొబ్బిలి రాజావారును, మొదటినుండియు మా మండలియెడల ఆదరాభిమానములను చూపుచుండిన గుంటూరు పురప్రముఖు లనేకులును విశేషముగ ధనసాహాయ్యము చేసిరి. సాతవాహన యుగ చరిత్రమును ప్రత్యేకముగ పరిశీలించిన మిత్రు లనేకులు చక్కని వ్యాసములను రచించి పంపినారు. ఆర్షశాఖ డైరెక్టరు జనరలు అనేక సాతవాహనయుగ వాస్తు చిత్రములను ప్రకటించుట కనుమతి నొసగి వాని ఫొటోలను మాకు లభింప జేసిరి. ఆంధ్ర పత్రికా సంపాదకులు శ్రీ శివలెంక శంభుప్రసాద్ గారు బ్లాకులను తయారు చేయించుటలో సాహాయ్యము చేసిరి. మిత్రులు శ్రీ కొమరగిరి నరసింహారావు గారు సాంచీతోరణముల రేఖాచిత్రమును వ్రాసి యిచ్చిరి.

మిత్రులు శ్రీ వావిలాల సోమయాజి, శ్రీ ప్రయాగ శేషాద్రి శాస్త్రి గార్లు ఆసాంతమును అమూల్యమగు సహకారము నొసగిరి.

వెల్‌కం ప్రెస్ అధిపతులు శ్రీ జంధ్యాల వెంకటప్పయ్య శాస్త్రి గారు ఈసంచిక ముద్రణ కార్యమును స్వకార్యముగ నిర్వహించిరి.

మండలి అధ్యక్షు లగు శ్రీ దివాకరుణి లక్ష్మీనారాయణ గారి యొక్కయు, మహర్షి శ్రీ బులుసు సాంబమూర్తి గారి యొక్కయు, శ్రీ తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రి గారి యొక్కయు ప్రోత్సాహాశీర్వచనములు ఈ యుద్యమ సాఫల్యమునకు మూలకారణములు.

ఈసహాయకు లందరికిని నేను కృతజ్ఞుడను.



మారేమండ రామా రావు
సంపాదకుడు,
కార్యదర్శి - ఆంధ్రేతిహాస సంశోధక మండలి

గుంటూరు
10.5.1950

# సహాయకులు

సాహిత్య సమ్రాట్, కళాప్రపూర్ణ

శ్రీ డాక్టరు విక్రమదేవ వర్మ బహద్దరు వారు

,, రాజా రావు శ్వేతాచలపతి రంగారావు బహద్దరు వారు

మా. శ్రీ కళా వెంకటరావు గారు

మా. శ్రీ బెజవాడ గోపాల రెడ్డి గారు

మా. హాలాహల్వి సీతారామ రెడ్డి గారు

,, దివాకరుణి లక్ష్మీనారాయణ గారు

,, మంచుకొండ గౌరీశంకర్ గారు

శ్రీ జస్టిస్ భువల్కా గారు

,, విన్నపాముల లక్ష్మీ నరసింహం గారు

,, దేశిరాజు హనుమంతరావు పంతులు గారు

,, అరవపల్లి వెంకటరావు గారు

,, మేళ్ళచెరువు విశ్వపతిశాస్త్రి గారు

# ఆంధ్ర సాతవాహన సామ్రాజ్యోత్సవము

# అధ్యక్షోపన్యాసము.*



డా॥ నేలటూరి వెంకటరమణయ్య ఎం.ఎ., పిహెచ్.డి.

మిత్రులారా!

ఈ సాతవాహన సామ్రాజ్యోత్సవమునకు నన్ను అధ్యక్షునిగ నహించమని ఆహ్వానించిన ఆంధ్ర శాతవాహన సంస్థాపక సంఘమువారికి నేను కృతజ్ఞుడను. ఆ ప్రాచీనాంధ్రుల సంతతికి చెందిన మనము వారి సామ్రాజ్యము అవతరించి సుమారు 1600 సంవత్సరములు అయిన పిమ్మట వారి సామ్రాజ్యకేంద్రముగనుండిన యీప్రాంతమున సమావేశమై నాలుగుశతాబ్దముల కాలము దక్షిణాపథమును వ్యాపించిన ఆ మహాసామ్రాజ్య మహోజ్జ్వలచరిత్రను స్మరించుకొనుట మిక్కిలి యుక్తముగ నున్నది.

ఆనాటి ఆంధ్రులు బహుప్రశంసనీయులు. రాజకీయమతసారస్వతకళాది వివిధరంగములలో వారు చేసిన కృషి అద్భుతమైనది. ఈ దేశపు సంస్కృతివికాసమునకు వారు చక్కని దోహద మొసంగిరి. అశోకచక్రవర్తి మరణానంతరము మౌర్యసామ్రాజ్యము విచ్ఛిన్నమగుటతోడనే సాతవాహనవంశీయుల నాయకత్వమున విజృంభించి ఆంధ్రులు యావద్దక్షిణాపథవ్యాప్తమగు రాజ్యమును నిర్మించి, మగధ నాక్రమించి, కొంతకాలము సమ్రాట్టులుగ పరిపాలించిరి. క్రీస్తుశకారంభకాలమున ఉత్తరాపథమంతయు మ్లేచ్ఛాక్రాంతమయ్యెను. అట్టి క్లిష్టసమయమున మహామేరువువలె నిలచి ఆంధ్రులు ఆ మ్లేచ్ఛవాహినులు దక్షిణమునకు రాకుండ అడ్డుకట్టిరి. సాతవాహనయుగపు ఆంధ్రనావికులు సముద్రములపై స్వైరవిహారము చేసి బర్మా, మలయా మున్నగు దేశములతోను, ప్రాచ్యద్వీపములతోను వాణిజ్యసాంస్కృతికసంబంధములను నెరపిరి. సాతవాహనరాజులు చాలమంది వైదికధర్మానుయాయులే అయినను వారు ఇతరమతములనుకూడ ఆదరించిరి. వారి పరిపాలనాకాలమున బౌద్ధమతము అపూర్వమగు శోభను గాంచినది. ఆనాడు దేశదేశములనుండియు నిచటి బౌద్ధక్షేత్రములను దర్శించి, ధర్మబోధనలను వినుటకు వేనవేల యాత్రికులు వచ్చుచుండిరి. ఆచార్యనాగార్జునుడు,

* ఆంగ్లమునకు అనువాదము — సంపాదకుడు.

ఆర్యదేవుడు మున్నగు భిక్షువు లెందరో ఇచట ప్రచారము చేసి యొక క్రొత్తధర్మమును, క్రొత్త నిర్మాణవిధానమును వ్యాప్తిలోనికి దెచ్చిరి. ఈ బౌద్ధమతపునరుజ్జీవనము వాస్తువునకును, కళకును నూతనవికాసము నొనగూర్చినది. దేశమునందంతటను చైత్యములు, స్తూపములు, విహారములు నిర్మింపబడినవి. కార్లా నాసిక అజంతాగుహాలు ఇట్టివే. శిల్పమును, చిత్రలేఖనమును క్రొత్త వికాసము నంది ఈమతప్రచారమునకు చక్కగ నుపకరించినవి. ఈ కళలలో నాటి ఆంధ్ర శిల్పులును, చిత్రకారులును తమకౌశలమును, ఉపజ్ఞను అద్భుతముగ చూపిరి. భట్టిప్రోలు, జగ్గయ్యపేట, అమరావతులలో దొరికిన శిల్పసంపద దీనికి చక్కని నిదర్శనము. సాతవాహనయుగమున సారస్వతమును బాగుగ నభివృద్ధి నందినది. అందునను ప్రాకృత వాఙ్మయవికాసమునందు అది స్వర్ణయుగము. సప్తశతి, లీలావతీ కావ్యము లిట్టివే.

ఈ సాతవాహనయుగమునుగురించి మనకు తెలియవచ్చు విషయములు బహుపరిమితములు. అందలి ముఖ్యాంశములు కొన్ని మాత్రము సునిశ్చితములుగ నున్నవి. మిగిలినవి అనేకములు వివాదాస్పదములుగ నున్నవి. ఇందు మొదటిది ఆంధ్రులపూర్వోత్తరమునకు సంబంధించిన సమస్య. ఆంధ్రుల జాతి ఏది అను ప్రశ్నకు కొందరు వారు ఆర్యులే అనియు, అనార్యభూములకు పోయి, అక్కడి జాతులతో కలిసిపోయి, వారివారి సభ్యతలను అలవరచుకొనిరనియు తలచుచున్నారు. మరి కొందరు ఆర్యులకు పూర్వము భారతదేశమంతటిని వ్యాపించియుండిన ద్రవిడులలోని వారు ఆంధ్రులని వాదించుచున్నారు. ఈ రెండువాదములకునుకూడ ఆధారమగు ఐతరేయబ్రాహ్మణమునందలి శునశ్శేపుని గాథలో ఆంధ్రులు పుళిందపుండ్రశబరమూతిబులతో కలసి యున్నట్లు పేర్కొనబడినారు. పురాణములు ఈసమస్యను పరిష్కరించుట కుపయోగపడవు. యాదవులలో అంధకులు, భోజకులు, మున్నగు తెగ లుండెడివి. జైన బౌద్ధగ్రంథములలో ఆంధ్రులు అంధ్రులనియు అంధకులనియు పేర్కొనబడిరి. ఈ అంధకులే యాదవగణములోని అంధకులగుచో ఆంధ్రుల ఆర్యత్వమున కిది ప్రోద్బలక మగును.

ఆంధ్రుల ఆదిమనివాసస్థానము ఏది అనునది మరియొక వివాదాంశము. ప్రాక్తీరము, అందును, కృష్ణాగోదావరీముఖప్రదేశము వారి మొదటి నివాసమనియు అశోకుని యనంతరము వారు సాతవాహనవంశజులగు శ్రీముఖ, కృష్ణ అనువారి నాయకత్వమున విజృంభించి, గోదావరివెంబడి మహారాష్ట్రమున కేగి, దానిని జయించి "దక్షిణాపథపతి" బిరుదాంచితులై పరిపాలించిరనియు ఒక వాదము. దీని నంగీకరింపక కొందరు ఈ యాంధ్రులు వింధ్యవాసులనియు, వారు మొదట పశ్చిమమున పరిపాలన చేసిరనియు, అటుపైన క్రమక్రమముగ కృష్ణాగోదావరీనదుల వెంబడి ప్రాక్తీరమునకు వ్యాపించిరనియు, పడమటిదిశను అధికారము అంతరించగా ప్రాక్తీరముననే స్థిరపడిరనియు, అప్పటినుండియే ఈప్రాంతమునకు అంధ్రమండలమని పేరు వచ్చెననియు, వారు నేటి ఆంధ్రులవలె తెలుగుభాషనుగాక ఒకవిధమగు ప్రాకృతమును మాట్లాడిరనియు వాదించుచున్నారు. ఐతరేయ బ్రాహ్మణమునందు

ఆంధ్రులు వింధ్యప్రాంతమునందు ఉండినట్లు చెప్పబడి యున్నది. కాని వింధ్యప్రాంతమన ఆరోజులలో ఏప్రాంతమో నిశ్చితము కాలేదు. ప్రాచీనకాలమున వింధ్యశబ్దము నేటివలె ఒక్క పర్వతపంక్తికేగాక దానికి తూర్పుపడమరలుగ వ్యాపించిన కొండలకుగూడ వర్తించినట్లు కనిపించుచున్నది. కాకతీయ రెడ్డి వెలమ వంశములరాజుల శాసనములలో వారివిజయములు వింధ్యసానువులవరకును వ్యాపించినట్లు చెప్పబడినది. బస్తరుసంస్థానమునను, మధ్యపరగణాలతూర్పుభాగమునను నేటికిని ఆంధ్రులనేకులు నివసించుచున్నారు. దీనినిబట్టి ప్రాచీనాంధ్రులు పశ్చిమమునగాక నేటి బేరారు ఒరిస్సాలప్రాంతమున నివసించుచుండిరని అనుకొనవచ్చును. ఆంధ్రులు పశ్చిమమునుండి తూర్పునకు వ్యాపించిరను వాదమునకు పూర్వసాతవాహనశాసనములు మహారాష్ట్రముననే దొరకుటయు, ఆంధ్రదేశమున లభింపకుండుటయు ముఖ్యాధారములు. కాని నాసిక నానాఘాట్ కార్లాలలో దొరకిన శాసనములు ఆయాప్రాంతములు సాతవాహనుల ఏలుబడిలో నుండినవనియే తెల్పునుగాని వారు ఎటునుండి ఎటువ్యాపించిరో నిరూపింపజాలవు. అట్లే నాటి ఆంధ్రులు ఏభాషను మాట్లాడిరో తెలియదు. నేటి ఆంధ్రుల మాతృభాషయగు తెలుగు క్రీ. శ. 6వ శతాబ్ది నుండియే ఉన్నట్లు కనిపించుచున్నను వారి ఆదిమభాష ప్రాకృతమేనని నిష్కర్షగ చెప్పజాలము. ఆనాటి శాసనములు ప్రాకృతము నందుండినంతమాత్రమున అవి ప్రజలభాష యని చెప్పుటయు సమంజసము కాదు. మౌర్యరాజుల ఆస్థానముయొక్కయు, బౌద్ధసంఘముయొక్కయు సాంప్రదాయముల ననుసరించి ఆనాడు ప్రాకృతము అధికారికభాషగ పరిగణింపబడుచు వచ్చెను. అందువలననే రాజశాసనములను, దానశాసనములను ప్రాకృతమున వ్రాయించుట ఆచార మయ్యెను. గుణాఢ్యుని బృహత్కథననుసరించి వ్రాయబడిన సోమదేవుని కథాసరిత్సాగరమున గనిపించు నొకముఖ్యాంశము నిచట ఆలోచింపవలసి యున్నది. అందలి కథలో ప్రతిష్ఠానపురమున సాతవాహనరాజు ఆస్థానము నందుండిన గుణాఢ్యపండితుడు ప్రత్యర్థియగు శర్వవర్మ ఆరుమాసములలో రాజును సంస్కృతభాషా పారగుని చేయగలిగినయెడల తాను నాడు వ్యాప్తిలోనుండిన సంస్కృత ప్రాకృత దేశభాషలను వదలివేసెదనని శపథము చేసినట్లు చెప్పబడినది. ఇందు దేశీ అనునదే జనసామాన్యముయొక్క భాషయై యుండును. అగుచో ఇదియే ప్రాచీనాంధ్రుల భాషగ నుండి కాలక్రమమున ఇతరభాషలసంపర్కమువలన ఇది తెలుగుభాషగ పరిణమించెనని చెప్పవగును.

ఆంధ్రులకును సాతవాహనులకునుగల పరస్పరసంబంధము మరియొక సమస్య. కొందరు సాతవాహనులు ఆంధ్రులు కారనియు, వారిది ఒక ప్రత్యేకవంశమనియు వాదించుచున్నారు. ఇంతవరకును దొరికిన సాతవాహనశాసనములలో ఎచ్చటను ఆంధ్రప్రశంస లేదనియు, సాతవాహనుల నాణెములు సహితము మహారాష్ట్రముననే దొరికినవనియు వారు చూపు ఉపపత్తులు. బళ్ళారిమండలమున దొరికిన ఒక సాతవాహనశాసనమునను, ఒక పల్లవశాసనమునను ఆప్రాంతము సాతవాహనిరట్ఠమనియు, సాతవాహనాహారమనియు పేర్కొనబడినది. దీని నాధారము చేసుకొని కొందరిదియే

సాతవాహనుల నివాసస్థానమునియు ఆంధ్ర దేశము కాదనియు వాదించుచున్నారు. ఈ శాసనములు రెండును సాతవాహనులు అధికారమునకు వచ్చిన పిదప శతాబ్దములకు తరువాతవి. అందువలన అవి వారి ఆదిమనివాసస్థల మెద్దియో నిరూపింపజాలవు. పరిపాలనాంతమున వారు ఇచ్చట నుండిరనిమాత్రము వాటినిబట్టి చెప్పవచ్చును. సాతవాహనులు తమశాసనములలో తాము ఆంధ్రులమని చెప్పుకొనలేదు. 'ఆంధ్ర' అనునది ఒక జాతి యొక్క నామము. 'సాతవాహన' అనునది కులము పేరు. సాతవాహనకులజులు తమ వంశనామమును చెప్పుకొనియే ఉన్నారు. జాతిప్రశంసను వారు చేయుట అవసరము కాదు, ఉచితమును కాదు. నేడును ఆంధ్రులలో ములికినాట్లనియు, వెలనాట్లనియు, వేగినాట్లనియు విభేదములున్నవి. అట్లే రెడ్లు, కమ్మలు, వెలమలు, బలిజలు మున్నగు భేదములున్నవి. సాతవాహనయుగమునను ఆంధ్రులలో ఇట్టి భేదము లుండియుండును. మహాభారతమునందు "ఆంధ్రాశ్చ బహవః" అని చెప్పబడినది. బౌద్ధగ్రంథములలో గోదావరీ తీరమున నివసించిన అశ్మకులును, ములికలును ఆంధ్రులని చెప్పబడినది. అశ్మకులకు పోతననగరమును, ములికులకు ప్రతిష్ఠానమును కేంద్రములు. క్రీ.శ. 15వశతాబ్దివరకును గల శాసనములనుండి కడపగుంటూరుజిల్లాలలో భాగములును, నైజాంరాజ్యమందలి మెదకు జిల్లాయును ములకనాడని వ్యవహరింపబడినటు తెలియుచున్నది. శాసనములనుండి తెలియనగు రాజులలో చాలమంది పేర్లు పురాణములలో గన్పించుచున్నవి. దీనినిబట్టి పురాణముల నిర్మాతలకు ఈ సాతవాహను లాంధ్రులని తెలిసియే వారు అట్లు వ్రాసి యుందురని చెప్పవచ్చును. ఈవిషయమై మరికొన్ని ఉపపత్తులనుకూడ చెప్పవచ్చును. క్రీ.శ. 4వశతాబ్ది నాటి పల్లవశివస్కందవర్మ మైదవోలు శాసనమునందు ఆంధ్రపథమను నొకవిభాగమును, దాని కేంద్రమగు ధన్నకడమును పేర్కొనబడియున్నవి. ప్రాచీనబాణశాసనములలో ఆంధ్రపథము వారి రాజ్యమునకు తూర్పుసరిహద్దుగ పేర్కొనబడినది. ఈ రాజులు నేటి మైసూరు రాజ్యమునందలి కోలారుజిల్లాలో రాజ్యమేలిరి. ఇటనుండి తూర్పుగ సముద్రమువరకును ఆంధ్రపథము వ్యాపించి యుండును. నేటి కర్నూలువద్ద తుంగభద్రలో కలియు అంద్రీ లేక హంద్రీ అను నది ఉన్నది. కర్నూలుజిల్లాలో కృష్ణాతీరమున నందికోటకూరుతాలూకాలో సాతానికోట అను నొకస్థల మున్నది. ఇచ్చట కొన్ని దిబ్బలును, ప్రాచీనాలయములును, క్రీ.శ. 7వశతాబ్ది నాటి శాసనములు నున్నవి. క్రీ.శ. 13వశతాబ్ది నాటి కాకతీయగణపతిదేవుని శాసనములలో దీనికి సాతవాహనకోట అనుపేరు కనిపించుచున్నది. విజయనగరసామ్రాజ్యము వర్ధిల్లిన కాలమునందిది యొక సైనికకేంద్రముగ నుండెను. దీనినిబట్టి సాతవాహనులకు ఇది బలిష్ఠమైన కోట అయియుండెనని ఊహింపవచ్చును. అట్లే సాతాహనిహార సాతాహని రాష్ట్రములును ఆంధ్రపథమున విభాగములై యుండవచ్చును. ఈకారణములనుబట్టి సాతవాహనులు ఆంధ్రులే అనియు బహుశః వారి నివాసమగు సాతాహనిహారము ఆంధ్రపథములోని భాగమనియు నా అభిప్రాయము.

ఆంధ్రుల చరిత్రమునకు సంబంధించిన మరియొక సమస్య కలదు. ఆంధ్రులు సంహితా

కాలమునుండియు ఉండిరని పైన చెప్పియుంటిమి. వారి ప్రాథమికచరిత్ర యెట్టిది అనువిషయ మింతవరకును పరిశోధించబడి యుండలేదు. ఆధారములు మిక్కిలి తక్కువగ దొరకుచుండుటవలన ఇది మిక్కిలి కష్టసాధ్యమైన పని. పురాణములును ప్రాచీన బౌద్ధగ్రంథములును ఆనాటి ప్రజలను గురించియు, నాటి రాజవంశములను గురించియు ప్రశంసించు సందర్భమున ఆంధ్రులప్రశంస చేయుచున్నవి. మెగాస్తనీస్ అను యవను వ్రాయబారి వారి ప్రాబల్యమును, వారి సైనిక బలమును కొనియాడెను. పురాణములు ఆంధ్రులలో కొందరు దక్షిణాపథమునను, మరికొందరు పురాంధ్రులనుపేర నేటి ఆఫ్ఘనిస్థానమున కుభానది బాహ్లికులను జాతివారికి దగ్గరగను ఉండినట్లు చెప్పుచున్నవి. నేటి ఆఫ్ఘనులలో బహుయూసుఫ్‌జైరులకు అంధారి లేక అంద్రి అను నొక తెగవారలు గల్‌కైన్ అంధ్రప్రాంతమునందున్నారు. బాల్కు పడమట నున్న అంధఖుయ్ అను విభాగము ఆంధ్రుల నివాసమని స్పష్టమగుచున్నది. ఉత్తరవైదికయుగమున వింధ్యప్రాంతములనుండినట్లు తెలియనగు నీ యాంధ్రులలో నొకశాఖ ఈ ఆఫ్ఘనిస్థానమునకెట్లు పోయెనో, అనంతర మీ రెండు శాఖలకు నేదైన సంబంధముండెనో లేదో తెలియదు. దక్షిణాపథమునందలి ఆంధ్రులను గురించి మాత్రము మనకు వివరములు తెలియుచున్నవి. బౌద్ధయుగారంభమునాటికే అశ్మకులు, ములకులు మున్నగు తెగలవారు బలిష్ఠములగు నగరములను నిర్మించుకొని ప్రాముఖ్యమును సంపాదించి నాటి రాష్ట్రములలో వన్నెకెక్కిరి... చంద్రగుప్తమౌర్యుని ఆస్థానమున రాయబారిగ నుండిన మెగాస్తనీస్ "ఇండికా" అనుగ్రంథమున ఆంధ్రులకు 30 ప్రాకారపరివేష్టితములగు నగరములు కలవనియు, 10,0000 కాల్బలమును, 2000 ఆశ్వికదళమును, 1000 ఏనుగులు నుండెననియు వ్రాసినాడు. ఈ యాంధ్రులది ఈకాలమున నొక రాజ్యమనియు, నది మౌర్యుల రాజ్యమునకు తరువాత పేర్కొనదగినంత ప్రబలముగ నుండెననియు కొందరి అభిప్రాయము. ఈకాలమున ఆంధ్రులను పరిపాలించిన రాజుల పేర్లు మనకు తెలియవు. పురాణములును, ప్రాచీనవాఙ్మయమును ఆంధ్రజాతిని పేర్కొనుచున్నవిగాని రాజులను కాదు. ఈ కారణములనుబట్టి యీకాలమున నాంధ్రులు ఒక ప్రజాస్వామికగణముగ నుండిరని యేర్పరచుట సమంజసముగ నుండును. ఇంతటి నుండి రెండుమూడుపురుషాంతరములకాలము గడచునప్పటికే ఆంధ్రులు తమ స్వాతంత్ర్యమును గోల్పోయి, అశోకచక్రవర్తి పరిపాలనకు లోనైరి. మౌర్యులు ఈయాంధ్రులను ఎట్లు ఎప్పుడు జయించిరో స్పష్టముగ తెలియదు. చంద్రగుప్తమౌర్యుడే దక్షిణాపథమునందలి ఇతరజాతులతో బాటు ఆంధ్రులనుకూడ జయించెనని కొందరి అభిప్రాయము. చంద్రగుప్తుడు తన జీవితసంధ్యాకాలమును నేటి మైసూరు రాజ్యములోని శ్రవణబెల్గోలాలో గడపెనను అర్వాచీనమును అవిశ్వసనీయమునగు జైనగాథ తప్ప ఈవిషయమును తెలుపు మరియొక ప్రమాణ మేదియు లేదు. తారానాథుడను టిబెట్ చరిత్రకారుడు ఒక బౌద్ధగాథ ననుసరించి చంద్రగుప్తుని కుమారుడగు బింబుసారుడు దక్షిణాపథమును జయించెనని వ్రాసినాడు. అశోకుడు ఒక్క కళింగదేశమును

మాత్రమే జయించెను. అందువలన అతని రాజ్యారంభమునకు పూర్వమే మౌర్యులు ఆంధ్రులను జయించిరని చెప్పవచ్చును.

ఆంధ్రులకును కళింగులకునుగల సంబంధ మేమి అనునది మరియొక సమస్య. వారిర్వురు వేర్వేరుజాతులవారనియు, ఇరుగుపొరుగు జాతులవారిమధ్య ఉండు సామాన్యసంబంధము తప్ప వారి కింకొకవిధమగు సంబంధ మేదియు లేదనియు చాలమంది అభిప్రాయము. శాసనములయందును, వాఙ్మయమునందును కళింగుల ప్రశంస ప్రత్యేకముగ చేయబడి యున్నను వారు ఆంధ్రులలో నొక శాఖవారనియు, ప్రాచీనకాలముననే విశిష్ట ప్రత్యేక రాష్ట్రమును స్థాపించుకొనిరనియు ఊహించుటకు ప్రబలములగు ఆధారములు కలవు. కళింగమునకు దక్షిణమునను పశ్చిమదక్షిణమునను గోదావరియు, ఉత్తరమునను ప్రాగుత్తరమునను మహేంద్రగిరియు సరిహద్దులు. మూడు కళింగములనియు, సప్తకళింగములనియు ప్రసిద్ధినందిన ప్రాంతమంతయు ఇందిమిడి యుండెను. మన చరిత్ర ప్రారంభమైనప్పటి నుండియు కళింగులు తెలుగుభాషనే మాట్లాడుచు, తెలుగువారితో సంబంధబాంధవ్యములను నెరపుకొనుచు, తెలుగువారి సాంఘిక వ్యవస్థనే అనుసరించుచు నుండిరని తెలియనగుచున్నది. ఉత్కళము లేక ఉత్తరకళింగము అనబడు నేటి ఒరిస్సా కళింగమున చేరి యుండెనని కొందరి అభిప్రాయము. చారిత్రిక ప్రమాణముల కీయూహ విరుద్ధముగ నున్నది. 'ఒరిస్సా' 'ఉత్కళ' పదములు సమానార్థకములుగ నుపయోగింపబడుచున్నవి. వాటివలన నుద్దేశింపబడు ప్రదేశముమాత్ర మొకటి కాదు. ఒరిస్సా అను పదము ఉదీచ్య అను సంస్కృతశబ్దమునకును, ఉడిస్స అనుపదమునకును భ్రష్టరూపము. దీనికి తూర్పునగల దేశమని అర్థము. దీనినుండియే ఒడ్డ అను జాతివాచకపదమును, ఓఢ్రం అను భాషావాచకపదమును ఏర్పడినవి. ఉత్కళ అనునది అర్వాచీనపదము. కళింగగాంగరాజులు జయించిన ఒరిస్సాలోని భాగములకు మొదట ఆ పేరు వచ్చెను. క్రీ. శ. ౧౧వ శతాబ్దినాటి చోళరాజుల శాసనములందు సహితము కళింగ, ఒడ్డ అనునవి ప్రత్యేక దేశములుగ పేర్కొన బడినవి. కళింగము ఉత్తరమున మహేంద్రగిరితో అంతమయ్యెననియు, ఒడ్డ దేశము దానిపైన ఉండెననియు తెలియుచున్నది. ఈయంశముల నన్నిటిని విమర్శించి చూడగ ద్రవిడదేశమునందలి చోళపాండ్యుల వలెనే ఆంధ్రులును కళింగులును రాజకీయముగ ప్రత్యేకముగ నుండినను వారు ఒకే జాతివారనియు ఒకే భాషను, ఒకే సభ్యతను కలిగియుండిరనియు తోచుచున్నది.

క్రీస్తుశకారంభమునకు కొంచెమువెలావలి కాలపు ఆంధ్రుల చరిత్రము నిర్దిష్టముగ తెలియుటలేదు. ఆంధ్రదేశచరిత్రజిజ్ఞాసువులు ఈవిషయమై లభ్యపడు సామగ్రినంతను సేకరించి ఆనాటి చరిత్రమును నిర్మింప వలసి యున్నది. కాని యీవిధమగు పరిశోధన సాగించుట బహుకష్టసాధ్యమైన పని. ఎన్ని అడ్డంకు లున్నను మనపరిశోధకులందరును పరస్పరసహకారముతో ప్రయత్నించినయెడల ప్రాచీనాంధ్రుల చరిత్రమును రచించుట సాధ్యము కాకపోదు.

# సాతవాహన సామ్రాజ్య చరిత్రము

మారేమండ రామారావు ఎం. ఏ., పిహెచ్. డి.

## ౧. ప్రాముఖ్యము

ఆంధ్రసాతవాహనసామ్రాజ్యము క్రీ. పూ. 3వశతాబ్ది చివరభాగమునుండి క్రీ. శ. 3వ శతాబ్ది మొదటిపాదమువరకును మధ్యగల నాలుగున్నరశతాబ్దములకాలము వర్ధిల్లినది. ఈ సామ్రాజ్యముయొక్క చరిత్రము భారత దేశచరిత్రలో శోభావంతమగు ఘట్టము.

సాతవాహనయుగమునకుపూర్వపు దక్షిణాపథచరిత్రము అస్పష్టమును అనిర్దిష్టమునై యున్నది. ఈవింధ్యదక్షిణభాగముయొక్క సక్రమమైనచరిత్రము సాతవాహనయుగములోనే ప్రారంభమగును.

సాతవాహనులు "దక్షిణాపథపతి" బిరుదాంచితులు. మధ్యమధ్య ఏ కొద్దికాలమో తప్ప సుమారు నాలుగుశతాబ్దములకాలము దక్షిణాపథము వారి ఏకచ్ఛత్రాధిపత్యమునందుండినది. వారు దేశమునకు అవిచ్ఛిన్నమగు శాంతిని, అపారములగు సిరిసంపదలను ప్రసాదించిరి. ఈ సాతవాహనసామ్రాజ్యశీతల చ్ఛాయలలో సుఖసుప్తులై నాటి దక్షిణాపథ వాసులు తీయటి కలలు కనిరి. ఉత్తరమున వింధ్యపర్వతములకును, దక్షిణమున తుంగభద్రకును, తూర్పుపడమరల సముద్రములకును మధ్యనున్న విశాలభూభాగము ఈ సాతవాహనయుగమునకు తప్ప అంతకుపూర్వమున గాని పరమునగాని ఇట్టి ఐక్యతను, ఇట్టి వైభవమును అనుభవింపలేదు. దక్షిణాపథచరిత్రమునందు సాతవాహనులు పరిపాలించినకాలము స్వర్ణయుగము.

అశోకచక్రవర్తి మరణించినది మొదలు సముద్రగుప్తుని విజయపరంపరలచేత గుప్తసామ్రాజ్యమును సుస్థిరమొనర్చువరకును గల ఆరుశతాబ్దులకాలమున ఉత్తరాపథమునందనేకదండయాత్రలును, విప్లవములును జరిగినవి. యవనులు రెండు పర్యాయములు దాడి చేసిరి. ఆమీద శకులు పాటలీపుత్రమువరకును చొచ్చుకొని వచ్చి ప్రజల ననేకవిధముల హింసించిరి. మౌర్యశుంగ కాణ్వకుషాణవంశముల పరిపాలనము రాజకీయవిప్లవములతో అంతమయ్యెను. ఈకారణములవలన ఆదేశమున శాంతిసౌఖ్యములు లేకుండెను. ఉత్తరాపథము నలజడిపరచిన విదేశీయులు దక్షిణాపథమునుకూడ జయించియుందురు. అట్లే ఉత్తరమున సామ్రాజ్యములను స్థాపించిన శుంగకాణ్వకుషాణవంశీయులు దక్షిణాపథములోనికి తమ సామ్రాజ్యములను విస్తరించియుందురు. కాని బలాఢ్యులైన సాతవాహనచక్రవర్తులు దక్షిణాపథము నీయుపద్రవములకు లోనుగాకుండగ రక్షించిరి.

ఉత్తరాపథమునందు అధికారమును స్థాపించి క్రమముగ తమ సామ్రాజ్యములను దక్షిణాపథములోనికి వ్యాపింపజేసిన మౌర్య గుప్త ఖిల్జీతుగ్లకు మొగిలురాజవంశములు కలవు. కాని దక్షిణాపథమునం దధికారమును స్థాపించి అటనుండి యుత్తరాపథమునకు సామ్రాజ్యమును విస్తరింపజేసి, సామ్రాజ్యకేంద్రమగు పాటలీనగరమునే ఆక్రమించి పరిపాలించిన రాజవంశము ఒక్క సాతవాహనవంశము తప్ప మఱియొకటి లేదు. దక్షిణదిశపాలకులగు ఖారవేలుడు, గంగైకొండచోళుడు మున్నగు రాజులు కొంద రుత్తరదేశముపై దండెత్తిరి కాని వారి విజయయాత్రలు తాత్కాలికములు. వానివలన నెవరికిని రాజ్యలాభము కలుగలేదు. సాతవాహనుల ఉత్తరదిగ్విజృంభణ మట్టిది కాదు. వారు పాటలీనగరమును జయించి యుత్తరాపథమునందలి కొంతభాగమును కొంతకాలము పరిపాలించిరి.

భారతదేశము ఉత్తరాపథము, దక్షిణాపథము, ద్రవిడదేశమునను మూడుభాగములుగ నున్నది. మహాభారతమున ధర్మరాజు ఈమూడుభాగములలోని రాజులను జయించెనని చెప్పబడినది. చరిత్రకు తెలియునంతవరకును చంద్రగుప్తమౌర్యుడు కొంకణతీరము ననుసరించి తిరునెల్వేలి జిల్లాలోని పొదియిల్ కొండవరకును చొచ్చుకొని పోయెను. ఆమీద సుల్తాన్ మహమ్మదుతుగ్లకు కర్ణాటకములోనికి తన పరిపాలనము కొంతకాలము విస్తరింపజేసెను. ఈ మధ్యకాలమునందు సాతవాహనులు తప్ప మఱియెవరును ఈ మూడువిభాగములను పరిపాలింపలేదు.

భారతదేశమున వర్ధిల్లిన సామ్రాజ్యములలో ఒక్క మౌర్యసామ్రాజ్యమును మినహాయించినచో మిగిలిన శుంగకాణ్వగుప్తసామ్రాజ్యములకంటెను సాతవాహనసామ్రాజ్యము పెద్దది. ఒకప్పుడు ఇది పాటలీపుత్రమునుండి బళ్ళారివరకును వ్యాపించియుండెను. మహావీరుడగు గౌతమీపుత్రసాతకర్ణి కాలమునందిది రాజపుత్రస్థానమునందలి ప్రాగ్భాగము మొదలు గోదావరీముఖద్వారమువరకును, ఉజ్జయిని మొదలు కడలూరువరకును వ్యాపించియుండెను.

ఈ కాలమునందు దక్షిణాపథము సిరిసంపదలతో తులతూగినది. పారిశ్రామికులు సంఘములుగ నేర్పడి అనేకవస్తువులను నిర్మించుచుండ వర్తకులు వీనిని సముద్రపథమున దూరదేశములకు తీసికొనిపోయి విక్రయించుచుండిరి. దానికి ఫలితముగ అపారమగు ధనవాహిని ఈదేశమునకు ప్రవహించినది.

భారతదేశసారస్వతచరిత్రమునందు సాతవాహనయుగము స్వర్ణయుగము. సాతవాహనచక్రవర్తియగు హాలుడు సంకలనము చేసిన సప్తశతియు, గుణాఢ్యపండితుని బృహత్కథయు, ప్రాకృతభాషాయోషకు అమూల్యములగు అలంకారములు. శర్వవర్మవిరచితమగు కాతంత్రవ్యాకరణమును, ఆచార్యనాగార్జునుని అనేకగ్రంథములును సంస్కృతవాఙ్మయమునకు వన్నె తెచ్చినవి.

బౌద్ధమతచరిత్రమునందు సాతవాహనయుగము మహోజ్జ్వలమగు ఘట్టము. బుద్ధునికి పిమ్మట మరల నంతటివాడని ప్రసిద్ధి చెందిన ఆచార్యనాగార్జునుడు ఒక సాతవాహనచక్రవర్తిప్రాపు సంపాదించి చిరకాల మాసామ్రాజ్యమున నివసించెను. నాటి బౌద్ధులలో అనిశ్చితములుగనుండిన వివిధవాదము

లను విమర్శించి ఆమహాసీయుడు మహాయాన మునకు రూపకల్పన చేసెను. ఇది బౌద్ధమునకు నూతనోత్తేజమును కలిగించెను. బౌద్ధ వాఙ్మయమును, బౌద్ధకళయు క్రొంగ్రొత్త రీతుల విజృంభించినవి. అంతియగాక చైత్యక వాదమున కాంధ్రదేశము ఆటపట్టయినది. ఈనూతనోద్యమమును, నూతనోత్సాహమును అమరావతీమహాచైత్యమున మూర్తీభవించినవి.'' దేశమంతయు అనేకబౌద్ధతీర్థములతో రాజిల్లినది.

సాతవాహనయుగమునందలి కళావైభవము సాటిలేనిది. గుహావాస్తువు ఈకాలము నందొకవిధముగ పరిణతిమై తర్వాతి ఎల్లోరా బౌద్ధాదిసాంప్రదాయములకు దోహదకరమైనది. ఈయుగమున నిర్మింపబడిన సాంచీ ద్వారములు నిరుపమములు. ఈనాటి అమరావతీమహాచైత్యము లోకోత్తరమైన శిల్ప ప్రబంధము.

భారతీయనాగరికత ఇతరప్రాచ్యదేశములకు విస్తరించి అచట నభివృద్ధినందిన విధము ఒక అద్భుతగాథ. ఈనాగరికతావిస్తరణమునకు ప్రాతిపదిక సాతవాహనయుగమునం దేర్పడెను.

ఇట్లు సాతవాహనసామ్రాజ్యచరిత్రము భారతదేశచరిత్రమునందు అతిప్రధానమైన భాగము.

## ౨. ఆధారములు

సాతవాహనసామ్రాజ్యచరిత్రమును రచించుట కుపకరించు ఆధారము లెన్నియో కలవు. శాసనములు, నాణెములు, పురాణములు, వాఙ్మయము, వాస్తుశిల్పములు, గాథలు, విదేశీయుల వ్రాతలు ఇందు ముఖ్యములు. ఈయాధారములు కొన్నిపట్టుల నెన్నియో విశేషములను తెలుపును, మరికొన్ని ఘట్టములను గూర్చి ఏమియు తెలియచేయవు. ప్రాయికముగ వీనిలో పరస్పరవిరుద్ధములగు నంశములుండును. ఇట్టియంశములను సమన్వయించియు, యుక్తియుక్తములును సంభావ్యశ్రేణిని దాటనివియునగు ఊహలను చేసియు చరిత్రను రచింపవలసి యుండును.

**శాసనములు :—** ఇవి ప్రధానమగు ఆధారము. సాతవాహనరాజులను పేర్కొను శాసనము లింతవరకును 27మాత్రము లభించినవి. ఇవి ఉత్తరమున సాంచీకిని, దక్షిణమున బళ్ళారికిని, పడమట నాసికకును, తూర్పున చినగంజామునకును మధ్యగల విశాలభాగమున దొరికినవి. ఇవి యన్నియు ప్రాకృతభాషలో బ్రాహ్మీలిపిలో చెక్కబడినవి. వీనియందు ఏశకమును పేర్కొనబడక ఆయారాజుల వైయక్తికరాజ్యకాలసంవత్సరములే ఉదహరింపబడి యున్నవి. అందువలన కేవలమును ఇతరాధారములను బట్టియే వీని కాలమును నిర్ణయింపవలసి యున్నది. ఈ సాతవాహనశాసనములలో రెండు మిక్కిలి ముఖ్యములు. అందొకటి మొదటి సాతకర్ణిఅను రాజు చేసిన అనేక యజ్ఞములను, ఆయాసందర్భములలో చేయబడిన దానధర్మములను పేర్కొనుచున్నది. రెండవది సాతవాహనచక్రవర్తులలోనెల్ల అగ్రగణ్యుడగు గౌతమీపుత్రసాతకర్ణివిజయము

లను, సద్గుణసౌశీల్యములను పేర్కొను ప్రశస్తి, మిగిలిన శాసనములలో కొన్ని రాజులును, కొన్ని ఇతరులును చేసిన ధర్మములను పేర్కొనుచున్నవి. ఈశాసనముల ఉనికినిబట్టి ఆయాకాలముల సామ్రాజ్యవిస్తృతి తెలియ నగును. వీనియందు ఆకాలమునందుండిన రాష్ట్రవిభాగముల పేర్లును, రాజోద్యోగుల ఔద్యోగికనామములును, నాడు వర్ధిల్లిన మతములను గురించి విశేషములును, కొన్నినాణెముల పేర్లును కనిపించుచున్నవి.

నాణెములు:— శాసనములకు పిమ్మట నాణెములు ముఖ్యమగు సాధనము. సాతవాహననాణెములు మహారాష్ట్రమునను, బేరారుమధ్యపరగణాలలోను, ఆంధ్రదేశమునను, మైసూరురాజ్యమునను, ద్రవిడదేశములో మదరాసు కడలూరులమధ్యగల ప్రాక్తీరమునను, ఉత్తరదేశమున కుమరహార్ భీహాలలోను దొరకినవి. చాందా, అకోలా, కొల్హాపురము, జగల్త్రాంపె, తెరహాలా, కొండాపురము, గుడివాడలలో పోగులు దొరికినవి. ఈనాణెములమీద కొన్నిబొమ్మలును, కొన్ని గుర్తులును ఉండును. సాధారణముగ సాతవాహననాణెములమీద ఉజ్జయినీచిహ్న మొక వైపున తప్పక ఉండును. రెండవవైపున చైత్యము, గుర్రము, సింహము, ఏనుగ, వృక్షము ఉండును. వీనితోపాటు సాధారణముగ నాణెములను వేయించిన రాజుల పేర్లును శాసనములవలెనే ప్రాకృతభాషలో బ్రాహ్మీలిపిలో వేయబడి యుండును. గౌతమీపుత్రయజ్ఞశ్రీ అనురాజుయొక్క కొన్ని నాణెములమీద మాత్రము అతని తల ముద్రింపబడి యున్నది. సాతవాహననాణెములలో వెండివి బహుతక్కువ. గౌతమీపుత్ర సాతకర్ణిచేత పునర్ముద్రింపబడిన నహపానుడను క్షహరాటరాజు వెండినాణెములే ఎక్కువగ దొరకినవి. మిగిలినవి సీసపునాణెములో లేక పొటిన్ అను మిశ్రితలోహముతో వేయబడినవో అయియున్నవి. ఇందు కొన్ని గుండ్రముగను, కొన్ని చతురస్రముగను, కొన్ని కోలికపూసల ఆకారముగను ఉన్నవి. ఇంతవరకును మొదటిసాతకర్ణి, రెండవసాతకర్ణి, ఆపీలక, మేఘస్వాతి, గౌతమీపుత్రసాతకర్ణి, వాసిష్ఠీపుత్రపులోమావి, వాసిష్ఠీపుత్రశివశ్రీ, వాసిష్ఠీపుత్రచంద్రశ్రీ, యజ్ఞశ్రీ, పులోమావి అనురాజుల నాణెములు దొరికినవి. వీరు శాసనములనుండియు, పురాణములనుండియు తెలియవచ్చుచున్నారు. వీరుగాక శకసేన, స్కందసాతకర్ణి, కర్ణసాతకర్ణి, కుంభసాతకర్ణి, శ్రీకృష్ణరుద్రశ్రీలనువారును నాణెములనుండే తెలియనగుచున్నారు. ఇటీవల 'సాతవాహన' అనురాజును పేర్కొను నాణెమొకటి దొరికినది. ఈ రాజులప్రశంస ఇతరాధారములలో కనిపింపదు. కొల్హాపురమున దొరికిన నాణెములు విలివాయకురనామకుల నిద్దరిని, శివలకురుడను సతనిని ఒకనిని పేర్కొనుచున్నవి. వీరు సాతవాహనవంశజులగుదురో కాదో తెలియదు. ఈ నాణెములు లభించిన స్థలములనుబట్టి ఆయాకాలముల సాతవాహనరాజ్యవిస్తృతిని నిర్ణయింపనగును. వీనికిగల అన్యోన్యసారూప్యవైరూప్యములనుబట్టి వీనిని వేయించిన రాజుల పరస్పరసంబంధసామీప్యములను గుర్తింపనగును.. ఇంతవరకును దొరికిన నాణెములలో చాలభాగము, రాప్సన్, స్మిత్ మున్నగువారు తమపట్టికలలో చేర్చిరి. వీరి నిర్ణయములలో కొన్ని ప్రమాదములును, కొన్ని అసంగతాంశములును నున్నవి. వానిని

సవరింపవలసి యున్నది. ఇటీవల దొరకిన నాణెములను పై పట్టికలలో చేర్చవలసి యున్నది. ఏరాజుపేరును లేక గుర్తులును, బొమ్మలును మాత్రముగల నాణెము లెన్నియో కలవు. వానిని ఒకపట్టికలో చేర్చవలెను.

పురాణములు :— ఇవియును ప్రధానమగు నాధారము. చరిత్రకాలము పురాణములలో కేవలము గాథలేకాని చారిత్రకాంశములు లేవని ఒక దురభిప్రాయము నుండెడిది. ఇటీవల పండితులు వీనిని సూక్ష్మముగ, సవిమర్శకమునగు దృష్టితో పరిశీలించి అమూల్యములగు చారిత్రకాంశములను బయల్వెడలించినారు. పార్జిటరు అను పాశ్చాత్యుండెతుడు ఈవిషయమై చేసిన పరిశోధన అమూల్యమైనది. అధిసీమకృష్ణుడనురాజు రాజ్యమేలుచుండినప్పుడు నైమిశారణ్యమునందు పండ్రెండుసంవత్సరముల కాల మొకసత్రయాగము జరిగెనట. ఆకాలమున సూతుండు ఋషులకు ఈపురాణములను చెప్పెనట. ఆనాటికి భవిష్యమగు కాలమునందేయేరాజు లుండుదురని ఋషులడుగగ సూతుడు భవిష్యద్రాజకథను మొదల్పెను. దీనికి మహాభారతయుద్ధమును, పరీక్షిత్తు జననమును ప్రారంభ ఘట్టములు. ఈకథనమంతయు మగధరాజ్యదృష్ట్యా చెప్పబడినది. అప్పటినుండి పౌరాణికవృత్తాంతము గుప్తరాజ్యారంభమువరకును కలదు. కొన్ని పురాణములు సాతవాహనరాజగు యజ్ఞశ్రీ కాలమున లిఖింపబడినట్లు ఊహింపబడినది. కొన్ని ఆంధ్రసాతవాహనసామ్రాజ్యాంతము వరకును వచ్చుచున్నవి. తక్కినవి గుప్తరాజ్యారంభముతో ఆగిపోవుచున్నవి. ఇట్లు పురాణములు వివిధకాలములలో గ్రంథస్థములు చేయబడినవి. ఇవి ఎవరి స్వకపోలకల్పితములును కావు. విష్ణువాయుబ్రహ్మాండాదిపురాణములు భవిష్యపురాణము నాధారముచేసికొని వ్రాయబడినట్లున్నవి. భవిష్యపురాణము మాతృక. ఇదియైనను మూలమాతృకకాదు. ఆదిలో ప్రాకృతమున నొక పాఠముండెననియు, దానికి అప్పుడప్పుడు సంస్కృతీకరణములుగ కొన్ని పురాణములు వెలువడుచు వచ్చెననియు తోచుచున్నది. ప్రతిరాజాస్థానమునను వందిమాగధులుండి ఆయారాజుల గుణగణములను స్తుతులుగ నేర్పరచి కీర్తించుచుండిరి. ఇవి యీపురాణరచనమునకు తోడ్పడి యుండును. సాతవాహనరాజులపేర్లు విష్ణువాయుబ్రహ్మాండభాగవతమత్స్యపురాణములలో కలవు. మగధను పరిపాలించిన రాజవంశములలో ఆంధ్రరాజులనుపేర పురాణము లీవంశీయుల పట్టికలను పేర్కొనుచున్నవి. పై ఐదుపురాణములలోను కొన్ని రాజులపేర్లనే చెప్పుచున్నవి. కొన్ని వారి నైయక్తిక రాజ్యకాలపరిమితులను తెలుపుచున్నవి. అన్నియును మొత్తము రాజులసంఖ్యను, ఈ వంశము పరిపాలనచేసిన మొత్తముకాలమును పేర్కొనుచున్నవి. ఈ పట్టికలలోని రాజులు కొందరు శాసనములనుండియు, నాణెములనుండియు కూడ తెలియనగుచున్నారు. కొందరు కేవలము నీపురాణములవలననే తెలియనగుచున్నారు. ఈపురాణములు రెండుమూడు సమస్యలను కల్పించుచున్నవి. ఇందు మొత్తమురాజులసంఖ్యయు వాస్తవముగ పేర్కొనబడిన రాజుల సంఖ్యయు ఒకటి యగుట లేదు. అట్లే సాముదాయక రాజ్యకాలపరిమితులును నైయక్తికరాజ్యకాలములమొత్తములును ఒకటి కావు. రాజులపేర్లు ఒక్కొకపురాణమునం దొక్కొకవిధముగ నున్నవి. కొన్నిటిలో కొన్నిపేర్లుమాత్రము

కలవు. కొన్నిటిలో ఎక్కువపేర్లు కలవు. మొత్తముమీద కొన్నిపురాణములు 30మంది రాజులును, 450 సంవత్సరములరాజ్యకాలపరిమితియు ననియు, మరికొన్ని 19 మంది రాజులును 290 ఏళ్ళ మొత్తముయేలుబడియుననియు చెప్పుచున్నవి. పురాణములలోగల ఈవ్యత్యాసములనుబట్టి కొందరు పండితులు చిత్రవిచిత్రములగు నూహలను చేసిరి. అట్లే కాలపరిగణనమునుగురించియు ఈపురాణములు ఇతరాధారములకు సరిపడని విషయములను తెలుపుచున్నవి. సప్తర్షిమండలముయొక్క సంచారము నాధారముగ చేసికొని అవి పరీక్షిజ్జననమునుండి నందరాజ్యాభిషేకమువరకు నిన్ని యేళ్ళనియు, నందాభిషేకమునుండి ఆంధ్రాంత్యమువరకు నిన్నిసంవత్సరములనియు చెప్పుచున్నవి. అదేవిధముగ స్థూలముగ మౌర్యశుంగకాణ్వవంశములకుపిమ్మట ఆంధ్రవంశము నాల్గున్నర శతాబ్దుల కాలము పరిపాలించెననియు వీనిలో చెప్పబడినది. ఈరెండుమార్గములలో దేనిననుసరించినను ఆంధ్ర సాతవాహనులపాలనము క్రీ. శ. 5వ శతాబ్దియందు అంతమగును. సమకాలికచరిత్రము ఇది అసంభవమని నిరూపించుచున్నది. అందువలన పౌరాణికవృత్తాంతములలోని పరస్పరభేదములను సూక్ష్మదృష్టితో పరిశీలించి, ఇతరాధారముల సహాయమున వానిని సమన్వయించుకోవలసియున్నది.

వాఙ్మయము :—సంస్కృతప్రాకృతతమిళ గ్రంథము లనేకములు ఆంధ్రులనుగూర్చియు, సాతవాహనులనుగూర్చియు విశేషములను తెలుపుచున్నవి. ఐతరేయబ్రాహ్మణము, బౌధాయనాపస్తంబసూత్రములు, మనుస్మృతి, రామాయణ భారత భాగవతహరివంశ బృహత్సంహితలు, వీనిలో ఆంధ్రుల ప్రశంస కలదు. గర్గసంహితాంతర్గతమగు యుగపురాణమునను, కథాసరిత్సాగరం, అభిధానరాజేంద్ర, దేశీనామమాలమున్నగువానిలోను సాతవాహనుల ప్రశంస కలదు. వాత్స్యాయనకామసూత్రములలో నాటి నాగరికజీవితము ప్రతిబింబించుచున్నది. ప్రాకృతగ్రంథములలో సప్తశతి అగ్రగణ్యము. అందు ఆనాటి ప్రాకృతభాషావైభవమును, కవికవయిత్రుల నామములును, నాటి గ్రామజీవితమును, జనుల ఆచారవ్యవహారములును గాంచనగుచున్నవి. లీలావతియను కావ్యము హాలుని విజయవివాహాగాథలను వర్ణించుచున్నది. జైనుల ఆవశ్యకసూత్రమున సాతవాహనప్రశంస కలదు. బౌద్ధజాతకకథలలో కాదాచిత్కముగ ఆంధ్రుల ప్రశంస కలదు. కథావస్తు మహావంశ దీపవంశమహావగ్గములును పరిశీలింపదగినవి. తమిళభాషలో 'సాతివాహనం' అను నొక పురాణ ముండెడిదట. శిలప్పదికారమను కావ్యమున నూఱువర్ కణ్ణర్ అనుపేర నొక సాతవాహనరాజు ప్రశంస కలదు.

గాథలు, స్థలనామములు :— సాతవాహనులనుగూర్చి పెక్కుగాథలు కలవు. ఇవి పంజాబు, కాశ్మీరములవంటి ఉత్తరదేశములలో వ్యాప్తియందున్నవి. మగధలోను, నేటి బేరారు మధ్యరాష్ట్ర మహారాష్ట్ర ఆంధ్రదేశములలోను సాతవాహనులనుబట్టి యేర్పడిన కొండలపేర్లును, గ్రామనామములును అనేకములు కలవు.

సమకాలికులు :—సాతవాహనులకు సమకాలికులుగ పరిపాలనచేసిన ఇతరరాజవంశములవారు కొందరి శాసనములలో సాత

వాహనుల ప్రశంస కలదు. కళింగరాజగు ఖారవేలుడు ఒకసాతకర్ణిని లక్ష్యము చేయక తనసైన్యములను దండయాత్రలకై పంపితినని చెప్పుకొనినాడు. ఉజ్జయినిని పాలించిన శక రాజగు రుద్రదాముడు ఒక సాతకర్ణిని రెండు సార్లు ఓడించియు బంధువగుటచే ప్రాణము లతో విడిచితినని చెప్పుకొనినాడు. ఈప్రశంసలు సాతవాహనుల కాలనిర్ణయముచేయుట కుపకరించుచున్నవి. అశోకునిశాసనములలో ఆంధ్రులప్రశంస కలదు.

విదేశీయుల వ్రాతలు:— క్రీ.పూ. 4వశతాబ్దిలో మెగస్తనీస్అను యవనుడు మౌర్యుల ఆస్థానమున రాయబారిగ నుండి తనకు తెలియవచ్చిన వృత్తాంతములను వ్రాసి పెట్టెను. అందు ఆంధ్రులప్రశంస కలదు. పెరిప్లస్అను నౌకగ్రంథము క్రీ.శ. 1వశతాబ్ది మొదటిభాగమున రచింపబడెను. అందు ఆనాటి సాతవాహనరాజ్యముయొక్క వాణిజ్య వైభవము వర్ణింపబడినది. క్రీ.శ. 130ప్రాంతమున టాలెమీఅను యవను డొకగ్రంథమును వ్రాసెను. అందును నాటి వాణిజ్య ప్రశంస కలదు. ఈవిదేశీయుడు పేర్కొనిన శక రాజగు చష్టనుడు, సాతవాహనరాజగు పులోమావికి సమకాలికుడను నంశము సాతవాహనుల కాలనిర్ణయమున కొక ముఖ్యాధారమైనది.

వాస్తుశిల్పములు:— భారతదేశకళా చరిత్రమున సాతవాహనయుగము మిక్కిలి ముఖ్యమైనది. ఈకాలమున పెక్కుగుహలును, స్తూపములును నిర్మింపబడినవి. సాంచీస్తూపమునకు నాలుగువక్కలను మనోహరములగు ద్వారము లెత్తబడినవి. అజంతాగుహలలో ప్రాచీనములగువానియందు వర్ణచిత్రములు వేయబడినవి. ఇవి యన్నియు నాటికళానైశిత్యమును వేనోళ్ళ చాటుచున్నవి. సాంచీశిల్పములయందును, అమరావతీమహాచైత్యశిల్పములందును నాటి ప్రజాజీవితము చక్కగా గాంచనగుచున్నది. ఈయుగపు సాంఘికజీవితమును తెలిసికొనుట కీశిల్పములు ఎక్కువగ నుపకరించుచున్నవి.

ఈ యాధారముల సహాయమున సాతవాహనయుగపు చరిత్రను రచింపవలసి యున్నది.

## 3. ఆంధ్రులు—ఆంధ్రదేశము

'ఆంధ్ర' శబ్దము ఈనాడు ఒకప్రజకును, ఒకదేశమునకును, ఒకభాషకును వర్తించుచున్నది. ఆంధ్రులు, ఆంధ్రదేశము, ఆంధ్ర భాష నేడు సువిదితములు.

ఆంధ్రదేశము సువిశాలమైనది. దీనికి "తూర్పుదిక్కున సంతయు బంగాళాఖాతమున్నది. దీని కుత్తరపు స్వాభావికమైన యెల్ల ఋషికుల్యానది ... ... ఋషికుల్యనుండి పడమటుగా నాయెల్ల పోయి తూర్పుకనుమలను దాటి నైఋతిమూలగా బస్తరుసంస్థానములోని సుంకము, బిజ్జితాలూకాల సరిహద్దున శబరీనదిని దాటి, బేలదిలగుట్టలవెంబడి జరిగి యింద్రానదివరకు బోవుచున్నది. అక్కడ నుండి ఆనదియొడ్డున సాగి, యది గోదావరిని

గలియువరకును బోయి, చాందాజిల్లా దక్షిణ భాగమంతటిని దనలో నిముడ్చుకొని, యింకను తూర్పునసాగి, పూనుజిల్లా దక్షిణభాగము నంతటిని దనలో జేర్చుకొనుచున్నది. అచ్చట నుండి దక్షిణముగ మంజీరానది గోదావరి యందు సంగమించు స్థానమువరకును బోయి, యింకను దక్షిణముగ సాగి, బీదరుమండల మున కన్నడము ప్రచారములోనున్న ప్రదేశములోనికి చొచ్చుకొని పోవుచున్నది. అచ్చటనుండి సరిగ దక్షిణముగ నైజాము రాష్ట్రములోని యారుజిల్లాలను దనలో జేర్చుకొని, తిరిగి బ్రిటీషుఇండియాలోని బళ్ళారి జిల్లాను సరిగ రెండుభాగములు చేయుచున్నది. ఆతరువాత నది యిట్లు సాగి, యనంతపురము జిల్లాద్వారా మైసూరుసంస్థానమును చొచ్చుకొని, యందలి బెంగుళూరు, కోలారు, నంద దుర్గము, చిత్రదుర్గముజిల్లాలను దనలో జేర్చుకొనుచున్నది. అక్కడనుండి యుత్తరఆర్కాడు, చెంగల్పట్టుజిల్లాల మధ్యభాగమున సాగి, తిరిగి బంగాళాఖాతమును జేరుచున్నది."[1] ఆంధ్రదేశపు వైశాల్యము భారతదేశపువైశాల్యములో 9వవంతు. భారతీయులందరిలోను ఆంధ్రులసంఖ్య 10వవంతు. భారతదేశమునందలి భాషలలో ఆంధ్రభాషది మూడవ స్థానము.[2]

తెలుగుభాష వ్యాప్తియందున్న ఈదేశమునకు తెలుగుదేశమనియు, ఆంధ్రదేశమనియు పేర్లు మధ్యయుగమున సామాన్యముగ వాడబడినవి. కాకతీయప్రతాపరుద్రదేవునియాస్థానమునందుండిన విద్యానాథకవి కాకతీయరాజులను ఆంధ్రక్షమావల్లభులనియు, ఆంధ్రక్షమాభృత్తులనియు వర్ణించినాడు.[3] ఈ రాజులను సమకాలికులగు యాదవరాజుల శాసనములు తిల్లింగక్షితిపాలురనియు, తెలుంగరాయలనియు పేర్కొనినవి.[4] కాకతిరుద్రుని శాసనమొకటి అన్మకొండనగరము 'ఆంధ్రావనీమండన'మని వర్ణించినది.[5] వెల్నాటిరాజులశాసనములలో ఆంధ్రదేశ ప్రసంస కలదు. విష్ణుకుండినులకు సమకాలికుడైన వాకాటకహరిసేనుడు తాను కళింగాంధ్ర దేశములను జయించితినని చెప్పుకొనినాడు. క్రీ. శ. 6వశతాబ్దిపూర్వభాగపు హరహాశాసనమునందు 'ఆంధ్రపతి' ప్రశంసకలదు. ఆనంద గోత్రజుడగు కందరరాజుదౌహిత్రుని చేజర్ల శాసనమునందు "ఆంధ్రపృథ్వీ" పేర్కొనబడినది. ఇంతకంటెను ప్రాచీనమైన ప్రశంస పల్లవుల మైదవోలుతామ్రశాసనమున కలదు.[6] అందు అంధ్రాపథములోని విరిపరగ్రామము దానముచేయబడినట్లు చెప్పబడినది. ఈవిరిపర గుంటూరుజిల్లాలోని విప్పర్లగ్రామము. ఈ "అంధాపథ"ము ఉన్నంతలో ప్రాచీనతమమైన దేశవాచకశబ్దముగ గన్పించుచున్నది. శాతవాహనరాజులశాసనములయందెచ్చటను ఆంధ్రదేశమనుమాట కన్పింపదు. ప్రాచీన

---

1. డా॥ చి. నారాయణరావుగారి ఆంధ్రభాషా చరిత్రము. పుట 5.
2. Dr. M. Rama Rao—Andhra Province pp. 3—5.
3. కాకతీయ సంచిక—అనుబంధములో ప్రతాపరుద్రీయభాగము.
4. డిటో
5. డిటో అనుమకొండశాసనము.
6. Ep. Ind. II.

బౌద్ధవాఙ్మయమునందు అంధకులను నొక భిక్షుకగణము పేర్కొనబడినది.(7) రాజగిరికులను మరికొందరు భిక్షువులును పేర్కొనబడినారు. రాజగిరిప్రాంతనివాసు లగుటవలననే వారి కా పేరు వచ్చియుండును. సముద్రగుప్తుని అల్లాహాబాదుశాసనమున కోసలకమహేంద్ర, గిరికోట్టూరకస్వామిదత్త, కౌరాలకమంతరాజ, వేంగేయకహస్తివర్మ, కాంచేయకవిష్ణుగోప అను పేర్లున్నవి. ఈ రాజులు ఆయాస్థలముల నుండి పరిపాలించినవారు. అట్లే 'అంధక' భిక్షువులు అంధ, అంధ్ర, లేక ఆంధ్రదేశము లగుటవలన నట్లు పిలువబడిరని ఊహింప వచ్చును. అప్పుడు బౌద్ధయుగముననే ఆంధ్ర శబ్దవాచ్యమగు దేశముండెనని యేర్పడుచున్నది. ఆంధ్రులను ప్రజలప్రశంస ఇంతకంటెను ప్రాచీనకాలమున ఐతరేయబ్రాహ్మణమున కనిపించుచున్నది.(8) అనేకచోట్ల ప్రజల పేర్లనుబట్టి వారు నివసించు ప్రదేశముల పేర్లు ఏర్పడినవి. అందువలన ఆంధ్రులు నివసించు దేశము ఆంధ్రదేశమయ్యెనని నిశ్చయింప వచ్చును.

మధ్యయుగమునందు తెలుగుభాష ఆంధ్ర భాషగ వ్యవహరింపబడినది. ఉన్నంతలో ఆంధ్రభాషలో నన్నయమహాభారత మాది కావ్యము. ఆమహాకవి యీగ్రంథమును తాను తెనుగున రచించితినని చెప్పుకొనినాడు.(9) గద్యలో ఆంధ్రమహాభారతమని ఉన్నది. అతని కీసందర్భమున సహాయము చేసిన నారాయణభట్టు సంస్కృతప్రాకృత పైశాచికాంధ్రభాషలలో నిపుణుడని వర్ణింపబడెనాడు.(10) దీనినిబట్టి క్రీ.శ. ౧౧వ శతాబ్దిలోనే తెలుగున కాంధ్రమను పేరుండెనని తెలియనగుచున్నది. క్రీ.శ. 5, 6 శతాబ్దులలో ప్రాగాంధ్రమును పరిపాలించిన విష్ణుకుండిన రాజులను సమకాలికులు ఆంధ్రులని పేర్కొనినారు. రేనాటిచోళుల శాసనములు తెలుగులో ఉన్నవి.(11) విష్ణుకుండినుల శాసనములలో గ్రామ నామములు తెలుగులో ఉన్నవి. ఇంతకు పూర్వము క్రీ.శ. 4, 5, 6 శతాబ్దులలో వేంగిని పరిపాలనచేసిన శాలంకాయనరాజుల శాసనములందును తెలుగుపేర్లున్నవి. ఈశాలంకాయనవిష్ణుకుండినవంశీయులకు సమకాలికులుగ కళింగమును పరిపాలించినరాజుల శాసనములందును ఎన్నియో తెలుగుపేర్లు కన్పించుచున్నవి.(12) వీరందరికిని పూర్వము పరిపాలించిన ప్రాచీనపల్లవుల తామ్రశాసనములు రెండింటిలో 'విరిపర' 'దాలూర' అను రెండు పేర్లు కలవు.(13) నేటి గుంటూరుమండలములోని విప్పర్ల, దావులూరులకు ఇవి సరియగును. అగుచో విప్పర్లకు విరిపరయు,

7. The Jatakas V. pp. 10 & 138,
8. VII. 8.
9. మహాభారతావతారిక.
10. నందంపూడి శాసనము. E. I. IV. pp. 300—309.
11. మాలెపాడు శాసనము.
12. Dr. M. Rama Rao—Inscriptions of Andhra Dynasties: Sālankāyanas and Viṣṇukuṇḍins. వీనిలో అరుతురె, ముండూరు, చెంచెరువు, కంబురాంచేరువు, పెదెనూరుపల్లి, కురువాడ మున్నగు పేర్లు కలవు.
13. మైదవోలు, బ్రిటిష్ మ్యూజియం తామ్రశాసనములు. Ibid

దాక్షారామునకు దాలూరను ప్రాచీననామములు కావచ్చును. అప్పటికి పల్లవరాజ్యస్థాపనకాలమునందేమి తెలుగు భాష వ్యాప్తిలో నుండెనని ఏర్పడుచున్నది. అంతకు పూర్వము, అనగా, శాతవాహనయుగమున తెలుగుభాష వ్యాప్తియందుండెనో లేదో నిశ్చితముగా తెలియదు. శాతవాహనరాజగు హాలుడిచే సంకలనము చేయబడిన సప్తశతియను ప్రాకృతకావ్యమున తెలుగుమాటలున్నవని ఒకవాదము కలదు. హాలుడు క్రీ.శ. 1వశతాబ్దివాడు. అంతియగాక గుణాఢ్యపండితుడు నాడు వ్యాప్తిలోనున్న సంస్కృతప్రాకృతదేశీయ మూడుభాషలను త్యజించి పైశాచీభాషలో తన బృహత్కథను రచించెనని కథాసరిత్సాగరమున చెప్పబడినది.(14) శాతవాహనయుగమున ప్రాకృతము రాజాస్థానభాషగ నుండెను. అంతకు పూర్వము అశోకచక్రవర్తి ఈభాషలోనే తనశాసనములను వేయించెను. శాతవాహనులును ఆ సంప్రదాయమును అనుసరించిరి. కాని ప్రజాసామాన్యము సంస్కృతప్రాకృతభిన్నమౌ, దేశి అని పిలువబడిన నొకభాషను మాట్లాడుచుండిరి. ఉత్తరశాతవాహనయుగమున సంస్కృతము రాజాస్థానముల భాషయై శాసనములన్నియు ఆభాషయందే వ్రాయబడెను.(15) ప్రజాసామాన్యమునకు తెలియవలెనను ఉద్దేశముతో కావలెను దానముచేయబడిన గ్రామముల పేర్లను, నాటిపరిహారములను దేశభాషయగు తెలుగున ఆశాసనములలో వ్రాయబడినవి. సంస్కృతము శాసనములభాషగను రాజాస్థానభాషగను ఉండినప్పుడు వ్యాప్తిలో నుండిన దేశభాషలు ప్రాకృతము రాజాస్థానములయొక్కయు, శాసనములయొక్కయు భాషగనుండినప్పుడును వ్యాప్తియందుండెనని చెప్పవచ్చునుగదా! అట్లచో తెలుగు ఏదో ఒకరూపమున శాతవాహనయుగమునను ఉండె, అనంతరము ఆ శాఖాంతరములనుండి, ఉత్తరశాతవాహనయుగమున ఒక రూపము నందెనని ఊహింపవచ్చును.

జాతిపరముగ ఆంధ్రశబ్దము బహుప్రాచీనము. ఇతిహాసపురాణములయందును అది అంధ్ర, ఆంధ్ర అనురూపములలో కనిపించుచున్నది. ఆంధ్రుల మొట్టమొదటి ప్రశంస ఐతరేయబ్రాహ్మణమున కలదు. ఈ ఐతరేయబ్రాహ్మణము పురాణములకంటెను, శాసనములకంటెనుకూడ ప్రాచీనతరము.

పైన పేర్కొనబడిన యంశములనుబట్టి ఆంధ్రజాతి మిక్కిలి ప్రాచీనమైనదనియు, ఆ జాతినిబట్టియే అది నివసించు ప్రాంతమునకు ఆంధ్రదేశమని పేరు వచ్చెననియు చెప్పవచ్చును. ఈ ఆంధ్రులు ఆర్యులా అనార్యులా అని ఒక వాదము జరిగినది. ఐతరేయబ్రాహ్మణమున వీరిని పేర్కొను భాగము సందిగ్ధముగ నున్నది. దానికి ఆంధ్రులు ఆర్యులే అని, విశ్వామిత్రుని శాపమువలన అనార్యజాతుల సమూహమున నివసించి, క్రమక్రమముగ వారిలో కలిసిపోయిరనియు అర్థము చెప్పవచ్చును లేదా వీరు విశ్వామిత్రుని అనార్యసంతతి అనియు

14. కథాపీఠలంబకము, తరం. ౬ శ్లో. 147—148

15. ఉత్తరపల్లవ ఆనందశాలంకాయన విష్ణుకుండినుల శాసనములును, వేంగీచాళుక్యుల శాసనములలోను చాలభాగమును సంస్కృతముననే ఉన్నవి.

చెప్పవచ్చును. ఇందు ఏది నిజమైనను వారియందు అనార్యసంమిశ్రణము విశేషముగ జరిగెననుట స్పష్టము. అందువలననే ఆంధ్రుల వ్యవహారము వచ్చిన తెలుగు భాష ఇతర ఆర్యభాషాభవములగు దేశభాషల కంటెను భిన్నముగను, ద్రవిడభాషలతో సన్నిహితసంబంధము కలదిగను ఉన్నది. కాని ఆంధ్రులసంస్కృతిలో ఆర్యసంస్కృతి ప్రధానముగ గనిపించుచున్నది. ఆంధ్రులు నివసించెడి ఆంధ్రదేశమునకు వచ్చినది గనుకనే తెలుగునకు ఆంధ్రభాషయని పేరు వచ్చినది.

ఆంధ్రులచరిత్ర సాతవాహనరాజ్యారంభకాలమునుండియు సక్రమముగ తెలియుచున్నది. అంతకుపూర్వము చరిత్ర స్పష్టముగ లేదు. అక్కడక్కడ వైదికసంపుటములలో చేయబడిన ప్రశంసలనుబట్టి కొన్ని అంశముల నూహింపవలసి యున్నది. ఐతరేయబ్రాహ్మణమునం దొక కథ గలదు. విశ్వామిత్రమహర్షికి నూర్గురుపుత్రులుండిరట. ఆ మహర్షి పేరుగాక శునశ్శేపుడను నతనిని కుమారునిగ స్వీకరించెనట. అంతట నతని మొదటి యేబండ్రుపుత్రులును తిరుగబడిరట. కుపితుడై విశ్వామిత్రుడు వీరిని ఆర్యభూముల వెలుపల నివసింపుడని శపించెనట. అందువలన ఆంధ్రపుండ్రపుళిందశబరమూతిబులు కలసి యున్నారట. వీరిలో పుండ్రులు వింధ్యపర్వతములకు ప్రాగుత్తరముగనుండిరని ఇతరాధారములనుండి తెలియుచున్నది. శబరులు కళింగదేశమున తూర్పుకనుమలలో ఏజన్సీ ప్రాంతమున నేటికిని కలరు. పుళిందులు వింధ్యప్రాంతమున నుండువారు.[16] హాలుని సప్తశతియందును వీరి ప్రశంస కలదు.[17] అగుచో ఈజాతులవారికి దక్షిణముగనున్న భాగమున వారికి ఇరుగుపొరుగుగ ఆంధ్రులు ఉండియుండిరి. వైదికవాఙ్మయమున కొన్ని రాజ్యముల ప్రశంస కలదు. మొదట దక్షిణాపథము ఆర్యభూములనుండి బహిష్కరింపబడినవారు నివసించెడి ప్రదేశముగ నుండెను. క్రమముగ ఆర్యులు వింధ్యపర్వతములను దాటి యీ ప్రాంతమునను రాజ్యములను నిర్మించిరి. ఇట్టి వానిలో విదర్భ ఒకటి. కళింగము మరియొకటి. ఇది ప్రాక్సముద్రతీరమువెంబడి వైతరణీగోదావరీనదులమధ్య నుండెడిది. గోదావరీతీరమునందు పోతనగరము రాజధానిగగల అశ్మకరాష్ట్రము మరియొకటి. ఇంకొకటి మూలకరాష్ట్రము. ఈరాజ్యముల క్రిందనున్న దక్షిణాపథము ఆంధ్రపుళిందాదుల నివాసముగ నుండెను.[18] పురాణములు వివిధజాతుల ప్రశంస చేయుచోట్ల ఆంధ్రులను దక్షిణాపథవాసులుగను, ప్రాచ్యజనపదములలోనివారిగను పేర్కొనినవి.[19] పురాణములలోని యాదవవంశమున సాత్వతునికి అంధక, వృష్ణులని ఇద్దరు పుత్రులుండిరనియు, వీరిసంతతివారు అంధకవృష్ణులని పిలువబడిరనియు చెప్పబడినది. బౌద్ధవాఙ్మయమున ఆంధ్రులు అంధకులని వ్యవహరింపబడిరి. అప్పుడు పైఅంధకవృష్ణులలోని

16. వీరిరాజధానియగు పుళిందనగరము నేటి భిల్సావద్ద నుండెడిది.—Raychaudhari—Pol. Hist. Anc. Inc. P. 165.

17. చూ. అనుబంధము.

18. Raychaudhari—Pol. Hist. Anc. Ind. pp. 40—43.

19. మత్స్య 114—46—48; వాయు 45—126; భాగవతము XII 207—42

అంధకులు ఆంధ్రులు కావచ్చును. బౌద్ధజాతకములలో అంధకవెణ్హుజాతకమను నొక జాతకము కలదు.(20) దానిననుసరించి అంధకవెణ్హు అనునతడొక బానిస. అతనిభార్య నందగోప. ఈమె దేవగర్భియను తన యజమానిని పురిటింటనుండగ పరిచర్య చేసెనట. అంధకవెణ్హుదంపతులకు కృష్ణుడుమున్నగు సోదరులు పుట్టిరట. వారికి అంధకవెణ్హు దాసపుత్రులని ప్రసిద్ధి వచ్చెనట. ఈజాతకకథ దేవకీవసుదేవులకథను పోలియున్నది. పైఅంధకవెణ్హు అంధకవృష్ణి యగును. శ్రీకృష్ణుడు వృష్ణివంశోద్భవుడు, వార్ష్ణేయుడు. అంధకవృష్ణులు యాదవులలోనివారు. అంధకశబ్దము ఆంధ్రశబ్దపర్యాయపదము. ఈగాథనుబట్టియు ఆంధ్రులు యాదవులు నొకరేఅని తోచుచున్నది. ఒకవేళ ఆంధ్రులలోనే ఈయూ[illegible]తో ఉపశాఖలు బయల్వెడలినవేమో!

శ్రీమద్రామాయణమున ఆంధ్రుల ప్రశంస కలదు. మహాభారతమున సహదేవుని దిగ్విజయమును వర్ణించుచోట్లను(21) అతడు పాండ్యద్రవిడఓడ్రకేరళఆంధ్రకళింగులను జయించెనని చెప్పబడినది. ధర్మరాజు మయసభయందుండగ అతనిని పరివేష్టించియున్న సామంతులలో మద్రకపులిందకిరాతఅంగవంగపుండ్ర ఆంధ్రపాండ్యఓఢ్రరాజు లుండిరట(22) హరివంశపురాణమున కంసప్రేరితుడై చాణూరుడను ఆంధ్రమల్లుడు శ్రీకృష్ణునితో యుద్ధము చేసెనను గాథ కలదు. ఈచాణూరాంధ్రుడు కరూశులలో పుట్టెనట 23) శ్రీమద్రామాయణమున మలదకరూశదేశములు గంగాదక్షిణతీరమునందుండినట్లు చెప్పబడినది. దీనినిబట్టి కరూశులు ఆంధ్రులలో నొకశాఖవారని ఊహింపవచ్చును. శ్రీమద్భాగవతమున మరియొక గాథ కలదు.(24) మగధరాజగు బలిరాజుకి దీర్ఘతమసుడను ఋషివలన అంగవంగకళింగసుహ్మపుండ్రఆంధ్రులను కుమారులు కలిగి వారు తమతమ పేర్లతో ప్రత్యేకరాష్ట్రములను నిర్మించుకొనిరట. సెరివణిజజాతకమను నొక బౌద్ధజాతకమున(25) తేల్‌నదీతీరమున అంధకపురమను నగరముండెనని చెప్పబడినది. ఈతేల్‌నది మహానదికుపనదియగు తెలింగిరి లేక తెలివాహానదియని పండితుల అభిప్రాయము. జాతకములలో పురశబ్దము రాజధానులకే వాడబడినది. అగుచో అంధకపురము లేక ఆంధ్రపురము ఒకఆంధ్రరాష్ట్రమునకు కేంద్రమని తేలుచున్నది.(26) జాతకములును, పురాణములునుకూడ కళింగమును ప్రత్యేకరాజ్యముగ పేర్కొనుచున్నవి. వారివెనువెంటనే ఆంధ్రులును పేర్కొనబడినారు. నేటికిని ఆంధ్రకళింగులకు భాషాసంస్కృతులయందును, ఆచారవ్యవహారములయందును సామ్యమున్నది.

20. Ratilal Mehta—Pre—Buddhist India pp. 24—25.
21. సభాపర్వ. అధ్యా. 31.
22. డిటో అధ్యా. 4 శ్లో 20, 24.
23. పూనా చిత్రశాలా ప్రెస్ ప్రతి పుటలు 226, 229.
24. నవమస్కంధము. అధ్యా. 23.
25. J. A, 1918—p. 71.
26. ఇట్టి ఆంధ్రరాష్ట్ర అంధకపుర అంధకుల ప్రశంస జాతకములలో కలదు. Cowell and Thomas—The Jatakas. I. pp. 80; 12; V, pp. 10, 138.

పైన పేర్కొనబడిన గ్రంథములనుబట్టియు ప్రాచీనాంధ్రుల చరిత్రము నొకవిధముగ నూహింపవచ్చును. ఐతరేయబ్రాహ్మణకాలమునందే వారు వింధ్యపర్వతములను దాటి, వానికి దక్షిణముగ నివాసము లేర్పరచుకొనిన పుళిందమూతిబులభూములను దాటి, సుప్రసిద్ధ పుండ్రశబరకళింగుల నివాసముల నాని తమ నివాసము నేర్పరచుకొనిరి. మొదట వారికి తెలివాహాతీరమునందొక నగరము కేంద్రముగ నుండి అంధకపురమని ప్రసిద్ధి నందెను. క్రమక్రమముగ వారు తూర్పుకనుమల వెంబడి దక్షిణముగ వ్యాపించి దక్షిణాపథమునందలి మధ్యప్రాగ్భాగముల నాక్రమించిరి. వారిలో అంధకవృష్ణికరూశాది ఉపశాఖ లేర్పడినవి. ఇది క్రీ. శ. 5వశతాబ్దినాటికే జరిగెను.

నందరాజ్యాభిషేకము భారతదేశచరిత్రమునందొక ముఖ్యఘట్టము. నందరాజులు బహుబలాన్వితులు. పాటలీపుత్రము వారికి రాజధాని. కొంచెమెక్కువతక్కువగ ఉత్తరాపథమంతయు వారియధీనమునం దుండెను. వారు కళింగమును జయించిరని కొన్ని యాధారములు తెలుపుచున్నవి.(27) ఆంధ్రులకును వీరికిని ఎట్టిసంబంధముండెడిదో, వీరు ఆంధ్రులనుకూడ వశపరచుకొనిరో లేదో తెలియదు.

క్రీ.పూ. 322లో చంద్రగుప్తుడు మౌర్య సామ్రాజ్యమును స్థాపించెను. ఇతడుత్తరాపథమును వశపరచుకొని పరిపాలించెను. అంతియగాక నీచక్రవర్తి కొంకణతీరము వెంబడి పోయి, ద్రవిడదేశమున తిరునెల్వేలిజిల్లాలోని పొదియిల్ కొండవరకును తనయధికారమును విస్తరించెనని కొన్నియాధారములు తెలుపుచున్నవి.(28) అర్వాచీనములగు మరికొన్ని యాధారము లీరాజు మైసూరురాజ్యములోని శ్రవణబెల్గొలావద్ద కొంతకాలము గడపి అచటనే మరణించెనని చెప్పుచున్నవి.(29) అతడు ఆంధ్రులను జయించెనని ఏయాధారమును చెప్పుటలేదు. అతని యాస్థానమున రాయబారిగనుండిన మెగస్తనీస్ అను యవనుడు ఆనాటి పరిస్థితులనుగూర్చి తనకు తెలిసిన విషయములను గ్రంథస్థము చేసెను. అతని గ్రంథమునుబట్టి[30] కళింగులకు 60000పదాతులును, 1000రౌతులును, 200ఏనుగులును గల బలముండెననియు, వారు సముద్రతీరమున నుండిరనియు, ఈ కళింగులకంటెను బలవంతులు ఆంధ్రులనియు, వీరికి అనేక గ్రామములును, ప్రాకారావృతములగు 30 నగరములు నుండెడివనియు, వీరి రాజుకు 10000 పదాతులును, 2000రౌతులును, 1000ఏనుగులును గల సైన్యముండెననియు తెలియుచున్నది. ఈ యాంధ్రనగరములను కొన్నిటి

27. కుంతలము నందరాజ్యమున చేరియుండెనని కొన్ని మైసూరు శాసనములు చెప్పుచున్నవి. [Rice—Mysore and Coorg from inscriptions p. 3] ఇవి అర్వాచీనములు విశ్వసనీయములు కావు. కళింగరాజగు ఖారవేలుని హాథీగుంఫాశాసనమున (J B O R S. 1917 pp. 447, 457—458)-నందులు కళింగమును జయించిరని చెప్పబడినది.

28. S. K. Iyengar—Beginnings of S. Ind. History. ch. II.

29. Smith—Oxford History of India p. 76; Rice—Mys & Coorg pp. 3—4

30. Indika in I. A VIpp. 337—339

నైనను నేను నిరూపింపవచ్చును. వేంగీ ప్రాచీననగరము. ప్రఖ్యాత బౌద్ధక్షేత్రము. క్రీ.పూ. 2వశతాబ్దినాటికే పిథుండమను పూర్వరాజనిర్మితమగు నగరముండెను. [31] ధాన్యకటకము క్రీ.పూ. 3వశతాబ్దినుండి యుండెను. విజయపురియును నాగార్జునకొండయు ప్రాచీనమే. భట్టిప్రోలువద్ద క్రీ.పూ. 3వశతాబ్దమునందే యొక నగరముండియుండవలెను. ఇటీవల నైజాంరాజ్యమున కొండాపురము, గాజులబండ, పెదగిరులలో ప్రాచీన నగరములు బయలుపడినవి. జాతకములలో పేర్కొనబడెను అంధకపుర మొకటి. ఇవియును మరియితరములును చేరి మెగస్తనీసు పేర్కొనిన 30నగరములును అగును.[32] దీనినిబట్టి మెగస్తనీసుకాలమునకే దక్షిణాపథమునందలి ముఖ్యప్రాగ్దక్షిణభాగములలో ఆంధ్రులు నివసించుచుండిరని చెప్పవచ్చును.

క్రీ.పూ. 3వశతాబ్దిలో రాజ్యము చేసిన అశోకచక్రవర్తికాలము మిక్కిలి ముఖ్యమైనది. అతని శాసనములు కళింగమునందలి ధౌలి, జౌగడాలలోను, కర్నూలుజిల్లాలోని ఎర్రగుడిలోను, నైజాంరాజ్యమునందలి మస్కిలోను, మైసూరురాజ్యమునందలి సిద్ధాపురము నను కలవు. కళింగమునం దొకడును, మస్కివద్ద సువర్ణగిరియం దొకడును ఆచక్రవర్తి ప్రతినిధులుండిరి.(33) అతని శాసనములలో సమకాలిక స్వతంత్రరాజ్యములయొక్కయు, స్వతంత్రులుగనుండని తెగలయొక్కయు, రాజ్యస్థములగు తెగలయొక్కయు ప్రశంస కలదు. అప్పటికి కళింగము ప్రత్యేకస్వతంత్రరాజ్యముగనే ఉండె. ఆచక్రవర్తిచేత జయింపబడెను. దక్షిణపుసరిహద్దున చోళపాండ్యులును, కేరళసత్యపుత్రులు నుండిరి. రాజ్యములోపల (ఇధ రాజవిషయము) యవనకాంభోజనాభకనాభపంక్తి భోజపెటెనిక ఆంధ్రపుళిందు లుండిరట.(34) ఈ ఆంధ్రుల ప్రశంస ఆ చక్రవర్తియొక్క షాహాబాజ్ గహి. మాన్సెర, గిర్నార్ శాసనములలో కనిపించుచున్నది. అశోకుడు ఒక్కకళింగమును తప్ప మరియేప్రాంతమును జయించలేదు. అయినను ఆంధ్రులు అతనిరాజ్యములోని వారని చెప్పబడెను. దీనినిబట్టి ఇతనితండ్రియగు బిందుసారుడు ఆంధ్రులను జయించెనేమోఅని అనుమానము కలుగుచున్నది. అశోకుని శాసనములలోనే ఆంధ్రులు అతని ధర్మబోధ ననుసరించిరని మాత్రము చెప్పబడెను. అందువలన ఆంధ్రులు నామమాత్రముగ మౌర్యుల స్వామిత్వము నంగీకరించినను వాస్తవముగ స్వతంత్రులుగనే ఉండిరని చెప్పవచ్చును. అశోకుడు మహాదేవభిక్షువును ఆంధ్రదేశమున ధర్మప్రచారము చేయుటకై పంపెను. రఠికులు నేటి మహారాష్ట్రమునను, భోజకులు నేటి బేరారులోను, పిటెనికులు గోదావరీతీరమున పైఠనుప్రాంతమునను ఉండెడివారని పండితుల నిర్ణయము.(35) అగుచో ఈప్రాంతములును, కళింగమును పోగా మిగి

---

31. కళింగరాజగు ఖారవేలు డీనగరమును గాడిదలు యీడ్చిన నాగళ్ళచే ధ్వంసము చేయించితినని తన హాథీగుంఫాశాసనమున చెప్పకొనెను.
32. ఈ నగరములు నేటి ఆంధ్రదేశము నందన్ని జిల్లాలను కలవు.
33. Corp. Ins. Ind. I. Intro p. XXXVIII.
34. చూ. 13వ శాసనము.
35. Raychaudhari—Pol His. Anc. Ind p. 165.

లినదియు దక్షిణమున చోళపాండ్యకేరళ రాజ్యములవరకును విస్తరించినదియు అగు దక్షిణాపథమును, ఆంధ్రులును, మిగులు చున్నారు. అప్పటికి ఆంధ్రులీమిగిలిన ప్రాంతమునందు అశోకుని కాలమున నివసించుచుండె నని చెప్పవచ్చును. భట్టిప్రోలుస్తూపమున దొరికిన ప్రాచీనబ్రాహ్మిలిపిలోని శాసనములును, గుహాగాథలును అశోకునికిపూర్వమే బౌద్ధమతమాంధ్రదేశమున వ్యాపించెనని తెలుపుచున్నవి. ఆంధ్రదేశమునందలి భట్టిప్రోలు, అమరావతి, నాగార్జునకొండలలోని మహాచైత్యములు బుద్ధుని శారీరకావశేషములపైని నిర్మింపబడిన కట్టడములు. అశోకుడు విభాగించి పంచిపెట్టిన బుద్ధధాతువుల లోనివే ఇవి కావలెను. పంచవింశతి శాసనములు ఆంధ్రుల ప్రాచీనతనుగూర్చి తెలుపుచున్నవి. అతడు వారికి మారాజు ధాతువుల పంపుటయు, నాటి ఆంధ్రుల ప్రాబల్యగౌరవ ములను చూపుచున్నది.

చారిత్రకాంధ్రులనియు, అతడు కరూ శులలో పుట్టెననియు శ్రీమద్భాగవతహరివంశ ములు తెలుపుచున్నవి. దీనినిబట్టి ఆంధ్రు లలో కరూశులను నొకశాఖవా రుండిరని ఊహింపవచ్చును. యాదవులలో అంధక వృష్ణు లుండిరి. బహుశః ఈయాంధ్రులలోని యాదవులను నొకశాఖవారు ఏర్పడిరేమో! మెగస్తనీసు 'శతేంగి' అనువారు వెంగిబంగాళ ములకు సరిహద్దులని వ్రాసినాడు. చరిత్రప్రసిద్ధు లగు 'సాతవాహనరాజులకు సాతకర్ణి, సాతి' అనుపేరులుండెను. వీరు పై శతేంగి కావ చ్చును. పురాణములు ఈరాజులను ఆంధ్ర జాతీయులని వర్ణించినవి. అందువలన సాత వాహను (సాతకర్ణు)లును కరూశులవలె ఆంధ్రులలో నొకశాఖవారని చెప్పవచ్చును.

ఇట్లు ఆంధ్రులు ఐతరేయబ్రాహ్మణకాల మున ఆర్యభూములను దాటి వచ్చి కొంత కాల ముత్తరాపథమున నుండి, పమ్మట వింధ్యపర్వతములను దాటి దక్షిణాపథమునకు వచ్చి శాతవాహనశాఖలై క్రీ. పూ. నవశతాబ్ది ప్రాంతమునకే కొంచెమెక్కువతక్కువగ నీయాంధ్రదేశమునంతటిని ఆక్రమించి యిట స్థిరపడిరని తెలియుచున్నది.

## ౪. సాతవాహను లాంధ్రులు

పురాణములు ముప్పదిమంది ఆంధ్రరాజులు సుమారు నాలుగున్నరశతాబ్దుల కాలము పరిపాలించిరని చెప్పుచున్నవి. పౌరాణికపట్టికలలో ఈరాజుల పేర్లు కలవు. శాసనములును, నాణెములును సాతవాహనవంశజులగు రాజుల పేర్లను తెల్పుచున్నవి. పురాణముల లోని ఆంధ్రరాజుల పేర్లును, శాసనాదులలోని సాతవాహనరాజుల పేర్లును కొద్దితేడాలతో ఒకటిగనే ఉన్నవి. ఈకారణమునుబట్టి చాల మంది పండితులు పురాణములలోని ఆంధ్రు లును, శాసనములలోని సాతవాహనులు నొక్కరే అని అంగీకరించిరి. కొందరు మాత్రము ఈసమన్వయము నంగీకరింపలేరు. తమ అనంగీకారమునకు వీరు ఈక్రిందికారణ ములను చెప్పుచున్నారు:—

(1) ఆంధ్రులు దక్షిణాపథప్రాగ్భాగము నందలి ఆంధ్రదేశమునందున్నారు. సాతవాహనవంశమునందలి మొదటిరాజుల శాసనములును, నాణెములును మహారాష్ట్రమునందున్నవి. సాతవాహను లాంధ్రులగుచో ఆంధ్రదేశమునందు వారి శాసనాదులు కనిపించి తీరెడివి.

(2) ఇంతవరకును సాతవాహనులశాసనము లెన్నియో లభించినవి. అందు వారు ఆంధ్రులని ఎచ్చటను చెప్పబడలేదు.

(3) ఆంధ్రుల భాష తెనుగు. సాతవాహనశాసనములు ప్రాకృతభాష యందున్నవి.

(4) పురాణములలో చెప్పబడిన రాజులు ఆంధ్ర లేక ఆంధ్రభృత్యవంశజులు సాతవాహనులు కారు.

(5) సాతవాహనులు మహారాష్ట్రమునందు అధికారమును స్థాపించిరి. కొంతకాలమైనపిమ్మట వారు ఆంధ్రదేశమును జయించిరి. ఈవంశీయులలో కడపటి ఏడెనిమిది పురుషాంతరముల రాజులు ఆంధ్రదేశముననే పరిపాలించిరి. పౌరాణికులు ఈకారణమువలన భ్రమపడి సాతవాహనులను ఆంధ్రులుగ వర్ణించిరి.

పైన వివరింపబడిన అంశములకు ఈక్రింది విధమున సమాధానము చెప్పవచ్చును.

(1) సాతవాహనుల శాసనములలో ఒక్కటియు వారిని ఆంధ్రులని పేర్కొనకుండుట వాస్తవమే. ఉత్తరసాతవాహనయుగమున ఆంధ్రదేశము నేలిన ఆంధ్రరాజవంశములలో ఇక్ష్వాకు, పల్లవ, శాలంకాయన, విష్ణుకుండి, కాకతీయ, రెడ్డివంశములు ముఖ్యములు. ఇందు ఒక్కటియు ఆంధ్రేతరవంశము కాదు. అయినను ఇందు ఒక్కవంశమువారైనను తమ శాసనములలో తాము ఆంధ్రులమని చెప్పుకొనలేదు. అంతమాత్రమున వారు ఆంధ్రులు కారనుట ఉచితమగునా? సాధారణముగ రాజులు తమవంశనామమును చెప్పుకుందురు కాని తామే ప్రజలలోనివారో చెప్పుకొనుట అరుదు. నాసికశాసనములలోని శాసనములు నహపానుని క్షహరాటుని (క్షహరాటవంశజుని) అని చెప్పుచున్నవి, కాని అతని జాతిని పేర్కొనుట లేదు.(36) ఇతరాధారములు అతడు పహ్లవజాతీయుడని తెల్పుచున్నవి. అట్లే రుద్రదాముడు కార్దమకవంశీయుడని ఒక కన్హేరిశాసనము తెలుపుచున్నది.(37) అతడు శకజాతీయుడు. ఒకప్రజ విశాలమగు దేశము నాక్రమించినపుడు అందు వేర్వేరు రాష్ట్రము లేర్పడును. వేర్వేరుకుటుంబములు వేర్వేరు భాగములయందు నివసించి రాజ్యస్థాపన చేయును. 'సాతవాహన' అనునది కులనామము. 'ఆంధ్ర' అనునది ఇట్టికులములు అనేకములు కల ప్రజపేరు.

(2) ఆంధ్రులు నేటి మదరాసురాజధానియందలి ఉత్తరభాగమున ప్రాక్తీరమున మాత్రమే ఉన్నారని అనుకొనుట పొరబాటు. మధ్యపరగణాలలోని చందా వార్ధాజిల్లాలలోను, బస్తరుసంస్థానమునందును, మైసూరు రాజ్యమునందలి ప్రాగుత్తరభాగమునను, నైజాంరాజ్యమునందలి తొమ్మిదిజిల్లాలలోను వారు నేటికిని నివసించుచున్నారు. సాతవాహనులు ఆంధ్రదేశమునుండి బయలుదేరి

36. E. I. VIII. లోని నాసికశాసనములలో ఉషవదత్తుని శాసనములను చూచునది.
37. A S W I. p. 78. No. 15.

మహారాష్ట్రమును జయించిరి. ఆమీద కొన్ని రాజకీయకారణములవలన వారు ఆప్రాంతముననే కొంతకాలము ఉండిపోవలసి వచ్చినది. అందువల్లనే వారిలో మొదటిరాజుల శాసనములును, నాణెములును మహారాష్ట్రమున కనిపించుచున్నవి.(౩౮)

(౩) నేటి ఆంధ్రుల భాష తెనుగే. క్రీ. శ. 5, 6 శతాబ్దులలో ప్రాగాంధ్రమును పరిపాలించిన శాలంకాయనులశాసనములలో తెనుగుమాటలు కాంచనగుచున్నవి. అంతకు పూర్వప్రసంగము నిశ్చయముగ తెలియదు. క్రీ. శ. 1వశతాబ్దినాటి గుణాఢ్యపండితునికాలముననే 'దేశీ'అను లోకభాష ఉండెడిది. అదియే క్రమక్రమముగ పరిణతి పొంది తెనుగుగ మారియుండవచ్చును. ప్రాకృతమును శాసనములయందు నుపయోగించినవారు ఒక్క సాతవాహనులేకారు. వారికి పూర్వముండిన అశోకచక్రవర్తి శాసనములన్నియు ప్రాకృతముననే ఉన్నవి. కళింగరాజులవి కొన్నియు ఆభాషయందే ఉన్నవి. ప్రాచీనపల్లవులయొక్కయు, ఇక్ష్వాకులయొక్కయు శాసనములును ప్రాకృతముననే ఉన్నవి. ఒక్క క్షహరాటులయొక్కయు, ఉజ్జయినీక్షత్రపులయొక్కయు శాసనములు మాత్రము సంస్కృతమునందున్నవి. ఆకాలపు సామాన్యప్రజలు సహితము తమ ధర్మశాసనములను ప్రాకృతముననే చెక్కించుకొనిరి. నాడు ప్రబలులుగ నున్న బౌద్ధులు తమగ్రంథములను, ఆభాషలోనే రచించిరి. ప్రాకృతము ఆరోజులలో ఆస్థానముల భాషయేకాక జనసామాన్యమునకుకూడ అర్థమగు భాషగ నుండెడిది. లేనిచో కేవలము ప్రజోపయోగార్థము వేయింపబడిన అశోకుని శాసనములు ఆభాషయందుండవు కదా. సాతవాహనులు ఇతరాచారములతో పాటు ఈసాంప్రదాయమును మౌర్యులవద్దనుండి గ్రహించిరి. అదియునుగాక వేంగీ చాళుక్యుల దానశాసనములలో చాలభాగమును విస్తరించిన శాలంకాయనులశాసనములును సంస్కృతమునందున్నవి. అంతమాత్రమున వారు ఆంధ్రులు కాకపోవుదురా? వారి కాలపు సాంప్రదాయ మది.

(4) పురాణములలో ప్రాయికముగ కనిపించునది 'ఆంధ్ర'వంశము. కొన్నిటిలో మాత్రము 'ఆంధ్రభృత్య'వంశమని యున్నది. మరికొన్ని రెండుపేర్లను ఉపయోగించుచున్నవి. కాని పురాణములలో ఎక్కువ సంఖ్యగలవి ఆంధ్రులును ఆంధ్రభృత్యులును వేరనియు, ఆంధ్రులకుపిమ్మట ఆంధ్రభృత్యులు ఏలిరనియు చెప్పుచున్నవి.(౩౯)కొందరు దీనికెఅనవసరముగ ప్రాధాన్యము నిచ్చిరి. ఆంధ్రభృత్య శబ్దమునకు ఆంధ్రులభృత్యులనియు, ఆంధ్రులగు భృత్యులనియుకూడ అర్థము చెప్పవచ్చును. రెండవపక్షము ననుసరించి ఈవంశజులు ఆంధ్రులని చెప్పవచ్చునుగదా! అదియునుగాక ఈవంశజులలో మొదటివాడగు సిముకుడు ఆంధ్రజాతీయుడని స్పష్టముగ చెప్పబడియే ఉన్నది.

(౫) సాతవాహనులు విదిశను జయించిరనుట కాధారములున్నవి. పాటలీపుత్రమును జయించిరనుటకు ఆధారము లున్నవి. మహా

౩౮. చూ. పూర్వసాతవాహనులు—ఆంధ్రదేశము అను 6వ విభాగము.

39. I. A. 1913 p. 29

రాష్ట్రమును జయించిరనుట సుప్రసిద్ధము. కాని ఆంధ్రమును జయించిరనుటకు ఏయాధారము లేదు. వారిలో వాసిష్ఠీపుత్రపులోమావి ఆంధ్రమహారాష్ట్రములను రెంటిని పరిపాలించెను. అతనితండ్రి గౌతమీపుత్రుడు మహారాష్ట్రముతోపాటు ఆంధ్రమును ఏలెననియేకాక ముందు ఆంధ్రదేశమును పరిపాలన మారంభించి ఆమీద మహారాష్ట్రాదిదేశములను జయించెనని నిస్సందేహముగ చెప్పవచ్చును.[40] అతనిపూర్వులు ఎప్పుడో ఆంధ్రతీరప్రాంతములను కోల్పోయిరి. ఈసాతవాహనులలో మొదటిముగ్గురు రాజులును మొత్తముమీద 50సంవత్సరములు మాత్రమే మహారాష్ట్రమును పాలించిరి. ఆతర్వాత గౌతమీపుత్రునివరకును, అనగా సుమారు రెండున్నరశతాబ్దులవరకును సాతవాహనులకు మహారాష్ట్రముతో సంబంధము లేకుండెను.

అంతియకాక సాతవాహనులాంధ్రులనుటకు ఈక్రింది కారణములనుకూడ చెప్పవచ్చును:—

(1) సాతవాహనులలో సిముకుడు మొదటిరాజని శాసనములును, పురాణములునుకూడ తెలుపుచున్నవి. ఈసిముకుడు సజాతీయులతోకూడ వసుంధరను పొందునని చెప్పబడినది. ఇంకొకచోట సిముకు డాంధ్రజాతీయుడని ఉన్నది.(41) దీనినిబట్టి సిముకుడు ఇతరసజాతీయులతోకూడ రాజ్యస్థాపన మొనర్చెనని తెలియవచ్చుచున్నది. ఈఉద్యమము ఆంధ్రోద్యమమనియు, దీనికి సాతవాహనవంశీయుడగు సిముకుడు నాయకుడనియు దీనినుండి స్పష్టమగుచున్నది.

(2) సాతవాహనరాజ్యస్థాపన జరుగుటకు కొద్దికాలము ముందుగనే ఉండిన అశోకుని శాసనములలో రఠికపేటనికభోజకులును, ఆంధ్రపుళిందులును, కళింగులును పేర్కొనబడినారు. రఠికులు మహారాష్ట్రమునను, భోజకులు బేరారులోను, పుళిందులు వింధ్యప్రాంతమునను ఉండిరి. కళింగము గోదావరివైతరిణీనదులమధ్య ప్రదేశమునం దుండినది. అప్పుడు దక్షిణాపథమునందలి మధ్యప్రాగ్దక్షిణ, దక్షిణభాగములును ఆంధ్రులును మిగులుదురు. ఆంధ్రులు ఆభాగములనుండిరనుట సమంజసముకాదా! అశోకుని కాలమున మహారాష్ట్రము రఠికులు లేక రాష్ట్రికుల వశమునం దుండెను. అతని అనంతరము

40. చూ. 6వ విభాగము.

41. సిముకోస్వస్రి స్వజాతీయః—పార్గిటరు పాఠము, మత్స్యపురాణము
సిముకోహ్యాన్ధ్ర జాతీయః—వాయు.
సింధుకోహ్యాన్ధ్రజాతీయః—బ్రహ్మాండ
బలిపుచ్ఛకనామా హత్వాంధ్ర జాతీయో—విష్ణు
గాంభోత్యాన్ధ్ర జాతీయః—భాగ

ఈపురాణములలో వాయు, బ్రహ్మాండ, విష్ణు, భాగవతములు గుప్తవంశస్థాపనవరకును నడచిన వృత్తాంతములను పేర్కొనుచున్నవి. అప్పటికి సాతవాహనసామ్రాజ్య మంతరించి కొద్దికాలమే అయ్యెను. మత్స్యపురాణముయొక్క కొన్ని ప్రతులు గౌతమీపుత్రయజ్ఞశ్రీ 9వ సంవత్సరమున వ్రాయబడినట్లున్నవి. (Parg—Dyn. Kali Age. pp. 13, 23, 42) ఈపరిస్థితులలో పౌరాణికులు సాతవాహనాంధ్ర సంబంధమును ఎరిగియుండరనుకొనుటకు ఎంతమాత్రమును అవకాశము లేదు.

8. Pargiter—Dynasties of the Kali Age. Intro.

సాతవాహనులు దానికి [illegible] అప్పుడు వారు మహారాష్ట్రమునకు విదేశీయులే అగుదురుకదా! అగుచో వారు ఆంధ్రులనుండియు, ఆంధ్రదేశమునుండియుకాక మఱెచ్చటనుండి వచ్చియుందురు?

(౩) శ్రీమద్భాగవతమున కలియుగములలో పుట్టిన రాజాదులను ఆంధ్రులని చెప్పబడినది. తెలుగువారిలో ములికినాటివారు ఉన్నారు. వీరు ములికి లేక మూలక అను ప్రాంతము వారు కావలెను. మూలక దేశమనునది అశ్మక అశ్మకలతోపాటు ఒకవిభాగముగ నుండెనది. [illegible] పురాణములలో శ్రీపర్వతీయ ఆంధ్రుల ప్రశంస కలదు. సాతవాహనులకు పెమ్మట కొన్నికాలము సాతకర్ణి గోత్రనామముతో వనవాసి అపరాంతకముల నేలిన చుటువంశీయులును ఆంధ్రులని పండితుల అభిప్రాయము. ఖారవేలుని హాథిగుంఫ శాసనమునందు కృష్ణానదీతీరమున మూషికులనగరముండెనని యున్నది. ఇది ఆంధ్రదేశమధ్యము. ఇట్లు ఆంధ్రప్రజలలో అనేక శాఖలవారుండిరని స్పష్టమగుచున్నది. సాతవాహనులదికూడ అట్టి ఒకశాఖ కావచ్చునుకదా?

(౪) పురాణములలో చాలభాగము క్రీ. శ. 2, 3 శతాబ్దములలో వ్రాయబడినవి. అంతకుపూర్వము ప్రాకృతమునందున్న మూలములను, రాజశాసనములలోని వంశవృత్తములను ఆధారముచేసికొనియే ఈపురాణములు వ్రాయబడినవి కాని అవి ఎవరి స్వకపోలకల్పితములును కావు.(42) సాతవాహనరాజగు యజ్ఞశ్రీకాలమునకే కొన్నిపురాణములు గ్రంథస్థములైనవి. అట్టియెడ ఒకరాజవంశమింకను పరిపాలించుచుండగనే వానినిగూర్చి అసత్యములు వ్రాయబడునా?

(౫) ఆంధ్రరాజులును, సాతవాహనరాజులు నొక్కటేనని సమన్వయించకపోయిన యెడల పెక్కు ఇబ్బందులు కలుగును. శాసనములలోని సాతవాహనుల పేర్లును పురాణములలోని ఆంధ్రరాజుల పేర్లును కొంచెము భేదాలతో ఒకదానికొకటి సరిపోవుచున్నవి. అప్పుడు ఒకే పేర్లుగల రెండువేర్వేరు రాజవంశములు పరిపాలించెనని చెప్పవలసివచ్చును.

ఈకారణములనుబట్టి సాతవాహనులు ఆంధ్రులేఅనియు, వారే పురాణములలో ఆంధ్రరాజులుగ వర్ణింపబడిరనియు చెప్పనగును.

## ౫. సాతవాహనుల ఆదిమనివాసము

సాతవాహనుల ఆదిమనివాసస్థానమేది? వీరెచ్చటివారు? అను విషయమునుగురించి కొంత వివాదమున్నది. వీరు బళ్ళారిమండల ప్రాంతమువారని ఒకవాదమును, మహారాష్ట్రీయులని ఒకవాదమును, విదర్భనివాసులని ఒక వాదమును కలవు. వీని నిచ్చట విమర్శింప వలసియున్నది.

సాతవాహనులు బళ్ళారిప్రాంతమున నివసించుచు, అచ్చటనుండి పశ్చిమోత్తరముగ పోయి మహారాష్ట్రమును జయించి, ఆమీద మహారాష్ట్రమునుండి బయలుదేరి ఆంధ్రదేశమును జయించిరని ఈ వాదముయొక్క సారాంశము. ఇది సుక్థంకరుపండితుని వాదము.(43)



42. Pargiter—Dyn. Kali Age. Intro.
43. A B O R I. Vol. i. pp. 21—44

నాసికు పులోమావి మ్యాకదోనిశాసనము సాతివాహనీహారమును పేర్కొనుచున్నదనియు, ప్రాచీనపల్లవప్రాకృతశాసనమగు హిరహడగల్లితామ్రశాసనము సాతాహనిరాష్ట్రమును పేర్కొనుచున్నదనియు, ఈ రెండు పేర్లును సాతివాహనులనుండియే వచ్చినవనియు, వారనేకప్రాంతములను జయించి పాలించినను వారి పేర్లు మరియే యితరస్థలములకును రాలేదనియు, అందువలన ఈ సాతాహనిరాష్ట్ర సాతాహనిహారములే సాతవాహనుల ఆదిమ నివాసస్థానములు కావలెననియు, ఇవి రెండును బళ్ళారిమండలముననే కలవనియు, ఇవి ఆంధ్రదేశమునకు వెలుపల నున్నవనియు ఈవాద వివరములు. సాతాహనిరాష్ట్రమును పేర్కొను పల్లవశాసనము క్రీ. శ. నవశతాబ్దిమధ్యభాగమునాటిది. అప్పటికి సాతివాహనులు అంతరించి పోయిరి. సాతాహనీహారమును పేర్కొను మ్యాకదోనిశాసనములోని పులోమావి సాతివాహనులలో కడపటివాడు. సాతివాహనుల విజృంభణము ఇప్పటికి రమారమి నాలుగుశతాబ్దుల పూర్వపు సంగతి. పైరెండుశాసనములును సాతివాహనులు తమ రాజ్యావసాన కాలమున బళ్ళారిమండలమును ఏలిరని నిరూపించునేగాని అది వారి ఆదిమనివాసమనియు, 4,వ శతాబ్దములకు పూర్వము వారు అచ్చటనే ఉండిరనియు నిరూపింపజాలవు. ఇదియే వారి ఆదిమనివాసమగుచో పులోమావికి పూర్వముండిన 29మందిరాజుల శాసనములును, నాణెములు నీప్రాంతమున నేల దొరకలేదు? సాతివాహనుల పేరు మరియే యితరస్థలములకును రాలేదనుట సత్యదూరమగు మాట. ఆంధ్రమహారాష్ట్రవిషయములలో అనేకపర్వతములకును, గ్రామములకును సాతవాహనులను స్ఫురింపజేయు పేర్లు కలవు(44) కుమారిహారిగోవర్ధనాహారి మామాలాహారములను పేర్లు సుప్రసిద్ధములు. అవి కుమారు, గోవర్ధనము, మామాలము అను నగరములను బట్టి యేర్పడినవి. అట్లే వేంగినుండి వేంగిరాష్ట్రమేర్పడినది. అదేవిధముగ సాతాహనాహార, సాతాహనరాష్ట్రములును సాతాహని లేక సాతివాహన అను నొకనగరమునుండి యేర్పడియుండవచ్చును. ఈ రెండువిభాగములను పేర్కొను శాసనములు దొరికిన బళ్ళారిజిల్లాలోనే ఒక సాతనూరు కలదు. దీనికి సాతవాహనూరు అనుపేరు ఉండియుండవచ్చును. అప్పుడు దీనినుండియే సాతివాహనాహారమును, సాతివాహనరాష్ట్రము నేర్పడి యుండవచ్చును. ఈ సాతివాహననగరమును సాతవాహనకోట, సాతిగాం మున్నగువానివలె ఒక నగరముగను. దీనిలో ప్రత్యేకత ఏమియు కనిపెంపను. ఈ బళ్ళారిప్రాంతము ఆంధ్రదేశము వెలుపల నున్నదనుటయు సమంజసము కాదు. ప్రాచీనతమిళవాఙ్మయమున తిరుపతికి ఉత్తరముగనున్న భాగము వడుగు లేక వడుగావళి అని పేర్కొనబడినది. బాణరాజుల శాసనములనుండి నేటి మైసూరుకు తూర్పున ఆంధ్రపథ ముండెనని తెలియనగుచున్నది. బళ్ళారిజిల్లాలో ఆంధ్రీ అను నది కలదు. పల్లవశివస్కందవర్మ మైదవోలు శాసనము(45) అంధాపథమును పేర్కొనుచున్నది. అందు గుంటూరుజిల్లాలోని ధాన్యకటకప్రాంతము చేరియుండెను. బళ్ళారిజిల్లా

44. మా. ౭వ [illegible]

45. Ep. I. VI. pp. 84—89.

లోని ఆదోని, ఆలూరు, రాయదుర్గ తాలూకాలు ఆంధ్రప్రాంతము. మైసూరు రాజ్యములోని ప్రాగుత్తరభాగ మాంధ్రభాగము. ఈ కారణములనుబట్టి మైసూరురాజ్యములోని తూర్పుభాగము మొదలు బంగాళాఖాతము వరకునుగల ప్రాంతమంతయు ఆంధ్రభూమని ఊహింపవచ్చును. అప్పుడు సాతవాహనిహారం, సాతవాహనరాష్ట్రము లింపలిభాగములే, అనగా ఆంధ్రదేశమునందలి భాగములే అగును. ఈ కారణములనుబట్టి బళ్ళారిప్రాంతము సాతవాహనుల ఆదిమనివాసము కాదని చెప్పవచ్చును.

సాతవాహనులు మహారాష్ట్రులనియు, మహారాష్ట్రమే వారి ఆదిమనివాసస్థానమనియు మరికొందరి వాదము. పి. టి. శ్రీనివాసఅయ్యంగారు చేసిన ప్రారంభమును(46) జోగేల్కరు అనుసరించుటచే దీనికి బలము కలిగించెను.(47) సాతవాహనుల శాసనములు ప్రాకృతమునందున్నవనియు, హాలుని సప్తశతి మహారాష్ట్రప్రాకృతమునందున్నదనియు, అందువలన సాతవాహనులు మహారాష్ట్రులనియు అయ్యంగారివాదము. సాతవాహన శాసనములభాష మహారాష్ట్రి, నాసిలోని లిపి ఉత్తరదేశపు లిపి, వారి నామములు మాల్వాపరములవి, వారికి జైనులతో సంబంధముండెను, సినుకుడు ఆంధ్రజాతీయుడని ఉన్నది కాని ఆంధ్రదేశీయుడని లేదు అని చెప్పుచు జోగేల్కర్ పండితుడు ఒక వింతసిద్ధాంతము నుపపాదించినాడు. సుక్థాంకరు, శ్రీనివాసయ్యంగారు ప్రభృతులు సాతవాహనులు ఆంధ్రులు కారని ప్రతిపాదించిరి కాని ఈపండితుడు వారు ఆంధ్రులని అంగీకరించినాడు. కాని ఇతని ఆంధ్రశబ్దనిర్వచనము వేరు. పాణిని అవంతికోసలకరూశకళింగములనే పేర్కొనినాడట. అందువలన అతనికాలమున ఆంధ్రము రాజకీయవ్యక్తిత్వము లేక కళింగాంతర్గతమై యుండెనట. ఐతరేయబ్రాహ్మణమునందలి పుండ్రశబరపుళిందులు దక్షిణాపథపశ్చిమభాగవాసులట. అశోకుని శాసనములలోని రిస్తికభోజకపిటినికులు మహారాష్ట్రములోని వారట. అందువలన వారితో కలిసి పేర్కొనబడిన ఆంధ్రులును మహారాష్ట్రములోనివారే నట. ఈ ఆంధ్రులు ఆంధ్రదేశములోనివారు కారట. పూనాజిల్లాలో మావల్ తాలూకాలో ఆంధ్రా అను నది కలదట. అది సహ్యాద్రులలో పుట్టి, కార్లాకు 8 మైళ్ళలో ఉన్న రాజపురవద్ద ఇంద్రాయణినదిలో కలియునట. ఈ ఆంధ్రానదీతీరవాసులకు ఆ నదినిబట్టి ఆంధ్రులని పేరువచ్చెనట. సాతవాహనులు ఈ ఆంధ్రులలోని వారట. అందువలన మహారాష్ట్రులట. ఈ ఆంధ్రులు బ్రహ్మాండమగు విప్లవమును బయలుదేరదీసి విదేశీయులగు మహారాటులను వారిద్రోలి, మహారాష్ట్ర, మహాభోజ, పిటినిక, పుళింద, పుండ్ర. శబర, మూతిబ, అపరాంతులను ఏకీకరించి ఒక నూతనరాష్ట్రము నేర్పరిచిరట. అందువలననే మహారాష్ట్రమునకు నవరాష్ట్రమని పేరు వచ్చినదట. వాసిష్ఠీపుత్రపులోమావికి ఒక నాసికశాసనమునగల 'నవనరస్వామీ' బిరుదమునకును ఇదే అర్థమట. ఈవాదము కేవలమును నవలవలె చిత్రకల్పనము. ఆంధ్రులు పుళిందశబరమూతిబులతో కలిపి చెప్పబడినమాట నిజమేకాని వారుండిన

46. I. A. 1913 pp. 276—281.
47. A B O R I. Vol. XXIII. pp. 196—205

చోటనే వీరను ఉంచితీరవలెననుటకు ఆధారములు మును లేదు. ఐతరేయబ్రాహ్మణమునను, అశోకుని శాసనములయందును చేర్చిన బడిన జాతులు వింధ్యపర్వతపు దక్షిణభాగమునను నేటి మహారాష్ట్రమునను ఉన్నట్లు స్పష్టము. అప్పుడు ఆంధ్రులు వీనికి వెలుపలనే ఉండవలెనుకదా. పురాణములలోను, భారతభాగవతములలోను ఆంధ్రులునుకళింగులును ప్రత్యేకజనపదములుగ చెప్పబడినారు. పూర్వము ఆంధ్రము ప్రత్యేకరాష్ట్రముగ లేక కళింగాంతర్గతముగ నుండె ననుట నిశ్చయము. పురాణములు ఆంధ్రజాతిని వేరుగ చెప్పుచున్నవి. భారతమున రెండు మూడుచోట్ల వారిరాజు పేర్కొనబడినాడు. అచ్చటనే కళింగరాజు ప్రశంసయు కలదు. బౌద్ధవాఙ్మయమును ఆంధ్రకళింగులను ప్రత్యేకముగ పేర్కొనుచున్నది. ఆంధ్రసాతవాహనులు క్షహరాటులను పారద్రోలినమాట నిజమే. కాని ఈమహాకార్యమును వారివంశమునందు 23వరాజగు గౌతమీపుత్రసాతకర్ణి నిర్వహించెను. ఆంతకుపూర్వము ఆంధ్రదేశమును 17 సంవత్సరములు రాజ్యము చేసి ఆ మహారాజు తన 18వరాజ్యసంవత్సరమున మహారాష్ట్రముపై దండెత్తి క్షహరాటవంశమును నిరవశేష మొనర్చెను. అంతియకాని మహారాష్ట్రముగ, మహారాష్ట్ర నివాసిగ అతడు మహారాష్ట్రస్వాతంత్ర్యస్థాపనకై ఈ దండయాత్రను సాగించలేదు. సాతవాహనయుగమున మహారాష్ట్రమను విభాగమే లేదు. అది క్రీ. శ. 6వశతాబ్దప్రాంతమునుండి కాంచ నగుచున్నది. అట్లే మహారాష్ట్రి అను భాషయు సాతవాహనయుగమున అసలుతో లేనేలేదు. ఆరోజులలో ప్రాకృతము దేశమునందంతటను బహుళప్రచారమునందుండెను. అది ఒక్కొక్క ప్రాంతమునందు కొన్నికొన్నిమార్పులనందుచు, కొన్ని ప్రత్యేకలక్షణములను కలిగి యుండెను. క్రీ. శ. 6, 7 శతాబ్దములలో వరరుచిమున్నగు పండితులు ఈమాండలికరూపములను పరిశోధించి మాండలికముగ దానిని విభజించి మాగధీశౌరసేని మహారాష్ట్రి పైశాచీ మున్నగుపేర్లు పెట్టి ప్రాకృతవ్యాకరణములను వ్రాసిరి. ఇట్లు సాతవాహనయుగము ముగిసిన తర్వాత మూడునాలుగు శతాబ్దములకు ఏర్పడిన దేశభాషానామములను సాతవాహనయుగమునకే వర్తింపజేయుట అసమంజసము. ఇక ఆంధ్రనది విషయము. ఈపేరుగల నది మహారాష్ట్రమునందుండుట నిజమే. కాని ఇదేపేరుగల నది (అంధ్ర) బళ్ళారివద్దను కలదు. దానినుండియే ఆంధ్రులకు ఆపేరు వచ్చెనని ఏల చెప్పకూడదు ? సాతవాహనుల ఆదిమనివాసము మహారాష్ట్రమనుటకు మరి కొందరు పండితు లింకను కొన్ని కారణములను చూపెయున్నారు. అశోకుని శాసనములలో సత్యపుత్రులనువారు పేర్కొనబడినారట. సాతవాహనవంశములలో ప్రాచీనములగువానియందు "సాతి" అని ఉన్నదట. అందువలన వీనికి 'సాతి'లనుపేరు వర్తించునట. అశోకునినాటి సత్యపుత్రులు నేటి కొంకణమునందుండిరట. ఆప్రాంతమున నేటికిని "సాతప్పనే" (సాతపుత్రులను) మహారాష్ట్ర కాయస్థకుటుంబము లున్నవట. అందువలన ఈసాతప్పనేలు నాటి సాతి లేక సాతవాహనుల సంతతివారట. అందువలన సాతవాహనులు మహారాష్ట్రులును, కొంకణదేశవాసులు నట. అశోకుని మరణానంతరము సిముకుని

నాయకత్వమున వీరు స్వతంత్రులైరట.(48) ఇది ఒకవాదము. ఈవాదము ప్రాకృత ఉపాశీర స్యామని మొదటనే తోచుచున్నది. పాండ్య చేర-చోళ కేరళులతో కలిపి చెప్పబడిన సత్య పుత్రులు వారితోనే ద్రవిడదేశమునందుండ వలెను కాని మరియొకచోట నుండజాలరు. ఈసత్యపుత్రులు నేటి కోయంబత్తూరు జిల్లా లోని సత్యమంగళంతాలూకాలోని వారను స్మిత్ పండితుని సిద్ధాంతము సమంజసముగ నున్నది. సాతవాహనులు ఆదిలో మహా రాష్ట్రమునందు ఉండి, కొంతకాలమైన పిమ్మట వీనిని కోల్పోయి, ఆపూర్వ ఆంధ్రదేశమును జయించి, తమ పరిపాలనాంతమున కృష్ణా ముఖద్వారప్రాంతమునే ఏలుచు, అచట అంతరించిరియు, ఈకారణమువలన భ్రాం తులైన పౌరాణికులు వీరిని ఆంధ్రరాజులుగ వర్ణించిరనియు రాయచౌధురి అనుసంధించుచు న్నాడు.(49) సాతవాహనులలో గౌతమీ పుత్రుని పుత్రుడగు పులోమావియు ఆంధ్రమహారాష్ట్రవిదర్భల నేలిరి. తర్వాత వారిలో నొక సాతకర్ణియు పిమ్మట యజ్ఞ శ్రీయు వీని నేలిరి. ఈవంశమున కడపటి రాజగు మూడవపులోమావి శాసనమొకటి బళ్ళారివద్దను, నాణెములు కొన్ని విదర్భ లోను దొరికినవి. ఈయంశములు సాతవాహ నులు ఒక్క కృష్ణాముఖద్వారప్రాంతమునే ఎప్పుడును పాలింపలేదని నిరూపించుచున్నవి. పురాణములు విశ్వసనీయములగు ఆధార ముల ననుసరించి వ్రాయబడినవే కాని కేవల కల్పనాకథలు కావు. అందు కొన్ని సాత వాహనరాజగు యజ్ఞశ్రీ రాజ్యకాలమున గ్రంథస్థములు చేయబడెను. ఒకవంశము రాజ్యముచేయుచుండగనే దాని పూర్వోత్తరం ములను గురించి చెప్పగల్గుటయు వ్రాయబడునని అనుకొనుట సమంజసము కాదు. ఎట్లు చూచి నను సాతవాహనులు మహారాష్ట్రమును అనేక సారుగ మొత్తముమీద చిరకాలము పరిపా లించిరనియే చెప్పవలెను కాని వారు అచ్చ టనే ఆదిలో నివసించిరనుటకు తగిన ఆధార ములు లేవు.

ఇక మిగిలినది సాతవాహనుల ఆదిమనివా సము విదర్భ అను వాదము. ఇది ఇటీవల మిరాశీ అనుపండితునిచేత ప్రతిపాదింపబడి నది.(50) వీరిసారాంశము. సాతవాహనులకు పులో మావికాలమువరకును ఆంధ్రదేశముతో సం బంధము లేదు. హాథిగుంఫ శాసనమునందు సాతకర్ణిని లక్ష్యముచేయక ఖారవేలుడు పడమ టికి పంపిన సేనలు కృష్ణాబెన్నానదివరకును పోయె నని చెప్పబడినది. ఈకృష్ణాబెన్నానది కళింగము నకు పడమటగ నుండవలెను. వేన్ గంగానదికి ఉపనదియై, నేటి నాగపూరు కు తూర్పుగ 10 మైళ్ళలో గల కన్హాన్ అనునది ఒకటి కలదు. మహాభారతవనపర్వమున తీర్థములను పేర్కొను సందర్భమున వేణానది (నేటి వేన్ గంగ) చెప్ప బడినది. దేవప్రహదమును అనెడి కృష్ణవేణానది జన్మస్థానమువద్ద కలదు. ఈకృష్ణవేణానది వేణానదికి ఉపనది కావచ్చును. దీనినిబట్టి ఖారవేలునికాలమున సాతవాహనులు విద ర్భను ఏలుచుండిరని చెప్పవచ్చును. గౌతమీ పుత్రుడు ఒక నాసికశాసనమున బెనాకటక స్వామి అని వర్ణింపబడెను. ఇటీవల దొరి కిన ఒక వాకటకతామ్రశాసనమునందు బెన్నా

48. J. Bo. B R A S. Vol. 22. pp. 94—99.
49. Pol. Hist. Anc. Ind. p 220.
50. Jour Num. Soc. Ind. II pp. 92—94.

కటముయొక్క పశ్చిమభాగమున కోశాంబ ఖండమను గ్రామ ముండెనని చెప్పబడినది. ఈగ్రామము నేటి భండారాజిల్లాలో ఉన్నది. బెన్నాకటమనునది వేన్గంగానది రెండు వైపులనుగల భాగము అగును. ఈబెనాకటమును సహదేవుడు జయించినట్లు మహాభారతమున కలదు. అందువలన ఈబెనాకటమును విభాగము సాతవాహనుల ఆదిమనివాసమని చెప్పవలెను. గౌతమీపుత్రుడు క్షహరాటులను జయించినప్పుడు తనరాజధానిని ఇచ్చటనుండి ప్రతిష్ఠానపురమునకు మార్చెను.— ఈవాదమునందు ఎన్నియో లోపము లున్నవి. ఖారవేలుని హాథిగుంఫ శాసనమున కనేకులు అనేకవిధముల అర్థములు కల్పించినారు. అందలి ఒక పంక్తిలో సాతకర్ణినిగూర్చి ఆలోచింపకనే పశ్చిమదిక్కునకు పంపబడిన సేన కణ్హబెణ్ణవరకును పోయి మూసికనగరమును భయపెట్టినది అని ఉన్నది. దీనినిబట్టి కణ్హబెణ్ణానది మూసిక లేక మూసికనగరమునకు సమీపమునందుండవలెనని స్పష్టమగుచున్నది. మిరాసీపండితులు చెప్పినను నాగపురప్రాంతమునందలి కన్హాననదివద్ద మూసికనగరము లేదు. అందువలన ఈపండితుని సమన్వయము నిలువజాలదు. ఒకవేళ వారిమునకై కన్హాననదియే కణ్హబేణ్ణా అని అంగీకరించినను ఈసమన్వయమువలన సాతవాహనులలో మూడవరాజగు సాతకర్ణి ఈనదీప్రాంతమునకు ఏలిక అనిమాత్రము తెలియనగునుకాని ఆదిసాతవాహనుల ఆదిమనివాసమని నిరూపింపజాలదు. ఇక గౌతమీపుత్రుని విషయము. 'బెనాకటస్వామి' అను అతని బిరుదములోని బెనాకటమునకు ఒకదేశమని అర్థము చెప్పుట ఉచితముకాదు. ఆరాజుకాలమున అట్టిప్రాంతమే ఉండె, అది అతని యేలుబడిలో నుండినయెడల అది అసిక అశ్మకాదిప్రాంతములతోబాటు అతనితల్లి బాలశ్రీ వేయించిన నాసికశాసనమునందు ఏల పేర్కొనబడలేదు? మరియును కట, కటకఅనునవి పట్టణవృత్తిమైన నగరమునకు గాని ఒక దేశవిభాగమునకు గాని కాజాలవు. అదియును గాక గౌతమీపుత్రుడు ఈప్రాంతమునకు స్వామియే ఐనను అతనికి 21 తరములకుపూర్వము సాతవాహనుల కిది ఆదిమనివాసస్థాన మెట్లగును? సిముకునినుండి గౌతమీపుత్రునివరకునుగల సాతవాహనుల కీబెనాకటముతో సంబంధముండినట్లు కేమాధారము కలదు? పైగా గౌతమీపుత్రుని విదర్భనుండి బయల్వెడలి క్షహరాటులను జయించినట్లు స్వైరమగు ఊహ యగును. అతని 18వ రాజ్యసంవత్సరమువరకును అతనికి మహారాష్ట్రీయులతో సంబంధము లేకుండెను. అంతవరకు ఆప్రాంతము క్షహరాటులవశమునందుండెను. బాలశ్రీనాసికశాసనమునందు గౌతమీపుత్రుడు జయించెనని చెప్పబడిన దేశముల పట్టికలో విదర్భకూడ కలదు. దీనినిబట్టి ఆతడు క్షహరాటులను ఓడించకపూర్వమీదేశమునం దుండెననుట అసమంజసమగును గదా!

ఇట్లు సాతవాహనుల ఆదిమ నివాసము బళ్ళారిమండలమనియు, మహారాష్ట్రమనియు, విదర్భఅనియు ఉపపాదింపబడిన వాదములు లోపభూయిష్ఠములుగను, అసమంజసములుగను కనిపించుచున్నవి. ఈసమస్యాపరిష్కారమునకు అశోకుని శాసనములు ముఖ్యమైనవి. వాటికాలమునకును సాతవాహనరాజ్య

స్థాపనకాలమునకును ఎక్కువ అంతరము లేకుండుటవలన అవి మరియును విశ్వసనీయము లగుచున్నవి. నాసిలో రఠిక పెటినిక భోజకమహారథులు పేర్కొనబడినారు. వీరిలో రఠికులు మహారాష్ట్రమునను, భోజకులు విదర్భలోను ఉండిరని బాహుపండితుల నిర్ణయము. ఈ రెంటికిని కళింగమునకును వెలుపలనున్న పశ్చిమోత్తరభాగమునందు ఆంధ్రులుండవలెను. ఇది ఆంధ్రదేశము. ఈ ఆంధ్రులలోని శాఖయగు సాతవాహనులు ఆంధ్రులును, ఆంధ్రదేశవాసులునై యుండవలెను.

## ౬. పూర్వసాతవాహను లాంధ్రదేశము నేలిరా?

సాతవాహనరాజులు వారి పరిపాలనా ప్రారంభమైనప్పటినుండియు ఆంధ్రదేశము నేలిరా లేక తరుమబడి కొంతకాలము సాగినపిమ్మటనే వారు ఈదేశముమీద అధికారము సాగించిరా అనునది ఒక ముఖ్యమైన ప్రశ్న. రాప్సన్, స్మిత్, భండార్కరు మున్నగువారు ఈరాజు లాంధ్రదేశపాలకులుగనుండి ఆపిమ్మట మహారాష్ట్రమును జయించి పాలించిరని వ్రాసినారు.[51] సుక్థంకరు, రాయచౌదరి,[52] ప్రభృతులు ఈ యభిప్రాయమును నిరసించి చిరకాల మితరప్రాంతముల నేలినపిమ్మటనే సాతవాహనులు ఆంధ్రదేశమున కేలికలైరని వాదించినారు. ఇటీవల సాతవాహనవంశజులలో ఇరువదిరెండవరాజగు గౌతమీపుత్రశాతకర్ణి వరకునుగల పూర్వసాతవాహనుల కాంధ్రదేశముతో సంబంధము లేకుండెనను వాదము ప్రబలమైనది. ఈవాదము నిచ్చట విమర్శింపవలసియున్నది.

పూర్వసాతవాహనులకు ఆంధ్రదేశముతో సంబంధము లేదనుటకు ఈక్రిందికారణములు చెప్పబడుచున్నవి:- [53]

(1) సిముక, కృష్ణ, శాతకర్ణి అనువారు సాతవాహనులలో మొదటి ముగురు రాజులు. వారిని పేర్కొను శాసనములు మహారాష్ట్రమునందలి నాసిక నానేఘాటులలో ఉన్నవి కాని ఆంధ్రదేశమున లేవు. ఆంధ్రదేశమున దొరకిన శాసనములలో వారి ప్రశంస లేదు.

(2) మూడవరాజగు శాతకర్ణి భార్య నాగానిక ప్రశస్తి శాసనము నానేఘాట్‌లో ఉన్నది. ఇది రాజధానికి దగ్గరనుండవలెనుకాని దానికి దూరముగ నుండియుండదు. అందువలన సాతవాహనరాజధాని మహారాష్ట్రమున ఉండవలెను. ఇది నానేఘాటుకు 120 మైళ్ళదూరమునున్న ప్రతిష్ఠానము కావచ్చును.

(3) అశోకుని శాసనములు వేయబడిన బౌద్ధికాలమునకే చెక్కబడిన భట్టిప్రోలుశాసన

51. Rapson — Cat. Andhra Coins — Intro; Smith — Early Hist. Ind; Bhandarkar — EHD.
52. Sukthankar — ABORS Vol. I pp.21—44; Raychaudhari Pol. Hist. Anc. Ind. p. 220.
53. K. Gopalachari — Early Hist. Andhra. Ch. II

ములు రాజాకుభీరకుని, అతని తండ్రిని పేర్కొనుచున్నవి. ఈయాధారమునుబట్టి ఆంధ్రదేశము క్రీ.పూ. 3, 2శతాబ్దులలో సాతవాహనవంశముయొక్క పరిపాలనలో గాక మరియొక, అనగా కుబేరకునివంశముయొక్క అధీనమునం దుండెనని స్పష్టమగుచున్నది.

(4) గౌతమీబాలశ్రీ అను రాణి ఒక నాసికశాసనములో తనకుమారుడు సాతకర్ణి పరిపాలించిన దేశములను పేర్కొనినది. అందు ఆంధ్రదేశముయొక్క ప్రశంస లేదు.

(5) సాతవాహనవంశీయుల 24శాసనములలోను 6నాసికలోను, 5కన్హేరిలోను, 3కార్లాలోను, 1భిల్సాలోను, 2నానేఘాటులోను, 1మ్యాకదోనిలోను, 1చిన్నగంజాంలోను, 2 అమరావతిలోను, 1కొడవలిలోను దొరికినవి. వీనిలో ఎక్కువభాగమును, ప్రాచీనతరములైనవియును మహారాష్ట్రమునందే దొరికినవి.

(6) ఆంధ్రదేశమున దొరికిన శాసనములు వాసిష్ఠీపుత్రపులోమావివి, అతని తర్వాతివారివి కాని అంతకు పూర్వపువారివి కావు.

(7) ఖారవేలుడను కళింగరాజు పిథుండమును నగరమును నాశనమొనర్చి ప్రమిరులను చెదరగొట్టితినని తన హాథీగుంఫ శాసనమున చెప్పుకొనినాడు. ఈపిథుండనగరము కృష్ణాగోదావరీమధ్యమగు ఆంధ్రదేశమున నుండిన నగరము. ఈప్రాంతము సాతవాహనుల పాలనమునందుండినచో వారు ఖారవేలుని తప్పక ప్రతిఘటించి యుందురు. ఖారవేలుడును వారిప్రశంస యీసందర్భమున చేసియే యుండును. ఆప్రశంస అతనిశాసనమున కన్పింపదు. అందువలన ఖారవేలుని కాలమున అనగా క్రీ.పూ. 3, 2శతాబ్దులలో సాతవాహనులు ఆంధ్రదేశమునకు పాలకులు కారుఅని స్పష్టమగు చున్నది.

(8) మహారాష్ట్రమునందలి గుహలలోగల శాసనములలో మొదటిరాజులనువారి ప్రశంస గలదు. వీనిలో నొకడగు త్రణకయిరో అను నతని కుమార్తె నాయనిక లేక నాగనిక మూడవసాతవాహనరాజగు మొదటిసాతకర్ణి భార్య. ఈసంబంధము సాతవాహనులు మహారాష్ట్రమునందే ఆదిలో పరిపాలించిరని నిరూపించుచున్నది.

(9) ఈసాతవాహనరాజుల నాణెములలో నెల్ల ప్రాచీనతరములైనవి 'సిరిసాతస' అను పేరుగలవి రెండు. అవి మొదటిసాతకర్ణివి అని నిర్ణయింపబడినవి. ఆంధ్రదేశమున తూర్పుగోదావరీజిల్లాలో "సిరి...విర"అను పేరుగల రెండునాణెములును, "ఘ సదస"అను పేరుగల ఒకనాణెమును దొరికినవి. ఇందు మొదటి రెండును మొదటిరాజులలో నొకరివనియు, మూడవది పౌరాణికపట్టికలలోని మేఘస్వాతిదనియు రాప్సనుపండితుని అభిప్రాయము. కాని మొదటిరెండునాణెములలోని పేరును 'రజోబిర'అని చదువవచ్చును. అప్పుడది కుభీరకుని పేరువలె నుండును. ఏమైనను ఇవి రెండును సాతవాహనుల నాణెములగునో కావో అని సందేహము కలుగుచున్నది. మూడవనాణెము మీది పేరు పూర్తిగ లేదు. దానిలోని "ఘ" అను అక్షరమును "స"అనియు చదువవచ్చును. అప్పుడు ఈశాసనము "సనసదస"అగును. ఇది ఏసాతకర్ణిదైనను కావచ్చును. దీనిని క్రీ. పూ. 1వశతాబ్దినాటిదానిగ గాని క్రీ.శ. 1వ శతాబ్దినాటిదానిగగాని పరిగణింపవచ్చును. ఈ ఒక్క నాణెము ప్రమాదవశమున పడమటనున్న

సాతవాహనరాజ్యమునుండి ఆంధ్రదేశము లోనికి వచ్చియుండవచ్చును.

(10) ఆంధ్రదేశమున క్రీ.పూ. 3, 2 శతాబ్దులనాటి భట్టిప్రోలు, అమరావతీస్తూపములు బయలుపడినవి. వానిని ఖననము చేసినప్పుడు పూర్వసాతవాహనుల నాణెము ఒక్కటి అయినను దొరకలేదు. క్రీ.శ. 2వ శతాబ్దికి చెందిన అనేకాంధ్రస్తూపములలో కడపటి సాతవాహనులగు పులోమావి, శివశ్రీ, చంద్రశ్రీ, యజ్ఞశ్రీ, రుద్రశ్రీల నాణెములు ఎన్నియో దొరికినవి.

(11) సాతవాహనరాజులలో తల్లి పేరు తమపేరులకుముందు చేర్చుకొను ఆచారముండెడిది. (ఉదా. గౌతమీపుత్ర, వాసిష్ఠీపుత్ర, మాఠరీపుత్ర) ఈ యాచారమును సామాన్యులును పాటించుచుండిరని మహారాష్ట్రమున దొరికిన శాసనములు తెలుపుచున్నవి. ఆంధ్రదేశమున సాతవాహనులకు సామంతులుగ నుండిన ఇక్ష్వాకులు తప్ప బృహత్పలాయన, శాలంకాయన, విష్ణుకుండివంశీయులు ఈ యాచారమును అవలంబింపలేదు. ఇదియును సాతవాహనులు మహారాష్ట్రముననే చిరకాలము పాలించిరని నిరూపించుచున్నది.

(12) కాలకాచార్యకథానకమను ఒక జైన గ్రంథమున కాలకాచార్యుడు శాలివాహనుని రాజధానియగు ప్రతిష్ఠానపురమునకు పోయెనని చెప్పబడియున్నది. ఈ ఆచార్యుడు క్రీ.పూ. 171లో మరణించెను. దీనినిబట్టి ఇతనికి సమకాలికుడుగ ఒక సాతవాహనరాజు క్రీ.పూ. 2వ శతాబ్ది పూర్వార్ధమున ప్రతిష్ఠానమున రాజ్యము చేయుచుండెనని ఏర్పడును. నియుక్తి అను మరియొక జైనగ్రంథమున పైఠానసాలివాహనుడును నహపానుడును సమకాలికులని చెప్పబడినది. ఇది క్రీ.శ. 1వ శతాబ్దిలో ప్రతిష్ఠానము సాతవాహనరాజధానియని నిరూపించుచున్నది.

(13) నాసికశాసనములలో నొకదానిలోని భాగమును భండార్కరుపండితుడు "ధనకటసామినెహి" అని చదివి గౌతమీపుత్రుడు ధాన్యకటమునకు స్వామి అని యర్థము చెప్పి, ఈ ధనకటము గుంటూరుజిల్లాలోని అమరావతి-ధాన్యకటమని సమన్వయము చేసెను. ఇతడు మరియొక నాసికశాసనములోని "బెనాకటసామి" అను భాగమునుకూడ 'ధనకటసామి' అని చదివెను. సెనార్ట్, బూలర్ అను పాశ్చాత్యపండితులు ఈ భాగములలో మొదటిదానిని "ధనకటసమనెహి" అనియు, రెండవదానిని "బెనకటసామి" అనియు చదివిరి. ఇదియే సరియైన పాఠము.

(14) రాప్సన్, స్మిత్ పండితులు సిముకుడును, అతనితమ్ముడు కృష్ణుడును ఆంధ్రదేశమునుండి మహారాష్ట్రముపై దండెత్తిపోయి, దానిని జయించిరని అభిప్రాయపడినారు. అది నిజమేయగుచో వారి విజయప్రశంస ఏశాసనమునను, ఏవాఙ్మయాధారమునను ఏల కనిపింపదు అను సందేహము కలుగుచున్నది.

(15) సాతవాహనరాజులలో మూడవవాడగు మొదటిసాతకర్ణికి "దక్షిణాపథపతి" అను బిరుదముండెను. క్రీ.శ. 1వ శతాబ్దినాటి "పెరిప్లస్" అను గ్రంథమున[54] పైఠాన, టగర అను వర్తకస్థానములు "దచినబేడీస్" అను దక్షిణాపథమున నున్నవనియు, పడమటితీరము వెంబడి

54. ఈగ్రంథము క్రీ. శ. 80 ప్రాంతమున రచింపబడెను. ef. D. C. Sircar — Successors of the Sathavahanas p. 145.

భాగముగా దిగువగలభాగము "వనికి" లేక ప్రవిశఅనియు చెప్పబడి, ప్రాక్సిరిమున కృష్ణా ప్రాంతము మైసలియా అని ప్రత్యేకముగ పేర్కొనబడియుండుటచే ఆనాటి దక్షిణాపథ మున దక్కను అని నేడు వ్యవహరింపబడు భాగమునందలి ప్రాగ్దక్షిణభాగములు చేరి యుండలేదని స్పష్టమగుచున్నది. అందువలన పై మొదటిశాతకర్ణి పతిత్వమునందుండిన దక్షిణాపథము నేటిమహారాష్ట్రముమాత్రమే అగుచున్నది.

(16) ఖారవేలుడు పశ్చిమదేశపాలకుడగు శాతకర్ణిని లక్ష్యము చేయక అశ్వసైన్యముల నాదిక్కునకు పంపెనని తన హాథీగుంఫా శాసనమున చెప్పుకొనినాడు. దీనిబట్టి శాతకర్ణి రాజ్యము ఖారవేలుని రాజ్యమగు కళింగమునకు పడమటగ నుండెనని స్పష్టమగుచున్నది. ఆంధ్రదేశము కళింగమునకు పడమటగగాక దక్షిణముగ నున్నది. అందువలన శాతకర్ణి ఆంధ్రదేశమునకు రాజు కాడని చెప్పవలెను.

(17) జైనగాథలనుండి ప్రతిష్ఠానపురము శాతవాహనరాజధానియని తెలియుచున్నది. కథాసరిత్సాగరమున శాలివాహనుడు పైఠనులో పుట్టెనని చెప్పబడినది. ఆంధ్రదేశము నందలి ఏనగరమును శాతవాహనుల రాజధానిగ పేర్కొనబడలేదు.

పైన వివరింపబడిన అంశముల కీక్రింది విధమున సమాధానము చెప్పవచ్చును.

(1) సిముకకృష్ణశాతకర్ణుల శాసనములు వారు మహారాష్ట్రమును పాలించిరని మాత్రమే తెల్పునుగాని ఇతరప్రాంతములను ఏలలేదని నిరూపింపజాలవు.

(2) పైఠను మొదటిశాతకర్ణికి రాజధాని కావచ్చును. ఆంధ్రమునుండి మహారాష్ట్రముపై దండెత్తి ఆదేశమును జయించినప్పుడు శాతవాహనులకు తమ పరిపాలనము నచ్చుట నున్నిరి నొనర్చుకొనుట అవసరమైనది. అందువలననే వారు తాత్కాలికముగ ప్రతిష్ఠానమును కేంద్రముగ చేసికొని యుందురు. స్వదేశమగు ఆంధ్రదేశము నిర్బాధకముగ తమయేలుబడి యందుండుటవలననే వారీప్రాంతమున నివసింపగలిగిరి. ఢిల్లీసుల్తానగు మహమ్మదు తుగ్లకు క్రొత్తగ దక్షిణాపథమును, కర్ణాటకమును జయించి, ఇచ్చట తన యేలుబడిని స్థిరపరచుకొనుట అవసరమగుటవలన తనరాజధానిని ఢిల్లీనుండి దౌలతాబాదునకు మార్చుకొనెను. అంతమాత్రమున ఉత్తరహిందూదేశము తనయేలుబడిలో లేదనిచెప్పుటకు వీలు కాదుకదా!

(3) వాసిష్ఠీపుత్రపులోమావి శాసనము లాంధ్రదేశమున దొరకనవి. అతని తండ్రి గౌతమీపుత్రుడాంధ్రదేశము నేలెను. శాతవాహనవంశమునందు 22వవాడగు గౌతమీపుత్రునినుండి 6వవాడగు రెండవశాతకర్ణి వరకునుగల 16మంది రాజులలో పేర్కొనిన శాసనమైనను ఏదేశమునందు ఏప్రాంతమునందును దొరికలేదు. అట్టియెడ పులోమావిపురాణముల శాసనము లాంధ్రదేశమునం దెందుకు దొరకలేదు అను ప్రశ్న అసంగతము అగునుకదా!

(4) మొదటిశాతకర్ణి భార్య నాగానిక మహారాష్ట్రమునందలి మహారథి త్రణకయిరో కూమార్తె. సిముకుడు మహారాష్ట్రమును జయించినప్పుడు ఈమహారథులను వశపరచుకొనెను. తనరాజ్యస్థైర్యముకై వారితో వైవాహికసంబంధము నేర్పరచుకొనెను. వీరు. కూర్పుబడిన పల్లవరాజు నాగులను జయించి

నారి రాజపుత్రికను పెండ్లాడెను. చంద్రగుప్త మౌర్యుడు యవనుల వశమునందుండిన పంజాబును జయించి వారిరాజపుత్రికను పెండ్లి చేసుకొనెను. కాకతీయగణపతిదేవుడు వెల్నాడును జయించి అచట ప్రబలులుగనున్న అయ్యవంశీయుల కన్యలగు నారమపేరములను వివాహమాడెను. పైసాతవాహనమహారాష్ట్రసంబంధము నిట్టిదే. ఇట్లు సాతవాహనులు క్రొత్తగ జయించిన మహారాష్ట్రమును తమ వశమున స్థిరపరచుకొనినవిధమును తెల్పును గాని వారు అచ్చటమాత్రమే పరిపాలించిరని నిరూపింపజాలదు.

(5) రాప్సను నాణెములపట్టికలో చెప్పిన ఒక నాణెముమీదిపేరు "ఘ సతస" అని స్పష్టముగ నున్నది. 'సత'అనునది సాతకర్ణిశబ్దమునకు హ్రస్వరూపము. పౌరాణికపట్టికలలో మేఘస్వాతి అనురాజు చెప్పబడినాడు. "స్వాతి"శబ్దము 'సాతకర్ణి'కి పర్యాయపదముగ కన్పించుచున్నది. దీనినిబట్టి నాణెముమీది పేరును మేఘసాతకర్ణిది అని సమన్వయింప వచ్చును. సమంజసమగు ఈసమన్వయమును వదలి 'ఘ' ను 'స' అని చదివి, దానికిముందు 'రను' చేర్చుకొని 'రనో సతస' అని సవరించు కొని, ఈరాజు ఏసాతకర్ణి అయినను కావచ్చు ననుట సంగతముకాదు.

(6) సాతవాహనులలో కొంతకాలము తల్లులపేర్లను తమపేర్లముందు చేర్చుకొను నాచారముండెడిది. ఈయాచారము ౨౨వ రాజగు గౌతమీపుత్రసాతకర్ణి నుండియు గాంచనగుచున్నది. ఈకడపటి సాతవాహనులు ఒక్క మహారాష్ట్రమునే పరిపాలించియుండినచో వారు ఆదేశీయులనియు, అందువలననే అచట వ్యాప్తియందుండిన ఈయాచారము ననుసరించిరనియు చెప్పుట సమంజసముగ నుండును. కాని యీరాజులు ఆంధ్రమహారాష్ట్రముల రెండింటిని పాలించిరి. ప్రాక్సాతవాహనులలో మొదటి ముగ్గురును సిముక కృష్ణసాతకర్ణులు ప్రతిమలు వాడించునట్లు మహారాష్ట్రమునే పరిపాలించినచో ఆమహారాష్ట్రమున తల్లిపేర్లను వ్యక్తికనామములకు చేర్చుకొను నాచారముండెడిదికదా అయిన నీముగ్గురు సాతవాహనులును ఆట్టి పేర్లనుగ్రహింపలేదేల? వారు నిజముగ మహారాష్ట్రులై, అచటనే వారివంశము నేలుబడి ఆరంభమైయుండినచో వారు తప్పక ఆదేశాచారము ననుసరించియే యుందురు. వారు అట్లుచేయకుండుట వారు ఇతరప్రాంతమునుండి వచ్చి మహారాష్ట్రమును పాలించిరని నిస్సంశయముగ నిరూపించుచున్నది.

(7) పైఠానశాలివాహనుని కలసిన కాలకాచార్యుడు పర్యుషణకాలమునకు దినమును మార్పుచేసిన మూడవకాలకాచార్యుడని ఆకథయందే కలదు. ఇతడు క్రీ.శ. 446 ప్రాంతమువాడు. యుగప్రధానస్వరూపమను మరియొకగ్రంథమున చెప్పబడిన మొదటి కాలకాచార్యుడు క్రీ.పూ. 171 ప్రాంతమువాడు. ఇతడు శాలివాహనుని కలిసెనని చెప్పబడలేదు. అందువలన నీకాలకాచార్యశాలివాహనుల సమాగమవృత్తాంతము విశ్వసనీయము కాదు. నిరుక్తి అను నొక జైనగ్రంథమునం దొక శాలివాహనుడు చెప్పబడినాడు. ఈగ్రంథమునకు సంస్కృతరూపమగు అభిధానరాజేంద్రమునం దీశాలివాహనుడు హాలుడని చెప్పబడినది. హాలుడు క్రీ.శ. 1వ శతాబ్దివాడు. ఇతనికి పైఠానము రాజధానిగ నుండినంతమాత్రమున అది అంతకు ఒకటి

న్నరిశతాబ్దులకుపూర్వపు ఇతని పూర్వులకు రాజధానిగ నుండెనని చెప్పుట సమంజసము కాదు.

మిగిలిన అంశములు మొదటిసాతకర్ణికిని, గౌతమీపుత్రునికిని సంబంధించినవి. వాని క్రిందివిధమున సమాధానము చెప్పవచ్చును.

మొదటి సాతకర్ణి — ఆంధ్రదేశము — ఈ రాజుయొక్క 'దక్షిణాపథపతి' అను బిరుదము నందలి దక్షిణాపథము మహారాష్ట్రము మాత్రమే అగును అనుట మిక్కిలి సాహసము. పురాణములందును, ఇతిహాససంస్కృతి వాఙ్మయమునందును నర్మదానదికి దక్షిణమందున్న ప్రాక్పశ్చిమములకు రెండింటికిని దక్షిణాపథమను పేరు గలదు. దక్షిణాపథవాసులను పేర్కొనుచు అవి ఇటు ఆంధ్రులను, అటు కొంకణులను పేర్కొనుచున్నవి. అనాదిగా దేశమున రూఢిగ ఉన్న ఈయర్థమును ఒక విదేశీయుని వ్రాత నాధారముగ గొని త్రోసిపుచ్చుట ఉచితము కాదు. ఈ మొదటిసాతకర్ణి రాజు ఎన్నియో వైదికక్రతువులను, ఆయాసందర్భములలో ఇయ్యబడినభూరిదక్షిణలను నానె ఘాట్ శాసనము పేర్కొనినది. ఈ రాజు రాళ్ళసీమయగు ఒక్క మహారాష్ట్రమువంటి నిస్సారమగు ప్రదేశమునకుమాత్రమే ఏలిక యగుచో ఇతనికి ఆదానములను చేయగలుగు నంత వైభవము ఉండజాలదు. అదియునుగాక ఈరాజు రెండు అశ్వమేధములను, ఒక రాజసూయమునుగూడ చేసెను. ఇదియును ఇతని రాజ్యవిస్తృతిని తెలుపుచున్నది. ఖారవేలుడను కళింగరాజు రెండుసార్లు ఆంధ్రదేశముపై తనసేనలను పంపించెననుట వాస్తవము. అగుచో ఆకాలమున సాతకర్ణి యీ దేశమున కేలికయగుచో ఖారవేలుడు అతని ప్రశంసను ఏలచేయలేదు అను ఆక్షేపము అవిచార మూలకము. ఖారవేలుడు తన హాథీగుంఫా శాసనమున "అచింతయితా సతకంణిం" అని సాతకర్ణిని ప్రశంస చేసియే యున్నాడు. అంతే కాదు "సాతకర్ణిని లెక్కచేయక పడమటిదిశకు నా సేనలను పంపితిని" అని అతడు సగర్వముగ చెప్పుకొనినాడు. ఈసాతకర్ణి చెప్పుకో దగినంతటి ప్రబలుడు కానిచో ఖారవేలు డతనిని పేర్కొని యుండడుకదా! తాను ఇట్లు ఉత్తరదిశకును, ద్రవిడదేశముమీదికిని దండయాత్రలను బంపియు ఖారవేలుడు ఆ దేశమున గల ఏరాజ్యపు ఏలికను పేర్కొని చెప్పలేదు. ఇదియును సాతకర్ణి గౌరవమును సూచించు చున్నది. "సాతకర్ణిని లక్ష్యము చేయక పడమటి దిక్కుకు నా సేనను పంపితిని" అను ఖారవేలుని శాసనభాగమునకు "పడమటిదిక్కుకు పాలకుడగు సాతకర్ణిని లెక్కచేయక" అని కొందరు పండితులు అపార్థము కల్పించి నారు. అంతటితో ఆగక వారు హాథీగుంఫా శాసనమునందు సాతకర్ణి పశ్చిమదిశకు పాలకుడని ఉన్నదనియు, ఈపశ్చిమదిశ కళింగము నకు పశ్చిమదిశ అగుననియు, ఆంధ్రదేశము కళింగమునకు పశ్చిమముగ లేక దక్షిణముగ నున్నదనియు, అందువలన సాతకర్ణికి ఆంధ్ర దేశముతో సంబంధము లేదనియు వ్యాఖ్యానము చేసినారు. ఇది కళింగాంధ్రముల ఉనికి యొక్క స్వభావము తెలియక చేసెడి అపవ్యాఖ్యానము. దక్కనుయొక్క పటముపైనైన ను ఈవ్యాఖ్యలోని దోషమును నిరూపింపగలము. గోదావరీమహానదులమధ్యగల కళింగ దేశమునకు దక్షిణముగ నున్నది బంగాళా ఖాతమును సముద్రముకాని ఆంధ్రదేశము కాదు. ప్రాక్తీరరేఖ దక్షిణమున తంజావూరు

జిల్లానుండి ఉత్తరముగ గుంటూరుజిల్లాలోని తెనుపర్తివరకును 80°వ లాంగిట్యూడ్ రేఖను బట్టి ఉత్తరముగాపోయి, తెనుపర్తి నుండి తూర్పుగా వంగి, క్రమముగా ప్రాగ్దిశకు పోవును. కళింగదేశము కొంచెము హెచ్చుతగ్గుగ 82°–86° లాంగిట్యూడు రేఖలమధ్య నున్నది. దీనికి పశ్చిమముగా గోదావరీకృష్ణాగుంటూరు జిల్లాలును, తెలంగాణమునందలి కరీంనగరు, వరంగల్లు నల్లగొండ జిల్లాలును ఉన్నవి. ఇవంతయు ఆంధ్రదేశమేగదా! అంతేకాదు. గోదావరిజిల్లావారు కృష్ణాజిల్లావారిని, కృష్ణాజిల్లావారు గుంటూరుజిల్లావారిని పడమటివారినియు, వీరువారిని తూర్పువారినియు, నేటికిని వ్యవహరించుచున్నారు. క్రీ. శ. 14వ శతాబ్దినాటి కొండవీటికుమారగిరిరెడ్డి ఒక తామ్రశాసనమున[55] దక్షిణపశ్చిమ దిశల పాలకులు తనకు మిత్రులనియు, తూర్పున గలవారే విరోధులుగ నుండిరనియు చెప్పి తన మహాసేనానియగు కాటయవేమారెడ్డిని ఆ దిక్కుగా విజయయాత్ర సాగించుమని కోరినాడు. దానిని అనుసరించి కాటయవేమన కళింగముపై దండెత్తి పోయెను. ఈప్రమాణములనుబట్టి ఖారవేలుని కళింగమునకు పశ్చిమముగ నున్నది ఆంధ్రదేశమే అని స్పష్టమగుచున్నదికదా! ఈపశ్చిమదిశకు సైన్యమునుపంపిన ఖారవేలుడు "సాతకర్ణిని లక్ష్యము చేయక" అని చెప్పుటలో ఆదిక్కునగల దేశమునకును సాతకర్ణికిని సన్నిహితమగు సంబంధముండెనని స్ఫురించుచున్నది. ఆప్రాంతము స్వతంత్రముగ గాని, మరియొకరు పరిపాలనమునగాని ఉండియుండినచో ఈసందర్భమున సాతకర్ణిప్రశంస రావలసిన అవసరము ఏమియులేదు. ఈపడమట దిక్కుగా పోయి కళింగసైన్యములు చేసిన పనులు పిథుండనగరమును ధ్వంసము చేయుట,[56] మూషికనగరమును భయపెట్టుట, కృష్ణవేణిని చేరుట[57] అని హాథిగుంఫ శాసనము తెలుపుచున్నది. ఈమూషికనగరము ఎక్కడనుండెనను విషయము కొంచెము వివాదాస్పదము. నేటి హైదరాబాదును అంటి ప్రవహించుచు మూసీనది నల్లగొండజిల్లాగుండా పోయి కృష్ణలో కలియుచున్నది. ఆమూషికనగరము ఈమూసీతీరమునగల ఒకనగరము కావచ్చును. నేటి నైజాం రాజ్యములోని రాయచూరుజిల్లాలో మాస్కి అనుచోట ఒక అశోకశాసనము బయలుబడినది. ఈమస్కియే మూషిక లేక మూషికనగరమని ఒక అభిప్రాయము గలదు.[58] ఏమైనను ఈనగరము మూసీనదీతీరమునందుండెననుటయే సమంజసముగ గన్పించుచున్నది. ఈనగరమును భయపెట్టి కృష్ణానదిచేరిన కళింగసైన్యములు నేటి వరంగల్లు, నల్లగొండజిల్లాలగుండా పోవలసియుండును. ఇవి ఆంధ్రదేశభాగమేకదా! నల్లగొండజిల్లాకు ఉత్తరముగ నున్న మెదకుజిల్లాలో కొండాపురమునను, నల్లగొండజిల్లాలోని ఫణిగిరిగాజులబండ గ్రామములలోను ఇటీవల సాతవాహనయుగము

55. J. A. H. R. S. XIII pp. 64.

56. పిథుండం గదభనంగలేన కాసయతి.

57. దుతియె చ వసే అచితయితా సాతకంనిం పఛిమదిసం హయగజనరధ బహులం దండం పఠాపయతి కన్హబెంణాగతాయ చ సేనాయ వితాసితం మూసికనగరం.

58. ఇది శ్రీ కురుగంటి సీతారామయ్యగారి అభిప్రాయము. Proceedings Ind. Hist. Con. 1945 pp. 52–55.

నాటి స్తూపములు, నాణెములు, పట్టణములు బయటపడినవి.[59] ఈ ప్రాంతముననే ఇటీవల కొన్ని ప్రాచీనసాతవాహననాణెములు దొరికినవి. అందు ఒకటి ఖారవేలునికి సమకాలికుడగు మొదటిసాతకర్ణినని నిర్ణయింపబడినది.[60] ఇంతకంటెను ప్రాచీనతరమై, బహుశః సాతవాహనవంశప్రతిష్ఠాపకుడగు సిముకునికి పూర్వుడగు సాతవాహనుడనురాజుది అగు మరియొకనాణెము వరంగల్లులో దొరికినది.[61] ఇది మొదటిసాతకర్ణికి [illegible]ముల వెనుకటిది. ఈయాధారములనుబట్టి నేడు తెలంగాణా అనబడు నైజాంరాజ్యాంతర్గతమైయున్న ఆంధ్రప్రాంతము మొదటిసాతకర్ణి స్వాధీనము నందుండెనని నిస్సందేహముగ చెప్పవచ్చును. దీనినిబట్టి యీప్రాంతముపైకి సేనలను పంపిన ఖారవేలునికి మొదటిసాతకర్ణితో వైరముండె నని ఊహింపదగును. ఈసాతకర్ణి రెండు అశ్వమేధములను ఒక రాజసూయమును చేసెను. ఇతనినాణెములనుబట్టి యితడు మాళవమును జయించెనని చెప్పదగును. ఒక అశ్వమేధము మాళవవిజయసూచకము కాదగును. రెండవ అశ్వమేధము ఖారవేలుని దండయాత్రలకు పిమ్మటది కాదగును. అనివారితదక్షిణాపథపతిత్వమునకు రాజసూయము సూచకము కాదగును. ఈకారణములనుబట్టి ఆంధ్రసాతవాహనరాజులలో మూడవవాడగు మొదటిసాతకర్ణి ఆంధ్రదేశమును పరిపాలించె నని స్పష్టమగుచున్నది.

(౨) గౌతమీపుత్రసాతకర్ణి-ఆంధ్రదేశము: సాతవాహనరాజులలో నెల్ల ప్రతిభావంతుడగు నీరాజుశాసనములును, నాణెములును మహారాష్ట్రముననే దొరికినవనియు, నితనిపాలనమునందుండిన ప్రాంతములలోగాని, ఇతనిచే జయింపబడినవానిలోగాని ఆంధ్రదేశము లేదనియు అందువలన నితనికి ఆంధ్రదేశముతో సంబంధము లేదనియు ప్రతిపక్షుల వాదము. ఈ మహారాజు సముద్రగుప్తపులకేశులవలె గొప్పవిజేత. ఇతని గుర్రములు పూర్వదక్షిణపశ్చిమసముద్రముల నీరు త్రాగినవట.[62] ఇచట మూడుకు బదులు నాలుగుసముద్రములని యుండినచో ఇది లాంఛనముగ చెప్పబడినమాట అని అనుకొనవచ్చును. ‘త్రిసముద్రపీతసత్వ’ అని యుండుటవలన నది సత్యదూరమును, కల్పితమును కాదని చెప్పవలెను. ఒకనాసికశాసనమునందు ఈరాజు తన 1౮వ రాజ్యసంవత్సరమున వైజయంతిసైన్యము యొక్క విజయస్కంధావారమునందున్నట్లు చెప్పబడినది.[63] ఈవైజయంతి నేటి మైసూరురాష్ట్రమునకు పశ్చిమోత్తరమున ఉత్తరకెనరాజిల్లాలో పశ్చిమతీరమునంటి యున్నది. ఈవనవాసిలోను, చిమొగ్గజిల్లాలోని మాలవెల్లిలోను, అపరాంతములోని కన్హేర

59. ఖాజామహమ్మద్ అహమ్మద్ గారి J. A. H. C. III—4 లోని గాజులబండను గురించియు, డిటో IV—1 లోని పణిగిరినిగురించియు వ్యాసములను చూచునది,
60. Jour. Num. Sve. VIII—i pp. 18—21
61. Proc. Ind. Hists. Con. 1946. p. 23
62. తిసముదతోయ పీతవాహనస - గౌతమీబాల శ్రీనాసికశాసనము. E. I. VII. no. 2. పంక్తి 3.
63. E. I. Vol. VIII నాసికశాసనములు నం. 4.

లోను చుటునాగవంశజుల శాసనములును,[64] అనంతపురకడప జిల్లాలలో వీరి నాణెములును[65] దొరికినవి. ఈవంశీయులు సాతవాహనసామంతులు. షిమొగ్గఅనంతపురజిల్లాలకు మధ్యనున్న చిత్తలదుర్గజిల్లాలో మహారథుల నాణెములు దొరికినవి. ఈమహారథులు సిముకునికాలమునుండియు సాతవాహనసామంతులు రాజబంధువులునై యుండిరి. చిత్తలదుర్గమునకుత్తరమునను, అనంతపురిజిల్లాకు పశ్చిమోత్తరమునను గల బళ్ళారిమండలమువ ఒక నాగుడు క్రీ.శ. 3వశతాబ్దిలో సాతవాహన మహాసామాన్యుడుగ నుండెను.(66) దీనినిబట్టి నేటి మైసూరురాజ్యమునందలి ఉత్తరభాగమును, ఆంధ్రదేశమునందలి రాయలసీమ ప్రాంతమును, మదరాసు నగరము చుట్టునున్న తొండమండలమని ప్రసిద్ధిచెందిన భాగమును క్రీ.శ. 2వశతాబ్దిలో మహారథులు నాగులుఅనువారి వశమునందుండెనని స్పష్టమగుచున్నది. వీరందరును సాతవాహనసామంతులు. వైజయంతిలో గౌతమీపుత్రుడు స్కంధావారములో నుండుట ఒకవేళ మహారాథుల విజృంభణకాలమున నీభాగములు స్వతంత్రములై, వీటిని తాను తిరిగి జయించుటకైనను కావచ్చును లేదా ప్రబలురైన ఇచటి సామంతుల సహాయముతో దక్షిణదిగ్విజయము చేసివచ్చుచు దారిలో వైజయంతిలో ససైన్యముగ విశ్రమించుటయైనను కావచ్చును. ఇందేది నిజమైనను దక్షిణాపశ్చిమాంధ్ర మహారాజు వశమునందున్న మాట నిజమని దీనినుండి తెలియనగుచున్నది.

ఇతని తల్లి గౌతమీబాలశ్రీ వేయించిన నాసిక శాసనమునందు ఇతడు కొన్ని పర్వతములకు పతి అని వర్ణింపబడినాడు.(67) అందు మహేంద్ర లేక మహేంద్రపర్వతము, సిరిటన లేక శ్రీస్థానము, చకోర లేక చకోరపర్వతము పేర్కొనబడినవి. మహేంద్ర అనుపేరుగల పర్వతము ఒక కళింగదేశమునందలి మహేంద్రగిరి తప్ప మరియొకటి కానరాదు. సిరిటన యనునది కర్నూలుజిల్లాలోని సుప్రసిద్ధమైన శ్రీశైలము కావచ్చును లేదా గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలో నాగార్జునకొండ అని పిలువబడు శ్రీపర్వతమును కావచ్చును. పురాణములలో శ్రీపర్వతచకోరములని రెండు పర్వతములు కలిసి పేర్కొనబడి యున్నవి. అందువలన చకోరపర్వతమును ప్రాక్సీమననే ఉండెనని యూహింపవచ్చును. ఈశాసనమును వ్రాసినవారు విదిశనాసికులతో పేర్కొని యుండుటనుబట్టి తూర్పుకనుమల నడుమ అంతయు అదేవిధముగ మహేంద్ర చకోర శ్రీస్థాన అను వరుసలో పేర్కొనబడినవని యూహించుట సమంజసముగ నుండును. అప్పుడు గౌతమీపుత్రుడు తూర్పుకనుమల వరుసకంతటికిని పతి అని చెప్పవచ్చును. ఏరాజును నాళ్ళలోనూ, అడవులలోనూ నిండియుండెడి కొండలకు స్వామి నని సగర్వముగ చెప్పుకొనును. పడమటిప్రాంతమంతటికిని ఆయాపర్వతములు ప్రధానములుగ నుండుటచేత పర్వతమునుబట్టి పరిసరము

64. A. S. W. I. V. p. 86; I. A. 1885. p. 331; Ep. carn VII. p. 251.
65. Raps n — CAC. p. XLiii
66. E. I. XIV pp. 153—155.
67. వింఝు చవత పారిచాట సహ్య కణ్హగిరి మచ సిరిటన మలయ మహిద సెటగిరి ఛకోర పవత పతిస —పంక్తులు 2-3.

న్యోతితమగును. గిరిపశ్చిమ లేక కొండపడమటిసీమ, కోరుకొండసీమ, దీనికుదాహరణములు. అందువలన ఈరాజు ఈకొండల కిరువంకలనుగల దేశమునకు పతి అని అర్థము చెప్పవలెను. విశాఖపట్టణగోదావరీకృష్ణాగుంటూరునెల్లూరుజిల్లాలు ఒకవైపునను, వరంగల్లు, నల్లగొండ, మహబూబునగరు, కర్నూలుజిల్లాలు ఇంకొకవైపునను తూర్పు కనుమలకు ఇరువైపులను గలవు. ఈజిల్లాలు ఆంధ్రదేశమున ప్రధానభాగ మగుచున్నవి గదా! ఇట్లు ఆంధ్రదేశమంతయు గౌతమీపుత్రుని ఏలుబడిలో నుండెనని పైనాసికశాసనమునుబట్టియే సిద్ధమగుచున్నదికదా! ఇటీవల గుంటూరుజిల్లా చేబ్రోలు, అమరావతులలో గౌతమీపుత్రుని నాణెములు దొరికినవి.(68) అమరావతిస్తూపమునందు ప్రాచ్యవస్తు[illegible] తలలేని స్త్రీవిగ్రహమొకటి దొరికినది. దాని అడుగున "గోతమి నమో" అను శాసనమున్నది. ఈవిగ్రహము గౌతమీపుత్రుని తల్లియగు గౌతమీబాలశ్రీది కావచ్చును. ఈ రాజుకు పూర్వము కొంతకాలము సాతవాహనులపాలనముసాగిన తర్వాతను క్షహరాటవంశీయులు మహారాష్ట్రమాళవదేశముల నేలిరి. గౌతమీపుత్రుడు ఈభాగములకు రాజనియు, క్షహరాటులవంశమును నిర్మూలించినవాడనియు అతని తల్లి శాసనము తెలుపుచున్నది. దీనినిబట్టి ఈరాజా దేశములను జయించెనని స్పష్టము. మహారాష్ట్రమునగల ఇతని మొదటిశాసనము 18వ రాజ్యసంవత్సరమునాటిదగుటచే ఆకాలముననే ఇతడాప్రాంతమును జయించెనని చెప్పవచ్చును. అగుచో తనరాజ్యకాలమున మొదటి 17 సంవత్సరములు ఇతడు మహారాష్ట్రమాళవవిదర్భదేశములకేవల నెక్కడనో ఉండియుండవలెను గదా! ఈభాగమున కేవలమున్నది ఆంధ్రదేశమేగదా! దీనిని బట్టియు ఈరాజు ముందుగ ఆంధ్రదేశపాలకుడుగ నుండి ఆమీద నాప్రాంతములను జయించెనని చెప్పవలెను గదా! అంతియ కాదు. ఈరాజు శాసనములును, నాణెములలో చాలభాగమును మహారాష్ట్రముననే దొరికినవి. కాని ఇతని కుమారుడును, ఇతని వెనుక రాజ్యమునకు వచ్చినవాడును అగు పులోమావి నాణెములును, శాసనములును మహారాష్ట్రమునను ఆంధ్రదేశముననుకూడ దొరికినవి. ఈపులోమావి ఆంధ్రదేశమును జయించినట్లు ఎచ్చటను చెప్పబడలేదు. ఇతనికి ఆంధ్రదేశము విజయమువలన కానియుండల పారంపర్యముగ సంక్రమించెననియే చెప్పవలెనుగదా! గౌతమీపుత్రుడైనను మహారాష్ట్రాదికములను జయించెననుటకు ప్రమాణమున్నది కాని అతని మహేంద్రచకోరశ్రీపర్వతపతిత్వము విజయలబ్ధమనుటకు ఆధారము లేదుకదా! ఈయాంధ్రప్రాంతము మొదటిసాతకర్ణినాటికే సాతవాహనసామ్రాజ్యమున చేరియుండెనని ఇదివరలో చెప్పియుంటిమి. క్షహరాటులవిజృంభణము మహారాష్ట్రముదాటి తూర్పుగ వ్యాపించినట్లు కనపడదు. ఈకారణములనుబట్టి మొదటినుండియు నేటిఆంధ్రదేశము సాతవాహనసామ్రాజ్యమున నుండెననియు, అది గౌతమీపుత్రునికి పారంపర్యముగ సంక్రమించెననియు స్పష్టమగుచున్నది. అందువలననే బాలశ్రీనాసికశాసనమున ఆంధ్రదేశప్రశంస లేదు.

68. JAHC Vol. I nos. 1 and 2.

సాతవాహనులకు మహారాష్ట్రముతో గల సంబంధమును చాలమంది ఉత్ప్రేక్షించి దానికి అనుచితమగు ప్రాముఖ్యము నొసగుచున్నారు. సిముకసాతకర్ణులవిగ్రహములును, సాతకర్ణి భార్యనాగానికశాసనమును నానేఘాట్‌లో దొరికినవి. రెండవరాజగు కృష్ణుని శాసన మొకటి నాసికలో కలదు. ఇవియే మొదటి ముగ్గురరాజులకును మహారాష్ట్రముతో గల సంబంధమును నిరూపించు సాధనములు. మూడవరాజగు మొదటిసాతకర్ణి మొదలు 22వవాడగు గౌతమీపుత్రునివరకును గల 18మంది సాతవాహనరాజులకు మహారాష్ట్రముతో ఎట్టిసంబంధమును లేదు. కడపటి రాజులలో గౌతమీపుత్రపుళోమావి సాతకర్ణి యజ్ఞశ్రీలు ఆంధ్రదేశముతోపాటు మహారాష్ట్రమునుకూడ పాలించిరి. సిముకకృష్ణసాతకర్ణుల రాజ్యకాలము మొత్తము (23 + 18 + 10) 51సంవత్సరములు. 30మంది రాజులు గల సాతవాహనవంశమున ముగ్గురుమాత్రము మహారాష్ట్రమునే ఏలిరి. మొత్తము సుమారు 450ఏండ్ల ఏలుబడిలో 50 ఏండ్లు మాత్రము మహారాష్ట్రముమీద సాగినవి. ఈకొద్ది కాలము సాతవాహనులు ఈప్రాంతమునను తాత్కాలికముగ నొక కేంద్రము నేర్పరిచుకొని యుందురు. దానికి ప్రబలములగు కారణము లుండినవి. క్రీ. పూ. 236 ప్రాంతమున అశోకుడు మరణించెను. వెంటనే మౌర్య స్సామ్రాజ్యము విచ్ఛిన్నమై రెండుగ విభజింపబడెను. కొద్దికాలముననే సాతవాహనులు విజృంభించి స్వతంత్రరాజ్యస్థాపన మొనర్చిరి. దక్షిణాపథ మశోకుని సామ్రాజ్యమున చేరియుండెను. కడపటి మౌర్యులు దీనిని వశపరచుకొనుటకై దండెత్తివత్తురేమో అను భయము సాతవాహనుల కుండెను. అమీద యవనులు రెండుసార్లు ఉత్తరాపథముపై దండయాత్రలు చేసిరి. పుష్యమిత్రశుంగుడు కడపటి మౌర్యుని చంపి తాను రాజయ్యెను. ఇతడును దక్షిణాపథముపై బడుట కవకాశముండెను. ఇట్లుత్తరాపథమున ఒకదానివెనుక నొకటిగ భయకారణములు బయల్వెడలుట వలనను, తాము క్రొత్తగ జయించిన మహారాష్ట్రము ఈకల్లోలదేశమునకు దగ్గరగ నుండుటవలనను మొదటిసాతవాహనులీ ప్రాంతమును జాగ్రతగ రక్షించుకొనవలసి వచ్చెను. క్రీ. పూ. 100 ప్రాంతమున శకులు మహారాష్ట్రమును జయించుటతో సాతవాహనుల కాదేశముతో సంబంధము వదలిపోయెను. గౌతమీపుత్రుడు దానిని తిరిగి జయించువరకును వారి యేలుబడి అక్కడ సాగలేదు.

ఈసంవత్సరముల క్రింది యంశములు కూడ ఆలోచనీయములు.

(1) సాతవాహనులలో కొందరిపేర్లు గమనింపదగినవి. వానిలో పాటలక, పురీకసేన అనునవి కలవు. అవి పాటలీ, పురీక అనునగరముల నుండి వచ్చినవి. అట్లే కుంతలమహేంద్రి చకోర అనుపేర్లు కలవు. కుంతలవిషయమున పుట్టుటవలన కుంతలునకా పేరువచ్చెనట. మహేంద్రగిరి చకోరపర్వతము లాంధ్రదేశమున తూర్పుకనుమలలోని కొండలకు పేర్లు. ఇవి యీపేర్లుగల రాజుల ఆంధ్రదేశసంబంధమును సూచించుచున్నవి. ఇందు మహేంద్ర సాతకర్ణి క్రీ. పూ. 1వశతాబ్ది మూడవపాదమునను, చకోరసాతకర్ణి క్రీ.శ. 51 లోను రాజ్యము చేసిరి.(69)

69. చూ. 'కాలనిర్ణయము' అను విభాగము.

(౨) హాలుడు సుప్రసిద్ధుడగు సాతివాహన రాజు. అతడు క్రీ.శ. 1వశతాబ్ది మొదటిపాదమున నుండెను. అతడు ఆంధ్రదేశమునందలి సప్తగోదావరీక్షేత్రమును, భీమేశ్వరనిలయము నగు దక్షారామమున సింహళదేశరాజపుత్రికను పెండ్లాడెనని లీలావతియను ప్రాకృత కావ్యము తెలుపుచున్నది.[70]

(౩) క్రీ.శ.1వశతాబ్దిలోని మొదటి ముప్పది యేండ్లును రెండవపులోమావి ఆంధ్రదేశము నేలెను. అంతకుపూర్వ మీదేశము నేరాజవంశమును పరిపాలించిన నిదర్శనములు లేవు. భట్టిప్రోలుశాసనములు కుభిరకుని రాజుగ నేర్కొనుచున్నవి. కాని అతడు 'సింహగోష్ఠి'కి రాజుగ వర్ణింపబడినాడు కాని ఏదేశమునకును, రాష్ట్రమునకును కాడు.[71] క్రీ.పూ. ౩వశతాబ్ది నుండియు ఆంధ్రదేశమున వాణిజ్య మభివృద్ధి నందుచుండెను. భట్టిప్రోలుఅమరావతులలో చైత్యములు నిర్మింపబడినవి. క్రీస్తుశకారంభమున కిటునటుగల కాలమునం దీదేశమును సాతవాహనులును పాలింపక, మరియేయితర వంశీయులును పాలింపక నుండినచో ఇది అరాజకముగ నుండెనని యేర్పడునుగదా! అరాజకముగ నున్న దేశమున వాణిజ్యవైజ్ఞానికకళాభివృద్ధి సంభవమగునా?

(౪) గౌతమీపుత్రుడు మహారాష్ట్రాదిదేశములను క్షహరాటులనుండి జయించెనని ఇదివరలో చెప్పియుంటిమి. అతని పూర్వులు క్రీ.పూ. 100 ప్రాంతమున ఆ దేశమును పోగొట్టుకొనిరి. కాని ఆరాజు 'కులపురుషపరంపరాగతవిపులరాజశబ్దుడు'. అనగా మహారాష్ట్రము చెయ్యిజారిపోయినపిమ్మటను సాతవాహనుల పరిపాలనము అవిచ్ఛిన్నముగ సాగుచునే వచ్చెనని స్పష్టమగుచున్నది. వీరు క్రీ.పూ. 106-96నడుమను, క్రీ.పూ. 28-క్రీ.శ. 78నడుమనుమాత్రము మగధ నేలినట్లు కనిపించుచున్నది.[72] వీరు మగధను పోగొట్టుకొనినవెంటనే వచ్చినవారిలో మొదటివాడగు గౌతమీపుత్రుడు ముందుగ ఆంధ్రదేశమునకు రాజయ్యెను. దీని నితడు జయింపలేదు. ఇది పూర్వులనుండి సంక్రమించినది. ఈయంశములు ఆదినుండియు ఆంధ్రదేశము సాతవాహనులయేలుబడియం దుండెనని నిరూపించుచున్నవిగదా!

(౫) ఇటీవల 'సాతవాహన' అను రాజుయొక్క నాణెములు మూడు దొరికినవి. అందు రెండు పునాదౌరంగాబాదులలో కొనబడినవి. అవి యెక్కడదొరికినవో తెలియదు. ఒకటిమాత్రము ఓరుగల్లులో దొరికినది. నాణెముమీది అక్షరములస్వభావమునుబట్టి ఈసాతవాహనుడు సిముకునికి పూర్వుడని నిర్ణయింపబడినది. అగుచో ఇతనిరాజ్యము ఓరుగల్లు ప్రాంతమునందుండెనని చెప్పవచ్చును. సిముకుడు క్రీ.పూ. 220 ప్రాంతమున రాజ్యమునకు వచ్చెను. అశోకుడు క్రీ.పూ.236లో మరణించెను. అగుచో సిముకునికి పూర్వుడగు సాతవాహనుడు క్రీ.పూ. 236—220నడుమ నుండవలెను. అప్పుడు అశోకుని మరణానంతర మితడు స్వతంత్రుడై దక్షిణాపథప్రాఙ్మధ్యభాగముల కేలిక అయియుండును. బహుశః ఇతని పుత్రుడగు సిముకుడు తొలిఆంధ్రనాయ

70. భారతి. ౩వ సంపుటములోని శ్రీ మానపల్లి రామకృష్ణకవిగారి వ్యాసము.

71. M. Rama Rao — Ins. Andhra. Dyn. p. 1.

72. చూ. 'మగధలో ఆంధ్రులు' అను విభాగము.

కులను కొందరిని కూడగట్టుకొని మహారాష్ట్రమును జయించి తనతండ్రి యేలిన ఆంధ్రదేశ పరిమితమగు రాజ్యమును విస్తరించి యొక సామ్రాజ్యమును స్థాపించియుండెను.

ఇట్లు ఉపలభ్యములగు నాధారముల నన్నిటిని నిష్పాక్షికముగ పరిశీలించినచో సాతవాహనులు మొదట ఆంధ్రదేశముననే పరిపాలనము నారంభించిరనియు, పిమ్మట మహారాష్ట్రమును జయించి 50సం॥లు దానినికూడ నేలిరనియు, క్రీ.పూ. 100 ప్రాంతమున అది అన్యాక్రాంతముకాగా, విదిశవిదర్భకళింగములను, మగధను జయించి పాలించిరనియు, కాలక్రమమున నవియు వశము తప్పగ, తిరిగీ మహారాష్ట్రమాళవవిదిశవిదర్భలను జయించి యేలిరనియు, ఉజ్జయినీక్షాత్రవు లింక కొన్ని ప్రాంతములను లాగికొనగ, మహారాష్ట్ర విదర్భలను మరల సంపాదించి యేలిరనియు, ఈయా దేశములు లభించుచు వశముతప్పుచు నుండినను ఆంధ్రదేశముమాత్రము ఆదినుండి అంతమువరకును వారిపరిపాలనమునం దుండె ననియు నిస్సందేహముగ చెప్పవచ్చును.

## ౭. సాతవాహన, శాలివాహన, సాతకర్ణి శబ్దములు

ఈ ఆంధ్రరాజులపేళ్లు విలక్షణములుగ నున్నవి. పౌరాణికపట్టికలలోని మహేంద్ర, చకోర అనుపేర్లు పర్వతములనుండి యేర్పడినవి. కుంతల అనునది ఒక దేశవిభాగమునుండియు, పాటలక పురీక అనునవి ఆపేర్లుగల నగరములనుండియు, స్కంద, కృష్ణ, శివ, శివస్కంద, చంద్ర మున్నగునవి దేవతలనుండియు ఏర్పడినవి. కొందరు రాజుల పేర్లలో "స్వాతి" "స్వాతివర్ణ", "శాతకర్ణి", "శతకర్ణి" అనునవి కనుపించుచున్నవి. నలుగురు రాజుల పేళ్లు శాతకర్ణి అనిమాత్ర మున్నవి. శాసనములలో ఈ పేరు సాతకణి, సతకణి, సతకంణి అనియు, నాణెములమీద సద, సదకన, సదకణి అనురూపములలోను కలదు. మరికొందరు రాజుల పేర్లకు ముందు గౌతమీపుత్ర, వాసిష్ఠీపుత్రమున్నగు మాతృనామము లున్నవి. ఈపేర్లను సవిమర్శకముగ పరిశీలించినచో స్వాతి, స్వాతికర్ణి శబ్దములు సాతి, సాతికర్ణి శబ్దములకు పర్యాయపదములా అను అనుమానము కలుగుచున్నది. ఒకవేళ ఈ రాజులపేర్లు మొదట ప్రాకృతమున వ్రాయబడి, తర్వాత పౌరాణికులచేత సంస్కృతీకరింపబడునప్పుడు వానికి రూపాంతరములు కల్పింపబడినవేమో. ఈ ఊహ సరియైనది అయినయెడల ఈ ఆంధ్ర రాజులలో చాలమందికి సాతకర్ణి అనునది బిరుదముగ నుండెనని తోచుచున్నది. ఈ సాతకర్ణి అనుశబ్దము ఎట్లు వచ్చినదో నిశ్చితముగ తెలియదు. కాళిదాసు రఘువంశమున సాతకర్ణి అను నొకఋషి గోదావరీతీరమున కొంతకాలము నివసించెనని చెప్పబడినది [73] గోత్రప్రవరనిబంధమున సాలహోతేయుడును, సప్తకర్ణియును గోత్రకర్తలగు ఋషులుగ పేర్కొనబడినారు. హాలుడను రాజు సాతవాహనవంశమున కలడు. పురాణములలో నిత

73. సర 13. శ్లో. 34.

నికి హాలేయుడను నామాంతరమును కలదు. ప్రాకృతమున 'స'అనునక్షరము'హ'గ మారును. [74] అప్పుడు 'హాల'శబ్దము 'సాల'అగును. 'సప్తకర్ణకిని' 'సతకర్ణి'కిని సంబంధముండెనా అని అనుమానము కలుగుచున్నది. అప్పుడు సాతవాహనులు సప్తకర్ణిఋషి సంతతివారై, తమగోత్రనామమును సతకర్ణి లేక సాతకర్ణి అనురూపమున బిరుదముగ వేసుకొనిరేమో అని తోచుచున్నది.

శాసనములలోను, నాణెముల మీదను 'సాతవాహన' అను మరియొక పేరు కనిపించుచున్నది. నానాఘాట్ గుహాలయం దొకదానిలో కొన్ని విగ్రహము లున్నవి. వానిమీద ఆయావ్యక్తుల పేర్లు చెక్కబడినవి. అందు 'సిముక సాతవాహన' అనుపేరు కలదు. ఈ సిముకుడు ఆంధ్రరాజవంశమున మొదటివాడని పౌరాణికపట్టికలు తెలుపుచున్నవి. మరియొక విగ్రహము 'కుమార సాతవాహన' అను పేరు కలది.[75] బాణుని హర్షచరితమున గాథాసప్తశతీకర్త సాతవాహనుడని చెప్పబడినది. రాజశేఖరకవియు నిట్లు వ్రాసినాడు. సప్తశతిప్రతులలో నొకదానియందు దానికర్త హాలసాతవాహనుడని ఉన్నది. బృహత్కథను ప్రాకృతమున రచించిన గుణాఢ్యపండితుడు ఒక సాతవాహనుని ఆస్థానమునం దుండెను. [76] ప్రభావకచరితమను నొక గ్రంథమున శ్రీ సాతవాహనుడను రాజు ఒక జైనతీర్థము నుద్ధరించెననియు, పాదలిప్తసూరియను ఆచార్యుడు అచ్చట ధ్వజప్రతిష్ఠ చేసెననియు చెప్పబడినది. [77] రాజశేఖరుని కావ్యమీమాంసలో కుంతలదేశమునందు సాతవాహనుడను రాజు ఉండెననియు, అతని అంతఃపురమున ప్రాకృతభాష వాడుకలో ఉండెననియు చెప్పినాడు. [78] జినప్రభాసూరి ప్రతిష్ఠానపట్టణకల్పమును, రాజశేఖరుని చతుర్వింశతిప్రబంధమును సాతవాహనుడు ప్రతిష్ఠానపురమున కేలికగ పేర్కొనబడినాడు.[79] నాగదేవభట్టోపాధ్యాయుడు అమరకోశమునకు వ్రాసిన తెలుగు వ్యాఖ్యలో హాలుడు సాతవాహనుడగునని చెప్పినాడు.[80] హేమచంద్రుని అనేకార్థమునను,[81] అభిధానచింతామణిలోను[82] అట్లే ఉన్నది. ఆర్యమంజుశ్రీమూలకల్పము స్వాతిసుచంద్రుడను సాతవాహన రాజును పేర్కొనుచున్నది.[83] వాత్స్యాయనకామసూత్రములలో కుంతలసాతకర్ణి సాతవాహనుడుగ పేర్కొనబడినాడు [84] బృహద్దేశీ అను

74. Cf. Rapson—C A C. Intro pp. xc, xci; K. Gopalachari—Early. Hist. Andhra pp. 13—14.
75. A S W I vol. V. p. 46
76. కథాసరిత్సాగరము—కథాపీఠ లంబకము—6, 7, 8 తరంగములు
77. శ్రీసాతవాహనాఖ్యో భూప ఇదం తీర్థ ముదధార పునః శ్రీపాదలిప్తసూరిః ధ్వజప్రతిష్ఠాం వ్యధాత్తత్ర॥
78. శ్రూయతే హి కుంతలేషు సాతవాహనో నామ రాజా తేన ప్రాకృతభాషాత్మక మంతఃపుర మేవేతి॥ 14. 339.
79. A B O R I. vol. XXVII. p. 239.
80. హాలస్స్యా త్సాతవాహనః॥
81. హాలత్యరాతిహృదయం హాలః...| సాతం దత్తసుఖం వాహన మస్య సాతవాహనః| సాలవాహనో౽పి॥
82. శాలో హాలే మత్స్యభేదే | హాలః సాతవాహనపార్థివే |...హాలః సాతవాహననృపః॥
83. V. 662.
84. కర్తర్యా కుంతలః శాతకర్ణిః శాతవాహనో మహాదేవీం మలయవతీం జఘాన॥

సంగీతగ్రంథమున సాతవాహనీ అను రాగము ప్రశంసింపబడినది.[85] బహుశః సాతవాహనుడను రాజుచే కల్పింపబడినదగుటవలన ఆరాగమున కాపేరు వచ్చియుండును. ఇటీవల "సాతవాహన" అను ఒకరాజు నాణెములు దొరికినవనియు, వానిమీది అక్షరములస్వభావమును, మొదటిసాతవాహనుల శాసనములను సమన్వయించి చూచినచో ఈ సాతవాహనుడనురాజు సిముకునికి పూర్వుడని స్పష్టమగుచున్నదనియు ఇదివరలో చెప్పియుంటిమి. ఈ యంశములనుబట్టి ఈ ఆంధ్రరాజులకు 'సాతవాహన' అనునది పేరుగను, బిరుదుగనుకూడ నుండెనని ఊహింపనగుచున్నది. నాసికశాసనములలో నొకదానిలో[86] "సాతవాహనకులే కిత్తే రాజని" అని యున్నది. మ్యాకదోనిశాసనమునందు[87] పులోమావి "రాజ్ఞః సాతవాహనానాం" అని చెప్పబడినాడు. ఈ రెండుశాసనములును "సాతవాహన" అనునది యీరాజుల వంశనామమని తెలుపుచున్నవి. కల్హణుడు తన రాజతరంగిణిలో కాశ్మీరము నేలిన రాజవంశములలో సాతవాహనవంశమునుకూడ నొకదానినిగ పేర్కొనినాడు. పౌరాణికపట్టికలనుబట్టి యీవంశమున రెండవవాడగు కృష్ణుడు సాతవాహనకులజుడగు నెడల, అతని అన్నయగు సిముకుడును సాతవాహనకులజుడే కావలెను గదా. ఈ సిముకునికి సాతవాహనుడను బిరుదముండెను. ఇతని పూర్వుడు సాతవాహననామధేయుడు. ఈయంశములనుబట్టి సాతవాహనుడనురాజునుండి అతనివంశమునకు సాతవాహనవంశమని పేరువచ్చెనని ఊహింపవచ్చును.

గాథాసప్తశతి,[88] అమరకోశము, అభిధానచింతామణి,[89] దేశీనామమాలా[90] అను గ్రంథములు శాలివాహనుడనియు, హైమానేకార్థ త్రికాండశేషానేకార్థ, అనేకార్థకైరవాకర కౌముది అను గ్రంథములు శాలుడనియు హాలుడని పేర్కొనుచున్నవి. జినప్రభాసూరి కల్పప్రదీపికా, కాలకాచార్యకథానకము, ద్వాత్రింశత్పుత్తలికా, ముహూర్తమార్తాండము[91] శాలివాహనుడను నొక రాజును పేర్కొనుచున్నవి.

సాత లేక సాతవాహన శబ్దములతో సంబంధముగల స్థలనామములు లెన్నియో కలవు. మత్స్యదేశమునకు సమీపముగ సాతకర్ణిక అను నగరముండెను.(92) నేటి బళ్ళారి మండలప్రాంతమును సాతవాహనిరాష్ట్రము, సాతవాహనిహారము మండలమని శాసనములు తెలుపుచున్నవి. కర్నూలుజిల్లా నందికోటకూరు తాలూకాలో సాతవాహనికోట అను సాతనికోట గలదు. గుంటూరుజిల్లాలో సాతవాహనపల్లె అను సత్తెనపల్లె ఉన్నది. బళ్ళారిజిల్లా ఆదోని తాలూకాలో సాతనూరు, చిత్తూరుజిల్లా చంద్రగిరితాలూకాలో సాతంబాకం, గుంటూరుజిల్లా నరసరావుపేట తాలూకాలో సాతులూరు, కృష్ణాజిల్లా బందరు తాలూకాలోని సాతులూరు, గంజాం విశాఖపట్టణంజిల్లాలలో సాతుకొట్టిని, సాతోపాడియ, సాతగొనాలో, సదనపల్లె, సాతులి, సడాంబాం, సతాపి, సాప అను గ్రామము

౮౫. XI. 13. ౮౬. E I. VIII. p. 93. no. 22. 87. Ibid. XIV. pp 153—155.
౮౮. చూ. గాథాంత గద్యలు. ౮౯. V. 272. చూ: 10వ నోటు. 90. VIII. 36.
91. A B O R I. vol XXVII. p. 241. 92. S. B. E. XVII, 38.

లును గలవు.[93] గౌతమీబాలశ్రీ నాసిక శాసనమునందు సెటగిరి అను పర్వతము పేర్కొనబడినది.[94] మహాభారతమున చెప్పబడిన ఋషీవంతపర్వతము[95] నేటి సాతపుడాకొండ అని ఒకఅభిప్రాయము. బేరారులో చందాకోలాజిల్లాలకును పెన్‌గంగా నదికిని దక్షిణమున సాతమాలపర్వతపంక్తి కలదు. చాందాజిల్లాలోని పరిజాగడ్ అనునొక పర్వతశిఖరమునకు సాతివహాని అని పేరు. అచ్చటనే సాతనాల అను పర్వతమున్నది.[96] గయవద్దనున్న బరాబర్ కొండలలో సాతఘర అను గుహాలున్నవి.[97] గౌతమబుద్ధుని నిర్యాణానంతరము జరిగిన మొదటి బౌద్ధసమావేశము రాజగృహమువద్ద గల సత్తపణ్ణి గుహాలో జరిగెను.[98]

ఈ సాతవాహన శాలివాహనసంబంధితులైన రాజులనుగురించి ఎన్నియో గాథలుకలవు-

(1) రాజగృహానగరమునకు సాతుడను యక్షుడు అభిమానదేవతమట. అతనికి సాతిగిరి అను కుమారుడును, అభిరతి అను పుత్రికయు నుండిరి. ఈఅభిరతికే హారితి అనియు పేరుండెను. కుబేరుని సేనానియగు పాంచికుడామె భర్త. తమ్ముడగు సాతగిరి ఎంతవారించినను లక్ష్యము చేయక హారితి రాజగృహమునందలి బిడ్డలను తినివేయుచుండెనట. బుద్ధుడు ఈమెకు ధర్మబోధ చేసెనట. అప్పటినుండియు నామె శాకపాకాదులతో తృప్తిపడి, శిశువులను తినుటకుమారుగ వారికి రక్షకురాలు అయ్యెనట.[99]

(2) కథాసరిత్సాగరమున మరియొక గాథ గలదు. దీపకర్ణియను రాజుండెనట. ఒకప్పుడు అతని రాణి శక్తిమతి సర్పదష్టయై మరణించెనట. భార్యమరణమున కొకవంకను, తనకు పుత్రులు లేరని మరియొకవంకను ఈ రాజు విచారించుచుండగ శివుడు సాక్షాత్కరించి వేటకై ఒక అడవికి పొమ్మనియు, అతని కచట సింహముపై స్వారిచేయు బాలుడొకడు కనిపించుననియు, వానిని తెచ్చి పెంచుకొనమనియు చెప్పెనట. ఆరాజు అట్లే అడవికి పోయెను. అక్కడ అతనికి ఒకబాలుని తనపై నెక్కించుకొని తిరుగుచున్న సింహము కనిపించెను. కొంతసేపైనపిమ్మట బాలుని క్రింద దింపి ఆసింహము నీరు త్రాగుటకై ఒక సరస్సున దిగెను. ఆయదను కని పెట్టి రాజు ఒక బాణము వదలి సింహమును గాయపరచెను. అంతట సింహమునుండి మనుష్యరూప మావలికి వచ్చి, తాను సాతుడను యక్షుడననియు, రహస్యముగ నొక ఋషిపుత్రికను పెండ్లాడితిననియు, అది తెలిసి ఆఋషి వారిద్దరను సింహములు కమ్మని శపించెననియు. పుత్రి జననముతో అతనిభార్య శాపవిముక్త అయ్యెననియు, దీపకర్ణి బాణము తగులుటతో తన శాపమును గతించెననియు చెప్పి, బాలుని దీపకర్ణి కిచ్చి అదృశ్యుడయ్యెను. శివాజ్ఞను స్మరించుకొనుచు రాజు ఆబాలుని తనయింటికి తీసుకొనిపోయి, సాతుని (సింహము) వాహనముగ నుపయోగించియుండుటవలన నితనికి సాతవాహనుడని పేరిడెను.[100]

93. List of villages in the Madras Presidency. 94. E. I. VIII Nasik Ins. No. 2.
95. వనపర్వము. 61, 23-24 96. Proc. R A S B. 1893 pp. 116—17.
97. Cunningham—Arch. Sur. Repts. I. 44. 98. Ibid I. 21—22.
99. సంయుక్తవస్తు XXXI. 100. తరంగము 6.

(3) జినప్రభాసూరి ప్రతిష్ఠానపురకల్పము నందు మరియొక గాథ ఉన్నది:— ఒకప్పుడు ఇద్దరు బ్రాహ్మణయువకులు, విధవ అయిన తమ చెల్లెలితో కలిసి ప్రతిష్ఠానపురమునకు వచ్చి, బిచ్చమెత్తుకొని జీవించుచుండిరట. ఒక రోజున ఆయువతి నీరు తెచ్చుటకై గోదావరికి పోయెనట. నాగరాజు ఆమెను చూచి వ్యామోహితుడై మనుష్యరూపము ధరించి సంభాషించెనట. క్రమక్రమముగ వీరికి ప్రేమ ఏర్పడెను. ఆమె గర్భవతి అయ్యెను. తలచి నప్పుడు తప్పక వచ్చెదనని వాగ్దానము చేసి నాగరాజు మరియొక చోటికి పోయెను. ఈస్థితి కనిపెట్టి అన్న లామెను విడచి పోయిరి. ఒక కుమ్మరియింట చేరిన ఆయువతికి కాలక్రమమున చక్కని కుమారుడు కలిగెను. దినదినాభివృద్ధి నందుచు నీబాలుడు తోటిబాలురకు రాజై వారికి మట్టితో చేసిన ఏనుగులు, గుర్రములు మున్నగు వాహనముల నిచ్చుచుండెను. వాహనములను ఇచ్చినవాడు గనుక (సాతాని దత్తాని వాహనాని యేన సః) ఈబాలునికి సాతవాహనుడని పేరు వచ్చెను. ఒకప్పుడు విక్రమాదిత్యుడను రాజు ప్రతిష్ఠానముపై దండెత్తివచ్చెను. నగరవాసులు నిస్సహాయులైరి. అంతట సాతవాహనుడు మట్టిగుర్రములను, ఏనుగులను, యోధులను ఒకచో చేర్చెను. అతని తల్లి నాగరాజును తలచుకొని అతనిచే వీనికి ప్రాణము పోయించెను. ఈబలమునకు నాయకుడై సాతవాహనుడు విక్రమాదిత్యుని ప్రతిఘటించి ఓడించెను. ద్వాత్రింశత్పుత్తలిక అను గ్రంథమునను ఈగాథ కలదు కాని అందు సాతవాహనుని తల్లి రెండున్నరసంవత్సరముల కన్యఅనియు, విక్రమాదిత్యుడు ఉజ్జయిని రాజనియు చెప్పబడి నది.

(4) శిలప్పదికారమను ద్రవిడపురాణమున మరియొక గాథ కలదు. ఒకచేరరాజు హిమాలయపర్వతములనుండి రాళ్ళను తెచ్చి వాటిని విగ్రహములు చెక్కించుట కుపయోగించెనట. అతడు మొదటిసారి ఉత్తరదిశ కేగి నప్పుడు గంగాతీరమున వెయ్యమంది ఆర్య రాజులను ఓడించెనట. మరియొకసారి అతడు పత్తినిదేవివిగ్రహమును తయారుచేయింప సంకల్పించి మంచిరాతికొరకు ఉత్తరముగ నేగె నట. అప్పుడు నూరువర్ కన్నర్ అను రాజులు ఇతని మైత్రిని కోరి తమసేవలలో ఈరాజును గంగదాటించిరట. ఈనూరువర్ కన్నర్ సాత వాహనులనియు మగధనుండి రాజ్యము చేయుచుండిరనియు కొందరి మతము.[101]

(5) మరియొక ద్రవిడగాథనుండి ధర్మాత్ము డగు సాతవాహనుని మదముట్టించుటకై శివుడు చేరచోళపాండ్యులను సృష్టించెననియు, తుదకొకచోళరాజు తిరుచినాపల్లివద్ద సాత వాహనరాజును చంపెననియు తెలియు చున్నది.[102]

(6) పైశిలప్పదికారమున సాత్తాన్, పాసండసాత్తాన్ అను పదములు గలవు.[103]

(7) కరికాలుడను రాజు కావేరీముఖద్వార మున నిర్మించిన పట్టణమున సాతవాహన అనుదైవము ఆరాధింపబడుచుండెనట.[104]

101. Dikshitar—Silappadikaram. Intro. p. 14; Aravamudan—The Kaveri, Maukharis and the Sangam age. 102. JRAS. X, p. 39 103. IX 11, 12 & 12
104. S. K. Aiyyangar—Beg. S. Ind. Hist. p. 144

(౮) పటియాలసంస్థానమున కలహాత అను చోట సాతవాహానుడను దేవతగుడులు కలవట.[105]

(౯) ఉత్తరదేశమున భట్టీరాజపుత్రులు తాము సూర్యవంశజులమనియు, తమపూర్వీకులు ముల్తాను సమీపమునున్న కరోరువద్ద సాతివాహానుని శకులను ఓడించుటలో సహాయము చేసిరనియు చెప్పుకొందురు.(106)

(10) అమోఘ మాళవరాజపుత్రానాల లోని బాయిస్ రాజపుత్రులు తమపూర్వులు తమ పేరుకు చెందిన శాలివాహానుడను రాజుతో వచ్చిరనియు చెప్పుకుందురు.

సాతవాహన, సాతకర్ణి శబ్దములఅర్థమును అనేకులు అనేకవిధముల చెప్పిరి. విల్ఫర్డ్ అను నతడు శాలివాహనశబ్దము సంస్కృతము లేక అరబిక్ భాషలోనిదనియు, శాలి అనగా Shorea Robusta అను వృక్షమనియు, వాహనమనగా ఒకచోటనుండి మరియొక చోటికి పోవు సాధనమనియు, అది ఒక చిలువ కావచ్చుననియు, శాలివాహనునితండ్రి తక్షకులను నాగులలోనివాడనియు, అతడు మంచి వడ్రంగి అనియు, అందువలన నీశాలివాహానుడు ఏసుక్రీస్తు కావలెననియు వ్రాసియున్నాడు. రాప్సన్ పండితుడు సాతవాహన అనునది ఒక తెగయొక్క పేరనియు, సాతకర్ణి అనునది బిరుదమనియు, వ్రాసినాడు.[107] ప్రజలస్కీ[108] అనునతడు సాది, సదాని, సాదాని అనుమాటలకు ముండాభాషలో గుఱ్ఱము అని అర్థముగలదనియు, హాన, హాపన్ అనువానికి కుమారుడని అర్థముకల దనియు, సాదవహాన లేక సాదహాన అను పదమునకు గుఱ్ఱముకొడుకు అను అర్థమేర్పడు ననియు వ్రాసినాడు. అశ్వమేధసందర్భములో దేశాటనము చేసివచ్చిన గుఱ్ఱము యజ్ఞశాలలో పట్టమహిషితో సంగమించు ఆచారము కలదనియు, అట్టిసంగమమునకు ఫలితముగ పుట్టినవాడు సాదిహానుడు లేక సాతిహానుడు కావచ్చుననియు ఈపండితుని అభిప్రాయము. దక్షిణాపథమునేలిన రాజులలో సాతవాహనులు అశ్వమేధమును చేసియుండుట ఈయూహను బలపరచుచున్నది. కాని ఇతరరాజుల నెందరినో జయించి విజేత అయిన వాడు తప్ప ఈయాగమును చేయడు. సాతవాహనవంశమును శిముకుడు స్థాపించెనని ఇంతవరకును పండితుల అభిప్రాయము. అతడు సాతవాహనుడని చెప్పబడినాడు. అందు వలన అతని పూర్వులెవరో ఈయజ్ఞమును చేసి యుండవలెను. ఆపూర్వుల చరిత్ర మేమియు మనకు తెలియుటలేదు. అందువలన అశ్వమేధయాయజనిసుడును, అందుమూలమున సాతవాహనశబ్దవాచ్యుడగువాడును అగురాజు ఒకడుండె అతని సంతతివారికి అతనినిబట్టి సాతవాహనులను వంశనామ మేర్పడెనని నిశ్చితముగ చెప్పుటకు వీలులేదు. అదియునుగాక ఎందరోరాజులు అశ్వమేధమును చేసిరి. అప్పుడు వారిపుత్రులందరును సాతవాహనులే కావలెను. బార్నెట్ అను పండితుడు[109] వాహన, కర్ణి అనుపదములు సమానార్థకము

105. Ketkar — Satavahanaparva.
106. Cunningham — Arch. Sur. Repts. II p. 21
107. Asiatic Researches. 108. JRAS 1859
109. Bulletin of the School of Oriental Stores Vol. IX. p 327.

లనియు, వాటికి పుత్రుడు అని అర్థమనియు, 'సాతి' అను పదిఒకని పేరనియు. సాతివాహన శబ్దమునకు సాతుని పుత్రుడు అని అర్థమనియు వ్రాసినాడు. హాలకన్నడములో ఒకసమాసమున రెండవపదము ప, బ, మ లతో మొదలగునెడల ఆయక్షరము వ అగునట. అందువలన సాత + మగన లో 'మ' 'వ' ఆయి సాతవగన అగునట. దానికి "సాతవాహన" అనునది సంస్కృతరూపమట. అప్లకన్న, కర్ణా అనునవి సంస్కృతమునందలి కన్యాశబ్దమునకు పుంలింగరూపములట. అప్పుడు కన్య అనగా పిల్లవాడు అని అర్థమట. సాతకన్య అనగా సాతులబాలుడు అని అర్థమట. వహ, కర్ణ శబ్దములకు "పుత్ర" అని అర్థమున్నదనియు, సాతకర్ణ అనగా నూరు ఓడలుకలవాడు అని అర్థమనియు కుమారస్వామి అను మరియొక పండితుని అభిప్రాయము. రాజవాహి అను ఇంకొకపండితుడు[110] మరియొక అర్థమును చెప్పినాడు. పురాణములలోను, గాథలలోను శాతవాహన, శాలివాహన, శాకవాహనశబ్దములు పర్యాయపదములుగ నున్నవి. శాలి అనునది ధాన్యవిశేషము. శాలివాహన అనగా శాలీధాన్యము వేయబడిన బండి అగును. శాతవాహనులు ఆంధ్రులు. వారి దేశమున శాలిధాన్యము విరివిగ పండును. అందువలన తద్ద్యోతకముగ వారు ధాన్యము పోసిన బండిని ధ్వజముపై చిత్రించుకొని యుండి శాలివాహనులని పిలువబడి యుందురు. శాత అనగా వేడి, వాహన అనగా గుర్రములు, ఎద్దులు కాని బండ్లుకాని కావచ్చును. వేగముగల గుర్రములు, వాహనములు కలవారు శాతవాహనులగుదురు. ఋగ్వేదములోని అష్టకర్ణి అనుపదమునకు పాశ్చాత్య పండితులు ఎనిమిది గుర్తులు కలది అని అర్థము చెప్పినారు. అట్లే శాతకర్ణి అనగా చీలి వేయబడిన చెవులు కలవి అని అర్థమేర్పడును. ఆదిలో శాతకర్ణివాహన అనియుండి మధ్యమపదలోపమై శాతవాహన అను పదమేర్పడియుండవచ్చునని ఈపండితుని అభిప్రాయము. శాతకర్ణి లేక సాతకర్ణి అను పదమునకే నూరువర్ కన్నర్ అనునది తమిళ భాషారూపమనియు, దీనికి నూరు చెవులు, లేక నూరుమంది చారులు కలవాడని అర్థమనియు కనకసభై అను పండితుని ఊహ. సాతిశబ్దము స్వాతిశబ్దము నొకటేఅనియు, స్వాతి అనగా ఖడ్గమనియు, సాతవాహనుడనగా ఖడ్గమును మోయువాడనియు ఒకరి వ్యాఖ్యానము. కర్ణి అనగా కొండగుహ అగును, సాతకర్ణి అనగా సాతుకొండలు కలవాడని అర్థమేర్పడును అని మరొకరు.[111] ఇటీవల మరియొక వ్యాఖ్యానము ఉదహరింపబడినది[112] సింహళమునుండి సాతవాహనశబ్దమునకు సప్తవాహన అనియు, సాతకర్ణిశబ్దమునకు సప్తకర్ణి అనియు అర్థములు చెప్పబడినవి. ఈసాతవాహనులు సూర్యవంశీయులనునది ఇందలి ప్రధానాంశము. ఈ వాదముయొక్క సారాంశ మిది-(1) సాతవాహనశబ్దమువలెనే "వాహన" అనుపదముతో అంతమగు మేఘవాహన, జీమూతవాహన అను ఇంద్రపరములగు పదములును, హోత్రవాహన, హవ్యవాహన అను అగ్నివాచకములగు పదములును కలవు. ఇవిగాక వృషవాహన, మహిషవాహన, బభ్రువాహన, శ్వేతవాహనాదులును కలవు. (2) మనదేశము

110. Arch· Sur. Mysore. 1929 pp. 93. 175, 177, 180.
111. ABOR., Vol. p. 259. 112. His. pp. 260—283.

వలెనే ఈజిప్టు, సుమేరియా, ఇండోనీషియా లలోకూడ రాజులను దేవాంశసంభూతులుగ పరిగణించు ఆచార మందెడిది. వారిలో కొందరు రాజులు సూర్యపుత్రులమని చెప్పుకొనుచుండిరి. మన క్షత్రియవంశములన్నియు సూర్యపుత్రుడగు వివస్వతుని పూర్వికునిగ పేర్కొనుచున్నవి. అనేకసందర్భములలో సూర్యునికి ఒక కన్యకవలన జన్మించిన రాజసంతతి ప్రశంస కనిపించుచున్నది. కుంతికి కర్ణుడు ఇట్లు ఉద్భవించెను. శాలివాహనుడు కూడ నొక కన్యపుత్రుడని ఒకగాథ కలదు. (౩) హిందూధర్మము ప్రధానముగ సూర్యారాధనాత్మకము. వేదములలో చెప్పబడిన దేవతలలో సూర్యుడు ముఖ్యుడు. మంత్రరాజమగు గాయత్రీమంత్రము సూర్యదేవతాత్మకము. సప్తాశ్వములచే లాగబడు రథముగలవాడగుట సప్తవాహన, సప్తాశ్వ (ఏడుతలలు గల గుర్రము నెక్కువాడగుట) వేదములలో సూర్యుడు వర్ణింపబడినాడు. అతనిరథమునకు ఏడు గుర్రములట. సూర్యుని ధ్యానించునప్పుడు కర్ణిక అను పద్మకోశముపై మనస్సును కేంద్రీకరించవలెనట. కర్ణికాకుసుమములు సూర్యునికి ప్రియములైనవి. సముద్రమథనానంతరము సూర్యుడు అమృతము త్రాగుచుండగ కొన్ని చుక్కలు క్రిందపడెనట. వానినుండి శాలిధాన్యమును, ఇక్షు అను చెరకును పుట్టెనట. శాలి, కర్ణ శబ్దములు సాతవాహనులసంబంధముగ వాడబడినవి. ఇవి సూర్యసంబంధమును చూపుచున్నవి. (౪) క్షత్రియులలో రెండు శాఖలుండెడివి. అందు ఇక్ష్వాకులు సూర్యవంశీయులు. ఐలులు చంద్రవంశీయులు. ఐలులు విదర్భ, సూర్పారిక, కళింగదేశముల నాక్రమించిరి. ఇక్ష్వాకునికి నూర్గురు పుత్రులుండిరి.

అందు ఏబదిమంది ఉత్తరాపథమునను, ఏబదిమంది దక్షిణాపథమునను రాజులైరి. దండకుడనునతడు ఇక్ష్వాకుని పుత్రులలో కడపటివాడు. బహుదుర్మార్గుడు. అందువలన ఇతనిని వింధ్యదక్షిణభాగమునకు పంపివేసిరి. ఇచ్చట నతడు శుక్రాచార్యుని కూతురగు అరజ అను నామెను చెరచెను. అంతట శుక్రుడు ఇతని రాజ్యమంతయు అరణ్యమగునట్లు శపించెనట. దండకారణ్యము ఇట్లేర్పడెను. మహాభారతమునందు దండకులను వారియొక్కయు, దండకరాజ్యముయొక్కయు ప్రశంస కలదు. ఈ రాజ్యము బుందేలుఖండమునకును కృష్ణకును నడుమనుండెడిదని పండితుల అభిప్రాయము. కొంకణమున దండకరాజపురి అను రేవు కలదు. మహావస్తువను బౌద్ధగ్రంథమున దండకకు గోవర్ధననగరము కేంద్రమని చెప్పబడినది. యువనాశ్వుని పుత్రుడగు మాంధాత సూర్యవంశచక్రవర్తి. అతనికి నర్మద కోడలు. దక్షిణాపథవాసులైన నాగులు తమకు మౌనేయులను గంధర్వులతో జరిగిన యుద్ధములో ఈ నర్మదద్వారా మాంధాతసహాయమును అర్థించిరి. ఆచక్రవర్తి నర్మదను దాటివచ్చి ఆగంధర్వులను ఓడించెను. అతనిపేరిట నర్మదానదీతీరమున ఓంకారమాంధాత అను నగరము నిర్మింపబడెను. మాంధాతకుమారుడు ముచకుందుడు నర్మదాతీరముననే మాహిష్మతీనగరమును నిర్మించెను. కొంతకాలమునకు హైహయులు విజృంభించి ఈ ఇక్ష్వాకులను అణచివేసిరి. ఈహైహయుల రాజగు కార్తవీర్యార్జునుడు గొప్ప విజేత. బ్రాహ్మణుడును భార్గవుడునగు జమదగ్ని రేణుక అను ఇక్ష్వాకు కన్యను వివాహమాడెను. అశితుడను ఇక్ష్వాకు రాజు హైహయులదాడికి ఓర్వలేక దక్షిణా

పథమునందలి భార్గవుల ఆశ్రమములకు పారి
పోయి తల దాచుకొనెను. కార్తవీర్యార్జునుడు
జమదగ్నిని అవమానపరచెను. దీనికి ఫలిత
ముగ జమదగ్నిపుత్రుడు పరశురాముడు అర్జు
నుని చంపుటయు, అర్జునుని కుమారుడు జమ
దగ్నిని చంపుటయు, ఆమీఁద పరశురాముని
క్షాత్రరాహిత్యక్షత్రియసంహారమును, హైహ
యులు భార్గవులను సంహరించుటయు జరిగి
నవి. అసితునిపుత్రుడు సగరుడు భార్గవాశ్రమ
మున పుట్టి విదర్భరాజపుత్రికను పెండ్లాడి,
భార్గవులచే అయోధ్యలో అభిషిక్తుడయ్యెను.
కొంతకాలమునకు ఈఅయోధ్య నేలుచుండిన
సూర్యవంశపురాజులలో కల్మాషపాదుడు నిర్వీ
ర్యుడయ్యెను. అంతట పురోహితుడగు వశి
ష్ఠునివలన అతని భార్య గర్భము ధరించెను.
పండ్రెండు సంవత్సరములైనను ప్రసవింపక
పోవుటచే ప్రాణమువిసిగి రాణి రాతితో(అశ్మ)
గర్భము విచ్ఛిన్నము చేసుకొనెను. అందు
ఒక మొగశిశువు ఉండెను. అతనికి అశ్మకుడని
పేరు వచ్చెను. ఇతని కుమారుడు మూలి
కుడు. అశ్మకమూలక అను రెండు విభాగ
ములు దక్షిణాపథమునం దుండెడివని శాసన
ములు తెలుపుచున్నవి. పాణినీయవ్యాకర
ణమునందు అశ్మకులు దాక్షిణాత్యులుగ
పేర్కొనబడినారు. బౌద్ధుల పరమార్థజాతక
మున అశ్మకమూలకులకు మధ్య గోదావరి
ప్రవహించునని చెప్పబడినది. సుత్తనిపాత
మున అశ్మకకును, గోవిందసూత్రమున
మూలకకును ప్రతిష్ఠానపురము రాజధానిగ
పేర్కొనబడినది. ఇట్లు ప్రాచీనకాలమునుండియు
సూర్యవంశములకు దక్షిణాపథముతో సంబంధ
ముండెడిదని తెలియనగుచున్నది. సాతవాహ
నుల అనంతరము పరిపాలనచేసిన ఇక్ష్వాకు
వంశజులు బుద్ధుని సంతతివారమని చెప్పుకొని
నారు. వారిదక్షిణాపథఇక్ష్వాకురాజుల శాఖ
కావచ్చును. అమీఁదవచ్చిన శాలంకాయనులు
భగవచ్చిత్రరథస్వామిపాదానుధ్యాతులు. చిత్ర
రథుడు సూర్యుడు. ఇట్లు సాతవాహనులకు
పూర్వమును పరమునకూడ రాజులకు
సూర్యవంశముతోడను, సూర్యునితోడను
సంబంధముండెను. (౬) వేదకాలమునుండియు
తల్లులపేర్లను వ్యక్తులు తమపేర్లకు ముందు
చెప్పుకొనునాచారముండెను. ఈ పేర్లు
బ్రాహ్మణులైనచో వారు పెండ్లిచేసుకొను
కన్యల గోత్రముల పేర్లును, క్షత్రియులైనచో
వారి పురోహితుల గోత్రనామములును అగు
నని కొందరి యభిప్రాయము. సాతవాహన
రాజులలో కడపటివారు గౌతమీపుత్ర,
వాసిష్ఠీపుత్ర, మాఢరీపుత్ర అను పేర్లను తమ
నామములకు ముందు పెట్టుకొనిరి. వారి
తర్వాత ఆంధ్రకాలమునకు వచ్చిన చుటు,
ఇక్ష్వాకు, ఆభీరవంశజులును ఈమాతృనామో
పపదములను వాడిరి. గౌతమవాసిష్ఠమాఢరి
అనునవి మూడును వైదికగోత్రములే. వశి
ష్ఠుడు సూర్యవంశజులైన అయోధ్యానగరపు
ఇక్ష్వాకువంశజుల పురోహితుడు. భవిష్య
పురాణమున వాసిష్ఠులు సూర్యునిసంతతివారని
చెప్పబడినది. ఒకప్పుడు వసిష్ఠుడు దొరకక
పోగా విదేహరాజును, సూర్యవంశీయుడునగు
జనకుడు గౌతముడగు శతానందుని ఒకయజ్ఞ
మున పురోహితుని చేసుకొనెను. మాఠరు
డను ఋషిని ఇంద్రుడు సూర్యపూజలో పారి
పార్శ్వకునిగ నియోగించెనని భవిష్యపురాణ
మున కలదు. సాతవాహనులనాటికే సాతకర్ణి
బిరుదాంచితులైన చుటుకులజులు హారీతీ
పుత్రులు. హారీతుడు అంబరీషమహారాజు

ప్రోత్సాహము. ఇట్లు సాతవాహనరాజుల నాణెములపై గుర్తులు సూర్యవంశసంబంధములని తెలుపుచున్నవి. (10) ప్రాచీననాణెములమీద అనేక విధములగు గుర్తులు కనిపించుచున్నవి. వీనికి అర్థములున్నవి కాని ఇవి పిచ్చిగ వేయబడిన గుర్తులుకావు. కౌశాంబీలో దొరికిన వత్సరాజుల నాణెములమీద ధేనువు బొమ్మ ఉన్నది. సూర్యమిత్ర, భానుమిత్రులనాణెములమీద సూర్య చిహ్నము కలదు. సూర్యుల నాణెములమీద మయూరము లేక నెమలి బొమ్మ ఉన్నది. సాతవాహనరాజుల నాణెములు అక్కడక్కడ కొన్నికొన్ని దొరికినను చాలభాగము నాగర్జుని, చాందా, తర్హాల, గుడివాడ, నాగార్జునకొండలలో లభించినవి. వీనిపైన ఒకవైపున చైత్యము, ఓడ, గుర్రము, సింహము, ఆవరణములో ఒక వృషభము, కలవు. రెండవవైపున సాధారణముగ ఒకనిలువుగీతయు, దానిమధ్యగ ఒక అడ్డగీతయు, గీతల నాలుగు చివరలను నాలుగు సున్నలుకల ఉజ్జయినీచిహ్నము కలదు. మొదట సాతవాహననాణెములు ఉజ్జయిని ప్రాంతమున దొరుకుటవలన దీనికి పండితులు ఉజ్జయినీచిహ్నమని పేరుపెట్టిరి. చాలమంది పరిశోధకులు ఈచిహ్నము ప్రధానముగ సాతవాహనులదే అని చెప్పినారు. ఈచిహ్నము ఇతరవంశములవారి నాణెములమీదను కలదు. ఆంధ్రసాతవాహనులు సమ్రాట్టులని పురాణములు చెప్పుచున్నవి. అగుచో సమ్రాట్టుల చిహ్నమును ఉపయోగించినవారందరును వారికి సామంతులు కావలెను. ఉజ్జయినీచిహ్నము హిందూధర్మము నవలంబించిన మఘురిత్పుత్రులయొక్కయు, అయోధ్య నేలిన మూలదేవధనదేవసువత్రవిశాఖుపుత్రుల యొక్కయు, కౌశాంబినేలిన అగ్నిమిత్రబృహస్పతిమిత్రులయొక్కయు నాణెములపైన ఉన్నది. సహపానుడను క్షహరాటరాజును ఓడించి అతని నాణెములను పునర్ముద్రింపించిన గౌతమీపుత్రసాతకర్ణియు, క్షత్రపులను జయించి వారినాణెములవంటి నాణెములను వేయించిన యజ్ఞశ్రీయునుకూడ ఈచిహ్నమునే వాడియుండుట ఇది సాతవాహనుల ప్రత్యేకచిహ్నము అను ఊహను బలపరచుచున్నది. ప్రాచీనఈజిప్టులో ఒక సున్న చుట్టి దానిమధ్య ఒక చుక్కపెట్టి దానిని సూర్యునికి చిహ్నముగ వాడిరి. చైనాలోను ఈ యాచారముండెను. ఎస్సిరియాలో + గుర్తు సూర్యచిహ్నము. స్వస్తిక సూర్యచిహ్నము. చక్రము సూర్యచిహ్నము. చుక్కగల సున్న సూర్యచిహ్నము. ఉజ్జయినీ చిహ్నము ఈ స్వస్తిక చక్రములయొక్క కలయిక. ఇది సూర్యోద్యోతకము. ధేనువు బొమ్మగల నాణెము శిశునాగవంశమును, నెమలి బొమ్మ మౌర్యులను, మయూరము మౌర్యులను స్ఫురింపచేసినచో ఉజ్జయినీచిహ్నము సూర్యుని స్ఫురింపచేయవలెనుకదా! దానిని ఉపయోగించిన సాతవాహనులు సూర్యసంబంధులు కావలెనుకదా! అప్పుడు సాతవాహనశబ్దమునకు సూర్యుడు అని అర్థము చెప్పవచ్చును కదా!

సాతవాహన, శాలివాహన, సాతకర్ణి, శాతకర్ణి శబ్దములకు మరియొక విధమునకూడ అర్థములను చెప్పవచ్చును. 'శాత' అనగా పదునైన, అందమైన అని అర్థమున్నది. 'కర్ణ' అనుధాతువుకు గుచ్చుట, చిల్లివేయుట అని అర్థము. 'కర్ణిన్' అనగా పొడుగైన చెవులు కలవాడు, చుక్కానిపట్టువాడు. 'సాత' అనగా

ఇయ్యబడిన, ధ్వంసముచేయబడిన అని యర్థము. 'అత' అనుధాతువునకు 'గమన' మని అర్థము. సాత లేక శాతవాహన అనునది మూలరూపముగఁ జో చురుకుగా పోవు, లేక అంపబడిన, లేక ఇయ్యబడిన వాహనములు కలవాడు అని అర్థ మేర్పడును. శాతకర్ణిశబ్దమునకు పదునైనబాణములు కలవాడు అనియు, సాతకర్ణి శబ్దమునకు చురుకుగాపోవు బాణములు కలవాడనియు అర్థములు ఏర్పడును. శాసనములలోను నాణెములమీదను సాతవాహన, సాతకర్ణి అను రూపములు కలవు. వాఙ్మయమున శాతవాహన, శాతకర్ణి అను రూపములు కనిపించుచున్నవి. శాల, సాల అనునవి ఒక చెట్టు పేర్లు; శాలి, సాలి అనునది ఒక ధాన్యవిశేషము.

పై అంశములనన్నిటిని విమర్శించి చూడగ సాతవాహనులవంశనామము ఆపేరుగల రాజు నుండి వచ్చినదనియు, సాతకర్ణి అను పేరును వారి గోత్రమునుండి వచ్చినదనియు ఊహించుట సమంజసముగ నుండునని తోచుచున్నది.

## ౭. వంశక్రమము.

సాతవాహనరాజుల వంశక్రమమును నిర్ణయించుట మిక్కిలి కష్టసాధ్యము. శాసనముల నుండియు, నాణెములనుండియు, వాఙ్మయము నుండియు తెలియుచున్న అంశములను క్రోడీకరించి వానిని నవిమర్శముగ సమన్వయింప వలసి యున్నది.

ఈసందర్భమున పురాణములు ప్రధానముగ నాధారము. అందును [113]మత్స్య వాయు [114]విష్ణు [115]భాగవత [116]బ్రహ్మాండ [117]పురాణములు ముఖ్యములు. వీనియందు ఆంధ్ర (సాతవాహన) రాజుల పట్టికలు కలవు. రాజులపేర్లలోను, క్రమములోను ఈపురాణములలో వ్యత్యాసము లున్నవి. కొన్నిపట్టులలో మూలములకు అర్థము కుదురుట లేదు. రాజులలో ఒకరొకరికిగల సంబంధము చాల వరకు చెప్పబడలేదు. రాజుల మొత్తముసంఖ్యనుగూర్చియు, వారి పరిపాలనాకాలమునుగూర్చియు వ్యత్యాసము లున్నవి. మత్స్యపురాణము 19రాజు లుండిరని చెప్పినను 29 మంది పేర్లు నొసగును. వాయుపురాణము 30మంది రాజులుండిరని చెప్పియు 15 మందినే పేర్కొనును. బ్రహ్మాండవిష్ణుభాగవతములును 30మందిరాజులని చెప్పియు 17, 24, 23 మందినే పేర్కొనును.[118] రాజుల మొత్తముసంఖ్యనుగూర్చి కనిపించు వ్యత్యాసము నాధారముచేసికొని కొందరు తక్కువమంది రాజులను పేర్కొను వాయుపురాణము ఆంధ్రసాతవాహనుల మూలశాఖలోని రాజులను పేర్కొనుననియు, ఎక్కువమంది రాజులను పేర్కొను ఇతరపురాణములు ఈమూలశాఖలోను, దాని ఉపశాఖలన్నిటిలోను గల రాజుల నందరిని పేర్కొనుననియు, అందువలన సాతవాహన

113. 273, 1—17. 114. 99, 348—358; 115 IV. 24, 12—13.
116. VII. 1, 22—58. 117. III. 74, 160—170.
118. అనుబంధములోని పౌరాణిక భాగములను చూచునది.

వంశమున వాస్తవముగ 19 రాజులే ఉండి సుమారు 296 సంవత్సరములు పరిపాలించిరనియు ఒక వాదము నుపపాదించిరి. మరియును భండార్కరు[119] సాతవాహనులలో ప్రతిష్ఠానమునందొకటియు, ధాన్యకటకమునందొకటియు రెండుశాఖ లుండెననియు, వనవాసి నేలిన చుటుసాతకర్ణుల శాఖ మరియొకటి అనియు ఊహించెను. ఇతరులు కొందరు కుంతలసాతకర్ణి పేరునుబట్టి సాతవాహనులలో కుంతలశాఖ మరియొకటి ఉండెనని అనిరి. ఇది నిజమేయగుచో మహేంద్రచకోర (120) పాటలకపురీకసేనుల పేర్లనుబట్టి మరి నాలుగు శాఖ లుండెడివనియు చెప్పవచ్చును. కొల్హాపురిమున దొరికిన నాణెములు గౌతమీపుత్ర, వాసిష్ఠీపుత్ర, మాఢరీపుత్రఅను మాతృనామోపసర్గలుగల మువ్వురురాజులను తెల్పుచున్నవి. సాతవాహనుల కట్టి ఉపసర్గ లుండెడివి. అందువలన పైమువ్వురును కొల్హాపుర శాఖవారని చెప్పవచ్చును. అదియునుగాక వాసిష్ఠీపుత్రచతరపణసాతకర్ణి మాఢరీపుత్రశకసేనుడు, సివమకసదుడు అనువారు శాసనములనుండియు, కుంభసాతకర్ణి, కర్ణసాతకర్ణి, శకసాతకర్ణి, శ్రీకృష్ణుడు, శ్రీరుద్రుడు అనువారు నాణెములనుండియు తెలియనగుచున్నారు. వీరందరును సాతవాహనవంశీయులుగనే కనిపించుచున్నారు. పౌరాణికపట్టికలలో వీరిపేర్లు లేవు. ఆంధ్రులు రాజ్యము చేయుచుండగనే వారివంశములు కొన్ని పరిపాలనచేయునని పురాణములు చెప్పుచున్నవి. [121] అందువలన పైరాజులు మరికొన్నిశాఖలకు చెందినవారని చెప్పవచ్చును. భండార్కరు సాతవాహనులకు రెండుకేంద్రములుండెడివనియు, అందు ధాన్యకటకము ప్రధానకేంద్రమై సమ్రాట్పాలకు లచట నుండి పరిపాలించుచుండిరనియు, యువరాజులు ప్రతిష్ఠానమున నుండుచు వచ్చిరనియు విశ్వసించి పైఠానశాఖయు, ధాన్యకటకశాఖయు నుండెనని ఊహించెను. ఇతని విశ్వాసమునకు గౌతమీపుత్రసాతకర్ణి యొక్క "ధనకటసామి" అను బిరుదము మూలము. కాని ఇటీవలివారు ఈబిరుదమును "బెనకటసామి" అని సవరించినారు. దానితో భండార్కరు వాదమంతయు కూలిపోయినది.[122] కథాసరిత్సాగరము [123] కుంతలసాతకర్ణికి ఉజ్జయినీపాలకులతో సంబంధముండెననియు, ఉత్తరాపథరాజు లనేకు లతనికి సామంతులనియు తెలుపుచున్నది. దీనినిబట్టి అతండు సమ్రాట్టనియు కుంతలములోని నాసిక శాఖీయుడు కాడనియు స్పష్టమగుచున్నది. చుటునాగవంశీయులు అపరాంతవైజయంతుల నేలినమాట నిజమే. కాని వారిలో మొదటిరాజు సాతవాహనవంశము నశించిన పిమ్మటనే రాజ్యమేలెను. అతని పేరు ఏపురాణమునను లేదు. కొల్హాపురనాణెములను వేయించిన రాజుల మాతృనామోపసర్గ లెట్లున్నను శివలకుర, విలివాయకుర అనువారి పేర్లకును సాతవాహనరాజుల పేర్లకును సామ్యమే లేదు. వీరు సాతవాహనవంశజులనుటకు నిదర్శనమున

---

119. E H D. p. 57.
120. ఈ పేర్లుగల ప్రతిమలు బాలశ్రీ నాసికాశాసనమున పేర్కొనబడినవి.
121. ఆంధ్రాణాం సంస్థితే పంచ తేషామున్యన్వయో నృపాః॥
122. Cf. K. Gopalachari—Early Hist. Andhra. pp. 63—66.
123. చూ. అనుబంధము.

ప్రమాణమేదియు లేదు. పురాణములలో(124) శ్రీపర్వతీయులు ఆంధ్రులనియు, ఆంధ్రభృత్యులనియు పేర్కొనబడినారు. ఈ శ్రీపర్వతీయులు ఇక్ష్వాకువంశీయులని పండితుల అభిప్రాయము. ఈవంశీయులలో ఇద్దరు చాంతమూలులు, ఒక పురుషదత్తుడు నుండెరి. ఈ మూడుపేర్లలో ఒకటియైనను పౌరాణికపట్టికలలో కనిపింపదు. ఈకారణములనుబట్టి సాతవాహనులలో ఒకవేళ కొన్నిశాఖ లుండినయే యుండినను, వాని రాజులపేర్లు పురాణములలో పేర్కొనబడలేదని స్పష్టమగుచున్నది. అందువలన భండార్కరుప్రభృతుల ఊహలు సరియైనవి కావనియు, పౌరాణికపట్టికలు ఒక కుదురుకు చెందిన రాజుల పేర్లనే పేర్కొనుననియు నిర్ణయింపవచ్చును. పురాణములలో గల పరస్పరవ్యత్యాసమున కింకొకవిధమున సమాధానము చెప్పవచ్చును. వానిలో కొన్నిటిలో "ప్రాధాన్యతః ప్రవక్ష్యామి"(125) అనియు, "భవిష్యే కథితాన్ పురా" అనియు ఉన్నది. దీనినిబట్టి మొదట భవిష్యపురాణమున సమగ్రముగ నీయబడిన పట్టికలలో ముఖ్యులని తోచినవారిపేర్లను మాత్రము ఇతరపురాణములలో కొన్ని పేర్కొనినవిఅని తెలియనగును. వాస్తవముగ నెందరు రాజులను పేర్కొనినను ప్రతిపురాణమును మొత్తము 30 మంది రాజులని చెప్పుచున్నది. ఇదియును పైయూహను బలపరచుచున్నది.

ఈపురాణముల ప్రాముఖ్యమునుగూర్చియు అభిప్రాయభేదము కలదు. వాయుపురాణము ప్రాచీనతమమనియు, దానికి పిమ్మట మత్స్యపురాణమును, ఆమీద విష్ణుపురాణమును, కడపట భాగవతమునని భండార్కరు (126) ఒకతారతమ్యము నేర్పరచెను. వాయుబ్రహ్మాండము లొకవిభాగమనియు, మత్స్యవిష్ణుభాగవతము లింకొకవిభాగమనియు, మత్స్యపురాణములోని పట్టిక సమగ్రమే కాని లోపభూయిష్టమనియు, వాయుబ్రహ్మాండపురాణములు ముఖ్యులైన రాజులనే పేర్కొనుననియు, విష్ణుభాగవతపురాణములు ఈపట్టికలను సంగ్రహించుటకు ఉపయోగపడుననియు జయస్వాల్ (127) వాదము. పురాణములనుగురించి ప్రశంసనీయముగు పరిశోధన చేసిన పార్జిటరు(128) మత్స్యవాయుబ్రహ్మాండపురాణములకు సన్నిహితసంబంధ మున్నదనియు, అవిమూడును భవిష్యపురాణమునుండి యేర్పడినవనియు, విష్ణుభాగవతపురాణము లొకతీరున నున్నవనియు, అవిపైవానికంటె అర్వాచీనములనియు, మత్స్యపురాణమునే ప్రధానాధారముగ తీసికొని దానిలోని లోపముల నితరపురాణముల సహాయమున సంస్కరింపవలెననియు వ్రాసినాడు.

పురాణములలోని మూలములలో ఎన్నియో తప్పులును, అసంగతాంశములును కలవు.(129) పార్జిటరు సంకలనము చేసిన మూలమునందు ఒకపాఠమున ఒకరాజు 12 సం|| ఏలునని యున్నది. రెండవపాఠమునందతడే పేరు న్వాతి అనియు, ఇతడు 18 సం|| ఏలుననియు ఉన్నది. ఇతరపురాణములలో

124. శ్రీపర్వతీయాంధ్రభృత్యా నామానః. Ftc.

125. J B O R s. XVI. pp. 263—265.

126. E H D. p. 51.

127. J B O R S. XVI. pp. 263—265, 173.

128. Dyn. Kali. Age. Intro. p. V.

129. చూ. అనుబంధము.

ఈపేరు లేదు. అట్లే పూర్ణోత్సంగునికి పిమ్మట పార్గిటరు పట్టికలో స్కందస్తంభి అనురాజు కలడు. ఈపేరు మరియేపురాణమునను లేదు. ఇద్దరు ముగ్గురురాజులు నుండిరా అని సందేహము కలుగుచున్నది. అట్లే ఒకపాఠమున ప్రకీంద్రసేనుని పేరుమాత్రమున్నది, పిమ్మట సౌమ్యుని పేరును ఉన్నవి. రెండవపాఠమున పురీకసేనుడు 21 సంవత్సరములని మాత్రమున్నది. ఇందు సౌమ్యుని పేరు లేదు. ఇట్టి రాజు ఉండెనా అని అనుమానము కలుగుచున్నది. ప్రకీంద్రసేనునితర్వాత వాయు బ్రహ్మాండపురాణములు ఒక సాతకర్ణిని పేర్కొనుచున్నవి. అనేకస్థలములు మత్స్యపురాణములో సుందరసాతకర్ణి పేరు కలదు. ఇదియే సరియైనపేరువలె నున్నది. చకోరస్వలోమావి శివశ్రీశివస్కందుల పేర్లు వాయుబ్రహ్మాండ పురాణములలో లేవు. ఇతరాధారములు వీరిని పేర్కొనుటవలన ఈపేర్లుగల రాజులు పరిపాలించిరని విశ్వసింపవచ్చును. వాయు పురాణముయొక్క ఒక ప్రతి నాధారము చేసుకొని 24వరాజుకు పిమ్మట పార్గిటరు ఒక సాతకర్ణిని తనపట్టికలో చేర్చినాడు. దీనిని నాణెములు బలపరచుచున్నవి. వాయుపురాణమున హాలునికి పిమ్మట ఐదుగురు సప్తకరాజులుందురని యున్నది. ఇందు సప్తక అను పదము పొరపాటనియు, సాతక లేక శాతక అని యుండవలెననియు తోచుచున్నది. కాని హాలునికి పిమ్మట సాతివాహననామకులగు రాజులెవరును లేరు. మత్స్యపురాణపట్టికలలో హాలునికి పూర్వము స్వాతి. స్వాతికర్ణ అను పేర్లుగల రాజులు ఐదుగురు కలరు. వాయుపురాణములోని పంచసప్తకరాజులును వీరే అయియుందురు. ఆపురాణము వీరి నిట్లు సాముదాయికముగ చెప్పుటకు వీరు అంత ముఖ్యులు కాకుండుటయు, ఆపురాణము ప్రధానముగు రాజులనే చెప్పుటయు కారణము కావచ్చును.

అన్నిపురాణములును మొదటిముగ్గురు రాజులను ఒకేవిధముగ పేర్కొనుచున్నవి. నాల్గవరాజు భాగవతమున పౌర్ణమాసుడని చెప్పబడినాడు. 6వ, 7వ రాజులనుగురించి కొంత వ్యత్యాసము కలదు. చాలపురాణములు లంబోదరుని, ఆపీలకుని పేర్కొనుచున్నవి. వాయుపురాణమునమాత్రము ఆపాదబద్ధుడు రెండవసాతకర్ణి కుమారుడని చెప్పబడెను. ఆపాదబద్ధ అనుపేరు తప్పుపాఠమని తోచుచున్నది. విష్ణుభాగవతపురాణములలో లంబోదరుడును, అతనిపుత్రుడు చిలక, చివిలక అనువారును పేర్కొనబడినారు. మత్స్యపురాణము ననుసరించి లంబోదరుని కుమారుడు ఆపీలకుడని నిశ్చయింపవచ్చును. భాగవతము రెండవసాతకర్ణిని వదలివేసి లంబోదరుని పౌర్ణమాసుని కుమారుని చేయుచున్నది. కాని ఇతరపురాణములలో లంబోదరునికి ముందు రెండవసాతకర్ణి పేరు కలదు. అందువలన భాగవత మీసందర్భమున విశ్వాసనీయము కాదు. మత్స్యవిష్ణుభాగవతములు మేఘస్వాతిని పేర్కొనిన స్థలమున వాయుపురాణము నేమికృష్ణుని పేర్కొనుచున్నది. ఈమేఘస్వాతిది ఒక నాణెమును కలదు.[130] అందువలన నిదియే సరియైనపేరని నిర్ణయింపవచ్చును. మత్స్యపురాణపట్టికలోని 13వరాజగు స్వాతివర్ణునికి బదులు ఇతరపురాణములు పటుమాన్, అటమాన, పులోమావి అనునతనిని పేర్కొనుచున్నవి. ఈపేర్లలో పులోమావి

130. చూ. అనుబంధము—సాతివాహన నాణెములు.

అనునామమే సరియైనది. ఒకమత్స్యపురాణ ప్రతిలో "ఆంధ్రులు పౌలోములు" అని యున్నది.[131] తర్వాతరాజు రిక్తవర్ణ, అరిష్ట కర్మ, అనిష్టకర్మ అను పేర్లతో కనిపించు చున్నాడు. వీనిలో శుద్ధరూప మేదియో గోచరించుటలేదు. హాలుని పేరు వాఙ్మయ మునకూడ అట్లే ఉన్నది. హాలాహాలుడను రూపాంతరము లేదు. 16వరాజు పేరు మండ లక, మంతలక, పట్టలక, సలలక, తలక అను రూపములలో కనిపించుచున్నది. పాటలక అనునది శుద్ధరూపమని తోచుచున్నది. 17వ రాజు పురీంద్రసేన, పురిషభేను, పుళిందసేన, పురీకసేన అని పేర్కొనబడినాడు. పుళిందసేను డనగా పుళిందులకు రాజని అర్థము చెప్ప వచ్చును. పురీకసేనుడనగా పురీకఅను నగరము నేలినవాడని చెప్పవచ్చును. శుంగులకాల మునందీపురీకనగరము సుప్రసిద్ధముగ నుండెను.[132] అందువలన పాటలక, పురీకసేన అను పాఠములు గ్రాహ్యములు. 21వరాజు శివ స్వాతి, శివస్వామి అని రెండువిధముల పేర్కొన బడినాడు. ఇందలి స్వాతిశబ్దము సాతి లేక సాతకర్ణికి పర్యాయపదమువలె నున్నది. అప్పుడీపేరు శివసాతకర్ణి అగును. తర్వాత వారిలో నొక శివశ్రీసాతకర్ణి కలడు. సుప్ర సిద్ధుడగు గౌతమీపుత్రసాతకర్ణిని విష్ణుభాగ వతపురాణములు గోమతీపుత్రుడని పేర్కొను చున్నవి. అట్లే అతని పుత్రుడగు పులోమావి అలిమాన్ అనియు, పులిమాన్ అనియు పేర్కొనబడినాడు. ఇతరాధారములలో వీరిద్ద రును గౌతమీపుత్ర, పులోమావి అనుపేర్లతో ప్రశంసింపబడినారు. అవియే సరియైన పేర్లు. విష్ణుపురాణమున పులోమావికి పిమ్మట నొక శాంతకర్ణి పేర్కొనబడినాడు. వాయుపురా ణపు ఒకప్రతిలో ఇదేస్థలమునందొక సాత కర్ణి కలడని పార్గిటరు సూచన. ఈశాంతకర్ణి సాతకర్ణి లొక్కరేయని ఊహింపవచ్చును. విష్ణుపురాణమునందలి ద్వియజ్ఞ అనుపేరు యజ్ఞశ్రీ, విజయ అను రెండుపేర్ల కలయికవలె నున్నది.

పౌరాణికపట్టికలలో ఈమహాంధ్రరాజుల పర స్పరసంబంధము ఈక్రిందవిధమున నున్నది.




పురాణములలో పేర్కొనబడిన ఆంధ్ర రాజుల నీక్రిందవిధమున వర్గీకరింపవచ్చును.

131. J B O R S. XXI. p. 281; III p. 248.
132. Raychaudhari—Pol. Hist. Anc. Ind. p. 214.

# పౌరాణిక పట్టికలు.



| | మత్స్య పురాణము.† | | పార్గిటరు పాఠము.‡ | | వాయుపురాణము.* | | బ్రహ్మాండపురాణము§ | | విష్ణుపురాణము♦ | భాగవతము.❡ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | శిశుక | 23 | సిముక | 23 | సి-ఘక | 32 | సింధుక | 23 | బలిపుచ్ఛక | వృషల |
| 2. | | | కృష్ణ | 18_10 | — | 10 | కృష్ణ | 10 | కృష్ణ | కృష్ణ |
| 3. | శ్రీమల్లకర్ణ | 10 | శ్రీశాతకర్ణి | 10 | శ్రీశాతకర్ణి | | శ్రీశాంతకర్ణి | - | శాంతికర్ణ | శ్రీశాంతకర్ణ |
| 4. | పూర్ణోత్సంగ | 18 | పూర్ణోత్సంగ | 18 | — | | — | | పూర్ణోత్సంగ | పౌర్ణమాస |
| 5. | శాంతకర్ణి | 56 | శాతకర్ణి | 56 | సాతకర్ణి | 56 | శాంతకర్ణి | 56 | శాతకర్ణి | — |
| 6. | లంబోదర | 18 | లంబోదర | 18 | ఆపాదబద్ధ | 10 | — | | లంబోదర | లంబోదర |
| 7. | ఆపీతక | 12 | ఆపీలక | 12 | — | | ఆపోలవ | 12 | పిలక | చివిలక |
| 8. | మేఘస్వాతి | 18 | మేఘస్వాతి | 18 | — | | — | | మేఘస్వాతి | మేఘస్వాతి |
| 9. | స్వాతి | 18 | స్వాతి | 18 | — | | | | | |
| 10. | స్కందస్వాతి | 7 | స్కందస్వాతి | 7 | — | | | | | |
| 11. | మృగేంద్రస్వాతికర్ణ | 3 | మృగేంద్రస్వాతికర్ణ | 4 | — | | | | | |
| 12. | కుంతలస్వాతికర్ణ | 8 | కుంతలస్వాతికర్ణ | 8 | — | | | | | |
| 13. | స్వాతివర్ణ | 1 | స్వాతివర్ణ | 1 | — | | | | | |
| | ... | | పులోమావి | 36_24 | — | | పటుమాన్ | 24 | పటుమాన్ | అటమాన |
| 14. | రిక్తవర్ణ | 25 | అరిష్టకర్ణ | 25 | నేమికృష్ణ | 26 | అనిష్టకర్మ | 25 | అరిష్టకర్మ | అనిష్టకర్మ |
| 15. | హాల | 5 | హాల | 5 | హాల | 1 | హాల | 1 | హాలాహల | హాలేయః |
| 16. | మండులక | 5 | పత్తలక | 3 | — | | పత్తలక | 5 | పలలక | తలక |
| 17. | పురీంద్రసేన | - | పురీంద్రసేన | 21 | పృతికషేణ | 21 | పురీషభీరు | 21 | పులింద సేన | పురీషభీరు |
| 18. | సౌమ్య | - | ... | | ... | | ... | | ... | — |
| 19. | సుందరశాంతికర్ణ | 1 | సుందరశాతకర్ణి | 1 | సాతకర్ణి | 1 | శతకర్ణి | 1 | సుందర | సునందన |
| 2 . | చకోరస్వాతికర్ణ | 1/2 | చకోర | 1/2 | — | | — | | శాతకర్ణి | చకోర |
| 21. | శివస్వాతి | 28 | శివస్వాతి | 28 | శివస్వామి | 28 | శివస్వాతి | 28 | శివస్వాతి | శివస్వాతి |

| | మత్స్య పురాణము. | | పార్జిటరు పాఠము. | | వాయు పురాణము. | | బ్రహ్మాండ పురాణము. | | విష్ణుపురాణము | భాగవతము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 22. | గౌతమీపుత్ర | 21 | గౌతమీపుత్ర | 21 | గౌతమీపుత్ర | 21 | గౌతమీపుత్ర | 21 | గోమతీపుత్ర | గోమతీపుత్ర |
| 23. | పులోమా | 28 | పులోమావి | 28 | — | | — | | అరిమాన్ | పురీమాన్ |
| 24. | ... | | శాతకర్ణి | 19 | — | | — | | శాంతకర్ణి | — |
| 25. | శివశ్రీ | 7 | శివశ్రీ | 7 | — | | — | | శివశ్రీ | మేదశిరా |
| 26. | శివస్కంధ | - | శివస్కంధ | | — | | — | | శివస్కంధ | శివస్కంద |
| 27. | యజ్ఞశ్రీశాంతికర్ణి | 29 | యజ్ఞశ్రీ | 29_19 | యజ్ఞశ్రీ | 19 | యజ్ఞశ్రీ | 19 | యజ్ఞశ్రీ | యజ్ఞశ్రీ |
| 28. | విజయ | 6 | విజయ | 6 | విజయ | 6 | విజయ | 6 | ద్విజయజ్ఞ | విజయ |
| 29. | చండశ్రీశాంతికర్ణ | 10 | చండశ్రీ | 10_3 | చండశ్రీసాతకర్ణి | 3 | చండశ్రీసాతకర్ణి | 3 | చంద్రశ్రీ | చంద్రవిజ్ఞ |
| 30. | పులోమా | 7 | పులోమావి | 7 | పులోమా | 7 | పులోమావి | 7 | పులోమా | సలోమధి |

† శ్రీవేంకటేశ్వర ప్రెస్ ప్రతి.

‡ Dynasties of the Kali Age. అను పుస్తకమునుండి.

* శ్రీవేంకటేశ్వర ప్రెస్ ప్రతి.

§ డిటో.

॥ అం. ౪_అధ్యా 23, శ్లో. 43_50.

♦ టి. ఆర్. కృష్ణాచార్యులుగారు ప్రకటించిన ప్రతి. స్కంధ 12_అధ్యా 1. శ్లో 22_29. ఇవికాక "కలియుగ రాజ వృత్తాంతము" మునను (M. Krishnamachariar—History of classical Sanskrit Literature Intro. pp. LIV—LVI) ఆంధ్రరాజవంశ వర్ణన కలదు.

సాతవాహనుల వంశక్రమమును నిర్ణయించుట కుపకరించెడి ఆధారములలో పురాణములకుపిమ్మట చెప్పదగినవి శాసనములు. సాతవాహనశాసనములు దానశాసనములు. వీనిలో చాలభాగము నాటి రాజుల పేర్లను మాత్రము తెలుపునుగాని ఉత్తరసాతవాహన యుగమునందలి శాసనములవలె వంశక్రమమును తెలుపవు. అయినను వీనిలో కొన్ని మాత్రము ముఖ్యములైనవి. నానే ఘాట్ గుహలలో నొకదానియందుగల విగ్రహముల పూర్వాపర్యమునుబట్టి[133] ఆయా వ్యక్తుల పరస్పరసంబంధ మీక్రిందివిధమున తెలియనగుచున్నది—




పై సిముకసాతకర్ణులు పౌరాణికపట్టికలలోని మొదటి, మూడవ రాజులు అగుదురు. పురాణములలో సిముకునికి పిమ్మట రాజయ్యెనని చెప్పబడిన అతని తమ్ముడగు కృష్ణుని విగ్రహము నానేఘాట్ గుహలో లేదు. పై సాతకర్ణికి పిమ్మట నెవరు రాజ్యమునకు వచ్చిరో నిశ్చయముగ తెలియదు. నాగానిక నానేఘాట్ శాసనము[134] ఆకాలమున నామె పుత్రుడు వేదిశ్రీ రాజుగనుండగ నామె రక్షకురాలుగనుండి రాజ్యతంత్రమును నడుపుచుండెనా అను సందేహమును కలిగించుచున్నది. పురాణములు సాతకర్ణితర్వాతను పూర్ణోత్సంగుని రాజుగ పేర్కొనుచున్నవి. ఈశబ్దము బిరుదమువలె నున్నది. వేదిశ్రీ పెద్దవాడై పరిపాలించెనా లేదా, పరిపాలించినచో పూర్ణోత్సంగ అనునది అతని బిరుదమా, ఒకవేళ వేదిశ్రీ బాలుడుగనే మరణించినచో సాతకర్ణి ఇతరపుత్రు లేమైరి అను ప్రశ్నలు ఈసందర్భమున బయల్వెడలుచున్నవి. వీనికి ఎట్టిసమాధానమును చెప్పుటకు వీలు లేదు.

గౌతమీ బాలశ్రీ నాసికశాసనము నుండి[135] ఈక్రిందిసంబంధము తెలియనగుచున్నది—




కన్హేరీశాసనములలో నొకటి (136) వాసిష్ఠీపుత్రసాతకర్ణిని, మహాక్షత్రప రుద్రుని కుమార్తెయగు అతనిరాణిని పేర్కొనుచున్నది.

పైవానిగాక శాసనములు ఈక్రిందిరాజులనుకూడ పేర్కొనుచున్నవి:—

సాతకర్ణి (సాంచీశాసనము)[137]
వాసిష్ఠీపుత్ర చతరపణ (నానేఘాట్)[138]
మాఢరీపుత్ర స్వామి శకసేనుడు (కన్హేరి)[139]
వాసిష్ఠీపుత్ర శ్రీచండసాతి (కొడవలి)[140]

133. Rapson—CAC. Intro. p. V. 134. ASWI vol. V. p. 86.
135. E. I. VIII Nasik Inscriptions no. 2. 136. ASWI. vol. V. p. 78.
137. E. I. II p. 88. 138. E. I. X Luders List. no. 1120.
139. Idid no. 1001. 140. E. I. XVIII. pp. 316—19.

గౌతమీపుత్ర శ్రీయజ్ఞ సాతకర్ణి (నాసిక,[131] కన్హేరీ,[142] చిన్నగంజాం)[143]
శ్రీపులోమావి (మ్యాకదోని)[144]
శివమక సదము (అమరావతి)[145]

వీరిలో సాతకర్ణి పౌరాణికపట్టికలలోని రెండవసాతకర్ణి అగును. యజ్ఞశ్రీ చండసతి పులోమావులు మత్స్యపురాణపట్టికలలోని 27 వ, 29వ, 30వ రాజులగుదురు. మిగిలిన నలుగురిపేర్లును పౌరాణికపట్టికలలోని పేర్లకు సరియగుట లేదు.

నాణెములును కొందరురాజులను పేర్కొను చున్నవి. వీనిలో 'సిరిసాత' అను పేరుగలవి బహుప్రాచీనములు.[146] ఈ 'సిరిసాత' అను పేరు శ్రీసాతకర్ణి కావచ్చును. ఈ సాతకర్ణి పౌరాణికపట్టికలలోని మూడవరాజని ఎల్లరును అంగీకరించినారు. స్థలనిర్దేశము తెలియక పశ్చిమఇండియాలో దొరికినవి అని చెప్పబడిన కొన్ని నాణెము లున్నవి.[147] వానిమీద 'సిరిసాతకణి' అను పేరు కలదు. రాప్సను ఈనాణెములు ఎవరివో నిశ్చితముగ చెప్పజాలక ఇవి గౌతమీపుత్రునివి కాని, అతని పూర్వులలో నెవరిదైనను కాని కావచ్చునని ఊహించెను. నేటి సాంచీవద్దగల విదిశలో తనకు ఇట్టి నాణెము లెన్నియో దొరికెనని కన్నింగ్‌హాం వ్రాసినాడు. ఈవిదిశ వద్దనున్న సాంచిలో రెండవసాతకర్ణి శాసన మున్నది. ఈనాణెములును సాతకర్ణిని పేర్కొను చున్నవి. వీనిమీది అక్షరములును ప్రాచీనములు. ఈకారణములనుబట్టి ఈ 'సిరిసాతకణి' పౌరాణికపట్టికలలోని రెండవసాతకర్ణి అని నిర్ణయింపవచ్చును. నేటి మధ్యరాష్ట్రములలోని చత్తీస్‌ఘర్ జిల్లాలో[148] ఆపిలకుని నాణెమొకటి దొరికినది. ఇతడు మత్స్యపురాణ పట్టికలోని ఏడవరాజగును. ఆంధ్రదేశమున 'సకసదస' అను పేరుగల నాణెము దొరికినది.[149] ఈతనిని 'సకసదస' అని సంస్కరించి బ్రహ్మాండపురాణములలోని 'మేఘస్వాతి' అని నిర్ణయింపనగును. గౌతమీపుత్ర వాసిష్ఠీపుత్ర పులోమావులనాణెము లనేకము లున్నవి. ఆంధ్రదేశమున వాసిష్ఠీపుత్ర శివశ్రీ సాతకర్ణి[150], వాసిష్ఠీపుత్ర చండసతి[151] అనురాజులనాణెములు లభించినవి. వీరిద్దరును పౌరాణికపట్టికలలోని 25 వ, 29వ రాజు లగుదురు. ఇటీవల తర్లహేలా అనుచోట దొరికిన నాణెములలో[152] కొన్ని శ్రీస్కందసాతకర్ణి, శ్రీసాతకర్ణి అను వారివి. వీరిద్దరిలో శ్రీస్కందుడు పురాణములలోని శివస్కందుడును, శ్రీసాతకర్ణి పార్జిటరుపట్టికలో 24a. గ పరిగణింపబడిన సాతకర్ణి అను రాజును అగుదురు. వీరు గాక కుంభసాతకర్ణి, కర్ణసాతకర్ణి, శకసాతకర్ణి, శ్రీరుద్ర, శ్రీకృష్ణ అను రాజులను నాణెములు పేర్కొనుచున్నవి. కాని వీరి శాసనములు లేవు. వీరి పేర్లు పౌరాణికపట్టికలలోని పేర్లకు సరిపోవు.

'సాతవాహన' అను రాజుని పేరుగల నాణెములు[153] దొరికినవనియు, అక్షర

141. E. I. VIII Nasik ins no. 24. 142. ASWI. vol. V. p. 79.
143. E. I. I. pp. 95—96. 144. Ibid XIV. pp. 153—155.
145. ASSI. vol. I. ch. 12. p. 61.
146. చూ. అనుబంధము – సాతవాహన నాణెములు.
147. Ibid. 148 Ibid. 149. Ibid, 150. Ibid. 151. Ibid.
152. J. N. S. I. vol II. pp. 83—94.
153. చూ. అనుబంధము – సాతవాహన నాణెములు.

స్వభావమునుబట్టి, యీరాజు సిముకునికి దగ్గరగ నుండియుండవలెననియు ఇదివరలో చెప్పియుంటిమి. సాతవాహనవంశక్రమములో సిముకునినుండి ఆరుతరములు నిశ్చితముగ తెలియనగుచున్నవి. ఆమధ్య ఈ సాతవాహనుడను రాజుకు తావు లేదు. కొందరు ఈరాజు మొదటి సాతకర్ణి పుత్రుడగు కుమారసాతవాహనుడు కావచ్చునని సూచించినారు. కాని ఆకుమారసాతవాహనుడు పెద్దవాడై సాతవాహనుడనుపేర స్వాతంత్రముగ రాజ్యము చేసెననుటకు ఆధారము లేదు. అందువలన ఈసాతవాహనుని సిముకునికి పూర్వుడుగ, మూలపురుషునిగ పరిగణింపవలెను.

గౌతమీపుత్రసాతకర్ణికిని యజ్ఞశ్రీసాతకర్ణికిని యగు శివస్కందునికిని నడుమగల వంశక్రమము నిశ్చితముగ లేదు. శాసనముల నుండియు, నాణెములనుండియు వాసిష్ఠీపుత్రశ్రీసాతకర్ణి, వాసిష్ఠీపుత్రచతరపణసాతకర్ణి, వాసిష్ఠీపుత్రశివశ్రీ, వాసిష్ఠీపుత్రపులోమావి అను నలుగురురాజులు తెలియనగుచున్నారు. పురాణములును, శాసనములును గౌతమీపుత్రుని అనంతరము అతని కుమారుడు వాసిష్ఠీపుత్రపులోమావి రాజ్యముచేసెనని స్పష్టముగ తెలుపుచున్నవి. ఇక వాసిష్ఠీపుత్రనామకులు ముగ్గురు మిగులుచున్నారు. పురాణములలో పులోమావికి పిమ్మట మత్స్యపురాణము శివశ్రీని పేర్కొనుచున్నది. ఇతడు వాసిష్ఠీపుత్ర శివశ్రీ కావలెను. విష్ణుపురాణమును, వాయుపురాణప్రతి యొకటియు పులోమావియనంతరము శాంతికర్ణి లేక సాతకర్ణిని పేర్కొనుచున్నవి. ఇతని నాణెములును దొరికినవి. అగుచో నితడు కన్హేరీశాసనములోని వాసిష్ఠీపుత్రసాతకర్ణి కావచ్చును. ఇక వాసిష్ఠీపుత్రచతరపణసాతకర్ణి యొకడు మిగిలినాడు. ఇతని మాతృనామోపసర్గనుబట్టి యితడు పులోమావి సాతకర్ణి శివశ్రీలకు సోదరుడని తోచుచున్నది. 'చతరపణ' అనునది 'క్షత్రప' శబ్దమునకు రూపాంతరమై యితని బిరుదము కావచ్చును. పులోమావి మరణించిన వెంటనే ఉజ్జయినీపాలకులగు శకక్షత్రపులు సాతవాహనులను పీడించిరి.[154] ఈసందర్భమున నొక సాతవాహనరాజు 'క్షత్రప' పదమునకు సమానమగు బిరుదము గ్రహించుట అతడు క్షత్రపులను ధిక్కరించుటకు సూచకమే యగును. ఇది సాతవాహనులను బాధించిన క్షత్రపరుద్రదాముని మరణానంతరమే (క్రీ. శ. 175) సంభవమగును. విష్ణుపురాణమున సాతకర్ణి శివశ్రీలు వరుసగ పేర్కొనబడినారు. ఈకారణములనుబట్టి చతరపణ సాతకర్ణి శివశ్రీకి పిమ్మట రాజ్యము చేసెనని యూహింపవచ్చును.

పై చర్చకు ఫలితముగ సాతవాహనుల వంశక్రమము నీక్రిందివిధమున నిర్ణయింపవచ్చును—




154. చూ. శకసాతవాహన సంబంధము అను విభాగము.

పులోమావి I
అరిష్టకర్ణ
....
హాలుడు
పాటలకుడు
|
పురీకసేనుడు
....
సుందరసాతకర్ణి
చకోరుడు
శివస్వాతి
....

గౌతమీపుత్రసాతకర్ణి
|
పులోమావి II | సాతకర్ణి | శివశ్రీ | చతరపణసాతకర్ణి
శివస్కందుడు
|
యజ్ఞశ్రీ
|
విజయుడు
|
చంద్రసాతకర్ణి
|
పులోమావి III

# ౯. కాలనిర్ణయము.

ఆంధ్రసాతవాహనవంశముయొక్క పరిపాలనాకాలమును, ఈవంశములోని రాజుల వైయక్తికరాజ్యకాలములను నిర్ణయించుట సులభము కాదు. ఈయంశములనుగూర్చి పురాణములలో పరస్పరమును వ్యత్యాసములున్నవి. సాతవాహనులశాసనములు ఆయారాజుల రాజ్యసంవత్సరములనే చెప్పును గాని శకమును ఉదాహరించవు. నాణెములమీద రాజులపేర్లుమాత్రమున్నవి కాని రాజ్యవర్షములు లేవు. ఈకారణములవలన శాసనములలోను, నాణెములమీదను గల అక్షరములస్వభావమునుబట్టి ఆయారాజుల కాలమును స్థూలముగ నిర్ణయింపవలసియుండును. ఇతరవంశములరాజులు కొందరు సాతవాహనులను కొందరిని పేర్కొనినారు. ఈ సమకాలికప్రశంసయు ఈ సందర్భమున తోడ్పడును.

పురాణములు సాతవాహనులరాజ్యకాలపరిమితులనుగూర్చి అనేకవిధములుగ చెప్పుచున్నవి. వాయుపురాణము సాముదాయికముగ 30మంది రాజులు 456సం॥లు పరిపాలించిరని చెప్పియు 14మందిరాజులనే పేర్కొనును. ఈరాజుల రాజ్యకాలముల మొత్తము 231సంవత్సరము లగుచున్నవి. బ్రహ్మాండపురాణమును సాముదాయికసంఖ్యలను పై విధముననే చెప్పుచు వాస్తవముగ 17 మంది రాజులను, 262సంవత్సరములను ఇచ్చుచున్నది. మత్స్యపురాణమున 19మందిరాజులనియు, 464సంవత్సరములనియు ఉన్నది. కాని అందు 28మంది రాజుల పేర్లు కలవు. వారి రాజ్యకాలముల మొత్తము మూడువందలయెనభైరెండున్నర సంవత్సరము లగుచున్నవి. విష్ణుపురాణమున 30మంది రాజులు 456సం॥లు పరిపాలించిరని చెప్పబడినది.[155]

155. చూ. అనుబంధమునందలి పురాణములలోని భాగములు.

భాగవతము నిట్లు చెప్పుచున్నది. ఇట్లు మొత్తముమీద 30మందిరాజులును, 456సంవత్సరములు ననునది ఒకటియు, 19మందిరాజులును రెండున్నరశతాబ్దములు ననునది ఒకటియు రెండు విధములగు పరిగణనము కనిపించుచున్నది. వీనిలో పెద్దమొత్తము మూలశాఖయొక్కయు, దాని ఉపశాఖలయొక్కయు పరిపాలనాకాలముల మొత్తము, తక్కువమొత్తము మూలశాఖది యనువాదము అసమంజసమని ఇదివరలో చూచియుంటిమి. ఈవ్యత్యాసమును సమన్వయించుటకు స్మిత్ పండితుడు యుక్తియుక్తమగు నొక సూచనను చేసెను [156] మత్స్య, విష్ణుపురాణములు ఆంధ్రవంశముయొక్క మొత్తముపరిపాలనాకాలము నొసంగుననియు, వాయుపురాణము కాణ్వాంతమునుండి యీవంశముయొక్క పరిపాలనాకాలము నొసంగుననియు అతని సూచన. శుంగులు 112సంవత్సరములు, కాణ్వులు 45సంవత్సరములు పాలించిరి. ఈరెండుమొత్తములను వాయుపురాణములోని ఆంధ్రరాజులపరిపాలనాకాలమునకు కలిపినచో మత్స్యవిష్ణుపురాణములలోని నాలుగున్నరశతాబ్దములకు సరియగుచున్నది. అందువలన సాతవాహనులు నాలుగున్నరశతాబ్దములు పరిపాలించిరని నిర్ణయించుటయే సమంజసముగ నుండును.

ఈసాతవాహనుల పరిపాలన మెప్పటినుండి ప్రారంభమయ్యెననునది మరియొక ప్రశ్న. కొందరు మౌర్యశుంగకాణ్వవంశముల యేలుబడి చెల్లినతర్వాత అనగా క్రీ. పూ. 23 లో ఆంధ్రుల యేలుబడి ప్రారంభమయ్యెనని నిర్ణయించినారు. పురాణములలో ఆంధ్రులు కాణ్వాయనులను, శుంగులయొక్క శేషమును కూడ అంతమొందింతురని యున్నది. దీని నాధారము చేసికొని కొందరు శుంగరాజ్యాంత్యముననే అనగా క్రీ. పూ. 73 లోనే ఆంధ్రుల యేలుబడి మొదలయ్యెనని నిర్ణయించినారు. (157) ఈరెండు నిర్ణయములకును వాయుప్రోక్తమగు 300 సంవత్సరముల మొత్తముయేలుబడి ప్రమాణము. ఈప్రమాణము ననుసరించి యెడల క్రీ. పూ. 73లో మొదలగుచో (300_73) క్రీ. శ. 227 లోను, క్రీ. పూ. 23లో మొదలగుచో (300_23) క్రీ. శ. 277 లోను సాతవాహనుల పరిపాలనము అంతముకావలెను. సమకాలీనచరిత్రము నది సంభవముకాదని నిరూపించుచున్నది. అదియునుగాక వాయుపురాణమున ప్రధానులగు రాజుల ప్రశంసయే ఉండి, అందలిపట్టికలును, సంవత్సరసంఖ్యయు అసమగ్రములని ఇదివరలో చెప్పియుంటిమి. ఆంధ్రరాజుల మొత్తముపరిపాలనాకాలము నాలుగున్నరశతాబ్దులేననియు, దీనిని కాణ్వాంతమున క్రీ. పూ. 23నుండి లెక్కింపవలెననియు మరియొకవాదము కలదు. అప్పుడు (456_23) క్రీ. శ. 433లో ఆంధ్రరాజ్యాంతమగును. ఉత్తరసాతవాహనయుగము యొక్కయు, గుప్తసామ్రాజ్యముయొక్కయు చరిత్రము నిది తల్లక్రిందులు చేయును. సాతవాహనరాజుల శాసనములలో ప్రాచీనములైనవి లిపివిషయమున అశోకుని శాసనములను పోలియున్నవి. అందువలన మొదటిసాతవాహనులు అశోకునికి దగ్గరగ నుండియుండవలెనని యేర్పడుచున్నది.

156 ZDMG 1903 లోని వ్యాసము.

157. R. G. Bhandarkar—EHD. pp. 53—54.

ఆంధ్రరాజ్యారంభకాలమును మరియొక విధమున నిర్ణయింపవచ్చును. స్మిత్ సూచన ననుసరించి ఆంధ్రవంశము కాణ్వాంత్యమైన పిమ్మట 300ఏండ్లు పాలించెననియు, కాణ్వుల 45ఏండ్లను శుంగుల 117ఏండ్లలో చేరియుండె ననియు, అంగీకరించి విష్ణువాయుపురాణముల మొత్తములోగల తేడా 15 సంవత్సరములను శుంగరాజ్యాంత్యమైన క్రీ. పూ. 73కు కలిపినయెడల ఆంధ్రరాజ్యారంభము క్రీ. పూ. 230లో నని యేర్పడును. గర్గసంహితాంతర్గత మగు యుగపురాణమున[158] శుంగరాజ్యారంభమైన 69ఏండ్లకు శకులు పాటలీనగరముపై దండెత్తిరనియు, అచట 10సంవత్సరములు వారి యేలుబడి సాగెననియు, ఆమీద 10యేళ్ళు శాతరాజు పాలించెననియు చెప్పబడినది. శుంగరాజ్యారంభము క్రీ. పూ. 185లో జరిగెను. దానినిబట్టి శాతరాజు పరిపాలనము (69 + 10=79, 185—79) క్రీ. పూ. 106_96 నడుమ జరిగెనని యేర్పడును. ఈ శాతరాజు సాతవాహనవంశములోని ఒకసాతకర్ణి కానగును. గౌతమీపుత్రసాతకర్ణి కుమారుడగు పులోమావి క్రీ. శ. 130లో ఉండెనని టాలెమీ అను యవనుని వ్రాతలనుబట్టి తెలియుచున్నది. ఈపులోమావికిని, ఈవంశములోని లంబోదరుడను రాజునకును నడుమ 226 సంవత్సరముల అంతరమున్నది. అప్పుడు లంబోదరుని రాజ్యారంభము (226—130) క్రీ. పూ. 96లో అగును. ఈలంబోదరునికి ముందు ఒక సాతకర్ణిని పౌరాణికపట్టికలు పేర్కొనుచున్నవి. అప్పుడు యుగపురాణమున పేర్కొనబడిన, క్రీ. పూ. 96నాటికి పరిపాలనము ఆగిపోయిన సాతరాజు ఈసాతకర్ణి యగును. ఈ సాతవాహనవంశమునందలి రెండవ సాతకర్ణి. పౌరాణికపట్టికల ప్రకారము సిముకుని పరిపాలనారంభమునకును, సాతకర్ణి పరిపాలనాంత్యమునకును నడుమ 125సంవత్సరముల అంతరముండెను. దీనినిబట్టి సాతవాహనుల పరిపాలనము (96 + 125) క్రీ. పూ. 221లో అయ్యెనని యేర్పడుచున్నది. సాతవాహన రాజుల శాసనముల లిపిస్వభావమునుబట్టి చేయబడిన అంచనాలును ఈనిర్ణయమును బలపరచుచున్నవి. నానేఘాట్ లోని ప్రాచీన శాసనములు అశోకునికి 20సంవత్సరముల ప్రాంతపువి అని స్మిత్ అభిప్రాయము.[159] అశోకుడు క్రీ. పూ. 234లో మరణించెను. బూలర్ అను మరియొక శాసనపరిశోధకుని ఊహప్రకారము ఈశాసనములు అశోకుని వెనుక రాజ్యమునకువచ్చిన దశరథునికి సమకాలికములు. కృష్ణుని నాసికశాసనము క్రీ. పూ. 200నాటిది.[160] అగుచో కృష్ణునికి ముందు 23ఏండ్లు పరిపాలించిన సిముకుని యేలుబడి క్రీ. పూ. 223లో ప్రారంభము కావలెను. నాగానిక నానేఘాట్ శాసనము క్రీ. పూ. 184 ప్రాంతపుది అని రాప్సన్ అభిప్రాయము.[161] ఈశాసనము మొదటిసాతకర్ణి మరణానంతరము వేయబడినది. సిముక

158. JBORS. vol. XVI. ఈ గ్రంథమునందు శకుల దండయాత్ర ఒఢ్రికుడను రాజు కాలమున జరిగెనని చెప్పబడినది. ఈ ఒఢ్రికుడు శుంగరాజ్యారంభమైన 69 ఏండ్లకు మరణించెనని పౌరాణికపట్టికల నుండి తెలియనగుచున్నది.

159. ZDMG. 1903. 160. JBORS. vol. XVI. pp. 261—263.

161. Cambridge History of India I. p. 530.

కృష్ణసాతకర్ణులు ముగ్గురును కలసి 43 లేక 51 సంవత్సరములు పరిపాలించిరి. అప్పుడు సిముకుని పరిపాలనారంభము (184 + 43) క్రీ.పూ. 227లో కావలెను.

మరికొన్ని మార్గములుకూడ ఈప్రారంభ కాలమునే సూచించుచున్నవి. కొన్ని పురాణములలో 'ఆంధ్రులు పౌలోము'లని యున్నది. దీనికి కొందరు పండితులు పులోమావి పాటలీ నగరమున ఆంధ్రరాజ్యస్థాపన మొనర్చెనని వ్యాఖ్యానము చేసినారు.[162] ఇది క్రీ. పూ. 28లో కాణ్వరాజ్యాంత్యమున జరిగియుండవలెను. పురాణములలో సిముకునికిని మొదటి పులోమావికిని 91సంవత్సరముల అంతరము కనిపించుచున్నది. అప్పుడు సాతవాహన రాజ్యారంభము (191 + 23) క్రీ. పూ. 214 లో కావలెను. గౌతమీపుత్రిసాతకర్ణి క్రీ. శ. 106లో అభిషిక్తుడయ్యెనని కొందరు పండితుల అభిప్రాయము[163] ఈరాజునకును సిముకునికిని 300ఏండ్ల అంతరమున్నది. అప్పుడు సిముకుని పరిపాలనారంభము (300 – 106) క్రీ. పూ, 206లో కావలెను.

సమకాలికుల ప్రశంసలు సాతవాహనుల కాలనిర్ణయమునకు మరియొక ఆధారము. ఖారవేలుని హాథీగుంఫ శాసనము ఆరాజునకు ఒక సాతకర్ణి సమకాలికుడని తెలుపుచున్నది. ఈశాసనమున 165వ మౌర్యకాలము ఖారవేలుని 13వరాజ్యసంవత్సరమని ఉన్నదనియు, ఈశాసనము క్రీ. పూ. 2వశతాబ్దిదనియు కొందరుపండితుల అభిప్రాయము. మరికొందరు దీనిలో మౌర్యకాలప్రశంస లేదనియు, ఇది ఖారవేలుడు నందరాజ్యాభిషేకమైన 300 సంవత్సరములకు, అనగా క్రీ. పూ. 1వశతాబ్దిలో ఉండెనని తెలుపుచున్నదనియు వాదించుచున్నారు.(164) ఈ వాదప్రతివాదములలోని నిజానిజము లెట్లున్నను ఖారవేలుడు క్రీ. పూ. 170 ప్రాంతమునందుండిన డెమిట్రియస్ అను యవనరాజునకు సమకాలికుడనుటకు నిర్దుష్ట ప్రమాణము కలదు.(165) దీనినిబట్టి యీకాలమునందొక సాతకర్ణియు ఉండెనని స్పష్టమగుచున్నది. రెండవసాతకర్ణి యేలుబడి క్రీ. పూ. 96లో అంతమయ్యెనని యిదివరలో చెప్పియుంటిమి. ఈరాజు 56 ఏండ్లును, ఇతనికి ముందు పూర్ణోత్సంగుడు 18 ఏండ్లును పరిపాలించిరి. ఈకాలము (56 + 18) 74 ఏండ్లగును. పూర్ణోత్సంగునికి ముందు మొదటిసాతకర్ణి 10 సంవత్సరములు ఏలెను. అప్పుడు ఈ మొదటిసాతకర్ణి కాలము (96 + 74 + 10) క్రీ. పూ. 180 — 170 అగును. అప్పుడు సాతకర్ణి, ఖారవేల, డిమిట్రియస్‌లు సమకాలికులగుదురు. ఈసాతకర్ణికి సిముకుడు 33 సంవత్సరములకు ముందుండెను. అగుచో సిముకుని యేలుబడి (180 + 33) క్రీ. పూ. 213లో కావలెను. ఈసందర్భమున నుపకరించునది టాలెమీ, చస్టాన, పులోమావుల సమకాలికత్వము మరియొకటి. క్రీ. శ. 130 లో వీరు మువ్వురును ఉండిరి. ఈపులోమావికి సిముకుడు 352 ఏండ్లముందు ఉండెను. అప్పుడు సిముకుడు (352 — 130) క్రీ. పూ. 222 నాటివాడు కావలెను. ఉజ్జయినీపాలకుడగు రుద్రదామునకు ఒక సాతకర్ణి సమకాలికుడు. క్రీ. శ.

162. JBORS. vol. XVI. p. 281. 163. Rapson—CAC. Intro. p. 27.
164. Cf. Raychaudhari—Pol. Hist Anc. Ind. pp. 216—212, 221.
165. JBORS. vol. XVI. p. 277; XIII. p. 242.

130 లో చష్టనుడు రాజు. క్రీ. శ. 150 నాటికి అతని పౌత్రుడగు రుద్రదాముడు ఘూర్జరకథియవాడ్ కొంకణములను జయించి స్వతంత్రపాలకుడుగ నుండెను. (166) పులోమావికి పిమ్మట నొక సాతకర్ణి రాజాయెను. అతని నోడించి రుద్రదాముడు ఆ ప్రాంతములను లాగుకొనెను. పులోమావి తర్వాత సాతకర్ణి, శివశ్రీ, చతరపణసాతకర్ణులు ఏలిరి. వీరిలో శివశ్రీ నాణెములు ఆంధ్రదేశమునను, మధ్యరాష్ట్రములలోను మాత్రము దొరికినవి. ఇతనికి మహారాష్ట్రముతో సంబంధముండినట్లు కనిపింపదు. చతరపణ అను బిరుదము క్షత్రపులను ధిక్కరించుటను సూచించును. ఈరాజు శాసనము కన్హేరిలో కలదు. అందువలన రుద్రదాముడు ఓడించిన రాజు ఇతడు కాజాలడు. అందువలన పులోమావి వెనుక వచ్చిన సాతకర్ణియే ఈశకరాజుకు సమకాలికుడు కావలెను. క్రీ. శ. 150—175నడుమ శకులవంశక్రమము అనిర్ణీతముగ నున్నది.(167) ఇది సాతవాహనుల విజృంభణకాలము కావచ్చును. చతరపణుడు ఈకాలమువాడు కావచ్చును.

సాతవాహనుల పరిపాలనాంత్యకాలమును కూడ నొకవిధమున నిర్ణయింపవచ్చును. శుంగాంత్యకాలమగు క్రీ. పూ. 73నుండి వాయుప్రోక్తమగు 300 ఏండ్ల కాలమును లెక్కించినచో ఆంధ్రరాజ్యాంత్యము క్రీ. శ. 227లో అగును. బహుమార్గములనుబట్టి సిముకుని రాజ్యారంభకాలమగు క్రీ. పూ. 221 నుండి పురాణములలోని సాముదాయికసంఖ్యయగు 456 సంవత్సరములను లెక్కించినచో ఆంధ్ర రాజ్యాంత్యము క్రీ. శ. 235లో కావలెను. క్రీ. శ. 300 తో ప్రాకృతశాసనములు నిలిచిపోయెనని ఎల్లరు నంగీకరించినారు. ఉత్తరసాతవాహనయుగపు పల్లవప్రాకృత శాసనములు (158) రెండుపురుషాంతరముల పల్లవరాజులను పేర్కొనుచున్నవి. అప్పుడు పల్లవరాజ్యారంభము క్రీ. శ. 250 ప్రాంతమున కానగును. సాతవాహనులకును పల్లవులకును మధ్య ఇక్ష్వాకులు రాజ్యము చేసిరి. పురాణములు వీరి యేలుబడి 55 ఏండ్లు సాగెనని చెప్పుచున్నవి. శాసనములనుండి ఈవంశీయులు ముగ్గురురాజులు తెలియనగుచున్నారు. అందు ఇర్వురు 31 సంవత్సరములు ఏలిరి.(169) దీనినిబట్టి ఇక్ష్వాకులు క్రీ. శ. 220 ప్రాంతమున అధికారమునకు వచ్చిరని ఊహింపవచ్చును. ఈసాతవాహనులలో కడపటివాడగు మూడవపులోమావికి ముందు పరిపాలించిన చంద్రసాతకర్ణి (చందసతి) కొడవలి శాసనమును చర్చించుచు కృష్ణశాస్త్రి అను పండితుడు ఆశాసనము క్రీ. శ. 210 నాటిదని నిర్ణయించెను.(170) అది ఆరాజు రెండవ రాజ్యసంవత్సరము. చంద్రశ్రీ 3 ఏండ్లును, ఆమీద పులోమావి 7 ఏండ్లును ఏలిరి. దీనిని బట్టి పులోమావి యేలుబడియు, సాతవాహన వంశముయొక్క యేలుబడియు క్రీ. శ. 218లో అంతమయ్యెనని యేర్పడును.

---

166 చూ. శకశాతవాహన సంబంధము. అనువిభాగము.

167. JBORS. vol. XVI p 302.

168. మైదవోలు, హీరహడగల్లి, బ్రిటిషుమ్యూజియం తామ్రశాసనములు.

169. ఈయిర్వురిలో పురుషదత్తుడు 20ఏండ్లును, రెండవ చాంతమూలుడు 11 ఏండ్లును పరిపాలించిరి. E. I. vol. XX Nagarjunakonda Inscriptions—Nos. L and H.

170. E. I. vol. XVIII. pp. 316—319

పైచర్చనుబట్టి ఆంధ్ర సాతవాహనుల యేలుబడి క్రీ. పూ. 221—క్రీ. శ. 218నడుమ సాగెనని నిర్ణయింపవచ్చును. పౌరాణికపట్టికల లోని వివరములననుసరించి సాతవాహనుల వైయక్తికరాజ్యకాలముల నీక్రిందివిధమున నిర్ణయింపవచ్చును.

| | | |
|---|---|---|
| సిముకుడు | 23 | క్రీ. పూ. 221_198 |
| కృష్ణుడు | 18 | 198_189 |
| సాతకర్ణి I | 10 | 180_170 |
| పూర్ణోత్సంగుడు | 18 | 170_152 |
| సాతకర్ణి II | 56 | 152_96 |
| లంబోదరుడు | 18 | 96_78 |
| ఆపీలకుడు | 12 | 78_66 |
| మేఘస్వాతి | 18 | 66_48 |
| స్కందస్వాతి | 7 | 48_41 |
| మహేంద్రస్వాతి | 3 | 41_38 |
| కుంతలసాతకర్ణి | 8 | 38_30 |
| పులోమావి I | 24 | 30_6 |
| అరిష్టకర్ణుడు | 25 | క్రీ. పూ. 6_క్రీ. శ. 19. |
| హాలుడు | 5 | క్రీ.శ. 19_24 |
| పాటలకుడు | 5 | 24_29 |
| పురీకసేనుడు | 21 | 29_50 |
| సుందరసాతకర్ణి | 1 | 50 |
| చకోరసాతకర్ణి | 1/2 | 51 |
| శివస్వాతి | 28 | 51_78 |
| గౌతమీపుత్రుడు | 24 | 78_102 |
| పులోమావి II | 28 | 102_130 |
| సాతకర్ణి | 20 | 130_150 |
| శివశ్రీ | 7 | 150_157 |
| చతురపణసాతకర్ణి | 10 | 157_167 |
| శివస్కందుడు | 7 | 167_174 |
| యజ్ఞశ్రీ | 29 | 174_203 |
| విజయుడు | 6 | 203_209 |
| చంద్రశ్రీ | 3 | 209_211 |
| పులోమావి III | 7 | 211_218 |

# ౧౨. సామ్రాజ్య స్థాపనము

సాతవాహనసామ్రాజ్య మెట్లు స్థాపింపబడెను అనునది యొక క్లిష్టసమస్య. చారిత్ర కాధారము లీసందర్భమున అనేకవిధములగు సూచనలను చేయుచున్నవి. వీని నన్నిటిని సమన్వయించి వాస్తవాంశమును నిర్ణయింప వలసి యున్నది.

పురాణములలో మత్స్యవాయుబ్రహ్మాండ పురాణములు కాణ్వాయనసుశర్మను, శేషించిన శుంగులను క్షయింపజేసి సింధుక లేక శిశుక అనునతడు వసుంధరను పొందును అని చెప్పుచున్నవి. విష్ణుభాగవతపురాణములు సుశర్మభృత్యుడే అతనిని చంపునని చెప్పుచు నీకాణ్వభృత్యుని బలిపుచ్ఛకుడనియు, వృషలుడనియు, బలీ అనియు మాత్రము వర్ణించుచున్నవి. ఇట్లు వివిధముగ పేర్కొనబడిన వ్యక్తి సిముకుడని స్పష్టమగుచున్నది. మొత్తముమీద అన్నిపురాణములు నితనిని ఆంధ్రుడనియు,[171] ఆంధ్రజాతీయుడనియు పేర్కొనుచున్నవి. దీనినిబట్టి కాణ్వవంశ మంతరించిన పిమ్మట ఆంధ్రవంశస్థాపన జరిగెననియు, సిముకుడే ఈ రెండుకార్యములను నిర్వహించెననియు ఏర్పడుచున్నది. సుశర్మ మగధకు పాలకుడు. అతనిని చంపి సిముకుడు సంపాదించిన వసుంధర మగధయే కావలెను. కాణ్వుల యేలుబడి క్రీ. పూ. 28వరకును సాగెను. అప్పుడు సిముకుడు కాణ్వభృత్యు

171. అనుబంధము నందలి పౌరాణికభాగములను చూడవలెను.

డుగ నుండుచు, క్రీ. పూ. 28లో తన యేలిక యగు సుశర్మను చంపి మగధను వశపరచు కొని తనవంశముయొక్క అధికారమును స్థాపించెనని చెప్పవలయును.

కాని యిది సరియైన నిర్ణయము కాజాలదు. ఆంధ్రసాతవాహనవంశముయొక్క మొత్తముయేలుబడియగు నాలుగున్నర శతాబ్దములకాలమును కాణ్వాంత్యమైన క్రీ. పూ. 28నుండి లెక్క పెట్టుటకు వీలులేదనియు, నీ వంశపు పరిపాలనము క్రీ. పూ. 3వశతాబ్ది చరమపాదముననే ప్రారంభమై యుండవలెననియు ఇదివరలో చెప్పియుంటిమి.[172] సిముకునికి మగధతో సంబంధముండెనని ఏయితరాధారమును తెలుపుటలేదు. అంతియకాక అతనిని గురించి లభించిన ఏకైకప్రశంస అతనికి మహారాష్ట్రముతో సంబంధముండెనని నిరూపించుచున్నది.[173] మరియును సిముక సుశర్మలకు మధ్య రెండుశతాబ్దముల అంతరమున్నది. వారు సమకాలికులు కారు. ఈ కారణములనుబట్టి పురాణములవృత్తాంతి మీ సందర్భమున విశ్వసనీయముకాదు. అవి సిముకుడు ఆంధ్రరాజ్యస్థాపన చేయుట, ఒక ఆంధ్రరాజు కాణ్వసుశర్మవద్దనుండి మగధను లాగికొనుట అను ప్రత్యేకసంఘటనలకు అసంబద్ధమగు సంబంధమును కల్పించుచున్నవి. ఈ యూహను మత్స్యపురాణము బలపరచుచున్నది. అందు కాణ్వులప్రశంస ముగిసిన పిమ్మట "యేషాం పర్యాయకాలే తు భూరిన్ధ్రాన్ నై గమిష్యతి" అని యున్నది. ఆమీద సిముకుని ప్రశంస కలదు. దీనిని బట్టి కాణ్వుల అనంతరము మగధరాజ్యదృష్ట్యా ఆంధ్రులు పాలకులైనను, ఆంధ్రరాజుల నప్పటినుండి మాత్రమే పేర్కొనక పురాణములు మొత్తమువంశమునంతనుకూడ వర్ణించినవని ఊహించుట కవకాశ మేర్పడుచున్నది.

పురాణములలో నీయాంధ్రరాజులు ఆంధ్రభృత్యులుగ పేర్కొనబడిరనియు, ఈయాంధ్రభృత్యశబ్దమునకు ఆంధ్రులగు భృత్యులు అని అర్థమనియు, ఆంధ్రుడై ఆంధ్రదేశమునందుండుచు వచ్చిన సిముకుడు మహారాష్ట్రభృత్యుడుగ మహారాష్ట్రమునందుండెననియు, అశోకుని మరణానంతర మత డామహారాష్ట్రముననే స్వతంత్రరాజ్యస్థాపన మొనర్చెననియు ఇటీవల నొక వాదము బయలుదేరినది. [174] ప్రధానములగు మత్స్యవిష్ణువాయుబ్రహ్మాండభాగవతపురాణముల ప్రమాణప్రతులయందచ్చటను ఈయాంధ్రరాజు లాంధ్రభృత్యులుగ వర్ణింపబడలేదు. అన్నిచోట్లను వారు ఆంధ్రులుగనే పేర్కొనబడినారు. మొదటిరాజగు సిముకుడును ఆంధ్రుడనియు, ఆంధ్రజాతీయుడనియునే వర్ణింపబడినాడు. ఏపురాణముయొక్క ఏప్రతిలోనో ఆంధ్రభృత్య శబ్దము అపపాఠముగ వ్రాయబడి యుండవచ్చును. దానికి అనవసరమగు ప్రాధాన్యము నొసంగుట సమంజసము కాదు. పురాణములలో గాంచనగునది సిముకుని కాణ్వభృత్యత్వము. ఇది అసంగతమని పైన చూపియుంటిమి. ఈయాంధ్రరాజులు మహారాష్ట్రభృత్యులని ఏయాధారమునను లేదు. సిముకుడు

172. చూ. కాలనిర్ణయము అను విభాగము.

173. నానీఘాట్‌లో. ఒక గుహలో సిముకుని విగ్రహమున్నది. దానిమీద అతని పేరును కలదు.

174. K. Gopalachari—Early Hist. Andhra, pp. 25—27.

మౌర్యభృత్యులుగ మహారాష్ట్రమునం దుండె ననుటయు ఊహామాత్రశరణ్యమే. ఇటీవల దొరికిన సాతవాహనుడను రాజును పేర్కొను నాణెము ఈయూహను పూర్తిగ ఖండించు చున్నవి.

ఆంధ్రసాతవాహనరాజ్యస్థాపనక్రమమును నేడు సహేతుకముగ నిర్ణయింపవచ్చును. క్రీ. పూ. 4వశతాబ్దినాటి మెగస్తనీస్ ఆంధ్రులకు 30 పరిఖావృతములగు నగరములుండెడివని వ్రాసినాడు. కృష్ణాతీరమునందలి ధాన్యకటకనగరము క్రీ. పూ. 3వ శతాబ్దినుండియు ఉండెనని అమరావతీచైత్యమున దొరకిన శాసనములనుండి యూహింపనగుచున్నది. క్రీ. పూ. 2వశతాబ్దిలోని ఖారవేలుడు పిథుండమను పూర్వరాజనిర్మితమగు నగరముండెనని తన హాథీగుంఫాశాసనమున చెప్పినాడు. ఈనగరము అప్పటికి చాల కాలమునకు పూర్వమే నిర్మింపబడి యుండవలెను. టాలెమీ వ్రాతలనుబట్టి యిది కృష్ణాముఖద్వారమునకును వరంగల్లుకును మధ్యనుండెనని తోచుచున్నది.(175) వరంగల్లులో సాతవాహనుడను రాజును పేర్కొను నాణెము దొరికినది. ఈరాజు సిముకునికి పూర్వుడు కావలెనని ఇదివరలో చెప్పియుంటిమి. ఈయంశములనుబట్టి సాతవాహను డీపిథుండనగరమున పరిపాలించుచుండెనని యూహించుట సమంజసముకాకపోదు. ఇతనినాణెముమీది 'రంఞో' అను పద మితడు స్వతంత్రపాలకుడని తెలుపుచున్నది. అశోకుని శాసనములలో ఆంధ్రులతని సామ్రాజ్యములోనివారివి చెప్పబడినది. సాతవాహనుడు సిముకునికి పూర్వుడు. సిముకునిపరిపాలనము క్రీ. పూ. 221లో ప్రారంభమయ్యెను. అశోకుడు క్రీ. పూ. 236లో మరణించెను. అందువలన నిసాతవాహనుడు క్రీ. పూ. 236–221 వరకు నుండెనని ఏర్పడును. ఆంధ్రరాజులలో సాతవాహనశబ్దవాచ్యులైనవారిలో సిముకుడు మొదటివాడు. ఆశబ్దము బిరుదమువలె నున్నది. అది అంతకుముందుండిన రాజుపేరు. సాతవాహనుడను రాజుపేరును తనపేరుతోపాటు బిరుదముగగల సిముకుడు ఆసాతవాహనుని కుమారుడని అనుకొనుట సమంజసముగ నుండును.

ఈసిముకుని పేర మహారాష్ట్రమునందలి నానేఘాట్ లోని ఒకగుహలో విగ్రహము కలదు. తండ్రి ఆంధ్రదేశమున కేలికకాగా కుమారుడు మహారాష్ట్రమున ప్రశంసింపబడుటయు, అంతకుపూర్వము మహారాష్ట్రము రఠికులవశమునం దుండుటయు, ఈరఠికుల నాయకుడగు మహారథిత్రణకయిరోకుమార్తె నాగానికను సిముకుని కుమారుడగు మొదటి సాతకర్ణి వివాహమాడుటయు,(176) సాతవాహనులలో మొదటిముగ్గురురాజులునగు సిముకకృష్ణసాతకర్ణుల ప్రశంసగల శాసనములు మహారాష్ట్రమున కనిపించుటయు, సిముకుడు మహారాష్ట్రమును జయించెనని నిస్సందేహముగ నిరూపించుచున్నవి. ఇట్లు ఆంధ్ర సామ్రాజ్యస్థాపనము ఒక విజయమునకు ఫలితమే. కాని అది పురాణములు సూచించునట్లు మగధవిజయముకాదు, మహారాష్ట్ర విజయము.

175. Ibid. p. 8.
176. పై నానేఘాట్ గుహలో నున్న విగ్రహముల ఉనికియు, నాగానిక నానేఘాట్ శాసనము నీయంశమును సూచించుచున్నవి.

ఈ సాతవాహనసామ్రాజ్య నిర్మాణక్రమమునుగూర్చి సమకాలికచరిత్రమునుండి మరికొన్ని వివరములను ఊహింపవచ్చును. అశోకమౌర్యుడు క్రీ. పూ. 272_236 నడుమ పరిపాలించెను. అతని శాసనములు దక్షిణమున మైసూరురాజ్యములోని బ్రహ్మగిరి, జైతుంగ రామేశ్వరము, సిద్ధాపురములలోను, రాయచూరుజిల్లాలోని మస్కీవద్దను, కర్నూలుజిల్లాలోని ఎర్రగుడియందును కలవు. దీనినిబట్టి దక్షిణాపథమున చాలభాగ మతని సామ్రాజ్యమున చేరియుండెనని తెలియుచున్నది. ఈ దక్షిణాపథభాగమున రఠిక, పెటెనికభోజికపుళిందాంధ్రులను తెగలవారుండిరి. వీరందరును పేరుకు మౌర్యసామంతులే అయినను వాస్తవముగ స్వతంత్రులుగనే ఉండిరి. వీరిలో ఆంధ్రులు మిక్కిలి బలవంతులు. అశోకుడు మరణించిన వెంటనే కలవరములు బయలుదేరినవి. అతని పుత్రులలో తివర, కునాల, జలౌకులు ప్రసిద్ధులు. ముందుగ కునాలుడు 8 ఏండ్లును, ఆమీద అతని కుమారుడు దశరథుడు 8 ఏండ్లును, పిమ్మట ఇంద్రపాలితుడు 10 ఏండ్లును, ఆమీద కునాలుని మరియొకపుత్రుడగు సాంప్రతి 9 ఏండ్లును పాలించిరని పురాణములు చెప్పుచున్నవి. జలౌకుడు ముందుగనే కాశ్మీర కాన్యకుబ్జములను వశపరచుకొని స్వతంత్రుడుగ పరిపాలింపసాగెను. దశరథుడు క్రీ. పూ. 232_224 నడుమ సామ్రాజ్యప్రాగ్భాగమునకు ఏలిక అయ్యెను. పశ్చిమోత్తరభాగమునకు సుభగసేనుడను నతడు స్వ తం త్ర పా ల కు డయ్యెను. ఇట్లు అశోకుడు మరణించిన కొద్ది కాలముననే మౌర్యసామ్రాజ్యము ఛిన్నభిన్నమయ్యెను. సాంప్రతి ప్రబలుడై ఉజ్జయినీ సౌరాష్ట్రములలోనికి తనయధికారమును విస్తరించెను. జైనమతాభిమానియై యితడు జైనుల సహాయముతో విజృంభింపసాగెను.(177)

ఆకాలమున రఠికులు మహారాష్ట్రమునను, భోజకులు బేరారులోను, పెటెనికులు పైఠాను ప్రాంతమునను స్వతంత్రులైయుండిరి. కళింగమును స్వతంత్రమైయుండెను. ఈయీరాష్ట్రములమధ్య ప్రబలులుగ నుండిన ఆంధ్రులు వీరందరికంటెను ముందుగనే స్వాతంత్ర్యమును సాధించుకొనియుండిరి. ఈమహాకార్యము పైనపేర్కొనబడిన సాతవాహనుని నాయకత్వమున నాటి ఆంధ్రులు సాగించియుండిరి.

క్రీ. పూ. 221లో సాతవాహనుడు మరణించెను. వెంటనే సిముకుడు ఈస్వతంత్రాంధ్ర రాజ్యమునకు పాలకుడయ్యెను. ఇదేసమయమున సాంప్రతి మౌర్యసామ్రాజ్యపశ్చిమభాగమున కధిపతియై అప్పరుసౌరాష్ట్రఉజ్జయినుల లోనికి తన అధికారమును వ్యాపింపజేయుచుండెను. సౌరాష్ట్రాంధ్రములకు మధ్య రఠికులుండిరి. సామాన్యులగు నీరఠికులను వశపరచుకొనినచో సాంప్రతి ఆంధ్రరాజ్యముపై బడుట కవకాశముండెను. ఇట్లు క్రొత్తగ పునర్నిర్మింపబడిన యీరాజ్యమునకు పశ్చిమోత్తరదిశనుండి ప్రమాదము వాటిల్లనైయుండెను. ఈయపనును పురస్కరించుకొని సిముకుడు బ్రహ్మాండమగు విజయయాత్రను సంకల్పించెను. సిముకుడు దీనిని కేవలమును వైయక్తికకార్యముగగాక అత్యవసరమగు ఆంధ్రజాతీయోద్యమముగ ప్రారంభించెను. ఇతరాంధ్రనాయకు లితనికి తోడ్పడిరి.(178)

---

177. V. A. Smith—Entry History of India. pp. 200—203.

178. శిశుకోఽన్ధ్రః స్వజాతీయః ప్రాప్స్యతీమాం వసుంధరాం - మత్స్యపురాణము.

ఇట్లు తగిన సహాయమును సమకూర్చుకొని సిముకుడు నేటి మహారాష్ట్రముపై దండెత్తెను. అచట రఠికులనువారు ప్రబలులై యుండిరి. మహారఠి త్రణకయిరో ఆనునతని నాయకత్వమున వారు ఆంధ్రులను ప్రతిఘటించి యుందురు. కాని సిముకుని సంకల్పము అప్రతిహతమయ్యెను. అతని సేనలు అవక్రపరాక్రమముతో పోరాడినవి. ఏకముఖముగను, ఏకనాయకత్వమునను విజృంభించిన నాటి ఆంధ్రుల శక్త్యుత్సాహము లఖండమగు విజయమును సాధించినవి.

ఇట్లు ఆంధ్రసాతవాహనసామ్రాజ్యస్థాపనము కాణ్వానాశమునకుగాని, మౌర్యభృత్యత్వమునకుగాని ఫలితము కాదు. అది సిముకుని నాయకత్వమున నాటి ఆంధ్రులు సాగించిన విజయయాత్రకు ఫలితము.

## ౧౧. పూర్వ సాతవాహనులు

### సిముకుడు క్రీ. పూ. 221–198.

ఇతడు ఆంధ్రసామ్రాజ్యప్రతిష్ఠాపకుడు. దూరదృష్టియగు నితడు ఆనాటి సంక్షుభిత వాతావరణమున తనతండ్రి సాతవాహనుడు తనకొసంగిన ఆంధ్రరాజ్యమునకు ప్రమాదము వాటిల్లనున్నదని నిశ్చయించుకొనెను. ఉత్తరాపథమున నొకటివెంబడి యొకటిగ బయల్వెడలుచుండిన కల్లోలములు వింధ్యదక్షిణభాగమునుకూడ కలచివేయకుండవలెననినచో దక్షిణాపథమున ప్రబలమగు నొక సామ్రాజ్యమవసరమని యితడు గ్రహించెను. మరియును రఠికులుపిటినికులుభోజకులు మున్నగు చిన్న చిన్న తెగలవారు దక్షిణాపథపు ఉత్తరభాగమునందుండుట ప్రమాదకరమనియు, ఉజ్జయినీ విదిశలవరకును అధికారమును సాగించుచుండిన యేఉత్తరాపథపాలకులైనను నర్మదానదిని దాటి యీ తెగలవారిని సులభముగ కబళింపవచ్చుననియు, అటు సౌరాష్ట్రమువరకును వ్యాపించిన మౌర్యులు అటనుండి అపరాంతమును సులభముగ జయింపగలరనియు అందువలన క్రొత్తగ స్థాపింపబడిన తన ఆంధ్రరాజ్యము స్థిరముగ నుండవలెననినచో, దానిని పశ్చిమోత్తరములకు విస్తరింపచేయుట అత్యంతావశ్యకమనియు సిముకుడు నిశ్చయించుకొనెను. వెంటనే తగిన ప్రయత్నమును చేసి యితరాంధ్రనాయకులతో కూడి మహారాష్ట్రముపై అతడు దాడివెడలెను.(179) సాంప్రతియను మౌర్యరాజు సౌరాష్ట్రమువరకును ప్రబలుడుగ నుండుటవలన(180) నీసౌరాష్ట్రపు సరిహద్దునగల మహారాష్ట్రమునే సిముకుడు ముందుగ జయించెను. అంతియకాక ముందుముందు ఏప్రమాదము వచ్చినను మొదటి సంఘర్షణ మిచ్చటనే జరుగవలసియుండెను. అందువలన సిముకుడు తనయధికారము నీ ప్రాంతముననే సుస్థిర మొనర్చుకొనవలసి

---

179. Cf. శిశుకో౽న్ధ్ర స్సజాతీయః ప్రాప్స్యతీయాం వసుంధరాం—మత్స్యపురాణము.

180. ఈవిభాగమున చేర్చబడిన మౌర్యశుంగకాణ్వవంశముల చరిత్రకు సంబంధించిన అంశములు V. A. Smith—Early History of India నుండి గైకొనబడినవి.

యుండెను. ఈకారణమునుబట్టి అతడు స్థానిక నాయకుడగు మహారథిత్రణకయిరో అనునతని కుమార్తె నాగానీకను తనపుత్రుడగు శ్రీసాత కర్ణికి వివాహము చేసెను.(181) ఇట్లు సిము కుడు ఆంధ్రమహారాష్ట్రముల రెంటిని కలిపి ఒకసామ్రాజ్యము నిర్మించెను. ఈవిజయ యాత్రయు, సీవైవాహికసంబంధమును జరిపి, వలయు నేర్పాట్లను చేయుటకు నాలుగైదు సంవత్సరములకాలము పట్టియుండును. అంత వరకును సిముకుడు మహారాష్ట్రముననే ఉండి పోయెను. ఇంతలో క్రీ. పూ. 216 లో శాలి శూకుడు మౌర్యరాజ్యమున కేలిక అయ్యెను. ఇతడు బహుదుర్మార్గుడు, అధార్మికుడు, యుద్ధ ప్రియుడు. సౌరాష్ట్రముపై దండెత్తి యితి డాదేశము ననేకవిధముల పీడించెను.(182) ఈ మూలమున తనరాజ్యమున క్షేమమాదమును సంభవింపకుండగ చేసికొనుటకై సిముకుడు మరికొంతకాలము మహారాష్ట్రమునం దుండ వలసి వచ్చెను. క్రీ. పూ. 206 లో మరియొక ప్రమాదము సంభవించెను. హిందూకుష్పర్వతముల కావల సంతియు యవనులు ప్రబలు రుగ నుండిరి. అపర్వతముల కీవల సుభగసేను డను రాజు స్వతంత్రరాజ్యమును స్థాపించెను. ఆరాజ్యమున కావల మౌర్యరాజులు అంతః కలహములకు లోనైయుండిరి. ఈపరిస్థితులను గమనించి ఆంటియోకస్ అను యవనరాజు దండెత్తివచ్చెను. పాంచాలమును, సాగలనగ రమును న్నాక్రమించి అతడు యమునాతీరమునం దున్న మధురానగరమును పట్టుకొనెను. అంత టితో ఆగక యవనులు పాటలీపుత్రమువర కును చొచ్చుకొని వచ్చిరి. అచ్చట భయంకర మగు యుద్ధము జరిగెను. ప్రజలు బహువిధ ముల బాధలనందిరి. కొంతకాల మాప్రాంత మంతయు అరాజకముగ నుండెను.(183) నామ మాత్రులుగనుండిన మౌర్యరాజు లేకిష్టకాల మునందు ఎక్కడనో తలదాచుకొనిరి. ఈయవ నుల దండయాత్ర కారణముగ మరికొంత కాలము సిముకుడు మహారాష్ట్రముననే ఉండి పోవలసి వచ్చెను. ఇతడు క్రీ. పూ. 198 లో మరణించెను.

## కృష్ణుడు క్రీ. పూ. 198--180.

ఒక్క మత్స్యపురాణము తప్ప తక్కిన పురాణములన్నియు నితనిని రెండవఆంధ్ర రాజుగను, సిముకుని సోదరుడుగను పేర్కొను చున్నవి. ఒకపురాణముమాత్రము నితడు సిము కుని తమ్ముడని చెప్పుచున్నది.(184) ఇతనిరాజ్య కాలము 10 సంవత్సరములని కొన్నిపురాణములలోను, 18 సంవత్సరములని మరికొన్నిటి యందును కలదు. నాసికలోని పాండులేనా గుహాలలోని ఒకగుహలో అది సాతవాహన కులమునందు కణ్హుడు (కృష్ణుడు) రాజుగనుండగ నిర్మింపబడెనని తెల్పు శాసనమొకటి కలదు. (185) అందువలన కృష్ణుడు కల్పితపురుషుడు

181. చూ. నానేఘాట్ గుహాలోని విగ్రహములు, నాగానిక శాసనము.

182. ఈప్రశంస యుగపురాణమునను కలదు. చూ. అనుబంధము.

183. డిటో

184. కృష్ణో భ్రాతాస్య వర్షాణి సోऽస్మాద్దశ భవిష్యతి—బ్రహ్మాండ పురాణము.

185. E. I. VIII. Nasik Ins. no. 22.

కాడని స్పష్టమగుచున్నది. ఇతని నాణెము లేవియు దొరకలేదు. నానేఘాట్ గుహాలలో ఒకదానియందు కొన్ని విగ్రహములు చెక్కబడి యున్నవి. వానిలో ఒక్కొకదానిమీదను పేర్లు గలవు. వీనిలో సిముకునియొక్కయు, అతనికుమారుడగు శ్రీసాతకర్ణి యొక్కయు అతనిభార్య నాగానికయొక్కయు, ఆమెతండ్రి మహారథియొక్కయు విగ్రహము లున్నవి. కృష్ణుని విగ్రహముమాత్రము లేదు. ఇది విస్మయజనకముగ నున్నది. దీని నాధారము చేసికొని కొందరు సిముకుడు మరణించిన పిమ్మట నతనితమ్ముడగు కృష్ణుడు తన అన్న కుమారుడగు శ్రీసాతకర్ణిని తొలగించి, బలిమిచే సాతవాహనసింహాసనము నాక్రమించెనని ఒకసిద్ధాంతము చేసినారు.(186) ఇదియును సంభవమే. లేదా సిముకుడు మరణించు నాటికి శ్రీసాతకర్ణి యుక్తవయస్కుడు కాకపోవచ్చును. ఈకాలపువాడే అగు ఖారవేలుడు తన 24వ యేటగాని రాజ్యాభిషిక్తుడు కాలేదు. సాతకర్ణికి అప్పటికి కీవయస్సు వచ్చియుండకపోవచ్చును. ఇతడు చిన్నవాడగుటవలన సిముకుడు తనతమ్ముడగు కృష్ణుని యౌవరాజ్యాభిషిక్తుని చేసి యుండవచ్చును. ఈకృష్ణుడు మహారాష్ట్రవిజయమున సిముకునికి విశేషముగ సహాయము చేసి ప్రతిభావంతుడుగ నుండియుండును. ఆనాటి క్లిష్టపరిస్థితులలో యువకుడగు సాతకర్ణికంటె సమర్థుడగు కృష్ణుడే నూతనముగ నిర్మింపబడిన ఆంధ్రసామ్రాజ్యనిర్వహణమునకు తగినవాడని నిశ్చయించుకొని సిముకుడు కృష్ణునకే రాజ్యమును సంక్రమింపచేసి యుండును. ఇట్లుకాక కృష్ణుడు ఈవిదేశమున బలాత్కారముగ రాజత్వము నాక్రమించియుండినచో స్థానికులగు మహారథులు ఊరకుందురా! నానేఘాట్ గుహాలో ఇతని విగ్రహము లేకుండుట ఒక వింతకాదు. ఆవిగ్రహములు శ్రీసాతకర్ణి మరణానంతరము చెక్కబడినవేమో అని తోచుచున్నది. అవి నేటివారు వేయించుకొని భద్రపరచుకొను Family Groups వంటివి. నాగానిక వీనిని చెక్కించి యుండును. తన తండ్రి, తనభర్త తండ్రి, తనభర్త, తాను, తనపిల్లలు అనెడు ఆవిరపాత్రములు. ఇందు పినమామగారి ప్రసక్తికి అవకాశము లేదు.

కృష్ణునికాలమునను వాతావరణము సంక్షోభితముగనే ఉండెను. మౌర్యులు నానాటికిని క్షీణింపసాగిరి. వారి సామంతులు నధికారులును ప్రబలులగుచుండిరి. ఇటు తూర్పున కళింగమున చేతివంశము అధికారమును స్థాపించి విజృంభింపసాగెను. ఇంతలో పాటలీపుత్రమునందొక విప్లవము జరిగెను. ఆనాటి బృహద్రథుడను మౌర్యరాజు మిక్కిలి అసమర్థుడుగ నుండెను. శుంగవంశీయుడగు పుష్యమిత్రుడతనిసేనాని. ఒకనాడు సైన్యపర్యవేక్షణమును మిషపై రాజును ఈవలికి రప్పించి పుష్యమిత్రుడు హఠాత్తుగ అతనిని నరికివేసెను. వెంటనే నగరము నాక్రమించి, సింహాసనము నధిష్ఠించి తానే రాజునని ప్రకటించెను.(187) ఇది బ్రహ్మాండమగు సంచలనము కలిగించెను. అంతవరకును మౌర్యసామ్రాజ్యమున చేరియుండిన విదర్భ స్వతంత్రమయ్యెను.

---

186. JBO BRAS. N. S. XVI. p. 33.

187. ఈ వృత్తాంతము పురాణములయందును, బాణుని హర్షచరిత్రమునను గాంచనగుచున్నది. Smith—Early History of India p. 208. n. i.

ఇట్లు ఉత్తరమున నొక క్రొత్త ప్రమాదము ఘోరముగ విజృంభించి నాసిక ప్రాంతమును బయలుదేరెను. ఈసమయమున కృష్ణుడు ఉత్త జయించి వశపరచుకొనెను.

## మొదటి సాతకర్ణి క్రీ. పూ. 180–170.

కృష్ణుని మరణానంతరము అతని అన్నకుమారుడగు శ్రీసాతకర్ణి రాజయ్యెను. ఈపేరుగల సాతవాహనరాజులలో నితడు మొదటివాడు. పురాణములలో ఇతని ప్రశంస యితడు కృష్ణుని పుత్రుడని అర్థమేర్పడునట్లు కలదు. కాని నానేఘాట్ గుహాలోని విగ్రహముల ఉనికి ఇతడు సిముకుని పుత్రుడని నిరూపించుచున్నది. "సిరిసాత" అను పేరుగల నాణెములు కొన్ని ఇతనివిగ పరిగణింపబడినవి (188) నానేఘాట్ గుహాలో ఇతని విగ్రహ మున్నది. ఇతనిభార్య నాగానిక శాసనమునందును, కళింగరాజగు ఖారవేలుని హాథీగుంఫా శాసనమునందును ఈ రాజు ప్రశంస కలదు.

ఈసాతకర్ణి పినతండ్రిని, తండ్రిని మించిన ప్రతిభాశాలి. కొన్నిపురాణము లితనిని "మహాన్" అని వర్ణించినవి.(189) నాగానికశాసనము నందితడు ఏకవీరుడనియు, శూరుడనియు, అప్రతిహతచక్రుడనియు, దక్షిణాపథపతి అనియు వర్ణింపబడినాడు. ఇతనిరాజ్యకాలము పదిసంవత్సరములే అయినను అది దక్షిణాపథ చరిత్రమున మిక్కిలి ముఖ్యమైనది. సిముక కృష్ణులు మౌర్యుల ఒత్తిడిని తట్టుకోవలసి వచ్చెను. సాతకర్ణికి మగధలో మౌర్యులకు పిమ్మట అధికారమునకు వచ్చిన శుంగులతోను, కళింగమునుండి విజృంభించిన ఖారవేలునితోను సంఘర్షణ మేర్పడెను. ఇట్లు సమానప్రతిభగల పుష్యమిత్రఖారవేలసాతకర్ణులొకేకాలమున సామ్రాజ్యవిస్తరణ దీక్షితులై ప్రతిస్పర్థులుగ నిలచిరి. తురుకుత్తరాపథమునకు పుష్యమిత్రుడును, దక్షిణాపథమునకు సాతకర్ణియు అప్రతిద్వంద్వులై పాలకులుగ నిలచిరి.

ఆనాటిపరిస్థితులలో ఏమిచూచినను సాతవాహనసామ్రాజ్యమునకు ప్రమాదమువచ్చు నవకాశముగాని, విస్తరణావకాశముగాని ప్రాగుత్తరదిశలనే కనిపించుచుండెను. ఈకారణము వలననే కృష్ణరాజు ముందుగ నాసికప్రాంతమును వశపరచుకొనెను. అతనిమాదర్శమునే సాతకర్ణియు అనుసరించెను. ఈరాజు నాణెములు మాళవాప్రాంతీయవి, ఉజ్జయిని పద్ధతిని నిర్మింపబడెనని. ఈనాణెము లితడు ఉజ్జయినిని జయించెనని తెలుపుచున్నవి.(190) ఈనగరము పూర్వము మౌర్యుల ముఖ్యకేంద్రములలో నొకటి. పుష్యమిత్రుడు కడపటిమౌర్యుని చంపి తాను క్రీ. పూ. 185 లో రాజయ్యెనని ఇదివరలో చెప్పియుంటిమి. ఈయదనున సాతకర్ణి మాళవముపై దండెత్తి ఉజ్జయినీకేంద్రముగ గల పశ్చిమమాళవమును జయించెనని ఊహింపవచ్చును. ఇతడు రెండశ్వమేధములను చేసెనని నాగానిక శాసనము చెప్పుచున్నది. ఉజ్జయిని యావద్భారతప్రసిద్ధమగు పుణ్యక్షేత్రము. సమాట్టుల ఉపకేంద్రము.

---

188. చూ. సాతవాహన నాణెములు అను శీర్షిక.

189. శ్రీశాంతకర్ణి ర్భవితా తస్య పుత్రోస్తు వై మహాన్ —బ్రహ్మాండ పురాణము.

190. Cf. Cambridge History of India vol. I. p. 531; Bhandarkar—EHD. pp. 71-72;

ఇట్టినగరమును జయించినందులకు సాతకర్ణి ఒక అశ్వమేధమును చేసెనని ఊహించుట సమంజసముగ నుండును. పుష్యమిత్రుడీకాలమున తనస్థితిని బలపరచుకొనుటలో నిమగ్నుడై యుండి సాతకర్ణి విజృంభణమునకు ప్రతీకార మొనర్పలేకపోయి యుండును. సాతవాహనుల విజృంభణ మింతటితో ఆగలేదు. శుంగులపై మరియొక దెబ్బ తీయుటకు వారికింకొక అవకాశము లభించెను. మౌర్యరాజుల కాలమున విదిశవిదర్భలు రెండు ఉపరాజ్యములుగ నుండెడివి. విదర్భపాలకుడగు యజ్ఞసేనుడు ఒకమౌర్యమంత్రికుమారుడు. పుష్యమిత్రుడు మౌర్యుల సింహాసనము నాక్రమించినపిమ్మట తనపుత్రుడగు అగ్నిమిత్రుని విదిశకు పాలకునిగ నియమించెను. పుష్యమిత్రుడొనర్చిన రాజద్రోహమునకు ప్రతీకారముగ యజ్ఞసేనుడు తనస్వాతంత్ర్యమును ప్రకటించెను. అంతట అగ్నిమిత్రుడు అతనితో యుద్ధము చేయవలసి వచ్చెను. ఈయదనున యజ్ఞసేనుడు సాతకర్ణితో సఖ్యము చేసుకొనెను. సాతకర్ణి యజ్ఞసేనుని శుంగులను ధిక్కరింపుమని ప్రోత్సహించి యుండును. తుదకు యజ్ఞసేనుడు ఓడిపోయెను. విదర్భ రెండుగ విభజింపబడెను. వరదానది యీరెండుభాగములకును సరిహద్దు అయ్యెను. దీనికి పర్యవసానముగ దక్షిణవిదర్భలో సాతవాహనుల పలుకుబడి ప్రతిష్ఠితమయ్యెనని ఊహింపవచ్చును.(191)

కళింగరాజగు ఖారవేలునితో సాతకర్ణికి ప్రబలమగు వైరము తటస్థించెను. ఈఖారవేలుని హాథీగుంఫాశాసనమునందు ఒక సాతకర్ణి ప్రశంస కలదు. ఆసాతకర్ణి యీ మొదటి సాతకర్ణి అని చాలమంది పండితులు అంగీకరించినారు. కొందరుమాత్రము ఈనిర్ణయమును నిరాకరించి, హాథీగుంఫాశాసనమున 165వ మౌర్యకాలము ఖారవేలుని 13వ రాజ్యవర్షమని చెప్పు భాగము లేదనియు, ఆశాసనము నందరాజ్యాభిషేకమైన 300ంవ సంవత్సరములకు పుట్టినదనియు, అందువలన అది క్రీ. పూ. 1వశతాబ్దినాటిదనియు, ఖారవేలుడు ఈకాలపువాడేఅనియు వాదించుచున్నారు.(192) మౌర్యకాలప్రశంసమాట ఎట్లున్నను, ఈశాసనమున 'దిమిత' అను యొక రాజు ప్రశంస కలదు. ఈదిమితుడు యవనరాజగు డెమిట్రియస్ కావలెను. అతడు క్రీ.పూ. 190లో రాజ్యమునకు వచ్చెను. దీనినిబట్టి యీశాసనమును, అందుప్రశంసింపబడిన ఖారవేలసాతకర్ణి డెమిట్రియస్‌లును క్రీ. పూ. 2వ శతాబ్దినాటివారని స్పష్టమగుచున్నది.(193) ఈకాలమున సాతవాహనవంశమున ఇద్దరు సాతకర్ణులుండిరి. అందు రెండవవాడు యుగపురాణమున పేర్కొనబడిన 'కళింగశాత'రాజని ఇదివరలో చెప్పియుంటిమి. అగుచో ఇతడు ఖారవేలుని అనంతర ముండియుండవలెనుకదా. అప్పుడు ఖారవేలుని సమకాలికుడగు సాతకర్ణి మొదటిసాతకర్ణియే అని ఏర్పడును. ఈఖారవేలుడు మహాబలశాలి. ఉత్తరాపథపతియగు పుష్యమిత్రుని, దక్షిణాపథపతియగు సాతకర్ణిని కూడ ఒక ఊపు ఊపిన ప్రతిభాశాలి. ఇతడు తన రెండవరాజ్యసంవత్సరమున హయగజరథ బహుళమగు సైన్యమును పశ్చిమముగ

191. Camb. Hist. Ind. I. p. 519.

192. Cf. Gopalachari—Early Hist. Andhra p. 37.

193. E. I. XX. pp. 71—89. హాథీగుంఫా శాసనము., 4_11 పంక్తులు.

బంపెను. ఆసైన్యము కృష్ణవేణీనదివరకును పోయి ముషికనగరమును భయపెట్టెను. సాతకర్ణిని లక్ష్యము చేయక ఖారవేలు డీసైన్యమును పంపెనట. దీనినిబట్టి యీసేన సాతకర్ణి రాజ్యమున నే ప్రవేశించెనని స్పష్టమగుచున్నది. నాల్గవరాజ్యవర్షమున రఠికభోజకులను తన పాదములకు నమస్కరించునట్లు చేసెను. పదియవరాజ్యసంవత్సరమున పూర్వరాజనిర్మితమగు పిథుండనగరమును గాడిదలు లాగిన నాగళ్ళచే దున్నించెను.(194) పై ముషికనగరము నైజాంరాజ్యమునందలి రాయిచూరుజిల్లాలో కృష్ణానదికి దగ్గరగనున్న ముస్కియను మసికనగరము కావచ్చునని ఇదివరలో చెప్పియుంటిమి. రఠికులు మహారాష్ట్రముననను, భోజకులు విదర్భలోను ఉండెడివారు. సిముకుని మహారాష్ట్రవిజయమునకు ఫలితముగ రఠికులు సాతవాహన సామంతులైరి. విదిశవిదర్భలకు జరిగిన యుద్ధసందర్భమున విదర్భలో సాతవాహనులకు పలుకుబడి లభించెను. పిథుండనగరము సాతవాహనరాజ్యము ప్రారంభమైన కేంద్రము కావచ్చునని ఇదివరలో చెప్పియుంటిమి. ఇట్లు ఖారవేలుడు పంపిన మూడు దండయాత్రలును సాతకర్ణిరాజ్యములోనికే నని స్పష్టమగుచున్నది. సాతకర్ణి దీనికి తగిన ప్రతీకారము చేసియే యుండును. అందువలననే ఇటుపైని ఖారవేలుడు ఉత్తరాపథము పైకి తనదృష్టిని మరల్చి పుష్యమిత్రుని పీడింప సాగెను. సాతకర్ణి ఖారవేలుడు తిరిగి ఆంధ్ర రాజ్యముమీదికి రాకుండునట్లు కట్టుదిట్టము చేసుకొని రెండవఅశ్వమేధమును చేసెను. ఇంతలో యవనులు మరియొకసారి దండెత్తి వచ్చిరి. మగధలో గంగాతీరమున వారికిని పుష్యమిత్రునికిని యుద్ధము జరిగెను. ఇట్లు పుష్యమిత్రఖారవేలులిర్వురును ఇతరకార్యాసక్తులై యుండి సాతకర్ణిని వదలివేసిరి. అప్పుడి ఆంధ్రరాజు రాజసూయము చేసెను.

శ్రీసాతకర్ణి మహారాజుడై అనేకములగు ప్రమాదములను అరికట్టి సాతవాహనసామ్రాజ్యము నకాలనాశమునుండి రక్షించెను. ఈ రాజు పరమధార్మికుడు. సనాతన వైదిక ధర్మమునెడ ఎక్కువ అనురక్తి కలిగి అనేక వైదికక్రతువుల నాచరించి హాయిగజరిఫగో సువర్ణాది పెక్కుదానములను చేసెను. ఇతని భార్య నాగానిక శాసనమునుండి యీమహారాజు అగ్న్యాధేయ, అనారంభణీయ, భగలాదశరాత్ర, గర్గత్రిరాత్ర, గవామయన, అప్తోర్యామ, అంగిరసామయన, శతాతిరాత్ర, అంగిరసత్రిరాత్ర, అంగిరసామయనాదిక్రతువులను చేసినట్లు తెలియుచున్నది.(195)

ఈసాతకర్ణి మహారాజు నాగానిక అను నామెను పెండ్లిచేసికొనెను. ఆమెయు లోకోత్తరగుణశీలసంపదకలది, మాసోపవాసిని, గృహతాపసి, చరితబ్రహ్మచర్య, దీక్షావ్రతి యజ్ఞనిరత. ఈదంపతులకు కుమారభాయ, కుమారహకుసిరి, కుమారసాతవాహన, సతిసిరిమత్, వేదిసిరిఅను కుమారులుండిరి. నాగానిక నానేఘాట్‌శాసనము ఆమె ఆకాలమున తనపుత్రుడగు వేదిశ్రీ పక్షమున పరిపాలనము సాగించుచుండెనా అను సందేహమును కవకాశము కల్పించుచున్నది. పైరాజపుత్రులలోని హకుసిరి ఒక నాసిక శాసనమున(196) పేర్కొనబడిన మహాహకుశ్రీ కావచ్చును. అది అతని

194. Raychaudari—Pol. Hist. Anc. Ind. pp. 196-201; Ind. Ant. 1910 p. 214.
195. చూ. అనుబంధము. 196. E. I. VIII Nasik. Ins. no. 19.

చోహిత్రి శాసనము. దీనినిబట్టి యీహాకుశ్రీ రాజ్యము చేయలేదని తెలియనగుచున్నది. సతిసిరిమత్ అనునతడు జైనగాథలలోని 'శక్తి కుమారుడగునని కొందరి ఊహ. వేదిశ్రీ పెద్దవాడై స్వతంత్రముగ రాజ్యముచేసెనో లేదో తెలియదు. పురాణములుమాత్రము సాతకర్ణికి పిమ్మట పూర్ణోత్సంగుని పేర్కొనుచున్నవి. విష్ణుభాగవతపురాణములుమాత్ర మితడు సాతకర్ణికుమారుడని చెప్పుచున్నవి. ఇది నిజమేయగుచో పైనపేర్కొనబడిన రాజపుత్రులలో నెవరో యొకరు పూర్ణోత్సంగ అను బిరుదముతో రాజ్యము చేసియుండవలెను.

## పూర్ణోత్సంగుడు క్రీ. పూ. 170-152.

ఇతని ప్రశంస ఒక్క-పురాణములలో తప్ప ఇతరాధారములలో కనిపించదు. ఇతని రాజ్యకాలమున క్రీ. పూ. 149లో పుష్యమిత్రశుంగుడు మరణించెను. అమీది క్రమక్రమముగ శుంగుల అధికారము క్షీణించసాగెను. బహుశః కొద్దికాలమునకే కళింగరాజగు ఖారవేలుడును మరణించి యుండును.

## రెండవ సాతకర్ణి క్రీ. పూ. 152-96.

ఈమహారాజు సాతవాహనవంశీయులందరిలోను ఎక్కువకాలము పరిపాలించెను. సిముక ప్రథమసాతకర్ణులవలె నితడును విజేత. ఇతని శాసనమొకటి సాంచీలో కలదు. మహారాష్ట్రమున దొరికినవని చెప్పబడిన, 'సిరిసాతకంణి' అనుపేరుగల ఇతని నాణెములును కలవు.(197) యుగపురాణము ఈకాలమున కళింగమునకు శాతరాజు పాలకుడుగ నుండెనని చెప్పుచున్నదనియు, నీశాతరాజు రెండవసాతకర్ణి కావలెననియు ఇదివరలో చెప్పియుంటిమి. ఖారవేలుడు మరణించినపిమ్మట చేతవంశ మేమయ్యెనో తెలియుటలేదు. బహుశః రెండవ సాతకర్ణి ప్రథమసాతకర్ణికాలమున ఖారవేలుడాంధ్రరాజ్యముపై పంపిన దండయాత్రలకు ప్రతీకారముగ ఖారవేలుని యనంతరము కళింగముపై దండెత్తిపోయి, చేతవంశము నంతమొందించి ఆరాజ్యమును తనసామ్రాజ్యమున కలుపుకొని యుండును. ఇతనికాలమున మరిరెండుమూడు ముఖ్యఘటనలు జరిగెనవి. అందు మొదటిది శకుల దండయాత్ర. శుంగవంశీయులలో భద్రకుడు రాజుగ నుండగ శకులు మగధపై దండెత్తివచ్చిరి. పాటలీనగరమున ఘోరమగు యుద్ధము జరిగెను. అందు శుంగరాజు మరణించెను. ఇది శుంగరాజ్యారంభమైన 69 సంవత్సరములకు, అనగా క్రీ. పూ. (185-69) 116 లో జరిగెను. శకులు పాటలీపుత్రము నాక్రమించి పాలించసాగిరి. వారియేలుబడి పదిసంవత్సరములు సాగెను. అకాలమున ప్రజ లనేకవిధముల పీడింపబడిరి. ఈశకరాజులలో కడపటియతడు అర్ధలుబ్ధుడై కళింగముపై దండెత్తెను. ఆదేశపుపాలకుడగు శాతరాజు (రెండవసాతకర్ణి) శకుల నోడించి

197. చూ. సాతివాహన నాణెములు అను శీర్షిక.

వెంటతరిమెను. అట్లు అతడు పాటలీనగరము వరకును పోయి, అటనుండియు వారిని తరిమి వేసి, ఆనగరము నాక్రమించి పదియేండ్లు పరిపాలించెను. ఈవృత్తాంతము యుగపురాణమున గలదు.(198) ఈసాతకర్ణి శాసనము సాంచీలో కలదు. ఈసాంచీ విదిశకు సమీపమునందున్నది. దీనినిబట్టి సాతకర్ణి విదిశను జయించెనని స్పష్టమగుచున్నది. బహుశః శకులు శుంగులను పారదోలి పాటలీనగరమును పరిపాలించుచుండినకాలమున అనగా క్రీ. పూ. 116_106 నడుమ సాతకర్ణి యీప్రాంతమును జయించి యుండును. పాటలీవృత్తముపై అతని పరిపాలనము క్రీ. పూ. 106_96నడుమ సాగెను. ఈసాతకర్ణి యిట్లు మగధను రక్షించుటలో నిమగ్నుడై యుండగ పడమట నొక ప్రమాదము జరిగెను. మొదటిసాతకర్ణి మరణించినపిమ్మట శుంగులు ఉజ్జయినిని తిరిగీ జయించిరి. వారు దానిని కొంతకాలము ఏలిన పిమ్మట గర్దభిలుడను రాజు ఆనగరము నాక్రమించెను. ఇతడు కాలకాచార్యుడను నొక జైనగురువు నవమానించెను. ఆయాచార్యుడు శకద్వీపమునకు పోయి 96 మంది శకనాయకులను తనవెంట గొనివచ్చెను. ఈశకులు సౌరాష్ట్రమును జయించి, ఆమీద గర్దభిలుని నిర్జించి ఉజ్జయినిని గైకొనిరి. ఈవృత్తాంతము క్రీ. పూ. 100 ప్రాంతమున జరిగెను.(199)

ఇట్లు రెండవ సాతకర్ణికాలము సాతవాహన వంశచరిత్రలో మిక్కిలి ముఖ్యమైనది. విదిశ కళింగమగధలను జయించి యీమహారాజు సాతవాహనసామ్రాజ్యమున, కపూర్వమగు విస్తృతిని కల్పించెను. ఈమహారాజు 56 సంవత్సరములు పరిపాలించి క్రీ. పూ. 96 లో మరణించెను.

## లంబోదరుడు క్రీ. పూ. 96_78.

రెండవసాతకర్ణికి పిమ్మట నితడు పరిపాలించెను. లంబోదరుడనునది ఇతని పేరు కాదనియు, మారుపేరనియు తోచుచున్నది. ఇతని కాలమున సాతవాహనులకు రెండు ప్రమాదములు సంభవించినవి. క్రీ. పూ. 100 ప్రాంతమున శకులు ఉజ్జయినిని జయించిరని చెప్పియుంటిమి. ఈసమయమున క్షహరాటవంశీయుడగు భూమకుడు గుజరాత్ కథియవారుల నాక్రమించెను. ఆవెనుక నహపానుడు సాతవాహనులవద్దనుండి మహారాష్ట్రమునుకూడ లాగికొని పరిపాలింపసాగెను.(200) కడపటిశుంగులలో భాగవతుడు సుప్రసిద్ధుడు. అతడు విదిశ ప్రాంతము నేలినట్లు నిదర్శనము లున్నవి. దీనినిబట్టి రెండవసాతకర్ణి అనంతరము సాతవాహనులు విదిశనుకూడ పోగొట్టుకొనిరని తెలియనగుచున్నది.

## ఆపీలకుడు క్రీ. పూ. 78_66.

ఇతని నాణెమొకటి మధ్యరాష్ట్రములలోని చత్తీస్ ఘర్ జిల్లాలో దొరికినది.(201) రెండవ సాతకర్ణి యనంతరము శుంగులు పాటలీనగరమును తిరిగి జయించియుందురు. ఆమీద విది

198. చూ. అనుబంధము నందలి యుగపురాణ భాగము.
199. JBORS. vol. XVI. pp. 201-203
200. Rapson—CAC. Intro pp. 104—108.
201. JASB. I. 1935. p. 28.

శయు పోయెను. కాని యీనాణెము ఆపీలకుని కాలమున మధ్యరాష్ట్రములలోని ప్రాగ్భాగము సాతవాహనుల యేలుబడిలో నుండెనని తెలుపుచున్నది. ఈఆపీలకుని కాలమున మగధలో నొక ముఖ్యసంఘటనము జరిగెను. దేవభూతియను కడపటి శుంగరాజు విలాసప్రియుడు ననమర్థుడు నైయుండెను. అతని మంత్రియు కాణ్వవంశీయుడునగు వసుదేవుడు క్రీ. పూ. 73 లో ఒకనాడు ఒక దాసీపుత్రిచేత రాజును చంపించి, మగధరాజ్యసింహాసనము నాక్రమించెను.[202]

## ౧౨. ఆంధ్రులు — మగధ

ఆంధ్రసాతవాహనుల చరిత్రమునందు వారు మగధను జయించి పరిపాలించుట ఒక ముఖ్యఘట్టము. "వీరు మగధను పరిపాలించుట సంభవమే అయినను దానిని నిర్ధారణచేయుటకు అవసరమగు సామగ్రి లభించుటలేదు" అని స్మిత్ వ్రాసెను.[203] ఇటీవల సాతవాహనులను గురించి వ్రాయుచున్నవారెవరును ఈయంశమును ప్రశంసించుటలేదు. కాని ఉపలభ్యమగు సామగ్రి ఆంధ్రుల మగధరాజత్వమును నిరూపించుటకు చాలినంత కలదు.

ఆంధ్రులు మగధను పాలించిరని నిరూపించు మొదటి ప్రమాణము పురాణములు. వానిలో ఆంధ్రరాజులకు పూర్వమునను పరపరమునకుకూడ మగధను ఏలిన మౌర్యశుంగకాణ్వగుప్తరాజవంశముల వర్ణన కలదు. ఆంధ్రులును వారివలె నారాజ్యము నేలియుండవలెను. మఱియును కాణ్వులలో కడపటి వానిని చంపి ఆంధ్రరాజు వసుంధరను పొందునని చెప్పబడినది. కాణ్వులు మగధ నేలిరి. వారివద్దనుండి ఆంధ్రులు సంపాదింపదగిన వసుంధర మగధయే కావలెనుగదా.

యుగపురాణము శకులను ఓడించి వెంటదరిమి, పదిసంవత్సరములు పాటలీనగరమునుండి పరిపాలించినట్లు చెప్పబడిన కళింగసాతరాజు రెండవసాతకర్ణి అని ఇదివరలో చెప్పియుంటిమి.

ఆర్కి శాఖవారు నేటి పాట్నావద్ద కుమర్‌హార్ అనుచోట ఖననము చేసి ప్రాచీనపాటలీనగరముండిన స్థలమును కనిపెట్టిరి. ఈసందర్భమున మౌర్యయుగమునాటి సామగ్రితోపాటు కొన్ని సాతవాహననాణెములు దొరికినవి.[204] అల్లాహాబాదువద్ద భిటా అనుచోటను ఖననపరిశోధన జరిగినది. ఇచ్చట విశాలములగు నగరములు బయలుపడినవి. అందొకటి సాతవాహనయుగమునాటిది. అందులో సాతవాహననాణెములు దొరికినవి [205] దీనినిబట్టి ఒకప్పుడైనను అల్లహాబాదుపాట్నాలమధ్యనున్న భాగము సాతవాహనులవశమునందుండెనని తెలియనగుచున్నది.

క్రీ. పూ. 28లో కాణ్వరాజ్యాంత్యమైనది మొదలు క్రీ. శ. 300ప్రాంతమున గుప్తరాజ్యము ప్రతిష్టింపబడుటవరకునుగల మధ్య

202. Cowell and Thomas—Harshacharita p. 193. 203. Early Hist. Ind. p. 216. 204. J. BORS. vol. XVI. p. 205. 205. Arch. Sur. Repts 1918. p. 115.

కాలమున మగధరాజ్యము యొక్కయు, పాటలీనగరముయొక్కయు చరిత్రము తెలియుట లేదు. క్రీ. శ. 78లో రెండవకాడ్ఫైసిస్ అను కుషానవంశపురాజు విజృంభించి పంజాబుదాటి వచ్చి, తూర్పున గంగాతీరము నందున్న ఘాజీపూర్ కాశీలవరకును, దక్షిణమున విదిశసౌరాష్ట్రములను జయించెను.(206) ఈకుషానుల విజృంభణమునకు ఫలితముగ సాతవాహనులు ఉత్తరాపథమున తమ యధికారమును గోల్పోయియుందురు. అవిూద వారికి క్షహరాటులును, ఉజ్జయినీపాలకులగు శకులును ప్రబలశత్రువులైరి. బహుశః పాటలీనగరము మరియొక స్థానికరాజవంశమునకు వశమైయుండును [207] ఈసమకాలికచరిత్రమునుబట్టి చూచినను క్రీ. పూ. 28_క్రీ. శ. 78 నడుమ మగధరాజ్యము సాతవాహనుల యేలుబడియందుండెననియే తోచుచున్నది.

## కుంతల సాతకర్ణి క్రీ. పూ. 38_30

ఈరాజు మిక్కిలి ప్రసిద్ధుడు కథాసరిత్సాగరమునందలి యొక కథ సాతవాహనబిరుదాంచితుడగు నొకరాజు ప్రతిష్ఠానపురమున తన యాస్థానమున సుశర్మను ఉంచుకొని అతని కుమార్తెను తనయాశ్రితుని కొకనికి పెండ్లి చేయుమని ఆజ్ఞాపించెనని చెప్పబడినది. ఈ సుశర్మకాణ్వరాజులలో కడపటివాడగు సుశర్మ అని ఒక వాదము కలదు.(208) అదేగ్రంథమున విషమశీలలంబకమను నొక భాగము కలదు. అందు విక్రమాదిత్యబిరుదాంచితుడగు విషమశీలుడను రాజు కథ కలదు. ఒకప్పుడు మ్లేచ్ఛులబాధ యెక్కువకాగా దేవతలు శివునివద్దకు పోయి యాబాధ నివారణ చేయుమని ప్రార్థించిరట. అతడు తన ప్రమథగణములోని మాల్యవంతుని ఉజ్జయినీపాలకుడగు మహేంద్రాదిత్యునికి పుత్రుడుగ బుట్టి దేవకార్యమును నిర్వహింపుమని ఆజ్ఞాపించెనట. ఇట్లు జన్మించి యితడు విషమశీలుడనియు విక్రమాదిత్యుడనియు ప్రసిద్ధినందెనట. ఇతని సైన్యములు దక్షిణాపథమున అపరాంతసౌరాష్ట్రములను, మధ్యదేశమును, అంగవంగకళింగకాశ్మీరములను జయించెనట. గౌడకర్ణాటలాటసింధుభిల్లపారశీకపాలకులితని సామంతులట. ఇతనికి సింహళద్వీపరాజపుత్రికయగు మదనలేఖయు, కళింగసేనయు, మలయవతియు భార్యలట.(209) పురాణములలో కుంతలస్వాతికర్ణియు, నతని తండ్రి మహేంద్రస్వాతియు పేర్కొనబడినారు. పైకథలోని మహేంద్రాదిత్యునిపేరు ఈమహేంద్రస్వాతి పేరువలె నున్నది. వాత్స్యాయనకామసూత్రములలో కుంతలసాతకర్ణి తనరాణియగుమలయవతిని కత్తెర విసిరి చంపెనని చెప్పబడినది.(210)

206. Smith—E. Hist. Ind. p. 265.

207. కౌముదీమహోత్సవ మను సంస్కృత నాటకమునందలి వస్తువు ఈ వంశముయొక్క చరిత్రకు సంబంధించినది కావచ్చును.

2 8. JBORS. vol. XVI. Saka-Satavahana History para 108 A; కథాసరిత్సాగరము (నిర్ణయసాగరప్రతి) పే. 21. 209. కథాసరిత్సాగరము కడపటి లంబకము.

210. కుంతలః సాతకర్ణిః కర్తర్యా దేవీం మలయవతీం జఘాన.

పైకథలోని విక్రమాదిత్యుని భార్యలలో మలయవతి పేర్కొనబడినది. ఈయంశములను బట్టి యీవిక్రమాదిత్యుడు కుంతలసాతకర్ణి కావచ్చునని తోచుచున్నది. ఈయూహ నిజమగునెడల కుంతలసాతకర్ణి సుశర్మను జయించి తనకు సామంతుని చేసికొనెనని యేర్పడును. పురాణములు సుశర్మ 10 సంవత్సరములు రాజ్యము చేసెనని చెప్పుచున్నవి. ఈకాలము క్రీ. పూ. 38–28 అగును. కుంతలుని కాలము క్రీ. పూ. 38–30. వీరిద్దరును సమకాలికులు. ఈయంశము పైయూహను బలపరచుచున్నది. కాని కథాసరిత్సాగరమునందలి విక్రమాదిత్యునికి అవంతిలోని ఉజ్జయినీనగరము రాజధాని అని చెప్పబడినది. సాతవాహనుల రాజధాని ప్రతిష్ఠానము. ఒకవేళ నాటిపరిస్థితులలో ఉజ్జయిని కొంతకాలము సాతవాహనుల కుపరాజధానిగ నుండెనేమో!

రాజశేఖరుని కావ్యమీమాంసలో కుంతలుడు అంతఃపురమున ప్రాకృతభాషలోనే మాట్లాడుచుండెనని చెప్పబడినది.(211) ఈ యంశము కథాసరిత్సాగరము నందలి మఱియొక కథను స్ఫురింపచేయుచున్నది.(212) ప్రతిష్ఠానపురమున సాతవాహనుడు రాజ్యము చేయుచుండెనట. అతనికి శర్వవర్మ మున్నగువారు మంత్రులుగ నుండిరట. ఒకనాడు గుణాఢ్యుడను మహాపండితుడు రాజును దర్శించెనట. రాజీతనినికూడ నొకమంత్రిగ నియమించెనట. ఒకనాడు సాతవాహనుడు భార్యలతోగూడి జలక్రీడలతో వినోదించుచుండెనట. హేలగా నాతడు భార్యలమీదకు నీళ్ళు కొట్టెనట. అందొకరాణి బాధనంది "మోదకైర్దేవ పరితాడయ మాం" (దేవ! నన్ను నీళ్ళతో కొట్టకుము) అనెనట. అందు మొదటిమాటను అపార్థము చేసుకొని రాజు ఉండ్రాళ్ళను తెప్పించెనట. ఇతని అనభిజ్ఞతకు నవ్వి, రాణి "జలక్రీడాసమయమున మోదకములెందుకు? నేను "మ ఉదకైః తాడయ" అని అంటినికదా! మా, ఉదక శబ్దముల సంధి నైనను గుర్తెరుంగజాలని మూర్ఖుడవా" అని పరిహసించెనట. పరివారమును నవ్వెనట. వెంటనే నీటినుండి వెలుపలికి వచ్చి రాజు ప్రాసాదమునకుపోయి, అన్నపానాదులను వర్జించి, ఖిన్నుడై, చిత్రమునందలి బొమ్మవలె ఉలకక పలకక నుండెనట. పరిచారకుల వలన నీవార్తను విని గుణాఢ్యశర్మవర్మలు ఎట్లో రాజును రంజింపచేసి పలుకునట్లు చేసిరట. అతనును ఎంతకాలము కృషిచేసిన తాను పండితుడు కావచ్చునని అడిగెనట. అప్పుడు సర్వవిద్యలకును మూలమగు వ్యాకరణమున పండ్రెండుసంవత్సరములలో రాజును పండితుని చేయగలనని గుణాఢ్యుడు చెప్పెనట. అంతట శర్వవర్మ తానాపనిని ఆరు నెలలలో చేయగలనని అనెనట. ఇది విని గుణాఢ్యుడు ఆరునెలలో శర్వవర్మ రాజును సంస్కృతవ్యాకరణపారగుని చేయగలిగినచో తాను సంస్కృతప్రాకృతదేశభాషలను త్యజింతునని శపథము చేసెను. శర్వవర్మయు తాను అట్లు చేయలేనియెడల పండ్రెండుసంవత్సరములు గుణాఢ్యుని పాదుకలను తలపై మోసెదనని ప్రతిజ్ఞ చేసెనట. ఆమీద శర్వవర్మ కుమారస్వామి నారాధించి కాతంత్రమను పేరుగల లఘువ్యాకరణమును సంపాదించి,

211. అధ్యా. 10.

212. కథాపీఠ లంబకము.

దానిని గడువులోపుగ సాతవాహనుని కుప దేశించి అతనిని పండితుని చేసెనట. రాజును గురుదక్షిణగ శర్వవర్మకు నర్మదాతీరమునం దున్న భరుకచ్ఛనగరాధిపత్యము నొసంగెనట. కుంతలుని ప్రాకృతభాషాప్రియత్వము కథాసరిత్సాగరమునందలి సాతవాహనుని సంస్కృత భాషానభిజ్ఞత్వమును అన్యోన్యావిరుద్ధములుగ నున్నవి. జైనఆవశ్యకసూత్రమను ప్రాకృతగ్రంథమున(213) నహవానుడు భరుకచ్ఛమున రాజనియు, సాలివాహనుడు పైఠానమున రాజనియు, నహపానుడు ద్రవ్యసమృద్ధుడనియు, తాను బలసమృద్ధుడయ్యు శాలివాహనుడు రెండుసార్లు నహపానునితోపోరి గెలువలేకపోయెననియు, తుదకు శాలివాహనుడు తనమంత్రిని గూఢముగ నహపానునివద్దకు బంపి, ధర్మకార్యములకై అతనిధనమునంతను వ్యయింపచేయించి, ఆమీద ఆరాజును యుద్ధమునందు ఓడించెననియు ఒక కథకలదు. ఈ వృత్తాంతము కథాసరిత్సాగరమునందలి పై కథకు అనుగుణ్యముగ నున్నది. ఇందలి నహవానుడు క్షహరాటవంశపురాజగు నహపానుడు కావలెను. అతడును కుంతలునివలె క్రీ. పూ. 1వశతాబ్దిలోనివాడే.

పైన పేర్కొనబడిన అంశములను, చేయబడిన ఊహలనుబట్టి కుంతలసాతకర్ణి మహాప్రతిభాశాలిగ తెలియనగుచున్నాడు. ఆనాడు కాణ్వులు దుర్బలులుగనున్నసంగతి గ్రహించి అతడు వారిరాజగు సుశర్మను వశపరచుకొని పాటలీనగరమునకు అధిరాజయ్యెను. అంతటితో తృప్తినందక ఈఆంధ్రరాజు ఉత్తరాపథ పాలకులలో పెక్కుమందిని సామంతులుగ చేసికొనెను. మొదట ప్రాకృతభాషాప్రియుడుగ నుండి ఆమీద సంస్కృతమునను పాండిత్యమును సంపాదించెను. జగత్ప్రసిద్ధమగు బృహత్కథయను పైశాచీభాషాగ్రంథ మితని మంత్రియగు గుణాఢ్యపండితునిచే రచింపబడెను. ఈకుంతలసాతకర్ణి నహపానుని ఓడించి నాడు ముఖ్యమగు రేవుపట్టణముగ నుండిన భరుకచ్ఛమును జయించెను. ఈవిజయము లితని విక్రమాదిత్యబిరుదమును సార్థకమొనర్చినవి.

## మొదటి పులోమావి క్రీ. పూ. 30–6

కొన్ని పురాణము లితనిని ప్రముఖునిగ పేర్కొనుచున్నవి. కొందరు పండితులు ఈ రాజే కాణ్వవంశమును అంతమొందించి పాటలీనగరమును గైకొనెనని ఊహించుచున్నారని ఇదివరలో చెప్పియుంటిమి. ఇది సంభవము. ఏలనన కాణ్వులలో కడపటివాడగు సుశర్మ క్రీ. పూ. 28లో మరణించెనని పురాణములనుండి తెలియనగును. పులోమావి క్రీ. పూ. 30 లో రాజ్యమునకు వచ్చెను. బహుశః కుంతలసాతకర్ణి మరణించినవెంటనే సుశర్మ పాటలీపుత్రమునకు పోయి స్వాతంత్ర్యమును ప్రకటించి యుండును. దీనికి ప్రతీకారముగ పులోమావి పాటలీనగరముపై దండెత్తిపోయి, సుశర్మను యుద్ధమున చంపి ఆనగరము నాక్రమించి యుండును. ఇంతకంటెను ఈ రాజునుగూర్చి వివరములు తెలియవు.

213. JBORS. vol. XVI pp. 200—201

## హాలుఁడు క్రీ. శ. 19—24

ఈమహారాజు పరిపాలనాకాలము సాతవాహనుల చరిత్రమునందు స్వర్ణయుగము. ఇతని ప్రశంస వాఙ్మయమునమాత్రము కనిపించుచున్నది. ఇతఁడు గాథాసప్తశతియను ప్రాకృత కావ్యమును సంకలనము చేసి శాశ్వతమగు కీర్తిని సంపాదించెను. తాను స్వయముగ మహాకవి, విద్వత్పోషకుఁడు. లీలావతియను ప్రాకృతకావ్యమునుండి యీమహారాజు సింహళరాజపుత్రికయగు లీలావతిని సప్తగోదావరీతీరమున భీమేశ్వరక్షేత్రమగు దక్షారామమున వివాహమాడెనని తెలియుచున్నది.(214) మధ్యదేశమును, నర్మదాప్రాంతమంతయు, ఆంధ్రకళింగములు నితనిరాజ్యమున చేరియుండెనవి.

భవిష్యోత్తరపురాణమున రాజకాలనిర్ణయమను విభాగమొకటి కలదు.(215) అందు మగధరాజవంశముల ప్రశంసయు, ఆసందర్భమున ఆంధ్రరాజవంశముయొక్క ప్రశంసయు చేయబడెనవి. ఆంధ్రరాజులలో చంద్రశ్రీ అనునతఁడు మూడేండ్లు మగధను పాలించెనట. ఆకాలమున శ్రీపర్వతాధిపతిపౌత్రుఁడును, పార్వతీయకులోద్భవుఁడునగు చంద్రగుప్తుఁడు లిచ్ఛవుల సహాయముతో చంద్రశ్రీ కొలువున ప్రవేశించెనట. పిమ్మట రాజభార్యతో కుట్రచేసి యితఁడు రాజును హత్యచేయించెనట. ఆమీఁద చంద్రశ్రీకుమారుఁడు పులోమావి ఏడేండ్లు రాజుగనుండెనట. ఈకాలమున నీబాలరాజుకు సంరక్షకుఁడుగనుండి యొకనాఁడు చంద్రగుప్తుఁడితనిని చంపించి తానే సింహాసనము నధిష్ఠించెనట. శ్రీపార్వతీయాంధ్ర భృత్యుల పరిపాలన మీవిధముగ స్థాపింపబడెనట. ఈచంద్రశ్రీ పులోమావుల పేర్లును, రాజ్యకాలపరిమితులును పౌరాణికపట్టికల లోని కడపటి యిద్దరుఆంధ్రరాజుల వర్ణనకును సరియగుచున్నవి. సాతవాహనుల కాలముననే గుప్తశబ్దాభిధులగు కొందరు కనిపించుచున్నారు. గౌతమీపుత్రశాతకర్ణి నాసికశాసనమొకటి ఒక శివగుప్తుని పేర్కొనుచున్నది.(216) అతఁడాశాసనమునకు లేఖకుఁడు. వాసిష్ఠీపుత్రపులోమావియొక్క కార్లాశాసనములలో నొకదానిని శివస్కందగుప్తుఁడనునతఁడు అమలుపరచెను.(217) ప్రాచీనపల్లవరాజ్ఞియగు చారుదేవి ప్రాకృతతామ్రశాసనమునందలి దానమును రోహిణిగుప్తుఁడనునతఁడు అమలుపరచెను.(218) ఇచ్ఛావార్ అనుచోట దొరికిన ఒకశాసనమునందు శ్రీహరిదాసుఁడను రాజుయొక్క మహాదేవి గుప్తవంశోద్భవ అని చెప్పబడినది. శుంగులనాటి ఒక బరాహుత్ శాసనమున వసుదేవుఁడనురాజుభార్య "గుప్తి" అని పేర్కొనబడినది. ఆంధ్రరాజులగు ఈచంద్రశ్రీ పులోమావుల శాసనములు ఆంధ్రదేశముననే గాని ఉత్తరముగ గన్పింపవు. దీనినిబట్టి రాజకాలనిర్ణయములోని అంశములను సందేహింపవలసి వచ్చును.

ఇట్లు సాతవాహనులు మగధను పాలించుట వాస్తవము. ఈఆంధ్రుల ఉత్తరాపథపరిపాల

---

214. భారతి III. pp.    215. చూ. అనుబంధ

216. E. I. VIII. Nasik Ins. no. 4.

217. Ibid. VII. no. 19.    218. Ibid. VIII. pp. 143—146.

నమునందు రెండవసాతకర్ణి, కుంతలసాతకర్ణి, ప్రథమపులోమావి, హాలశాలివాహనుల రాజ్యకాలములు మిక్కిలిముఖ్యమైనవి. క్రీ. శ. 78 లో కుషానుల అధికారము మగధకు వ్యాపించుటలో సాతవాహనుల కా ప్రాంతముతో సంబంధము పోయెను.

## ౧౩. శకసాతవాహన సంబంధము

భారతదేశముమీదికి ఎందరో విదేశీయులు అప్పుడప్పుడు దండెత్తివచ్చి, కొంతభాగము నాక్రమించి, దానినేలి ఆమీదట ఇచటి దేశీయులలో కలిసిపోయిరి. ఇట్టి విదేశీయులలో యవనశకపహ్లవులు ముఖ్యులు. ఇందు యవనులు గ్రీకుదేశీయులు. ఆదేశపురాజగు అలెగ్జాండరు క్రీ. పూ. 326 లో ఈదేశముపైదండెత్తివచ్చి వెనుకకు మరలిన పిమ్మట మనదేశమునకు పశ్చిమోత్తరమున అతని దేశీయులు కొందరు స్థిరపడి బాక్ట్రియా, పార్థియా అను రాజ్యముల నేర్పరచిరి. మౌర్యచంద్రగుప్తునికిని సెల్యూకస్ అను యవనరాజునకును వైవాహికసంబంధమేర్పడెను. అనేకమందియవనులు భారతదేశములోనికి వచ్చి ఆవాసము లేర్పరచుకొనిరి. శకులు శకద్వీపవాసులు. వారిలో కొందరు పంజాబును మధ్యదేశమును పరిపాలించిరి. పహ్లవులు పార్థియాదేశపువారు. యవనపహ్లవశకులు వరుసగ భారతదేశముమీదదండెత్తిరి. వీరిప్రశంస రామాయణ(219) మహాభారతములయందును,(220) హరివంశమునను,(221) మహాభాష్య(222) మనుస్మృతులలోను(223) కలదు. కాలక్రమమున శకనాయకులు గాంధారమునందలి కపిశలోను, పంజాబులోని తక్షశిలయందును, మధ్యదేశములోని మథురయందును తమఅధికారమును స్థాపించి క్షత్రప, మహాక్షత్రప అను బిరుదములతో పరిపాలనము సాగించిరి. ఈమూడుశాఖలునుగాక మహారాష్ట్రమునందొక శాఖవారును, ఉజ్జయినీనగరమునందింకొకశాఖవారును శకక్షత్రపులు పరిపాలన చేసిరి.

శకులు బహుదుర్మార్గులనియు, వారు ప్రజల ననేకవిధముల బాధించిరనియు యుగపురాణాదిగ్రంథములు తెలుపుచున్నవి. దేశీయరాజు లనేకమంది యీశకులతో పోరాడిరి. విక్రమాదిత్యుడను రాజు శకారిగ ప్రసిద్ధి నందెను. ఈవిక్రమాదిత్యశబ్దము బిరుదము వలె ఉన్నది. ఈబిరుదమును అనేకమంది ధరించిరి. మొదట నీబిరుదముగల రాజు ఒకడు శకులతో పోరి, వారి నోడించి ప్రసిద్ధుడై యుండును. అంతటినుండి శకారియైన ప్రతిరాజు నీబిరుదమును వహించిన ట్లగపడుచున్నది. శకారియై తనపేర నొకశకమును స్థాపించిన విక్రమాదిత్యుడొకడును,[224] జైనులగాథల ననుసరించి గర్దభిలుని ఓడించిన శకులను ధ్వంసముచేసిన విక్రమాదిత్యుడొకడును,[225] కథాసరిత్సాగరమున పేర్కొనబడిన విషమశీలుడను పేరుగల విక్రమాదిత్యుడొకడును,[226] గాథాసప్తశతిలో మహా

219. I. 54. 22; IV. 43. 12. 220. II. 32. 17. 221. Ch. XVI. 16.
222. I. A. 1875. p. 244. 223. X. 44.
224. ఈ శకము క్రీ. పూ. 58 లో ప్రారంభమయ్యెను.
225. Cf. జైనపట్టావళిగాథలు, జినసేనుని హరివంశము. 226. విషమశీలలంబకము.

దాతగ వర్ణింపబడిన విక్రమాదిత్యు డొకడును,[227] గుప్తచక్రవర్తులలో మూడవ వాడై ఉజ్జయినీశకులతో యుద్ధము చేసిన చంద్రగుప్తనామధేయుడైన విక్రమాదిత్యు డొకడును గాంచనగుచున్నారు.

కాలకాచార్యకథానకము జైనగ్రంథ మొకటి శకుల రాకనుగురించి కొన్ని వివరములను తెలుపుచున్నది.(228) ఉజ్జయినీపాలకు డగు గర్ధభిలుడు కాలకాచార్యుడను జైనగురువును అవమానించెనట. అంతట కాలకుడు సాగకులమునకు పోయి అచ్చట శకనాయకుల రాజును భారతదేశముమీద దండెత్తుమని ప్రోత్సహించెను. 96 గురు శకనాయకులు దండెత్తి వచ్చిరి. గర్ధభిలుడు వీరిచే ధ్వంసము చేయబడెను. అంతట నొక శకనాయకుడు ఉజ్జయినికి పాలకుడయ్యెను. మాలవసౌరాష్ట్రములు వీరికి వశపడెను. ఇది విక్రమశకారంభమునకు పూర్వము జరిగెనట. జైనుల పట్టావలిగాథలును, జినసేనుని హరివంశపురాణమును ఈశకదండయాత్రనుగురించి మరికొన్ని వివరములను తెలుపుచున్నవి.(229) అందు పుష్యమిత్రశుంగుడు 30 ఏండ్లు ఉజ్జయినిని పాలించునని ఉన్నది. ఆమీద హరివంశమున అగ్నిమిత్రవసుమిత్రులు 60 ఏండ్లు పాలింతురనియు, పట్టావలిగాథలలో ఈ 60 ఏండ్లను బాలమిత్రభానుమిత్రులు పాలింతురనియు చెప్పబడినది. పిమ్మట నహపానుడు 40 ఏండ్లను, గర్దభిలుడు 13 ఏండ్లను, శకుడు 4 ఏండ్లను, విక్రమాదిత్యుడు తనరాజ్యాభిషేకమునకు పూర్వము 18 ఏండ్లను పాలింతురని గాథలలో కలదు. హరివంశమున శుంగులకు పిమ్మట రాసభ (గర్దభిల) రాజులు 100 ఏండ్లను, నరవాహులు 42 ఏండ్లను ఏలుదురని ఉన్నవి. దీనినిబట్టి శుంగులు 90 సంవత్సరములు ఏలిన తర్వాతను, విక్రమశకారంభమునకు 42 ఏండ్లు ముందును శకుడగు నహపానుడు ఉండెనని ఏర్పడుచున్నది. శుంగరాజ్యారంభము క్రీ. పూ. 188లో జరిగెను. అప్పుడు (188–90) నహపానుడు క్రీ. పూ. 98 నుండి పరిపాలించెనని ఏర్పడును. విక్రమశకము క్రీ. పూ. 58 నుండి ప్రారంభమయ్యెను. ఇంతకు 42 ఏండ్లు ముందు అనగా క్రీ. పూ. 100 అగుచున్నది. అందువలన శకులు ఉజ్జయినిపై దండెత్తి వచ్చుట క్రీ. పూ. 100 ప్రాంతమున జరిగెనని ఊహింపవచ్చును.

గర్గసంహితాంతర్గతమగు యుగపురాణము కూడ శకులదండయాత్రనుగురించి కొన్నివివరములను తెలుపుచున్నది.[230]శుంగవంశీయుడు ఓ్రఘకుడు రాజుగనుండగ శకసంఘములతని రాజ్యముమీద దాడి చేసినవి. అప్పుడు జరిగిన యుద్ధమునం దీరాజు మరణించెనట. విజయులైన శకులు పాటలీనగరమును వశపరచుకొని ప్రజలను హింసించి, అటనుండి పరిపాలించిరట. వీరిలో అమ్లాటుడు కొంత కాలమును, తర్వాత గోపాలుడు 1సంవత్సరమును, పుష్పకుడు 1ఏడును, శర్విలుడు 3ఏండ్లును, తర్వాత ఇంకొక నాయకుడును ఏలిరట. ఈకడపటిరాజు దురాశాపరుడై కళింగదేశముమీద దాడి చేసెను. ఆదేశపురాజగు శాతిరాజు ఇతనిని ఓడించి, వెంట తరిమి,

227. చూ. అనుబంధములోని 'సప్తశతి'లో భాగములు.

228. JDORS XVI. pp. 293–94. 229. Ibid p. 234.

230. చూ. అనుబంధము.

పాటలీనగరమును పట్టుకొని, పదియేండ్లు పాలించెనట. శుంగులుపుష్యమిత్రునినుండి ఓఘ్రికునివరకును మొత్తము 69 సంవత్సరములు, అనగా (185–69) క్రీ. పూ. 116 వరకును ఏలియుండిరి. ఆమీదట శకుల ఏలుబడి 10 ఏండ్లు చెల్లెను. ఇది క్రీ. పూ. (116–10) 106 లో అంతమగును.

శాసనములనుండియు నాణెములనుండియు, మహారాష్ట్రకథియవారులను క్షహరాటవంశీయులగు శకులు కొందరు పరిపాలించినట్లు తెలియుచున్నది. ఇందు ఘటక, భూమక, నహపాన అను ముగ్గురు రాజుల పేర్లు తెలియుచున్నవి. వీరిలో ఘటకుడు మథురాప్రాంతము నేలెను. భూమకుడు గుజరాత్ కథియవారు మాల్వాలను పరిపాలించెను.(231) అతని తర్వాత నహపానుడు క్షత్రపుడయ్యెను. ఇతని శాసనములు నాసిక, జునార్ కార్లాలలో దొరికినవి.(232) జగల్ తొంబి అనుచోట ఇతని నాణెములు సుమారు 3000 దొరికినవి. ఈఆధారములనుబట్టి ఇతడు ఉత్తరకొంకణములోని పునాసోపారాలనుండిమాల్వాలోని దశపురము వరకును, పశ్చిమోత్తరముగ అజ్మీరుపుష్కర తీర్థములవరకును గల ప్రాంతమును పరిపాలించినట్లు తెలియుచున్నది.(233) ఇతని శాసనములు ఇతని రాజ్యసంవత్సరములలో కాక ఏదియో ఒక శకమున వేయబడినవి. అందు కడపటిది 46వ సంవత్సరమునాటిది. విదిశను పాలించిన వారిలో నఖపానజభనధర్మకంగరుల పేర్లు కలవు. వీరు శుంగులరాజ్యాంతమగుటకు పూర్వము ఏలిరట. ఇందలి నఖపానజుడు నహపానుని కుమారుడు కానచ్చును. నహపానునికి ఉషవదత్తుడను ప్రతిభాశాలియగు అల్లుడుండెను. నహపానుడు క్షహరాటవంశీయుడు. ఈక్షహరాటులు మథురక్షాత్రపులకు సామంతులని కొందరు పండితుల అభిప్రాయము.

ఉజ్జయినీనగరమున మరియొక శకవంశము వర్ధిల్లెను. వీరిది కార్దమకవంశము. దీనికి య్సామొతికుడు స్థాపకుడు. ఆమీదట చష్టన, జయదామ, రుద్రదాములు పాలకులైరి. ఈ రాజుల శాసనములును, నాణెములును అనేకములు కలవు. వీరిశాసనములును ప్రత్యేక రాజ్యసంవత్సరములలోగాక ఏదియో ఒక శకమున వేయబడినవి. రుద్రదాముని శాసనములు 72, 75వ సంవత్సరములనాటివి కలవు. చష్టనుని నాణెములు గుజరాత్, కథియవార్, అజ్మీర్, పుష్కరములలో దొరికినవి. ఇతడు క్షత్రపబిరుదాంచితుడుగ నుండి పిమ్మట మహాక్షత్రపుడయ్యెను. ఇతని నాణెములమీద ఖరోష్ఠి లిపిలో అక్షరములున్నవి. ఈకారణములనుబట్టి ఇతడు ఉత్తరాపథమునేలిన రాజులకు సామంతుడుగ నుండెనని తోచుచున్నది.(234) ఇతడు మహాక్షత్రపుడుగనుండగ ఇతని కుమారుడు జయదాముడు క్షత్రపుడుగ నుండెను. ఆమీదట ఇతనిపౌత్రుడు రుద్రదాముడు క్షత్రపుడయ్యెను. ఈ రుద్రదాముడు మహాప్రతిభాశాలి. స్వశక్తిచేత రాజ్యమును సంపాదించినవాడు. దక్షిణాపథపతియగు సాతకర్ణిని రెండుసార్లు ఓడించియు సన్నిహితబాంధవ్యమూలమున అతనిని విడిచి పెట్టెను. ఇతడు మాళవ, అనూప, కాంబే, కథియ

231. Rapson—CAC. intro. p. 232.
232. Ibid.
233. E. I. VII, VIII. లలోని క్షహరాట శాసనములు.
234. Rapson—CAC—Intro. p. 107.

వాగు' గుజరాత్, మాల్వార్, ఉత్తరకొంక ణములను పరిపాలించెను. ఈఉజ్జయినీక్షాత్రపుల శాసనములు క్రీ. శ. 78లో ఆరంభమగు శకములోనివని చాలమంది పండితుల అభిప్రాయము. అప్పుడు వీరు క్రీ. శ. 2వశతాబ్దిలో పరిపాలన మారంభించినట్లు ఏర్పడును. క్రీ. శ. 2వశతాబ్దిలో 130 ప్రాంతము న ం దు ం డి న టాలెమీ అను యవనుడు చస్తనుడు ఉజ్జయినికి పాలకుడని వ్రాసియున్నాడు.

పైన పేర్కొనబడిన శకరాజులలో మహారాష్ట్రఉజ్జయినీశాఖలవారికిని సాతవాహన రాజులకును పెక్కుసంఘర్షణలు జరిగెను.

ఇందు మొదటిసంఘర్షణము రెండవసాతకర్ణినాటిది. పాటలినగరమును క్రీ. పూ. 116 లో ఆక్రమించి పాలించుచువచ్చిన శకరాజు కళింగముపై దండెత్తి వచ్చెననియు, అప్పుడు రెండవసాతకర్ణి వీరిని ఓడించి, వెంట దరిమి, పాటలీనగరమునుండి పారదోలి, ఆనగరము నాక్రమించెననియు ఇదివరలో చెప్పియుంటిమి. ఇది శకసాతవాహనుల మొదటి సంఘర్షణము.

ఉజ్జయినిలో శకులపరిపాలనము క్రీ. పూ. 100 ప్రాంతమున ప్రతిష్ఠింపబడెను. రెండవ సాతకర్ణి క్రీ. పూ. 96 లో మరణించువరకును మహారాష్ట్రము అతని యేలుబడియందుండి నట్లే ఉన్నది. ఆమీదట నీప్రాంతము క్షహరాటులరాజ్యమున చేర్చబడెను. సాతకర్ణి వెనుక రాజ్యమునకు వచ్చిన లంబోదరుని కాలమున క్షహరాటు లితనిని పారదోలి మహారాష్ట్రము నాక్రమించియుండిరి. ఇది శకసాతవాహనుల రెండవ సంఘర్షణము.

కుంతలసాతకర్ణి గొప్పవిజేత అనియు, ఉత్తరాపథపాలకు లెందరో అతనికి సామంతులుగ నుండిరనియు, ఉజ్జయినీనగర మతనికొక కేంద్రముగ నుండెననియు, అతడు తంత్రముచేత నహపానుని ఓడించి భరుకచ్ఛనగరము నాక్రమించెననియు ఇదివరలో చెప్పియుంటిమి. ఇది శకసాతవాహనుల మూడవ సంఘర్షణము.

సాతవాహనులలో గౌతమీపుత్రసాతకర్ణి అగ్రగణ్యుడు. ఇతడు హర్షసముద్రగుప్తుల వలె గొప్ప విజేత. ఇతడు జయించిన దేశము లితనితల్లి బాలశ్రీ నాసికశాసనమునందు పేర్కొనబడినవి. అందు చాలభాగము క్షహరాటుల పరిపాలించినవే. అదిగాక ఈమహారాజు "క్షహరాటవంశ నిరవశేషకర" అని వర్ణింపబడినాడు. జగల్తాంబి అనుచోట దొరికిన 3000 నహపానుని వెండినాణెములలో చాలవాటి నీసాతకర్ణి పునర్ముద్రింపించెను. ఈవిశేషాంశము లాధారముగ గౌతమీపుత్రనహపానులకుగల సంబంధమును గురించి వాదోపవాదములు బయలు దేరినవి.

కొందరు గౌతమీపుత్రుడు నహపానునికి సమకాలికుడై అతనిని చంపెననుచున్నారు. (235) ఇతరులు వారిర్వురును సమకాలికులే కాదని అనుచున్నారు ఈరెండుపాదములను ఇచ్చట పరిశీలించుట అవసరము.

నహపానగౌతమీపుత్రులు స మ కా లి కు లనుటకు ఈక్రిందికారణములు చూపబడుచున్నవి :—

(1) నహపానుడు క్షహరాటుడు, గౌతమీపుత్రుడు క్షహరాటవంశనిరవశేషకరుడు.

235. Smith—Cat. Coins Ind. Mus. Intro. cvi; Early Hist. Ind. pp. 210—211.

(2) నహపానునిజగల్తంబి నాణెములలో 2/3వంతు గౌతమీపుత్రునిచే విజయసూచకముగ పునర్ముద్రింపబడినవి.

(3) గౌతమీపుత్రుని నాసికశాసనములలో ఒకదానియందు అతనిచే దానముచేయబడిన భూమి అంతవరకును (అజకాలకీయం) ఉషవదత్తుని ఆధీనమునం దుండెనని చెప్పబడినది. ఉషవదత్తుడు నహపానుని అల్లుడు.

(4) గౌతమీపుత్రుడు జయించిన దేశములలో నహపానుడు పాలించిన ప్రాంతములన్నియు చేరియున్నవి.

(5) నహపానుని శాసనములు క్రీ. శ. 78 నాటి శకమునందు వేయబడినవి. ఆప్పుడు అతడు (78 + 46) క్రీ. శ. 124 వరకును ఉండియుండును. క్రీ. శ. 130నాటి టాలెమీకి పులోమావి సమకాలికుడు. అతనితండ్రి గౌతమీపుత్రుడును క్రీ. శ. రెండవశతాబ్దిలోనేఉండును.

(6) నహపానుని అల్లుడగు ఉషవదత్తుని శాసనముల లిపి గౌతమీపుత్రుని శాసనముల లిపిని పోలియున్నది.

(7) క్రీ. శ. 80ప్రాంతమున రచింపబడిన 'పెరిప్లస్' అను గ్రంథమున నబానస్ అను రాజు పేర్కొనబడినాడు. ఈనంబానస్ నహపానుడగును.

ఈవాదము నంగీకరింపక గౌతమీపుత్ర నహపానులు సమకాలికులు కారనువారు ఈ క్రింది కారణములను చెప్పుదురు—

(1) బాలశ్రీ నాసికశాసనమునందు గౌతమీపుత్రుడు క్షహరాటవంశమును నిర్మూలముచేసెనని ఉన్నది కాని నహపానుని చంపెనని లేదు.

(2) నహపానుని నాణెములను గౌతమీపుత్రుడు పునర్ముద్రించినమాట నిజమే. కాని వానిని జాగ్రతగ పరిశీలించినయెడల అవి చిరకాలము వాడుకలో ఉండినతర్వాతనే పునర్ముద్రింపబడినవని స్పష్టమగును.[236] ఈపునర్ముద్రణమైనను అనేకసమయములలో అనేకచోట్ల జరిగినట్లు ఉన్నది.

(3) లిపిపరిణామమునుబట్టి ఉషవదత్తుని శాసనములు గౌతమీపుత్రుని శాసనములకంటె ప్రాచీనములని తెలియనగుచున్నది.(237)

(4) నహపానుని నాణెములమీది ఖరోష్ఠి అక్షరములు అతడు క్రీ. పూ. నాటివాడని నిరూపించుచున్నవి.(238)

(5) జైనగాథలు నహపానుడు క్రీ. పూ. 100–58నడుమనుండెనని తెలుపుచున్నవి.(239)

(6) నహపానుని శాసనములను క్రీ. పూ. 58నుండి ప్రారంభమగు విక్రమశకములోనివిగ పరిగణింపవలెను. చస్తనునియొక్కయు అతని వంశజులయొక్కయు శాసనములను క్రీ. శ. 78నుండి ప్రారంభమగు శకములోనివిగ పరిగణింపవలెను. లేనిచో నహపానుని విజయములకును, గౌతమీపుత్రుని విజయములకును, రుద్రదాముని విజయములకును అవకాశము చాలక పోవును.[240]

236. JRAS. 1904, p. 373; Rapson—CAC. Intro. p. CX; Dubreuil—Anc. Dek p. 40; JBBRAS. vol. XXII p. 224.
237. Cf. E. I. Vol. VIII లోని నాసిక శాసనములు.
238. JRAS. 1899 p. 372; 1904. p. 373.
239. Jayaswal—Saka-Sat. Hist. in JBORS. vol. XVI; Dubreuil-Anc. Dek. pp. 21-22
240. Cf. R. D. Benarjee in JRAS 1917; D. R. Bhandarkar in JBBRAS. vol. 23; Dubreuil in Ancienl Dekkan.

(7) నహపానుని కాలమున నిర్మింపబడిన కట్టడములు సాంచీసాంప్రదాయమును పోలి యున్నవి.[241]

(8) గౌతమీపుత్రుని నాసికశాసనములోని "అజకాలకియం" అనునది ఒక పొలముయొక్క పేరు కాని దానికి "నేటివరకును" అని అర్థము కాదు. ఇందు పేర్కొనబడిన ఉషవదత్తుడు నహపానుని అల్లుడు అనుటకు ఆధారము లేదు.[242]

(9) నహపానుడు చష్టనునికి ఒక శతాబ్దము పూర్వమునందుండెనని అతని శాసనముల లిపినుండి ఊహింపనగును.

ఇటీవల జయస్వాల్ పండితుడు ఒక వింత వాదమును ఉపపాదించెను.(243) నహపానుడు గౌతమీపుత్రునిచే చంపబడుటయే కాక గౌతమీపుత్రుడు పౌరాణికపట్టికలలోని రెండవసాతకర్ణి అనియు, అతడే శకారి అని ప్రసిద్ధినందిన శకకర్త అయిన విక్రమాదిత్యుడనియు ఆయన అభిప్రాయము. ఈవాదమున కాధారముగ నీక్రింది ఉపపత్తులు చూపబడినవి :—

(1) పట్టావలిగాథలలో శకుడని పేర్కొనబడిన రాజే జినసేనుని హరివంశములోని నహపానుడు. దీనినుండి నహపానుడు శకరాజని యేర్పడును.

(2) ఆవశ్యకసూత్రము అను జైనగ్రంథమున పైఠానకి శాలివాహనుడు భరుకచ్ఛము మీద దండెత్తి నహపానుని చంపెనని చెప్పబడినది.

(3) నహపానుని అనంతరము విక్రమాదిత్యుడు పరిపాలించెనని జైనగ్రంథములు చెప్పుచున్నవి. అందువలన శాలివాహనుడే విక్రమాదిత్యుడు.

(4) విక్రమాదిత్యుడు 55 సంవత్సరములు జీవించెను. అతని జననకాలమునుండియే పరిపాలనాకాలము పరిగణింపబడినది. సాతవాహనరాజగు రెండవసాతకర్ణి 55 వర్షములు ఏలెనని పురాణములు తెలుపుచున్నవి. అందువలన ఈసాతకర్ణియే విక్రమాదిత్యుడు.

(5) పురాణములు రెండవ సాతకర్ణికి పిమ్మట అపీలకుని, పులోమావిని పేర్కొనుచున్నవి. ఈరెండును ఒకేపేరు. పులవ లేక పులమావి అను పేరు రెండుపేర్లుగ విడగొట్టబడినది. అపీలకుడు కల్పితపురుషుడు.

(6) గౌతమీపుత్రుడు ఉషవదత్తుడు చేసిన దానములను మన్నించి, నహపానుని నాణెములను తిరిగి ముద్రించెను. అందువలన అతడు నహపానుని చంపెనని ఏర్పడును. అప్పుడు అతడు పైఠానకశాలివాహనుడును, విక్రమాదిత్యుడును, రెండవసాతకర్ణియు అగును.

ఈవాదమునం దనేకదోషము లున్నవి:—

(1) గౌతమీపుత్రుని ప్రతిభ అతని తల్లి బాలశ్రీ నాసికశాసనమున వివరముగ వర్ణింపబడినది. అందు ఒక్కఅంశమైనను రెండవ సాతకర్ణికి వర్తింపదు. 24వర్షములు పరిపాలించిన ఒకరాజును, 56ఏండ్లు ఏలిన మరియొక రాజుతో సమన్వయించుట ఉచితముకాదు. అదియునుకాక వీరిలో నొకరాజు గౌతమీ

---

241. Dubreuil—Anc. Dek. p. 20.

242. JRAS 1926 p. 657.

243. JBORS Vol. XVI. లోని Saka — Satavahana History అను వ్యాసము.

పుత్రుడు. రెండవరాజుకు ఆమాత్రునామము లేదు.

(2) ఆపీలకుడు కల్పితపురుషుడనుట ప్రమాణవిరుద్ధము. ఇతని నాణెమొకటి ఇటీవల దొరికినది. అందువలన నితడు వాస్తవపురుషుడే అనియు, రెండవసాతకర్ణి తర్వాత పరిపాలించెననియు నిస్సందేహముగ చెప్పవలెను. మరియును గౌతమీపుత్రసాతకర్ణి కుమారుడు వాసిష్ఠీపుత్రపులోమావి. ఆపీలకునికి పిమ్మటనుండిన పులోమావికి ఆమాత్రునామము లేదు. అందువలన రెండవసాతకర్ణి గౌతమీపుత్రుడగుటయు, ఈమొదటిపులోమావి వాసిష్ఠీపుత్రపులోమావి అగుటయు, అతడు రెండవసాతకర్ణికుమారుడగుటయు, అన్నియుకూడ అసమంజసములే.

(3) నహపానుడు క్రీ. పూ. 1శతాబ్దివాడని అనేకాధారములు నిరూపించుచున్నవి. టాలెమీ అను యవనుని గ్రంథమునుబట్టి క్రీ. శ. 130ప్రాంతమున పులోమావి పైఠాను నరాజుగనుండెను. ఈపులోమావి గౌతమీపుత్రసాతకర్ణికుమారుడగు వాసిష్ఠీపుత్రపులోమావి. ఈపులోమావి 24 ఏండ్లును, గౌతమీపుత్రుడు 24ఏండ్లును రాజ్యము చేసిరి. దీనినిబట్టి గౌతమీపుత్రుడు క్రీ. శ. 1వశతాబ్ది కడపటిపాదమునం దున్నట్లు స్పష్టమగుచున్నది. నహపానుని కడపటిరాజ్యసంవత్సరము క్రీ. పూ. 54 అగును. అప్పుడు ఇతనికిని గౌతమీపుత్రునికిని 136సంవత్సరముల అంతరముండును. ఇట్టి వీరిద్దరును సమకాలికులనుట అసమంజసముకదా!

ఈకారణములనుబట్టి గౌతమీపుత్రుడు విక్రమాదిత్యుడు కాజాలడనియు, అతడు రెండవసాతకర్ణి అసలేకాడనియు నిర్ణయింపనగుచున్నది. గౌతమీపుత్రుడు క్షహరాటవంశమును నిరవశేషమొనర్చినపుడు ఏక్షహరాటుని చంపెనన్నప్రశ్న ఇచ్చట బయల్వెడలును. వాయుపురాణము విదిశను పాలించినవారిలో నఖపానజ, దండధర్మ, కంగరులను వారిని పేర్కొని వీరు శుంగరాజ్యాంతమునకు ముందు పాలించిరని చెప్పుచున్నది. ఇందు నఖపానజుడు నహపానజుడు లేక నహపానుని కుమారుడు కావచ్చును. ఈరాజులకుపిమ్మట భూతినంది, శిశునంది అనువారిపేర్లు కలవు. ఈ యిద్దరును శుంగులకుపిమ్మట పరిపాలించిరట. ఈ ఐదుగురును క్షహరాటవంశజులే కావచ్చును. రెండవసాతకర్ణి మరణానంతరము క్షహరాటులు మహారాష్ట్రమాళవములతో విదిశనుకూడ ఆక్రమించియుందురు. పై అయిదు పురుషాంతరములవారును సుమారు 100—150 ఏండ్లు పరిపాలించియుందురు. అప్పుడు నహపానునినుండి లెక్కించినచో వీరికాలము క్రీ. పూ. 54నుండి క్రీ. శ. 100ప్రాంతమగును. గౌతమీపుత్రుడు క్రీ.శ. 78లో రాజ్యమునకు వచ్చెను. మహారాష్ట్రమునగల అతని మొదటి శాసనము అతని 18వ రాజ్యవర్షములోనిది. అది క్రీ. శ. 96నాటిది అగును. ఈ యేటనే ఆరాజు మహారాష్ట్రమును జయించియుండును. ఇది పై క్షహరాటవంశజుల పరిపాలనాంత్యకాలమునకు సరియగుచున్నది. ఇట్లు చిరకాలము రాజ్యము చేసిన క్షహరాటుల వంశమును నిర్మూలించుటవలననే గౌతమీపుత్రుడు ప్రత్యేకముగను, గౌరవద్యోతకముగను క్షహరాటవంశనిరవశేషకరుడని వర్ణింపబడినాడు.

శకసాతవాహనసంబంధమునం దిది నాల్గవ సంఘర్షణము.

ఇక మిగిలినది ఉజ్జయినీ శకక్షత్రపులకును సాతవాహనులకును గల సంబంధము. ఈశక రాజ్యస్థాపకుడగు చష్టనునిగురించి అనేకులు అనేకవిధములుగ అభిప్రాయపడిరి. కొందరు ఇతడు నహపానునికి సమకాలికుడుగ అతడు కతియవారును ఏలగ తాను ఉజ్జయినిని ఏలెననిరి. కొందరితడు గౌతమీపుత్రుని సామంతుడనిరి. మరికొందరు చష్టనుడు ఉత్తరాపథపాలకులగు కుషానులకు సామంతుడనియు, సాతవాహనుల విజృంభణమును అరికట్టి వారి వద్దనుండి వీలగునంత దేశమును లాగికొనమని కుషానులు ఇతనిని దక్షిణమునకు పంపిరనియు అభిప్రాయపడిరి.(244) ఇందు చష్టనుడు నహపానునికి సమకాలికుడగుట పొసగదు. క్రీ. శ. 130 ప్రాంతమునందున్న ఇతడు క్రీ శ. 1వ శతాబ్దిచరమపాదమున నుండిన గౌతమీపుత్రునికి సామంతుడగుటయు పొసగదు. నాణెములనుబట్టి చష్టనుడు కతియవార్, గుజరాత్, అజ్మీర్, ఉజ్జయినులను పాలించినట్లు తెలియుచున్నది. ఈభాగములు పూర్వము గౌతమీపుత్రునిచే జయింపబడినవే. ఈరాజుకుమారుడు పులోమావి మహారాష్ట్రమును, నేటి మధ్యరాష్ట్రములను, ఆంధ్రదేశమును పరిపాలించెనని ఇతని నాణెములును, శాసనములును తెలుపుచున్నవి. పులోమావి తనతండ్రి యిచ్చిన రాజ్యమునం దేభాగమును పోగొట్టుకొనెననుట కవకాశము లేదు. టాలెమీ వ్రాతలనుబట్టి ఇతడును, చష్టనుడును క్రీ. శ. 130లో ఉండినట్లు తెలియుచున్నది. ఈయంశములనుబట్టి పులోమావి కడపటిరాజ్యసంవత్సరమున చష్టనుడు గుజరాత్, కతియవార్, అజ్మీర్, ఉజ్జయినులను ఆక్రమించెనని తోచుచున్నది.

ఇది శకసాతవాహనుల ఐదవ సంఘర్షణము.

క్రీ. శ. 150 నాటికి రుద్రదాముడు మహాక్షత్రపుడుగ నుండెను. ఇతడు పూర్వాపరాకరావంత్యనూపనీవృదానర్తసురాష్ట్రశ్వభ్రమరుకచ్ఛసింధుసౌవీరకుకురాపరాంతనిషాద దేశములకు ప్రభువు. ఇవి అన్నియు నితనికి స్వవీర్యార్జితములట. ఈప్రాంతములలో చష్టన గౌతమీపుత్రుల ఏలుబడిలోనుండిన భాగములు చేరియున్నవి. ఇతడు దక్షిణాపథపతియగు సాతకర్ణిని రెండుసార్లు ఓడించియు, దగ్గరసంబంధముకలవాడగుటచే నాశమొనర్పలేదట(245) ఈసాతకర్ణి పులోమావియనంతరము రాజ్యమునకు వచ్చిన అతని తమ్ముడగు వాసిష్ఠీపుత్రసాతకర్ణి అని యిదివరలో చెప్పియుంటిమి. ఒక కన్హేరీశాసనమున కార్దమకవంశజుల బిడ్డయును, మహాక్షత్రపరుద్రుని కుమార్తెయు, ఈసాతకర్ణికిరాణి యని వర్ణింపబడినది. ఈమహాక్షత్రపరుద్రుడు రుద్రదాముడు కావలెను. బహుశః చష్టనుడే తనరాజ్యస్థైర్యమును పురస్కరించుకొని ప్రబలులగు సాతవాహనులతో వైరము క్షేమకరము కాదని నిశ్చయించుకొని పులోమావితమ్ముడగు సాతకర్ణికి రుద్రదాముని కుమార్తెనిచ్చి వివాహము చేయించియుండును. ఈరుద్రదాముడు తన జునాగడ్ శాసనమున తనరాజ్యము స్వవీర్యార్జితమనియు, సర్వవర్ణములవారును

244. Sten Konow in E. I. vol. XV. pp. 293-94.
245. చూ. అనుబంధము 16వ పేజీ.

తనను రాజుగ కోరుకొనిరనియు చెప్పుకొనినాడు. తనకు దగ్గరచుట్టమగు సాతకర్ణిని రెండుసార్లు ఓడించియు విడిచిపుచ్చితిననియు చెప్పుకొనినాడు. దీనినుండి సాతకర్ణి యితని కేదియో ప్రమాదమును కలిపించెననియు, చష్టనుని మరణానంతరము కొంతకాలము అతని రాజ్యమునందలి కొంతభాగమైనను అన్యాక్రాంతమయ్యెననియు, రుద్రదాముడు దానిని తిరిగి జయింపవలసి వచ్చెననియు ఊహింపనగుచున్నది. అనేకవిధముల సాతకర్ణి చష్టనుడు మరణింపగనే విజృంభించి అతని రాజ్యమునందలి కొంతభాగము నాక్రమించి యుండును. కొంతకాలమైన పిమ్మట తగినబలమును చేకూర్చుకొని రుద్రదాముడు సాతకర్ణిని రెండుపర్యాయములోడించి ఆయాభాగములను లాగికొని యుండును.

ఇది శకశాతవాహనుల ఆరవ సంఘర్షణము.

ఈసాతకర్ణికి పిమ్మట రాజ్యమునకు వచ్చిన శివశ్రీ నాణెములు ఆంధ్రదేశమునను, మధ్యపరగణాలలోను, బేరారులోను దొరికినవి. ఇతనికి మహారాష్ట్రముతో సంబంధముండెననుట కెట్టి యాధారమును లేదు. శివశ్రీ వెనుక క్రీ. శ. 157_167 నడుమ రాజ్యము చేసిన చతరపణసాతకర్ణి శాసనమొకటి నానేఘాట్‌లో ఉన్నది. ఇతని 'చతరపణ' బిరుదము క్షత్రపులను ధిక్కరించుటకు సూచకము. క్రీ. శ. 150కి తర్వాత రుద్రదాముని ప్రశంస కనపడదు. ఈకారణములనుబట్టి రుద్రదాముడు మరణించిన పిమ్మట మరియొకసారి విజృంభించి సాతవాహనులు మహారాష్ట్రమును జయించి వశపరచుకొనిరని తోచుచున్నది.

ఇది శకసాతవాహనసంఘర్షణాలలో ఏడవ ఘట్టము.

పై సాతకర్ణికి ఏడుసంవత్సరముల అనంతరము యజ్ఞశ్రీ సాతవాహనసామ్రాజ్యమునకు పాలకుడయ్యెను. ఇతడు ఆంధ్రమహారాష్ట్రములను, మధ్యపరగణాలలోని కొంతభాగమును పరిపాలించినట్లితని శాసనములును, నాణెములును తెలుపుచున్నవి.[246] ఇతనిరాజ్యమున కుకురాపరాంతములేగాక బరోడావరకునుగల భాగమంతయు చేరి యుండెను.[247] వాసిష్ఠీపుత్రపులోమావికి పిమ్మట నితడే యీప్రాంతము నేలిన ఆంధ్ర రాజు. దీనినిబట్టి యజ్ఞశ్రీకూడ శకరాజ్యముపై దండెత్తి కుకురాపరాంతానూపవిదర్భలను జయించెనని తెలియనగుచున్నది.

ఇది శకశాతవాహనసంబంధమునందెనిమిదవ ఘట్టము.

ఇట్లు క్రీ. పూ. 2వశతాబ్దిలోని రెండవ సాతకర్ణి కాలమునుండి క్రీ. శ. 2వశతాబ్దిలోని యజ్ఞశ్రీవరకును గల మూడుశతాబ్దముల కాలము సాతవాహనులకును శకులకును వైరము సాగుచునే వచ్చెను. ఏడుసార్లు ఈ రెండువంశములవారికిని సంఘర్షణ జరిగెను. ఏమైనను సాతవాహనులు శకులు దక్షిణాపథమున లోభాగమునకు చొచ్చుకొనిరాకుండగ అరికట్టిరి. సాతవాహనసామ్రాజ్యము పోయినపిమ్మట ప్రబలులైన ఇక్ష్వాకులతో శకులు వైవాహికసంబంధము నేర్పరచుకొనిరి. తుదకు క్రీ. శ. 4వశతాబ్ది నాల్గవ పాదములో గుప్తరాజులు [illegible]టికి నిలచి యుండిన ఉజ్జయినీశకరాజ్యము జయించిరి.

246. Rapson — CAC. Intro. p. 42.
247. బరోడాలో ఈరాజు నాణెము ఒకటి దొరికినది. Gopalachary — Early Hist. Andhra p. 13.

# ౧౪. కడపటి సాతవాహనులు

ఆంధ్రసాతవాహనులు క్రీ. పూ. 28— క్రీ. శ. 78వరకును మగధనుకూడ పరిపాలించి యుండిరని ఇంతకుపూర్వము చెప్పియుంటిమి. ఈవంశమునందలి పూర్వరాజులు పరిపాలించిన మహారాష్ట్రమాళవవిదిశవిదర్భలను క్షహరాటులాక్రమించిరి. రెండవసాతకర్ణి కళింగము నేలెను. సాతవాహనులలో కడపటి రాజగు పులోమావికి ముందుండిన చంద్రశ్రీ ఏకైకశాసనము కళింగమున కలదు.(248) ఈ మధ్యకాలమున నీదేశమును మరియెవరును ఏలినట్లు కనిపింపదు. అందువలన ఇతర ప్రాంతములన్నియు వశము తప్పిపోయినను కళింగాంధ్రములుమాత్రము సాతవాహనుల పరిపాలనమున నుండుచునే వచ్చెనని చెప్పవచ్చును.

హాలునికి పిమ్మట వచ్చిన రాజులను గురించి వివరము లేమియు తెలియుటలేదు. పాటలకపురీకసేనుల పేర్లుమాత్రము వారికి ఉత్తరాపథముతో సంబంధముండెనని సూచించుచున్నవి. ఈప్రాంతముతో సాతవాహనుల సంబంధము ఎప్పుడు, ఎట్లు వీడిపోయెనో నిశ్చితముగ తెలియదు. కాని కుషానుల విజృంభణముమాత్రము అందుల కొకకారణమై యుండెనని ఊహింపవచ్చును.

## గౌతమీపుత్ర సాతకర్ణి క్రీ. శ. 78–102

ఇతడు సాతవాహనరాజులలో నెల్ల అగ్రగణ్యుడు. భారతదేశచరిత్రలో గొప్పవిజేతలుగ పేరుపొందిన చంద్రగుప్తవిక్రమసముద్రగుప్తాదులతో సమానమైన ప్రతిభ కలవాడు. ఇతని విజయపరంపరకు ఫలితముగ సాతవాహనసామ్రాజ్య మీతనికాలమున పరమోచ్ఛదశ నందెను.

ఇతనితల్లి బాలశ్రీ నాసికశాసనమున పేర్కొనబడిన ఇతనిరాజ్యభాగములను క్షహరాటరాజులశాసనములనుండి(249) తెలియనగు వారి రాజ్యవిస్తృతితో సరిపోల్చి, ఇతడు నహపానుని నాణెములను పునర్ముద్రింపించుటను, మహారాష్ట్రమున కనిపించు ఈరాజు మొదటిశాసనము(250) ఇతని 18వరాజ్యసంవత్సరమునాటిది అగుటను సమన్వయించినచో ఈ మహారాజు మొదట 17సంవత్సరములు ఆంధ్రకళింగదేశములనే పాలించెనని స్పష్టమగునని ఇదివరలో చెప్పియుంటిమి.

ఈసాతకర్ణి మహారాజు క్షత్రియదర్పమానమర్దనుడు, శకయవనపహ్లవనిషూదనుడు, అనేకసమరావజితశత్రుసంఘుడు, అపరాజితవిజయపతాకుడు, ఏకశూరుడు, ఏకధనుర్ధరుడు నని వర్ణింపబడినాడు.(251) ఆనాటి పరిస్థితులు మిక్కిలి క్లిష్టములుగ నుండినవి. అశోకుని కాలముననే కొందరు యవనులు మనదేశ

248. E. I. XVIII pp. 316—319.

249. E. I. VII. లోని నాసికశాసనములలో ఉషవదత్తుని శాసనములు.

250. చూ. అనుబంధము ౬ వ శాసనము.

251. డిటో ౧౨ వ శాసనము.

మున స్థిరపడిరి. ఒకయవనుడు(252) సౌరాష్ట్రమునం దామహారాజు ప్రతినిధిగ నుండెను. ధేనుకాకటము మున్నగుచోట్ల అనేకమంది యవనులు స్థిరనివాసముల నేర్పరచుకొని యుండిరి (253) శకులును దేశమున బహుభాగములనాక్రమించి స్వతంత్రరాజ్యములను నెలకొల్పిరి. తుదకు మహారాష్ట్రమాళవవిదర్భవిదిశలు వారిసంబంధులు నాశ్రితులునగు క్షహరాటులకు వశమైనవి. క్రీ. శ. 2వశతాబ్ది నాటిరుద్రదామునివద్ద(254) సువిశాఖుడనుపహ్లవుడు ఉద్యోగిగ నుండెను. బహుశః ఈపహ్లవులును నాడు కొన్నికొన్నిచోట్ల ప్రబలురుగ నుండియుందురు. నాడు ఉత్తరాపథమున సమర్థులైనరాజులు ఎవరును లేకుండిరి. దక్షిణాపథపాలకులగు సాతవాహనులలోను కొందరు అసమర్థులుగనుండిరి. ఇందువలన విదేశీయులగు యవనశకపహ్లవులు విజృంభించి కొంత అలజడి కలిగించియుందురు. ఇట్లు అరాజకము ప్రబలుటయేగాక నాటి హిందూసంఘమున కూడ కొంతకల్లోలము జరిగినట్లు కనిపించుచున్నది. నహపానుడు మున్నగు క్షహరాటులును, రుద్రదాముడు మున్నగు ఉజ్జయినీ క్షత్రపులును విదేశీయులయ్యు హిందూమతము నవలంబించి క్షత్రియోచితములగు రాజ, మహారాజబిరుదముల నుపయోగించిరి. బహుశః వీరు తాము క్షత్రియులమనియు వ్యవహరించిరేమో. ఇతరప్రాంతములలో కొందరు యవనులును హిందూమతావలంబులైరి. ఇట్లు ఈవిదేశీయులు తమ యిష్టమువచ్చినవిధమున నాటి హిందూసంఘమున చేరిపోవుటవలన వర్ణాశ్రమముల స్థైర్యము తగ్గిపోయెను.

ఇట్టి సంక్షోభితవాతావరణమున గౌతమీపుత్రసాతకర్ణి రాజ్యమునకు వచ్చెను. ఈ మహారాజు ముందుగ కళింగాంధ్రములలో తన పరిపాలనమును స్థిరపరచుకొనెను. ఆ మీద తన పూర్వులు అనుభవించిన వైభవ ప్రాభవములను, వారు సార్థకపరచుకొనిన దక్షిణాపథపతిబిరుదమును, తననాటి సాతవాహనవంశదైన్యమును తలచుకొని యెట్లైనను తనవంశగౌరవమును పునః ప్రతిష్ఠింపవలెనని నిశ్చయించుకొనెను. అదియునుగాక అప్పటికి కుషానరాజగు రెండవకాడ్ఫైసిస్ ప్రాసికతో తనరాజ్యమును విస్తరించుచుండెను. ఈకుషానులవిజృంభణము దక్షిణాపథము లోభాగమునకుకూడ వ్యాపించునేమో అనుభయమును ఈమహారాజుకు కలిగియుండును. ఇట్లు ఆత్మరక్షణమును, వంశగౌరవపాలనమును ఇతనిని విజయయాత్రోన్ముఖుని చేసినవి. ఇతని మొదటి శాసనము వైజయంతీసైన్యముయొక్క విజయస్కంధావారమునం దుండి మహారాష్ట్రములో చేయబడిన దానమును తెలుపుచున్నది. దీనినిబట్టి అప్పటికే ఇతని క్షహరాటవిజయము పూర్తిఅయ్యెనని చెప్పవచ్చును. బాలశ్రీ శాసనమునం దితడు త్రిసముద్రతోయపీతవాహనుడని వర్ణింపబడినాడు. ఇందు దక్షిణసముద్రము చేరియున్నది. ఇందు

252. చూ. రుద్రదాముని జూనాగడ్ శాసనము. అనుబంధము పే. ౧౩.

253. E. I. VIII. లోని నాసిక శాసనములలో ఈయవనుల ధర్మశాసనములు కలవు.

254. చూ. అనుబంధము పే. 16.

వలన నీమహారాజు రెండువిజయయాత్రలను సాగించెనని తెలియనగుచున్నది.

గౌతమీపుత్రసాతకర్ణి మొదట పశ్చిమ దిగ్విజయము చేసియుండును. దీనికిఫలితముగనే ఇతనికి అసికఅసకములకసురఠకుకురాపరాంతానూపవిదర్భాకరావంతి రాజత్వము లభించియుండును. ఇందు అసక అనునది నేటి నైజాంరాజ్యమునందలి ప్రాగుత్తరభాగమును, మదరాసురాజధానిలోని తూర్పుగోదావరి జిల్లాయు గలభాగము కావచ్చును. దీనికు[illegible]గమున గోదావరీతీరమున పైఠానము కేంద్రముగ ములక అను విభాగముండెను. విదర్భ నేటి బీరారుకు సరియగును. ఆకరావంతి పూర్వపశ్చిమమాళవములగును. అనూప అను విభాగము నర్మదానదీతీరమున గలదు. సురఠ నేటి కథియవారుకు సరియగు సౌరాష్ట్రము. కుకురము నేటి గుజరాతుకు సరియగునని ఒకమతమును, రాజపుత్రస్థానమునకుసరియగునని ఒకమతమును కలవు. అపరాంతము బొంబాయి రాజధానిలోనిథానా కొలాబా రత్నగిరి ఉత్తర కనరా జిల్లాలకు సరియగును.(255) ఈప్రాంతములన్నియు క్షహరాటుడగు నహపానుని ఏలుబడియందుండెడివి. అతనిరాజ్యము రాజపుత్రస్థానమునందలి పుష్కరతీర్థము వరకును వ్యాపించి యుండెను. నహపానుని అనంతరము అతనివంశీయులు కొందరు పరిపాలించిరనియు, నహపానుని నాణెములను సాతకర్ణి పునర్ముద్రింపించెననియు ఇదివరలో చెప్పియుంటిమి. ఇతడు క్షహరాటవంశనిరవశేషకరుడని వర్ణింపబడినాడు. ఈయంశములనుబట్టి యితని పశ్చిమదిగ్విజయము ప్రాగాంధ్రము నుండి ప్రారంభమయ్యెనని చెప్పవచ్చును. మహోత్సాహముతో బయల్వెడలిన ఈమహారాజు సైన్యములు వరుసగ ములక అశ్మక, విదర్భ ఆకరావంతిపుష్కరసౌరాష్ట్రకుకురాపరాంతములను జయించియుండును. నాటి క్షహరాటులీమహాసైన్యమున కడ్డువచ్చి దాని కాహుతి అయియుందురు. ఈక్షహరాటులేకాక అచ్చటచ్చట ప్రబలులుగ నుండిన యవనశకపహ్లవులు నీయాంధ్రవాహిని నెదిరించి నశించియుందురు. ఇట్లు అనేకమంది శత్రురాజులను జయించి, విజయపరంపర నార్జించి, అపరాజితవిజయపతాకుడై సాతకర్ణిమహారాజు తన పశ్చిమదిగ్విజయమును ముగించియుండును.

ఇతడు వైజయంతీసైన్యస్కంధావారము నందుండుట ఆప్రాంతమును జయించుసందర్భముననా లేక అది స్వరాజ్యమున భాగమగుట వలననా అని సందేహము కలుగుచున్నది. ఇతని పూర్వుడగు కుంతలసాతకర్ణికి కుంతలదేశముతో సంబంధముండెనని అనుకొనుట కవకాశము కలదు. అగుచో కుంతలము సాతవాహనసామ్రాజ్యమున అప్పటినుండియైనను చేరియుండెనని చెప్పవచ్చును. దీనిని క్షహరాటులు పాలించిరనుట కెట్టియాధారమును లేము. అప్పుడు సాతకర్ణి ప్రాగాంధ్రమున బయలుదేరి, దక్షిణాపథోత్తరభాగమును, ఆమీద మహారాష్ట్రమును జయించి ప్రక్కనున్న తనరాజ్యభాగమగు కుంతలమున విశ్రమించెనని ఊహింపవచ్చును,

ఆమీదట నీమహారాజు దక్షిణదిగ్విజయము చేసెను. ఇతనికుమారుడగు పులోమావినాణెములు ప్రాక్తీరమున(256) మదరాసు

255. D. R. Bhandarkar—Dekkan of the Satavahana times in I. A. vol. 43.
256. Rapson CAC. para 67.

కడలూరులమధ్య దొరికినవి. ఈపులోమావి స్వయముగ నేదేశమును జయించినట్లు కనిపింపదు. బాలశ్రీనాసికశాసనమునుబట్టి గౌతమీపుత్రుడు దక్షిణసముద్రతీరమువరకును చొచ్చుకొనిపోయెనని తెలియనగుచున్నది. అశోకునికాలమున దక్షిణదేశమునందు చోళ చేరపాండ్యసత్యపుత్రరాజ్యము లుండెడివి. ప్రాచీనద్రవిడవాఙ్మయము దక్షిణపెన్నానది నాటి ద్రవిడదేశమునకు ఉత్తరపు సరిహద్దు అనియు, ఆనదికి ఉత్తరముగను తిరుపతికి దక్షిణముగను ఉన్నభాగము అరణ్యావృతమై ద్రవిడేతరులగు అరువలార్ అను తెగవారి ఆధీనమునందుండెననియు, అందు అరువనాడు, అరువవడతలైనాడు అను విభాగము లుండెడివనియు తెలుపుచున్నది.(257) గౌతమీపుత్రుని కుమారుడగు పులోమావికి సమకాలికుడగు టాలెమీ అను యవనుడు ఆకాలమున ప్రాక్తీరమువెంబడి రెండు నాగ రాజ్యములుండెడివని వ్రాసినాడు.(258) కడపటి సాతవాహనరాజగు పులోమావికాలమున బళ్ళారి ప్రాంతమునందుండిన జనపదములకు శివస్కందనాగుడను సామంతుడు పాలకుడుగ నుండెను.(259) సాతవాహనసామ్రాజ్యపతనానంతరము నేటి రాయలసీమలోని పశ్చిమభాగమునకును, మైసూరురాజ్యమునకును చుటు నాగవంశీయులు పాలకులైరి.(260) ఈయంశము లనుబట్టి ఆనాడు ఆంధ్రద్రవిడదేశముల మధ్య భాగమున అరువలారును, నాగులును ప్రబలులుగనుండిరని తెలియనగుచున్నది. సాతకర్ణి మహారాజు ఈప్రాంతమునంతను జయించి, చోళరాజ్యముగుండా విజయయాత్రను సాగించి దక్షిణసముద్రమువరకును పోయి విజయలక్ష్మీపరివృతుడై తిరిగి వచ్చియుండును.

ఈవిజయములకు ఫలితముగ నీమహారాజు సామ్రాజ్యము పశ్చిమోత్తరమున పుష్కర తీర్థము మొదలు, ప్రాగ్దక్షిణమున కడలూరు వరకును, ప్రాగుత్తరమున కళింగనగరము మొదలు పశ్చిమదక్షిణమున వైజయంతివరకును వ్యాపించెను. ఇతడు రాజరాజయ్యెను. సాతవాహనవంశయశః ప్రతిష్ఠాపనకరుడయ్యెను.

ఇట్లు మహావిజేతయు సమ్రాట్టును అయిన యీమరాజు అనేకసద్గుణవిరాజితుడు. తేజమునందితడు నాభాగనహుషజనమేజయసగర యయాతిరామాంబరీషులకు సదృశుడు. పరాక్రమమున రామకేశవార్జునభీమ సేనులకు సమానుడు. బలమున హిమవన్మేరుమందర పర్వతసముడు. యుద్ధములయందద్భుతములగు ధైర్యసాహసములను ప్రకటించినవాడు. వైదికధర్మమునందత్యంతమగు గౌరవము కలిగి, వర్ణసాంకర్యమును అరికట్టినవాడు. ఆగమనిలయుడు, అనేకద్విజకుటుంబములను పోషించినవాడు. అనేకసమాజములను జరిపినవాడు. ఏకబ్రాహ్మణుడు. అపరిమితమగు వైభవము ననుభవించువాడయ్యు ఈమహారాజు అనవసర ప్రాణిహింస చేయలేదు. సత్పురుషుల కాశ్రయ మిచ్చెను. అధికారమువలనను, ఉపచారములవలనను ఉద్విగ్నుడు కాలేదు. అనేకులగు దీనుల కభయ మొసగి రక్షించెను. ధర్మమార్గముననే పన్నులను తీసికొని వ్యయ

257. Dr. N. Venkataramanayya in Swatantra Nov. 1947.
258. Ptolemy's Geo. VII. i.
259. చూ. అనుబంధము ౨౩ వ శాసనము.
260. చూ. మాలవెల్లి బనవాసి శాసనములు.

పరచెను. పౌరజనులతో సమానముగ తన సుఖదుఃఖములను పంచుకొని అనుభవించెను. తాను సర్వరాజలోకపరిగృహీతశాసనుడయ్యు వినయసౌశీల్యములను, స్వధర్మమును మరువ లేదు. తనకాలమును త్రివర్గసాధనకై చక్కగ విభజించుకొనినాడు. అవిపన్నమాతృశుశ్రూషాపరుడుగ నుండినాడు.(261)

ఈసాతకర్ణి మహారాజు ఇతర విధముల కూడ ధన్యుడు. ఇతనితల్లి గౌతమీబాలశ్రీ చిరస్మరణీయ. ఆమె సత్యవచనదానక్షమాహింసానిరత, తపదమనియమోపవాసతత్పర. సర్వవిధములను రాజర్షిపత్నీపదమున కర్హత కలది. సాతకర్ణిభార్య మహారాణి వాసిష్ఠి. ఇతని పుత్రుడు పులోమావి. అతడును సద్గుణ సౌశీల్యశోభితుడు, పితృసేవాతత్పరుడు, పితామహీప్రియకాముడు. బాలశ్రీ మిక్కిలి ధన్యజీవి. ఆమె మహారాజపత్ని, మహారాజమాత, మహారాజపితామహి. ఈపుణ్యచరిత తనభర్తయగు శివస్వాతిమహారాజుకాలముననే బహుప్రసిద్ధయైయుండెను.(262) ఆమహారాజుమరణించినపిమ్మట కుమారుడగు సాతకర్ణికాలమునను, పౌత్రుడగు పులోమావికాలమునను కూడ వారితో కలసి దానధర్మములు చేయుచు, బహుశః రాజ్యతంత్రనిర్వహణమున వారికి తోడ్పడుచు సాతవాహనసామ్రాజ్యమునకును, నాటి దక్షిణాపథవాసులకును అమూల్యమగు సేవ చేసెను.

## వాసిష్ఠీపుత్ర పులోమావి క్రీ. శ. 102–130.

గౌతమీపుత్రసాతకర్ణికి నలుగురు కుమారులుండెరి. అతనివెనుక పులోమావి రాజ్యమునకు వచ్చెను. ఇతనికి పితామహియగు బాలశ్రీ చేదోడువాదోడుగ నిలచి సహాయము చేయుచుండెను. ఈమహారాజు తన తండ్రి యొసగిన విశాలసామ్రాజ్యమును జాగ్రతగ రక్షించెను. ఇతని శాసనములును, నాణెములును ఆంధ్రమహారాష్ట్రవిదర్భలలో లభించినవి.(263) ఇతని పరిపాలనాకాలమున ఉత్తరాపథమున ముఖ్యములగు మార్పులు జరిగెను. కుషానుల విజృంభణము నానాటికిని ఎక్కువయ్యెను. క్రీ. శ. 120లో కనిష్కుడు కుషానుసామ్రాజ్యమున కధిపతి అయ్యెను. అనేకవిజయముల నార్జించి ఇతడు తన యధికారమును విస్తరించెను. ఈమహారాజు పాటలీపుత్రముమీదను దండెత్తెను.(264) ఉత్తరాపథవిజయములతో తృప్తినందక కనిష్కుడు దక్షిణాపథమువంకకును తనదృష్టిని మరల్చెను. అచ్చట చిరకాలము క్షహరాటవంశజులు పరిపాలించిన అపరాంతసౌరాష్ట్రకుకురానూపాదప్రాంతములను సాతవాహనులు జయించి తమ సామ్రాజ్యమున కలుపుకొనుట ఇతనికి కష్టము కలిగించెను. అదియునుగాక యావద్దక్షిణాపథవ్యాప్తమై ప్రబలముగనుం

---

261. చూ. అనుబంధము ౧౨వ శాసనము.

262. డిటో.

263. ఇతని శాసనములును, నాణెములును అనుబంధములో చెప్పబడినవి.

264. ఆనాడు ఈనగరమును పాలించుచుండిన రాజును జయించి కనిష్కుడు బౌద్ధాచార్యుడగు అశ్వఘోషుని, తీసుకొనిపోయెనట. Smith—E H I. p. 208.

డిన ఆంధ్రసామ్రాజ్య మీకుషానచక్రవర్తికి భయావహ మయ్యెను. సాతవాహను లింకను విజృంభించినచో తన సామ్రాజ్యమునకే ప్రమాదము వాటిల్లునని యితడు నిశ్చయించుకొనెను. ఈప్రమాదము నరికట్టి, సాతవాహనుల విజృంభణము నణచివేయుటకై చష్టనుడను సామంతుని కనిష్కుడు దక్షిణాపథమునకు పంపెను.(265) చష్టనుడును కతియవార్, గుజరాత్, అజ్మీర్, ఉజ్జయినులను జయించెను.(266) ఉజ్జయిని రాజధానిగ నీప్రాంతముల నిత డొకరాజ్యముగ నేర్పరచి పరిపాలింపసాగెను. ఈకాలమునందు అన్యకార్యాసక్తుడగుటవలననో మరియేయితరకారణము వలననో పులోమావి ఈశకవిజృంభణమునకు ప్రతీకారము చేయలేక పోయెను. అనతికాలముననే ఈసాతవాహనరాజు మరణించి యుండును.

## సాతకర్ణి క్రీ. శ. 130—154.

పులోమావి అనంతర మతని తమ్ముడు సాతకర్ణి రాజయ్యెను. ఇతడు దక్షిణాపథపతి బిరుదాంచితుడు.(267) చష్టనుడు తాను మహాక్షత్రపుడుగనుండి క్షత్రపబిరుదముతో తన కుమారుడగు జయదాముని పరిపాలనమున పాల్గొనజేసెను. మరి కొద్దికాలమునకే అతని పౌత్రుడగు రుద్రదాముడు క్షత్రపబిరుదము వహించి పితామహునితో కలసి రాజ్యము చేసెను.(268) దీనినిబట్టి చష్టనుని జీవితకాలముననే జయదాముడు మరణించెనని తెలియనగుచున్నది. క్రీ. శ. 150నాటి శాసనములలో రుద్రదాముడు మహాక్షత్రపుడుగ వర్ణింపబడినాడు. అన్నివర్ణములవారును స్వరక్షణార్థమై యితనిని రాజుగ నెన్నుకొనిరట. ఇతడు స్వయమధిగతమహాక్షత్రపనాముడట. సామాన్యపరిస్థితులలో జయదాముడు ముందుగనే మరణించుటవలన చష్టనునియనంతరము రుద్రదాముడు మహాక్షత్రపుడు కావలసి యుండెను. ప్రజ లితనిని రాజుగ నెన్నుకొనుటయు, తనంతట తానే మహాక్షత్రపబిరుదమును వహించుటయు రుద్రదాముడు రాజగుటకుపూర్వము కొన్నికష్టములు సంభవించెననియు, బహుశః కొంతకాలమైనను రాజ్యములో కొంతభాగమైనను రుద్రదాముని వశము తప్పిపోయెననియు సూచించుచున్నది. క్రీ.శ. 130_150 నడుమ చష్టనజయదాము లెప్పుడు మరణించిరో, రుద్రదాము డెప్పుడు రాజ్యమునకు వచ్చెనో తెలియదు. బహుశః పులోమావి మరణించినవెంటనే అతని తమ్ముడగు ఈసాతకర్ణి శకరాజ్యముపై దండెత్తి యుండును. ప్రబలుడగు నితనితో వైరమేలనని చష్టనుడు ఇతనికి రుద్రదాముని కుమార్తెనిచ్చి పెండ్లి చేయించియుండును. ఆమీద చష్టనుడు మరణించియుండును. ఈసమయమున పరిసరప్రాంతములనున్న యౌధేయులుమున్నగువారు శకరాజ్యముపై దండెత్తివచ్చి యుందురు. ఈ

---

265. Rapson—CAC. Intro. p. CVI. Smith—E H I. pp. 210—211.
266. I. A. vol. 48. p. 153.
267. చూ. అనుబంధములోని రుద్రదాముని జూనాఘుడ్ శాసనము.
268. చూ. ఆంధ్రశాసనములు.

యడనును పురస్కరించుకొని సాతకర్ణియు దండయాత్ర సాగించియుండును. అందు రుద్ర దాము డితనిని ఓడించియుండును. కొంతకాల మైనపిమ్మట సాతకర్ణి మరియొకసారి శకరాజ్య ముపై దండెత్తియుండును. ఈసారియు సాతి కర్ణి ఓడిపోయియుండును. ఈ వైరమునకు ఫలిత ముగ కొంతకాలము అపరాంతము సాతకర్ణి స్వాధీనమునం దుండినను(269) తుదకు పూర్వా పరాకరావంతి సౌరాష్ట్రకుకురాపరాంతములు రుద్రదామునికి వశమయ్యెను. ఆంధ్రకళింగ విదర్భలుమాత్రము సాతవాహనసామ్రాజ్య మున నిలచెను.

## గౌతమీపుత్ర యజ్ఞశ్రీ సాతకర్ణి క్రీ. శ. 174—203.

చతరపణసాతకర్ణికి పిమ్మట శివస్కందుడు రాజ్యమునకు వచ్చెను. ఇతనిశాసనము లేవియు దొరకలేదు. ఈ రాజునాణెములుమాత్రము నేటి బేరారులోని తరహాలాలో లభించినవి. (270) కృష్ణాజిల్లాలో దొరికి రుద్రసాతకర్ణిదిగ పరిగణింపబడిన ఒకనాణెము ఈరాజుదే అని ఒక వాదము.(271) ఇది సమంజసమనియే తోచుచున్నది. అప్పుడు ఈనాణెములమీది 'ఖదసత' స్కంద లేక శివస్కంద సాతకర్ణి అగును.

శివస్కందుని కుమారుడు గౌతమీపుత్ర యజ్ఞశ్రీ. సాతవాహనవంశజులలో ప్రతిభా వంతులని చెప్పదగినవారిలో ఈమహారాజు కడపటివాడు. ఇతని నాణెము లనేకములు దొరికినవి. అవి గుజరాత్, కథియవార్ బరోడా మాల్వా అపరాంత మహారాష్ట్రాంధ్ర దేశములలోను, మధ్యరాష్ట్రములలోను దొరి కినవి.(272) ప్రాక్సైరమున దొరికిన ఓడబొమ్మ గల నాణెము లితనివికూడ కొన్ని గలవు (273) దీనినిబట్టి ఇతడును గౌతమీపుత్రసాతకర్ణివలె విశాలమగు సామ్రాజ్యమును పరిపాలించెనని స్పష్టమగుచున్నది. రుద్రదాము డప్పటికి గతించియుండెను. అందువలన ఉజ్జయినీ శక రాజులప్రతిభ సన్నగిలెను. యజ్ఞశ్రీ వీరి నోడించియే గుజరాత్ కథియవార్ మున్నగు ప్రాంతములను గైకొనియుండును.

యజ్ఞశ్రీ రాజ్యకాల మీవిజయములకే గాక మరియొక కారణమువలనకూడ ప్రఖ్యాత మయ్యెను. బౌద్ధమతమునకు బుద్ధునితర్వాత మరల నంతటివాడనియు, మహావిద్వాంసు డనియు, పేరుపొంది మాధ్యమికవాదనిర్మాత అయిన ఆచార్యనాగార్జునుడు యజ్ఞశ్రీమహా రాజుచే ఆదరింపబడి, శ్రీపర్వతమున ఆమహా రాజు నిర్మించిన సంఘారామమునందు నివసిం చెను. నాగార్జునుని గ్రంథములును, ఫాహి యాన్ హ్యూయాన్ త్స్యాంగ్ మున్నగు చైనా యాత్రికుల వ్రాతలును, టిబెట్ చైనాలలో ప్రచారమునందుండిన గాథలును ఈయాచా ర్యునికి ఒకసాతవాహనరాజుతో సన్నిహిత సంబంధ ముండెనని చెప్పుచున్నవి. "రసరత్నా కర"మను గ్రంథమున శాలివాహనుని ప్రశంస కలదు. ఈత్సింగ్ అను చైనాయాత్రికుడు ఆచార్యనాగార్జునుడు తనమిత్రుడగు సోతో ఫోహోనా లేక సాతవాహనునికి "సుహృల్లేఖ"

269. Iour. Num. Soc. Ind. vol. II p. 89. 270. Ibid.
271. A S W I. vol. V. p. 78. no. 12.
272. Rapson—CAC. Intro. paras. 60—62, 65, 72. 273. Ibid. pl. V. 96.

అను జాబును వ్రాసెననియు, ఈరాజుకు జింతక(జేతిక) అని మఱియొక పేరును ఉండెననియు, వ్రాసినాడు. బాణుని హర్షచరిత్రమున ఈశాతవాహనుడు విశాలమగు రాజ్యముకలవాడనియు, త్రిసముద్రాధిపతియనియు వర్ణింపబడినాడు. హ్యూయన్‌త్సాంగ్ వ్రాతలనుబట్టి యీ శాతవాహనుడు దక్షిణకోసల మునకు ను ఆంధ్రమునకును పాలకుడని తెలియుచున్నది. ఆచార్యనాగార్జునుడు కనిష్కునికి సమకాలికుడని ఒక అభిప్రాయ మున్నది. బహుశః ఆచక్రవర్తికాలమున నాగార్జునుడు బాలుడుగ నుండెనేమో. ఏమైనను ఈయాచార్యుడు క్రీ. వ. 2వశతాబ్ది ఉత్తరార్థమునం దుండెనని చాలమంది పండితుల అభిప్రాయము.(274) ఇతడు యజ్ఞశ్రీ పూర్వుడగు వాసిష్ఠీపుత్ర పులోమావికాలమువాడని ఒకవాద మున్నది.(275) కాని పులోమావి క్రీ. శ. 130 నాటికి మరణించియుండుట ఈవాదము సమంజసము కాదని చూపుచున్నది. యజ్ఞశ్రీకి పిమ్మట శాతవాహనవంశము క్షీణించిపోయెను. అంత ప్రతిభావంతు లెవరును లేకుండిరి. ఈకారణములనుబట్టి యజ్ఞశ్రీ నాగార్జునాచార్యునికి సమకాలికుడగు శాతవాహనరాజని నిర్ణయింపవచ్చును. ఈమహారాజు ఈబౌద్ధాచార్యుని యెడల విశేషములగు భక్తిగౌరవములను చూపెను. ఆయాచార్యుడును తన పాండితీవిభవముచేత శాతవాహనసామ్రాజ్యమునకు దేశదేశాంతరములందు సహితము శాశ్వతములగు కీర్తిగౌరవములను కల్పించెను.

## ౧౫. సామ్రాజ్య పతనము

గౌతమీపుత్రయజ్ఞశ్రీ అనంతరము విజయ, చంద్రశ్రీ, పులోమావి అనువారు పరిపాలించిరి. వీరెవ్వరును మహారాష్ట్రమును పాలించినట్లు లేదు. విజయుని శాసనములు లేవు. ఇటీవల తర్హాలాలో దొరికిన నాణెములలో నాలుగు ఇతనివిగ పరిగణింపబడినవి[276] ఆంధ్రదేశమున ఇతని నాణెములు దొరికలేదు. చంద్రశ్రీశాసనము కొడవలిలో దొరికినది.[277] ఇతని నాణెములు ఆంధ్రదేశమధ్యరాష్ట్రములలో దొరికినవి.[278] కడపటి రాజగు పులోమావిశాసనము బళ్ళారిజిల్లా మ్యాకదోనిలోను, కొన్ని నాణెములు తర్హాలాలోను[279] లభించినవి. నాసికలో ఆభీరవంశజుడగు మాఢరీపుత్ర ఈశ్వరసేనుని క్రీ. శ. 2వశతాబ్ది పూర్వార్థమునాటి శాసన మొకటి కలదు.[280] కడపటి ముగ్గురు శాతవాహనరాజులకును మహారాష్ట్రముతో సంబంధము లేకుండుటను, నాసికలో ఈశ్వరసేనుని

274. కొడాలి లక్ష్మీనారాయణ—నాగార్జునచరిత్ర. III, IV విభాగములు.

275. Sivaramamurthi—Amaravati Sculptures. p. 8.

276. Jour. Num. Soc. Ind. vol. II. p. 90

277. చూ. అనుబంధము—౨౨వ శాసనము.

278. Rapson—CAC. Intro. para. 61—62

279. Jour. Num, Soc. II. p. 902. 280, E. I. VIII. Nasik. Ins.

శాసన మందుండుటనుచూడ యజ్ఞశ్రీ అనంతరము ఆభీరులు మహారాష్ట్రమును జయించి వశపరచుకొనిరని తోచుచున్నది. అపరాంతవైజయంతులలో మహారథుల యొక్కయు, చుటునాగులయొక్కయు శాసనములు, నాణెములును దొరికినవి. వీరికి సన్నిహితమగు బాంధవ్యముండెను. ఆంధ్రదేశమున శ్రీరుద్రసాతకర్ణి అను రాజుయొక్క నాణెములులభించినవి. మధ్యరాష్ట్రములలో శ్రీకృష్ణుని నాణెములు కనిపించును.[281] ఈయంశములను పురస్కరించుకొని రాప్సన్ పండితుడు యజ్ఞశ్రీ మరణానంతరము సాతవాహనసామ్రాజ్యము రెండుగ విభజింపబడెననియు, అందు పశ్చిమభాగమును చుటుసాతకర్ణులును, ప్రాగ్భాగమును శ్రీకృష్ణాదులును పాలించిరనియు ఒక సిద్ధాంతము చేసినాడు.[282] తరహాలా నాణెములు దొరకకపూర్వ మీసిద్ధాంతము చేయబడినది. అప్పటికి చంద్రశ్రీ కొడవలిశాసనమును, ఆంధ్రదేశమునందలి నాణెములును, పులోమావి మ్యాకదోనిశాసనమును మాత్రమే తెలియవచ్చినవి. కాని తరహాలా నాణెముల నుండి చంద్రశ్రీ ఆంధ్రవిదర్భలను పాలించెనని స్పష్టమగుచున్నది. పులోమావి బళ్ళారి నుండి విదర్భవరకునుగల దేశము నేలెననియు చెప్పనగును. అప్పుడు చుటువంశీయులు ఈ కడపటి ఇద్దరు సాతవాహనులను ధిక్కరించి స్వతంత్రులై పరిపాలించిరని చెప్పవలసివచ్చును. పులోమావి పరిపాలనము బళ్ళారి ప్రాంతమున సుస్థిరముగ నుండెనట్లు అతని మ్యాకదోనిశాసనము తెలుపుచున్నది: అందేయగాక శివస్కందనాగుడు అతనికి మహాసేనాపతియగుట నాగులీ మహారాజునకు సామంతులుగనుండిరని సూచించుచున్నది. దీనినిబట్టి పులోమావి మరణానంతరముగాని యీచుటునాగవంశీయులు స్వతంత్రులై యుండరని తోచుచున్నది.

మత్స్యపురాణమున ఆంధ్రులు రాజ్యము చేయుచుండగనే వారిభృత్యాన్వయములకు చెందిన ఐదు ఆంధ్రవంశములు పరిపాలించునని చెప్పబడియున్నది.(283) ఆంధ్రులసమకాలికుల ప్రశంస చేయుసందర్భమున నీయంశము పేర్కొనబడినది. ఒకచోటమాత్రము శ్రీపార్వతీయాంధ్రులు ఈసమకాలికులలో నొకరుగ పేర్కొనబడినారు. మిగిలిన నాలుగు ఆంధ్రవంశములు ఏవియో చెప్పబడలేదు. వనవాసిప్రాంతమున దొరికిన రెండుశాసనములను బట్టి(284) మహారాజహారీతీపుత్ర చుటుకులానందసాతకర్ణి, స్కందనాగసాతక లేక సాతకర్ణి అను ఇద్దరు రాజులు తెలియనగుచున్నారు. సాతకర్ణి బిరుదము సాతవాహనరాజులది. పై హారీతీపుత్రుడు చుటుకులజుడు. స్కందనాగుడు నాగవంశజుడు. వీరిద్దరును సాతకర్ణిబిరుదము వహించుటనుబట్టి వీరును సాతవాహనులవలె ఆంధ్రులే యనియు, పురాణములలోని ఆంధ్రభృత్యవంశజులలో వీరు చేరియుండిరనియు ఊహింపవచ్చును. ఆంధ్రదేశమున దొరికిన నాణెములలో శ్రీరుద్రసాతకర్ణి అను రాజు నాణెములు కలవని ఇదివరలో చెప్పియుంటిమి. ఇతని పేరు పౌరాణికపట్టికలలో లేదు. ఇతని శాసనము

281. Rapson—CAC. Intro. paras 61, 62, 65. 282. Ibid. pp. 42—43.
283. చూ. అనుబంధము. పే. 26.

284. I. A. XIV. p. 334; Ep. Cra. VII. p. 251.

లును లభించలేదు. అమరావతీశాసనములలో నొకటి శివమక సాద అను రాజును పేర్కొనుచున్నది. ఇతని శాసనములు మరియెచ్చటను లేవు. ఇతని నాణెములును లభించలేదు. ఈయిర్వురు రాజులకాలములను నిస్సందేహముగ నిర్ణయించుటకు తగిన ఆధారములును లేవు. కాని వీరిబిరుదములనుబట్టి వీరు సాతవాహనవంశజులని చెప్పవచ్చును. మహారాష్ట్రమునందలి కొల్హాపురమున కొన్నినాణెములు దొరికినవి.(285) వానినుండి ఇద్దరు విలివాయకురులును, ఒక శివలకురుడును తెలియనగుచున్నారు. వీరిశాసనము లేవియు లేవు. గౌతమీపుత్ర, మాఢరీపుత్ర అను మాతృనామములు వీరిపేర్లముందు చేర్చబడియున్నవి. సాతవాహనయుగమున సామాన్యులు సహితము ఇట్లు తల్లులపేర్లను తమ పేర్లముందు కలుపుకొను నాచార ముండెను. కాని పైమువ్వురును తమపేర్లతో నాణెములను వేయించుటవలన వారు సామాన్యులు కాక పరిపాలనాధికారము కలిగి యుండిన వారని తోచుచున్నది. వీరి నాణెములమీద ఒకవైపున చైత్యమును, వృక్షమును కలవు. ఈరెండుచిహ్నములును మొదటి సాతకర్ణి నుండి యజ్ఞశ్రీవరకునుగల సాతవాహనుల నాణెములమీద కనిపించుచున్నవి. ఈ వృక్షమును, చైత్యమునుసదకనకళలాయమహారథి వేయించిన చిత్తల్ దుర్గప్రాంతమున దొరికిన నాణెములమీదను కలవు. ఇతడు సాతవాహనసంబంధము కలవాడని 'సదకన' అను బిరుదము సూచించుచున్నది. ఈరాజువలెనే ఈ కొల్హాపురి నాణెములనుండి తెలియవచ్చు ముగ్గురురాజులునుకూడ సాతవాహనసామంతులో లేక దాయాదులో అని చెప్పవచ్చును. ఇటీవల విదర్భలోని బ్రహ్మపురిలో దొరికిన నాణెములు కుంభసాతకర్ణి, కర్ణసాతకర్ణి, శకసాతకర్ణి అను ముగ్గురురాజులను పేర్కొనుచున్నవి.(286) ఈపేర్లు పౌరాణికపట్టికలలో లేవు. ఈరాజులశాసనములును లేవు. వీరి నాణెములు మరియేప్రాంతమునను దొరకలేదు. సాతకర్ణి బిరుదము వీరు సాతవాహనులని సూచించుచున్నది. ఈకారణములనుబట్టి వీరు విదర్భ శాఖకు చెందిన సాతవాహనులని ఊహింపవచ్చును. కన్హేరిలో మాఢరీపుత్రస్వామిసకసేనుని పేర్కొను శాసనమొకటి కలదు.[287] ఇతనికి సాతకర్ణిబిరుద మీశాసనమున కనిపింపదు. ఆంధ్రదేశమున కృష్ణాగుంటూరు జిల్లాలలో "సిరి సకసేనస" అను పేరుగల నాణెములు దొరికినవి.[288] ఈసకసేనుడు పై కన్హేరిశాసనమునందలి సకసేనుడు కావచ్చును. ఇతడు సాతవాహనవంశజుడును కావచ్చును. ఇతనికి గల 'స్వామి' బిరుదము "సామి సిరి పుళుమావిస" అను వాసిష్ఠీపుత్రపులోమావి పేరులోను "సామి సిరియణ సదస" అను యజ్ఞశ్రీ పేరులోను గల 'స్వామి' బిరుదమును పోలియున్నది. ఈకారణమునుబట్టి ఇతడును సాతవాహనుడే అని ఊహింపవచ్చును. అగుచో నితడు యజ్ఞశ్రీకి పిమ్మటను, అభీరులకు పూర్వమును ఆంధ్రమహారాష్ట్రదేశములను కొంతకాలము పాలించి యుండవచ్చును.

285. Ibid. 286. Jour. Num. Soc. II. pp. 90—92.

287. చూ. అనుబంధము. 17వ శాసనము.

288. Rapson—CAC. pr. III and para 62.

పైన పేర్కొనబడిన వివరములనుబట్టి ఈ క్రిందివృత్తాంతముల నూహింపవచ్చును; గౌతమీపుత్రయజ్ఞశ్రీ అనంతరము సాతవాహనసామ్రాజ్యమున కొంత కలవరము ఏర్పడెను. పశ్చిమమున ఆభీరులు ఈశ్వరసేనుని నాయకత్వమున దండెత్తివచ్చి నాసిక్‌ప్రాంతమును వశపరచుకొనిరి. మాఢరీపుత్రశకసేనుడను సాతవాహనవంశజుడు అప్పటిరాజగు చంద్రసాతకర్ణిని తరిమివేసి కృష్ణాగుంటూరు మండలముల నాక్రమించి, ఆపిమ్మట మహారాష్ట్రమునకు పోయి, కన్హేరిప్రాంతము నాక్రమించి ఆభీరులవిజృంభణము నరికట్టెను. ఈ సమయమున చంద్రశ్రీ గోదావరిని దాటిపోయి కళింగవిదర్భమధ్యరాష్ట్రములను పాలింపసాగెను. చంద్రశ్రీ మరణించిన పిమ్మట కొందరు సాతవాహనవంశీయులు స్వతంత్రులై విదర్భలో ఒక స్వతంత్రరాజ్యమును నెలకొల్పిరి. శకసేనుని అనంతరము కృష్ణాగుంటూరుమండలములకు సినమకసాతకర్ణి, శ్రీరుద్రసాతకర్ణిఅను మరియిద్దరు సాతవాహనవంశీయులు పాలకులైరి. ఆపిమ్మట మూలశాఖలో కడపటిరాజగు మూడవపులోమావి బళ్ళారిప్రాంతమునందలి సాతాహనిరాష్ట్రమునకు తన కేంద్రమును మార్చుకొని, ఒకసారి ప్రాక్తీరముమీదను, విదర్భమీదను తన అధికారమును స్థాపించెను. అతనితో సాతవాహనుల మూలశాఖ ఉత్సన్నమయ్యెను. దానితో సాతవాహన సామ్రాజ్యము నశించెను.

మూడవపులోమావి అనంతరము సాతవాహనసామ్రాజ్యము భిన్నభిన్నమై పోయెను. గుజరాత్ కతియవార్ ప్రాంతమును శకరాజులు గైకొనిరి. నాసిక్‌ప్రాంత మాభీరుల వశమయ్యెను. అపరాంతమున మహారథులు స్వతంత్రులై 'సాతకర్ణి' బిరుదమును వహించి పరిపాలింపసాగిరి. కుంతలమున చుటువంశీయులు ప్రబలులై 'సాతకర్ణి' బిరుదముతో ఏలుబడి సాగించిరి. వారికి ప్రాగ్దక్షిణముగ ద్రవిడదేశమువరకునుగల భాగమున నాగులు బలవంతులుగ నుండిరి. చుటువంశీయులు అటు మహారథులతోడను, ఇటు నాగులతోడను వైవాహికసంబంధముల నేర్పరచుకొనిరి. ప్రాగాంధ్రమున శ్రీపర్వతమువద్దనున్న విజయపురి కేంద్రముగ ఇక్ష్వాకులు విజృంభించిరి. వారిలో మొదటివాడగు మొదటిచాంతమూలుడు అశ్వమేధవాజపేయాదియజ్ఞములను చేసెను.[289] ఇతడు తన రాజ్యమును అటు ఉజ్జయినీశకుల రాజ్యమువరకును, ఇటు చుటువంశీయుల రాజ్యమువరకును విస్తరించి తనరాజ్యస్థైర్యము నాశించి ఉజ్జయినీ రాజపుత్రికను తనకుమారునికిని, తన పౌత్రునివనవాసిమహారాజుకును ఇచ్చి వివాహములు చేయించెను.[290]

---

289 E. I. XX. Nagarjunakonda Ins. No. B2.
290 Ibid B5 and H.

# ఆంధ్రుల విస్తరణము*

శ్రీ కురుగంటి సీతారామయ్య ఎం. ఏ.

ఆంధ్రుల ఆదిమనివాసస్థానము ఏది అనునది ఒక ముఖ్యసమస్య. దానినిగూర్చి అనేకాభిప్రాయము లున్నవి. నేడు ఆంధ్రులు మధ్యరాష్ట్రములలోని చాందాజిల్లాలోను, నైజాం రాజ్యములోని తెలంగాణమునందును, మదరాసురాజధానిలోని తీరమండలములలోను, పశ్చిమోత్తరభాగమునను, మైసూరురాజ్యము నందలి ప్రాగ్భాగమునను నివసించుచున్నారు. ఆంధ్రులు ఈభూభాగములలోనికి ఎట్లు వ్యాపించిరి అనునది ఈవ్యాసమున చర్చింపబడును.

ఆంధ్రుల మొదటిప్రశంస ఐతరేయబ్రాహ్మణమున కలదు.(1) అందు విశ్వామిత్రుడు తన కుమారులను ఆర్యభూములను దాటిపోయి వానికి వెలుపల నివసింపుడని శపించెననియు, అందువలననే ఆంధ్రపుండ్రపుళిందశబరమూతిబులు కలసియుండిరనియు చెప్పబడినది. ఈ యైతరేయబ్రాహ్మణము క్రీ. పూ. 500 నాటిదిగ పరిగణింపబడుచున్నది. పైవృత్తాంతము అంతకుపూర్వము జరిగి యుండవలెను. ఇది ఒక ముఖ్యఘట్టము.

ఆంధ్రులేమార్గమున కదలిరి అనునది ఒక సమస్య. వీరు పారియాత్రముమీదుగా, అనగా బర్‌హాన్‌పూర్ కనుమలగుండా దక్షిణామునకు వచ్చిరని ఒక వాదము.(2) పూర్వయుగమున కొందరు బ్రాహ్మణులు దక్షిణాపథ పశ్చిమభాగముమీదుగ ద్రవిడదేశమువరకును పోయిరనియు, వీరికి బృహచ్చరణులను పేరు వచ్చెననియు మరియొక వాదము. ఈబృహచ్చరణులు ముందుగ అవంతిని ప్రవేశించి, ఆమీద విదర్భ,ముళక,అశ్మకలగుండా దక్షిణామునకు పోయిరట.(3) ఆంధ్రదేశమునందు ఈ బృహచ్చరణశాఖ లేదు. అందువలన వీరి గమనక్రమము ఆంధ్రుల విస్తరణమును నిరూపించుట కుపయోగింపదు. పైన పేర్కొనబడిన జాతుల ప్రశంసలోని క్రమము మిక్కిలి ముఖ్యమైనది. దానినుండి తక్కినవారికంటె ఆంధ్రులే ముందు బయలుదేరిరని తెలియనగుచున్నది. పురాణములలో ఆంధ్రకళింగులు కలిపి పేర్కొనబడినారు. పాణిని కళింగుల ప్రశంస చేసినాడు.(4) దీనినిబట్టి కళింగులు ఆంధ్రులకంటెనుకూడ ముందుగనే బయలుదేరివచ్చి దక్షిణాపథప్రాగ్భాగమున స్థిరపడిరని ఊహింపనగును. వారు వింధ్యపర్వతములను దాటక, తూర్పుగనే పోయి, క్రమక్రమముగ తీరమువెంబడి దక్షిణముగ వ్యాపించియుందురు. క్రీ. పూ. 4వ శతాబ్దినాటి మెగాస్తనీసు ఆంధ్రకళింగులను ఇరుగుపొరుగు జాతులుగ

---

* ఆంగ్లమునకు అనువాదము — సంపాదకుడు.

1. ఐతరేయ బ్రాహ్మణము VII. 3—18.
2. S. K. Aiyyangar—Ancient India. p. 215.
3. D. R. Bhandarkar—Charmichael Lectures pp. 22—23.
4. R. G. Bhandarkar—EHD p. 12.

పేర్కొనినాడు. మెగాస్తనీస్ గ్రంథమునకు వ్యాఖ్యాత మక్కకళింగె, గంగారిడె, మొడో కళింగె అను విభాగములకు చెందిన జాతివారు మొదట గంగాముఖద్వారమునుండి దక్షిణాపథప్రాక్తీరమంతటను వ్యాపించిరని యు(5) నాటి ఆంధ్రులు కృష్ణాగోదావరీమధ్యదేశము నుండి ఉత్తరముగ నర్మదానదివరకును, ప్రాగుత్తరముగ గంగాతీరమువరకును వ్యాపించిరనియు వ్రాసినాడు.(6) ఆంధ్రులు కళింగుల వలెగాక వింధ్యపర్వతములను దాటి, కృష్ణాగోదావరీమధ్యదేశము నాక్రమించి, క్రమముగ ప్రాక్తీరమునకు విస్తరించి యుందురు.

అశోకుని శాసనములు నీసందర్భమునందు ఉపకరించు చున్నవి. ఆచక్రవర్తి కళింగులను జయించెను కాని ఆంధ్రులను జయింపలేదు. అయినను వారు అతనియొక్కయు, సువర్ణగిరి యందుండిన అతని ప్రతినిధియొక్కయు అధికారము నంగీకరించినట్లు కనిపించుచున్నది.(7) ఆచక్రవర్తి శాసనములలో రఠికభోజకపెటినికుల ప్రశంస ప్రత్యేకముగ నున్నది. ఈరఠికుల మహారాష్ట్రమును, పెటినికుల పైఠానమును, భోజకుల బెరారును ఆంధ్రసాతవాహనసామ్రాజ్యమున చేరియుండినవి. దీనినిబట్టి ఒకప్పుడు ఆంధ్రులు తూర్పునుండి పడమటికి వ్యాపించిరని తెలియనగుచున్నది.

బౌద్ధుల జాతకకథలు మరికొన్ని వివరములను తెలుపుచున్నవి. సెరివణిజజాతకమున(8) ఇద్దరు వర్తకులు సెరివానగరమునుండి తెలివాహానదీతీరమునందున్న ఆంధ్రపురమున కేగిరని చెప్పబడినది. పాళీవాఙ్మయమున 'పుర' శబ్దము రాజధానికే వాడబడినది. అందువలన పై ఆంధ్రపురము ఒక ఆంధ్రరాష్ట్రమునకు కేంద్రమని చెప్పవచ్చును. తెలివాహానది నేటి మదరాసుమధ్యరాష్ట్రముల సరిహద్దులోగల తేల్‌నది అగును. ఈ ప్రాంతము కళింగము నంటియున్నది. ఇది క్రీ. పూ. 5, 4 శతాబ్దులలో ఆంధ్రుల నివాసస్థానమై యుండును.

ఆంధ్రబ్రాహ్మణులలో ములికినాటివారను శాఖ ఒకటి కలదు. గోదావరీతీరమున పైఠాను కేంద్రముగ ములకనాడను రాష్ట్ర మొకటి ఉండెను.(9) సుత్తనిపాతమున(10)బవేరిన్ అను నొక బ్రాహ్మణుడు బౌద్ధమతముయొక్క ఒత్తిడికి నిలువజాలక స్వదేశమగు ములకరాష్ట్రమును విడచి అశ్మకరాష్ట్రమునకు పోయెనని చెప్పబడినది. ఈవృత్తాంతము ఆంధ్రులు ములకనుండి దక్షిణముగ అశ్మకమునకు వచ్చిన విధమును సూచించును. ఇది క్రీ. పూ. 5వ శతాబ్దినాటి వృత్తాంతము కావచ్చును.

కృష్ణయజుర్వేదమునకు ద్రవిడపాఠ మొకటియు, ఆంధ్రపాఠ మొకటియు కలవు. ఆంధ్రదేశమునందంతటను ఆంధ్రపాఠము ప్రచారమునం దున్నవి. ఇందు ఎక్కువపదములును, అనువాకములును కలవు. ఈయాంధ్రపాఠము దక్షిణమునను, ఘూర్జరమహారాష్ట్రములందునుకూడ వ్యాప్తియం దున్న బహుప్రాచీనకాలముననే ద్రవిడులు ఉత్తరమునుండి దక్షిణమునకు వచ్చిరట. అగస్త్యుడు మొట్టమొదటిసారి వింధ్యపర్వతములను దాటి దక్షిణముగ

5. Mc Crindle—Ancient India pp. 133—35.
6. Ibid. p. 138.
7. Ind. Ant. 1918. pp. 70—71.
8. Ibid.
9. Garmichael Lectures p. 4.
10. Ibid. p. 18.

బహుదూర మేగెనని రామాయణమహాభారతములు తెలుపుచున్నవి.(11) అతని వెనుక ననేకులు వచ్చి దండకారణ్యమునందు ఎన్నియో ఆశ్రమములను స్థాపించిరి. ఈ తడ తడవల వచ్చినవారు యజుర్వేదమును కొన్ని కొన్ని మార్పులను చేయుచు వచ్చియుందురు. ఇట్లు ద్రవిడు లొకసారియు, ఆంధ్రు లింకొకసారియు వచ్చి, ఎవరిపాఠమును వారు ప్రచారము చేసియుందురు.

పైన పేర్కొనిన అంశములనుబట్టి కళింగులు కదలిపోయిన తర్వాత బయలుదేరి, ఆంధ్రులు వింధ్యపర్వతములను దాటి, గోదావరీ తీరముకును, అమీద కృష్ణాతీరమునకును వచ్చి, పిమ్మట సముద్రతీరమువరకును వ్యాపించిరని చెప్పవచ్చును. పిమ్మట వారిలో ఒకశాఖ వారు దక్షిణముగను, ఇంకొకశాఖవారు పశ్చిమోత్తరముగను పోయి యుందురు.

---

11.

# ఆంధ్ర-సాతవాహన సమస్య*

శ్రీ గొర్తి వెంకటరావు ఎం. ఏ, ఎల్ఎల్. బి.

ప్రాచీనభారతదేశచరిత్రమునందలి ఇతర సమస్యలవలెనే ఈసమస్యయు చిరకాలము వాదోపవాదములకు కారణమైనది. ఈసమస్యకు రెండువిధముల సమాధానము లొసంగ బడినవి. కొందరు సాతవాహనులు నాంధ్రులు నొకేజాతివా రనుచున్నారు. మరికొందరు వీరిని వేర్వేరు జాతులందురు. ఇంక కొందరు సాతవాహను లాంధ్రజాతీయులే అని అంగీకరించుచు వారు కృష్ణాగోదావరీముఖద్వారములనుండి పడమటగ నాసికప్రాంతమునకు వ్యాపించిరనిమాత్రము అంగీకరించుట లేదు. అందువలన నీసమస్యను పునర్విమర్శించుట యుక్తము.

నానేఘాట్‌లో ఒక గుహలో 'రాయ సిముక సాతవాహన' అను రాజుని పేర్కొను శాసనమొకటి కలదు. నాసికలోని ఒకగుహయందలి శాసనము సాతవాహనకులమునకు చెందిన కన్హ అను రాజును పేర్కొనుచున్నది. గౌతమీబాలశ్రీ నాసికశాసనము ఆరాణికుమారుడగు గౌతమీపుత్రసాతకర్ణి విజయములను వర్ణించుచు అతడు సాతవాహనకులముయొక్క గౌరవమును తిరిగి ప్రతిష్ఠించెనని చెప్పుచున్నది. ఈరాజులపేర్లే పురాణములలో ఆంధ్రజాతీయులగు రాజులపేర్లుగ చెప్పబడినవి. కొన్నిపురాణములు వీరిని ఆంధ్రభృత్యులని పేర్కొనుచున్నవి. ఈయంశములనుబట్టి చాలమంది పండితులు శాసనములలోని సాతవాహనరాజులు పురాణములలోని ఆంధ్ర లేక ఆంధ్రభృత్య వంశజులని నిర్ణయించిరి.

ఆర్. జి. భండార్కరుపండితుడు ఈయభిప్రాయమునే ఒసగుచు 'ఆంధ్రభృత్య' శబ్దమునకు ఒకప్పుడు భృత్యులుగ నుండిన ఆంధ్రులు అని అర్థము చెప్పెను. ఈశబ్దము ఢిల్లీని పరిపాలించిన 'బానిసవంశము'యొక్క పేరును స్ఫురణకు తెచ్చుచున్నది.

మెగాస్తనీసు కాలమున ఆంధ్రులు కృష్ణాగోదావరీముఖద్వారములవద్ద నివసించుచు మౌర్యచక్రవర్తుల బలమునకు పిమ్మట నెదుర్కొన దగినంత ప్రబలమగు సైనికబలమును కలిగియుండిరని స్మిత్ అభిప్రాయము. అశోకుని కాలమున వారి రాజు ఆమౌర్యచక్రవర్తికి కొంతవరకును లోబడి యుండెను. అశోకుని మరణానంతరము ఆంధ్రులు స్వతంత్రులై నాసికవరకుమ తమ అధికారమును వ్యాపింప చేసిరి. బర్గెస్, రాప్సన్, బార్నెట్ ప్రభృతులును ఇట్లే అభిప్రాయపడిరి.

ఈవాదము నంగీకరింపనివారు ఏశాసనమునందును, నాణెమునందును సాతవాహను లాంధ్రులని ఏల చెప్పబడలేదు? ఏపురాణమునందును ఆంధ్రులు సాతవాహనులుగ ఏల పేర్కొనబడలేదు? ప్రాచీన సాతవాహన శాసనములన్నియు మహారాష్ట్రముననే ఏల కలవు? అను ప్రశ్నలను వేయుచున్నారు. పి.

---

* ఆంగ్లమునకు అనువాదము—సంపాదకుడు.

టి. శ్రీనివాసఅయ్యంగారు సాతవాహను లాంధ్రులే అయినను వారి ఆదిమనివాసము కృష్ణాగోదావరీముఖద్వారప్రాంతము కాదనెను. ఆంధ్రులు వింధ్యప్రాంతవాసులనియు, వారిరాజులు మొదట మహారాష్ట్రము నేలిరనియు, ప్రాకృతభాషను మాట్లాడిరనియు, వారిఅధికారము పడమటనుండి తూర్పునకు విస్తరించెననియు, పడమటిరాజ్యమును కోల్పోయి వారు ప్రాక్తీరమునకు వచ్చిన పిమ్మట నీప్రాగ్భాగమునకు ఆంధ్రమండలమను పేరు వచ్చి రూఢి అయ్యెననియు ఈపండితుని వాదము.

సాతవాహను లాంధ్రజాతీయులే కాని వారి అధికారప్రారంభము పశ్చిమమునందయ్యెననియు, వారు ఆంధ్రదేశరాజవంశీకులో లేక మహారాష్ట్రమున మౌర్యుల సామంతపాలకులై ఆంధ్రులగు భృత్యులను ప్రసిద్ధిని పొందినవారో అయియుందురనియు, అశోకుని మరణానంతరము వారు తాము అంతవరకును అధికారమునెరపిన మహారాష్ట్రమున స్వతంత్రులైరనియు వాదించి డా. గోపాలాచార్యులు ఇది ఊహామాత్రమని వ్రాసెను.

వి. యస్. సుక్తంకరు ఆంధ్రసాతవాహనుల సంబంధమునుగూర్చి సందిగ్ధమున పడినను సాతవాహనుల ఆదిమనివాస మాంధ్రదేశముమాత్రము కాదని ఖండితముగ వ్రాసి మ్యాకదోని, హిరహడగల్లి శాసనములలోని సాతవాహనిహార, సాతవాహనరఠ శబ్దముల నాధారముచేసికొని నేటి బళ్ళారిప్రాంతము సాతవాహనుల ఆదిమనివాసమని ఒక వాదమును లేవదీసెను. అంతటితో తృప్తినందక ఈపండితుడు సాతవాహనులు తమ సజాతీయులగు ఆంధ్రులనుండి వేరుపడి, మహారాష్ట్రమున కేగి, అచ్చట స్థిరపడియుండవలెను లేదా ఆంధ్రులే మొదట సాతవాహనిహారమున నివసించి, పిమ్మట రెండుశాఖలుగ అటనుండి మహారాష్ట్రమునకును ఆంధ్రదేశమునకును పోయియుండవలెను అని తన యభిప్రాయమును వివరించి తుదకు సాతవాహనులు అసలు ఆంధ్రులే కాకపోవచ్చుననియు పురాణములు చెప్పునట్లు వారు ఆంధ్రులభృత్యులు కావచ్చుననియు నిర్ధారణ చేసుకొనెను.

కే. పి. జయస్వాల్, వి. యస్. బాక్లే అనువారు సాతవాహనులు అశోకునిశాసనముల లోని సత్యపుత్రులగుదురని ఊహించిరి. బాక్లే సాతవాహను లాంధ్రులు కారనియు, వారి ఆదిమనివాసము బళ్ళారిగాని ఆంధ్రదేశము నందలి మరియేయితరభాగముకాని కాదనియు, పురాణములు గ్రంథస్థములు చేయబడునాటికి వారు మహారాష్ట్రమును గోల్పోయి ఆంధ్రదేశముననే ఉండుటవలన ఆంధ్రులుగ వర్ణింపబడిరనియు వాదించెను.

ఈ వివిధవాదములకు పర్యవసానముగ సాతవాహను లాంధ్రులా కారా? వారి ఆదిమనివాస మేది? అను రెండు ప్రశ్నలు బయల్వెడలుచున్నవి.

నాణెములలోను, శాసనములలోను సాతవాహను లాంధ్రులని చెప్పబడకుండుట నిజమే. కాని అది నాటి సాంప్రదాయమున కనుగుణ్యముగ నున్నది. ఆనాటి అన్ని రాజవంశములవారును తమ కులమునే చెప్పుకొనిరి కాని జాతిని ప్రశంసింప లేదు. దీనినిబట్టి పౌరాణికులు సాతవాహనకులముయొక్క జాతి నామమును పేర్కొనిరని చెప్పనగును. ఆంధ్ర

భృత్యశబ్దముయొక్క 'భృత్యులగు ఆంధ్రులు' అను అర్థము దీని కనుగుణ్యముగనే ఉన్నది. సుక్థంకరు చెప్పినట్లు సాతవాహనులు ఆంధ్రులు కాక ఆంధ్రుల భృత్యులే అగుచో ఆఆంధ్రుల వైభవప్రాభవముల చిహ్నము లేల కనిపింపవు? పురాణములలో ఆంధ్రభృత్య ఆంధ్రజాతీయ శబ్దము లొకే వంశమునకు వాడబడుట అవి పర్యాయపదములని సూచించుచున్నది. శుంగకాణ్వవంశీయులవలెనే ఆంధ్రులగు సాతవాహనులు మరియొకరికి భృత్యులుగనుండి పిమ్మట స్వతంత్రాధికారమును స్థాపించియుందురు.

సాతవాహనశాసనములలోని ప్రాకృతము మహారాష్ట్రప్రాకృతమును పోలును కాని (ఆంధ్రదేశపు) భాషయగు తెలుగును పోలదను ఒక వాదము సాతవాహనుల ఆంధ్రత్వమునకు ప్రతిషేధకముగ చెప్పబడినది. ప్రాకృతము ఒక్క సాతవాహనులకేగాక క్రీ. పూ. 300—క్రీ. శ. 300 నడుమ వర్తిల్లిన అనేక రాజవంశములవారికి ఆస్థానభాషగ నుండెను. తర్వాత కాలమున సంస్కృతము ఆస్థానభాష అయినప్పుడు శాసనములు ఆభాషలోనే వేయబడుచు వచ్చెను. ఇంతమాత్రమున సాతవాహనులకు ప్రాకృతమును, ఇతరరాజవంశముల వారికి సంస్కృతమును మాతృభాషలనుట సమంజసము కాదుగదా!

సాతవాహను లాంధ్రులు గాదనువారికి ప్రాచీనసాతవాహనశాసనములు మహారాష్ట్రమున దొరకుటయు, గౌతమీబాలశ్రీనాసిక శాసనమునందు ఆంధ్రదేశప్రశంస లేకుండుటయు, ఆంధ్రదేశమున లభించిన సాతవాహన శాసనములు వాసిష్ఠీపుత్ర పులోమావిదొక్కయు అతనితర్వాత వారివియు అగుటయు ప్రబలములగు ఆధారములు. కాని ఈవాదము ఉపలభ్యములగు చారిత్రకాధారముల నన్నిటిని పరిశీలించినచో నిలువజాలదు. ఒకటి రెండు శాసనములను, సందేహాస్పదములగు కొన్ని నాణెములను పురస్కరించుకొని ఏకకంఠముగ సాతవాహనులాంధ్రులని నిరూపించు పురాణములను త్రోసిపుచ్చుట భావ్యముకాదు. నానేఘాట్ శాసనమున పేర్కొనబడిన సాతకర్ణి 'దక్షిణాపథపతి' బిరుదమునందలి దక్షిణాపథము ఒక్క మహారాష్ట్రమునకే వర్తించుననుటయు సమంజసము కాదు. మత్స్యవాయుపురాణములలో చోళ పాండ్య కేరళరాజ్యములు దక్షిణాపథములోనివిగ చెప్పబడినవి. బాలశ్రీనాసికశాసనమునందు సిరిటనమహేంద్రపర్వతములప్రసంగ కలదు. ఇందు సిరిటనము కర్నూలుజిల్లాలోని శ్రీశైలమును, మహేంద్రము తూర్పుకనుమలలోని కొండయు కావలెను.

ఇట్లు ఉపలభ్యమానములగు చారిత్రకాధారములు నేటి ఆంధ్రదేశమున కాపేరు సాతవాహనులవిజయానంతరమే వచ్చెనను శ్రీనివాసఅయ్యంగారి వాదమునకుగాని, సాతవాహను లాంధ్రదేశము నేలుటవలన పౌరాణికులు భ్రమపడి వారి నాంధ్రులుగ వర్ణించిరను బర్గె వాదమునకుగాని అనుకూలముగ లేవు. ఆంధ్రరాష్ట్రము మహానది కుపనదియగు తెలివాహానదీతీరమునం దుండెనని ఒక ప్రాచీన జాతకమున చెప్పబడినది. మెగాస్తనీసు వ్రాతలును, అశోకుని 13వ శిలాశాసనమును ఆంధ్రులు దక్షిణాపథప్రాగ్భాగమునం దుండిరని ఊహించుట కవకాశ మిచ్చుచున్నవి. బహుశః సాతవాహనవంశము అశోకునికాలమున ఆంధ్రజాతికి నాయకత్వమును వహించెనేమో!

ఆ చక్రవర్తి మరణించినపిమ్మట నీవంశీయులు స్వతంత్రులై యావద్దక్షిణాపథవ్యాప్తమగు సామ్రాజ్యమును స్థాపించిరి. ఈవిధమున శాసనములను పురాణములను సమన్వయించినచో "ఆంధ్ర" అనునది జాతివాచకశబ్దమనియు, 'సాతవాహన' అనునది ఆజాతిలోని ఒకకులము యొక్క పేరనియు తెలియనగును. ఆనాడు గ్రీకులు మున్నగువారివలన కలుగగల ఉపద్రవముల నరికట్టుటకై సాతవాహనులు పైఠనును కేంద్రమొనర్చుకొనిరి. సాతవాహనులాంధ్రులని అంగీకరించినయెడల వారి అధికారము తూర్పునుండి పడమటకు విస్తరించెననుటయే ఎక్కువ సమంజసమని స్పష్టము కాగలదు.*



ఈ వ్యాసమునం దుపయోగింపబడిన ఆధారములు :

Archaeological Survey of Western India, Vol. V; Ep. Ind. Vol. VIII; D. C. Sircar—Select Inscriptions; Rapson—CAC; JBORS vol. III; JBoBRAS (N. S) III; ABORI vol I; R. G. Bhandarkar — EHD; Burgess — Buddhist Stupas of Amaravati and Jaggayyapeta; Smith — EHI; Mc Crindle — Ancient India; D. R. Bhandarkar — Asoka; K. Gopalachari — Early Hist. Andhra country.

# సాతకర్ణిశబ్దము—నూతనార్థము*

డా॥ కె. గోపాలాచారి ఎం. ఏ., పిహెచ్. డి.

'సాతకర్ణి' అను శబ్దము చిరకాలము వర్ధిల్లిన సాతవాహనవంశమునను, కొద్దికాలము మాత్రమే పరిపాలించిన చుటువంశమునను అనేకమంది రాజుల పేరుగ వాడబడినది. అది ఒకప్పుడు మాతృగోత్రనామములతోను, ఒకప్పుడు మరియొక వ్యక్తినామములతోను, ఇంకొకప్పుడు కేవలముగను వాడబడినది. సాతవాహనుల శాసనములలోను, నాణెములమీదను ఈశబ్దము 'సాతకని' అను ప్రాకృతరూపమున కనిపించుచున్నది. 'సాత' 'సాతి' 'సద' 'సాతక' అనునవి దీనికి హ్రస్వరూపములు.

ఈ సాతకర్ణిశబ్దమునకు అనేకార్థములు చెప్పబడినవి. దాని రూపమే వివాదాస్పదముగ నున్నది. రాప్సన్ పండితుడు పురాణములలో గాంచనగు 'శాతకర్ణి' అను రూపమును గ్రహించెను. శాతకర్ణి, స్వాతికర్ణి, శాంతికర్ణ, స్వాతివర్ణ మున్నగు పౌరాణికరూపములు అర్థముతో నిమిత్తములేక వాడబడి నట్లు కనిపించుచున్నది.

ఈశబ్దముయొక్క సరియైన రూపము 'సాతకర్ణి' అనునది. క్రీ. శ. 2, 3 శతాబ్దులనాటి శాసనములయం దీరూపమే కనిపించును. ఒక సాతవాహనరాణి కన్హేరీ శాసనమున "వాసిష్ఠీపుత్రస్య సాతకర్ణిస్య" అని కలదు. రుద్రదాముని గిర్నార్ శాసనమున "దక్షిణాపథపతే స్సాతకర్ణే" అని ఉన్నది. కాకుస్థవర్మ తాలగుండ శాసనమున "[illegible] స్సాతకర్ణ్యాదిభిః" అని ఉన్నది.

ఇంతవరకును పండితులు చెప్పిన సాతకర్ణి శబ్దార్థములు చిత్రములుగ నున్నవి. 'కణ' శబ్దము ముండా భాషలో పుత్రుడు అను నర్థము నిచ్చు 'కోన్' అను మాటనుండియు, 'సాత' శబ్దము గుర్రము అను నర్థమునిచ్చు 'సాదాం' అను మాటనుండియు వచ్చినవను ప్రిజులుస్కీవాదము ఊహామాత్రశరణ్యము. కుమారస్వామి అను పండితుడు 'సాతకర్ణి' శబ్దము శిలప్పదికారం అను ద్రవిడపురాణములోని 'నూఱువర్ కన్నార్' అను మాటకు సరియగునని చెప్పెను. ఆమీద పండితులు సతకిన శబ్దమును గైకొని (శతకర్ణిస్య పుత్రః శాతకర్ణిః) దానిని శాతకర్ణి అని అనువదించిరి. ఈ శిలప్పదికారకారకుడు సాతకర్ణిశబ్దార్థము నెరుగడు. అదియునుగాక ఈగ్రంథము క్రీ. శ. 5, 6 శతాబ్దుల నాటిదని ఇటీవలివారి నిర్ణయము. బార్నెట్ అను నతడీమాటకు సాతుని కొడుకని అర్థము చెప్పెను. "వాహ", "కర్ణి" శబ్దములకు తెడ్డు అని అర్థమని ఆరావముదన్ అభిప్రాయము. అప్పుడు సాతవాహన, సాతకర్ణి శబ్దములు రెంటికిని ఒకటే అర్థమగును. అప్పుడామాటలకు నూరు తెడ్లు లేక ఓడలు కలవాడని అర్థము వచ్చును. 'కర్ణి' శబ్దమునకు కొండ అనియు, గుహ అనియుకూడ అర్థమని కొం

* ఆఙ్గ్లమునకు అనువాదము — సంపాదకుడు.

దరు. మరికొందరు రఘువంశమున పేర్కొనబడిన సాతకర్ణిఋషి సంతతి సాతికర్ణులని అందురు. జొగేల్కరు సాతకర్ణి పదమునకు (సప్త = ఏడు, కర్ణి = కిరణములు) ఏడుకిరణములు కలవాడని అర్థము చెప్పెను.

సాతకర్ణి అను పేరు లేక బిరుదమునకు సాతవాహన అను కులనామముతో సంబంధము ఉండెనని ఊహింపవచ్చును. గ్రాంథిక ప్రాకృతమున సాతవాహనశబ్దము 'సత్తవాహన' అగును. అది సంస్కృతమున సప్తవాహన అగును. స్కాందపురాణాంతర్గతమగు కాశీ ఖండమున సూర్యుడు సప్తవాహనుడుగ వర్ణింపబడినాడు. ఋగ్వేదమునందితడు సప్తాశ్వుడుగ పేర్కొనబడినాడు. సాతవాహన అనునది సూర్యవంశీయుడగు నొక రాజు పేరు కావచ్చును. ఈవంశమున మొదటి రాజు సాతవాహనుడని పేర్కొనబడుటయు, తర్వాత వారిలో నొకడు సాతకర్ణి శబ్దవాచ్యుడగుటయు సాతవాహన శబ్దమునుండియే సాతకర్ణి శబ్దము వచ్చెనని నిరూపించుచున్నవి. యజుర్వేదాంతర్గతమగు తైత్తిరీయారణ్యకమున 'సప్తకర్ణ' అనునది యొక సూర్యభక్తుని పేరుగ కనిపించుచున్నది. (సప్తకర్ణిశ్చ ప్లక్షిః') ఈభక్తునిపేరును సూర్యవంశపు రాజులు తమ ఇంటిపేరుగ పరిగ్రహించియుండవచ్చును. అప్పుడు 'సప్తకర్ణి' శబ్దము 'సప్తకర్ణ' శబ్దమునకు రూపాంతరము కావచ్చును.

---

# విలివాయకుర, సివలకుర శబ్దములు*

డా॥ దినేశచంద్ర సర్కార్ ఎం. ఏ., పిహెచ్. డి.

నాణెములనుండి దక్షిణమహారాష్ట్రమున కొల్హాపురప్రాంతమును పరిపాలించిన కొందరు రాజులు తెలియవచ్చుచున్నారు. ఇందు వాసిష్ఠీపుత్ర విలివాయకుర, మాఢరీపుత్ర సివలకుర, గౌతమీపుత్ర విలివాయకుర అనువారు కలరు. వీరిలో మాఢరీపుత్రుడు వాసిష్ఠీపుత్రుని యొక్కయు, గౌతమీపుత్రుడు తక్కిన ఇద్దరి యొక్కయు నాణెములను పునర్ముద్రించెను. దీనినిబట్టి వాసిష్ఠీపుత్ర, మాఢరీపుత్ర, గౌతమీపుత్రులు వరుసగ ఒకరితరువాత నొకరు పరిపాలించిరని తెలియవచ్చుచున్నది.

రాప్సన్ ఈరాజుల పేర్ల చివరగల "కుర" శబ్దము "కుల" అను సంస్కృతశబ్దముయొక్క-ప్రాకృతరూపము కావచ్చు ననెను. కాని ఈ శబ్దము ఈరాజులవంశనామమని తోచుచున్నది. ఇది నిజమేయైనచో వీరిని కొల్హాపురపు 'కుర' లేక 'అంకుర' వంశీయులని పిలువచ్చును. సాతవాహనులవంశనామమువలెనే ఈవంశనామమును ఆపేరుగల వంశస్థాపకునినుండి యేర్పడి యుండవచ్చును.

కొందరుపండితులు ఈరాజులు సాతవాహనవంశముయొక్క శాఖకు చెందినవారని తలచిరి. కొందరు ఈరాజులను సాతవాహనరాజులతో సమన్వయింప ప్రయత్నించిరి. పై మాఢరీపుత్ర సివలకురుని మాఢరీపుత్ర శకసేనుడనియు, గౌతమీపుత్ర విలివాయకురుని గౌతమీపుత్ర సాతకర్ణి అనియు చేయబడిన సమన్వయము ఊహామాత్రశరణ్యము. ఈ 'కుర' వంశీయులకును, సాతవాహనవంశీయులకు నెట్టిసంబంధము నున్నట్లు కనిపించదు. వారు యజ్ఞశ్రీ మరణించినపిమ్మట క్రీ. శ. 200 ప్రాంతమున స్వతంత్రులుగ కొల్హాపుర ప్రాంతమును పాలించిరని తోచుచున్నది.

---

* ఆంగ్లమునకు అనువాదము—సంపాదకుడు.

# సాతవాహనసామ్రాజ్యము— సామాన్య పరిస్థితులు

డా॥ మారేమండ రామారావు ఎం. ఏ., పిహెచ్. డి.

## ౧. పరిపాలనావిధానము

సువిశాలమగు సాతవాహనసామ్రాజ్యమున చక్కని పరిపాలనావిధానముండెను. దీనికంతటికిని రాజు మూలాధారుడు. సర్వతంత్రస్వతంత్రుడై ప్రజాక్షేమమును కనుచు, సామ్రాజ్యరక్షణమునకు సకల బాధ్యత వహించెను. సాతవాహనరాజవంశమున వారసత్వము పురుషులద్వారానే సంక్రమించుచుండెను. గౌతమీపుత్ర సాతకర్ణి "కులపురుష పరంపరాగతరాజశబ్దు"డట (1). ఇందును మొదట జ్యేష్ఠపుత్రుడును, ఆమీదట అతనికి పుత్రులులేనియెడల అతని తమ్ములును రాజ్యాధికారమునకు వచ్చుచుండిరి. వాసిష్ఠీపుత్ర పులోమావివెనుక అతని తమ్ములు వరుసగ రాజులైరి. ఒకవేళ వారసుడు బాలుడగుచో అతని పినతండ్రిగాని, తల్లిగాని పరిపాలన సాగించుచుండిరి.(2) సాతవాహనులలో మొదటిరాజగు సిముకునికి పిమ్మట అతని కుమారుడగు మొదటిసాతకర్ణి బాలుడగుట వలనకావలెను సిముకుని తమ్ముడగు కృష్ణుడు రాజయ్యెను. అట్టిపరిస్థితులే మొదటిసాతకర్ణి మరణానంతరమును తటస్థించెను. ఈరాజుకు చాలమంది కుమారులుండిరి. వారిలో పెద్దవాడగు వేదిశ్రీ బాలుడైయుండుటవలన కాబోలును అతని తల్లి దేవీనాగానిక పరిపాలనమును సాగించెను. ఏకారణమువల్లనైనను రాజు పరిపాలనమును పర్యవేక్షించుట కశక్తుడైనచో అతనితల్లి అతనికి సహాయము చేయుచుండెను.(3) గౌతమీబాలశ్రీ నాసికశాసనమునుండి ఎల్లరకును అభయమొసగి ప్రజలను నిశ్చింతగ జీవించుటకు అవకాశము కలిగించుట, పౌరజనుల సుఖదుఃఖములను తనసుఖదుఃఖములవలెనే చూచుకొనుట, ఇతరులవలన రాష్ట్రమునకు ఉపద్రవములు కలుగకుండునట్లు చేయుట, ధర్మము ననుసరించియు సువిహితములగు నియమముల ననుసరించియు పన్నులను వసూలుచేసి వ్యయమొనరించుట, చాతుర్వర్ణ్యాది సాంఘికవ్యవస్థ శిథిలమై ప్రజలలో సంక్షోభము కలుగకుండగ చూచుట, గురుజనుల యెడ గౌరవము చూపుట మున్నగునవి నాటి

1. చూ. అనుబంధము ౧౭వ శాసనము.
2. పురాణములు సాతవాహనులలో మూడవరాజగు సాతకర్ణి మొదటిరాజగు సిముకుని కుమారుడనియు, రెండవరాజగు కృష్ణుడు సిముకుని తమ్ముడనియు చెప్పబడుచున్నవి. నాగానిక నానేఘాట్ శాసనము వేదిశ్రీ కాలమున ఆమె వేయించినది.
3. E. I. vol. VIII Nasik Ins. no. 5.

సాతవాహనరాజుల ధర్మములుగ నుండెనని తెలియుచున్నది.

సాతవాహనరాజులకు రాజ్యతంత్రనిర్వాహణమునందు అనేకమంది సామంతులును ఉద్యోగులును సహాయము చేయుచుండిరి. ఆనాటి దేశము అసిక, అస్సక, ములక, సురఠ, కుకుర, అపరాంత, అనూప, విదర్భ, ఆకరావంతి, వైజయంతి, మున్నగు చిన్నచిన్న రాష్ట్రములుగ విభజింపబడియుండెను. వీనికి స్థానికముగ కొందరు పాలకు లుండిరి. గౌతమీపుత్రశాతకర్ణి సిసుకాద విజేత లీయూరాష్ట్రములను జయించి తమసామ్రాజ్యమున కలుపుకొనిరి. ఆరంభమ్మున వీరు ఈనాసికపాలకులను అట్లే యుంచి తమసార్వభౌమత్వమును మాత్రము అంగీకరించునట్లు చేసియుందురు. వీరును సాతవాహనసామంతులై యథాపూర్వముగ ఆయా భాగములను పరిపాలించుచుండిరి. "సర్వమండలాభివాదిత చరణస్య" "సర్వరాజలోక మండల ప్రతిగృహీతశాసనస్య" అను గౌతమీపుత్రశాతకర్ణి విశేషణములు దీనిని సూచించుచున్నవి. ఆనాటి శాసనములలోను, నాణెములలోను మహారథి, మహాభోజ అను రెండుతరగతులవారి ప్రశంస కనిపించుచున్నది (4) దేవీనాగానిక తండ్రి ఒక మహారథి. కార్లా చైత్యగృహప్రాంగణమున సింహస్తంభము నెలకొల్పిన దాత మహారథిపుత్రుడగు నొక మహారథి. చిత్రలదుర్గమున దొరకిన నాణెములు కళలాయ అను పేరుగల ఒక మహారథివి. అట్లే కన్హేరి మున్నగుచోట్ల గల శాసనములలో మహాభోజుల పేర్లు కలవు. ఈరెండుతరగతులవారును సామంతులుగ కనిపించుచున్నారు. ఈమహారథిమహాభోజుల భార్యలును మహారథినీ, మహాభోజీ అను బిరుదులను కలిగియుండిరి.

పైసామంతులు కాక అనేకమంది రాజోద్యోగులపేర్లును తెలియనగుచున్నవి. వీరిలో మహాసేనాపతి ముఖ్యుడు. ఇతడు ఒకప్పుడు రాజునకు ఆంతరంగికకార్యదర్శిగ నుండెను. ఒకనాసికశాసనము మహాసేనాపతి మేఘుడనువానిచే వ్రాయబడెను.(5) స్కందనాగుడను మహాసేనాపతి సాతవాహనాహారమునకు పాలకుడుగ నుండెను.(6) అమాత్యులు ఒక్కొక్క ఆహారమునకు పాలకులుగ నుండిరి. వీరుగాక మహాతారిక, భాండాగారిక, మహామాత్ర, నిబంధకార మున్నగు ఉద్యోగులు నుండిరి.

రాజ్యమంతయు నిగమములు(7) లేక పట్టణములు, జనపదములు లేక పల్లెపట్లుగ విభజింపబడెను. నిగమములు వాటి పరిపాలనమును అవియే నిర్వహించుకొనుచుండెడివి. రాజశాసనములన్నియు వీనియందు గ్రంథస్థములు చేయబడుచుండెడివి. 'ఆహార' అనునది ఒక రాష్ట్రవిభాగము. మామాలాహారగోవర్ధనాహార సాతవాహనాహారములు దీనికి ఉదాహరణములు.(8) ఆవిభాగమునకు దీనికి కేంద్రమగు పట్టణమునుబట్టి పేరు పెట్టబడుచుండెను. 'పథము' అనునది మరియొక విభాగము. పైఠనపథము దీని కుదాహరణము.(9) ఆహారమును,

4. Rapson — CAC. Intro. p. lxxxvi; E. I. VII Karla Ins. no. 2, 14; ASWI. vol. V Kanheri Ins. nos. 15, 24, 29.

5. E. I. VII Nasik Ins. no. 3.

6. చూ. అనుబంధము ౨౩ వ శాసనము.

7. చూ. ధనకట నిగమము.

8. అనుబంధములోని శాసనములు.

9. ASWI vol, V Kanheri Ins. no. 4.

పథమునుగాక 'రాష్ట్రము' అను మరియొక విభాగ ముండెను. అల్లూరుశాసనమునం దొక రాష్ట్రము పేర్కొనబడినది.(10) అమరావతీ శాసనములలో నొకటి 'పుగిరథి' అను పేరుగల రాష్ట్రమును(11) పేర్కొనుచున్నది. ఈయూ విభాగములకు అమాత్యులు పాలకులుగ నుండిరి. వీనిలో అనేక గ్రామములు చేరియుండెను. ఒక్కొక్క గ్రామమునకును గ్రామికుడు, గ్రామిక లేక గ్రామణి అను అధికారి యుండెను.

## ౨. ఆర్థికస్థితి*

శాతవాహనయుగమున దక్షిణాపథము సిరి సంపదలతో తులతూగినది. సమర్థులగు శాతవాహనసమ్రాట్టులు ఉత్తరాపథమును అనుగమునకును ముంచివేయుచుండిన దండయాత్రలును, విప్లవములును దక్షిణాపథమునకు వ్యాపింపకుండగ అరికట్టిరి. ఒకవైపు విదిశ విదర్భలును, ఇంకొకవైపు రాజపుత్రస్థానము వరకును, గుజరాత్ కతియవారులును, మాళవమును, చిరకాలము కడలూరువరకుగల ద్రవిడదేశమును వారి సామ్రాజ్యమున చేరియుండెను. ఇందు ఇతర భాగములు రాజకీయ కారణములవలన పట్టు తప్పిపోవుచును క్రీ.పూ. 1వ శతాబ్దిలో మహారథులు మహారాష్ట్రమును పాలించిన కొద్దికాలము తప్ప దక్షిణాపథమంతయు శాతవాహనులవశమునం దుండెను. ఆవిధమున వారి దక్షిణాపథసామ్రాజ్యము స్థిరమయ్యెను. దేశమున శాంతిసౌఖ్యములు అవిచ్ఛిన్నములుగ నుండెనవి. అందువలన ప్రజలు నిర్భీతులై తమతమ వృత్తులను సాగించుకొనిరి.

ప్రజలు సుఖశాంతులై బహువిధములగు వస్తువులను తమ దైనందినజీవితమునం దుపయోగించుచుండిరి. ఈ కారణమున అనేక వృత్తులవారికి చేతినిండ పని ఉండెను. నాటి జీవితమంతయు సమష్టివిధానమున సాగుచుండెను. ప్రత్యేకవృత్తులును అనేకవిధముల సాగింపబడుచుండెనవి. ఎవనికిష్టమగువారు వాని వృత్తిని చూచుకొనుటగాక ఒకే వృత్తినవలంబించువారందరును చేరి ఒక సంఘముగ నేర్పడి ఆవృత్తిని సమిష్టిగ సాగించుచుండిరి. సమకాలికశాసనములు ఇట్టి సంఘముల నేకములను పేర్కొనుచున్నవి. ఈకాలమున [illegible]కులు, మాలాకారులు, కోలికులు(సాలెవారు), తిలపిష్టకులు (తెలికవారు), ఓదయంత్రికులు, కాసాకారులు (కంచరివారు), [illegible]కారులు (మెరుగుపెట్టువారు), కమారులు (కమ్మరులు), చర్మకారులు, గంధకులు, సువర్ణకారులు, మణికారులు, మిఠికులు (రాళ్ళు మెరుగుపెట్టు వారు), సెలవర్ధకినులు (శిల్పులు), వర్ధకులు (వడ్రంగులు), మున్నగు అనేకవృత్తుల వారుం

10. K. Gopalachari -- Early Hists. Andhra. p. 89.
11. Sivaramamurthi — Amaravati Sculptures p. 298.
* ఈ విభాగము Ptolemy's Geography; Schoff—The Periplus of the Erythraean Sea; D. R. Dhandarkar—Dekkan of the Satavahan times in Ind. Ant. vols. 47, 48, 49; E. I. vols. VII, VIII; ASWI vols. IV, V, VI లలోని నాసిక నానేఘాట్, కార్లా, కన్హేరీ శాసనములు అను గ్రంథముల సహాయమున రచింపబడినది.

డిరి. వీరు ఏర్పరచుకొనిన వృత్తిసంఘములకు నికాయములనియు, శ్రేణులనియు పేరు. ఒక్కొక్క సంఘమునకు శ్రేష్ఠి అను నాయకుడుండెను. వీనికి నిగమసభలను పౌరకార్యాలయములలో ప్రత్యేకముగ కార్యాలయములుండెను. ఈసంఘములకు చక్కని ఆదాయముండెడిది. ఇవి కేవలము వృత్తిసంఘములుగనే కాక నిధులుగకూడ వ్యవహరించుచుండెడివి. ఆనాటి శ్రీమంతులు దానధర్మములు చేయునప్పుడు ఈసంఘములలో కొంత ద్రవ్యము నుంచి, దానిపైని వచ్చు వడ్డీ ధర్మకార్యములకు వినియోగింపబడునట్లు ఏర్పాటు చేయుచుండిరి.

ఆనాటి వర్తకులు చక్కని సముదాయములుగ నాయా నగరములందే యుండిరి. వారికి వణిజ శ్రేణి నిగమము అని పేరుండెను. కార్మికులవలెనే వణిజులును ఒక్కొక్కచోట వర్తకసంఘముల నేర్పరచుకొని వర్తకమును సాగించుచుండిరి. వీరి సంఘములకు నిగమములని పేరు. సంఘాధ్యక్షుడు శ్రేష్ఠి. ఒకచోటనుండి మరియొకచోటికి వస్తువులను తీసుకొనిపోయి వర్తకముచేయు వారికి సార్థవాహులని పేరు.

శాతవాహనుల నాణెములు అనేకములు దొరికినవి. బంగారునాణెములు అసలు లభింపలేదు. వెండినాణెములు బహుస్వల్పములు. చాలభాగము రాగి, సీసము, పోటిన్ అను లోహములలో వేయబడినవే. వీనిలో అనేక పరిమాణములు కలవు. వీనివిలువ ఎట్టిదో తెలియరాదు. అయినను సమకాలికశాసనములలో నాణెములనుగూర్చియు వాని విలువను గూర్చియు కొన్ని అంశములు గాంచనగుచున్నవి. వీనిలో కార్షాపణము, సువర్ణము, పణము అనునవి ముఖ్యములు. నాసికశాసనములలో ఒకటి (No. 7) క్షహరాటరాజగు నహపానుని అల్లుడగు ఉషవదత్తుడు 4000 కార్షాపణములకు ఒక భూమిని కొని దానిని దానము చేసెనని తెలుపుచున్నది. అతడే ఒక కోలిక నికాయమున 2000 కార్షాపణములను, మరియొకదానిలో 1000 కార్షాపణములను ఉంచెననియు, అందు మొదటిమొత్తమునకు నెలకు ఒక ప్రతిశతము, రెండవదానికి నెలకు 3/4 ప్రతిశతము వడ్డీ ఏర్పరచెననియు, మరియొక నాసికశాసనము (No. 12) తెలుపుచున్నది. ఇంకొక శాసనమునందు ఒక్కొక్క సువర్ణమునకు 35 వంతున 7000 కార్షాపణములు, అనగా 2000 సువర్ణములు ఒక నికాయమునందు ఉంచబడెనని తెలుపుచున్నది. ఇంకొకశాసనమునందు 1000 కార్షాపణములమీద సంవత్సరమునకు 90 కార్షాపణముల లేక 60 కుశనముల వడ్డీ వచ్చునని తెలియుచున్నది. నాగానిక నానేఘాట్ శాసనమునందు ఆంధ్ర శాతకర్ణి మహారాజు అనేకక్రతువులను చేసినప్పుడు బ్రాహ్మణులకు వేలకొలది కార్షాపణములు దానము చేయబడెనని చెప్పబడినది.

శాతవాహనయుగపు వైభవప్రాభవములకు ఆకాలమునందు అవిచ్ఛిన్నముగ సాగిన విదేశీయవాణిజ్యము ముఖ్య కారణము. అప్పుడు మనదేశమునకు వచ్చి, యీవాణిజ్యమును కండ్లార గాంచి, సవివరముగ వర్ణించిన విదేశీయుల వ్రాతలనుండి మనకు అనేక ముఖ్యాంశములు తెలియుచున్నవి. కార్మికులు సంఘముల నేర్పరచుకొని అనేకవస్తువులను తయారుచేయుచుండిరి. వర్తకులును వీనితో క్రయవిక్రయములను సాగించుచు, వీని నొక చోటనుండి మరియొకచోటికి తీసికొనిపోవుచుండిరి. దక్షిణాపథమునందు లో భాగమున

ఎన్నియో ప్రఖ్యాతవస్త్రకస్థానము లుండెడివి. అట్టివానిలో పడమట పైఠాన, తగర, జున్నార్, కరహాటక, నాసిక, గోవర్ధన, వైజయంతులును, తూర్పున ధాన్యకటక, కేవురూరు, విజయపురములును ముఖ్యములు. ఆ నాడు తూర్పున చైనామొదలు, పడమట రోమావరకును గల అనేక దేశములలో దక్షిణాపథనాసులు వర్తకము చేయుచుండిరి. ఈ వర్తకసామగ్రిలో సన్నబట్టలు ముఖ్యమైనవి. అవి కృష్ణాగోదావరీమధ్యదేశమును తియారెరోమమున్నగు పరదేశములకు తీసికొనిపోబడుచుండెడివి. ఈవర్తకము విరివిగ సాగుటకును, సామగ్రిని ఒకచోటనుండి మరియొకచోటికి తీసికొనిపోవుటకును చక్కని రాజమార్గము లుండెడివి. ఇందుప్రధానమార్గము కృష్ణాముఖద్వారమువద్ద నేటి బందరు ప్రాంతమునుండియు, రెంటవది గుంటూరుజిల్లాలోని వినుకొండనుండియు బయలుదేరెడివి. బందరు రేవుకు ప్రాచ్యదేశములనుండి అనేకవస్తువులు వచ్చెడివి. ఇవియు స్థానికముగ తయారుచేయబడిన సన్నబట్టలు ఈమార్గమున పడమటికి తీసుకొనిపోబడుచుండెడివి. వినుకొండప్రాంతము లోహపరిశ్రమకు ప్రసిద్ధముగ నుండెను. అది గాక మధ్యయుగమువరకును పల్నాటు వజ్రపరిశ్రమకు పేరొందియుండెను. ఈరెండుమార్గములును మూసీనదీతీరమున నేటి హైదరాబాదు ప్రాంతమున కలిసెడివి. ఆమీద ఈరెండును కలసిన మార్గము కల్యాణ, తగర, పైఠానులమీదుగ నాసిక చేరెడిది. అక్కడనుండి దేశము పర్వతావృతమగుటచే రాజమార్గములు లేక నాటుదారులమీదుగ వాణిజ్యము పడమటిసముద్రతీరమునందున్న బ్రోచ్ లేక భరుకచ్ఛమును చేరెడిది. ఆనగరమునుండి ఓడలు పాశ్చాత్యదేశముల కేగెడివి.

పశ్చిమతీరమునందు ఎన్నియో రేవు లుండెడివి. వీనిలో కొన్ని వ్యాపారమునకు పనికివచ్చు చిన్నచిన్న ఓడలును పరదేశములకు పోవు పెద్దపెద్ద ఓడలు నుండెడివి. ఈరేవులలో భరుకచ్ఛము ముఖ్యమైనది. దీనిగుండా ద్రాక్షారసము, రాగి, సీనారేకు, సీసము, పగడము, గోమేధికములు, వస్త్రములు, చెకుముకిరాళ్ళు, గాజు, వెండిబంగారములు, గంధము, పట్టు మున్నగువానిలో వర్తకము సాగుచుండెను. పిమ్మట సోపారా ముఖ్యమగు రేవు. కల్యాణము మరియొకటి. ఆపైన మాందగోర, బలిపట్టణము, మలయగిరి, సెమూల, విజయదుర్గము ముఖ్యస్థానములు. తూర్పుతీరమున దక్షిణమున పులికాట్ కును ఉత్తరమున కళింగపట్టణమునకును మధ్య అనేక రేవు లుండెడివి. వీనిలో కంటకశిల, ఘంటసాల, అల్లోసైనే, ఎపిడోరియన్ అనునవి ముఖ్యములు. ఈఎపిడోరియన్ ఏదియో తెలియదు. అది నేటికిని బర్మామున్నగు దేశములలో వర్తకమునకు ప్రసిద్ధముగ నున్న కోరింగి లేక కళింగ కావచ్చును. మలేద్వీపకల్పము మున్నగు ప్రాచ్యదేశములకు పోవు ఓడలన్నియు ఈరేవు నుండి బయలుదేరెడివట. ప్రాచ్యసముద్రతీరమునందనేకచోట్ల క్రీ. శ. 1. 2 శతాబ్దులనాటి రోమనునాణెములు దొరికినవి. మదరాసుకడలూరులమధ్య గల తీరమున వాసిష్ఠీపుత్ర పులోమావియొక్క ఓడముద్రగల నాణెములెన్నియో లభించినవి. అనేకప్రాచ్యదేశములలో ఆంధ్రనగరముల పేర్లు గల నగరములు, రాష్ట్రములు గాంచనగుచున్నవి. అచ్చట ప్రాచీనపల్లవలిపిలోని శాసనములు కలవు.

అమరావతీబుద్ధులను పోలెనిబుద్ధవిగ్రహములు దొరికినవి. ఈయంశములన్నియు సాతవాహనయుగమునందు ప్రాక్తీరమున గల ఆంధ్రభాగమునకును, ఈప్రాచ్యదేశములకును సన్నిహితమగు సంబంధ ముండెడిదని నిరూపించుచున్నవి.

## ౩. మతములు

సాతవాహనయుగము మతసామరస్యమునకును, మతాభినివేశకును మిక్కిలి ప్రసిద్ధము. దేశమున వివిధమతములు వ్యాప్తియందుండినవి. అనేకమంది ప్రాచీనవైదికధర్మము నవలంబించుచుండిరి. జైనమతమును కొంతవరకు వ్యాపించెను. బౌద్ధమతము ఈకాలమునందు మించి వర్ధిల్లెను. ఐనను ఈమతములకు అన్యోన్యవైషమ్యముగాని సంఘర్షణగాని తెటస్థించినట్లు కనిపింపదు. ఒకమతము ననుసరించుచుండినవారు మఱియొకమతమునకు సహాయము చేయుచుండిరి.

ఈకాలమున వైదికధర్మము చక్కగ వర్ధిల్లెను. సాతవాహనరాజులు బ్రాహ్మణులని ఒక అభిప్రాయము కలదు. పురాణములు కాణ్వులను పేర్కొని ఆమీఁద "సజాతీయు"డగు సిముకుడు(12) అని చెప్పుచున్నవనియు, కాణ్వులు బ్రాహ్మణులనియు, అందువలన వారికి సజాతీయులగు సిముకాదులును బ్రాహ్మణులగుదురనియు నొక వాదము. సాతవాహనులలో అగ్రగణ్యుడగు గౌతమీపుత్రసాతకర్ణి బాలశ్రీనాసికశాసనమున(13) క్షత్రియదర్పమానమర్దనుడనియు, ఏకబ్రాహ్మణుడనియు వర్ణింపబడినాడు. శాతకర్ణి యను నొక బ్రాహ్మణఋషి పేర్కొనబడినాడు.(14) సాతకర్ణి నీకుదాంచితులైన సాతవాహనులు ఆఋషిసంతతివారైనకావచ్చును. ఈరాజులపేర్లలో చాలభాగము కృష్ణ, వేదశ్రీ, శక్తిశ్రీ, స్కంద స్తంభి, శివస్వాతి, యజ్ఞశ్రీ, చంద్రశ్రీ మున్నగునవి వారివైదికధర్మానుయాయిత్వమును నిరూపించుచున్నవి.

సాతవాహనయుగమునందు వైదికక్రతువులయెడలను, వేదములలో పేర్కొనబడిన దేవతలయెడను మిక్కిలి భక్తిశ్రద్ధ లుండెడివి. మొదటిసాతకర్ణి మహారాజు భార్య నాగానికవేయించిన నానేఘాట్ శాసనమునందు[15] మొందుగ, ధర్మఇంద్రసంకర్షణవాసుదేవచంద్రసూర్యులకును, నలుగురు లోకపాలురకును, యమవరుణకుబేరవాసవులకును నమస్కారములు చెప్పబడినవి. గాథాసప్తశతిలో దారునిర్మితములగు ఇంద్రప్రతిమలు ఆరాధింపబడినట్లు చెప్పబడియున్నది.[16] ఈవైదిక దేవలతో పాటు పౌరాణికదైవములగు శివకేశవుల ఆరాధనమును ఆనాడు వ్యాప్తియందుండెను. కృష్ణునిగూర్చిన అనేకగాథలు ప్రచారమునం

12. శిశుకోఽన్ధ్రః స్వజాతీయః ప్రాప్స్యతీ మాం వసుంధరాం.

13. E. I. VIII. నాసిక శాసనము నం. 2. పంక్తి ౩.

14. కాళిదాసు రఘువంశము సర్గ 13 శ్లో. ౩౮.

15. ASWI. V. p. 60. పంక్తి ౧.

16 సప్తశతి (Weber) p. 470. Gatha 864.

దుండెడివి. రాధాకృష్ణుల ప్రేమగాథలు నాటి జనులను నాక్కగ ఆకర్షించెను.(17) హరి త్రివిక్రమ అను పేర్లతో విష్ణువును బహుజనులు ఆరాధించుచుండిరి. క్షీరసాగరమథనము, లక్ష్మీఉత్పత్తి, బలిదమనము మున్నగు వైష్ణవ గాథలు నాడు బహుజనవిదితములుగ నుండెను.(18) అట్లే శివుని అరాధనమును విరివిగ సాగుచుండెను. దేశమునందనేకస్థలముల శివపార్వతుల ఆలయము లుండెడివి. పరమశివునికి పార్వతియెడగల ప్రణయము, దక్షాధ్వరధ్వంసము మున్నగు శైవగాథలును నాడు ప్రచారమునందుండెను.(19)

ఆనాడు చరకులను సన్యాసులు అనేకస్థలముల దిరుగుచు మతప్రచారము చేయుచుండిరి. వారికి సాతవాహనయుగమున సోపారగ, సువర్ణముఖ, గోవర్ధనాది ప్రాంతములు ముఖ్యస్థానములుగ నుండెడివి [20] శైవులలో పాశుపతులును, కాపాలికులు నుండిరి.[21]

మొదటిసాతకర్ణిమహారాజు అంతకుముందు ఎన్నిసంవత్సరములనుండియో ఆచరణలో లేని వైదికక్రతువుల నెన్నిటినో చేసెను.[22] అందు అగ్న్యాధేయ, అనారంభణీయ, భగలాదశరాత్ర, గర్గత్రిరాత్ర, గవామయన, అప్తుర్యామ, అంగిరనామయన, శతాతిరాత్ర, అంగిరసత్రిరాత్ర, ఛందోమపవమానత్రిరాత్ర మున్నగునవి కలవు. ఇవిగాక ఆమహారాజు రెండు అశ్వమేధములను ఒక రాజసూయమును చేసెను. ఇతనితర్వాత నితనివంశీయులలో గౌతమీపుత్రునివంటి విజేతయుండినను ఈయజ్ఞముల నెవరును చేయలేదు. కాని సాతవాహనయుగము ముగిసినవెంటనే బ్రహ్మాండమగు వైదికధర్మపునరుజ్జీవనోద్యమము బయల్వెడలెను. సాతవాహనసామ్రాజ్యమునందలి వివిధభాగములలో స్వాతంత్రరాజ్యములను స్థాపించిన రాజు లెందరో ఈసాతకర్ణి మహారాజుఆదర్శము ననుసరించిరి. ఇక్ష్వాకురాజ్యస్థాపకుడగు మొదటిశాంతమూలమహారాజు అశ్వమేధాగ్నిష్టోమవాజపేయయాజి.[23] పల్లవరాజగు శివస్కందవర్మ మహారాజును ఈయజ్ఞములను చేసెను.[24] ఈకాలమున వింధ్యప్రాంతమును పరిపాలించిన వాకాటకులు అనేకాశ్వమేధములను చేసిరి. ఉత్తరాపథమున కుషాన్‌రాజ్యవిధ్వంసమొనర్చిన భారశివనాగులును అశ్వమేధములను చేసిరి. ఇట్లు ఈఅశ్వమేధము నొనర్చుట అహింసామూలకమగు బౌద్ధధర్మమును నిరసించుట అయ్యెను. మొదటిసాతకర్ణి మహారాజు బౌద్ధమును అత్యంతాసక్తితో ప్రచారముచేసిన అశోకచక్రవర్తి మరణించిన కొద్దికాలమునకే జీవించెను. అతడు పెక్కువైదికక్రతువులను, అశ్వమేధ రాజసూయములను చేయుటకు స్వామితాభినిరతియు, స్వాధికారప్రాభవప్రకటనమును వలెనే బౌద్ధధర్మవ్యాప్తివలన వెనుకపడిన వైదికధర్మోద్ధరణకాంక్షయు నొక కారణ

17. డిటో p. 3 323. గా. 657: 112; p. 31. గా. 89. 18. డిటో గాథ 411, 358.

19. డిటో గాథ 172, 440. 20. E. I, VIII. నాసిక శాసనములు నం. 12.

21. సప్తశతి గాథా 408.

22. నాగానీక నానేఘాట్ శాసనమునందు ఈయజ్ఞముల పేర్లును, ఆయాసమయములలో ఇయ్యబడిన దానములను గూర్చిన వివరములును పేర్కొనబడినవి.

23. E. I. XX. నాగార్జునకొండ శాసనములు B2. 24. E. I. హీరహడగల్లి శాసనము.

నేమో! సాతవాహనులలో అగ్రగణ్యుడగు గౌతమీపుత్రుడు వైదికధర్మోద్ధారకుడు. అతని తల్లి బాలశ్రీ నాసికశాసనము అతని ధర్మానురక్తిని అనేకవిధముల చిత్రించుచున్నది. అతడు ద్విజవరకుటుంబవివర్ధనుడు, ఆగమనిలయుడు, ఏకబ్రాహ్మణుడు, వర్ణాశ్రమధర్మపరిత్రాత.[25] అతడు క్రీ. శ. 1వశతాబ్దినాటివాడు. అప్పటికే బౌద్ధము బహుముఖముగ అభివృద్ధినందసాగినది. యవనశకపహ్లవాది విదేశీయులెందరో దేశమున స్థిరపడి బౌద్ధవైదికధర్మముల నవలంబించిరి. బహుశః ఈవిదేశీయులమూలముననును, బౌద్ధము మూలముననును, వైదికధర్మమునకును తదంగమగు వర్ణాశ్రమవ్యవస్థకును కొంత నష్టమును, బాధయు కలిగియుండును. అందువలననే ఈమహారాజు ఈవ్యవస్థ నుద్ధరింపవలసి వచ్చెను. ఇట్లు సాతకర్ణి గౌతమీపుత్రులిర్వురును వైదికధర్మమున కమూల్యమగు నుపకారము చేసిరి.

ఆనాటి సాతవాహనరాజులును వైదికధర్మమునందు పరమాదరము కలిగి దాని ననుసరించిరి. మొదటిసాతకర్ణి మహారాజు భార్యయగు దేవినాగానిక తన భర్త చేసిన బహువిధయాగములలో అతనికి సహాయముగ నిలిచెను. ఆమె మాసోపవాసనియమాన్వితి, గృహతాపసి, చరితబ్రహ్మచర్యా, దీక్షావ్రతయజ్ఞశీల.[26] అట్లే గౌతమీపుత్రశాతకర్ణి మహారాజు తల్లియగు బాలశ్రీ సత్యవచనదానక్షమాఅహింసానిరత, తపదమనియమోపవాసతత్పర, రాజర్షివధూలక్షణసమన్వితి.[27]

సాతవాహనయుగము బౌద్ధమతచరిత్రమునందు స్వర్ణయుగము. ఆమతము దక్షిణాపథమునందు, అందును విశేషముగ ఆంధ్రదేశమునందు బహుముఖముగ వ్యాపించి అనూనము, అసదృశమునగు శోభను గాంచినది.

గౌతమబుద్ధుడు తనదివ్యసందేశమును నలుబదిసంవత్సరములకాలము ప్రచారము చేసి కుశీనగరపరిసరమున మహాపరినిర్వాణము నందెను. వెనువెంటనే అతని శరీరావశేషములకొరకై బ్రహ్మాండమగు తగవు బయలుదేరి అది బహుకష్టముమీద సర్దుబాటు చేయబడెను. అప్పటికే అతని శిష్యులలో అతని బోధనలను గురించి కొంత అభిప్రాయభేదము కలిగెను. వీటిని సవరించి ఆ మహనీయుని బోధనలకు స్థిరరూపమును కలిగించు నుద్దేశ్యముతో నాటి బౌద్ధులు రాజగృహనగరమున 'సంగీతి' అను నొక మహాసభ నేర్పరచిరి. అనంతరము ఆచారవ్యవహారములను గురించియు, నియమములను గురించియు వైవిధ్యమేర్పడెను. దీనిని సవరించుటకు వైశాలీనగరమున రెండవసంగీతి జరిగెను. పూర్వాచారపరాయణులగువారు థేరులని పిలువబడిరి. వీరు థేరవాదమను నొక శాఖను ఏర్పరచిరి. ఆచారనియమాదులలో కొంతమార్పు కావలెననువారు మహాసాంఘికులైరి. అశోకచక్రవర్తి ఈవిభేదములను సవరించు నుద్దేశముతో తన రాజధానియగు పాటలీపుత్రమున మూడవ సంగీతిని జరిపించెను. తుదకు మహాసాంఘికులవాదమే నెగ్గి

25. బాలశ్రీ నాసిక శాసనము.

26. ఈమహారాణి నానేఘాట్ శాసనము పంక్తి ౫.

27. ఈమె నాసికశాసనము, పంక్తులు ౯-౧౧.

నది.(28) వారి మతమునే అచక్రవర్తి దేశదేశ ములందును ప్రచారము చేయించెను. అశోకుని నాటికే బౌద్ధమున పెక్కు శాఖోపశాఖలు ప్రబలినవి. అందు థేరవాద, సమ్మతియ, మహింసాసక, సర్వాస్తివాద, ఉత్తరాపథక, మహాసాంఘిక, అంధకశాఖలు ముఖ్యమైనవి. కాలక్రమమున బౌద్ధమున మరికొన్ని మార్పులు వచ్చినవి. వానిలో నెల్ల మాధ్యమికవాదము లేక మహాయానము మిక్కిలి ప్రబలమైనది. ఇది బౌద్ధధర్మమునకు నూతనోత్తేజము కలిగించెను. క్రీ. శ. 2వశతాబ్దిలో కనిష్కునికాలమున జరిగిన మరియొక సంగీతిలో ఇది విజయము నందెను. అప్పటికి బౌద్ధులలో హీనయానమహాయానములు రెండు ప్రబల శాఖలైనవి. హీనయానమున వజ్జిపుత్తక, భద్దయానిక, చన్నగిరిక, సమ్మతియ, ధమ్ముత్తరియ అను నుపశాఖలుగల థేరవాదమొకటియు; గోకులిక, బహుస్సుతిక, పణ్ణాత్తివాద, చెతియవాద, ఎకబ్యవహారిక అను నుపశాఖలుగల మహాసాంఘికవాద మొకటియు; సబ్బత్థివాద, కస్సపిక, సణ్కంతిక, సుత్తవాద, ధమ్మగుత్తిక అను నుపశాఖలుగల మహిసాసకవాద మొకటియు మూడు ముఖ్యశాఖ లుండెను. ఆమీద హైమవతికులనియు, అంధకులనియు మరిరెండు శాఖలేర్పడెను. ఈఅంధకులలో రాజగిరిక, సిద్ధారిక, పూర్వశైలీయ, అపరశైలీయ, వాజిరియ అను ఐదు ఉపశాఖ లుండెడివి.[29] ఒకపరిగణనమునను సరించి థేరవాదులలో క్రీ. పూ. 350నాటికే మ హి సా స కు లే ర్ప డి రి. వానిలో కొద్దికాలమునకే సర్వాస్తివాదమను శాఖ ఏర్పడెను. దానిలో మూలసర్వాస్తివాద, ధర్మగుప్తక, కాశ్యపీయ అను నుపశాఖలు బయలుదేరినవి. క్రీ. పూ. 250 నాటికి మహిసాసకులలో సువర్షక అను నుపశాఖ ఏర్పడెను. క్రీ. పూ. 100 నాటికి దీనిలో సంక్రాంతివాదసూత్రాంతికములను రెండుచీలికలేర్పడెను. మహిసాసకశాఖకంటెను ముందుగనే క్రీ. పూ. 400 నాటికే థేరవాదులలో వాసపుత్రియ శాఖ ఏర్పడెను. వీనిలో క్రీ. పూ. 310 నాటికి సమ్మతీయోపశాఖయు, క్రీ. పూ. 230 నాటికి భద్రాయనీయోప శా ఖ యు, క్రీ. పూ. 210 నాటికి ధర్మోత్తరీయోపశాఖయు, క్రీ. పూ. 210 నాటికి చందాగారికోపశాఖయు ఏర్పడెను. అట్లే మహాసాంఘికులయందును క్రీ. పూ. 4వశతాబ్దిలో గోకులిక లేక లోకోత్తరవాదమను శాఖ ఏర్పడెను. పిమ్మట ఏకవ్యవహారికమను మరియొక శాఖ బయలుదేరెను. క్రీ. పూ. 150 ప్రాంతమున చైత్యవాద లేక చైత్యకీయ అను మూడవ శాఖ బయల్వెడలెను. పిమ్మట సీచైత్యకులలో పూర్వశైలీయ, అపరశైలీయ లేర్పడిరి. ఇదే కాలమున లోకోత్తరవాదులలో బాహుశ్రుతీయ, ప్రజ్ఞాప్తివాదశాఖ లేర్పడెను.[30]

పైన వివరింపబడిన బౌద్ధశాఖలలో చాల భాగము సాతవాహనయుగపు శాసనములలో పేర్కొనబడినవి. మహారాష్ట్రమునందలి శాసనములలో భద్రాయణీయ, ధర్మోత్తరీయ, మహాసాంఘిక, చైత్యకీయ శాఖల ప్రశంస కలదు. ఆంధ్రదేశమునందలి శాసనములలో చైత్యక,

28. మా. సోమశేఖర శర్మగారి చారిత్రక వ్యాసములు పేజి ౩౭-౪౧.

29. Rhys Davids — Buddhist Sects. JRAS 1891 pp. 409–422.

30. Nalinaksha Dutt—Budh Schools in Jour. Dept. Letters. III. table on p. 266.

రాజగిరిక, పూర్వశైలీయ, అపరశైలీయ, శాఖలు పేర్కొనబడినవి.

క్రీ. పూ. 7వ శతాబ్దినాటికి వ్యాప్తిలో ఉండిన గాథలు గౌతమబుద్ధుడు దక్షిణాపథమునకు వచ్చెననియు, ఉడ్ర, దక్షిణకోసల, మహారాష్ట్ర, ఆంధ్ర, కళింగ, ధనకటకములలో సంచారము చేసెననియు చెప్పుచున్నవి. కాని వీనియందెంతనిజమున్నదో తెలియరాదు.[31] ఏమైనను బుద్ధునికాలముననే దక్షిణాపథవాసులు అతని దివ్యసందేశము నాకర్ణించి, దాని ననుసరించిరని యూహింపవచ్చును. మహారాష్ట్రమునందలి పిటల్ కోరా గుహలలోను, కొల్హాపురమున బయల్పడిన స్తూపమున దొరకిన అవశేషపాత్రమీదను గల శాసనములనుబట్టి అశోకునికిపూర్వమే ఈప్రాంతమున బౌద్ధము వ్యాపించెనని ఊహింపనగును[32] అట్లే భట్టిప్రోలుస్తూపమున బహుప్రాచీనమగు మౌర్యలిపిలో వ్రాయబడిన శాసనములు దొరికినవి. వీనినిబట్టి ఆంధ్రదేశమునం దశోకునికి పూర్వమే బౌద్ధమతము వ్యాపించెనని తెలియనగుచున్నది. పాటలీనగరమున మూడవసంగీతిని జరపిన పిమ్మట అశోకచక్రవర్తి దక్షిణాపథమున బౌద్ధధర్మమున విస్తరించుటకై, ధర్మరక్షితుడను యవనుని అపరాంతమునకును మహేంద్రభిక్షువును ఆంధ్రదేశమునకును పంపెను. అంతియకాదు. ఆచక్రవర్తి బుద్ధుని శరీరావశేషములుగల ఎనిమిది స్తూపములను తెరిపించి ఆయవశేషములను అనేకశకలములుగ జేసి వివిధదేశములకు పంపెను. ఇట్లు దానిపైన 84000 స్తూపములు నిర్మింపబడెనని ఐతిహ్యము కలదు. అట్టి బుద్ధుని అవశేషములమీద నిర్మింపబడిన మూడు స్తూపములు ఆంధ్రదేశమున భట్టిప్రోలు అమరావతినాగార్జునకొండలలో బయల్పడినవి. ఇట్లు అశోకుడొసగిన దోహదము వలన దక్షిణాపథమునందు బౌద్ధమునకు నూతనవికాసము కలిగినది.

అశోకుని మరణానంతరము ప్రారంభమైన సాతవాహనయుగమునందు బౌద్ధమతవిజృంభణము జరిగినది. మహారాజులు మొదలు పేదసంసారులవరకును అన్నితరగతులవారును ఈమతము నాదరించిరి. ముఖ్యముగ వణిజులును, వణిక్సంఘములు నీధర్మము ననేకవిధముల నాదరించుట జరిగెను. వారు అపారమగు ధనమును వెచ్చించి గుహాలను, విహారములను, చైత్యగృహములను నిర్మించి భిక్షుభిక్షుణీగణములకు దానము చేయుచుండిరి. జనసమ్మర్దముగల నగరములను గ్రామములను వీడి వానికి అందుబాటులో ఉండి ప్రకృతిరమణీయములై, ప్రశాంతములైన స్థలములయందు ఈభిక్షువుల నివాసము లేర్పరుపబడెను. వీనికి సంఘారామములనియు, విహారములనియు పేరు. మహారాష్ట్రమున ప్రాయికముగ పర్వతములలో ఇట్టినివాసములు దొలవబడినవి. ప్రతిసంఘారామమునను, ప్రతిగుహయందును చక్కని మంచినీరు దొరకు నేర్పాట్లు కల్పింపబడెను. ఆంధ్రదేశమున గుంటుపల్లిలో ఇట్టి గుహాలు కలవు. ఇవిగాక పర్వతములమీదను, సమతలమునను అనేకసంఘారామములు నిర్మింపబడెను. వీనికి చేర్చి ప్రార్థనలకై చైత్యగృహములును, ధర్మబోధనలు జరుగుటకై సమావేశభవనములును నిర్మింపబడెను. సాత

31. I A. vol. XVI. p. 1.
32. Tourner — Mahavamsa p. 171.

వాహనయుగమున భిక్షువులకు ఈఆవాససౌక ర్యము మొదటినుండి తుదివరకును కల్పింప బడుచు వచ్చెను. మహారాష్ట్రమున పితల్ ఖోరా గుహలు క్రీ. పూ. 3వశతాబ్దివి. నాసిక బేడ్సాభాజాకొండనేలఅజాంతాగుహలు క్రీ.పూ. 2వశతాబ్దివి. కార్లా, కుడా, మహద్, కోల్, జునార్, కన్హేరీనాసికగుహలు క్రీ. పూ. 1వశతాబ్దివి. మిగిలినవి అర్వాచీనములు. అట్లే ఆంధ్రదేశమున అమరావతిభట్టిప్రోలు స్తూపములును, బహుశః వానికనుబంధము లుగ నేర్పడిన విహారాదికములును క్రీ. పూ. 3, 2 శతాబ్దులవి. క్రీ. పూ. 1వశతాబ్ది మధ్య భాగమునకు సాతవాహనులు విదిశను జయిం చిరి. వారియాజమాన్యమున అశోకుడు నిర్మిం చిన సాంచీ మహాచైత్యమునకు మనోహరము లగు నాలుగు ద్వారములు ఎత్తబడినవి. ఆంధ్ర దేశమున అమరావతిభట్టిప్రోలులలోని మహా చైత్యములు క్రీ. పూ. 3వశతాబ్దినుండియు వర్ధిల్లెను.

క్రీ. శ. 2వశతాబ్దిలో బౌద్ధమతమున బ్రహ్మాండమగు విప్లవ మేర్పడి మాధ్యమిక వాదము బయలుదేరెను. దీనికి ఆచార్యనాగా ర్జునుడు రూపకల్పన చేసెను. ఈవాదము దేశ మునందెల్లెడలను వ్యాపించెను. అయినను ఆంధ్రదేశము దీనికి ప్రధానస్థాన మయ్యెను. నాగార్జునాచార్యుడు ఒకసాతవాహనరాజు ఆస్థానము నలంకరించెనని ఐతిహ్యము కలదు. ఈక్రొత్తవాదము ప్రబలుటతో బుద్ధునియొక్క ప్రతిమను ప్రత్యేకముగ ఆరాధించుటయు, శిల్పమునందతని ప్రతిమను చెక్కుటయు ఆచారమయ్యెను. అంతవరకును ఆమహనీ యుని సాంకేతికముగనే ఆరాధించుచు, శిల్ప మున చూపుచువచ్చిరి. శూన్యసింహాసనము, ధర్మచక్రము, బోధివృక్షము, బుద్ధపాదములు, చైత్యము అతనికి బదులుగ నారాధింపబడు చుండెడివి. మాధ్యమికవాదము కలిగించిన నూతనోత్సాహము అనేకవిధముల ప్రబలినది. అది శిల్పమునందద్భుతముగ ప్రతిబింబించి నది. ఈవిలక్షణశిల్పసృష్టికి ఆంధ్రదేశ మాల వాలమైనది. నాటిఆంధ్రశిల్పులు పావనకృష్ణ వేణీతీరమున ధాన్యకటకక్షేత్రమున కళాసమా ధిని మునిగి నూతనసందేశమును గాంచి, లోకోత్తరమైన శిల్పస్రోతయోగమును సాగిం చిరి. కృష్ణవేణి కుభయపార్శ్వములనుగల పుణ్యభూమి వారికి క్రతుశాల అయ్యెను. అదివరకే మాధ్యమికవాదమునకును, చైత్యక శాఖకును ప్రధానముగనుండిన అమరావతి చైత్యము నీనాటిశిల్పులు లోకోత్తరశిల్పసంప దతో అలరారు చలవరాతిపలకలతో అలంక రించిరి. ఈఅమరావతీశిల్పసంప్రదాయము నను సరించి చెక్కబడిన పలకలతో కృష్ణాతీరము నందలి స్తూపముల నన్నిటిని మలచిరి. అనేక చోట్ల స్తూపములును విహారములును నిర్మింప బడినవి.

ఆంధ్రదేశ మీవిధమున ఆచార్యనాగార్జు నున కావాసభూమియు, మాధ్యమికవాదము నకు పట్టుకొమ్మయు అయ్యెను. ఇచట వందల కొలది బౌద్ధతీర్థములు వర్ధిల్లెను. ఒక్క కృష్ణా గుంటూరుమండలములలోనే అనేకతీర్థములు బయల్పడినవి. వీనిలో నాగార్జునకొండ బౌద్ధతీర్థము విలక్షణమైనది. ఇంతవిస్తృతిగల తీర్థము భారతదేశమునందు మరి ఎచ్చటను కానరాదు. ఉత్తరమున శాలిహుండమునుండి దక్షిణమున చినగంజామువరకును, తూర్పున ఆదుర్రునుండి పడమట కొండాపురమువర కునుగల విశాలప్రదేశమున దొరకిన బౌద్ధతీర్థ

ముల ఉనికిని పరిశీలించినచో అవి ఆనాటి ప్రధానమార్గములకు సమీపమున నిర్మింపబడి ఆంధ్రదేశమంతటికిని ముఖ్యములుగనుండిన నగరములే వీనికిని కేంద్రములుగ నుండినట్లు కనపడుచున్నది. మొత్తముమీద వేంగీవద్ద ఇట్టివి ఏడుమార్గములు కలిసినట్లు కనిపించు చున్నది. ఒకమార్గము వేంగిలో బయలుదేరి ఆరుగోలను, కాపవరము, కోరుకొండ, కొడవలి, పిఠాపురము, సంఘారామము, ధారపాలెము, రామతీర్థము, శాలిహుండముల మీదుగ కళింగదేశమునకు పోయెడిది. దీనికి కోరుకొండనుండి గోదావరీముఖద్వారమువద్దనున్న ఆదుర్రుకు పోవు శాఖ ఒకటియు, ఉత్తరముగ ఎర్రంపాలెము మీదుగ దక్షిణకోసలమునకు పోవు శాఖ ఒకటియు ఉండెడివి. రెండవది దక్షిణమార్గము. ఇది వేంగీనుండి గుడివాడ, ఘంటశాల, భట్టిప్రోలు, బుద్ధాం, చినగంజాం, పెదగంజాములమీదుగా ద్రవిడదేశమునకు పోయెడిది. మూడవమార్గము వేంగీనుండి విద్యాధరపురము, పెద్దమద్దూరు, ధాన్యకటక-అమరావతి, గరికపాడు, చేజెర్ల, గోలి, నాగార్జునకొండలమీదుగ పోయి కృష్ణదాటి గాజులబండ, పణిగిరికొండాపురముల మీదుగ కర్ణాటకమునకు పోయెడిది. ఇంకొకబాట వేంగీనుండి అల్లూరు, రామిరెడ్డిపల్లి, జగ్గయ్యపేటల మీదుగ మహారాష్ట్రమునకు పోయెడిది. ఐదవమార్గము వేంగీనుండి గుంటుపల్లిమీదుగ దక్షిణకోసలమున కేగెడిది.

## ౪. వైదుష్యము

శాతవాహనయుగమున రాజకీయార్థికాది విషయములకేగాక విద్యావైదుష్యములకును మిక్కిలి ప్రశంసనీయమైనది. ఆనాడు దేశము పరిపూర్ణస్వాతంత్ర్యము ననుభవించుచుండెను. సిరిసంపదలకు లోటు లేకుండెను. రాజులు విద్యాప్రియులును కళాప్రియులు నైయుండిరి. కవులనేకులును, పండితులును స్వేచ్ఛగ కావ్యరచన మొనర్చుచు రాజాస్థానములలో సన్మానముల నందుచుండిరి.

అది ప్రాకృతభాషాయోష పరిపూర్ణసౌందర్యముతో సవిలాసలాస్య మొనర్చిన సత్సమయము. బౌద్ధులు తమమతము జనసామాన్యముకొరకు ఉద్దేశింపబడినదగుటవలన తమ మతప్రచారమును గ్రంథరచనమును ఆనాడు ఎల్లరకును సుబోధ్యముగనుండిన ప్రాకృతభాషలోనే సాగించిరి. ఇందువలన ప్రాకృతభాష బహుముఖముగ వ్యాపించినది. అశోకచక్రవర్తి తన శాసనములను ఆ భాషలోనే వేయించెను. అతని ఆదర్శము ననుసరించి ఇతరరాజులును ఆభాషయందే తమ ఆస్థానకార్యములను నిర్వహించుకొనుచుండిరి. ప్రజలును తమ దానధర్మములను అభాషలోనే శాసనస్థముల నొనర్చుచుండిరి. ఇట్లు బహుజనాదరపాత్రమైన ప్రాకృతమును కవులుకూడ అవలంబించి అందు కావ్యరచన చేయుచుండిరి. ఇట్లు క్రమక్రమముగ నీభాష అభివృద్ధినందినది. సంస్కృతభాషలో సహితము సాధ్యముకాని కొన్ని శ్లేషచమత్కారములును, ధ్వనికల్పనములును ఇందు సాధ్యములైనవి.

సాతవాహనులలో 16వరాజగు హాలమహారాజుకాలము ప్రాకృతభాషాచరిత్రమున స్వర్ణయుగము. అతని ఆదరప్రోత్సాహములు కారణముగ కవులనేకులు అతని ఆస్థానము నలంకరించిరి. వారిలో కుమారిల శ్రీపాలితులు ముఖ్యులు.[33] ఆయాకవులు ఆయా సమయములలో రాజు మన్ననబడయుటకును, తమ ప్రతిభను ప్రకటించుటకునై చెప్పిన పద్యములను రాజోద్యోగులు ఎప్పటికప్పుడు వ్రాసి భద్రపరచిరి. కొంతకాలమునకు పిమ్మట అనేకములగు నిట్టి పద్యములలో 700మాత్రము 'గాథాసప్తశతి' అను పేరనొక గ్రంథముగ సంకలనము చేయబడినవి.[34] భోజమహారాజుకాలమునందు సంస్కృతకవితకు ఎట్టి ఆదరము లభించెనో హాలుని ఆస్థానమున ప్రాకృతమున కట్టి గౌరవము లభించెను.[35]

సప్తశతి సుప్రసిద్ధమగు ధ్వనికావ్యము. ప్రాకృతకవితలో దీనిని మించిన కావ్యము లేదు. దీనియందు ప్రసాదమాధుర్యాదిగుణములు పొంగిపొరలుచున్నవి. రసనిర్భరమగు ఈకావ్యము సాహిత్యలక్షణముల నన్నిటిని కలిగియున్నది. అందువలననే రుద్రట, మమ్మట, వాగ్భటవిశ్వనాథాది సాహిత్యాచార్యులందరును తమతమలక్షణగ్రంథములలో సప్తశతినుండి విరివిగ నుదాహరణముల నొసంగియున్నారు. మహోజ్జ్వలమగు సప్తశతి వంటి ముక్తకకావ్యములు సంస్కృతమునందు సహితము బహుతక్కువగ నున్నవి. ఈ గ్రంథముయొక్క ప్రాశస్త్యమునుబట్టియే "అమృతం ప్రాకృతకావ్యం" అను సూక్తి యేర్పడినది. ఇది శృంగారరసభూయిష్ఠము. ఇందుగల ఒక్కొక్క గాథయు ఒక్కొక్క కావ్యము. ప్రతిగాథయందును, గ్రంథమునందు అనాంతము శృంగారము బహువిధముల భాసించుచున్నది. ఈశృంగారము ఒక్కొక్కప్పుడు మిక్కిలి పచ్చిగను, ఒక్కొక్కప్పుడు ఉచ్ఛృంఖలముగను పోయినది. శివపార్వతులు, లక్ష్మీనారాయణుల వంటి అగ్రదైవములను సహితము విపరీతరతాద్యవస్థలలో వర్ణించినగాని నాటి కవిశేఖరులకును పాఠకలోకమునకు తృప్తి కలుగలేదు.

ఈగ్రంథము నెవరు సంకలనము చేసిరను నంశమునుగూర్చి భేదవివాదము కలదు. హాలమహారాజు స్వయముగ రసవత్కవి, కవితాప్రియుడు, బహుకవిపోషకుడు. "కవివత్సల" బిరుదాంచితుడు. ఈగ్రంథమునందతనివే పెక్కుగాథలు కలవు. ప్రథమశతకమున తృతీయగాథలో "నానాలంకారలలితములగు కోటిగాథలలోనుండి కవివత్సలుడగు హాలుని చేత 700 మాత్రము రచింపబడినవి" అని చెప్పబడినది. శతకాంత్యములయందుగల అంతిమగాథలలో "రసికజనహృదయదయితే కవివత్సలముఖసుకవిసంకలితే" అనియు "...పరిరచితే" అనియు చెప్పబడెనది. దీనినిబట్టి హాలుడే ఈగ్రంథమును తనయొక్కయు, ఇతర కవులయొక్కయు కృతులతో సంకలనము చేసెనని ఎర్పడును. కాని ఇది సత్యము కాదేమో అని సందేహించుటకు కొంత అవ

33. చూ. కవుల పేర్లు. 34. సప్తశతి శత ౧. గాథా 3.

35. కేనాసన్నాఢ్యరాజస్య రాజ్యే ప్రాకృతభాషిణః
కాలే శ్రీ సాహసాఙ్కస్య కే న సంస్కృత భాషిణః॥

సప్తశతీ. నిర్ణయసాగర ముద్రాలయప్రతి. భూమిక. పుట ౯.

కాశము కనిపించుచున్నది. నాల్గవశతకమునం దలి 64వ గాథయందును, ఐదవశతకమునం దలి 67, 71వ గాథలయందును, ఆరవశతకము నందలి 85వ గాథయందును హాలుడు ప్రత్యక్షముగ స్తుతింపబడినాడు. యుక్తాయుక్తవివేకముగల హాలుడు ఇట్టి గాథలను తన సంకలనమున చేర్చి "స్వకుచమర్దన" మొనర్చుకొనునా అని ఒక సందేహము. మరియును అభినందనకవిరచితమగు రామచరితమున హాలునిచే ధనసత్కారమునందిన శ్రీపాలితుడనుకవి హాలునిపేర సప్తశతిని సంకలనము చేసెనని చెప్పబడినది.[56] పై గాథలలో V_67, 71; VI_95 ఎవరి రచనలో తెలియదు. ఏమైనను ఇవి హాలుని స్వయముగ రచించినవిగా ఖ్యాతము కావు. అదియునుగాక హాలునివలెనే మహారసికుడును, కవివత్సలుడును, స్వయముగ కవియును అయిన కృష్ణరాయలు తన ఆముక్తమాల్యదలో పెద్దనగారు తన విజయాదికములను ప్రశంసించుచు రచించి మనుచరిత్రమున కూర్చిన పద్యములను తాను తన గ్రంథమున జేర్చుకొనెనుగదా! బాణాది మహాకవులు హాలునే సప్తశతీసంకలనకర్తగ ప్రశంసించియున్నారు. సప్తశతికి సంబంధించిన మరియొక అంశమునుగూడ నిచట నుదహరించుట సమంజసము. ఇందు చేరిన గాథలను రచించిన కవులలో 250 మందికి మించినవారు కలరు. అందు ఏడెనిమిదిమంది కవయిత్రులు ఉన్నారు. వీరిందరును హాలునికి సమకాలికులేనా లేక భిన్నకాలములవారా అనునది యొక చిన్నసమస్య. ఇంతమంది కవులును సమకాలికులు కాకపోవచ్చును. కాని కొందరైనను ఆనాడు సుప్రసిద్ధకవులుగ నుండి హాలునిచే గౌరవింపబడియుందురనుటకు సందేహము లేదు. అంతియగాక గాథలను జాగ్రతగ పరిశీలించినయెడల వానిలో గోదావరీ నర్మదల ప్రశంసయే విశేషముగ గన్పించుచున్నది. దీనినిబట్టి ఒకేప్రాంతమునకు చెందిన కవులు చాలమంది చెప్పిన గాథలు చాలవరకును సప్తశతిలో చేరినవని ఊహింపవచ్చును.

సప్తశతిలో ఈక్రిందికవుల పేర్లు కనవచ్చుచున్నవి:— అమిత, అసింస, అనురాగ, అసిరుద్ధ, అహక, అలంకార, అరికేసరి, అనంగ, అల్ల, అసమసాహ, అవజ్ఞాంగ, అనంగ, అనిరుద్ధ, అరిక్ష, అంధ్రి, అనురాగ, అలక్ష, అనురాధ, అశోక, అర్జున, అక్షక, అలిక, ఆహవశక్తి, ఆమిక, ఇంద్రి, ఈశాన, ఉచ్ఛేక, ఉద్ధవ, ఉవధి, కల్లాన, కేశవ, కుమారిల, కడ్డల, కాలసార, కదలీహర, కవిరాజ, కాంతాపరి, కల్యాణశీల, కులగుప్త, కృష్ణగుప్త, కైలాస, కుమార, కాలదేవ, కువింద, కువలయ, కటిల, కుందీపుత్ర, కంఠేశ్వర, కాల, ఖండ, గతలంఘిత, గుణాఢ్య, గుణమంజిత, గజసింహ, గజ, గ్రామకూట, చంద్రస్వామి, చంద్రహస్తి, చంద్రి, జీవదేవ, జగనందసార, త్రిలోక, తుంగక, దుర్ధర, దేవ, దామోదర, దేవదేవ, ధనంజయ, దుర్విదగ్ధ, నరసింహ, నాగహస్తి, నిప్పట, నరవాహన, నిష్కలంక, నిరుపమ, నందన, నందివృద్ధ, నీల, పరాక్రమ, పాలిత, పూర్ణభోజక, పర్వతకుమార, ప్రసన్న, పొట్టిస, ప్రమాణ, పుండరీక, పండి, పాలిత, ప్రణాల, బహురస, భోజక, భోట్టక, భోజ, బహురాగ, భ్రిమర, భానుశక్తి, భావుక, బ్రహ్మరాజ, బహ్మగతి, బప్పస్వామి,

---

56. డిటో పుట 8.

బ్రహ్మచారి, మిహిర, మితాంగ, మీనస్వామి, మకరందక, ముగ్ధదీప, మకరధ్వజ, మధ్య, మత్తగజేంద్ర, మంజుసువర్ణ, మందర, మృగాంక, మహాదేవ, మహేంద్ర, ముగ్ధశీల, మండలిక, మనోరథ, మాన, మలయశేఖర, మాతంగ, మన్మథ, మంగలకలశ, మ్లేచ్ఛక, ముద్ర, రతిరాజ, రామ, రాజహస్తి, రోహదేవ, రాగహస్తి, రాగరసిక, రాజవర్గ, విధివిగ్రహ, విజ్ఞ, వాహవ, వజ్ర, వంగవిహారి, వసంత, వల్లభ, వోదిత, వత్స, విజయగతి, విలాస, విగహ, సీరశక్తి, విగ్రహ, విశ్రుత, వసుచారి, విశ్వేశ్వరసింహ, వజ్రదేవ, శర, శంకరశక్తి, శక్తహస్తి, శూర, శాలిక, శంకర, శ్యామక, శ్రీసత్తిక, శ్రీసుందర, శ్రీరాజ, శ్రీధర్మక, శ్రీశాంతి, సుచరిత, సింహ, సరల, సురభివత్స, సవరశక్తి, సింహనాద, సూరన, సత్యస్వామి, సుశీల, సద్గుణకలశ, సీవల, సురభివంశ, స్ఫోట, హాలిక, హరకాల, హారకుంత.

సప్తశతియందు ఈక్రింది రాజకవుల గాథలును చేర్చబడినవి:— హాల, ప్రవరసేన, కేశవరాజ, అవంతివర్మ, మాఉరాజ, జయరాజ, కవిరాజ, వాహనరాజ, మాధవసేన, విషమసేన, గర్గరాజ, వాసవరాజ, మాణిక్యరాజ, ముఖరాజ, ప్రవరరాజ, అర్ధరాజ, మహారాజ, సత్యసేన, ఆయుధరాజ, అవంతివర్మ, వసంతవర్మ, ఆహవశక్తి, మాతృరాజ, విషమరాజ, మల్లసేన, విక్రమరాజ, మణిరాజ, శశిరాజ, కీర్తిరాజ, కుసుమరాజ, రవిరాజ, స్వర్గవర్మ, వప్రరాజ.

ఈక్రింది కవయిత్రుల గాథలును సప్తశతిలో కనిపించుచున్నవి.(37) అనులక్ష్మి, అనులబ్ధి, రేవా, ప్రహతా, వర్ధవతి, శశిప్రభా, రోహా, మాధవీ.

సాతవాహనయుగమున బృహత్కథయను మఱియొక అమూల్యప్రాకృతగ్రంథమును వెలువడినది. అనేకమంది సంస్కృతకవులీగ్రంథమునుకూడ కొనియాడిరి. దీనిని గుణాఢ్యుడను మహాపండితుడు రచించెను. ఈ గ్రంథము ఈనాడు లభించుటలేదు. దీనినిబట్టి బృహత్కథాసారసంగ్రహమను గ్రంథమును క్షేమేంద్రుడును, కథాసరిత్సాగరమను గ్రంథమును సోమదేవసూరియు సంస్కృతమున రచించిరి. కథాసరిత్సాగరమునందు బృహత్కథారచననుగూర్చి యొకగాథ ఇట్లున్నది.[38] సాతవాహనమహారాజు ప్రతిష్ఠానమున నుండి పరిపాలించుచుండెను. అతనికి సంస్కృతభాషాజ్ఞానము లేకుండెను. ఒకనాడు రాజు జలక్రీడాసమయమున ఒకరాణి మీదికి నీళ్ళు కొట్టెను. అందువలన బాధకలిగి ఆమె "రాజన్ మోదకైస్తాడయ" (రాజన్ మ ఉదకైః తాడయ = రాజా! నీళ్ళతో కొట్టకుము) అనెను. దీనిని రాజు "రాజన్ మోదకైః తాడయ" (రాజా! ఉండ్రాళ్ళతో కొట్టుము) అని అపార్థము చేసుకొని, ఉండ్రాళ్ళను తెప్పించెను. ఆమె అతని సంస్కృతభాషాజ్ఞానశూన్యతకు పరిహసించెను. ఇందువలన కష్టము కలిగి రాజు విద్వాంసులను సభకు రావించి వీలైనంత తక్కువకాలములో తనకు సంస్కృతవ్యాకరణమును బోధించవలెనని కోరెను. ఆసభలో గుణా

37. ఈకవి నామములు పైగ్రంథములోని గాథానుక్రమణిక నుండి గ్రహింపబడినవి.

38. చూ. అనుబంధములోని కథాసరిత్సాగర భాగములు.

ఢ్యుడు, శర్వవర్మ అను నిద్దరు మహాపండితులుండిరి. గుణాఢ్యుడు ఆరుసంవత్సరములు పరిశ్రమచేయవలెనని రాజుతో చెప్పెను. శర్వవర్మ ఆరునెలలలోనే రాజును వ్యాకరణపండితుని చేసెదననెను. గుణాఢ్యుడు అది సంభవమే యగునెడ తాను సంస్కృతప్రాకృతదేశీభాషలలో రచనాసంభాషణలను మానివేసెదనని ప్రతిజ్ఞ చేసెను. శర్వవర్మ కుమారస్వామిని ప్రసన్నుని చేసుకొని, కాతంత్రమను నొకవ్యాకరణమును నిర్మించి, దానిని రాజుకు చెప్పి ఆరునెలలలో అతనిని పండితుని చేసెను. గుణాఢ్యుడు తన శపథమును నిలుపుకొనెను. అరణ్యమునకు పోయి, అతడు అచట పిశాచుల భాషను నేర్చుకొని, ఆపైశాచీభాషలో బృహత్కథ అను మహాగ్రంథమును రచించెను. గుణాఢ్యశిష్యులు దానిని రాజుకు చూపిరి. క్రొత్తగ సంస్కృతభాషానిష్ణాతుడైన రాజు భూతభాషలో, భూర్జపత్రములమీద, రక్తముతో వ్రాయబడిన ఆగ్రంథమును నిరసించెను. అంతట ఖిన్నుడై, గుణాఢ్యుడు అగ్నినిరగిల్చి అందు ఒక్కొక్క పత్రమునే వేసి కాల్చుచుండెను. ఈవార్త విని అచటికి పరుగెత్తి రాజు అతని క్షమ నర్థించెను. సహృదయుడగు గుణాఢ్యుడు అంతటితో గ్రంథదహనము నాపివేసెను. ఆరులంబకములలో ఐదు పోగా ఒక్కటి మాత్రము మిగిలెను. దానినే సోమదేవసూరి కథాసరిత్సాగరమను పేర సంస్కృతీకరించెను.

ఈపరిశిష్టమునే అనేకమంది మహాకవులు ఎక్కువగ ప్రశంసించినారు. ఆచార్యగోవర్ధనుడు గుణాఢ్యుని జన్మాంతరము నందిన వ్యాసుడు అని వర్ణించినాడు.[39]

## ౫. ఆచార్య నాగార్జునుడు

కార్లా చైత్యగృహము, సాంచీ స్తూపద్వారములు, అమరావతీ మహాచైత్యము, ఆచార్య నాగార్జునుడు ఆంధ్ర సాతవాహన యుగము ప్రపంచమునకు సమర్పించిన అమూల్యోపహారములు. సాతకర్ణి, గౌతమీపుత్ర, యజ్ఞశ్రీలవంటి సాతవాహన సమ్రాట్టుల యశస్సు ఒక్క భారతదేశముననే వెలుగొందినది కాని ఆచార్యనాగార్జునుని అమరప్రతిభ నేటికిని బౌద్ధప్రపంచమున, ముఖ్యముగ చైనా జపాన్ టిబెట్టులలో, దేదీప్యమానముగ నున్నది. బౌద్ధతత్వములు వివాదగ్రస్థములై, బౌద్ధలోకము అచారవిశ్వాసవైరుధ్యకలుషితమై సంధిగ్ధావస్థలో నుండినప్పుడు నాటి తత్వములనెల్ల సవిమర్శకముగ పరిశీలించి, నూతన విశ్వాసములకు మాధ్యమికవాదమను పేర రూపకల్పన మొనర్చి ఆచార్యనాగార్జునుడు బౌద్ధధర్మమునకు స్థైర్యమును, నూతనవికాసమును కల్పించెను.[40] ఇతడు బుద్ధుని తర్వాత బుద్ధుని యంతటివాడు. ఈమహనీయుడు తన జీవితమున చాలభాగమును ఆంధ్రదేశమున ధాన్యకటక విజయపురప్రాంతముల గడపి, ఇచ్చట నొక ప్రసిద్ధమైన విద్యాపీఠమును,

39. సప్తశతి. (నిర్ణయసాగర ప్రెస్) భూమిక పుట ౬.

40. కొడాలి లక్ష్మీనారాయణ - నాగార్జున చరిత్రము 4వ విభాగము.

గ్రంథాలయమును, పరిశోధనాగారమును నెల
కొల్పి మాధ్యమికదర్శనసృష్టి చేసెను. అం
తియగాక ఈ ఆచార్యునికి ఒక సాతవాహన
రాజు ఆలంబమైయుండెను.

నాగార్జునుడు లోకోత్తరుడు. ఇతడు
ఒకవ్యక్తియే కాదు, ఒకఉద్యమము, ఒకసంస్థ.
ఇతడు మహాపండితుడు, ఆచార్యశిరోమణి,
చక్కని వక్త, నిరుపమ వాదప్రతివాద కౌశల
భూషితుడు, బౌద్ధతత్త్వవేది, బహుగ్రంథకర్త,
వైద్యరహస్యముల నెరిగినవాడు, రసాయన
శాస్త్ర నిర్మాత, సిద్ధ పురుషుడు, ప్రముఖ
తాంత్రికుడు, సర్వజ్ఞుడు, గురుపరంపరలో
14వవాడు, ఆర్య, ఆచార్య బోధిసత్వబిరుద
విఖ్యాతుడు.

ఈమహనీయుని పవిత్రజీవితమును గురించి
తెలిసికొనుటకు కొన్ని నిర్దుష్టములగు ప్రమా
ణములున్నను మరికొన్ని అనేకభ్రాంతులను
కలిగించుచున్నవి. అసలు నాగార్జునులు ఎం
దరు అనునది ఒకపెద్దసమస్య. కొందరు
ఇద్దరు, కొందరు ముగ్గురు మరికొందరు నలు
గురు నాగార్జునులుండిరని అభిప్రాయపడినారు.
కాని వాస్తవముగ ఈపేరుతో సుప్రసిద్ధులుగ
నుండిన వ్యక్తులు ఇద్దరు మాత్రముండిరి.
అందు సాతవాహనయుగమున క్రీ. శ. 2వ
శతాబ్దిలో వర్ధిల్లిన మహాయాన దార్శనికు
డగు బోధిసత్వనాగార్జునుడొకడు. రెండవ
వాడు రసాయన శాస్త్రజ్ఞుడును, తాంత్రిక
వాద ప్రచారకుడును, వజ్రయానియునైన
క్రీ. శ. 7వశతాబ్ది యందుండిన సిద్ధనాగార్జు
నుడు. ఆచార్య నాగార్జునుని గురించి వివర
ములను తెలుపు మొదటి ఆధారము అతని
గ్రంథములు. మనదేశమున లభించు ఇతర
గ్రంథములలో రాజతరంగిణీకథాసరిత్సాగర
ములు ముఖ్యములు. ఈ ఆచార్యుని గ్రంథము
లన్నియు టిబెట్ చైనా భాషలలోని కనువ
దింపబడినవి. అవిగాక కుమార జీవుడను
నతడు క్రీ. శ. 405లో ఆచార్యనాగార్జునుని
చరిత్రమును రచించెను. సింహళద్వీపమున
రచింపబడిన దీపవంశ మహావంశములును
ముఖ్యములు. ఫాహియాన్, హ్యూయన్‌త్సాంగ్,
ఈత్సింగ్ అను ముగ్గురు చైనాదేశీయులు
మనదేశమునకువచ్చి ఈ బౌద్ధాచార్యుని
గూర్చి కొన్ని ముఖ్యాంశములను తెలిసికొని
వానిని గ్రంథస్థము చేసిరి. తారానాథుడను
టిబెట్ బౌద్ధుడు ఆయాదేశములలో గల బౌద్ధ
గాథలను బట్టి బౌద్ధమతచరిత్రమును వ్రాసెను.
అందును నాగార్జునుని ప్రశంస కలదు. ఆధు
నికులలో పాశ్చాత్యపండితులెందరో ఈఆచా
ర్యుని గూర్చి వ్రాసిరి. ఈఆధారములన్నియు
జిజ్ఞాసువులకు ఎక్కువగ నుపకరింపగలవు.

ఆచార్య నాగార్జునుడు దాక్షి
ణాత్య బ్రాహ్మణుడు. ఇతని జన్మస్థానము
విదర్భనగరమని (నేటి నాగపురము లేక చత్తీస్
ఘర్) అని కొందరును,[41] కాంచీ నగరమని
కొందరును వ్రాసి యున్నారు. మరికొందరు
ఇతడు జన్మచేత ఆంధ్రేతరప్రాంతీయుడైనను,
తనజీవితమున విశేషభాగము నాంధ్రముననే
గడపెనని వ్రాసినారు. ఆచార్య నాగార్జునుడు
జీవించిన క్రీ. శ. 2వ శతాబ్దియందు ఆంధ్ర
దేశము బహువిస్తృతముగ నుండెను. సాత

41. JASB. vol. li pt. i. p. 115.

వాహన సామ్రాజ్యమునందు విదేశ అంతర్ఖ్యాతముగ నుండెను. అప్పుడే దక్షిణమున కాంచీ నగరమును అందు చేరియుండెను. అందువలన నాగార్జునుని జననమెచ్చటనైనను అతడు ఆంధ్ర సామ్రాజ్యపౌరుడుగనే జన్మించెనని చెప్పవచ్చును. లంకావతారసూత్రమను నొక గ్రంథమున బుద్ధుడే తనయనంతరము 600ఏండ్లకు నాగాహ్వాయుడను భిక్షువు జన్మించునని చెప్పినట్లున్నది.[42] ఇతని పేరు "నాగ" అనియు, నితడు అర్జున వృక్షము క్రింద తపము చేసి సిద్ధుడగుటవలన నాగార్జునుడని ప్రసిద్ధి నందెననియు నొకగాథకలదు. ఈఆచార్యునకి ఏడవయేట ప్రబలమగు గండము వచ్చెననియు, జ్యోతిష్కులు సన్యసించినగాని ఇతనికీగండము తప్పదనిరనియు, అందువలన అప్పుడే ఇతడు సన్యసించెననియు మరియొక గాథ కలదు. ఇది విశ్వసనీయము కాదు. ఈ యతి వైదికధర్మము నామూలాగ్రముగ తెలిసినవాడు. ఇంతటి నైపుణ్యమును సంపాదింపగలుగుటకు ఎంతమేధావి యైనను అతడు కొంతకాలమైనను బ్రాహ్మణ మతానుయాయియై దీక్షతో వ్యాసంగము చేసి యుండవలెను. జైనగ్రంథములలో నితడు నిశితమైన మేధగలవాడును, ఏకసంధాగ్రాహియునని వ్రాయబడియున్నది. పరిపూర్ణ యౌవనుడగునప్పటికే ఇతడు విద్యాపూర్ణుడయ్యెను. ఆకాలమునందితడు వ్యభిచారిగ నుండెననియు, రాజాంతఃపురమునకే రాకపోకలు సాగించుచు ఒకసారి పట్టుబడెననియు, గండము తప్పినచో సన్యసింతునని నిశ్చయించుకొని, ఆమీదట పరివ్రాజకుడయ్యెననియు నొక గాథ కలదు.(43)అప్పుడితడు బౌద్ధమతమునవలంబించి హీనయాన శాఖలో చేరెను. పిమ్మట మహాయాన మితని నాకర్షించెను. ఆమీద నాగార్జునుడు ప్రబలమగు తపమొనర్చెను. ఇతడు కాంచీనగరమున తారాదేవి నుపాసించి సిద్ధుడయ్యెనని ఒక గాథయు, నాలందాలో చండిక నుపాసించి సిద్ధుడయ్యెనని ఒక గాథయు కలవు. ఈకాలమునకు నాలందా ప్రసిద్ధము కాలేదు. అందువలన నీ ఆచార్యుడు కాంచీనగరముననే తపస్సిద్ధుడయ్యెనని చెప్పవచ్చును. తంత్రశాస్త్రమునననుసరించి అభ్యసించి యితడు మయూరవిద్యాపారంగతుడై వలసినప్పుడు అదృశ్యుడగుట,[44] ఏవస్తువునైనను బంగారముగ మార్చుట మున్నగు సిద్ధవిద్యలను వశపరచుకొనెనట.

ఇట్లు అఖండమగు పాండిత్యమును, అమోఘమగు తపశ్శక్తిని సంపాదించి నాగార్జునుడు దేశసంచారమొనర్చి అనేక చోట్ల వాదోపవాదము లొనర్చి అవిచ్ఛిన్న విజయపరంపర నార్జించెను. మహాయానమునందు అభినివేశముకలవాడై ఆతత్త్వమునుగూర్చి యితడు విశేషముగ పరిశోధన చేసెను. ఇతడు బుద్ధ అమితాభుని, మహానాగబోధిసత్త్వుని, వజ్రసత్త్వునికలిసి వారివలన తత్త్వమును తెలిసికొనెనట. మహాయానమును గూర్చి నిశ్చయజ్ఞానము నీయగల గ్రంథము లీదేశమున లభింపకపోవుటవలన నాగార్జునాచార్యుడు సముద్రపు అడుగున నున్న నాగలోకమునకేగి అచ్చట ప్రమాణగ్రంథములగు ప్రజ్ఞాపారమితాసూత్ర, వైపుల్యసూత్రములను బుద్ధధాతువులుకల కరండికను సంపాదించెనట.[45]

---

42. Suzuki p. 24. 43. Coates—The Budhist Saint p. 209.
44. Watters—vol. II. pp. 200 - 201. 45. Ibid.

ఈనాగలోకము లంకాద్వీపమని పండితుల అభిప్రాయము. ఇట్లు ప్రమాణగ్రంథములను సంపాదించి ఇనుమడించిన కీర్తితో నాగార్జునుడు వానిని పరిశీలించుట కనువగు స్థలమునుగూర్చి యోచించెను. ఆనాడు సాతవాహన సామ్రాజ్యమును పరిపాలించుచుండిన మహారాజు ఈ పండితుని తనరాజధానికి ఆహ్వానించి తగిన సౌకర్యముల నన్నిటిని ఒనగూర్చెను.

సాతవాహనరాజు నాగార్జునుడు నివసించుటకై ప్రత్యేకముగ నొక సంఘారామమును నిర్మించి ఇచ్చెను. దీనిని చైనాదేశయాత్రికులుచక్కగవర్ణించినారు.[46] క్రీ.శ.5వశతాబ్ది నాటి ఫాహియాన్ వ్రాతలనుబట్టి దీనికి పారావతవిహారమని పేరు. అది ఐదు అంతస్థులు కలిగియుండెను. నేలమట్టమునగల అంతస్తు ఏనుగ ఆకారమునునుండెను. దీనిలో 500గదులుండెడివి. రెండవది సింహాకృతికలది. ఇందు 400గదులుండెడివి. మూడవది హయాకృతి గలది. అందు 300గదులుండెడివి. నాల్గవ దానిది వృషభాకృతి. అందు 200గదులుండెడివి. పై అంతస్తు పావురమువలెనుండెను, అందు 100గదులుండెడివి. ఇంకను పైన జలాశయముండెను. దీనినుండి విహారమునందన్ని చోట్లకును నీరువచ్చు సదుపాయ ముండెను. ఫాహియాన్ దీనిని 'పోలోయూ' అని వ్రాసినాడు. క్రీ. శ. 7వశతాబ్దిలో హ్యూయన్‌సాంగ్ అను యాత్రికుడు ఆంధ్రదేశమున సంచారము చేసెను. ఇతడీ సంఘారామమును ఇట్లు వర్ణించెను— రాజధానికి 300లీలదూరమున పోలోమోలకిలీ (భ్రమరగిరి) అను ఎత్తైన కొండ కలదు. దీనిలో సాతవాహన రాజు నాగార్జునునికొరకు ఒక సంఘారామమును దొలిపించెను. ఇందు గల కట్టడములలో ఐదు అంతస్తుల భవనము ముఖ్యమైనది. ఒక్కొక అంతస్థులోను విహారములును పాఠశాలలును కలవు. ప్రతివిహారమునందు మనుష్యుని ఎత్తుగల బంగారు బుద్ధ విగ్రహములుండెడివి. అన్నిటికంటెను పై అంతస్తులో శాక్యముని గ్రంథములును, వ్యాఖ్యానరచనలును ఉండెడివి. అట్టడుగు అంతస్తులో భోజనాది సామగ్రియుండెడిది. ఉపాసకు లిచట నివసించుచుండిరి. ఈ చైనాయాత్రికులు పారావతమని వ్రాసినది పార్వత సంఘారామము కావచ్చును. 'పర్వతము'మీదదిది అగుటవలన నది పార్వతమగును. గుంటూరుజిల్లాపల్నాడు తాలూకాలో 'నాగార్జునకొండ'అను నొక కొండ ఉన్నది. దీనివద్ద విశాలమగు ప్రదేశములో బౌద్ధశిథిలములు బయల్పడినవి. ఇచ్చట దొరికిన శాసనములనుబట్టి ఇది శ్రీపర్వతము వద్దనున్న విజయపురియను నగరమనియు, ఇక్ష్వాకురాజులకు రాజధానిఅనియు తెలియనగుచున్నది. ఈ శ్రీపర్వతమే నేడు నాగార్జునకొండగ వ్యవహరింపబడుచున్నది. ఆచార్య నాగార్జునుడు చిరకాల మాంధ్రదేశమున గడపెనను గాథలకు ఈ కొండపేరు అనుగుణముగ నున్నది. ఈ కారణములనుబట్టి చైనాయాత్రికులు వర్ణించిన పార్వత సంఘారామము ఈ శ్రీపర్వతముననే ఉండెనని బహుపండితులు నిర్ణయించినారు.

ఇట్లు శ్రీపర్వత సంఘారామమున నివసించి నాగార్జునాచార్యుడు తన పరిశోధనలను సాగించెను. అతని యీ పరిశోధన బహుముఖమై

---

46. K. R. Subrahmanyam—Andhra Histsry Etc. ch. IV.

నది. ఈ ఆచార్యుడు రసాయనశాస్త్రమున గొప్పపండితుడు.[47] పాదరసమును,వజ్రమును శుద్ధిచేసి ఔషధోపయోగముల నొనర్చెను. అనేక లోహములను శోధించెను. ఏవస్తువునైనను బంగారముగ మార్చు యోగమును కనిపెట్టెను. ఈ పరిశోధనలను సాగించుటకనువగు నొక పరిశోధనాగారమీ సంఘారామమునందుండి యుండవలెను. ఈ కృషికి ఫలితముగ నీయాచార్యుడు 'రసరత్నాకర'మను ప్రమాణగ్రంథమును రచించెను. నాగార్జునుడు వైద్యశాస్త్రమునందు అపారమగు పాండిత్యము కలవాడు. ఇతడు అనేక మూలికల ప్రభావమును తెలిసికొని, కాయకల్పచికిత్సను కనిపెట్టి దానిని తానుచేసుకొని. సాతివాహన రాజుకును చేసెనట. ఇందుమూలమున వారిద్దరును సుదీర్ఘజీవులైరట. ఈ వైద్య పరిశోధనకు ఫలితముగ నితడు సుశ్రుతమును సంస్కరించి, కక్షపుటతంత్రిఆరోగ్యమంజరులను రెండు వైద్యగ్రంథములను రచించెను. నాగార్జునాచార్యుడు విషవైద్యమున గొప్ప కృషి చేసి ప్రామాణికు డయ్యెను. నేత్రవైద్యమునందితడు కనిపెట్టిన చిట్కాలు చైనాలో ప్రసిద్ధములుగ నుండెను. అశోకచక్రవర్తి సర్వమానవ సౌభ్రాతృత్వమును సౌఖ్యమును కాంక్షించి బౌద్ధధర్మమును రాళ్ళమీదను, స్తంభముల మీదను చెక్కించి ప్రచారము చేసెను. భగవానుడగు బుద్ధదేవుడు సర్వప్రాణులయందును కరుణకలిగి నలుబదిసంవత్సరములు అవిచ్ఛిన్నముగ సంచారము చేసి ధర్మబోధ చేసెను. నాగార్జునబోధిసత్త్వుడు సర్వమానవ బాధానిర్వాపణపరతంత్రుడై తాను పరిశోధన పూర్వకముగ కనిపెట్టిన రోగచికిత్సలను అనేక స్థలముల రాళ్ళపై చెక్కించి ప్రచారము చేసెనట.

నాగార్జునుని ఖ్యాతి అతని తాత్త్వికపరిశోధనలమూలమున అమరమైనది. బుద్ధునికి పిమ్మట నితడే సర్వాంగసుందరమును, యుక్తియుక్తమునగు తత్త్వమును బోధించిన మహానుభావుడు. ఇతడు ప్రచారము చేసినది మాధ్యమికవాదము లేక శూన్యవాదము. "ఈ విశ్వము కేవలనిత్యమునుకాదు కేవలమిథ్యయుకాదు. ఇది అవాంతర నిత్యము. పరస్పరసంబంధముగల కొన్ని కారణముల సంయోగమువలన ఇది నడచుచున్నది. ఈ కారణముల నాశ్రయించి జనులు సుఖదుఃఖముల ననుభవించుచున్నారు. అవాంతరత్వ మున్నయెడల సత్యమును, నిత్యత్వమును కేవలముగ నుండజాలవు. ఈ అవాంతరత్వము పోయినచో శూన్యముండును. ఇది సుఖదుఃఖరహితము. ఇదియే పరమగమ్యము" అనునది ఈవాద సారాంశము. ఇది తర్వాత బయల్వెడలిన ఆచార్యశిరోమణియగు శ్రీశంకరుని మాయావాదమునకు దోహద మొసంగినది. ఇట్లు శూన్యవాదమును ప్రతిపాదించియు నాగార్జునుడు తాంత్రికమార్గమున దేవతోపాసన చేసి, సిద్ధుడై, అద్భుతశక్తులను సంపాదించెను. ఈ విధానము తర్వాతకాలమున ప్రబలిన భక్తిమార్గమునకు దోహదమొసంగినది. ఆచార్యనాగార్జునుని తాత్త్వికప్రతిభ నిరుపమము. ఇతని తర్కశక్తి అకుంఠితము. ఈ ఆచార్యుడు రచించిన బహుగ్రంథములలో 24మాత్రము లభించినవి. ఇవి అన్నియు టిబెటను చైనా భాషలలోనికి పరివర్తింపబడినవి. ఇందు ప్రజ్ఞాపారమితాశాస్త్ర, ప్రజ్ఞామూలశాస్త్రటీకా, ప్రజ్ఞాప్రదీపశాస్త్రకారికా,

47. P. C. Ray—Hist. Ind. Chem. vol. I. p. xcii.

మూలమాధ్యమికశాస్త్ర, శూన్య సప్తాధి, మాధ్యాంతానుగమశాస్త్ర, దశభూమివిభాసా శాస్త్ర, ద్వాదశనికాయశాస్త్ర, వివాదసమాన శాస్త్ర, ప్రమాణవివేచన, ఉపాయకౌశల్యహృదయశాస్త్ర, విగ్రహవ్యావర్తినీకారికా అనునవి ముఖ్యములు [48] ఇవికాక నీయాచార్యుడు సుహృల్లేఖ అను నొక లేఖను రచించెను.[49] అది యతడు మిత్రుడగు సాతవాహనరాజునకు వ్రాసిన సన్మార్గోపదేశకమగు ఉత్తరము. క్రీ. శ. 7వశతాబ్దిలో మన దేశమునకు వచ్చిన ఈత్సింగ్ అను చైనాయాత్రికుడు అప్పుడు ఆబాలవృద్ధులును ఈలేఖను కంఠస్థము చేయుచుండిరని వ్రాసినాడు.[50]

ఆచార్యనాగార్జునుని మరణమునుగూర్చి రెండురకముల వివరములు తెలియుచున్నవి. కాయకల్పరసాయనమును సేవించి ఇతడును, సాతవాహనరాజును సుదీర్ఘజీవులుగ నుండిరట. ఎప్పటికిని రాజు మరణింపకుండుటవలన ప్రాణము విసిగి యువరాజు నాగార్జునునివద్దకు వచ్చి అతని తలను కోసి ఇమ్మని యాచించెనట. ఆచార్యుడొక గడ్డిపరకతో తన శిరము నుత్తరించి యిచ్చెనట.[51] ఇది కల్పితమగు గాథ. మరియొక ఆధారము సత్యమును తెల్పుచున్నది. 60సంవత్సరములు దాటినమీదట ఆచార్యుడు ఒకనాడు సమాధిలోనుండి ధర్మవచనములను మాత్రము వినెనట. మర్నాడు అతడు సుఖావతిలో ప్రవేశించెనట. ఇతడెంత సేపటికిని బయటకు రాకుండుటవలన శిష్యులు తలుపులు పగులగొట్టి లోనప్రవేశించిరట. అప్పుడు వారికతని మృతదేహము కనబడెనట. ఈవార్త తెలిసినవెంటనే అన్ని దేశములలోను అతనికి ఆలయములు నిర్మించి అతనిని బోధిసత్వునిగ పరిగణించిరట. ఇది నిజమే కావచ్చును.

ఈ ఆచార్యశిరోమణి క్రీ. శ. 2వశతాబ్దిలో వర్తిలెనని స్థూలముగ నిర్ణయింపనగును. చైనాటిబెట్ దేశములలోని గ్రంథము లితడు కనిష్కునికి సమకాలికుడని చెప్పుచున్నవి [52] కనిష్కుని ఆస్థానమునందు అశ్వఘోషుడు ప్రధానాలంకారముగనుండిన బౌద్ధాచార్యుడు. గురుపరంపరలో నాగార్జును డశ్వఘోషునికి ప్రశిష్యుడు.[53] నాగార్జునుని గ్రంథములలో అశ్వఘోషకనిష్కుల ప్రశంసగలదు. మహావంశమను సింహళబౌద్ధగ్రంథమునుండి క్రీ. శ. 3వశతాబ్దినాటి తిస్సుడను ఆదేశపురాజునకు నాగార్జునునిశిష్యుడగు ఆర్యదేవుడు సమకాలికుడని తెలియనగుచున్నది.[54] జగ్గయ్యపేటలో దొరికిన క్రీ. శ. 5వశతాబ్దినాటి శాసనమొకటి నాగార్జునశిష్యుడగు జయప్రభుని శిష్యుని పేర్కొనుచున్నది.[55] ఈయాచార్యుని ప్రజ్ఞామూల శాస్త్రము క్రీ. శ. 196—2:1 నడుమ జీవించిన హ్యూన్కాన్ అనునతనిచే చైనాభాషలోనికి అనువదింపబడెనని తెలియుచున్నది. దీనినిబట్టి నాగార్జునుడు క్రీ.శ. 196కుపూర్వము మరణించెనని ఊహింపవచ్చును. ఒక గాథలో నీయాచార్యుడు కనిష్కుని కాలమున బౌద్ధసంగీతి జరి

48. I. A. vol. xvi. p. 169; Watters vol. II. p. 204; Nanjo. Cat. Nos. 1169, 1185, 1246, 1180, 1186, 1251.

49. I. A. vol. XVI. p. 169. 50. Takakusu—Itsing. pp. 151 - 162

51. Mystic tales of Taranath p. 10 - 11. 52. I. A. vol. XVI. p. 353.

53. Ibid. vol. IV. pp. 48, 315. 54. Gieger—Mahavamsa ch. 36.

55. Burgess—Bud. Stups. Amar. Jag. p. 111.

గినయేట జన్మించెనని యున్నది. ఆసహావేశము క్రీ. శ. 130 ప్రాంతమున జరిగియుండును. ఆధునికులలో హాక్‌మన్ క్రీ. శ. 150–200, బీల్ క్రీ. శ. 166–200, లక్ష్మణరావు క్రీ. శ. 137–194 నాగార్జునుని కాలమని నిర్ణయించిరి. పైకారణములనుబట్టి లక్ష్మణరావుగారి నిర్ణయము సరియైనదని తోచుచున్నది.

ఆచార్య నాగార్జునుడు తాను మహావిద్వాంసుడగుటయేకాక దిగ్దంతుల వంటి శిష్యులను తయారు చేసెను. అట్టివారిలో ఆర్యదేవు డగ్రగణ్యుడు. ఇతనికి దేవ, కానదేవ, నీలనేత్ర అను పేర్లు ఉండెను. ఇతడు 15వ బౌద్ధగురువు. మహాయాన రహస్యవేదియగు నితడు చోళకోసల మగధదేశములలో అనేక తాత్త్వికవాదముల నోనర్చెను. అంధకవింసుత్తాంత మనిన ఇతనికి ఎక్కువ అభిమానము. ఇతడు తన శతశాస్త్రమను గ్రంథమున సాంఖ్యవైశేషికములను, చిత్తవిశుద్ధి ప్రకరణమున నాటి గంగస్నానాది విశ్వాసములను ఖండించెను. ఇతడు పరమతిసహానము లేనివాడగుటచే ఒకశత్రువుచే హత్యచేయబడెను. తర్వాత పేర్కొనదగిన నాగార్జున శిష్యుడు భావవివేకుడు. ఇతడు ఆంధ్రుడు. ధాన్యకటకమునకు దక్షిణ పశ్చిమముననున్న ఒకకొండలోని గుహలో ఏకాంతముగ నివసించెడివాడు. మహాయాన ముక్తాహస్త శాస్త్రము, ప్రజ్ఞాలంపశాస్త్రము, సాంఖ్యతర్కజ్వాలా అనునవి ఇతని గ్రంథములు. వీరిర్వురునుగాక నంద, నాగ అను మరియిర్వురు శిష్యులుండిరి.

ఆచార్యనాగార్జునికి సమకాలికుడగు శాతవాహనరాజు ఎవడు అనునది వివాదాస్పదమగు అంశము. కొందరు ఇతడు వాసిష్ఠీపుత్రి పులోమావి అనిరి; ఇతరు లితడు గౌతమీపుత్రయజ్ఞశ్రీ అనిరి. పులోమావికాలమున కీబౌద్ధాచార్యుడు జన్మించెనా అని సందేహము కలుగుచున్నది. అందువలన నితడు యజ్ఞశ్రీకే సమకాలికుడని చెప్పవచ్చును. రాజునకు నీయాచార్యునికిని గాఢమగు మైత్రియుండెను. అమరావతీమహాచైత్యమునకు దానిచుట్టునుండిన ప్రాకారము ఎక్కువ శోభ నొసగూర్చినది. ఈప్రాకారము చలువరాతి స్తంభములతోను, పలకలతోను నిర్మింపబడినది. ఈ స్తంభములమీదను, పలకలమీదను లోపలివైపునను, వెలుపలివైపునను మనోహరములగు శిల్పములు కలవు. ఈశిల్పములు క్రీ. శ. 2, 3 వ శతాబ్దులనాటివని పండితుల నిర్ణయము. ఈప్రాకారమును ఆచార్యనాగార్జునుడు కట్టించెనని ఒక గాథ కలదు. అది నిజమే కావచ్చును. ఆంధ్రదేశమున బయల్పడిన అనేక చైత్యములు ఈ అమరావతీ ప్రాకారశిల్పపద్ధతిలో నిర్మింపబడిన శిల్పఫలకములతో మలచబడియున్నవి. దీనినిబట్టి యీ శిల్పపద్ధతికి నాగార్జునాచార్యుడు చక్కని దోహదము నొసగెనని ఊహింపవచ్చును.

నాగార్జునుడు రూపకల్పన చేసిన మాధ్యమికవాదము అనేక దేశములకు వ్యాపించినది. ఎందరో భారతీయ బౌద్ధపండితులు ఈ యాచార్యుని గ్రంథములను చదువుకొని ప్రాచ్యదేశములకేగి మాధ్యమిక శూన్యవాదములను అచట ప్రచారము చేసిరి. ఈగ్రంథములతోపాటుగ నీయాచార్యుని ప్రతిభయు ఆ దేశముల కొనియాడబడెను.

ఇట్లు నాగార్జునాచార్యుడు శాతవాహనయుగమునకు అద్వితీయమగు శోభ నొసగూర్చెను.

# ౬. సాంఘికస్థితి

సాతవాహనసామ్రాజ్యము వర్ధిల్లినకాలమున ప్రజలు ప్రశాంతముగ జీవించిరి. ఆనాటి సాంఘికజీవితమునుగూర్చి ఎన్నియో విశేషాంశములు తెలియనగుచున్నవి. నాటి శాసనములును, వాత్స్యాయనకామసూత్రములును, శాలివాహనసప్తశతియును, ఆయుగమునాటి శిల్పమును ఈసందర్భమున విశేషముగ నుపకరించుచున్నవి.

సాంఘికజీవితము చాతుర్వర్ణ్యవ్యవస్థపైన ఆధారపడియుండెను. గౌతమీపుత్రశాతకర్ణి వర్ణాశ్రమధర్మము నుద్ధరించెనని అతని తల్లి వేయించిన నాసికశాసనమున చెప్పబడినది.[56] నహపానుని అల్లుడగు ఉషవదత్తుడు అనేకమంది బ్రాహ్మణులకు పెక్కుదానములను చేసెను.[57] గౌతమీపుత్రుడు క్షత్రియదర్పమానమర్దనుడు. కన్హేరీశాసనములలో నొకటి యిద్దరు క్షత్రియసోదరులు చేసిన ధర్మమును తెలుపుచున్నది.[58] సాతవాహనయుగపు శాసనము లనేకములు వణిజులు చేసిన ధర్మములను పేర్కొనుచున్నవి. తురీయవర్ణమునకు చెందిన హాలిక, మూర్ధక, గోలిక శాఖల పేర్లును శాసనములలో కనిపించుచున్నవి. విదేశీయు లనేకులు ఆనాడు వైదికబౌద్ధమతమతముల నవలంబించి హిందూనామములను ధరించిరి. వీరిలో యవనులు చాలమంది బౌద్ధులైరి. శకులలో చాలమంది వైదికధర్మము నవలంబించిరి. వీరందరు నేయే వర్ణములలో చేరిరో నిశ్చయముగ తెలియదు కాని వీరు నాటి హిందూసంఘమున చేరిపోయినది మాత్రము నిజము.

ఆనాటికుటుంబములలో అన్యోన్యానురాగము ప్రబలముగ నుండెను. ఈకుటుంబములు సమిష్టికుటుంబములు. యజమానికి గహపతి అనియు అతనిభార్యకు గహపతినీ అనియు పేర్లు ఉండెను. పుణ్యక్షేత్రములను దర్శించినను, బౌద్ధతీర్థముల కేగినను కుటుంబమునందలివారందరును కలసి పోవుచుండిరి. గుహలను దొలిచుట, స్తంభములను చెక్కించుట మున్నగు ధర్మకార్యములను చేయునప్పుడుకూడ కుటుంబములోని వారందరును సమిష్టిగనే వ్యవహరించుచుండిరి.[59] సప్తశతిలో అనేకచోట్ల అన్నదమ్ములును, అత్త కోడండ్రును కలసి ఒకయింటనే ఉండినట్లు చెప్పబడినది.

నాటిసంఘమున స్త్రీలకు గౌరవనీయమైన స్థానముండెడిది. దేవీనాగానీక, గౌతమీబాలశ్రీలు రాజ్యతంత్రమునే నడుపుచుండిరి. సామాన్యకుటుంబములకుచెందిన స్త్రీలు ఎందరో చాలద్రవ్యమును దానధర్మములకు వినియోగించుచుండిరి. ఆరాధనమునను, పండుగులలోను, వినోదములలోను, వారు పురుషులతోసమానముగ పాల్గొనుచుండిరి. సప్తశతిలోని గాథలనుబట్టి వారికి ఆహారవిహారముల

56. చూ. అనుబంధము శాసనము ౧౨. 57. చూ. Ep. Ind. VIII లోని అతని నాసిక శాసనములు.

58. చూ. అనుబంధము శాసనము ౨౦.

59. నాసిక కార్లా అమరావతీ శాసనము లనేకము లిట్టి ధర్మములను పేర్కొనును.

యందును ఎక్కువస్వేచ్ఛ ఉండినట్లు తెలియ నగుచున్నది.

ఈయుగమున రాజాస్థానములు బహు వైభవోపేతములుగను, రాజుల జీవితములు ఆడంబరోపేతములుగను ఉండినవి. ఉష్ణీషము, ఛత్రము, చామరములు, వాలవ్యజనములు, ఖడ్గము, పాదుకలు, సింహాసనము, ధ్వజము వారి లాంఛనములు. వారిశరీరములు అనేక భూషణాలంకృతములు. శృంగవాహికలు, ఖడ్గవాహులు, ప్రతీహారులు, కంచుకి, కుబ్జులు, వామనులు వారి పరివారము. అశ్వగజాందోళికలు వాహనములు. ఈఆడంబరములతో రాజులు అతితరుచుగ అమరావతీసాంచీశిల్పములలోను, ఆజంతాచిత్రములలోను కనిపించుచున్నారు. రాజులవలెనే రాణులును లాంఛనములను, పరివారమును, ఆభరణములను కలిగియుండిరి. జాతకకథాశిల్పములలో చాల వాటిలో రాజులును, రాణులును, రాజాంతఃపురములును కనిపించుచున్నవి.

అన్నివర్గములకు చెందినవారును, స్త్రీలును పురుషులునుకూడ, ఎన్నియో ఆభరణముల నుపయోగించుచుండిరి. వీటిలోని వైవిధ్యము శిల్పమున గాంచనగుచున్నది.[60] చటులా తిలకమణి మున్నగు శిరోభూషణములు; చూడామణి, మకరిక, మృష్టకుండలములు, మకరకుండలములు, మృణాలకుండలములు, కాంచనతాలపత్రములు, కర్ణికలు, త్రికంటకలు, బాలికలు మున్నగు కర్ణభూషణములు; ఏకావలి, యష్టి, శీర్షకము, అపవర్తకము, రత్నావలి, ప్రకాండకము, ఫలకహారము, కంఠిక మున్నగు కంఠభూషణములు; ఫలకవలయము, మణిబంధనము, రత్నవలయము, కనకదోరము, జాలవలయము; బహువిధము లగు రత్నాబంధములు; అంగుళీయకములు మున్నగు హస్తభూషణములు; కాంచీ, రత్నమేఖల, మణిమేఖల, కాయబంధము, వేశనము మున్నగు కటిభూషణములు; మంజీరము, నూపురము, కింకిణి మున్నగు పాదభూషణములు; ముక్తాయజ్ఞోపవీతము, ఉదరబంధము, వైకక్షకము, మున్నగు నితరాభరణములు అసంఖ్యాకములగు భేదములతో శిల్పమున గలవు. సాతవాహనయుగపు శిథిలములను ఖననము చేసినప్పుడు కొండాపురము మున్నగు చోట్ల వీటిని పోలు ఆభరణములు బంగారముతో చేయబడినవి, మట్టితోను, ఎముకతోను, శంఖముతోను చేయబడినవి దొరికినవి.

ఆభరణములవలెనే వస్త్రధారణమునకూడ నాటి జనులు చక్కని అభిరుచులను కలిగియుండిరి.[61] జనుగు బాటుగలవారును, రాజవంశీయులును సన్నని వలువలను ధరించుచుండిరి. వాటికి చిత్రవిచిత్రములగు అంచులుండెను. ప్రతివారును అంతరీయమను కట్టుబట్టను, ఉత్తరీయమను పైబట్టను ఉపయోగించుచుండిరి. స్త్రీలలో ఊదా, ఎఱుపు రంగుల చీరలప్రశంస కలదు. భిక్షుభిక్షుణీలు కాషాయవస్త్రములను ధరించుచుండిరి. ఈ పంచలను కట్టుటలో పంచకచ్ఛము, విరుపుకట్టు, హస్తితుండకము, మత్స్యవాలకము, గుల్ఫావలంబి మున్నగు అనేకవిధము లుండెడివి. అమరావతీశిల్పములలో నొకదానియందొక స్త్రీ అర్ధోరుకమును (లాగు) తొడిగికొని నట్లున్నది. భిక్షువులు ఒక కాషాయాంబరమును

60. చూ. C. Sivaramamurthi—Amaravati Sculptures లోని అమరావతీశిల్పముల చిత్రములు.
61. Ibid. ఈవిభాగమును రచించుటలో శ్రీ శివరామమూర్తిగారి పైగ్రంథము ఎక్కువగ నుపకరించినది.

ధరించి మరియొకదానిని వల్లెవాటుగ కుడిచేతి క్రిందనుండి పైకి తీసి ఎడమభుజమున వేసుకొనుచుండిరి.

ఆనాడు స్త్రీపురుషులు సౌందర్యపోషణము నెడల మిక్కిలి ఆసక్తి కలిగియుండిరి. వారి అభిరుచులు మిక్కిలి ప్రశంసనీయములు. రాజాంతఃపురములలోను, ధనికుల యిండ్ల యందును అలంకరణమున నేర్పరులగు సైరంధ్రు లుండిరి. స్త్రీలు పాదములకును, గోళ్ళకును ఆలక్తకమును వేయుచుండిరి. ఆనాటి శిల్పములలో తైలపాత్రలు, దువ్వెనలు, అద్దములు, అంగరాగము, మాల్యములు మున్నగునవి గాంచనగుచున్నవి. స్త్రీపురుషులు తమ శిరోజములను అనేకవిధముల ముడులుగను, జడలుగను ధరించుచుండిరి. అట్లే వానిని స్థానమునందుంచుటకు బహువిధములగు ఉపకరణము లుండెడివి.

సాతవాహనయుగము వంకలి శిల్పములనుండి నాటికట్టడములనుగూర్చి విశేషాంశములు తెలియనగుచున్నవి. సామాన్యముగ నగరములచుట్టును ఎత్తైన ప్రాకారములుండెడివి. వాని అడుగున కందకము లుండెడివి. వీనిలో అనేకద్వారములును, ద్వారములకు ముందు తోరణములును ద్వారబంధములును ఉండెడివి.[62] ఈతోరణములు శిల్పశోభితములై అలంకారప్రాయములై యుండెడివి. ఒకప్పుడు భవనములముందును ఇట్టి తోరణము లుండెడివి. గృహములలోపల నుండిన వానికి తలుపు లుండెడివి. ఆనాటి ప్రాసాదములు అనేకవిధములు, పెక్కు అంతర్వులు గలవి. అడుగుఅంతరువులో పెక్కుస్తంభములుండెడివి. పై అంతరువులకు పోవుటకు మెట్లుండెడివి. ప్రతిఅంతరువునకు మధ్య గదులును, చుట్టును వరండాలు నుండెడివి. పై అంతరువున బహురూపములుగల వల్లభులును వానిపైన గుఱ్ఱపులాడమువంటి కప్పులు నుండెడివి. ఈ భవనములలో శాలలు, నివేశనములు, క్రీడాగృహములు, శుద్ధాంతములు, మంటపములు, కూటాగారములు, కపోతపాలికలు, గవాక్షములు మున్నగునవి ఉండెడివి. ఇట్టి భవనములుగాక సామాన్యగృహములును, పూరిగుడిసెలునుగూడ ఉండెడివి. ఇవిగాక దేవప్రాసాదములును, చైత్యగృహములును, విహారములు అనేకవిధములైనవి ఉండెడివి.

ఆనాటి వివిధవర్గముల ప్రజలు ఉపయోగించిన ఆసనములనుగూర్చియు, ఉపకరణములనుగూర్చియు వివరములు తెలియుచున్నవి. ఆసనములలో సింహాసనములు, పర్యంకములు, అర్ధపర్యంకములు, ఆసందులు, మంచములు, ఉండెడివి. భోజనఫలకములు, వానితో ప్రత్యేకాసనములు, ముక్కాలిపీటలు, పాదపీఠములును ఉండెడివి. ఇవిగాక బహువిధములగు పేటికలు, కరండికలు గనవచ్చుచున్నవి.

ప్రయాణసౌకర్యమునకై నాటివారు అనేకవిధములగు వాహనముల నుపయోగించుచుండిరి. ఎద్దుబండ్లలో సామానుబండ్లును, యానములు నుండెడివి. మంటపములవంటి శిబికలు, చక్కగ నలంకరింపబడిన పడవలును నాడు ఉపయోగింపబడెడివి.

ఆనాడు బహువిధములగు పాత్రలు వాడుకయందుండెడివి. నీటిని, ధాన్యములను ఉంచుకొను పెద్దపెద్ద బానలు, వానినుండి ఆయాద్రవ్యములను తీసికొనుటకు చిన్న చెం

62. చూ. సాంచీద్వారములు. నేటి ఓరుగల్లుకోటలో నాలుగు ద్వారములు గలవు.

బులవంటి పాత్రలు, విశాలములైన బౌళీలు, తబుకులు, గరిటెలు, చెంబులు, ఝూరీలు, గ్లాసులవంటి పానపాత్రలు, మనోహరములగు కలశములు ఆనాడు ఉపయోగింపబడెడివి. నేటికిని మనయిండ్లలో గాంచనగు చాటలు, రోళ్ళు, రోకళ్ళు, తిరుగళ్ళు నాడును ఉండెడివి. బహువిధములగు దీపములు, బళ్ళు, జంతువులు, బాణములు, ధనుస్సులు, గిలకలు మున్నగు పిల్లల ఆటవస్తువులు నుండెడివి.

శాతవాహనయుగమునాటి ప్రజలు నృత్తసంగీతప్రియులుగ నుండిరి. పల్లెపట్టులలోసహితము ప్రజలు వీణాదిజంత్రవాదమునందును, గాత్రగానమునందును అనురక్తులుగ నుండిరి.[63] పండుగలలోను, పర్వములందును నృత్తవాద్యములు సాగుచుండెడివి. నాగరికజీవితమునందును, రాజగృహములలోను ఇవి ప్రాముఖ్యములు. వీణలలో ధనురాకారముకలవియు, Guitar ఆకారము కలవియు ఉండెడివి. ఇవిగాక వేణువు, శంఖము, పటహము, మృదంగము, మర్దలము మున్నగు వాద్యము లుపయోగింపబడెడివి. నృత్యమానాడు అన్నివర్గముల ప్రజలలోను వ్యాప్తియందుండెను. గాథాసప్తశతినుండి పల్లెపట్టుల జను లీవిద్యతో వినోదించుచుండిరని తెలియనగుచున్నది.[64] అమరావతీశిల్పములలో రాజాంతఃపురమున నడచిన నాట్యమును, బుద్ధుని యవశేషముల విభజన జరిగినప్పుడు నడచిన నాట్యమును చిత్రింపబడినవి. మరియొక పలకమీద దేవతల నృత్యము కలదు.

సప్తశతిలోని గాథలలో ఆనాటి పల్లెపట్టుల జీవితము చక్కగ చిత్రింపబడినది. గ్రామములలో నగరములలోవలె తీర్చిదిద్దిన సదుస్సైన మార్గములు లేక వర్షము కురిసినప్పుడు రాకపోకలు దుష్కరములుగ నుండెను. గ్రామమును చుట్టును విశాలమగు హాలక్షేత్రము లుండెను. హాలికులు దానిని దున్ని శాలిధాన్యము, తిలలు, చెరకు మున్నగు ద్రవ్యములను పండించుచుండిరి.(65) ఈచెరకునుండి గుడయంత్రములమూలమున బెల్లమును తయారుచేయుచుండిరి.[66] జనుల స్థితిగతులనుబట్టియు, అవసరములనుబట్టియు అనేకరకముల యిండ్లు నిర్మింపబడుచుండెను. వానిలో గోడలమీద రామాయణమహాభారతాదులలోని పుణ్యశ్లోకుల చరిత్రములలోని ఘట్టములు వర్ణములలో చిత్రింపబడెను.[67] ఈయిండ్లలో వ్రేలాడగట్టిన పంజరములలో శారిక లుండెడివి.[68] ప్రధానమార్గములలో దేవమందిరము లుండెడివి.(69) గ్రామణిగ్రామమునకధిపతిగనుండి శాసించుచుండెను. నాటి కుటుంబములు సమిష్టిగనే ఉండెను. దేవరప్రణయము[70] ఋతుమతియైన స్త్రీ ముఖమునకు వహ్నిఘృతలేపన మొనర్చుకొనుట,[71] స్త్రీలు స్నానము చేయునప్పుడు వివిధ పసుపును,[72] మలాపనోదనార్థము జంబూకషాయము నుపయోగించుట,[73] యువతుల ప్రథమసంగమానంతరము మదనపటమును ప్రదర్శించుట,[74] హరితాళాదిద్రవ్యములతో ముఖమునకు రంగులు వేసికొనుట,(75) సురతలో భాగముగ మదిరాపానము చేయుట,

63. గాథాసప్తశతి VI—60 64. Ibid VII—85. 65. Ibid VII—89, 93
66. Ibid VI—54. 67. Ibid I—35, III—17. 68. Ibid VI—52. 69. Ibid II—90
70. Ibid I—35. 71. Ibid I—22. 72. Ibid I—80, III—46, 73. Ibid II—89.
74. Ibid V—85. 75. Ibid I—9.

(76) సంతతికి దంతములు వచ్చువరకును రతి విరమణము,(77) పండగలలో స్త్రీలు ప్రతి యింటను వాయనము లిచ్చుట,[78] అంగారకవార అవిష్టిదివసములను అపశకునములుగ పరిగణించుట,(79) మంగళాచరణ పూర్వకముగ ప్రారంభించి శేషహోమనాగవల్లీక్రియలతో వివాహము సమాప్తి చేయుట(80) నాడు ఉండిన కొన్ని ఆచారవిశేషములు. అప్పటి ప్రజలు శ్యామశబల,అగ్నివానీయ,చతుర్థీవ్రతములను, హోలికోత్సవ, ఫాల్గునోత్సవ, ఉత్ఫుల్లికా, చూతలతికా, మధూత్సవాదులను ఉత్సాహముతో చేయుచుండిరి.[81] నృత్యవాద్యవీణా వాదన రేఖావర్ణ చిత్రరచనములు నాటివారి వినోదములు.

వాత్స్యాయనకామసూత్రములలో ప్రసక్తానుప్రసక్తముగ సాతివాహనయుగపు నాగరికజీవితము వర్ణింపబడినది.[82] మంచినీటి సదుపాయముగలిగి చక్కని ఉద్యానమును వేసికొనుట కవకాశముగలచోట ఇంటిని కట్టుకొనవలెనట. అందు రహస్యముగనుండుట కనువగు భాగముండవలెనట. ఇంట అనువగు మంచములు, కుర్చీలు, బల్లలు, సుగంధద్రవ్యములు, జంత్రగాత్రసాధనములు, తాంబూల ద్రవ్యములు, పుస్తకములు, ద్యూతఫలకము, పక్షులుగల పంజరములు, అద్దములు నుండవలెనట. కాలకృత్యములను, నిత్యకృత్యములను దీర్చుకొనినపిమ్మట నాగరికుడు శుకశారికలతోను, లావకకుక్కుటమేషయుద్ధములతోను పొద్దుపుచ్చవలెనట. నైమిత్తికవినోదములలో నీక్రిందివి ముఖ్యములు:—

(1) ఘటానిబంధనము— దేవతల నుద్దేశించి నాగరికులందరు నొకచోట చేరి సాముదాయికముగ నిర్వహించెడి ఉత్సవము ఘటా అనబడును. పక్షముయొక్కగాని, మాసముయొక్కగాని అంత్యదినముననో లేక గణేశచతుర్థీ, సరస్వతీపంచమీ, శివాష్టమీ మున్నగు పర్వదినములయందో దానిని చేయవలెను. అప్పుడు స్థానికులు నితరస్థలములనుండి వచ్చినవారు నగు నటనర్తకాదులు తమతమ విద్యలను ప్రదర్శింపవలెను. (2) గోష్ఠీసమవాయము— దీనిని స్వగృహమునగాని, మిత్రగృహమునగాని, వేశ్యాభవనమునగాని జరుపవలెను. ఇందు సమానవిద్యాబుద్ధిశీలవిత్తవయస్కులును, విద్యాలావణ్యాశోభితలగు వేశ్యలును సమావేశమై భరతశాస్త్రమునుగూర్చిగాని, కావ్యములనుగూర్చిగాని చర్చలు చేసి, సమస్యాకల్పనపూరణాదికములు సాగించి తుదకు ఒకరినొకరు సత్కరించుకొందురు. (3) సమాపానకము— పైన చెప్పబడినట్లే సమానులైన నాగరికులు తడవకు ఒక్కొకరియింట పక్షమున కొకసారియో, మాసమున కొకసారియో సమావేశమై మధుమైరేయాసవాదులను త్రాగుదురు. (4) ఉద్యానగమనము—ఉదయముననే ఉద్యానమునకు పోయి మధ్యాహ్నము కుక్కుటలావకమేషయుద్ధవ్యాపారాదులతో వినోదించి, సాయంకాలమునకు ఇంటికి మరలుదురు. ఇవిగాక నాటి నాగరికులీక్రింది క్రీడలతోను వినోదించుచుండిరి— (1) యక్షరాత్రి— దీనికి సుఖరాత్రి అనియు, పక్షరాత్రి అనియు పేర్లుండెను. ఇది మాఘ

76. Ibid VI—50. 77. Ibid V—48. 78. 79. Ibid III—61.
80. Ibid VII—42, 43, 44. 81. Ibid III—11; VI—69; VI—35, 45.
82. అధికరణము-౧, అధ్యాయము ౪ నాగరిక వృత్తి ప్రకరణము.

శుక్ల పంచమినాడో, కార్తికపూర్ణిమినాడో జరుపబడెడిది. ఇందు ప్రధానముగ జూద మాడబడుచుండెడిది. (2) కౌముదీజాగరము— ఇది శరదృతువులో ఆశ్వయుజశుద్ధపూర్ణిమ నాడు జరిగెడిది. వెన్నెలలో నాగరికులు రాత్రియంతయు జాగరణముచేసి ఉయ్యెల లూగుట, జూదమాడుట, దేవతలను పూజించుట, అనేకవిధముల వినోదించుటతో కాలక్షేపము చేయుచుండిరి. (3) సువసంతకము— దీనికి మదనోత్సవమనియు పేరు. వసంతసవరాత్రములనుపేర ఈయుత్సవమును తొమ్మిది దినములు చేయుటయు కలదు. ఇందు ప్రధానముగ నృత్యగీతవాద్యములును, శాస్త్రచర్చలును, పండితగోష్ఠులును, నాటకప్రదర్శనములును జరిగెడివి. (4) సహకారభంజిక—నాగరికు లనేకులు సఖిజనపరివృతులై తియ్యమామిడితోటలలోనికి పోయి, చెట్లక్రింద జేరి, ఎగిరి మామిడి పండ్లగుత్తులలోనుండి పండ్లను నోటితో పట్టుకొని కోయుట ఈయాట. (5) అభ్యూషఖాదిక— చేలలోనికి పోయి, శనగ కొట్టను, జొన్నకంకులను తెచ్చి ఒక చెట్టుక్రింద మంటచేసి, దానిలో వానిని కాల్చుకొని తినుట. (6) భిసఖాదిక— ఒక సరస్సులో దిగి, వంగి, నోటితో తామరతూండ్లనుఊడలాగుట. (7) నవపత్రిక— ఇది బయళ్ళమీదికిపోయి, తొలకరించినవెంటనే అంకురించు లేతగడ్డి మొక్కలను లీలగా విహరించుచు లేళ్ళవలె నోటితో ఊడపెరుకుటయని కొందరును, నేటి గుజ్జనగూళ్ళవలె చెట్లకు వివాహముచేయుట అని కొందరును తలచినారు. (8) ఉదకక్ష్వేడిక— నేటి హోలీకి సరియగును. నాగరికులు ఈక్రీడలో వెదురుతో చేసిన చిమ్మనగొట్టములతో ఒకరిపైనొకరు నీళ్ళను కొట్టుకొనుచుండిరి. దీనికి శృంగక్రీడ అనియు పేరుండెను. (9) పాంచాలానుయానము – ఉత్సాహముతో బొమ్మలపెండ్లిండ్లు చేయుట. (10) ఏకశాల్మలీ — చక్కగ విడచిన పుష్పములతో మనోహరముగనున్న బూరుగుచెట్టు నెక్కి, దానిపై క్రీడించుట. ఇది నేటి కోతికొమ్మచ్చికి సరియగును. (11) యవచతుర్థీ — వైశాఖశుక్లచతుర్థినాడు నాగరికు లందరు నొకచోట చేరి సుగంధద్రవ్యములుకలిసిన యవచూర్ణము నొకరిపై నొకరు చల్లుకొనుట. (12) ఆలోలచతుర్థీ — శ్రావణశుద్ధతృతీయ నాడు ఉయ్యెల లూగుట. (13) మదనోత్సవము — మన్మథుని ప్రతిమను చేసి యువజనులు సమావేశమై దానికి అత్యుత్సాహముతో పూజలు చేయుట. ఇది చైత్రశుక్ల చతుర్దశినాడు చేయబడెడిదట. (14) దమనభంజిక — చైత్రశుద్ధద్వాదశినాడు దమనమునుకోసి ఒకరినొకరు అలంకరించుకొనుట. (15) హోలాక — దీనికి హోలీ అనియు, కామపూర్ణిమ అనియును పేర్లు. ఫాల్గుణపూర్ణినాడు కింశుకపరాగమునున్నగునవి కలిపిన రంగునీళ్ళను పిచికారీలతో ఒండొరులపై కొట్టుకొనుట. (16) అశోకోత్తంసిక — చైత్రశుద్ధాష్టమినాడు అశోకపుష్పములను కోసి ఒకరిశిరములను ఒకరు అలంకరించుట. (17) పుష్పావచాయిక — లీలగా పూవులను కోయుట (18) చూతలతికా — మామిడి చిగుళ్ళనుకోసి వానితో అలంకరించుకొనుట. (19) ఇక్షుభంజికా — చెరకుగడలను కోసి, వానిని ముక్కలుగ తరిగి, ఆముక్కలతో దండలు గ్రుచ్చి అలంకరించుకొనుట. (20) కదంబయుద్ధము — కృత్రిమాయుధములను చేసి, వానికి కదంబపుష్పములను తగిల్చి, వానితో

యుద్ధము చేయుట. ఇట్లు నాగరికులు నిత్యములును, నైమిత్తికములునగు క్రీడలతోను, కార్యములతోను వినోదించుచు జీవితముల నత్యుత్సాహముగ సాగించుచుండిరి.

ఆనాడు అగ్రవర్గములకు చెందిన స్త్రీలు ఎట్టి కళాకుశలలై యుండిరో, నాడు విద్యావతులుగను, కళానిరతలుగను ప్రసిద్ధిగాంచి సమాజమున గౌరవనీయమగు స్థానము గలిగి యుండిన గణికలు ఎంత సంస్కృతిని కలిగి యుండిరో వారువారు నియతముగ నభ్యసింప వలసిన కళలనుండి తెలియనగుచున్నది. వాత్స్యాయనుడు ఈకాలమునం దభ్యసింపబడుచువచ్చిన చతుష్షష్టికళలను పేర్కొనినాడు :—[83] (1) గీతము – ఇది స్వరగము, పదగము, లయగము, చేతోవధానగమునని నాలుగువిధములు. (2) వాద్యము – ఇది ఘన, తత, వితత, సుషిర అను భేదములు కలది. కాంస్యపుష్కరతంత్రివేణువుల వలన సాగింపదగినది. (3) నృత్యము – కరణాంగహారములతో విభావానుభావాద్యనుగుణముగ రసపోషకమగునటుల చేయునది. (4) విశేషకచ్ఛేద్యము – తిలకమును దిద్దుట (5) తండులకుసుమవలీవికారము – రంగురంగుల బియ్యపు గింజలను, పువ్వులను వివిధాకారములలో తీర్చుట (6) పుష్పాస్తరణము – పువ్వులతో మాలలు గుచ్చుట (7) దశనవసనాంగరాగము – పండ్లకును, వస్త్రములకును, శరీరమునకును రంగులు వేసుకొనుట (8) మణిభూమికాకర్మ – భూమిని వివిధవర్ణములమణులతో అలంకరించుట (9) ఆలేఖ్యము – చిత్రములను చేయుట (10) శయనరచనము (11) ఉదకవాద్యము – నీటిపైన మద్దెల మున్నగువానిపైన వలె వాయించుట (12) ఉదకాఘాతము – నేటి జలతరంగ్ వాయించుట వంటిది. (13) చిత్రయోగము – వివిధావస్థలకును, భావములకును స్ఫోరకములుగనుండునట్లు చిత్రములను అమర్చుట (14) మాల్యగ్రథనవికల్పము (15) శేఖరకాపీడయోజనము – శిఖలో అనేకాకృతులుగల చట్రములను పెట్టి పువ్వుల నమర్చుట (16) నేపథ్యప్రయోగము – వస్త్రమాల్యభూషణములతో శరీరము నలంకరించుకొనుట. (17) కర్ణపత్రభంగము – చెవులకు వివిధాభరణముల నుంచుకొనుట (18) గంధయుక్తి (19) భూషణయోజనము (20) ఐంద్రజాలము (21) కౌచుమారము – సుభగంకరణవిశేషము (22) హస్తలాఘవము (23) విచిత్రశాకయూషభక్ష్యవికారక్రియ (24) పానకరసరాగాసవయోజనము (25) సూచీవానకర్మ – కుట్టుపని (26) సూత్రక్రీడ – దారమును వ్రేళ్ళసందులలోనుండి పోనిచ్చి వివిధవస్తువులఆకారములు కలిపించుట (26) వీణాడమరుకవాద్యము (27) ప్రహేలిక (28) ప్రతిమాల (29) దుర్వాచకయోగములు (30) పుస్తకవాచనము (31) నాటకాఖ్యాయికాదర్శనము (32) కావ్యసమస్యాపూరణము (33) పట్టికావేత్రవానవికల్పము – మంచములకు పేమును అల్లుట (34) తక్షకర్మ (35) తక్షణము – వడ్రపుపని (36) వాస్తువిద్య (37) రూప్యరత్నపరీక్ష (38) ధాతువాదము (39) మణిరాగాకారజ్ఞానము (40) వృక్షాయుర్వేదయోగము (41) మేషకుక్కుటలావకయుద్ధవిధి – (42) శుకశారికాప్రలాపనము – చిలకలు, గోరువంకలు మున్నగువానికి మాటలు నేర్పుట (43) ఉత్సా

83. డిటో. అధి. ౧, అధ్యా. 3 విద్యాసముద్దేశ ప్రకరణము.

దనసంవాహన కేశమర్దనకౌశలము – శరీరము పట్టుట, కేశములను చక్కచేయుట (44) అక్షరముష్టికాకథనము – అక్షరములను మార్చియో, సంకేతాక్షరముల నుపయోగించియో చమత్కారముగను, గూఢముగను మాట్లాడుట (45) దేశభాషా విజ్ఞానము (46) పుష్పశకటిక (47) నిమిత్తజ్ఞానము – శకునములను తెలియుట (48) మ్లేచ్ఛతావికల్పము (49) యంత్రమాతృక – కదలెడిబొమ్మలను, వస్తువులనుచేసి, నడిపించుట (50) ధారణమాతృక – చూచినదానిని, వినిన దానిని జ్ఞాపక ముంచుకొనుట (51) సంపాఠ్యము – తాను వినని గ్రంథమును మరియొకరు చెప్పుచుండగ, వారితో కలసి దానిని చెప్పుట. (52) మానసీ (53) కావ్యక్రియ (54) అభిధానకోశము (55) ఛందోజ్ఞానము (56) క్రియాకల్పము – కావ్యాలంకారము (57) ఛలితకయోగములు (58) వస్త్రగోపనము (59) ద్యూతము (60) అకర్షక్రీడ (61) బాలక్రీడనకములు (62) వైనయికీయవిద్య – ఏనుగులు మున్నగువానిశిక్షణము (63) వైజయకీయవిద్య – అస్త్రవిద్య (64) వ్యాయామికానవిద్య – వేట మొదలైనవి.[84]

ఇట్లు శాతవాహనయుగమునందలి సాంఘికజీవితము శాంతియుతమును, శోభావంతమునై ఉత్తమశ్రేణికిచెందిన సభ్యత కాలవాలమై యుండెను.

---

84. ఈ కామసూత్ర గ్రంథము క్రీ. శ. 3శతాబ్దినాటిదిగ నిర్ణయింపబడినది. JARS. Oct. 1930 pp. 930—932.

# హాలుడు - గాధాసప్తశతి

శ్రీ గట్టి నరసింహశాస్త్రి

శకప్రవర్తకులైన మహాపురుషులలో, ముఖ్యంగా చెప్పుకోతగినవాడు, శ్రీశాతవాహనుడు. శాతవాహనుడు క్రీస్తుశకం ఒకటవ శతాబ్దంలోనివాడు. దక్షిణాపథంలోని ప్రతిష్ఠానపురం ఇతని రాజధాని. తండ్రి దీపకర్ణి. హాలుడు, శాలుడు, సాలవాహనుడు, సాతవాహనుడు అని శాతవాహనునకు పర్యాయనామములు. అవి వాని జన్మకర్మమహిమాదులద్వారా ప్రాప్తించి, సార్థకమైనవి. పూర్వం అతడొకయక్షుని కుమారుడనీ, సింహరూపముతోనున్న సాతుడు అనే యక్షుని వాహనంగా చేసికొనివచ్చి, సంతానహీనుడైన దీపకర్ణికి, కుమారుడుగా ఏర్పడి, తదాది అతడు సాతవాహనుడు అయినాడనీ కథాసరిత్సాగరాదులద్వారా శాతవాహనచరిత్రం, కొంత చిత్రవిచిత్రంగా లభించుతూన్నది.

హాలుడు విద్వదగ్రణి. ఆతని సభాభవనం దిగ్గజాలవంటి ఉద్దండపండితులతో కవికులతిలకులతో అనుదినం ఇంద్రసభలాగ శోభించుతూ ఉండేది. బృహత్కథాప్రణేత అయిన గుణాఢ్యుడు, కాలాపవ్యాకరణకర్త అయిన శర్వవర్మ మొదలైన మహాపండితులెందరో శాతవాహనుని సభామందిరంలో మండనాయమానులై ఉండేవాడు;

హాలుడు స్వయముగా మహాకవి. రసికమూర్ధన్యుడు. అందుకుతోడు ఆతని పట్టమహిషి మలయవతి సంస్కృతాదిభాషలలో, కవితలో అపారప్రజ్ఞగలది. మలయవతిసముల్లాసంకోసమేమి, తన రసవత్కవితాపక్షపాతం ప్రేరేపించడంచేతనేమి, భారతదేశభాగ్యవైభవంచేతనేమి శ్రీశాతవాహనకవిరాజు అనుదినం కవిపండితసభలు చేయించుతూ ఉండేవాడు. ఆతని సభాభవనంలో శారదాదేవి అనుదినం ఆనందతాండవం చేస్తూ ఉండేది. అలా కవిజనకల్పద్రుమాయమానుడైన ఈమహీజాని ఆస్థానంలో, పలువురు కవివరులు ఆశ్రయం సంపాదించి, సన్మానములు పొందుతూ ఉండేవారు. పలువురు శాలివాహనుని గౌరవసన్మానములాసించి, దూరదూరములనుండి వచ్చి, తమతమ పాండిత్యమును ప్రకటించుతూ ఉండేవారు.

కవితాకలాపకోవిదుడైన ఈభూవరుడు అతిచమత్కారికములై, రసవంతములైన ఆయాకవిశేఖరుల మధురకవితలను స్వజనులచేత పత్రములమీద వ్రాయించి, భద్రముగా దాచి ఉంచెడివాడు. అనంతరము సహస్రసంఖ్యలుగా సమకూరిన ఆయారచనలలో సుమధురములై ఉన్నతములైనవానిని ఏరి, ఆయాకవుల కీర్తివైభవములను లోకములో శాశ్వతముగా నిలబెట్టుటకు ఏడుశతకములుగా సంగ్రహించి ప్రకటించినాడు. ఆఉత్తమోత్తమగ్రంథరాజమే గాథాసప్తశతి. అట్లా ఆయాకవులకు ఆశ్రయమిచ్చి, సమ్మానించి, ఆయాకవులచే రచింపబడిన గాథలను సంగ్రహించి లోకంలో వారి కీర్తులను సుస్థిరముగా నెలకొలుపుటచేత హాలునకు 'కవివత్సలుడు' అను.

సార్థకబిరుదనామముకూడా కలిగినది. పైవిష యము గాథాసప్తశతి ప్రథమ శతకము మూడవగాథద్వారా స్పష్టమవుతున్నది—

" కవికులవత్సలుం డన జగమ్మునఁ గమ్మని కీర్తితోడ నై భవము గడించుకొన్న జన పాలుఁడు హాలుఁడు కూర్చె నేర్పుతో వివిధ ములౌ నలంకృతులఁ బేర్చిన గాథల నేడు నూర్లుగా, నవరసవాటియై బుధజనమ్ముల విందులు వెట్టు కోటిలోఁ " ౧-౩

అయితే—

"అవినాశిన మ్గ్రామ్య మకరోత్సాతవాహనః। విశుద్ధజాతిభిః కోశం రత్నైరివ సుభాషితైః॥"

అని బాణాదివాక్యప్రమాణాలద్వారా శాలివాహనుడే గాథాసప్తశతీగ్రంథకర్తగా గోచరించుతున్నది. కాని అది అలా జరిగి ఉండదు. మహారాజభోగాలలో మునిగి తేలుతూఉండే ఈసార్వభౌముడు తనచేతులారా అంత శ్రమ చేయపూనుకోలేడు. ఈమహారాజు అభిప్రాయమును గుర్తెరిగి, రాజసమ్మానాపేక్షతోనో, లేక మహారాజుచే అందుకు నియుక్తుడయియో తదాశ్రితుడైన కవిశేఖరుడొకడు, ఈగాథాసప్తశతిని, ఈరూపమున సంగ్రహించిఉండాలి. ప్రభునియోగము, లేదా ప్రభుసంతోషకారణము కావడంచేత అది తత్కర్తృకంగా, ప్రసిద్ధము ఉండాలి. అది నిశ్చయమే అనక తప్పదు. కారణం నిజగుణశ్లాఘచేత సంతుష్టుడై శాలివాహనభూనేత, విశేషధనాములొసగి నన్ను సమ్మానించగలడు— అన్నలాలస ఈసంగ్రహకర్తకు అతిశయితంగా ఉన్నట్లు ఈక్రిందిపద్యాలలో గోచరించుతుంది —

"చటుల రణమేఘసమయ భీ చలిత విహ్వల స్వపక్షాల్ విపక్షు లెల్లఁ బరిశేషితేనపద్మాకరలఁ బడె నీ మానసమ్ము ననుసరించు మనుచున్నవా రంచలటులు." ౫-౩౧.

"చెట్టుకొనకొమ్మ యాకులఁ జిక్కియున్న చిన్న మామిడిపిందెను క్రిన్నఁ జూచి, చంటిబిడ్డఁ డాఁకటిఁ దూలి ఛాల యేడ్వ వేడుకొన దేవధికుని నీ విమతు గృహిణి?" ౬-౫.

ఇత్యాది గాథలు ఒకానొకరాజునుద్దేశించి, వానిని సంతోషపెట్టడానికి, తదభిముఖంగా నిండుకొలువులో నిలబడి పఠింపబడినవి అని అనడానికి సందేహం లేదు గదా? ఆరాజు కూడా, ఎవ్వరో కాదు. ప్రాకృతకవికల్పతరువైన శ్రీశాలివాహనుడే. అది గాథలోనే స్పష్టం. రాజును పరమేశ్వరునిచేసి కవీంద్రుడు పలికిన పలుకు—

"తప్ప లీనినకొలముల నొప్పు పెరిమ, నుదరింప నేర్చినవారి లోక యిరువురే; గిరిజ కూరుచుమగఁ డొండెఁ; గీర్తిశాలి శాలివాహన జనపాల మౌలి యొండె." ౫-౬౩

పైకారణాలద్వారా, గాథాసప్తశతీకోశ గ్రథకుడు శాలివాహనుడు కాడు. తదాశ్రితుడైన ఒకానొక కవిపుంగవుడు; అని అనడం సమంజసమూ, నిర్వివాదమూను. అయితే, ఆకవిపుంగవుడు, పైగాథలలోని ఆశయమును బట్టి, శాలివాహనునిచేత, విశేషధనాములతో పాలితుడై ఉండాలి. అందుకు తగినట్లుగా—

"హాలే నోత్తమపూజయా కవివృషః శ్రీపాలితో లాలితః" ఇత్యాది రామచరితమహాకావ్యాదిప్రమాణాలద్వారా — పాలితుడు అనే కవిపుంగవుడు, గర్భదరిద్రుడై, ద్రవ్యాసక్తిచేత స్వప్రభువైన హాలునిపేర, గాథాసప్తశతిని సంగ్రహించి ఉండవచ్చునని ఊహించడానికి మంచి అవకాశం కలుగు

తోంది. శాలివాహనునిచేత పలితుడు కాక పూర్వము పాలితునకు, ఆపేరుకూడా ఉండి ఉండదు, అని మనం ఊహించవచ్చు.

శాలివాహనునికాలములో ప్రాకృతభాష అత్యుచ్చస్థితిలో ఉండి, సర్వాంగశోభితమై, సమ్యగలంకృతమై, సాహిత్యసౌధాగ్రహానికి సంపూర్ణాధికారం గడించి అప్రతిహతంగా ఉన్నది. ఆకారణంచేత, శృంగారాదులలో సరసవర్ణనలలో, ప్రాకృతవాణికంటె మధుర మధురమై అమృతమయమైన వాణి మఱొకటిలేదని మహాకవులంటూ, ప్రాకృతము లోనే, తమకవితాసూక్తులను వెదజల్లేవారు. ఆనాడు, సంస్కృతము, ప్రాకృతం ముందు ఒకచిన్నమిణుగురుపురుగుకూడా కాదు. అందువలననే, ప్రాకృతగాథలతో హాలుని గాథాసప్తశతి కూర్పబడినది. గాథారత్నకోశమను గ్రథించుతూ, సంగ్రాహకుడు, ఉద్దేశముచే సూచించి—

"చిలుకునం బల్కునం జవులు చిప్పిలునట్టి నవామృతంపుజాల్ పలుకునం బల్కునం గురియు ప్రాకృతకావ్యము చిత్తహారి యై నెలకొనంగా బఠంప విన నేరనివారలు వారలెట్లు లజ్జలరు సుమాత్రశాస్త్రపరిశీలనముం దలపెట్టుపట్టుదుర్?" ౧—౨.

అని గ్రంథారంభంలో తన ప్రాకృత కావ్యమును చదువనివారికి శృంగారరసంలో దిగడానికి అధికారమే లేదని, తనకావ్యము నిరూపించని శృంగారము మఱెక్కడా దొరకబోదని, ప్రతిజ్ఞగా పలుకుతూ, ప్రాకృత భాషను స్తుతించినాడు. అలాగే ఆరోజులలో అమృతం ప్రాకృతకావ్యమ్— అని అంతటా మాఱుమోగింది. దీనినే వివరించుతూ సరస్వతీకంఠాభరణకారుడు—

"కే నాస న్నాఢ్యరాజస్య రాజ్యే ప్రాకృతభాషిణః? కాలే శ్రీ సాహసాంకస్య కే న సంస్కృతభాషిణః?"

అని నుడివినాడు. అనగా— శాలివాహనుని రాజ్యములో, ప్రాకృతము పలుకనివాడు; విక్రమాదిత్యుని కాలములో సంస్కృతము పలుకనివారు కలికానికైనా లేరట!

గాథాసప్తశతి, ముక్తకకావ్యసంగ్రహం అని అనబడుతుంది. ముక్తకము అంటే ఇతరసంసర్గం అంటే ఇతరగద్యాపద్యాదికముల ఆవశ్యకం లేకుండా, చెప్పదలచుకొనిన గాథను స్వతంత్రంగా, తనకుతానే చెప్పివేయగలది. ప్రబంధములో మధ్యగతమైఉన్నా, ముక్తకం, పరిసమాప్తిలోగాని, మఱి ఏ ఇతరఅంశాలలోగాని, మఱొకదాని ఆకాంక్ష లేకుండానే స్వతంత్రంగా ప్రవర్తించగలదు. ఇట్టి ముక్తకాలను నిర్మించడం సాధారణకవికి సాధ్యపడదు. ముక్తకం, నిట్టనిలువు రస ప్రవాహనిర్భరంగా ఉంటుంది. దానిని, నిర్మించవలెనంటే, అందలి ప్రతిపదము రస స్ఫోరకమై, పొల్లుపోనిదిగా ఉండాలి. అందలి వస్తువుకూడా, రసానుకూలమైనదిగా ఉత్తమోత్తమమైనదిగా ఉండాలి. కాబట్టి, ఇట్టి ముక్తకములను, సరస్వతీమూర్తులైన మహాకవులు, నిర్మించాలి. అట్టి మహాకవుల ముక్తకసూక్తిముక్తాఫలములనే ఏరి, గాథాసప్తశతీ రత్నకోశములో, గ్రథింపబడినవి. గాథాలక్షణములో, ఉపదేశింపబడుటచేత, అవి సప్తశతిలో గాథలుగా, వ్యవహరింపబడుతూన్నవి. (గాథకు— ప్రథమ, తృతీయపాదములలో, పన్నెండు మాత్రలు, ద్వితీయపాదములో, పదునెనిమిదిమాత్రలు; చతుర్థపాదములో,

పద్యనైనమాత్రలు, ఉంటవి. లక్ష్యమును మూల(గ్రంథములో చూచుకోవచ్చును.)

గాథాసప్తశతిలో, అట్టి మహాకవులు, సుమారు 350 మందికి పైబడి తమకవితా సూక్తులద్వారా మనకు గోచరించుచున్నారు. వారిలో, స్వయంగా హాలుడు, పాలితుడు కూడా ఉన్నారు. అణులక్ష్మి, అనులబ్ధ, రేవ, మాధవి, మొదలైన కవయిత్రులుకూడా ఉన్నారు. హాలుడు, ఎంతరసికుడో, ఎంత శృంగారపురుషుడో, ఆతని ఈగాథద్వారా విశదమౌతుంది—

అంతగా లోబడి, బొత్తిగా వెట్టిబాగుల దానివి కాబోకు; సమయం చూచి, కొంచెం కోపం తీర్చుకొని, పట్టుదలతో, దయితాను నయసుఖం అనుభవించు. యథార్థంగా, అప్పుడుగాని, ప్రణయంలోని లోతుపాతు, పరమమైన సుఖానుభూతి, విశదపడవు—అని, కోప పాఠం ఉపదేశించుచూన్న సఖురాలితో, నాయిక, మృదులమృదులమైన తనహృదయ దశను విశదపఱచుతూ అంటుంది—

"ఎడపినయంత సుంత ఎడంజే, యొక ప్రొద్దున రాని నిద్దురకై వడంబడి, వెల్లంబాఱి, తనువల్లిక తూలుట, అస్సురుస్సులున్, పొడవవు వేడియూర్పులును, పుట్టి పోసంగునో, అల్లవాని కేర్పడి సరివచ్చుపాటి దాకొ, పన్నుడు నెంతటి కోపమేనియున్!" ౪-౭౪.

పాలితుని కవితాసూక్తి—

జాలిపడి సహాయపడుతూన్నట్లుగా, సమీపించి ఒక జవరాలితో, స్పర్శసుఖానుభవం ద్వారా, తన అభిలాష తీర్చుకొంటూన్న ఒక యువకుని చూచి, రసికుడొకడు పరిహాసంగా—

"చెవి నిడుకొన్న క్రొత్త శిరిచెందొవ పూవులలోని పుప్పొడుల్ పవనసమీరితమ్ములై యు వాలున వచ్చి పడం గలంగు నాయువిద మెఱుంగు పెద్దకను లుఫ్ఫన నూదుచుం దేపెం గాంచుచుంటివి వలకారి ముద్దుల ను; నీ వని మేఘులలో నెవండవో!" ౨-౬౬.

అణులక్ష్మి కవితకు ఉదాహరణ—

కపటానురాగంతో, పైపై మెఱుగులు చూపుతూన్న నిన్ను నమ్మి, చాలా మోసపోయాను, అని నాయకుని నిందించుతూ, ఒక పూవుబోడి అన్యాపదేశంగా—

"పచ్చని ఆకుకొంపములు, పండిన మొఱ్ఱని పంక్తిగుత్తులై ముచ్చట సూపెనట్టి శుకముల్ వెఱ నార్చుచు లేచిపోవఁగా, నచ్చెరియమ్ముతోడ నగి రిల్లన శుష్కవటమ్ముఁ జేరఁగా వచ్చిన పాంథు లందఱును పల్మఱుఁ గొట్టుచుఁ బెద్దచప్పటుల్" ౩-౬౩.

అనులబ్ధ కవితకు ఉదాహరణ—

స్త్రీలకు ఎడమకన్ను అదరటం శుభసూచకమని విని ఉన్న ఒక ప్రోషితపతిక, తన యెడమకన్ను అదిరిగా, ఇక తన ప్రియతముడు, ప్రవాసమునుండి ఇంటికి తిరిగి రాగలడు— అనే సంతోషంతో ఎగసిపడుతూ, ఆఎడమకన్నును పరితోషించి—

"వామనయనమా! నీశుభస్పందనమున, ప్రాణదయితుఁడు వేగను వచ్చెనేని, పొనరి దక్షిణనయనమ్ము మూసివేసి, వానిఁ గనుఁగొంచుఁ జిరము నీద్వారమునన" ౨౩-౭

గాథాసప్తశతిలో, ఈపద్యానికి అగ్రస్థానం ఈయబడి ఉన్నది.

రేవ—

ఒక ఖండితానాయిక నాయకునితో,

"చేయ వింతకు ము న్నెన్ని? చేయఁ బోవు మీఁద నిఁక నెన్ని? చేతిలో మెలఁగ వెన్ని యిపుడు తప్పు లేనేవి క్షమింపవలయు నోడువుము సుభగుఁడా! సిగ్గు విడిచినావు"

౧-౮౧.

మాధవి కవిత—

అనునయాదులకు దిగక దుర్విదగ్ధుడైన నాయికుని మందలించడానికి, మాతిక—

"ఎగసి అధికారముం బ్రకటింప రెవరు? కోపగించిన బ్రతిమాలుకొందు రెవరు దాసు లటులు? వారలె నెలంతలకుఁ బ్రియులు; తక్కుఁగల దర్శిరములు మెత్తటి మగలు."

౧-౮౧.

సప్తశతిలో మొదటినుంచి చివరిదాకా, శివపార్వతీస్తుతి, లక్ష్మీనారాయణ మంగళ స్తుతి రూపమైన శృంగారము వర్ణింపబడి యున్నది. నమమనమమ గణపతి స్తుతింపబడి నాడు. అక్కడక్కడా సరస్వతీస్తోత్రము కూడా కలదు. వీనినిబట్టి సనాతనధర్మపక్షపాత మూలగ్రంథములో స్పష్టమవుతున్నది. కాని, ఆకాలములో, భారతదేశములో బౌద్ధ ధర్మము సమూలముగా అపాస్తమై, చర్చా మాత్రముగానైనా లేదని ఊహించ వీలు లేదు. ఈసప్తశతిలోనే అచటచట బౌద్ధభిక్షు వుల ప్రస్తావనకూడా గోచరించుచున్నది—

"హాలువు వహించె రాచిలుక ముక్కుల పోల్కిని గన్నువిందులై యలరు పలాశ పుష్పనిచయంబులతో వసుధాతలంబు, బౌఁ దలఁ గొని బుద్ధదేవునిపదంబుల నానమితోత్త మాంగులై విలసితభక్తిఁ జాఁగిలిన భిక్షు గణంబులతోడనట్లుగాఁ"

౪-౮.

పీతశ్యామవర్ణశబలములైన కింశుకపుష్పములు నేలమీద అంతటా కప్పుకొని పడి ఉన్నవి. అవి— నడుమ కూర్చొని ఉన్న బుద్ధుని పాదములకు సాష్టాంగదండప్రణామములు చేయుటకు నేలపై పడిన వేలకొలది భిక్షువులులాగా ఉన్నవి.

వీనిలో— నల్లని కింశుకసునువృంతములకు శిరస్సులకు పోలిక. వానిపత్రములు పచ్చగాఉండటచేత పీతవస్త్రసాదృశ్యము చిత్రింపబడినది. ఇలా ఆకాలములో ఉన్న బౌద్ధోపదేశసమాజమును చిత్రించు సప్తశతి నాటి బౌద్ధవాసననుకూడా సూచించుచున్నది. కాని, అనాడు లోకంలో బౌద్ధులు అంటే ద్వేషంకూడా ప్రబలిఉన్నట్లు పైగాథలటీకాకారులు అభిప్రాయములలో ప్రకటితమవుతున్నది. అంతియగాక ౫-౬౪వ పద్యములో వర్ణింపబడిన విక్రమార్కవిభుచరిత్రమునుబట్టి విక్రమార్కుడు ఈగాథాకోశనాయకుడైన శాలివాహనునకు సమకాలికప్రాయుడుగా విశదమవుతున్నది. ప్రబంధకోశములో "విక్రమాదిత్యసమకాలినపివాయం సాతివాహన" అని ఉల్లేఖింపబడి ఉన్నదికూడా.

గాథాసప్తశతి తడవిచూడని అంశం లేదు. సప్తశతీపర్యాలోకనం చేసినతరువాత జగత్తు అంతా బాణోచ్ఛిష్టం కాదు, గాథోచ్ఛిష్టం అనిపిస్తుంది. దేశదేశాలు, పట్టణాలు, పల్లెలు, కొండపల్లెలు, అడవులు, తిరిగి, నాగరికుల, గ్రామీణుల, ఆటవికుల, సంప్రదాయాలు, జీవనాలు, సునిశితంగా, సమగ్రంగా విమర్శించి లోకానికి అందజేయబడిన మనోహర సందేశాలే సప్తశతిలోని గాథలు, మనస్తత్వం, ప్రకృతి, లెస్సగా పరామర్శించి సిద్ధాంతం అందజేయడంలో సప్తశతి అందవేసిన చేయి. వలపునుగూర్చి గాథలనుమించిన విమర్శ ఎక్కడా లభించదంటే ప్రమాదం లేదు.

స్త్రీపురుషుల భావబంధాలెట్లా ఉంటాయో, ఉండాలెనో, నిజమైన ప్రేమస్వరూపం ఏమిటో, అది యెలా పరిణతి పొందుతుందో, ఆయా సంఘటనలలో, ఆప్రియునీప్రియయు లెలా వ్యవహరించుతారో, మున్నగునవన్నీ గాథలలో శృంగారరస పరిమేయమయములుగా చిత్రింపబడి ఉన్నవి.

ఆకారణముగా గాథాసప్తశతిలో మొదటి నుంచీ చివరిదాకా శృంగారరసమే వర్ణింపబడింది. ఆశృంగారరసముకూడా, సాధారణ స్థితిలో లేదు. ప్రగాఢ కాముకీకాముకుల ఉత్కట సంగమాభిలాషను, ప్రతి అక్షరములోను సూచించుతూ, చరమసీమకు అధిగమించింది. రజస్వలతో సంగమంకూడా ఇందులో పొందుపరచబడి ఉన్నది. ఈత్పల్లిక, అంటే కత్తి పీట ఆట ఆడుతూన్న కన్యను చూచి, విపరీత రతం ఉత్ప్రేక్షింపబడింది. రహస్యసంగములలో, సమయానికి తలగడగా ఏది చేతికి అందకపోవడంచేత, అక్కడి పూజామందిరంలో ఉన్న గణపతివిగ్రహం తలగడగా ఉపచరించినట్లు ఉల్లేఖింపబడి ఉన్నది. మండు వేసంగిలో, మంటలు మండిపోతూన్న మిట్ట మధ్యాహ్నపు పడమటిసంబరంలో పిట్టలునా వీధిలో ఆడని సమయంలో, మధ్యాహ్నాభిసారికల అభిసరణావ్యగ్రత్వం సమగ్రంగా సూచింపబడినది. అయితే, అంత నిరావరణంగా, అంత అమర్యాదంగా, అంత అనువర్తకంగా, శృంగారరసం ఈగాథాసప్తశతిలో వర్ణింపబడి ఉన్నది. అంటే, అది ఆనాటి సమాజపు అభిరుచినిబట్టియో, గాథాసంగ్రహ ప్రధానకారణమైన హాలుని అభిరుచినిబట్టియో, శృంగారరసవర్ణనలలో, ఆనాడు ప్రాకృతి భాష పొందిన గౌరవాన్నిబట్టియో, అలా పోసగి ఉంటుంది. అందుకు తగినట్లు, చక్కని స్వభావవర్ణనలు గల గాథలకు, వ్యాఖ్యానకారులు, ద్రవిడప్రాణాయామమున, శృంగార ప్రమేయమయములుగా అవతారికలు అవతరింపజేసినారు. "అమృతం ప్రాకృతకావ్యమ్" అన్న మొదటి శతకం, రెండవపద్యంలోని ప్రతిననుసట్టి, వారు, శృంగారరసమును చెప్పక తప్పదన్న అభినివేశంతో అలా చేసి ఉంటారు. ప్రాకృతదృశ్యాలను ఉన్నదున్నట్లు వర్ణించుతూ, సంస్కృతములో నిర్వహింప సాధ్యపడని శబ్దార్థములను, ప్రాకృతంలలో నిర్వహించి ప్రదర్శించడంచేత అది అస్పృశ్యమయినదని అనుటం ఉచితిలేదు. ఉదాహరణకు—

"కంటిరా, కొట్టమందు వెన్నంటి
నిలుచు పొల్లయాంబోతుకొమ్ములపట్టిగంటి
తెప్పలగ గోకుచుగ మొదవొప్పు మీఱ
బ్రకటపఱచుచున్నది స్వసౌభాగ్యగరిమ"

సా-౬౦.

ఈగాథకు—"అన్యాగ్రస్వభావుడు, బహు మహిలాసక్తుడు, అయినా, దయితుని దనచేతిలోని కీలుబొమ్మను చేసి, అంగుళీనిర్దేశముల మీద ఆడించుతూన్న సవతియొక్క సౌభాగ్యమునుగూర్చి అసూయపడుతూ, ఒక పడతి అన్యాపదేశమున ఇలా అన్నది"—అనీ ఇంకా పలు తెఱగుల అవతారికలు వ్రాయబడినవి. గాథలో శ్రూయమాణమవుతూన్న సౌభాగ్య పదముద్వారా ఇదంతా సంభవమేకదా! అని అనవచ్చును. కాని, ఈదిగువగాథ—

"చాల దగ్గ గొని సెలయేటి జాలటంచు నాకే దెల్లత్రాచును, దున్న, నాల్కతోడ; దానిచొంగను త్రాగె నా త్రాచు, నల్ల తాటిచెట్టులో నీ పని యాతురమున"

౬-౫౧.

అని స్పష్టంగా గ్రీష్మమధ్యాహ్నతాపాన్ని వివరించుతున్నదిగదా! దీనికికూడా— మండు వేసవి మిట్టమధ్యాహ్నం కావడంచేత, ఎండ కడలి, బజార్లలో, ఒక్క పిట్టయినా ఆడటము లేదు. అతని దగ్గరకు హాయిగా పోయి రావచ్చును; అని అభిసారికకు సూచించుచూ, "మాలిక అబ్బో! నిదాఘతాపం సైపరానిదిగా ఉన్నది సుమా: అని పైకి ప్రకటించుతూ అన్నది"— అని అవతారిక కల్పించబడింది. ఇట్టి ప్రకృతివర్ణనలు గాథాసప్తశతిలో ఎన్నో ఉన్నవి. యథాతథంగా వానిని ప్రకృతివర్ణనలక్రిందనే గ్రహించేటట్లయితే గాథల చిత్రణనైపుణి అసామాన్యం అని సమ్మతించక తప్పదు. అయితే వ్యంగ్యప్రధానంగా, ధ్వనిమనోహరంగా ప్రవర్తించిన గాథలు సప్తశతిలో మెండు. అట్టివి సూచించే సూచనలు నానారూపాలలో ఉండవచ్చు! ప్రకరణికంగా కాని, కేవలశృంగారపరములుగానే వాటిని అని వేయుటము అంతగా శోభించదు.

"గావి రాశిన సుగ్రామ్య మకరో త్సాతి వాహనః" అని ఉపదేశింపబడినది. కాని, హాలుని గాథాసప్తశతిలో ముఖ్యముగా, బహుళముగా వర్ణింపబడినది, గ్రామ్యమే గ్రామీణులే, గ్రామీణాంగనలే, వారి విహారవ్యావహారాదికములే. అయితే గ్రామ్యవిషయమును ఉన్నదున్నట్లు గ్రహించినా, గాథలు, ఆగ్రామ్యమును గ్రామ్యముగాగాక రమ్యముగా, ఆదర్శప్రాయములుగా, వర్ణించినవని పై వాక్యానికి సమాధానం చెప్పుకోవాలి.

గ్రామీణుల నిత్యజీవన భావానుభవానులను మధురమధురంగా వర్ణించి సాగిపోతూ, గాథలు నాగరికుల ఆహారఆచారవ్యవహార విహారాదులను ఏవగించుకొంటున్నట్లు స్పష్టపడుతుంది. నాగరికులలోని ప్రణయము ప్రణయమే కాదని. అది కేవలం, వాంఛామాత్రమేనని, భావబద్ధమైన యథార్థప్రణయమును చూడవలెనంటే గ్రామీణులలోనే చూడవలెననీ, గాథలు నిరూపించుచుం ఉన్నవి.

గాథాసప్తశతిలో వర్ణింపబడిన నాయికలు, ఉత్తమోత్తములు, ఆదర్శపాత్రులు. అయితే, గ్రామవాసినులైన విలాసినులే ఆశృంగార నాయికలు. ఉన్ముక్తమైన వాతావరణంలో పుట్టి, పెరిగి హృష్టపుష్టాంగులైన పల్లెటూరి కోడెగాండ్రే, అడవరాండ్రే లక్ష్యములు. ప్రకృతిసుందరములైన గ్రామపరిసరములే, వారి విహారస్థలములు. హరితహరితములై, నిబిడసస్యాచ్ఛాదితములైన ధాన్యక్షేత్రములే, వారి అభిసారక్షేత్రరాజములు. అయితే, గాథలలో, పల్లపుచేలు అంటే మాగాణిచేల వర్ణన అచ్చటచ్చట ఉన్నా, ఎక్కువగా, మెట్టచేలు వర్ణింపబడినవి. వానిలో, నూవుచేలు, కందిచేలు, ప్రత్తిచేలు, జనపచేలు, సెనగచేలు, మొదలైనవి ఎక్కువగా వర్ణింపబడినవి. వరిపైరులను వర్ణించిన ఆకొన్ని గాథలు, అద్వితీయాలుగా, అభిమనోజ్ఞములుగా, ఉన్నవి. అంతటిరసికతకు కారణం గాథలే నిరూపించినవి. సమస్తం— గాథావర్ణితులైన గ్రామీణుల జీవనం, ఆనందమయం. వారి హేలాలు, ఖేలాలు, నిత్యకల్యాణాలు, పచ్చతోరణాలు. అందులో ముఖ్యంగా కర్షకులజీవనం, ఆరోజులలో, ఈరోజులలో లాగా, అనుగమనుగా దుఃఖాలతో దుర్భరమై కుమిలిపోవడమూ లేదు. మేఘములు, సకాలమున వర్షించి, ఋతువులు తమ ధర్మమును తప్పక ప్రవర్తించుచూ ఉంటే, క్షేత్రాలు

కోటికొల్లలు పండి, కన్నులపండువుగా ఉండేవి. ధాన్యలక్ష్మితో తమ ఇండ్లు నింపుకొని, కర్షకులు యథేచ్ఛంగా విహరిస్తూ, ఆనందరసలీలాడోలికలలో, హాయిగా ఓలలాడుతూ ఉండేవారు. గాథ అదే నిరూపించింది—

"మేల్మి నిష్పన్నసస్యసమృద్ధి గలఁడు
హాలికుఁ గూడ నవశరదవసరమున, దలిత
నవ శాలి తండుల ధవల రాజ శర్వరులఁ
బొందుచున్నాఁడు స్వైరసరణి" ౭-౮౯.

నాఱు నాటి, కావలసిన నీరు పెట్టి, తగిన పరామరికతో, చక్కగా సాకుతూ వచ్చి, క్రమక్రమంగా పైరు పెరిగి, ఈని, పాలపొట్ట, పోసికొని, గింజ కట్టి, ధాన్యపుకంకులతో నిండి. వంగిఉన్న పొలమును, కనులారా చూచి, కర్షకుడు పాఱాడుతూన్న కన్నకుమారుని చూచినలాగా, మనస్సులో, అంతులేని సంతోషంతో పొంగిపోయినాడట—.

"ప్రాపి క్షురముమాత్రము, దత్తజాను
పతన కమనీయరూపము, పంకములిన, మైన
శాలికేదారము, హాలికునకొసంగెఁ బుత్త్రుఁ
డట్టులు కను సమ్మదమ్ము." ౬-౬౭

మంచుతో నిండి పోయి, పైతలనుండి మంచుబొట్లు కారుతూ ఉన్న శాలికేదారాన్ని చూచి, శృంగారరసప్రమేయమయంగా చిత్రంగా ఉత్ప్రేక్షించి, గాథ—

"పరిణతివేళ నాకడఁగుబా యెదవర్,
ఖలసంగ మెట్లుగా తెరయునో యేమొ?
అంచు దురిపెల్లుమఁ జెల్లు మొగమ్ము వ్రాల్చి
వంపురుచు, సశోకమై వగలఁ దోఁగుచు
నున్నది శాలి. జాలిగాఁ పెరిగి, తుషార
బాష్పజలబిందువు తారిక జాలు వాఱఁగ" ౬-౬౮.

ప్రత్తికాయలు కోయడానికి వచ్చిన ఆ కూలిపడుచు, నాగనిమీద కన్నువేసినది సుమా— అని తన సఖురాలితో గ్రామాధికారి కోడలు—

"మన మిటఁ గోయుచుండ, యజ
మానికుమారుఁడు ప్రత్తికాయల౯ మును
కొని యన్ని కోసికొనిపోయెఁగదా, ఒడినిండ
నెప్పుడో! కనుఁగొను మల్ల కొమ్మపయిఁ
గ్రమ్మచు సాగిన దిష్టిఁ జెమ్మరించిన నును
వ్రేళ్ళతోఁ జెలువ చేతలిరాకు వితా భ్రమింపఁ
గా౯." ౪.౫౯.

నాగరకుడొకడు సహచరునితో అన్నట్లుగా, ప్రత్తికాయలతో వంగి ఉన్న కొమ్మను చూచి, ఆచెట్టుక్రింద జరిగిన ఒక ప్రణయ ఘట్టాన్ని నిరూపించుతూ, గాథ—

"రతిసుఖవివశ గ్రామీణసుత మృత
యని తలఁచి హాలికపుత్త్రుఁడు పిక్కబలముఁ
జూప, అరలు చిట్లిన కాయలబరువుతోడ
వంగి పక్కన నవ్వెను ప్రత్తికొమ్మ." ౪-౬౦.

చేనిలోకి, తనకు అన్నం తీసికొని వస్తూన్న ప్రియురాలిని చూచి భావనామత్తుడై హాలికకుమారకుడొకడు, దుక్కిటెద్దు ముకుపట్టెడకు బదులుగా, ముక్కుత్రాడు విప్పినాడు—

"క్రొత్తగా నాఁగలిం దున్నఁ గుదిరి
నట్టి హాలికసుతుఁ డన్నముం దెచ్చు ననుఁగు
చెలిని, మఱికి నవ్వులఁ జూచి, పట్టెడకు
బదులు వీడివి యూడఁదీసెను గిత్తముక్కు
త్రాడు" ౭-౯౨.

ఆనాటి ఆస్త్రీల ప్రేమ కేవలం ఇంద్రియలాలసకోసము మాత్రమే పుట్టినది కాదు. అది స్వాభావికమైన నిష్కళంక ప్రేమమునకు ఆదర్శము. ప్రియురాలి విరహంచేత ఉడికిపోతూన్న ఒక వృద్ధకర్షకుడు ఆతడు పాము

రుడేఅయినా, ప్రియాశూన్యమై సర్వశూన్యంగా ఉన్న ఆనాడు ఇంటిలో కాలుపెట్టడానికి మనసు పోక. మానివేసి, పొలంలోనే, తన కక్కడ పని యేమీ లేకపోయినా, అక్కడే ఉండి తిరుగుతూ తన జీవితశేషం గడుపకోసాగినాడు—

"కాలకరాళజిహ్వ కెఱగా నసు గోష్ఠి గతించిపోయి ఇల్లాలటు ఖాళి చేసిన గృహమ్మున కాఱనిశోక మాఁపుకోఁ, హాలికుఁడొక్కఁ-పూఁట యయినన్ జనఁడే పని పాట లేకయే కేలుఁ బగళ్ళు నూరిక చరించుచు నుండునుగాని చేనిలోఁ." ౨-౯౯.

ఒక పామరయువకుడు, పడుచుపినంలో ఉన్న తన ప్రియురాలి బిగి చను గు త్తు లు వెచ్చనై శీతనివారకములై, ఉండడం గమనించి, పుంజువంటి చలికోజులలో, తన దుప్పటి అమ్మివేసుకొని, మంచియెగ్గును కొనుక్కొన్నాడు—

"మాఘమాసాన హాలిక కుమారకుండు, కొమరుప్రాయపు ప్రియురాలి తిమురు చనుల బిగువుకని పట్టి, దుప్పటి వేగ సమ్మి, ఒక్క బలిసినగిత్త నాయూరఁ గొనియె." ౩-౩౮.

ఇలా పల్లెటూరి వారి స్వాభావికశృంగారముచే గాదు, గాథాసప్తశతి, అరణ్యములలో నివసించే భిల్లులు, కిరాతులు, మొదలైనవారి నైసర్గిక ప్రణయచర్యనుకూడా, చిత్రంగా రసవంతంగా వర్ణించినది.

ప్రియతముని తనవశం చేసికోనేర్చిన వ్యాధవధువు ఒకతె, ప్రియప్రణయవంచితలైన తన సవతులు, గజముక్తాలంకృతులై, వ్యర్థమైన గర్వాభిమానంతో, సంచరించుతూ ఉంటే, తాను సామాన్యపు నెమలియీకలు తలలో ముడుచుకొని, కులాసాగా, వారి ముందు తిరుగసాగినది—

"కులుకుచు మత్తకుంభికుల కుంభములందలి క్రొత్తముత్తియమ్ములు ధరియించి గర్వమున మున్గు సపత్నులమధ్య, నెంతయుం బలుపున నుల్లసిల్లె, అల వ్యాధవధూతిలకము నెమ్మి యీకెలు తలఁ దాల్చి, తేఁకు మఱఁగింపని పెంపున నుత్సవమ్ములోఁ" ౨-౭౩

ఒక పులిందాంగన, ప్రియునియెడ సపత్నీసంగమదోషముల శంకించి కోపించినది—

"పోఁతుతేనెటీఁగ యొకంఁ పొడిచి కుట్టి వాఁచినపెదవితోఁ ప్రియపతి మొగమ్ముఁ జూచి చనియెఁ బుళింది, యీసున మఱొక్క భూరుహాముసీడకుం జిఱ్ఱుబుఱ్ఱు మనుచు." ౭-౩౮.

లోకంలోని వాడుక ననుసరించి, గాథలలో వదినె అనగా అన్నభార్య, మఱదలుకు, పరస్పరప్రణయం, పరిహాసవాక్యములు వర్ణింపబడినవి. కాని, అవి, వ్యంజనారూపంగా వ్యపదేశింపబడి ఉన్నది. ఆవర్ణనలో ఎక్కడా గ్రామ్యధర్మం ఎవరికీ ద్యోతకంకాదు. ఉదాహరణము—

"నవనవ యేలతం గరమునం గొని పొంగుచు దేవరు డేయనా యవయవపల్లవమ్ముల సమాహతిఁ గూర్చఁగ నూహసేయు, నా యవయవపాళియందుఁ బులకాంకురముల్ ప్రకటమ్ములై సముద్భవమున పెంపునెంది కనుపట్టు వధూమణి కుల్లసత్ స్థితిన్॥" ౧-౭౮.

అర్థచంద్రుని చూచు ఉల్లాసంతో మోర యెత్తి ఆకాశంవంక ఊరకే చూస్తూన్న దేవరునితో ఒక యెమ్మెలాడి—

"మఱది! నీ వెన్నడును జూచి యెఱుఁగవేమొ! వలపుప్రియురాలి చంకల

ములుపులందు నర్ధచంద్రపరంపర; నాకస
ము ను కన్నులార్పక చూడఁగాఁ గడఁగి
నావు!                                       ౬-౨౦.

మఱదులతో ప్రణయవ్యాపారం ఉన్న వారిని అలా ఉంచండి. తప్పుదారి యెప్పుడైనా, తమ పట్ల తప్పుదారిని ప్రవర్తింపసాగితే, తమ మఱదులను యుక్తిగా మందలించి, ఋజుమార్గమునకు త్రిప్పి, లోకమునకు ఆదర్శప్రాయమయ్యే ఉత్తమోత్తమనాయికలు, గాథలలో వర్ణితలై ఉన్నారు. ఒక కులకాంత ఉదంత మిది—

"విలువిలుకానివాఁడఁ బడి వీడఁడి యై, చెడుబుద్ధి నున్న దేవరునకు చెప్పుచుండుదు పవల్ కులభామిని, ఏగి కౌసల్య ధరణిసుతా రఘువ్వివాహులదాస్యముఁ గొన్న సుమిత్ర కాన్పుపత్రరువులు నూపి గోడపడు, ధన్యము లాతినిపుణ్యాగాథలన్"       ౧-౩౪.

మఱొక మహాపతివ్రత—

"మఱఁది కడుం జెడుం గఱవమాలిన బుద్ధి మెలంగుచుంట గుర్తెఱిఁగియు నింటి కోడలు వచింపదు, దోంపిరిపాటువాఁడుగా గఱికెతియైన నాథునకుఁ, గాఁపుర మల్లనతో పెఁజిండ్ర వంటిది యవు నన్న భీతి, నిరతం బెదఁ గ్రుంగుచుచుండుంగాని తాన్"       ౧-౪౯.

అయితే ఒక వదినగారు, మఱదితో ప్రణయాభినివేశంతో ఇలా అన్నది—

"మఱఁది! నిజము చెప్పుము, పలు తెఱఁగు వెతఁగి చాటుకారము మన శశి స్వామి కెవ్వఁ డోరిమిం బట్టి నేర్పె, బ్రహ్మో జనమ్ము! దేజినంత మాహాత్మ్యగమునఁ బోలు తీరు?                              ౨-౮.

కుక్కలను పెంచడంలో కూడా రహస్యమైన అభిప్రాయం ఉన్నదంటాడు గాథాకారుడు—

"కడుపునిండ నన్నము పెట్టి, గంజి పోసి, ఇంటికుక్కను లోఁగొనె నింటియాలు; ఇంటిమగఁడు రా, నఱచుచు గెంటు; అందు మగఁడు రా, నడుగులో బడు మాల్మి నదియు"
                                          ౨-౬౭.

ఇలాగే అత్తకోడండ్ర పరిహాసవాక్యాలు కూడా గాథ చమత్కారంగా వర్ణించింది—

"కొప్పులో పెద్ద వెదురాకు లిప్పుడు సున గ్రుచ్చుకొన్నది ములుపుకో, కోడల అన, పట్టుకొన్నది మీవీఁపుపడుని వెలని! పాటిదు మ్మత్తమా! యని వధువు పలికె.     ౨-౨౮

ఆరోజులలో పల్లెటూరివారు సాధారణంగా, ఎఱ్ఱకోకలు కట్టుకునేవారు. ఎఱ్ఱకోక దొరికిననాడు వారికి పండుగగా ఉండేది. ఈ కాలపు రవికెలవలెగాక, ఆ కాలపు రవికలు విలక్షణాలుగా ఉండేవి. వాటిని కంచులిక అని అనేవారు. స్తనసంధిబంధస్థలంలో ఆ కంచులికకు రెండంగుళముల పరిమితమైన ఒక కీలిక కంచులికయొక్క రెండుభాగములను జత పరుస్తూ ఉంటుంది. దానిని, కపాటము అంటారు. ఈ కంచులిక సాధారణంగా నీలిరంగులో ఉండేది. ఆపడుచులు, ఎక్కువగా తలలో దానానిపూలు పెట్టుకొనేవారు. ఊరి బయటికి, ఆపూలకోసమని పోయి, అక్కడ ప్రియునితో, క్రీడించేవారుకూడా. అది గమనించిన కొందఱు పురుషులు తమ భార్యలకు తామే పూలు తెచ్చి ఇచ్చి, వారిని అక్కడికి పంపకుండా ఉండేవారుటకూడా. అలా పోయిన, పురుషులుకుకూడా, అన్యాసంగ చిహ్నం గమనించి, ధ్రువపడినపుడు, ఆ స్త్రీలు వారినికూడా, అక్కడికి పోనీక నిలుపుదల చేసేవారు. ఇక వారికి పూలు, ఎలాగ అంటే, ఏ గ్రామాధికారి దొడ్లోనో, చనవు చేసికొని,

మఱికొలు మొదలైన వారు, తెచ్చి ఇచ్చే వారు. సాధారణంగా ధనికుల ఇండ్లవాకిండ్లకు తెర లుండేవి. వాటిదగ్గరే నిలిచి, వారి వనితలు, బజారున పోయే కోడెగాండ్రను, కన్నార చూస్తూఉండేవారట. అలా బాగా పూనికచేసే చూస్తూ, ఒక్కొక్కప్పుడు, వారి, కాలు జారి పడటం కూడా సంభవించేది.

చెఱుకుగానుగలు, ఏతాములు, తైలయంత్రాలు, ఆరోజులలో ఎక్కువగా ఉండేవి. వానిదగ్గర తరుచు స్త్రీలుకూడా పని చేయుచుతూ ఉండేవారు.

హోలికోత్సవము, అనగా వసంతోత్సవం, గాథాసప్తశతిలో, ఎక్కువగా వర్ణించబడి ఉన్నది. అలాగే ఫాల్గునోత్సవం కూడా వర్ణితము.

వరసంగమము తొలిరోజున వధువుకు, తెల్లచీర, కట్టబెట్టేవారు. దానిని ఆనందపటం అంటారు. అది, సంగమసమయంలో, లగ్నలో హితవర్ణిం అవుతుందికదా! దానిద్వారా, మఱునాడు ఉదయం, బంధువులు మొదలైన వారందరూ, రాత్రి జరిగిన, వధూవరుల సంగమక్రీడను గురించి, ముచ్చటించుకొనే వారు. ఈఆచారము, ఇప్పటికీ, అన్నిసమాజములలోను ఉన్నది.

రజస్వల అయిన స్త్రీ, ఆమూడునాళ్ళు, పసుపు కలిపిన నేయి, దీనికి వర్ణఘృతం అని పేరు ముఖానికి, దూమెఱుగుగా పూసికొని ఉంటుంది. ఋతుస్నానం చేసేటప్పుడు, శరీరం అంతా పసుపు పూసికొంటారు. రానురాను, ఈపసుపుపూత, ఒక్కముఖానికే మాత్రమే నిలిచి ఉన్నది.

తమ పిల్లలకు, దంతములు వచ్చేటంత వఱకు, తల్లిదండ్రులు, మరల మైథునధర్మం పూనేవారు కారు.

ఆనాడు, పెండ్లిండ్లు, అయిదురోజులు వేడుకగా జరిగేవి. సుముహూర్తము అయినతరువాత, వరుడు, నాలుగురోజులుదాకా అత్తవారింట్లో ఉండి, నాలుగవరోజున చతుర్థీమంగళం అనగా, శేషహోమాదికం యథావిధిగా పూర్తిచేసికొని స్వగృహమునకు వెళ్ళేవారు. వివాహమునకు ముందు, వధువును పెండ్లి కుమార్తెను చేసి, మంగళాచారగీతములు గానముచేసి, పెద్దముత్తయిదువలు, ఆమెను సేవించేవారు.

ప్రజలు, సర్వసాధారణంగా పూరిఇండ్లలో నివాసం చేసేవారు. అందువల్ల దురదృష్టవశాత్తు, అగ్నిప్రమాదాలు ఎక్కువగా సంభవించుతూఉండేవి. అట్టిసమయంలో, అగ్నిప్రమాదసూచకంగా, ఒక పెద్ద నగారా, మోగించేవారు. అవి వినివినడంతోనే ప్రజలు, దానిని చల్లార్పవేయడానికి, మీర దూరాలనుండీ పరుగిడి వచ్చేవారు. ఆసమయంలో స్త్రీలుకూడా చాలాసహాయపడేవారు.

గాథాసప్తశతీనిర్మాణకాలానికి సమాసగ నంకూడా ప్రచారంలో ఉన్నట్లు గాథలు విరళంగా కనపడుతూఉన్నవి. శైవమతసులలో ఆఆచారము మఱింత పట్టుదలతో ఉన్నట్టు గోచరించుతుంది. ఏకాపాలికిఅయినా శరీరం నిండా పతిచితాభస్మం పూసుకొని సహగమనంచేస్తున్నది అంటె ఆమెను మహాదేవతగా భావించి చూస్తూ, ప్రజలు అలా నిశ్చలంగా నిలబడేవారు.

పూర్వం తప్పుచేసినవారికి చాలా కఠినమైన శిక్షలు విధింపబడేవి. దొంగతనానికి

శిక్షగా శ్మశానంలో చెట్టుకు వ్రేలాడగట్టి, ప్రాణదండనం విధించేవారు. అదిగాక, ఆరోజులలో, కొఱతవేయడంకూడా ఆచారంగా ఉన్నట్లు కనిపించుతుంది. ప్రాణదండన విధింపబడిన అపరాధిని, విఱచి కట్టి, వధ్యస్థానానికి తీసికొనిపోతూ, అతని ముందు, అతని నేరమును అందఱికి చాటించి వినిపించుతూ, డప్పులు, నగారాలు మ్రోయించేవారు. ఆ ఘోషణంద్వారా మఱెవరూ అట్టి అపరాధాన్ని తలపెట్టకుండా ఉండాలని శిక్షకుల శాసనం;

తమ శౌర్యమును ప్రకటించిగాని, దొంగతనముగా గాని, పురుషులు పూర్వం స్త్రీలను బంధించి, బందెలుగా తెచ్చేవారు. ఇలా బంధించి తీసికొనిరావడము, ఆ అపహర్తకు మిక్కిలి శౌర్యచిహ్నంగా పరిగణింపబడేది. అంతకన్నా ఇంకామిక్కిలిగా, వారిని, వారి బారినుండి విడిపించడం, తద్భర్తా మొదలైన వారికి శౌర్యచిహ్నంగా కొనియాడబడుతూ ఉండేది. ఈ ఆచారం రావణాసురునివద్దనుంచి, అనూచానంగా వస్తూన్నట్లు తోస్తుంది.

సప్తశతీకాలంలో, ఖండరాజ్యాలు చాలా ఉండేవి. ఆ మాండలరాజ్యాలలోని గ్రామాలను శాసించే విషయంలో, గ్రామాధిపతులకు సంపూర్ణాధికారం ఉండేది. అయితే, గ్రామాధిపతులు మండలాధిపతులకు, వారు సామ్రాజ్యనియంతలకు, వారు ప్రధానప్రభువులకు తలలొగ్గి ఉండేవారు. మొత్తంమీద రాజశాసనం అతిక్రమించడానికి ఎవరికీ వీలులేదు. శాసనవిరుద్ధంగా నడచినవారిమీద, కఠినంగా శిక్ష అమలుజరుపబడేది. లౌకికంగా గ్రామాధిపతులకు, వారికొడుకులకు ఊరిలోని పడుచులమీద ప్రణయప్రసారం విస్తారంగా ఉంటూ ఉండేది. ఊరిలోని కోడెగాండ్రు కొందఱు గ్రామాధికారుల ఇండ్లపై కన్నులు వేసి ఉండేవారే. ఒక గ్రామాధికారి ఇంటి దొడ్లో జపాపుష్పాలున్నాయి. ఆ ఊరిలో ఇంకెక్కడా ఆపూలు లేవు. ఎలా పోయేవో పూయగానే ఆపూలు ఊరిలో ఒక కోడెగాని దగ్గరకు పోయేవట. అవి చూచి, అనుమానించి, ఆతనిభార్య అత్తగారితో సయుక్తికంగా వ్యవహారమంతా సూచించి మందలించవలసింగా కోరుతూ ఉండేవట—

"ఊరిలో కెల్ల మునసబుగారి దొడ్డియందు మాత్రమే పాటలి అమరియుండ, అత్తయా! విూకుమారుని ఉత్తమాంగ మిటులు బాహులపాటల మయి ఎట్లు లొప్పె?" ౬-౭౯

గాథా సంగ్రహకారుడు గాథాసప్తశతీ గ్రంథ ఉపక్రమఉపసంహారాలలో శివాస్తవం చేసినాడు. అందులోను ప్రకృతిపురుషతాదాత్మ్యమహిమా వైభవప్రతిపాదకమైన అర్ధనారీశ్వరమూర్తిని స్తుతించాడు. ఆ స్తుతి అంతా శృంగారరసనిర్భరమై ఉన్నది. గ్రంథములో వర్ణించబోయే వస్తువును సూచించే నిమిత్తం ప్రథమంలో, ఆతడలాచేసి, వర్ణితమును గ్రంథాంతమందు మరల సూచించినాడని చెప్పుకోవలసి ఉంటుంది. ఆ స్తవమునకు ప్రయోజనం అలాగే గ్రంథమధ్యంలోకూడా శివపార్వతీవిలాసక్రీడ నభివర్ణించినాడు. ఒక చోట గణపతిమందిరం వర్ణించుతూ సరిగా అప్పుడే జారపురుషునితో సందర్భపడ్డ మదనక్రీడలో, యజమానురాలి తలక్రింద తలగడగా గణపతివిగ్రహమునే సర్దినాడు. గ్రంథ ఉపక్రమఉపసంహారాలలోని శివస్తోత్రములివి—

ఉపక్రమంలో—

" ఈసునఁ గొన్న రోసమున నెఱ్ఱని చాయలు మించి, సంచర చ్ఛ్రీసఖ మదిరాజాముఖ శశిప్రతిబింబము సక్రమింపఁ, బూజాసమ పాహితార్ఘ్య జలజాతయుతంబుగ నొప్పు నీశు సంధ్యాసలిలాంజలిక్ రసవిధాననిధానముగా నెఱంగుఁడీ ! " ౧-౧౩

ఉపసంహారంలో—

" సంజతటిక్ జలాంజలిని సంక్రమిత మ్మగుఁ, సర్వమంగళా మంజుముఖాంబుజంబు, బహుమానము లీయఁగఁ గన్నుదోయికిక్, రంజితలీల మంత్రపఠనమ్మను మాని, అలీక వృత్తి మోవిం జలిఁ బుంపఁజేయుచు జపెంచు నుమారమణుణ నుతించెదన్. " ౭-౧౦౦.

విమర్శించిచూడగా మొత్తంమీద గాథాసప్తశతి ఆమూలచూడం రసనిర్భరితమై ఆపాదాదశిరఃపర్యంతం ప్రణయలక్ష్మీశృంగారివర్ణనాపరవశమే అని అనక తప్పదు. ప్రకృతి పురుషస్తుతిపూర్వకంగా ప్రవర్తిల్లిన ఆమహాకావ్యం ప్రాకృతిమై, ప్రాకృతివర్ణనలచే, తన లేఖినిలో ప్రాధాన్యము నివ్వడములో ఆశ్చర్యమేమీం ఉండదు.

ఇట్లా మహావిద్వాంసురాలు పట్టమహిషి అయిన శ్రీమలయవతి ప్రేరణచేనేమి, తనకు తానుగా పూనుకొనియేమి, వ్యాకరణాది శాస్త్రముల నభ్యసించి, ఉత్తమకవియై, పలువురు కవిచంద్రులకు ఆశ్రయమై, కవివత్సలుడై, స్థిరమైన కృషితో గాథాసప్తశతీనిర్మాణము గావించి, శాస్త్రకారులకు ముఖ్యముగా యావత్ప్రపంచమునకు విజ్ఞానామృతమును భిక్షపెట్టిన హాలశ్రీశాతవాహనునకు మనము జోహారు లర్పించవలసి ఉన్నది. అందులో ముఖ్యంగా గాథాసప్తశతీకోశనిర్మాణమున సహాయకుడై ఉత్తమోత్తమగాథారత్నములను సమకూర్చిన శ్రీపాలితకవికులతిలకునకు ధన్యవాదములు. గాథారత్నకోశములోని కవిచంద్రులకు నమోవాకములు. కవయిత్రులకు అభివందనములు.

---

# గుణాఢ్యుడు - బృహత్కథ

శ్రీ శివ శంకర శాస్త్రి

[౧]

సంస్కృతభాషలో సోమదేవ భట్టు పద్య రూపములో రచించిన కథా సరిత్సాగరము అనే మహాగ్రంథానికి గుణాఢ్యుని బృహత్కథ మూలభూతము.

సంగ్రామరాజు కుమారుడు అనంతరాజు కాశ్మీరము పరిపాలన చేసేరోజుల్లో సోమదేవ భట్టు అతనిఆస్థానములో ఉండేవాడు. అనంత భూపతి క్రీ. శ. ౧౦౬౩-౮౧ వరకూ రాజ్యము చేసినాడు. ఆయనభార్య సూర్యమతీదేవి జలంధర రాజకన్య; కలశభూపతి తల్లి; కాశ్మీరక హర్షమహారాజ పితామహి. ఆమె సాహిత్యములో బాగా అభినివేశము కలది. ఆమెవినోదార్థము సోమదేవుడు కథా సరిత్సాగరము రచించినాడు.

క్రీ. శ. ౧౦౨౦-౧౦౮౦ వరకూ రాజ్యము చేసిన అవంతివర్మ ఆస్థానకవి క్షేమేంద్రుడు. ఆయన బృహత్కథను అనుసరించి సంగ్రహించి సంస్కృతములో రచించిన బృహత్కథామంజరి చాలా సంక్షిప్తముగా ఉన్నదనీ, నాతి రుచిర మనీ, సూర్యమతీదేవి సోమదేవుని ప్రార్థించి కథాసరిత్సాగరము చేయించింది.

[౨]

పైశాచీభాషలో బృహత్కథాకర్త అయిన గుణాఢ్యుడు ఎప్పటివాడు? క్రీ. శ. తొమ్మిదవ శతాబ్ది ప్రాంతములో వర్ధిల్లిన కవి బుధస్వామి పైశాచీబృహత్కథను అనుసరించి బృహత్కథా శ్లోకసంగ్రహము అనే గ్రంథము కావ్యరూపముగా చేసినాడు. అందులో ౨౮ సర్గలూ ౨౫,౦౦౦ శ్లోకములూ ఉన్నవి. గ్రంథము యథామాతృకముగా అనుకరించినాడట. ఇప్పుడు లభ్యమయ్యే గ్రంథములో ౪౫౨౮ శ్లోకాలు మాత్రము కనబడతవి. కథ ప్రద్యోతమహారాజు మరణముతో ప్రారంభమవుతుంది. అందులో పంచతంత్ర, బేతాళ పంచవింశతికలు లేవు. ఏమీ అతిక్రమించకుండా కవి నరవాహనదత్తచరిత్ర రచించినారు. అందులో మదనమంచుకను రాజపుత్రికను చేసినాడు.

ఈకథను బుధస్వామి నేపాళదేశముతో ముడి పెట్టినాడు. ౨౮ సర్గలకు బదులు ప్రస్తుతము ఆరు "లాభములే" (భాగములు) ఉన్నవి. పైశాచీమాతృకలో నరవాహనదత్తుని వ్యాపారాలే ఉన్నవట ౧౮ భాగాలుగా. శ్లోకసంగ్రహములో ఉపకథలు లేవు. కాశ్మీరపాఠముల పద్ధతికీ ఇందులో అనుక్రమణికకూ కొంత భేదము ఉన్నది. పైశాచీగ్రంథమును బుధస్వామి సముఖాన ఉంచుకొని సంస్కృతీకరించినాడా ?

గోవర్ధనాచార్యుడు, యశస్తిలక చంపూకావ్యకర్త, సోమదేవసూరి, ధనంజయుడు, త్రివిక్రమభట్టు, బృహత్కథను పొగడినారు. క్రీ. శ. ౮౭౫ సంవత్సరములో కాంబోడియా దేశములో ఒకానొక శాసనములో గుణాఢ్యుని నామధేయమూ, ఆయనకు ప్రాకృతభాష మీాది విరక్తి లిఖించి ఉన్నవి.

క్రీ. శ. ఏడవశతాబ్ది పూర్వార్ధముతో రాజ్యము చేసిన గాంగవంశప్రభువు అవినీత మహారాజు కుమారుడు దుర్వినీతుడు బృహత్కథను సంస్కృతీకరించినట్లు శాసనమువల్ల తెలుస్తుంది. జైనాచార్యుడయిన పూజ్యపాదునికి దుర్వినీతుడు శిష్యుడట!

"కువలయానంద" పరికరప్రకరణములో–
"చిత్రార్థాం న బృహత్కథా మచ కథం"
అని కనబడుతుంది.

"అతిదీర్ఘజీవిదోషా ద్వ్యాసేన యశోపహారితం హన్త! కైర్నోచ్యేత గుణాఢ్యః స ఏవ జన్మాంతరాపన్నః"

"శ్రీరామాయణ భారత బృహత్కథానాం కవీన్ నమస్కుర్మః" అని గోవర్ధనాచార్యుని ఆర్యాసప్తశతిలోనూ;

"రామాయణాది చ విభావ్య బృహత్కథాం చ"॥

అని ధనంజయుని దశరూపకములోనూ;

"శశ్వద్బాణద్వితీయేన నమదాకారధారిణా ధనుషేవ గుణాఢ్యేన నిశ్శేషో రంజితో జనః"

అని త్రివిక్రముని దమయంతీ కథాచంపువులోనూ;

"భూతభాషామయీం ప్రాహు రద్భుతార్థాం బృహత్కథామ్"

అని క్రీ. శ. అష్టమశతాబ్దిలో ఆచార్య దండి విరచిత కావ్యాదర్శములోనూ;

"బృహత్కథాలంబై రివ శాలిభంజికోపేతైః"

అని క్రీ. శ. సప్తమశతాబ్దిలో సుబంధుకవి విరచిత వాసవదత్తలోనూ,

"సముద్దీపితకందర్పా కృతగౌరీప్రసాధనా హరలీలేవ నో కస్య విస్మయాయ బృహత్కథా;" "బృహత్కథాకుశలేన"

అని క్రీ. శ. సప్తమశతాబ్దిలో వర్ధిల్లిన భట్టబాణుని హర్షచరిత, కాదంబరీ గ్రంథాలలోనూ;

"ప్రద్యోతస్య ప్రియదుహితరం వత్సరాజోఽత్ర జహ్రే" "ప్రాప్యావన్తీ నుదయనకథాకోవిదగ్రామవృద్ధాన్"

అని క్రీ. పూ. ప్రథమశతాబ్దిలో కాళిదాసకవీంద్రుని మేఘదూతములోనూ కనబడుతున్నవి.

క్రీ. పూ. ద్వితీయశతాబ్దిలో ఉన్న భాసకవి బృహత్కథను అనుసరించి 'ప్రతిజ్ఞాయౌగంధరాయణము', 'స్వప్నవాసవదత్త' మొదలయిన నాటకాలు రచించినాడు. బృహత్కథలోని గోముఖుడు యౌగంధరాయణుడుగానూ, మదనమంచుక వసంతసేనగానూ భాసునిరచనలలో మారిపోయినారు.

పైన ఉదాహరించిన సంగతులనుబట్టీ ఇతర చరిత్రాంశములనుబట్టీ గుణాఢ్యుడు క్రీ. పూ. ౨౦౦ మొదలు ౧౫౦ సంవత్సరప్రాంతాలలో వర్ధిల్లినవాడని పురాతత్వవేత్తలు నిర్ధారణ చేసినారు.

[3]

మహామాహేశ్వరుడయిన జయద్రథుడు తన "హరచరితచింతామణిలో" ౨౭ ప్రకాశములో "శబ్దశాస్త్రావతారఘట్టములో" గుణాఢ్యునికథ లిఖించినాడు. క్షేమేంద్రుడూ, సోమదేవుడూ గుణాఢ్యునిచరిత్ర వ్రాసినారు. వారివాక్కులవల్ల గుణాఢ్యునిది దైవమానుషజన్మగా కనిపిస్తుంది. ఆయనతల్లి బ్రాహ్మణకన్య, తండ్రి నాగప్రభువు. శాతవాహనప్రభువుల రాజధాని అయిన ప్రతిష్ఠాన (సుప్రతిష్ఠిత) పురములో ఆయన జననము. అప్పటిరాజు శాతకర్ణి కావచ్చు. కథాపీఠలంబ

కములో రాజజలక్రీడా వృత్తాంతములో సంస్కృతవ్యాకరణప్రశంసాదులను బట్టి రాజు హాలుడు అయి ఉండవలె. విమర్శకు ఈవిషయమునిలవదు. కథలో కొన్నివిషయాలు సుసంగతముగా లేవు. గ్రంథాంతరంగపరీక్షవల్ల గుణాఢ్యుడు ఉజ్జయినీపురవాసి అని తెలుతుంది.

గుణాఢ్యుడు కాశ్మీరకుడా, నేపాలీయుడా, ఆంధ్రుడా? నేపాళమువారు ఆయన తమ దేశీయు డన్నారు. అది అసంగతము. జర్మన్ విద్వాంసుడు Winternitz మతప్రకారము గుణాఢ్యుడు కాశ్మీరకుడు. దానికి తగిన కారణాలు కనబడవు. ఇక ఆంధ్రవాదము మిగిలింది.

పాటలీపుత్రప్రభువు నందుడూ, సుప్రతిష్ఠిత (ప్రతిష్ఠాన) ప్రభువు సాతవాహనుడూ సమకాలికులు. గుణాఢ్యునికీ సాతవాహన (ఆంధ్ర) రాజుకూ చాలా సంబంధము ఉండడము స్పష్టము. కాబట్టి గుణాఢ్యుడు ఆంధ్రుడు కావడానికి ఎక్కువవీలు కనబడుతున్నది.

బృహత్కథావిధానము రా మా య ణ మహాభారతములధోరణిని బోలి యున్నదట. బృహత్కథాబీజాలు క్రీ. పూ. చాలాశతాబ్దులు వెనుకకు వెళ్ళుతవి. వివిధకథలను సంగ్రహించి, ప్రణాళిక ఏర్పరచి పైశాచీభాషలో ఆయన రచించినాడు.

బృహత్కథ గద్యాత్మకమా, పద్యాత్మకమా? వచనరూపములోనే కవి రచించినాడని ఫ్రెంచివిమర్శకుడు Lacote మతము. అయితే ఇన్నిలక్షలగ్రంథము చేసినాడు అని కథాపీఠలంబకములో ఉ న్న మా ట ల గ తి యేమిటి? సంస్కృతభాషలో గ్ర ం థ ము అంటే 32అక్షరాల (పద్య) సముదాయము. ఒకవేళ దానిని వచనానికికూడా అన్వయించవచ్చునేమో.

గద్యమయ మయినా, పద్యమయ మయినా, చంపు వయినా బృహత్కథ ఆదినుంచీ ఆదరమే పొందింది. కవులు, లక్షణకర్తలూ (వ్యంగముగా) కవిత్రయములో వాల్మీకి, వ్యాస, గుణాఢ్యులను ప్రశంసించారు.

గుణాఢ్యునిప్రభావము చాలమంది గ్రంథకర్తలమీద పడినది. అది ము ఖ్య ము గా దండ్యాచార్య, క్షేమేంద్ర, సోమదేవ, బుధస్వామి, కల్హణపండిత ప్రభృతులమీద ప్రస్ఫుటము.

పైశాచీభాష ప్రాకృతాలలోనిదే.

మాగధి మొద లయినప్రాకృతాలు అపభ్రంశముగా ఉచ్చరిస్తే పైశాచికా లనుపించుకొంట వని రామతర్కవాగీశుడు అన్నాడు. ఈయన క్రీ: శ. ౧౭వశతాబ్దిలోని వైయాకరణుడు. ఆశతాబ్దికే చెందిన మార్కండేయుడు కాంచి, పాండ్య, పాంచాల, గౌడ, మగధ, వ్రాచడ, దాక్షిణాత్య, శౌరసేన, కైకేయ, శబర, ద్రావిడదేశాలలో పైశాచీ వ్యవహారా మున్నాడు. వీటిలో కైకేయ, శౌరసేని, పాంచాలములందలివి నాగరములు. కైకయ, ఛక్క అని పైశాచి రెండురకాలని రామతర్కవాగీశునిమతము. పాండ్య, కేకయ, బాహ్లిక, సింహళ, నేపాళ, కుంతల, సుధేష్ణ, చోడ, గాంధార, హైవ, కన్నోజన దేశాలలో పైశాచీ ఉండే దని లక్ష్మీధరు డన్నాడు. మార్కండేయునిప్రకారము కేకేయ పైశాచీ Standard dialect. దీనిలోనే గుణాఢ్యుడు వ్రాసినాడట! చూళికా పైశాచిలో బృహత్కథ రచించినా డని కొందరిమతము. దీనిలోనుంచి క్షేమేంద్రునినాటి కాశ్మీరభాష పుట్టింది. ఇది వింధ్యప్రాంతాలలోకూడా ఉండేది.

వరరుచిమతప్రకారము పైశాచి శౌరసేనీజ ని త ము. వ్యావహారికరూపము పొంది,

ప్రయోగములో ఉన్నశౌరసేనీ ప్రాకృతములో గుణాఢ్యుడు వ్రాసిఉంటాడు. కాని క్రమేణ లక్షణగ్రంథాలు ప్రమాణాలుగా ఎంచేరోజులలో శుద్ధవ్యావహారిక శౌరసేనికీ, తత్సదృశప్రాకృతాలకూ పైశాచీనామము వచ్చినట్టు భావించవచ్చును.

పైశాచిని మొట్టమొదట పేర్కొన్నలాక్షణికుడు వరరుచి.

దార్దిక్ భాషలు కొన్ని ఉన్న వనీ, భారతీయలాక్షణికులు వాటినే పైశాచీ అన్నారనీ Grierson మహాశయుడు వ్రాసినాడు. ఆఫ్గన్ఇస్తానులో "పష్టు" భాష ఉన్నదట. Gilgit ప్రదేశములోని 'Shina', కాశ్మీరీకి మూలము. వాయవ్యప్రాంతాలలో ఈభాషలు ప్రచారములో ఉండేవట. దక్షిణసరిహద్దు కాశ్మీరీ.

ఆంధ్రులు ఔత్తరాహులనీ, మహారాష్ట్రీయులనీ, మతభేద మున్నది. వీరికి పూర్వము దక్షిణాన తెనుగువా రుండేవారు, తెనుగు మాటాడేవారు. కాలక్రమేణ ఉత్తరహింపూస్థానభాషలలో ఆర్యప్రాకృతాలు లీన మయిపోయినట్టే తెనుగులో శౌరసేనీ (మహారాష్ట్రీ) రూప మైనపైశాచీ (అపభ్రంశ) ప్రాకృతము లీన మయి పోయింది. కాబట్టి ప్రాచీనాంధ్రులభాష మహారాష్ట్రీ ప్రాకృతానికి సమీపముగా ఉండే శౌరసేనీ ప్రాకృతమే. దీనిఅపభ్రంశాన్నే పైశాచి అన్నారు. ఇదే పరిణమించి దేశీయపదభూయిష్ఠమై మిశ్రప్రాకృతమైన తెనుగుభాషగా కనిపిస్తున్నది.

ఉచ్చారణలో భ్రష్టమై పోయినభాషలకు పైశాచి అని పేరు రావడము సంభవించింది. అవి మాటాడేవాళ్ళు నిమ్నజాతులో, ఆటవికులో కావచ్చును. మొత్తానికి వాళ్ళు అనాగరకులు.

పైశాచి అనేది జాతిపేరుకూడా కావచ్చును.

ఒకతెగబ్రాహ్మలు తమరచనలకు పైశాచీ భాష వాడినారు.

[౪]

తక్షశిల కేకయప్రధాననగరము. పాంచాలమే పంజాబు. శౌరసేని సమీపమథురాపురము. ప్రాచడము సమీపసింధు. కుంతలము నర్మదాప్రాంతము. చోటదేశము అస్సాంప్రాంతము. విశ్వామిత్రపుత్రులలో ఆంధ్రు లొకరు. వీరు ఆర్యజాతినుంచి విడిపోయిన వ్రాత్యులు. ఈ పైశాచీ మాటాడేవారికి ఇరానీయులసంపర్కము ఉన్నది. వీరు భారతదేశ మంతటా వ్యాపించారు. చివరకు కాశ్మీరు, శౌరసేనభాషలలో ఈచాయలు బాగా కనిపిస్తున్న వట. కాశ్మీరీ; తజ్జనిత మే శౌరసేనీజన్యము పైశాచీ.

ఈపైశాచీలో శాసనాలు గాని గ్రంథాలు గాని ఇంతవరకూ దొరకలేదు. కాని ప్రాకృత వైయాకరణులు ఇచ్చిన లక్షణాలు ఉన్నవి. అందులో కొన్ని :—

(౧) "చ" వర్గలోని తృతీయచతుర్థాక్షరాలు సంస్కృతపదాదిలో లేకపోతే క్రమంగా ప్రథమద్వితీయాక్షరాలుగా పైశాచిలో మారుతవని వరరుచిమతము. చూళికాపైశాచిలో పదాదికికూడా ఇది వర్తిస్తుందని లక్ష్మీధరు డన్నాడు.

(౨) "ణ" కారము "న" కార మవుతుంది.

(3) "శ, ష"లు "స" కార మవుతవి.

(౪) అన్యప్రాకృతాలలో 'ళ' కారము 'ల' కారము; తెనుగులో 'డ 'కూడా కనిపిస్తుంది.

(౫) లక్ష్మీధర, సింహరాజుల మతప్రకారము 'హృదయ' శబ్దములో 'య' కారము 'స' కార మవుతుంది: 'హితస'.

'ష్ట' కారము 'సట' 'సిట' 'స్న' 'సన' 'సిన' 'జ్ఞ' 'ఞ' ఞ కన్యా కఞా కఞ (ర్య) జ్ఞ చ్చ ఇవ పివ (రాచినా, రాచినో) అవుతవి.

పంచమ విభక్తి ప్రత్యయము ఉఆతో (రావాతో). ఇదే తెనుగులో తృతీయావిభక్తి ప్రత్యయ మయినది.

క్త్వా=కూనం ష్ట్వా=త్థూన, త్థూన ఉదాహరణము చేస్తూ.

Future finite verbs end in ఏయ్య.

ఉదా: భవేయ్య — చేస్పేను, చేసేను, చేసీని— ఇత్యాది.

[౬]

పైశాచీమాతృక కానీ, అందులో భాగాలు కానీ, ఇప్పుడు దొరకడము లేదు. క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దివరకూ పైశాచీ గ్రంథ మున్నట్లు బుధస్వామివల్ల తెలుస్తుంది. క్షేమేంద్రుడు కాని, సోమదేవుడు కాని పైశాచీమాతృక చూచారా అని సందేహము. ఈకవు లిద్దరికీ లభించినది గుణాఢ్యునికృతి కాదు అని పాశ్చాత్యవిమర్శకుల మతము; పైశాచీమాతృకను ఆధారము చేసుకొని, మూలములో కొన్నివిషయాలు తీసివేసి, కొన్నినూతనవిషయాలు చేర్చినగ్రంథ మది అనవచ్చు. అయితే అది పైశాచీలో ఉన్నదా, ఆనాటికాశ్మీరభాషలో ఉన్నదా ?

కథాపీఠలంబకములో ఉన్న విషయాల న్నీ యథార్థము లనడానికి వీలు లేదు. క్షేమేంద్ర, సోమదేవులు బుధస్వామి గ్రంథమునో కాశ్మీరీ అనువాదమునో చూచినా రని భావించవచ్చును.

క్షేమేంద్రుడు ఉత్తమగ్రంథాలను సంగ్రహించి, రామాయణమంజరి, భారతమంజరి, బృహత్కథామంజరి రచించినాడు. ఆయనకు కళాదృష్టికన్న ధర్మదృష్టి ప్రధానము కావడముచేత స్వారస్యతము తక్కువ.

క్షేమేంద్రుడు అనుసరించిన కాశ్మీరకపాఠముతో పంచతంత్రము, వేతాళపంచవింశతి మొదలయినవి ఉన్నవి. గుణాఢ్యుని కృతిలో అవి లే వట.

బుధస్వామిగ్రంథమును, సోమదేవునిపుస్తకమునూ గమనిస్తూ వక్ష్యమాణప్రకారముగా గుణాఢ్యునిమూలము పునర్నిర్మాణము చేయవచ్చు నని విమర్శకుల ఆశయము :—

కథాసరిత్సాగరములో ౧౬ లంబకము; అనగా గోపాలకునికథతో గ్రంథప్రారంభము కావచ్చును. అనంతరము, అరవలంబకములో ౨౭ తరంగము; తర్వాత వరుసగా,

౨, ౩, ౪, లంబకములు!

లంబకము ౬, తరంగము ౩౪;

లంబకము ౧౪, తరంగాలు ౧౦౫–౮;

లంబకములు ౩, ౯–౧౩, ౧౪, తరంగము ౧౧౮;

లంబకములు ౧౫, ౧౭, ౧౮.

ఈవిధముగా సవరించినగ్రంథము మూలబృహత్కథకు సరిపోవచ్చును అన్నారు కొందరు విజ్ఞులు,

[౭]

హేమచంద్రాచార్యుడు పైశాచీ బృహత్కథలోనివి అని యిచ్చిన పదాలు మొదలయినవి గుణాఢ్యుని వని చెప్పడానికి వీలు ఉన్నప్పటికీ, కేవలము విశ్వసించడానికి వల్లపడదు. (Pischel Edition ప్రకారము పుటలు) (౩౦౭) తామోదరో– సంస్కృ

తము— దమోదరః. ఇది సూర్యప్రభ కథలో ఒకానొక వీరునిపేరు. సగరపుత్త (సగరపుత్త వచనమ్ ౩౨౪) ఈశబ్దము సముద్ర వర్తకము చేసేవానిపేరు కావచ్చును. సాగర, సముద్రశబ్దాలు కథలలో తరుచుగా వస్తూ ఉంటవి.

హేమచంద్ర: ౪-౩౧౦ :—

కిం పి కిం పి హితపకే అత్థం సింతయమాసీ= కమపి కమపి హృదయకే ఽర్థం చింతయమానా= (ఆమె అటువంటివిషయము ఏవో ఆలోచిస్తున్నది.)

౩౧౬: పుధుమ తంశనే (వరరుచి: పుధు, పుధ) సవ్వస్స య్యేవ సమ్మానం కిరతే (వరరుచి: కిరతి)=ప్రథమదర్శనే సర్వస్యైవ సమ్మానం క్రియతే.

౩౨౦: తం తట్ఠూన (వరరుచి: దటూన, తథ్థూన) సింతితం, రాఞ్ఞా కా ఏస హునేయ్య (వరరుచి: హువియ్యాహా)= తం దృష్ట్వా చింతితం రాజ్ఞా కేషా భవేత్.

౩౨౧: తావ చ (వరరుచి: వ) తిక్ తూరాతో య్యేవ తిట్ఠో)= తావత్ చ తయా దూరాదేవ దృష్టః

౩౨౨: కతసినా (వరరుచి: కతసితా) నేన=కృతాసినా తేన.

పూజితో చ నాచ పాతగ్గ కుసుమప్పతానేన—పూజితా చ తయా పాదాగ్ర కుసుమ ప్రదానేన.

ఏవం సింతయంతో గతో సో తే సమీపమ్=ఏవం చింతయన్ గతస్య తస్యా స్సమీపమ్.

౩౨౩: అథ ససరీరో భగవం మకరధ్వజో ఇత్థ పరిభరమంతో హువేయ్య=అథ సశరీరో భగవాన్ మకరధ్వజః అత్ర పరిభ్రమన్ భవేత్.

ఏవం విద్యే భగవతీ కధమ తాపసవేసగటనం కతం= ఏవం విద్యయా భగవత్యా కథం తాపసవేశ గ్రహణం కృతమ్.

ఏతిసం అతిట్టపురవం మహాధనం తథ్థూన= ఈదృశం అదృష్టపూర్వం మహాధనం దృష్ట్వా.

భగవం యతి మాం వరం పయచ్ఛసే= భగవన్ యది మే వరం ప్రయచ్ఛసే.

రాజన్ (వరరుచి: రాయన్) సందావలోక= రాజం చండావలోక.

తావ చ తీక్ తూరాతో య్యేవ తిట్ఠో సో ఆగచ్ఛమానో రాజ=తావచ్ఛ తయా దూరా దేవ దృష్టః స ఆగచ్ఛమానో రాజా.

౩౨౬. చూలికా పైశాచికకు ఉదాహరణము :

పనమద పనయ పకుప్పిత
గోలి చలనగ్గలగ్గ పతిబింబన్
కస్సు నఖ తప్పనేసుం
ఏకాతస తనుథళం ఋద్దమ్. (౧)

నచ్చంతస్స య లీలా
పాకుక్ఖెవేన కంపితా వసుథా
ఉచ్ఛల్లంతి సముద్దా
శైలాని పతంతి తం హాలం నమథ! (౨)

ప్రణమత ప్రణయప్రకోపిత
గౌరీచరణాగ్రలగ్న ప్రతిబింబమ్
దశసు నఖదర్పణేషు
ఏకాదశ తనుస్థలం రుద్రమ్! (౧)

నృత్యతో యస్య లీలా
పాదోత్క్షేపేణ కంపితా వసుధా
ఉచ్ఛలన్తి సముద్రాః
శైలా నిపతన్తి తం హారం నమత! (౨)

ఆచార్య హేమచంద్రుడు ఇచ్చినఉదాహరణాలు గుణాఢ్యుని బృహత్కథలోనివి కావు; పైశాచీ బృహత్కథాసారములోవి. చూళికా పైశాచీ వృత్తాలుకూడా గుణాఢ్యునివి కావు; రెండవగ్రంథములో ప్రారంభ శ్లోకాలు కావచ్చును. అన్ని విషయాలూ ఆలోచిస్తే, బృహత్కథ ఖిల మయిపోయిందనే తోస్తుంది.

[౮]

కథాసరిత్సాగరమునుబట్టి గుణాఢ్యుని బృహత్కథలో విషయాలు ఏమి ఉంటవో కొంచెము ఊహించవచ్చును. సరిత్సాగరములో ౧౮ లంబకములు, ౧౨౪ తరంగములు, ౨౨ వేల శ్లోకములూ ఉన్నవని Macdonell మహాశయుని లెక్క. ౨౧౨,౫౦౦ శ్లోకాలే అని కొందరిగణన. సోమదేవసూరి గ్రంథాన్ని అనుష్టుప్ ఛ్చందస్సులో రచించినాడు. మధ్యమధ్య ఇతరవృత్తాంతాలూ కూడా తగులుతూ ఉంటవి. పుస్తకమంతా పురాణసోరణిలో నడిచింది.

ఇందులో ద్వితీయ, తృతీయ, చతుర్థ లంబకాలు ఒకశ్రేణిలో ఉంటవి. పంచమ అష్టమ లంబకాలకూ కథాగమనానికీ సంపర్కము తక్కువ. ఆరవలంబకముధోరిణి చూస్తే, తగినంత ప్రాతిపదిక లేకుండా నూతనకథాప్రారంభ మయినట్టు తోస్తుంది. ఏడు, తొమ్మిది, పది పదకొండు లంబకాలకు కూర్పుబిగువు తక్కువ. అవి వివాహాలతో మాత్రము సమాప్తి చెందుతవి. పన్నెండు, పదమూడు లంబకాలు సుసంగతాలు; అయినప్పటికీ ౧౪–౧౫, ౧౭–౧౮ లంబకాలతర్వాత ఉండడము ఉచితము. ౧౬ లంబకాన్ని విభజించాలి. పూర్వభాగము ఆరవలంబకానికి పీఠిక అవుతుంది. ఉత్తరభాగము సరిగా అతకదు.

సోమదేవుడు ఆరవలంబకమునుంచీ ఉపకథలు చేర్చి, నాయకుని వీరకృత్యాలు వివరించినాడు. అవాంతరకథలో సామాన్యజన విశ్వాసాలూ ద్యోతక మవుతవి. కాశ్మీరదేశములో ఉండే కొన్ని మూఢవిశ్వాసాలు వీటిలో చేరినవి. బౌద్ధుల జాతకకథాంశాలూ, మాంత్రికులచేష్టలూ, పిట్టకథలూ మొదలయినవి కూడా చాలా చేరినవి.

మానవచరిత్రలు దుఃఖభూయిష్టము లనీ, దివ్యులచరిత్రలు సుఖమయము లని, అందుచేత నైచిత్రికి తావు తక్కువ అనీ, దివ్యమానుషచరిత్రలు ఇందులో కవి వర్ణించినాడు. కథాపీఠములోనే ఈ ప్రతిజ్ఞ ఉండడముచేత సంభావనావిరహము కలుగదు.

సంభావ్యశ్రేణి దాటనికథలూ, ఘట్టములూ అనేకము కథాసరిత్సాగరములో కలిసిపోయినవి. రాజులచరిత్రలే కాక, బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులకథలూ, కర్మకారుల కష్టసుఖాలూ, వణిక్పుత్రుల వ్యాపారవిశేషాలూ, సముద్రయానపరుల సాహసకృత్యాలూ, ద్వీపాంతరవాసుల స్థితిగతులూ, విచిత్రవ్యవహారాలూ ఇందులో కనబడతవి.

వీటినిబట్టి మూలభూతమైనబృహత్కథ ఎలాటిదో కొంత కొంత ఊహించవచ్చును.

మతుల వివాహము శోభాయమానముగ జరిగెను. సింహళమున కొకదూత పంపబడెను. ఆమీద లీలావతీసాతవాహనుల వివాహము జరిగెను. యక్షవిద్యాధరరాజు శ్రీమహారాజునకు అంతర్ధాన, అక్షయకోశ, డివిగమనశక్తులను ఇచ్చిరి. ఆమీద నెల్లరును తమ తమ స్థానముల కేగిరి. హాలసాతవాహనుడును లీలావతీసహితుడై ప్రతిష్ఠానపురమును చేరెను.

---

# గౌతమీపుత్రసాతకర్ణి రాజధాని

శ్రీ రా. నరసింహారావు బి. ఏ. ఆనర్సు.

సాతవాహనరాజవంశజులలో గౌతమీపుత్రసాతకర్ణి ఉత్తమప్రతిష్ఠ గడించినవాడనుట సుప్రసిద్ధవిషయము. అతడు పెక్కుయుద్ధములు చేసి యపారమైన భూభాగము నేలినవాడు. ఈరాజు తన విశాలసామ్రాజ్యమునంతను ఎటనుండి పాలించెనను ప్రశ్న బయల్వెడలుచున్నది.

పూర్వసాతవాహనుల శాసనములును, నాణెములును స్పష్టముగ వారు మహారాష్ట్ర మాలవదేశములనేలుట సూచించుచున్నవి.(1) అంతేకాక క్షాత్రపవంశీయులు గుజరాత్, కథియవార్, మహారాష్ట్రములకు అధినాథులుగనున్నట్లు శాసనములేకాక నాణెములును విశదపరచుచున్నవి. క్షాత్రపులలో నొకడగు భూమకుడు గుజరాత్‌ను, కథియవారును పాలించెను (2) అతనియనంతరము రాజ్యమునకు వచ్చిన నహపానుడు ఉజ్జయినీమహారాష్ట్రముల కేలికగనున్నట్లతనియల్లుడగు ఉషవదత్తుని శాసనములనుండి తెలియుచున్నది.(3) దీనినిబట్టి సాతవాహనులీభూభాగమునుండి తరిమివేయబడిరని తేలుచున్నదికదా! తన పుత్రుడు క్షహారాటవంశనాశకుడు (ఖకరాట-వశ-నిరవసేస-కరస) అశిక, అసక, మూలక, సురఠ, కుకుర, అపరాంత, విదర్భ, ఆకరావంతిప్రభృతిదేశములపాలకుడునని వర్ణించు బాలశ్రీ నాసికశాసనము(4) ఈయంశమును బలపరచుచున్నది. బాలశ్రీశాసనమునందలి దేశములపట్టిక, ఉషవదత్తుని నాసికశాసనముల యందీయబడిన పట్టికకు సరియగుచున్నది. మరియు గౌతమీపుత్రునిచే పునర్ముద్రితములైన నహపానుని నాణెము లున్నవి.(5) పై చరిత్రాంశములనుబట్టి క్షాత్రపులయేలుబడి యందుండిన మండలములన్నియు సాతవాహనులచే గెలుచుకొనబడినవని స్పష్టమగుచున్నది.

ఈసాతవాహనవిజయకాలమును నిర్ణయింపవచ్చును. మహారాష్ట్రదేశ సంబంధియగు గౌతమీపుత్రుని మొదటిశాసన మాతని 18వ రాజ్యసంవత్సరమునాటిదై(6) వైజయంతీసేనానివేశమునుండి ఈయబడినది. ఈతేదీకి ముందీత డెచ్చట నుండెనను ప్రశ్న బయల్వెడలును. ఒకపండితుని యూహానుబట్టి క్షాత్రపులచే తరిమివేయబడిన సాతవాహనులు విదర్భయందు తల దాచుకొనిరి. ఆ మండలమునందలి బెనాటకమను తన ముఖ్యపట్టణమునుండియే గౌతమీపుత్రుడు మహారాష్ట్రమును వశపరచుకొనెను.(7) కాని గౌతమీపుత్రునిచే జయించబడిన మండలములలో విదర్భయు పేర్కొనబడుట పైయభిప్రాయమునకు బాధకము. అతడు రాజ్యమునకు వచ్చిన

1. A. S. W. I. vol. V. p. 861 vol. IV. p. 99. Rapson C A G. Intro.
2. C. A. C. Intro
3. E. I. vol. VIII Nask Ins.
4. Ibid; No. II
5. Jogalthambi hoard.
6. E. I. vol. VIII Nasik. Ins. No. IV
7. A. B. O. R. I. vol. XXVII p. 37

తరువాత 18వ సంవత్సరమునకుముందే విదర్భ యందుండజాలదు అని దీనివలన నిరూపింప బడును. కావున విదర్భయందలి బెనాకటక మాతని రాజధానియైయుండుట కవకాశము లేదు.

ప్రతిష్ఠానము లేక పైఠాన్ సాతవాహనుల రాజధానియని పరంపరగా వచ్చు కథల వలన తెలియుచున్నది. ఎప్పటినుండి సాతవాహనరాజధాని యచటనుండెనో స్పష్టముగ తెలియదు. ఉన్నదంతయు సాతవాహనుల పైఠనమను ప్రశంసమాత్రమే.(8) టాలమీ రచనలననుసరించి గౌతమీపుత్రునిపుత్రుడైన పులమావి పైఠనునందు క్రీ. శ. 130 ప్రాంతమున పాలించెనని నిశ్చయముగ తెలియుచున్నది. అశిక, అసక, మూలకాదిమండలముల విజయము బాలశ్రీ శాసనమున పేర్కొన బడియుంటవలన నీవిజయములకు పూర్వము ప్రతిష్ఠానము గౌతమీపుత్రుని రాజధానియై యుండజాలదు.

అగుచో అతని మొదటిరాజధాని యగు నగరము ఏది ? ఒక్కవిషయముమాత్రము నిశ్చితము. క్షాత్రపులనుండి దక్షిణాపథ పశ్చిమోత్తరభాగములను జయించువరకు నత డాభాగముల కావల నివసించెను. ఆభాగము దక్షిణాపథప్రాగ్దక్షిణప్రాంతమున నుండి యామండలమునకు గౌతమీపుత్రుడు మొదట నధిపతియైయుండెననుట కభ్యంతర మేమియు కన్పింపదు. నాసికశాసనములలో నొకటి యతనిని "...కటకస్వామి"గ వర్ణించినది. దీనియర్థమును గూర్చియు, ఇది యే స్థలమైయుండుననుటనుగూర్చియు నభిప్రాయ భేదములున్నవి. కొందరు దీనిని 'ధనకటక సామినహి'(9) యనియు, ఇతరులు 'బెనాకటక సమనహి'(10) యనియు చదివిరి. గౌతమీపుత్రుని ధనకటకాధిపతినిజేయు భండార్కరుల యర్థనిర్ణయమే బెనకటకశ్రమణపరముగ నితరులు చెప్పు అర్థముకన్న సమంజసముగ నున్నది. ఒకవేళ 'బెనాకటక'మను నర్థమే స్వీకార్యమగుచో దానికి బెనా-వెనా-వేణ్ణా-కృష్ణవేణ్ణా లేక కృష్ణా సంబంధియగు కటకము అను అర్థ మేర్పడును. ఆకాలమున కటకోపపదద్యోతితమై, కృష్ణయొడ్డుననున్న నగర రాజ మొక్కటే.(11) అది ధాన్యకటక మహానగరము.

కృష్ణానదియొడ్డుననున్న ధాన్యకటకమే గౌతమీపుత్రుని రాజధానియను నభిప్రాయమునకు సహాయకములుగ నితరాంశములను కొన్నిటిని పేర్కొనవచ్చును. గౌతమీపుత్రుని పుత్రుడైన పులమావియు, తదనంతరరాజులును ఆంధ్రదేశమును పాలించిరనుట సువిదితము.[12] పులమావి ఆంధ్రదేశమును జయించెననుటకు ఆధారము లేదు. కాగా పైతృకముగనే ఆంధ్రదేశము పులమావికి సంక్రమించినది. గౌతమీపుత్రుని యశ్వములు సాగరత్రయజలపానము జేసెనను(13) వర్ణన గౌతమీపుత్రున కీదేశముతో గల సంబంధమును సువ్యక్తముచేయుచున్నది. మరియు తూర్పు సముద్ర మీసాగరత్రయమున చేరియున్నది.

8. Jayaswal—Saka. Satavahana Hist. Appendix : I
9. Ind. Ant - vol. XXXX VII pp. 151...155.
10. E. I. VIII Ins. VIII 11. E. I. VI pp. 85—89. The Mydavolu grant
12. Inscriptions and coins of Kings Nos. 23—30 are found in Andhradesa
13. See note 6 above

ఆంధ్రదేశమున కీరాజన్యుడు పరిపాలకుడు కానియెడల నతడు త్రిసముద్రపీతసత్వుడు కాజాలడుగదా! ధాన్యకటకమున కనతిదూర స్థలములగు నమరావతీ, చేబ్రోలు పట్టణములలో నీరాజు నాణెములు కనుగొనబడినవి [14] నైజామురాజ్యమున ఇటీవల బయల్వెడలిన కొండాపురము, పణిగిరి, గాజులబండలలోని శిథిలములును, పురములును సాతవాహన యుగమునాటివే.[15] తన తనయుడు మహేంద్ర, సిరితన, చకోరాదిపర్వతముల కధిపతియని బాలశ్రీ నాసికశాసనమున వర్ణించినది. మహేంద్రము కళింగదేశమునందలి మహేంద్రగిరియే. కర్నూలుజిల్లాయందలి శ్రీపర్వతము లేక శ్రీశైలమే సిరితనము. శ్రీపర్వతచకోరముల ప్రశంస వాఙ్మయమున కన్పించుచున్నది. చకోరాద్రియు శ్రీపర్వత సమీపమున నుండి యుండును. మరియు నాసికశాసనము పై పర్వతత్రయమును పేర్కొను మిషచే తూర్పుకనుమలను పేర్కొనినది. ఆంధ్రదేశ మధికముగ నీకనుమల కిరువైపుల వ్యాపించియుండుటచేతను గౌతమీపుత్రిసాతకర్ణి ఈకొండలకేలికయగుటవలనను అత డాంధ్రదేశాధిపతియనువిషయము చెప్పకనే చెప్పినట్లైనది.

పైనచెప్పిన యంశములనుబట్టి క్షాత్రపులు పడమటిదేశములనుండి తరిమివేసినప్పుడు సాతవాహనులు వారి స్వదేశమైన ఆంధ్రదేశముననే తలదాచుకొని అచ్చటనే పరిపాలించుచు వచ్చిరని తేలుచున్నది.

గౌతమీపుత్రుడు ప్రతిష్ఠానమునుండి పరిపాలించెనని యెచ్చటను చెప్పబడలేదు. అందువలన పై నాసికశాసనములోని ధనకట లేక బెనాకట అను నగరము ఆంధ్రదేశమునందలి ధనకటమే కావలెను. అప్పుడు ఈరాజు తన రాజ్యకాలమునందలి మొదటి 17సంవత్సరములును ఈధనకటనగరమునుండి ఆంధ్రదేశమును పాలించి, ఆమీద దక్షిణాపథమునందలి ఉత్తరపశ్చిమోత్తరభాగములను, ఇతర ప్రాంతములను జయించి పరిపాలించెనని నిర్ణయింప వచ్చును.

---

14. J. A. H. C. vol III. No. 1.
15. For an account of these places see J. A. H. C. vol. III No. 4 and vol IV. Nos. — I and II. A. B O. R. I. vol. XII pp. 171 — 185

# ఆంధ్రులు—దూరప్రాచ్యదేశములు*

ఆచార్య కె. ఏ. నీలకంఠశాస్త్రి ఎం. ఏ.

క్రీ. శ. 60—70 నాటి 'పెరిప్లస్' అను గ్రంథము మసేలియా అను ప్రాంతము తీరము వెంబడిని, లోభాగమునకును బహుదూరము వ్యాపించియుండెననియు, ఇచట చక్కని సన్న బట్ట తయారుచేయబడుననియు వ్రాయబడినది. స్మార్ఫ్ అను వ్యాఖ్యాత ఈమసేలియా టాలెమీభూగోళమున పేర్కొనబడిన మైసోలియా అగునని చెప్పినాడు. తర్వాత వచ్చిన టాలెమీ మైసోలాస్ అను నదిని, కొంటకొస్సిల, అల్లోస్సెగని అను వాణిజ్య కేంద్రములను, కొడ్డూర అను మరియొక రేవును, క్రైసీకి పోవు ఓడలు బయలుదేరు స్థలమును పేర్కొనినాడు. కొంటకొస్సిల నేటి ఘంటశాల కానగును. కొడ్డూర గూడూరుతో సమన్వయింపబడినది.(1) శ్రీ సుంకుమళ్ళ అచ్యుతరావుగారు ఈస్థలము కృష్ణాముఖద్వారమువద్ద అవనిగడ్డ తాలూకాలో గల కోడూరు కావలెననిరి. ఇది సంభవమే.(2) అల్లోస్సెగని కోరంగి అని ఊహింపబడినది. క్రైసీకి బయలుదేరు ఓడలు తీరము వెంబడి కొంతదూరము పోయి ఆపిమ్మట నొకచోట నుండి తూర్పుగ సముద్రములోనికి తిరిగెడివట.(3) ఈస్థలము గోదావరీముఖద్వారమునకు దగ్గరగ నుండెను. మలేఇండోచైనాలకు క్రీస్తుశకారంభకాలముననే అనేకమంది హిందువులు వలసపోయిరని ఎల్లరు నంగీకరించుచున్నారు. పైనపేర్కొనబడిన రెండు గ్రీకు గ్రంథములు నీసందర్భమున ఆంధ్రులు ముఖ్యపాత్రను నిర్వహించిరని సూచించుచున్నవి. సాతవాహనులు క్రీస్తుశకారంభమున కీవలావల గల కాలమునందీప్రాంతము నేలిరి. వారికాలమునందే యీదూరప్రాచ్యదేశములకు ఆంధ్రుల ప్రభావము, ముఖ్యముగ నౌకావిషయికము, వ్యాపించియుండును. ఈసాతవాహనుల పరిపాలన నంతరించినపిమ్మటకూడ నీప్రభావము కనిపించుచున్నది.

ఈప్రాంతమున లభించిన ప్రాచీనశాసనముల లిపి ఆంధ్రదేశసంబంధమును సూచించుచున్నది. ఈశాసనములు చంపా, తూర్పు బోర్నియో, పశ్చిమజావా, మలేద్వీపకల్పములలో దొరికినవి. ఇవి క్రీ. శ. 300—500 నాటివి. డా॥ వోగెల్ సూచన ననుసరించి యీశాసనముల లిపి పల్లవలిపిగ పరిగణింపబడుచున్నది. అంతకుపూర్వమే బర్నెల్ పండితుడు దీనికి వేంగీలిపి అని పేరు పెట్టినాడు.(4) పల్లవులు అధికారమునకు వచ్చుటకు చిరకాలము పూర్వమే హిందువులు ప్రాచ్యదేశములకు పోయి యుండిరని క్రోంపండితుని అభిప్రాయము. పల్లవులు వాడిన లిపిని పల్లవులే ప్రవేశపెట్టిరని చెప్పుటకు వీలు కాదనియు, ఈప్రాచ్యదేశములకు వచ్చిన పల్లవలిపి సమ

---

* ఆంగ్లమునకు అనువాదము—సంపాదకుడు.

1. Dubreuil — Ancient Dekkan pp. 86—88
2. Mc Crindle — Ptolemy p. 68 3. I bid p. 69
4. VG vii pp. 73—4

శాలికపల్లవరాజ్యమునుండికాక అంతకు పూర్వము స్వతంత్రరాజ్యములు వర్ధిల్లిన ప్రదేశమునుండియే తీసికొని రాబడియుండుననియు కూడ పైపండితుని అభిప్రాయము (౫) ఇదిమిక్కిలి సమంజసముగ నున్నది. ఇటీవల లభించిన శాసనములను పరిశోధించినచో దక్షిణాపథమున దొరికిన అశోకుని బ్రాహ్మీశాసనములును, భట్టిప్రోలుచైత్యబ్రాహ్మీశాసనములును మొదలుగ ఇక్ష్వాకుశాలంకాయనవిష్ణుకుండిన శాసనములద్వారా పల్లవగ్రంథలిపి పరిణతమయ్యెనని స్పష్టమగుచున్నది. ఈప్రాచ్యదేశములలో దొరికిన శాసనముల లిపి అదేకాలమున ప్రాగాంధ్రమున దొరికిన శాసనముల లిపిని పోలియున్నది. ఇట్టిలిపిలో చెక్కబడిన శాసనములు ద్రవిడదేశమున దొరకలేదు. అదియునుగాక నీప్రాచ్యదేశములలో ముఖ్యముగ చంపాలో, లభించిన శాసనములలో పృథివీశబ్దము ప్రిథివీశబ్దముగను, మష్కృతిశబ్దము మ్రిష్కృతశబ్దముగను కనిపించుచున్నవి. నేటికిని ఆంధ్రులీశబ్దములను ప్రిథివీ, మ్రిష్కృత అనియే ఉచ్చరింతురు. ఈయంశము నీప్రాంతమునకు మొదట వలసవచ్చినవారు ఆంధ్రదేశీయులే అని సూచించును.

కళావిషయమున ఆంధ్రసంబంధ మీప్రాంతములలో స్పష్టముగ గాంచనగుచున్నది. శిలానిర్మితములును, కంచులో పోతపోయబడినవియు నగు ఆరు బుద్ధవిగ్రహములు ఈదేశములలో దొరికినవి. ఈవిగ్రహములు అన్నివిధములను అమరావతీబుద్ధవిగ్రహములను పోలియున్నవి. వీనిలోనెల్ల ప్రాచీనతమమైనది సుమాత్రాద్వీపమున పాలెంబాంగ్‌కు సమీపమున బుకిత్ సెగున్‌టాంగ్ అనుచోట దొరికిన నల్లరాతి బుద్ధవిగ్రహము. మొత్తము మీద నీవిగ్రహము 12 అడుగుల యెత్తు ఉన్నది. ఈవిగ్రహమున ఉత్తరీయము రెండు భుజములను కప్పివేసి, మెడను చుట్టుకొని యున్నది. దీనివిబట్టి యిది కుడిభుజముక్రింద నుండి పైకి వచ్చి యెడమముంజేతి మీద విడువబడిన ఉత్తరీయముగల అమరావతీబుద్ధవిగ్రహముకంటె ప్రాచీనమనియు, బహుశః క్రీ. శ. 2వశతాబ్దిది కావచ్చుననియు, ఇదియును అమరావతిలోనే నిర్మింపబడియుండుననియు, సయాంలోని పోంగ్‌టుక్ వద్ద దొరికిన చిన్న కంచుబుద్ధవిగ్రహము నిదేరీతి నున్నదనియు, ఈరెండును క్రీ. శ. 150తో అంతమైన ఒక భారతీయశిల్పపద్ధతిలో నిర్మింపబడినవనియు,(6) క్రీ. శ. 2వశతాబ్దిలోనే ఇట్లు నిర్మింపబడిన విగ్రహములను వేంగినుండి యితరదేశములకు పంపుట ప్రారంభమయ్యెననియు బెఖోఫెగ్ అను కళావిమర్శకుని అభిప్రాయము. పైకంచువిగ్రహము 1927 లో దొరకినది. దీనితోపాటు క్రీ. శ. 1, 2 శతాబ్దులనాటి దీపపుసెమ్మె ఒకటి లభించినది. అది గ్రీకోరోమను పద్ధతిలో ఉన్నది. కృష్ణాజిల్లాఅల్లూరులోని ప్రాకృతశాసన మొకటి 'యొనకదీపిక'ను పేర్కొనుచున్నది.(7) బహుశః పైదీపిక ఆప్రాంతముననే తయారుచేయబడి పైవిగ్రహముతోపాటు సయాంకు కొనిపోబడెనేమో! ఆనాటి చంపాలోభాగమగు నేటి అన్నాంలోని క్వాంగ్‌నాంరాష్ట్రమున డాంగ్

5. HJG. pp. 69—70
6. JGIS (1935) pp. 124—6
7. Gopalachari — Early History of the Andhra country p. 89

డూఓంగ్ అనుచోట ఒకమీటరు ఎత్తుగల మరియొక కంచుబుద్ధవిగ్రహము దొరికినది. ఇది మనోహరమగు విగ్రహము. కుడిభుజము మీద ఉత్తరీయము లేదు. దక్షిణహస్తము చిన్ముద్రలోను, వామహస్తము కటకాకృతిని ఉన్నవి. ఇది అమరావతీసాంప్రదాయమునకు చెందినది. ఈవిగ్రహము దొరికినప్రాంతమునకు పూర్వము అమరావతి అని పేరుండెను. దక్షిణజావాలో మరియొక కంచుబుద్ధవిగ్రహము లభించినది. దీని యెత్తు 42 సెంటిమీటర్లు. 75 సెంటిమీటర్ల యెత్తుగల మరియొక విగ్రహము సెలిబిస్ దీవి పడమటితీరమున దొరికినది. డా॥ బాష్ అను పండితుడు ఈసెలిబీస్ విగ్రహము అమరావతిలో నిర్మింపబడి, అక్కడనుండియే ఈదీవికి పంపబడెననియు, స్థానిక శిల్పపద్ధతికిని దీనినిర్మాణపద్ధతికిని ఎట్టి పోలికయు లేదనియు వ్రాసినాడు.(8)

బర్మా ఆంధ్రదేశమునకు మిక్కిలి సమీపమునందుండుటవలన ఆదేశమున ఆంధ్రుల ప్రభావము విశేషముగ కనిపింపవలెను. కాని యీరెండు దేశముల ప్రాచీనసంబంధమును సూచించుటకు కొన్ని గాథలుమాత్రము కలవు. ఇచటి మాన్ప్రజల ప్రతినామమగు తలెఇంగ్ 'తెలుగు' శబ్దమును స్ఫురింపచేయుననియు, అందువలన నీప్రజలలో కొందరైనను తెలుగువారు కలరనియు ఒకవాదము. ఒక గాథప్రకారము క్రీ. పూ. 345 లో ఈ తెలింగులే థటన్ను స్థాపించిరి. డా॥ నిహార్ రంజన్ రే అను పండితుడు క్రీ. శ. 5, 6 శతాబ్దులలో ప్రోం ప్రాంతమున వర్ధిల్లిన థేరవాద బౌద్ధము ఆంధ్రకుంతలపల్లవభూములలోని అమరావతినాగార్జునకొండ కాంచీపురం కావేరీపట్టణ ఉరగపురములనుండి వచ్చియుండవలెనని వ్రాసినాడు.(9)

క్రీ. శ. 10వశతాబ్దివరకునుకూడ నీమూర దేశములపై ఆంధ్రదేశప్రభావము సాగుచునే వచ్చెను. కాంభోజదేశమునందు ఈకాలమున పాశుపతశైవము వర్ధిల్లినది. క్రీ. శ. 968నాటి ఒకశాసనమునందు ఈ క్రింది శ్లోకము కలదు—(10)

దక్షిణాపథవిన్యస్తసార స్సిద్ధిప్రదోఽర్థినాం।
యుక్తం యో యుక్తినిపుణై శ్శ్రీపర్వత ఇతీరితః॥

ఇందొకరాజు శ్రీపర్వతముతో చమత్కారముగ పోల్చబడినాడు. ఈశ్రీపర్వతము శైవమతమునకు ఆటపట్టుగనుండిన శ్రీశైలమే.

ఇంతవరకును ఆంధ్రదేశమునకును దూరప్రాచ్యదేశములకును గల సంబంధము స్థాలీపులాకన్యాయముగ పేర్కొనబడినది. ఈయంశమును జాగ్రత్తగ పరిశోధించినియెడల ఎన్నియో వివరములును, విశేషాంశములును బయల్పడగలవు.

---

8. TBG 1933  9. Theravada Buddhism in Burma p. 44.
10. Coedes — Ins. du Cambodge I. p. 149 (v. 7)

# సాతవాహనయుగము — కళావైభవము

డా॥ మారేమండ రామారావు. యం. ఏ., పి. హెచ్. డి.

సాతవాహనయుగము రాజకీయమతసాంఘికార్థికాభివృద్ధికేగాక కళావికాసమునకు గూడ మహోజ్జ్వలమగు ఘట్టము. ఒకవంక సాతవాహనసామ్రాట్టులు విజయపరంపరల నార్జించి తమసామ్రాజ్యమును బహుముఖముల విస్తరింప, ఇంకొకవంక గుణాఢ్యశ్రీపాలితహాలసాతవాహనాదులు అమృతప్రాయములగు ప్రాకృతకావ్యములను రచింపుచుండ, మరియొకవంక నాటశిల్పాచార్యులు వాస్తుశిల్పచిత్రములను సృష్టించి అవిచ్ఛిన్నమగు కళాసత్రయాగమును సాగించుచుండిరి. ఉత్తర సాతవాహనయుగమునాటి అజంతాచిత్రములను, ఎల్లోరాబాదామిగుహాశిల్పములను, మహాబలిపురముమున్నగుచోట్లగల పల్లవవాస్తువులను సూక్ష్మముగ పరిశీలించిన యెడల వీనికన్నిటికిని ప్రాతిపదికలు సాతవాహనయుగమున గాంచనగుచున్నవి. నేడు లభించు ఆధారములనుబట్టి భారతీయకళ అశోకమౌర్యునికాలమున ప్రారంభమయ్యెనని పండితులు నిర్ణయించినారు. అతడు నిర్మించిన స్తూపములు సాంచీ, బార్‌హుట్, గయ, సార్‌నాథులలో కనిపించుచున్నవి. ఇవి అన్నియు ఇటుకలతో నిర్మింపబడిననిరాడంబరములగుకట్టడములు. ఈస్తూపనిర్మాణము సాతవాహనయుగమున అమరావతీమహాచైత్యమున పరమావధి నందినది. బరాబర్ కొండలలో అశోకునికాలపు గుహలు కొన్ని కలవు. ఈగుహావాస్తువు సాతవాహనయుగమునందు అద్భుతమగు పరిణామమును గాంచి ఆందోకశాఖ కార్లాచైత్యగృహమున పరమావధినందినది. అశోకుని స్తూపములకు చుట్టునుండిన ప్రాకారములు నిరాడంబరములు. బార్‌హుట్ సాంచీలలో శుంగులకాలమున అడ్డునిలువుమూలములతో ఒకవిధమగు ద్వారములు ప్రాకారములలో నాలుగుదిశలను నిర్మింపబడినవి. ఆంధ్రదేశమునందలి అమరావతి, భట్టిప్రోలుమున్నగుచోట్లగల చైత్యములచుట్టును ప్రాకారములుండెడివి కాని యందు ప్రత్యేకద్వారములున్నట్లు కనిపింపదు. ఆంధ్రస్తూపములలో దొరికిన చైత్యశిలాఫలకములమీద ప్రాకారమునందలి నాలుగు దిక్కులను గల ప్రవేశముల కిటునటు సింహస్తంభములుమాత్రమున్నట్లు చెక్కబడినది. ఈ ప్రాకారద్వార(తోరణ)నిర్మాణము సాతవాహనయుగమున ప్రాయికముగ నాచారముగనుండె ననుటకు పెక్కు శిల్పములును, నాసికలోని బాలశ్రీగుహయు నిదర్శనములు. కాని స్తూపప్రాకారమున నాలుగుదిక్కులను మనోహరములగు ద్వారములు ఒక్క సాంచీయందే కనిపించుచున్నవి. ఈసాంప్రదాయ మిచ్చట సాతవాహనయుగమున పరమావధిని గాంచినది. ఈసాంచీద్వారములును, అమరావతీశిల్పములును లోకోత్తరములు. కార్లాచైత్యగృహము అనుపమము. సాతవాహనయుగమునకు మకుటాయమానములగు వీనిప్రభావము దేశదేశాంతరములందును గాంచనగుచున్నది.

ఆంధ్రశాతవాహనయుగము బౌద్ధమతచరిత్రలో బహుశోభావంతమగు ఘట్టము. ఈ యుగపు కళ అంతయు బౌద్ధకళ. నాటిబౌద్ధమునకు వాస్తుశిల్పచిత్రకళలు పరిచారిక లైనవి. మహాదేవభిక్షు ఆచార్యనాగార్జున భదంత ఆనందాది ప్రసిద్ధభిక్షువుల ధర్మబోధలు వారితోనే అంతరించినవి. వారి బోధనాశక్తి, వారి వర్ణనాకౌశలము, వారి జనాకర్షణశక్తి, వారి భౌతికదేహములతో అంతరించినవి. కాని ఆనాడు వారి కనుసన్నల మెలగి, వారి ఆజ్ఞల నౌదలదాల్చి సుత్తిని చేతబట్టిన నాటి శిల్పాచార్యుల సోపజ్ఞమైన కళాసృష్టి, జాతకకథలను, బుద్ధజీవితగాథలను అజరామరముల నొనర్చి నేటికిని నిలచి యున్నది.

ఈయుగపు వాస్తువులను గుహలనియు, ఇటుకకట్టడములనియు, ద్వారములనియు మూఁడుతెరగులుగ విభజింపవచ్చును. గుహలు తిరిగి చైత్యగృహములనియు, విహారములనియు, సమావేశభవనములనియు మూఁడురకములు. ఈగుహలు మహారాష్ట్రమున పలుతావులను, ఆంధ్రదేశమున గుంటుపల్లి, సంఘారామ, కోరుకొండ, ఎర్రింపాలెం, కాపవరములలోను కలవు.

చైత్యగృహములు :— వీనిలో చైత్యగృహములు సాధారణముగ ముందు చతురస్రముగను వెనుకవైపు వంపుగను ఉండి, ఆ వంపుమధ్య లోభాగమున ఒక చిన్న చైత్యమును కలిగియుండును. ఈచైత్యము ఆరాధన చైత్యము. ఇంతవరకును మనకు దొరికిన చైత్యగృహములలో బహుసంఖ్యాకములు ఈ ఆకారమునే కలిగియున్నవి. కాని ఇందు కొంత వైవిధ్యమున్నది. కరాద్, జునార్, సంఘారామములలో చతురస్రములగు చైత్యగృహము లున్నవి. జునార్, కొండ్వేటే, గుంటుపల్లులలో గుండ్రని ఆకారముగలవి ఉన్నవి. సాధారణముగ చైత్యగృహములలో ముందు స్తంభములుగల ఒక వసారా ఉండి, దాని వెనుక అటునిటు స్తంభములవరుసలును, వానినంటి ప్రదక్షిణపథము నుండి మధ్య చైత్యముండును. మహర్ అనుచోట ఒక చావడియు, దానిమధ్య నొక చైత్యమును కలవు. ప్రాయికముగ వీనిలోని చైత్యము రాతిలో చెక్కబడి ప్రత్యేకముగ నిలచి యుండును. కాని మహర్జునారులలో ఈ చైత్యము గోడమీద చెక్కబడిన చైత్యగుహ లున్నవి. కరాద్జునారులలో ఇతరస్థలముల చైత్యము మీఁదనున్న ఛత్రము కప్పులోభాగమున చెక్కబడియున్నది. ఇతర చైత్యాలయములలో గాంచనగు ప్రదక్షిణపథము కరాద్చైత్యగృహములో లేదు. సాధారణముగ చైత్యము పైకప్పు కోళ్ళగూఁడువలె వంపుగలిగి లోపలి భాగమున కమ్ము లుండును. జునార్లో ఒక చైత్యాలయమున సమనైన కప్పు కలదు. బేడ్సా, పెతిల్కోరా, జునారులలో కొన్ని చైత్యగృహములలో చిత్రములు కలవు. ఈ విధమగు కట్టడములలో నెల్ల 10౯అడుగుల లోతును, 45½అడుగులవెడల్పును, 46అడుగులఎత్తునుగల చైత్యగృహము మిక్కిలిపెద్దది. అల్లే అన్నిటికంటెను చిన్నవి కుడామహార్లలో ఉన్నవి. అవి 15అడుగుల చతురములు. అదేవిధమున ఈకట్టడములలో గాంచనగు చైత్యములలో 16అడుగులవ్యాసముగల కార్లాకన్హేరీచైత్యములు పెద్దవి. 4అడుగుల వ్యాసముగల సంఘారామచైత్యము చిన్నది.

సాతవాహనయుగపు చైత్యగృహములు కొండలలో దొలవబడినవేకాక ఇటుకలతో

కట్టబడినవికూడ గలవు. వీనిలో కొన్ని సమతలములయందున్నవి. కొన్ని కొండలమీద నిర్మింపబడినవి. వీనియందును పలురకములు కనిపించుచున్నవి. ఇందు సాధారణముగ చైత్యముండును కాని శాలిహుండం, సంఘారామము, గుంటుపల్లి, విద్యాధరపురములలో చైత్యమునకు బదులు బుద్ధవిగ్రహ ముండెడిది. ఈచైత్యములు ప్రాయకముగ ఇటుకవే అయినను రామతీర్థమున శిలా చైత్యములున్నవి. గుంటుపల్లి, రామతీర్థములలోమాత్రము లోభాగమున వలయము చివర అడ్డగోడ కలదు. ఈచైత్యగృహములలో 60అడుగుల పొడవును, 13అడుగుల వెడల్పునుగల రామతీర్థచైత్యాలయము మిక్కిలి పెద్దది. 9'9పొడవును 8'6వెడల్పునుగల సంఘారామ చైత్యగృహము మిక్కిలి చిన్నది.

స్తూపములు :— ప్రతిబౌద్ధతీర్థమునను ఒక మహాచైత్యము ప్రధానముగ ఆరాధ్యముగ నుండెడిది.. దానిచుట్టును అనేకస్తూపము లుండెడివి. స్తూప, చైత్య, దగోబా, అనుపదములు పర్యాయపదములుగ వాడబడుచున్నవి. స్తూప అనునది స్తుప్ (ప్రోగుచేయుట) అను సంస్కృతధాతువునుండి వచ్చినది. చైత్య శబ్దము చితాశబ్దభవము. ఈరెండుమాటలును కూడ శరీరము దహనము చేయబడినపిమ్మట మిగులు బూడిద మున్నగు వానిమీద నిర్మించబడిన కట్టడమను అర్థము నిచ్చుచున్నవి. థూపో అను పాళీపదము స్తూపశబ్దమునకు రూపాంతరము కావచ్చును. దగోబా అనునది ధాతుగర్భశబ్దమునకు రూపాంతరముగ ఎంచబడుచున్నది. బర్మాయున్నగుచోట్ల నిదియే 'పగోడా' అని వ్యవహరింపబడుచున్నది.

ఈస్తూపములు సామాన్యముగ శారీరకములనియు, పారిభోగికములనియు, ఉద్దేశికములనియు మూడు విధములు. శారీరకములు దంతములు, గోళ్ళు, కేశములు, చితాభస్మము, ధాతువులు మున్నగు వానిమీద నిర్మింపబడినవి. పారిభోగికస్తూపములు ఆయా వ్యక్తు లుపయోగించిన వస్తువులమీద నిర్మింపబడినవి. ఉద్దేశికములు వారివారి జ్ఞాపకార్థము కట్టబడినవి.

స్తూపమునకు బౌద్ధమతమూలమున విశేషమగు ప్రాముఖ్యమును, ప్రచారమును లభించినవి కాని అవి బౌద్ధుల ప్రత్యేకనిర్మాణము కాదు. జైనులును స్తూపములను నిర్మించిరి. బుద్ధునికి పూర్వమే సుప్రసిద్ధుల శరీరావశేషములమీదను, వారి స్మారకముగను స్తూపములను నిర్మించు ఆచార ముండెడిది. అతని జీవితకాలమునందు అతడే కొందరు శిష్యుల శరీరావశేషములమీద వీనిని నిర్మింపచేసెను. ఆమహనీయుడే తాను మరణించుటకు ముందు బుద్ధులయొక్కయు, ప్రత్యేక బుద్ధులయొక్కయు, అర్హతులయొక్కయు, చక్రివర్తులయొక్కయు స్మారకముగ స్తూపములను నిర్మింపవలెనని చెప్పెనట.

బుద్ధుడు మరణించినపిమ్మట అతని శరీరావశేషములకొరకు కొంత వివాదము జరగెను. తుదకు అవి ఎనిమిది భాగములు చేయబడి ఎనిమిది చోట్ల స్తూపములలో భద్రపరుపబడెను. అశోకచక్రవర్తి బౌద్ధము నవలంబించినపిమ్మట వీనిలో ఒక్క రామగ్రామ స్తూపము తప్ప మిగిలిన ఏడుస్తూపములను తెరిపించి, వానిలోని బుద్ధధాతువులను ముక్కలు చేయించి, వివిధప్రాంతముల బౌద్ధులకు పంచియిచ్చి 84వేలస్తూపములను కట్టించె

నట. ఆంధ్రదేశమున బయల్పడిన భట్టిప్రోలు, అమరావతి, నాగార్జునకొండమహాచైత్యములు బుద్ధుని ధాతువులమీద నిర్మింపబడినవే.

ఈస్తూపములు మొట్టమొదట మిక్కిలి నిరాడంబరములుగ నుండెడివి. క్రమక్రమముగ ఇవి అభివృద్ధిచెందినవి. సౌందర్యమునకును, శిల్పశోభకును అమరావతియందును, ఎత్తుగ పెరుగుటకు సింహళబర్మాలలోను, విస్తృతికి బోరోబాదురులోను స్తూపము పరమావధిని గాంచినది.

ఈస్తూపములు ముఖ్యముగ రెండురకములు. కొన్ని కొండలలో రాతిలో దొలవబడినవి. వీనిలో చిన్నచిన్న ఉద్దేశికస్తూపములు కొన్ని, పెద్దపెద్దచైత్యములు కొన్ని. చిన్నచిన్న స్తూపములు ఆంధ్రదేశమున సంఘారామము వద్ద లింగాలమెట్టమీద వందలకొలది కలవు. బొజ్జన్నకొండమీదను కొన్ని కలవు. మహారాష్ట్రమున భాజాలో 17వనంబరు విహారమునకు సమీపమున చిన్నస్తూపములు 14 కలవు. పెద్దస్తూపములు ఒక్కసంఘారామమునసే కలవు ఇందు బొజ్జన్నకొండశిఖరమున ఉన్న ఏకశిలాస్తూపము 64 అడుగుల 8 అంగుళముల వ్యాసము కలది. ఇటువంటిది, ఇంతపెద్ద స్తూపము మరియెచ్చటను లేదు. ఇచ్చటనేగల ఉద్దేశికఏకశిలాస్తూపములలో 2 అడుగుల వ్యాసముకలవి 54 ఉన్నవి. ఈతరగతికి చెందిన, ఇంతకంటెను చిన్నవిఅయిన స్తూపములు మరియెచ్చటను లేవు. రెండవరకపు స్తూపములు ఇటుకతో నిర్మింపబడినవి. వీనిలోనెల్ల 138 అడుగుల వ్యాసమును, 100 అడుగుల ఎత్తును గల అమరావతీమహాచైత్యము మిక్కిలి పెద్దది. దీనితర్వాత గణనకువచ్చునది భట్టిప్రోలుస్తూపము.

ఇట్టిస్తూపములు ఆంధ్రదేశమునందు గంజాంజిల్లాలోని శాలిహుండమునను, విశాఖపట్టణంజిల్లాలోని రామతీర్థం, ధారపాలెం, సంఘారామములందును, తూర్పుగోదావరి జిల్లాలోని ఆదుర్రు, కొడవలి, పిఠాపురముల లోను; పశ్చిమగోదావరిజిల్లాలోని గుంటుపల్లి, ఆరుగొలనులలోను; కృష్ణాజిల్లాలోని జగ్గయ్యపేట, నందిగామ, విద్యాధరపురము, గుడివాడ, ఘంటసాలలలోను; గుంటూరుజిల్లాలోని భట్టిప్రోలు, అమరావతి, నాగార్జునకొండ, గరికపాడు, గోలి, చినగంజాం, పెదగంజాం, మాడుగుల, బుద్ధాంలలోను; నైజాం రాజ్యమునందలి గుమ్మడిదుర్రు, అల్లూరు, కొండాపురం, ఫణిగిరి, గాజులబండలలోను కలవు.

ఈస్తూపముల నిర్మాణమునందును వైవిధ్యము కనిపించుచున్నది. కొన్ని చతురస్రము మీదను, కొన్ని వర్తులముమీదను, కొన్ని స్వస్తికమీదను, కొన్ని బండిచక్రమువలెను నిర్మింపబడినవి. కొన్నిటి లోభాగమున నీరుపోసి దిమ్మిసచేయబడిన మట్టి నిర్మాణము కలదు. కొన్నిటిలో ఇటుక కంకరయు మట్టియు కలిసి యున్నవి. కొన్నిటిలో ఒకవరుస మట్టియు దానిపైన ఒకవరుస ఇటుకచపటాయు కలవు.

విహారములు :— ఇవి బౌద్ధభిక్షువులు నివసించుటకై ఏర్పరుపబడు వసతులు. వీనిలో చిన్నచిన్న గదులుండును. వీనిలో కొన్ని గుహాలు, కొన్ని సమతలమున కట్టబడినవి. గుహావిహారములు అనేకములు మహారాష్ట్రమున కలవు. వీనిలో చిన్నచిన్న అరుగులున్నవి. ప్రతివిహారమునకును ఒక్కొక మంచి

నీటితొండి గలదు. ఆంధ్రదేశమున శాలిహుండం, రామతీర్థం, సంఘారామము అమరావతి నాగార్జునకొండలలో ప్రత్యేకముగ నిర్మింపబడిన కట్టడములు కలవు. వీనిని పరిశోధించినప్పుడు ఆకాలపు భిక్షువులు ఉపయోగించిన అనేకవిధములగు వస్తువులు దొరికినవి. నాగార్జునకొండవిహారములలో పాకశాలలు, స్నానాగారములు, మురికినీరు పోవుటకు కాలువలుకూడ నుండెడివి. విజయపురిలో ఆచార్య నాగార్జునునికొరకు సాతవాహనరాజు అనేక అంతస్థులుగల విహారమును కట్టించెనట. ధాన్యకటకము సమీపమున ఎన్నో సంఘారామము లుండెడివి. వేంగిలో బహుగోపురములతో శోభించెడి పెద్ద సంఘారామము ఉండెడిది. ధాన్యకటకసంఘారామమును అనుకరించి టిబెట్‌లోని లాసాలో ఆరు విద్యాశాలలుగల విద్యాపీఠము నిర్మింపబడెనట. అల్లూరులో దొరికిన ఒకశాసనమును బట్టి అచ్చట పూర్వశైలీయభిక్షుసంఘముయొక్క విహార ముండెడిదని తెలియుచున్నది.

సమావేశభవనములు :— వందలువేలు భిక్షువులును, భిక్షుణీలును నివసించెడి బౌద్ధతీర్థములలో తరచుగ ధర్మబోధలును, ధర్మచర్చలును జరుగుచుండెడివి. ఆసమయము లలో చుట్టుప్రక్కలనుండిన ఉపాసకులును వచ్చుచుండిరి. ఇట్టి సమావేశములు జరుగుటకు విశాలములగు భవనము లవసరము లయ్యెను. కన్హేరీ, నాసిక, కార్లామున్నగుచోట్ల కొండలలో పెద్దపెద్దభవనములు నిర్మింపబడినవి. ఆంధ్రదేశమున సంఘారామ, రామతీర్థం, గుంటుపల్లి, నాగార్జునకొండలలో ఇట్టిభవనము లుండెడివి. వీనిస్తంభములు నేటికిని నిలచియున్నవి.

శిల్పములు :— పైన వివరింపబడిన వాస్తువులలో కొన్ని శిల్పశోభితములు. మహారాష్ట్రమునందలి గుహాలలో చాలభాగము నిరాడంబరములు. కొన్నిటిలోమాత్రము స్తంభముల మీదను, గుహాముఖములమీదను చైత్యవాతాయనప్రాకారజంతుశిల్పములు కలవు. కార్లాభాజాకన్హేరీచైత్యాలయములలో కొద్దిగ మనుష్యశిల్పము (మిధునములు) కలదు. ఇది అంతయు ప్రాచీనము. వీటిలోను, ఇతరగుహలలోను మహాయానము ప్రబలినపిమ్మట బుద్ధశిల్పములు చెక్కబడినవి. సాతవాహన యుగముయొక్క కళాశోభకు శిల్పము ఉత్కృష్టనిదర్శనము. సాంచీద్వారములును, అమరావతీమహాచైత్యమును ఆనాటి లోకోత్తరశిల్పమునకు నిధులు. ఇంతియేగాక చిత్రలేఖనముకూడ ఈ యుగమున వర్ధిల్లినది. బేడ్సా, పితల్‌కోరా, జునారులలో కొన్ని గుహాలయందును, అజంతాలోని మూడు ప్రాచీన గుహాలయందును ఈకాలపు చిత్రలేఖనము గాంచనగుచున్నది.

# ౧. మహారాష్ట్రమునందలి గుహాలు*

నేడు దక్షిణాపథమునందలి పశ్చిమోత్తర భాగము మహారాష్ట్రమని పిలువబడుచున్నది. ఇందు రాష్ట్రిక, పెటనకభోజకులను తెగల వారు నివసించుచుండిరి. కొంతకాలము ఈ ప్రాంతమున మౌర్యుల అధికారము సాగెను. అశోకునికాలమునందు ఈతెగలవారు అతని సామ్రాజ్యపు పడమటిసరిహద్దునందుండిరి. ఆచక్రవర్తి మరణించినపిమ్మట ఆంధ్రసాతవాహనవంశజుడగు సిముకు డీప్రాంతమును జయించి పరిపాలించెను. సాతవాహనుల యధికార మీప్రాంతముమీద సుమారు ఒకటిన్నర శతాబ్దముల కాలము సాగెను. ఆమీద క్షహరాటులు దీనిని జయించి కొంతకాలము ఏలిరి. పిమ్మట సాతవాహనులు తిరిగీ ఈప్రాంతమును వశపరచుకొనిరి. ఆమీద ఉజ్జయిని నుండి రాజ్యమేలిన శకక్షాత్రపులు దీనిని కొద్దికాలము పరిపాలించిరి. మరల నిది సాతవాహనుల వశమయ్యెను. ఇట్లు మధ్యమధ్య కొంతకాలమునతప్ప సుమారు నాలుగుశతాబ్దులకాలము మహారాష్ట్రము సాతవాహనుల ఏలుబడియందుండెను. ఈకాలమున అనేకస్థలములలో బౌద్ధసంఘములకొరకు పర్వతములలో చైత్యగృహములును, విహారములును, సమావేశభవనములును దొలవబడినవి. ఇట్టిగుహాలు భాజా, బేడ్సా, కొండనే, కార్లా, కన్హేరీ, కొండ్వేటే, కుదా, కోల్, కరాద్, పితల్‌కోరా, నాసిక, నానాఘాట్, జునార్, మహార్, వాయ్, శైలర్‌వాడీ, మొరోల్, సిర్వాల్, అజంతా మొదలగుచోట్ల గాంచనగుచున్నవి. మొత్తముమీద ఈస్థలములలో మూడునాలుగువందల గుహ లున్నవి.

పైగుహాలలో అనేకభేదములు కనిపించుచున్నవి. కొన్ని మిక్కిలి మోటుగను, నిరాడంబరములుగను ఉన్నవి. మరికొన్ని చక్కని పనితనముతో, సుందరశిల్పములతో అత్యాడంబరములుగ నున్నవి. కొన్నిటియందు శాసనములు చెక్కబడియున్నవి. చాలగుహాలలో ఇవి లేవు. శాసనములు ఆయాగుహాల నిర్మాణకాలములను ఆనాటి సాతవాహన రాజుల రాజ్యకాలసంవత్సరములద్వారా తెలియచేయుచున్నవి. కొన్ని గుహాలలో ఇట్టి రాజ్యకాలవర్షములను పేర్కొనక, ఆయాగుహాలను దొలిపించినవారి పేర్లను మాత్రము తెల్పు శాసనము లున్నవి. ఈశాసనముల లిపినిబట్టి ఆయాగుహాల నిర్మాణకాలములను ఊహింపవచ్చును. అట్లే శాసనములు లేని గుహాలయొక్క నిర్మాణకాలమును వాని సాముదాయికలక్షణములనుబట్టియు, నిర్మాణకాలములు తెలియవగిన ఇతరగుహాలతోగల పోలికలను బట్టియు ఊహింపనగును. నానాఘాట్‌లో ఒక గుహాయందు సాతవాహనరాజుల కుటుంబ శిల్పము లున్నవి. మరియొక దానిలో నాగానికి శాసన మున్నది. ఈరెండును బహుప్రాచీనములు. అట్లే కొండనే, భాజా, బేడ్సా, శైల

* ఈగుహాలలో చాలభాగము నేను 1943, 1947 లలో చూచితిని. ఈవిభాగము నేను వ్రాసుకొనిన సూచనలనుబట్టియు, ASWI. IV, V, VI. Cave Temples of W. India, Inscriptions in Cave Temples అను గ్రంథముల సహాయముతోను వ్రాయబడినది.

ర్వాడీ గుహాలలో కొన్ని క్రీ. పూ. 250_100 నాటివి. జునార్. పితల్‌కొరా, నాసికలో ఒక గుహ కొంచెమెక్కువతక్కువగ నీకాలపువే. అజంతాలోని 8, 9, 10, 12, 13 నంబర్లు గల గుహాలు క్రీ. పూ. 150 నాటివి కావచ్చును. కన్హేరీలో కొన్ని గుహాలు క్రీ. పూ. 100_క్రీ. శ. 150 నాటివి. కొన్ని క్రీ. శ. 5, 6 శతాబ్దులనాటివి. నాసికకార్లాలలో ముఖ్యములైన గుహాలు క్షహరాట నహపానుని యొక్కయు, సాతవాహనులలో గౌతమీపుత్ర, వాసిష్ఠీ పుత్రపులోమావి, యజ్ఞశ్రీల యొక్కయు కాలపువి.

ఈగుహాలలో ముఖ్యమైనవాని నీక్రింద వర్ణించుచున్నాము :—

కుడా :— ఇది రత్నగిరిజిల్లాలో సావిత్రి నదీతీరమున బొంబాయికి దక్షిణముగ 45 మైళ్ళదూరమున గలదు. ఇచ్చట రాజపురీ కొండలను కొండలు కలవు. ఈకొండలలో నొకటి రెండుభుజములు కలిగియున్నది. అందు ఉత్తరభుజమున 23గుహాలు దొలువబడి యున్నవి. వీనిలో నొకదానియందుమాత్రము శిల్పమున్నది. తక్కినవి నిరాడంబరములు. ఇందు 8, 15నంబర్లుగలవి రెండు చైత్యగృహములు. 16_2_ నంబర్లుగలవి చక్కని విహారములు.

౧వగుహ :— ఇది యొక చైత్యగృహము. దీనిముందు 22అడుగుల పొడుగును, 7అడుగుల వెడల్పునుగల వసారా ఉన్నది. దీనిలో రెండు లావైన పలక స్తంభము లున్నవి. ఎడమవైపు గోడలో 7 చదరపుఅడుగుల వైశాల్యముగల గది కలదు. దానిలోపల రాతి అరుగు ఉన్నది. వసారా వెనుకగోడమధ్య 7అడుగుల ద్వారమున్నది. దీని వెనుక 22చదరపుఅడుగుల వైశాల్యముగల చావడి కలదు. ఈచావడి వెనుకఅంచున రెండు లావైన పలకల స్తంభము లున్నవి. ఈ స్తంభముల వెనుక 23అడుగుల పొడవును, 7అడుగుల వెడల్పును గల మరియొకచావడి కలదు. దీని లోపలి గోడలవెంబడి రెండున్నరఅడుగుల ఎత్తుగల అరుగు ఉన్నది. ఈరెండవచావడి వెనుక 15 అడుగుల పొడవును, 14½అడుగుల వెడల్పును గల గదిలో మధ్య రాతిలోదొలవబడిన చైత్య మున్నది. దాని అగ్రము గదిపై కప్పును అంటియున్నది. చైత్యము నిరాడంబరమైనది. ఈగుహాముందువసారాలో క్రీ.పూ. 2వశతాబ్దినాటి బ్రాహ్మీలిపిలో చెక్కబడిన శాసనమొకటి ఉన్నది. దీనినిబట్టి ఈగుహ ఆ కాలమునాటిదని ఊహింపవచ్చును.

౩వగుహ :— ఇది విశాలమైన గుహ. దీనిలో శిల్పమేమియు లేదు. ముందు రెండు స్తంభములుగల వసారా ఉన్నది. వసారా వెనకగోడలో రెండు పెద్ద కంతకిటికీ లున్నవి. దీని వెనుక 34½ చదరపుఅడుగుల చావడి కలదు. గోడలను ఆని అరుగు ఉన్నది. దీనిలో గదులు లేవు. ముందువసారాలో నాసికలోని సాతవాహనరాజులశాసనముల లిపిలో చెక్కబడిన శాసనమొకటి ఉన్నది.

౬వగుహ :— ఇది కుడాలోని గుహాల యందు ప్రధానమైనది. చక్కని చైత్యగృహము. గుహముందు 8అడుగులు ముందుకు వచ్చు మంటపమున్నది. దీని నిటునటు నేనుగులు మోయుచున్నవి. దీనివెనుక ముందు రెండు స్తంభములుగలిగి, 24½ అడుగుల పొడవును, 7½ అడుగుల వెడల్పును గల వసారా ఉన్నది. వసారావెనుకగోడలో 6అడుగుల వెడల్పుగల ద్వార మున్నది. ద్వారమునకు

రెండువైపులను కంతకిటికీ లున్నవి. ద్వారము దాటినతోడనే 29అడుగుల చదరముగల చావడి కలదు. దీనిగోడలను ఆనుకొని అరుగు ఉన్నది. ఈచావడివెనుక అంచుమీద రెండు స్తంభము లున్నవి. వీనిపై నగల అడ్డదూలము మీద జంతువులయొక్కయు, వామనులయొక్కయు, పుష్పములయొక్కయు, శిల్పములుగల ప్రాకారము చెక్కబడి యున్నది. ఈ స్తంభములవెనుక 20అడుగుల లోతును, 15 అడుగుల వెడల్పును, 10½అడుగుల యెత్తును గల గది యున్నది. దీనిమధ్య 7అడుగుల 3 అంగుళముల వ్యాసముగల శిలా చైత్య మున్నది. ఈగుహాముందువసారాలో వెనుక గోడమీద ద్వారమునకు రెండువైపులను శిల్పము లున్నవి. ఎడమవైపు సర్వాలంకార భూషితులైన ఒకస్త్రీయు, ఒక పురుషుడు నున్నారు. స్త్రీ ఎడమచేతిని వామనుని తలపైన ఆనించినది. వామనుడు ఆమె పాదములకు గల అందెలను సర్దుచున్నాడు. కుడివైపున నిట్టిదే శిల్ప మున్నది. అందు స్త్రీ ఎడమచేత మూడు తామరిమొగ్గలను పట్టుకొని యున్నది. చావడిలో కుడివైపుగోడమీద సింహాసనాసీనుడై తామరపువ్వుమీద పాదములుంచిన బుద్ధుని బొమ్మయు, ఆపువ్వు కాడకు ఇటునటు లేళ్ళును, నాగులును చెక్కబడియున్నారు. ఇవి క్రీ. శ. 5, 6శతాబ్దులలో చెక్కబడినవి కావలెను. ఈచైత్యగృహము కార్లాచైత్యాలయమును పోలియున్నది. దానివలెనే ఇదియును క్రీ. శ. 2వశతాబ్దినాటిది కావచ్చును.

ఇవిగాక 8, 15నంబర్లుగల మరిరెండు చైత్యగృహములు, 16–22 నంబర్లుగల ఏడు విహారములును ఇచ్చట కలవు.

మహాడ్ :— ఈగ్రామము సావిత్రీనదీతీరమున కుడాకు 28 మైళ్ళదూరమునం దున్నది. ఇచ్చట 28 గుహ లున్నవి.

౧వగుహ :— ఇది అర్వాచీనము. దీని ముందు ఆరుస్తంభములును, 53 అడుగుల పొడవును, 8 అడుగుల వెడల్పునుగల వసారాయును కలదు. వసారా వెనుకగోడలో మూడు ద్వారములును, రెండు కిటికీలును ఉన్నవి. దీని వెనుక 57 1/2 అడుగుల పొడవును, 34 1/2 అడుగుల వెడల్పునుగల చావడి కలదు. దాని గోడలనాని అరుగు కలదు. పక్కగోడలలోను, వెనుకగోడలోను గదులు కలవు. వెనుకగోడ మధ్య నొక ద్వారమును, దానివెనుక 20అడుగుల పొడవును, 17 అడుగుల వెడల్పును గల గదియును కలవు. ఈగది మధ్య చదరముగనున్న బండకలదు. దానిమీద ధ్యానముద్రలో నున్న బుద్ధుని బొమ్మయు, క్రింద పరిచారకులును, పైన యక్షులును చెక్కబడి యున్నారు.

౨వగుహ :— ఇది ఒక చైత్యగృహము. ముందు రెండుస్తంభములవసారా కలదు దీని వెనుక 27 అడుగుల పొడవును, 23 అడుగుల వెడల్పును, 9 అడుగుల యెత్తును కల చావడి ఉన్నది. దీనిగోడలలో 8 గదు లున్నవి. చావడి వెనుక నింకొక 15 అడుగుల చదరముగల గదిలో ఒక శిలాచైత్య మున్నది.

౧౫వగుహ :— ఇదియు నొక చైత్యగృహము. ఇందలి చైత్యము వెనుకగోడమీద చెక్కబడి యున్నది. విడిగా లేదు.

౨౧వగుహ ;— ఇందు ఒకే గది ఉన్నది. దాని మధ్య 4 అడుగుల 8 అంగుళముల వ్యాసముకల శిలాచైత్య మున్నది. ఈచైత్యపు వేదికపైఅంచున ప్రాకారశిల్ప మున్నది.

కోల్ :— ఇది మహాడ్కు ఎదురుగ సావిత్రీనది ఆవలియొడ్డున గల చిన్న పల్లె. ఈపల్లెలోగల కొండమీద రెండువరుసల గుహ లున్నవి. ఒకవరుసలోనివి మిక్కిలి శిథిలములై పోయినవి. రెండవవరుసలోనివి అసంపూర్ణములు.

సిర్వాల్ :— ఈపేరుగల గ్రామము పూనాకు దక్షిణముగ నీరానదీ తీరమున నుండున్నది. ఇచ్చట నిరాడంబరములగు 20 గుహాలు కలవు. అందొకటి 20 అడుగుల లోతును, 14 అడుగుల వెడల్పును కలది. దానిమధ్య 5 అడుగుల వ్యాసముగల చైత్యమున్నది. రెండవగుహ 26 అడుగుల చదరముగల విహారము. దీనియందు 9 గదులున్నవి. మిగిలినవి చిన్న గుహాలు.

వాయ్ :— ఇది సతారా జిల్లాలోని గ్రామము. ఇచట 18 గుహ లున్నవి. అందు నంబరుకలది చైత్యగృహము. దీనిలోని చావడి 31 అడుగుల పొడవును, 30 అడుగుల వెడల్పును, 9 అడుగుల యెత్తును కలది. దీనిలో 7 గదులున్నవి. దీనివెనుక 16 అడుగుల చదరముగల గదిలో నిరాడంబరమైన చైత్యమున్నది. ౧వ నంబరుగుహ 27 అడుగుల పొడవును, 21 అడుగుల వెడల్పునుగల విహారము. 8వ నంబరుగుహ మఱియొక విహారము. తక్కినవి చిన్నచిన్న గుహాలు.

కరాడ్ :— ఇదియును సతారాజిల్లాలోని గ్రామమే. ఇందు మూడువరుసల గుహ లున్నవి. ఒకదానిలో 23ను, రెండవదానిలో 19యు, మూడవదానిలో 22ను, మొత్తము 64 గుహాలు కలవు. ఈగుహాలన్నియు మిక్కిలి చిన్నవి. వీటివసారాలలోను, చావడులలోను స్తంభములు లేవు. ఇచటి చైత్యాలయముల లోని చైత్యములు మిక్కిలి మోటుగ నున్నవి. ఈయంశములనుబట్టి ఈగుహాలు మిక్కిలి ప్రాచీనములని చెప్పవచ్చును. ఇవి క్రీ. పూ. 1వశతాబ్దినాటివి కావచ్చును. ఇందు కొన్ని మాత్రము అర్వాచీనము లున్నవి.

౧వగుహ :— ఇది చైత్యగృహము. ఇందలి చైత్యము నిరాడంబరమైనది. దీని పైకప్పు కార్లాలోవలె వంగి యున్నది. కాని చైత్యముచుట్టును ప్రదక్షిణమార్గము లేదు. ఆలయప్రధానద్వారముమీద గుర్రపులాడము వంటి కిటికీకి బదులుగ చదరపు కిటికీ ఉన్నది. ఈద్వారమునకు రెండుప్రక్కలను స్తంభము లున్నవి. వీటి అగ్రములమీద నాసికలోవలె సింహములును, చక్రమును, త్రిరత్నచిహ్నమును ఉన్నవి.

౬వగుహ :—దీనియందుగల వసారాలోని స్తంభాగ్రములు నాసికలోని స్తంభాగ్రములవలె జంతుశిల్పములు కలవి. వసారా వెనుక 16 అడుగుల పొడవును, 13 అడుగుల వెడల్పునుగల చావడియు, దానివెనుక 18 అడుగుల లోతును, 12 అడుగుల వెడల్పును గల గదిలో 7 అడుగులవ్యాసముకల చైత్యమును ఉన్నవి.

౧౧వగుహ ;— ఇది మఱియొక చైత్యగృహము.

౪౮వగుహ:—ఇదియొక చైత్యగృహము. చైత్యము 27 అడుగుల లోతును, 11 అడుగుల వెడల్పును 10½ అడుగుల యెత్తును గల గదిలో ఉన్నది. దీని వేదికాగ్రమున పాత్రికారశిల్ప మున్నది, చైత్యముపైన ఉండు ఛత్రము పైకప్పులో చెక్కబడి యున్నది.

కొండనె :— ఈగ్రామము పునాబొంబాయిమార్గమున కర్జట్ రైల్వే. స్టేషనుకు

నాలుగుమైళ్ళదూరమునం దున్నది. ఇచ్చటి గుహాలలో రెండు చైత్యాలయములును, ఒక విహారమును ముఖ్యములు.

౧వగుహ :— ఇది చైత్యగృహము. ఇది మిక్కిలి పెద్దది. గుహాముఖమునుండి ఆలయము లోపలివెనుకగోడవరకునుగల లోతు 66 1/2 అడుగులు. వెడల్పు 28 అడుగులు. ఎత్తు 28 1/2 అడుగులు. చైత్యమున్నగది లోతు 49 అడుగులు. వెడల్పు 14 అడుగుల 8 అంగుళములు. దీనిమధ్యనున్న చైత్యము యొక్క వ్యాసము 9 1/2 అడుగులు. ఈ చైత్యహర్మిక ఎత్తు ఇతరచైత్యముల హర్మికకు రెండురెట్లు. చైత్యము చుట్టును 30 స్తంభములున్నవి. వీనిలో నొక స్తంభము మీద కార్లాలోవలె చిన్నస్తూపము చెక్కబడియున్నది. గుహాముఖమున క్రిందిభాగమున నొక మనుష్యుని బొమ్మ చెక్కబడియున్నది. పైభాగము ప్రాకారమువలె చెక్కబడినది. ఈగుహాలో క్రీ. పూ. 2వశతాబ్దిలిపిలో చెక్కబడిన శాసనమొకటి యున్నది.

౨వగుహ :— ఇది యొక విహారము. దీని ముందువసారా పొడుగు 18 అడుగులు, వెడల్పు 6 అడుగులు. దీనిలో పలకలస్తంభములు అయిదు కలవు. వసారా కుడిప్రక్కగోడలో నొక గూడు కలదు. దానిలో నొక చైత్యమును, దానిపైన ఒక చైత్యవాతాయనము నున్నవి. ఈవసారావెనుక 29 అడుగుల పొడవును, 23 అడుగుల వెడల్పును, 8 1/2 అడుగుల యెత్తునుగల చావడి కలదు. దీనికి 3 ద్వారములును 18 గదులును కలవు. పైకప్పు క్రిందిభాగమున అడ్డనిలువుకమ్ములు చెక్కబడినవి.

భాజా :— ఈగ్రామము పునాబొంబాయి మార్గమున లోనవ్లాస్టీషనుకు సమీపమున కార్లాకు 2 మైళ్ళదూరమునం దున్నది. ఇచ్చట సుమారు 20 గుహాలున్నవి. ఇవి రెండు అంతర్వ్యాలలో ఉన్నవి.

౧౨వగుహ :— ఇది ఒకచైత్యగృహము. ఇది క్రీ. పూ. 200 నాటిది. సమగ్రముగ నున్నది. చైత్యమున్న గది 59 అడుగుల లోతును, 23 అడుగుల వెడల్పును కలది. దీని మూడువైపులను $3\frac{1}{2}$, వెడల్పుగల ప్రదక్షిణ మార్గ మున్నది. చైత్యమునకు మూడువైపులను 11 అడుగుల' ఎత్తుగల 27 పలకలస్తంభము లున్నవి. ఇందు కొన్ని స్తంభముల అగ్రములమీద చక్రము, స్వస్తిక, త్రిశూలము, కమలము మున్నగు చిహ్నము లున్నవి. కార్లాలోవలెనే చైత్యముపైన కమ్ములుగల వంపు ఉన్నది. నేలమట్టమునుండి దీని యెత్తు 26 అడుగులు. హర్మిక రెండంతర్వ్యాలలో నున్నది.

౧౩వగుహ :— 30 అడుగుల పొడవును, 14 1/2 అడుగుల వెడల్పును గల విహారము.

౧౪వగుహ :— 25 1/2 అడుగుల పొడవును, 7 అడుగుల వెడల్పును గల విహారము.

౧౭వగుహ :— 18 1/2 అడుగుల పొడవును, 12 1/2 అడుగుల వెడల్పునుగల విహారము. ఇందు 5గదు లున్నవి.

ఇవిగాక 1-11, 15, 16 నంబర్లుగల గుహలును విహారములే.

17వనంబరు గుహను సమీపమున రాతిలో దొలిచి నిర్మింపబడిన 14శిలాచైత్యము లున్నవి. వీని వ్యాసము 4 అడుగులనుండి 6 అడుగులవరకు నున్నది. కొన్నిటిమీద

ఛత్రము లున్నవి. అన్నిటికిని వేదికాగ్రమున ప్రాకారశిల్ప మున్నది. ఈదృశ్యము అనకాపల్లివద్దగల శంఖరంలోని లింగాలకొండమీది చైత్యములను స్ఫురింపజేయుచున్నది. వానికి ప్రాకారశిల్పము లేదు. అవి ఈభాజాచైత్యములకంటెను ప్రాచీనములు కావలెను. ఈ చైత్యములకు మరికొంతదూరమున నొక గది దొలనబడి యున్నది. అందు కుడిగోడలో నొకగూడు కలదు. దానిప్రక్కన గోడమీద సాంచీలోవలె చిన్న చైత్యములపంక్తి చెక్కబడి యున్నది.

బేడ్సా :— ఈపేరుగల గ్రామము భాజాకు తూర్పుగ కర్కిలరైలుస్టేషనుకు 4 1/2 మైళ్ళ దూరమునం దున్నది. ఇచ్చట స్వల్పసంఖ్యాకములగు గుహ లున్నవి. వీనిలో నొక చైత్యగృహమును, ఒక విహారమును ముఖ్యములు.

చైత్యగృహము :— ఇచట నొకపర్వతపంక్తికి ముందు ఒక గుట్ట కలదు. ఈగుట్టలో ఒకవైపునుండి రెండవవైపునకు 13 గజముల పొడవును 4 అడుగుల వెడల్పునుగల దారి దొలవబడినది. దీనికావల పర్వతములో ఈచైత్యగృహ మున్నది. ముందు పలకలుగల రెండుస్తంభముల వసారా కలదు. ఈస్తంభాగ్రములమీద నాసికకార్లాలలోవలె ఏనుగులును, సింహములును, వానిపై స్వారి చేయు స్త్రీపురుషులును చిత్రింపబడియున్నారు. ఈ వసారా పొడవు 30 అడుగులు, వెడల్పు 12 అడుగులు. రెండువైపులను రెండు గదు లున్నవి. వసారావెనుకగోడమీద ప్రాకారశిల్పమును, చైత్యములు నున్నవి. వసారా వెనుక చైత్యముగల గది ఉన్నది. దాని లోతు 45 అడుగులు, వెడల్పు 21 అడుగులు. చైత్యము చుట్టును 10 అడుగుల ఎత్తుగల 24 పలకలస్తంభము లున్నవి. వీనికావల 3 1/2 అడుగుల వెడల్పుగల ప్రదక్షిణమార్గ మున్నది. కొన్నిస్తంభములమీద చైత్యము, త్రిశూలము మున్నగు చిహ్నములు చెక్కబడినవి. చైత్యవేదిక అడుగునను, అగ్రమునను ప్రాకారశిల్ప మున్నది.

విహారము :— ఇది విలక్షణమైనది. చైత్యాలయమువలె దీని వెనుకభాగము వర్తులము. పైకప్పు గూడువలె వంపుగ నున్నది. దీని పొడవు 32 1/2 అడుగులు, వెడల్పు 18 అడుగులు. ఇందు 11 గదులు కలవు. వీని ద్వారబంధములమీద గుర్రపులాడములవంటి చైత్యవాతాయనము లున్నవి.

పితల్‌ఖోరా :— ఈగ్రామము ఖాండేష్ జిల్లాలో చాలీస్‌గాం రైలుస్టేషనుకు 12 మైళ్ళ దూరమునం దున్నది. ఇచ్చటగల గుహలలో నొక చైత్యగృహమును, ఒక విహారమును ముఖ్యములు.

చైత్యగృహము :— దీని లోతు 50 అడుగులు, వెడల్పు 34 1/2 అడుగులు, ఎత్తు 30 1/2 అడుగులు. చైత్యమున్నగది వెడల్పు 20 అడుగుల 8 అంగుళములు. చైత్యము చుట్టును 14 అడుగుల ఎత్తుగల 25 స్తంభము లున్నవి. ఈగది అజంతాలోని 10వగుహను పోలియున్నది. తర్వాతికాలమున దీని గోడల మీద బుద్ధునియొక్కయు, త్రిశూలముల యొక్కయు వర్ణచిత్రములు చిత్రింపబడినవి.

విహారము :— ఇది 50 అడుగుల వెడల్పు గలది. దీనిలోభాగమున వరుసవెంబడి వరుసగ నాలుగువరుసల స్తంభము లున్నవి. ఈయంశమునం దిది ఎల్లోరాలోని దశావతార గుహను పోలియున్నది. కొండనే విహారమునందువలె దీనియందును కప్పులోభాగమున

అడ్డునిలువుకమ్ములు చెక్కఁబడి యున్నవి. ఈవిహారమునందలి గదుల ద్వారములమీద చైత్యవాతాయనము లున్నవి. స్తంభముల అగ్రములందు సింహములును, వృషభము లును సాంచీద్వారములమీదవలె రెక్కలు గల జంతువులును చెక్కఁబడి యున్నవి. ఈ విహారము క్రీ. శ. 1వ శతాబ్దినాటిది కావచ్చును.

శైలర్వాడీ :— ఈపల్లె పునా బొంబాయి మార్గమున టలేగాం రైలుస్టేషనుకు 2 మైళ్ళ దూరమునం దున్నది. ఇచ్చట నొక కొండలో నొక చైత్యాలయమును, కొన్ని చిన్నవిహార ములు నున్నవి. ఒకదానిలో క్రీ. శ. 2వశతాబ్ది నాటి లిపిలో శాసన మున్నది.

జున్నార్ :—ఇది పునాజిల్లాలో ఉన్నది. ఇది ప్రాచీనకాలమున సుప్రసిద్ధవాణిజ్యకేంద్ర ముగ నుండెన టగర అను నగరమని కొందరి అభిప్రాయము. ఇచ్చట శివనేరి, తుల్జాలెనా, గణేశలేనా, సులేమాన్, మాన్మోడి అను అయిదు కొండలచరియలలో మొత్తముమీద 57గుహ లున్నవి. వీనిలో శిల్పములుగాని, ఆడంబరితగాని లేవు. సామాన్యముగ నీగుహ లలో చైత్యవాతాయనమును, ప్రాకారశిల్ప మును, చైత్యములును గాంచనగుచున్నవి. ఒకటిరెండుగుహాలలోమాత్రము స్తంభాగ్ర ములయందు జంతుశిల్పము లున్నవి. ఇక్కడి గుహాలలో కొన్ని బహుప్రాచీనములు, మరి కొన్ని అర్వాచీనములు. కొన్ని విలక్షణ ములు. ప్రాచీనములు క్రీ. పూ. 100నాటివి. అర్వాచీనములు క్రీ. శ. 2శతాబ్దివి. ఈగుహ లలో చాలభాగము ప్రాచీనార్వాచీనములకు మధ్యకాలమునకు చెందినవి.

శివనేరీగుహాలు :—ఇది చరిత్రప్రసిద్ధుడగు శివాజీ జన్మస్థానమగు శివనేరిగ్రామమునద్ద గలదు. ఇచట కొండ తూర్పు వాలులో ఈ గుహాలు దొలవబడినవి. ఇవి రెండంతస్థులలో ఉన్నవి. కొండ దిగువ చిన్నచిన్నగుహాలు అనేకము లున్నవి. వానిపైన ఒక పెద్దగుహ కలదు. దీనిముందు రెండు స్తంభములును, వాని మధ్య విశాలమగు ద్వారమునుకలవు. విని వెనుక చతురముగనున్న చావడి ఉన్నది. దానిమధ్య నొక శిలాచైత్యము కలదు. దీని పైభాగమున రెండంతస్తులగుహ ఉన్నది. దీనిలో క్రీ.పూ. 2వశతాబ్దలిపిలో ఒక శాసన మున్నది. దీనిలో పెక్కు గదులు కలవు. ఈ గుహాప్రక్కగ నొక విహార మున్నది. దీనిలో స్తంభములు లేవు. ఆప్రక్కగ ఆరుగదులు గల మరియొక విహారము కలదు. ఆమీద 36 అడుగుల పొడవును, 33అడుగుల వెడల్పును గల పెద్ద విహార మున్నది. ఇందు 12గదు లున్నవి. దీనిద్వారమునకు రెండువైపులను రెండు కిటికీ లున్నవి. దీనికావల నింకొక విహార మున్నది. దాని పొడవు 31అడుగులు, వెడల్పు 25అడుగులు. దీని ముఖమున వర్ణ చిత్ర మున్నది. ఈగుహాలవరుసలో రెండు చైత్యగృహము లున్నవి. ఇందొకదానిలో కొండనే నాసికలలోవలె వెనుకగోడలో నొక చైత్యము చెక్కఁబడినది. రెండవది సంపూర్ణ చైత్యగృహము. దీనియందొక పెద్దద్వార మును, రెండు కంతకిటికీలు నున్నవి. ప్రదక్షిణ పథమునకును, చైత్యమునకును మధ్య నాలుగు లావైన స్తంభము లున్నవి. చైత్యాలయము పొడవు 31అడుగులు, వెడల్పు 20 1/2 అడు గులు. చైత్యముయొక్క వ్యాసము 10అడు గులు. దీని వేదికాగ్రమున ప్రాకారశిల్ప

మున్నది. చైత్యఛత్రము కప్పుమీద, చెక్కబడియున్నది. కప్పు లోభాగమున వర్ణచిత్రము లున్నవి. ఈగుహాలో క్రీస్తుశకారంభకాలపు లిపిలో శాసనమొకటి కలదు.

తులజాగుహాలు :— కార్లాలోవలె ఈ గుహాలలో ఒకదానిని ఇటీవల నెవరో తులజా అను దేవి ఆలయమున మార్చినారు. అందువలన నీగుహాలకు స్థానికులు తులజాలేనా అని పేరు పెట్టినారు. వీనిలో విలక్షణమైన చైత్యగృహ మొకటియు, 2 విహారములును, అనేకములగు చిన్నచిన్న గుహాలు నున్నవి. ఇచటి చైత్యాలయము వలయాకారముగ నున్నది. దీని వ్యాసము 25 1/2 అడుగులు. దీనిమధ్య 8 అడుగుల వ్యాసముగల చైత్య మున్నది. దీనిచుట్టును 12 పలకలస్తంభములు కలవు. ఈస్తంభముల వెలుపలనున్న ప్రదక్షిణమార్గముపైన అర్ధవలయాకృతిగల కప్పు కలదు. చైత్యము నిరాడంబరము. ఈచైత్యగృహాము నకు ప్రాగుత్తరముగ నొక గుహా కలదు. దీని ముఖమంతయు నాసిక చైత్యాలయములవలె చైత్యవాతాయనములచే అలంకరింపబడినది. దీని ద్వారబంధము పైకమ్మిమీద స్వస్తికాలంకారమును, ప్రక్కకమ్ములమీద పుష్పాలంకారమును చెక్కబడినవి. దీనిపైన ఒకపెద్ద వాతాయనమును, దానికి రెండువైపులను రెండు చిన్న వాతాయనములు నున్నవి. దీనిలోపలిగోడలో నొక చైత్యమును దాని కిటునటు యక్షులు నున్నారు. అప్పైన ప్రాకార శిల్ప మున్నది.

గణేశలేనాగుహాలు :— ఈ గుహాలలో నొక దానియందు ఇటీవల నెవరో గణపతి విగ్రహామును చెక్కుటవలన వీని కాపేరు వచ్చినది. ఈగుహాలలో రెండు చైత్యాలయములును, మూడునాలుగు విహారములును ముఖ్యములు. అందు ఒక చైత్యగృహాపు ముందువసారాలో నాసికలోని స్తంభముల వంటివి నాలుగు స్తంభము లున్నవి. దీని పొడవు 25 అడుగులు, ఎత్తు 24 అడుగులు, లోతు 24 అడుగులు. చైత్యమున్నగది వెడల్పు 13 అడుగులు. చైత్యముచుట్టును 10 అడుగుల ఎత్తుగల 20 స్తంభములున్నవి. వీని అగ్రములు నాసికస్తంభాగ్రములవలె ఉన్నవి. వెనుక వంపుగలభాగమున 6 సామాన్యస్తంభము లున్నవి. చైత్యము ఎత్తు 16 1/2 అడుగులు. వేదికాగ్రమున ప్రాకారశిల్పము కలదు. దీనికప్పు గూడువలె వంపుకలిగి యున్నది. రెండవ చైత్యగృహాము చతురస్రాకృతి కలది. దీనికప్పు సమముగ ఉన్నది. వంపు లేదు. దీని లోతు 22 అడుగులు, వెడల్పు 13 అడుగులు, ఎత్తు 14 అడుగులు. చైత్యఛత్రము కప్పులో చెక్కబడినది. ముందువసారా వెనుకగోడలో ఒక ప్రధానద్వారమును, దానికి రెండువైపులను ఉపద్వారములును కంతికిటికీలు నున్నవి. ప్రదక్షిణపథము వెడల్పు 3 అడుగులు. ఈ గుహాలో క్రీ. పూ. 100 నాటి ఒక శాసన మున్నది. జున్నార్ గుహాలలోనెల్ల నిది ప్రాచీనతమము.

సులేమాన్‌కొండలోనిగుహాలు :— ఈ గుహాలలో రెండు చైత్యగృహములును, రెండు విహారములును ముఖ్యములు. ఒకచైత్యగృహాము లోతు 22 అడుగులు, వెడల్పు 8 అడుగులు. చైత్యము వ్యాసము 4 అడుగుల 10 అంగుళములు, ఎత్తు 9 అడుగుల 4 అంగుళములు. గుహా ఎత్తు 16 అడుగులు. గుహాముఖమున చైత్యవాతాయనము లున్నవి. వానిలో కొన్నిటియందు చిన్న చైత్యము

లును, మరికొన్నిటియందు కమలములు నున్నవి. మధ్యమధ్య ప్రాకారశిల్ప మున్నది. ప్రధానద్వారముయొక్క కమ్మలమీద నాసికలోవలె రేఖాపుష్పస్వస్తికశిల్పము లున్నవి. రెండవచైత్యగృహము అసంపూర్ణము. ముందు విశాలమగు గుహాముఖ మున్నది. లోపల అర్ధవలయాకారమగు రాయి యున్నది. ఇందు ఒకగూటిలో బాంబహూట్‌లోవలె శ్రీవిగ్రహము చెక్కబడియున్నది. మరియొక చోట క్రీ. పూ. 100 ప్రాంతపు శాసనమొకటి కలదు. ఇచటి రెండు ముఖ్యవిహారములలో నొకదానియందు 3 గదులును, లోపలిగోడలో నొక చైత్యము నున్నవి. రెండవవిహారము వెడల్పు 12 అడుగులు, పొడవు 33 అడుగులు. లోపలిగోడమీద ప్రాకారశిల్ప మున్నది.

కొండ్వానే :— ఈ గ్రామము కన్హేరికి దక్షిణముగ మోరోల్‌గ్రామమునకు దగ్గర నున్నది. ఇచటి కొండలో 16 గుహలు ఉన్నవి. ఇందొక చైత్యాలయమును, ఒకవిహారమును ముఖ్యములు. ఈచైత్యగృహము బరాబర్ కొండలలోని సుదామగుహవలె విలక్షణమైనది. ముందు రెండుగోడలనడుమ చతురస్రమగు ప్రదేశమున్నది. దీని లోతు 29 1/2 అడుగులు, వెడల్పు 17 అడుగులు, ఎత్తు 9 అడుగులు. దీనివెనుక వలయాకారముగల భాగమున్నది. దీనిమధ్య చైత్యము కలదు. దీని వెనుక గోడమీద కమలము పైనకూర్చొనిన బుద్ధునియొక్కయు, పరిచారకులయొక్కయు, నాగులయొక్కయు, యక్షులయొక్కయు బొమ్మలు చెక్కబడినవి. మరియొకచోట నిలచిన బుద్ధుని బొమ్మ కలదు. ఈశిల్పములన్నియు గుహ దొలవబడినపిమ్మట చెక్కబడినవే. ఇచటి ముఖ్యవిహారపు వసారాలో 4 స్తంభము లున్నవి. వసారాపొడవు 24 అడుగులు, వెడల్పు 14 అడుగులు.

నానేఘాట్ :— ఇది జున్నార్‌కు ఏడు మైళ్ళదూరమునం దున్నది. ఇచటిగోడలో పెక్కుగుహలు కలవు. వీనిలో చాలభాగము శిథిలములై పోయినవి. అయినను ఇందు రెండు గుహలు ముఖ్యములు. వానిలో ఒకదానియందు వెనుకగోడమీద కొన్ని మనుష్యవిగ్రహములు చెక్కబడినవి. వానిక్రింద ఆవ్యక్తుల పేర్లును చెక్కబడినవి. ఈపేర్ల నుబట్టి యీవిగ్రహములు సిముకసాతవాహనుడు, అతని కుమారుడు శ్రీసాతకర్ణి, అతనిభార్య, నాగానిక, ఆమె తండ్రి త్రణకయిరో, ఆమె పుత్రులు కుమారిభాయ, కుమారిహాకుసిరి, కుమారిసాతివాహన అని తెలియుచున్నవి. మరియొక గుహలో ప్రధానద్వారమునకు రెండుపైపులను పెద్దశాసనము చెక్కబడియున్నది. అది శ్రీసాతకర్ణి చేసిన బహుయజ్ఞములను ఆయాసంవత్సరములలో చేయబడిన దానములను పేర్కొనుచున్నది. ఈగుహలు నిరాడంబరములుగ నున్నవి. నాసికలోని కృష్ణునిగుహయు, ఈగుహలును ఒకేవిధముగ నున్నవి. ఇవి క్రీ. పూ. నవశతాబ్దిచరమపాదమునాటివి.

కన్హేరీ:— ఈగ్రామము బొంబాయినగరమునకు సమీపమునందున్న సాల్సెటీఅను ద్వీపమునం దున్నది. బి. బి. సి. ఐ రైలుపైని మీది బోరివ్లీ అను స్టేషనులో దిగి తూర్పుగ సుమారు రెండుమైళ్ళు పోయినచో ఈగ్రామము కనిపించును. ఇచటికి ఐదుమైళ్ళదూరమున కన్హగిరి అను కొండ కలదు. దానిలో సుమారు 103గుహ లున్నవి. ఇవియే కన్హేరీ గుహలని ప్రసిద్ధి నందినవి. ఈగ్రామమువద్ద

పడమటికనుమల వరుసలు చీలి యున్నవి. బొరివ్లీ స్టేషనునుండియే ఒక చిన్నగుట్ట వచ్చును. దీనిపైననే కన్హేరీగ్రామ మున్నది. ఈగుట్ట వెనుక నొక లోయ ఉన్నది. వలయాకారముగనున్న దీనిలో చిట్టడవి వ్యాపించి యున్నది. దీని తూర్పుఅంచున ఇంకొక గుట్ట కలదు. దాని వెనుక మరియొక పెద్దలోయ కలదు. దాని వెనుక నొక పర్వతపంక్తి ఉన్నది. దీని ప్రక్కలు వాలుగను అగ్రము సమముగను ఉన్నవి. ఈకొండమీద మూడు అంతరువులలో గుహలు దొలువబడి యున్నవి. ఇందు కొన్ని అతిప్రాచీనములు, మరికొన్ని అర్వాచీనములు. ఈగుహలలో సుమారు 20 ప్రాకృతశాసనము కలవు. వానినిబట్టి ఈగుహల నిర్మాణములు క్రీ. పూ. 2వశతాబ్ది నుండి క్రీ. శ. 4శతాబ్దివరకును జరుగుచు వచ్చెనని తెలియనగుచున్నది. చాలగుహలు శిథిలములైనవి. కొన్ని పడిపోవుచున్నవి. ఈ గుహలలో చాలభాగము విహారములు. కొన్ని పెద్దపెద్ద సమావేశభవనములు. కొన్ని చైత్యగృహములు, మరికొన్ని బుద్ధాలయములు.

వీనిలో ముఖ్యములైన గుహలను ఈక్రింద వర్ణించుచున్నాము :—

౧వగుహ :—ఇది రెండు అంతస్తుల గుహ. దిగువ అంతస్తులలో ముందు రెండువసారాలును, వానివెనుక నొక చావడియు కలవు. చావడి వెనుకగోడలో మూడు గదు లున్నవి. రెండవవసారాపైన గుఱ్ఱపులాడమువంటి పెద్ద కిటికీ కలదు. దీనిద్వారా కావలసినంత గాలియు, వెలుగును లోనికి వచ్చును. పై అంతస్తులో మూడు గదు లున్నవి. ఈగుహ నిరాడంబరమైనది. దీనిలో శిల్పము లేమియు లేవు.

౨వగుహ :—ఈగుహ మూడుభాగములుగ నున్నది. ఇందు ఒక చివరనున్నభాగములో నొక వేదికయు దానిమీద నొక చైత్యమును మాత్రము కలవు. దీనికి కుడిపైపునగల రెండవభాగమునందు ఒక గది ఉన్నది. దానిగోడలమీద సింహాసనాసీనుడగు బుద్ధుని యొక్కయు, పద్మపాణియొక్కయు, యక్షయక్షిణీలయొక్కయు బొమ్మలు చెక్కబడి యున్నవి. ఈభాగమునకు దక్షిణముగనున్న మూడవభాగము ఒక చైత్యగృహము. ఈ గృహముముందు గలగోడలో గాలియు వెలుగును లోపలికి వచ్చుటకై రెండు కంతలు దొలవబడినవి. మిగిలినగోడభాగములమీద సింహాసనాసీనుడును, పద్మాసనస్థుడునై బోధ చేయుచున్న బుద్ధునివిగ్రహముల వరుసలును, యక్షయక్షిణీలును, పద్మహస్తులగు భిక్షులును చెక్కబడియున్నారు. దీనివెనుక నొకవసారా ఉన్నది. దానిగోడమధ్య నొక ద్వారమును దాని కిరుపైపులను వరదచిన్ముద్రలలోనున్న బుద్ధుని బొమ్మలును, పద్మపాణిబొమ్మలును కలవు. మధ్యలో వేదికమీద చైత్య మున్నది. దీనిపైన హర్మిక లేదు.

౩వగుహ:—ఇది మనోహరమగు చైత్యగృహము. ఈగుహ రెండు అంతస్తులలో ఉన్నది. దిగువభాగమున నేలమట్టమునుండి ఒక పొట్టిదగు పిట్టగోడ కలదు. దానిమధ్య నొక మార్గమును మెట్లును ఉన్నవి. ఈమెట్లకు రెండు పైపులనుగల గోడ అడ్డునిలువు కమ్ములతో స్తూపప్రాకారమువలె చెక్కబడి యున్నది. ఈగోడవెనుక ఎత్తైన పలకల స్తంభములు నాలుగు కలవు. వాటిపైన అడ్డదూలమును, దానిపై పలకల స్తంభములు నున్నవి. ఈ స్తంభములు ఆరుపలకలు కలవి.

పీఠమధ్యలో ఆమలకము లున్నవి. అగ్రమున చతురములును వానిపైన సింహములు నున్నవి. ఈచతురశీర్షికలమధ్య చైత్యములును, మూలల వామనులును కలరు. స్తంభమూలములలో నాగనాగినులయొక్కయు, పద్మపాణియొక్కయు బొమ్మలు కలవు. ఈ స్తంభమూలసంటి ఒక వసారా ఉన్నది. దీని కుడివైపు గోడలో రెండుగూళ్ళును వానియందొక్కొక్క చైత్యమును కలవు. ఈ చైత్యములలో వేదికయు, హర్మికయు, దానిపైన మూడేసి ఛత్రములు నున్నవి. ఈవసారావెనుక మరియొకవసారా ఉన్నది. దీని కుడియెడమ గోడలపైని 4(' అడుగులయెత్తుకలిగి మనోహరములుగ నున్న పద్మపాణివిగ్రహము లున్నవి. వీని శిల్పము విస్మయజనకము. ఇంత ఎత్తైన బొమ్మలు మరియేగుహయందును లేవు. ఈ రెండవవసారా వెనుకగోడమధ్యలో ప్రధాన ద్వారమున్నది. గోడ చివరల రెండువైపులను రెండు చిన్నద్వారము లున్నవి. ఇవి లోపలిచైత్యమునకు చుట్టునున్న ప్రదక్షిణపథమునకు ప్రవేశములు. ప్రధానద్వారమునకు రెండువైపులను గల గోడమీద శిల్పము లున్నవి. ఇందు కుడివైపుగోడమీది శిల్పములు మూడుభాగములుగ నున్నవి. మొదటి భాగమున ద్విభంగిలో చామరహస్తయై తన యెడమచేతితో ఒక పురుషుని నడుము పట్టుకొని ఒక స్త్రీ నిలచి యున్నది. ఆమె ప్రక్క ఎడమచేత లీలారవిందమును పట్టుకొని ఒక పురుషుడు నిలచియున్నాడు. రెండవభాగమున పైన యక్షులును, క్రింద పరిచారికలునుగల పద్మపాణిబొమ్మ ఉన్నది. దీనిప్రక్క మరియొక మిథునము కలదు. ఇట్లే ద్వారమునకు ఎడమవైపునగల గోడమీదను మూడు భాగములలో శిల్పమున్నది. మొదటి భాగమున ఒక మిథునముకలదు. ఇందలి స్త్రీ త్రిభంగిలో నిలచి యున్నది. ఆమె ఎడమచేయి నడుమునకు ఆని యున్నది. కుడిచెయ్యి వ్రేలాడుచున్నది. పురుషుడు ఎడమచేతిని మోచేతివద్ద వంచి పైకెత్తి లీలారవిందమును పట్టుకొనినాడు. అతని కుడిచెయ్యి స్త్రీ నడుము చుట్టు నున్నది. ఈదృశ్యమున కావల నిలచిన పద్మపాణిబొమ్మ కలదు. పిమ్మట మరియొక మిథున మున్నది. ఇందు స్త్రీ త్రిభంగిలో నిలచి రెండు చేతులను పైకెత్తి అంజలి పట్టి కొంచెము ఎడమవైపునకు వంగి నమస్కరించుచున్నది. పురుషుడు ఎడమచేతిని మధ్య వంచి లీలారవిందము నెత్తిపట్టుకొని కుడిచేతిని నడుమున కాన్చి నిలచినాడు. ఈశిల్పముల చుట్టును అనేకముద్రలలో బుద్ధవిగ్రహము లున్నవి. ఈగోడవెనుక నొకగది కలదు. దాని లోతు 8౦ 1/2 అడుగులు, వెడల్పు 40అడుగులు. దీని మధ్య చైత్యమున్నది. దాని వ్యాసము 16అడుగులు. దానిచుట్టును 34 స్తంభము లున్నవి. వీనిలో ముందు గల నాలుగు స్తంభములును, చైత్యముచుట్టును వంపులో ఉన్నవియు నిరాడంబరములగు పలకల స్తంభములు. ఒకవైపు ఆరును, మరియొకవైపు 11ను మూలములును అగ్రములును కలవి. ఈ స్తంభమూలముల ఒకదానిలో నొకటిగ నాలుగు చతురము లున్నవి. ఆపైన గిన్నెవంటి భాగము కలదు. దానిమీద పలకలు గల స్తంభభాగము. దానిఅగ్రమున రెండు వలయములు. ఆపైన ఆమలకము. దానిమీద మరియొక వలయము. దానిమీద మరల నాలుగు చతురములు. ఈచతురశీర్షికమీద ఏనుగులును, చైత్యములును, మనుష్యులును

చెక్కబడియున్నారు. ఇందలి చైత్యమును, వసారాగోడమీాది మిథునశిల్పములును ప్రాచీనములు. బుద్ధశిల్పములు అర్వాచీనములు. ఈ కన్హేరీ చైత్యగృహము కార్లా చైత్యాలయమునకు నకలు.

౧౧వగుహ :— ఇది ఒక విహారము. ముందు వసారాలో పది పలకల స్తంభములున్నవి. కుడివైపుగోడలో ఒకగూటిలో సింహాసనాసీనుడైన బుద్ధుని బొమ్మ కలదు. పైన పక్షులును, క్రింద భక్తులు నున్నారు. ఈదృశ్యము చుట్టును పద్మపాణి బొమ్మలున్నవి. ఈవసారా వెనుక విశాలమైన చావడి కలదు. దీనిలో ఎనిమిది స్తంభములుగల నాలుగువరుస లున్నవి. చావడి వెనుకగోడలో మధ్య సింహాసనాసీనుడగు బుద్ధుని బొమ్మ చెక్కబడినది. దీని కొకవైపు ఎనిమిదియు, రెండవవైపు ఎనిమిదియు మొత్తము పదహారు గదులున్నవి.

౯౦వగుహ :— ఇది ఈ ప్రాంతమున గాంచనగు గుహలన్నిటికంటెను మనోహరమైనది. ఇది నేలమట్టమునకు అయిదారు అడుగుల ఎత్తున ఉన్నది. దీనిని చేరుటకు క్రింద నుండి మెట్లున్నవి. ముందుగ నాలుగుస్తంభముల వసారా కలదు. దీనిలో శిల్ప మేమియు లేదు. వసారా వెనుకగోడమధ్యలో ద్వారమున్నది. ఈద్వారపు కమ్ములమీాద శిల్పమున్నది. కుడివైపుకమ్మిమీాది అడుగున సింహాసనాసీనుడైనబుద్ధుడును, ఆపైన ధ్యానిబుద్ధుడును, ఆమీాద రెండంతరువులవేదిక పైన చామరసహితమైన చైత్యమును కలవు. కమ్మి మధ్యభాగమున పద్మపాణిచిత్రమును, వాని క్రింద నొక భక్తుడును, పైన ఇద్దరు యక్షులును కలరు. కమ్మిపైభాగమున ధ్యానిబుద్ధుని యొక్కయు, సింహాసనస్థుడగు బుద్ధుని యొక్కయు, పద్మపాణియొక్కయు బొమ్మలున్నవి. అట్లే ద్వారబంధపు ఎడమకమ్మి దిగువభాగమున చైత్యమును, సింహాసనాసీనుడగు బుద్ధుడును, ముగ్గురు ధ్యానిబుద్ధులును కలరు. దీనిపైభాగమున మూాడు పద్మపాణి బొమ్మ లున్నవి. ఆపైవరుసలో ఒక పద్మపాణియు, ఐదుగురు సింహాసనస్థులగు బుద్ధులును కలరు. ద్వారమునకు రెండువైపులను గల గోడమీాదకూడ శిల్పము లున్నవి. కుడివైపుగోడమీాద అనేక బుద్ధపద్మపాణిచిత్రములు కలవు. వీనిప్రక్క చైనాలిపిలోని శాసనమొకటి ఉన్నది. ద్వారము వెనుక చతురస్రమగు చావడి కలదు. దీని కుడియెడమల గోడలు మనోహరములగు శిల్పములతో నిండియున్నవి. వెనుకగోడ మధ్య నొక వేదిక కలదు. దీనిమీాద సింహాసనమున కూర్చొనిన బుద్ధుడు. అతని కుడిచేయి అభయముద్రలో ఉన్నది. ఎడమచేత నేదియో కలదు. ఈయాసనమును రెండు సింహములు వీపులమీాద మోయుచున్నవి. పైన ఇద్దరు యక్షులు అటునిటు వీణలు వాయించుచు నెగురుచున్నారు. ఈదృశ్యమునకు కుడివైపునగల గోడమీాద పైవరుసలో సింహాసనస్థుడగు బుద్ధుడున్నాడు, అతనిపాదములు పొడుగైన కాడగల తామర పువ్వుమీాద నున్నవి. క్రిందివరుసలో ఐదుపడగలుగల నాగరాజొకడు ఈకాడను పట్టుకొని నిలచినాడు. అతనివెనుక నొక నాగిని కలదు. ఈమెవెనుక నొకనాగుడును, నాగినియు, పద్మహస్తులై నిలచియున్నారు. తామర కాడకు ఆవలివైపునను ఇదే దృశ్యమున్నది. ఆపైన సర్వాలంకారభూషితుడగు రాజు కలడు. అతనివెనుక రెండుచేతులను స్వస్తికా

కృతిలో వక్షమున చేర్చి నిలచిన స్త్రీ కలదు. ఆపైన నొకపురుషుడు వీణవాయింప, ప్రక్కన నిలచి ఒకస్త్రీ తాళము వేయుచున్నది. ఎడమవైపుగోడమీదను పెక్కుశిల్పము లున్నవి. ముందుగ నొక పద్మపాణి బొమ్మ కలదు. ఆపైన వ్యాళీముఖమునుండి వెలికివచ్చుచున్న తామరతీగ కలదు. దీనిప్రక్కన పెద్దపెద్ద పద్మపాణిబొమ్మలు కలవు.

ఈకన్హేరీగుహలు పలురకములైనవి. కొన్ని విశాలభవనములు. కొన్ని చిన్న కంతలు. అనేకములు నిరాడంబరములగు విహారములు, సమావేశభవనములు. ఒకటి పెద్ద చైత్యగృహము. అతిప్రాచీనములగు గుహలు చాలవరకు శిథిలావస్థయం దున్నవి. ప్రతిగుహకును నీటితొట్టి కలదు.

నాసిక :— ఇది సుప్రసిద్ధమగు యాత్రాస్థలము. దీనికి సమీపమునగల త్రియంబకమున గోదావరీనది ఉత్పత్తియైనది. బొంబాయినాగపూరు రైలుమార్గమున నాసిక్‌రోడ్డు రైలుస్టేషను కలదు. దీనికి ఐదుమైళ్ళదూరమున నాసికపట్టణ మున్నది. పట్టణమునకు ఐదుమైళ్ళలో నొక కొండలవరుస కలదు. అందు పెద్దగంటవంటి ఆకారముగల కొండ యొకటి ఉన్నది. దీనికిచటి శాసనములలో తిరణ్హు లేక త్రిరస్మి పర్వతమనుపేరు గాంచనగుచున్నది. ఈపర్వతముమీద తూర్పుపడమరలుగ నొకవరుసలో 17 గుహలు దొలువబడి యున్నవి. వీనిని స్థానికులు పాండులేనా లేక పాండవగుంఫా లేక పాండవులగుహలని పిలచుచున్నారు. ఈపర్వతము నేలమట్టమునకు 300 అడుగుల ఎత్తుగ నున్నది. దూరముననుండి చూచినచో ఈగుహలవరుస పర్వతమునడుమునకు ఒకపటకాపెట్టినట్లు కన్పించుచు. గుహలముందు ఒక సన్ననిమేర సమముగ చేయబడినది. దీని కొకవైపున గుహలున్నవి. రెండవవైపున నిట్టనిలువుగ కొండచరియ ఉన్నది. పడమటగ పోనుపోను ఈప్రదేశము సన్ననై కొండను అంటుకొని పోవుచున్నది. ఈనాసికగుహలు అనేకకారణముల వలన మిక్కిలి ముఖ్యమైనవి. ఇచ్చట శాతవాహనరాజులలో రెండవవాడగు కృష్ణుని కాలమునుండి కడపటివారిలో ముఖ్యుడగు యజ్ఞశ్రీకాలమువరకును దొలువబడినగుహలున్నవి. వీనిని పరిశీలించినచో నాలుగు శతాబ్దులనాటి గుహావాస్తుపరిణామము విదితము కాగలదు. ఈగుహలలో ఎన్నియో శాసనము లున్నవి. వీనినిబట్టి ఆయాగుహల నిర్మాణకాలములు తెలియనగుచున్నవి.

౧౦వగుహ :— ఈగుహ పైకప్పు మంటపమువలె కొంతదూరము ముందుకు చొచ్చుకొని యున్నది. ముందుగ ఆరు నిరాడంబరములగు స్తంభములు కల వసారా ఉన్నది. వీని అగ్రములు చతురస్రములు. వీటిపైన రెండువరుసల శిల్పము లున్నవి. మొదటివరుసలో పరుగెత్తుచున్న ఏనుగులు, సింహములు, వృషభములు నున్నవి. పైవరుసలో ప్రాకారశిల్ప మున్నది. దీనిలో త్రిరత్నచిహ్నము, తామరతీగలు, సింహములు చెక్కబడినవి. వసారావెనుకఅంచునను ఆరు స్తంభములున్నవి ఆవెనుక నొకగోడయు దానిమధ్య నొక ద్వారము నున్నవి. దానివెనుక చతురస్రమగు చావడి కలదు. ఇందు స్తంభములు లేవు. చావడివెనుకగోడలో నొక వేదికయు, దానిమీద నొక విగ్రహము నున్నవి. పూర్తిగ అరిగిపోవుటవలన నావిగ్రహ మేదియో తెలియుటలేదు.

౨వగుహ :— ఈగుహకు ముందుభాగమున ఇతరగుహాలలోవలె స్తంభములు లేవు. ముందువసారాగోడమధ్య నొక ద్వారము కలదు. ఈవసారా పొడుగు 11 1/2 అడుగులు, వెడల్పు 4 1/2 అడుగులు. ఈద్వారపు అష్ట దూలముమీద సాతవాహనరాజగు వాసిష్ఠీపుత్రపులోమావికాలపు శాసనము కలదు. ఎడమవైపు గోడమీద రెండు ధ్యానిబుద్ధుని బొమ్మ లున్నవి. కుడివైపుగోడమీద సింహాసనస్థుడగు బుద్ధుడును, యక్షులును కలరు. వసారా వెనుక చావడిగోడమీద కుడివైపున సింహాసనస్థుడగు బుద్ధుడును, ఒకచేత చామరమును మరియొకచేత తామరపువ్వునుగల వ్యక్తియు,ఐదుపడగలుగల నాగులు నున్నారు. ఎడమవైపున పద్మపాణిబొమ్మ కలదు. ఇవి అన్నియు తర్వాత చెక్కబడిన శిల్పములు.

౩వగుహ :— ఇది మిక్కిలి ముఖ్యమైన విహారము. దీనికి రాణిగుహ అనియు, గౌతమీపుత్రునిగుహ అనియు పేరు. సాతవాహనచక్రవర్తులలో అగ్రగణ్యుడును, మహావిజేతయునగు గౌతమీపుత్రసాతకర్ణి పరాక్రమమును, విజయములను వర్ణించుచు అతని తల్లి బాలశ్రీ వేయించిన చరిత్రప్రసిద్ధమగు శాసనము ఈగుహయందున్నది. ఆరాజుమరణానంతర మతని పేరుగ ఆమహారాణి బౌద్ధభిక్షువుల కీగుహను దానము చేసెను. దీనికి ఆమహారాజు కుమారుడగు పులోమావి ఒక గ్రామమును దానము చేసెను. అందువలననే ఈగుహ మిక్కిలి అందముగ నున్నది.

ముందు నిలచి చూచినచో ఇది యొక విమానమా అను భ్రాంతి కలుగును. దీని పైన కప్పు మంటపమువలె ముందుకు చొచ్చుకొని వచ్చును. అట్టిదగున ఎనిమిదిమూలములు ముందుకు వచ్చినవి. వీనిలో ఆరిటిని బలిష్టులగు వామనులు తమ భుజములమీద పెట్టుకొని మోయుచున్నారు. నేలమట్టమునుండి ఐదడుగుల యెత్తువరకును ఒకగోడ ఉన్నది. దీనిమధ్య నొక మెట్లవరుస కలదు. ఈగోడ అట్టిదగున పైనపేర్కొనబడిన వామను లున్నారు. ఆపైన చక్కగ చెక్కబడిన త్రిరత్నచిహ్నముల వరుస కలదు. ఆమీద కొంతభాగమున అడ్డునిలువు కమ్ములతో ప్రాకారశిల్ప మున్నది. ఇందు నిలువుకమ్ముల మీద అర్ధవలయము లున్నవి. పైన మరియొక త్రిరత్నములవరుస ఉన్నది. ఈపట్ట గోడ లోపలిభాగమున ప్రవేశమునకు అటు మూడుస్తంభములును ఇటు మూడుస్తంభములును కలవు. ఇవి ఆగుహలకల స్తంభములు. వీని అగ్రములలో ఆమలకము లున్నవి. వాని పైన పోనుపోను పెద్దవగు చతురము లున్నవి. వీనిని యక్షులును, సింహములును, మోయుచున్నట్లు చెక్కబడినవి. ఈచతురములమీద మనోహరములగు శిల్పము లున్నవి. ఒకదాని మీద ఒకేశరీరముగల రెండు వృషభము లున్నవి. వానిపైన ఇద్దరు స్వారి చేయుచున్నారు. రెండవస్తంభముపైన ఒక ఏనుగు కూర్చొని లీలగా నొక కమలమును తొండముతో పట్టుకొనినది. దానిమీద నొక స్త్రీయు నిద్దరు పురుషులును స్వారిచేయుచున్నారు. మరియొక స్తంభాగ్రమున నిద్దరు పురుషులు రెండు సింహములపై స్వారిచేయుచున్న దృశ్యమున్నది. ఈమూడు స్తంభములును ఎడమవైపున ఉన్నవి. కుడివైపునగల స్తంభముల పైనకూడ నిట్టి శిల్పములే ఉన్నవి. ఒకదాని మీద రెండు ఏనుగులును వానిపైన నొక స్త్రీయు నిద్దరు పురుషులును కలరు. మరి

యొకదానిమీద ఇర్వురు పురుషులు రెండు సింహములపై స్వారి చేయుచున్నారు. మూడవస్తంభముమీద నొక సింహముపై ఇద్దరు స్వారి చేయుచున్న దృశ్య మున్నది. ఈస్తంభములపైన గల గుహాముఖమున మూడువరుసలలో పరుగెత్తుచున్న మనుష్యుల యొక్కయు, సింహములయొక్కయు, ఏనుగుల యొక్కయు చిత్రము లున్నవి. ఇట్టి చిత్రములు అమరావతీమహాచైత్యముయొక్క వేది కాగ్రమున కలవు. ఈవరుసలకుపైన ప్రాకార శిల్ప మున్నది. దానిపైన అర్ధచంద్రికల వరుస కలదు.

పైన వర్ణింపబడిన స్తంభములవెనుక నొక వసారా కలదు. దాని కుడివైపు గోడను చేరి ఒక అరుగు ఉన్నది. ఎడమవైపు గోడలో ఒక గూడు కలదు. వెనుకగోడలో మధ్య ప్రధానద్వార మున్నది. దానికి ఎడమవైపున ఒక నిలువు కిటికీయును, కుడివైపున అడ్డు కిటికీయును కలవు. ఎడమవైపు కిటికీపైని 14 పంక్తులలో బ్రాహ్మీలిపిలో గౌతమీబాలశ్రీ శాసనమున్నది. ఇందు మొదటి ఆరుపంక్తుల లోను మధ్య కొంచెము స్థలమున శాసనము లేదు. ఈఖాళీలో వేషభూషాలంకృతుడగు నొక యోధుని రేఖాచిత్రము కలదు. ఇది గౌతమీపుత్రసాతకర్ణిది కావలెను. ప్రధాన ద్వారము గుహాకంతటికిని అలంకారముగ నున్నది. ఇది క్రీ. పూ. 1వశతాబ్దమున నిర్మింప బడిన సాంచీచైత్యద్వారములవలె చెక్కబడి నది. ఇట్టిదే మరియొకద్వారము అమరావతీ చైత్యశిల్పములలో మహాభినిష్క్రమణదృశ్య మున చెక్కబడినది. ఈద్వారమునకు రెండు వైపులను ద్వారపాలకులబొమ్మలవంటి బొమ్మలు రెండు కలవు. ఇందలి వ్యక్తులు ఎడమచేతిని వంచి, నడుమునకు ఆన్చి, కుడి చేతిని మోచేతివద్ద వంచి, పైకి ఎత్తి లీలార విందమును పట్టుకొని నిలచినారు. ద్వారపు నిలువుకమ్ములు ఆరేసి అరలుగ నుండి ఒక్కొక దానియందును శిల్పములు కలవు. కుడివైపు కమ్మి అట్టడుగున ఒకవామనుడు కుడచేతిని పైకి ఎత్తి ద్వారమునంతటిని మోయుచున్నట్లు చిత్రింపబడినాడు ఆపై దృశ్యమునందు రాజో చితవేషభూషాలంకృతుడగు నొక పురుషు డున్నాడు. అతనికి ఎడమవైపున ఒకస్త్రీ ముం దుకు వంగి నిలచి యున్నది. ఆపైవరుసలో ఒక పురుషుడు కుడిచేయి నడుమున చేర్చి ఎడమచేతినొకస్త్రీ భుజముల చుట్టును పోనిచ్చి నాడు. ఆస్త్రీ కాళ్ళను స్వస్తికాకృతిని పెట్టు కొని నిలచి కుడిచేత పురుషుని కుడిభుజ మును పట్టుకొని, ఎడమచేతిని తన నడుమున కాన్చుకొనినది. దానిపైవరుసలలో ఒకభిక్షువు ఎడమచేతిని మధ్యకు వంచి పైకి ఎత్తి కుడిచేతితో ఎదుటనున్న స్త్రీ యిచ్చుచున్న వస్తువును తీసుకొనుచున్నాడు. ఆపైవరుసలో ఏనుగుపై స్వారిచేయుచున్న మిధున మున్నది. అన్నిటికంటెను పైన ఒక పురుషుడు తన చేతు లలో ఒకస్త్రీని ఎచ్చటికో తీసికొని పోవుదృశ్య మున్నది. ఎడమవైపు నిలువుకమ్మిమీదను ఇట్టి శిల్పము లున్నవి. అట్టడుగున వామను డున్నాడు. ఆపైన ఒకస్త్రీ ఎడమచేత నొక చెట్టుకొమ్మను పట్టుకొని కుడిచేత ఒకలేడికి ఏదియో పెట్టుచున్నది. ఆపైన ఒక మిథు నము నొక బాలుడును కలరు. ఆమీద దృశ్యము మధ్యగ నొక చెట్టుక్రింద నొక స్త్రీ కూర్చొని ఉన్నది. ఆమెకు ముందొకడును, వెనుకనొకడును పురుషు లున్నారు. అన్నిటి కంటెను పైన ఒకస్త్రీని ఒక పురుషుడు తన

చేతులలో తీసుకొని పోవుచున్న దృశ్యము న్నది. అడ్డకమ్మిక్రింద ముత్యాల తోరణ మున్నది. ఈమాలము నిలువుకమ్ములను దాటి రెండువైపులను కొంతదూరమేగి పైకి వంపు తిరిగినది. ఈవంపులకును నిలువుకమ్ములకును నడుమ ఏటవాలుగ అటునిటు రెండు సింహము లున్నవి. ఈఅడ్డకమ్మిమీద వరుసగ ప్రాకారావృతమైన బోధివృక్షమును, అటునిటు చామర వాహికలుగల ఒక చైత్యమును, ధర్మచక్ర స్తంభమును చెక్కబడినవి. ఈకమ్మిపైన కొంత దూరమున మరియొక అడ్డకమ్మి కలదు. దాని పైన పూర్ణకమలముల వరుస కలదు. ఈకమ్మి చివరలును పైకి వంపు తిరిగియున్నవి. ఈవంపులకును, నిలువుకమ్ములకును మధ్య కూడ సింహము లున్నవి.

ఈద్వారమున కవతల నొక చావడి కలదు. దానిలోతు 46అడుగులు, వెడల్పు 41అడుగులు. దీనిలో స్తంభములు లేవు. కుడి గోడలో అయిదును, వెనుకగోడలో ఆరును, ఎడమగోడలో ఏడును మొత్తము 18గదు లున్నవి. ఈవెనుకగోడమీద మధ్య కార్లా చైత్యమునకు ప్రతివంటి ఒక చైత్యము చెక్కబడి యున్నది. దీనిక్రింద రెండువైపులను చామరవాహకు లున్నారు. ఆపైన కుడివైపున ధర్మచక్రము నున్నది. ఆపైన రెండువైపులను యక్షులున్నారు. ఈయక్షులపైన రెండేసి ఛత్రము లున్నవి. చైత్యముమీద ఒక పెద్ద ఛత్రమున్నది.

౮వగుహ :—ఇది శిథిలావస్థయందున్నది. దీనిముందు వసారాలో 4 స్తంభము లున్నవి. వీని అగ్రములయందు ఏనుగులును వాటిపై స్త్రీపురుషులును చెక్కబడినారు. స్తంభముల పైన ప్రాకారశిల్ప మున్నది. వసారా కుడి యెడమగోడలలో గూళ్ళు కలవు. దీనివెనుక గోడలో మూడు ద్వారము లున్నవి. వీని వెనుక స్తంభములులేని చావడి ఒకటి ఉన్నది.

౯వగుహ :—ఇది మిగిలిన గుహలకంటెను ఎత్తుగ నున్నది. ఈగుహాలో ముందుకల వసారాలో నాలుగు స్తంభము లున్నవి. ఈ స్తంభములు పొట్టిగ ఉన్నవి. ఇందు ఒకదాని అగ్రమున లేడి కలదు. ఇంకొకదానిపైన రెండు వృషభము లున్నవి. మూడవదానిపైన ఇద్దరు పురుషులు కలరు. కుడివైపున గల ఒక స్తంభముమీద ఎడమచేయి నడుమున జేర్చి కుడిచేత నొకపుష్పమును ముక్కుదగ్గర పెట్టుకొని వాసన చూచుచున్న పురుషుని రేఖాచిత్ర మున్నది.

౧౦వగుహ :—ఈగుహ పైకప్పు మంటపమువలె ముందుకు చొచ్చుకొని వచ్చినది. గుహ అడుగుభాగమున కుడిగోడలో ఐదు అడుగుల యెత్తుగల మనుష్యుని బొమ్మ చెక్కబడినది. ఆవ్యక్తి ఎడమచేత ఒకగదను పట్టుకొని కుడిచేతిని మొలలోని బాకు పిడిమీద ఉంచినాడు. అతని తలమీద అయిదు పడగ లున్నవి. అతనికి ఇటునటు చామరవాహిక లున్నారు. గుహాముందువసారాలో ఆమలక స్తంభము లున్నవి. ఇవి కార్లా చైత్యగృహము లోని స్తంభములవలె ఉన్నవి. వీని అగ్రముల మీద ఏనుగులపైనను, గుర్రములపైనను స్వారి చేయుచున్న మనుష్యులు చెక్కబడి నారు. ఈ స్తంభములవెనుక వసారా ఉన్నది. దీని వెనుకగోడలో శిల్పము లేమియు లేవు. మధ్య ప్రధానద్వారమును, రెండువైపులను రెండు ఉపద్వారములు నున్నవి. ద్వారమునకు రెండువైపులను ఒక్కొక్క కిటికీ కలదు. ఈవసారావెనుక స్తంభములులేని చావడి

ఒకటి ఉన్నది. దీని వెనుకగోడమధ్యలో ఒక బొమ్మ చెక్కబడి యున్నది. అది కొద్దిగ కుడి వైపుకు వంగి, ఎడమచేతిని గదమీద ఆనుకొని, కుడిచేత మొలలోనున్న బాకుపిడి పట్టుకొని తలమీద ఐదుపడగలుగల పురుషుని బొమ్మ. దానిక్రిందగ కుడివైపున కాళ్ళను స్వస్తికాకృతిలో పెట్టి రెండుచేతులను తనపైన జోడించి కొంచెము ముందుకు వంగి నమస్కరించుచు నిలచిన స్త్రీ బొమ్మ కలదు. పురుషునకు పైన ఒక హర్మికయు, దానిమీద నొక ఛత్రమును కలవు. ఈగొడుగు కామునుండి ప్రక్కలకు మరిరెండు ఛత్రము నున్నవి. వీని అంచులనుండి ముత్యాలసరములు వ్రేలాడు చున్నవి. ఈగుహాలో క్షహరాటరాజగు నహపానుని అల్లుడు ఉషవదత్తుని శాసన మున్నది.

౧౭వగుహ:— ఇది ఒక విహారము. దీనిని ఇంద్రాగ్నిదత్తుడు, ధర్మరక్షితుడనను యవనులు నిర్మించిరి. దీనిముందు సన్నని వసారా కలదు. దానిముందు ఏనుగులపై స్వారిచేయుచున్న మనుష్యులబొమ్మలు చెక్కబడిన అగ్రములు కల నాలుగు స్తంభము లున్నవి. వసారావెనుక నొక చావడి కలదు. దీని లోపలి మూడుగోడలను ఆని ఒక అరుగు కలదు.

౧౮వగుహ:— ఇది ఒక చైత్యగృహము. ఇందు మహాహకుశ్రీ అను సాతవాహనరాజు దౌహిత్రి శాసన మున్నది. ఈగుహాముఖమున చైత్యవాతాయనములలో మనుష్య శిరములు చెక్కబడినవి. ఈగుహ బేడ్సా, కొండనే చైత్యాలయములను పోలియున్నది. ఈయంశములనుబట్టి ఇది మిక్కిలి ప్రాచీనమైనది అనియు బహుశః క్రీ. పూ. 2వశతాబ్దినాటి దనియు ఊహింపవచ్చును. ఈగుహాలోతు 39అడుగులు, వెడల్పు 22అడుగులు. ఈగుహాముఖము మిక్కిలి అందముగ నున్నది. మధ్యగ ప్రధానద్వారమున్నది. దీని నిలువు కమ్ములమీద లతలును, అడ్డకమ్మిమీద స్వస్తికాత్రిరత్నచిహ్నములును మనోహరముగ చెక్కబడినవి. ద్వారముపైన గుర్రపులాడమువంటి పెద్ద చైత్యవాతాయన మున్నది. దానిచుట్టును వరుసవరుసలుగ చిన్నచిన్న వాతాయనము లున్నవి. రెండేసివరుసలకు మధ్యగల అంచులలో మనుష్యశిరములుగల చిన్న వాతాయనము లున్నవి. ఈసాంప్రదాయము ఉత్తరసాతవాహనయుగమునందలి పల్లవవాస్తువులో కనిపించుచున్నది. ద్వారము దాటగనే 25అడుగుల లోతును, 10అడుగుల వెడల్పును, [illegible]అడుగుల ఎత్తును గల గది యున్నది. దీనిమధ్య 5½అడుగుల వ్యాసమును, [illegible]అడుగుల ఎత్తునుగల శిలాచైత్య మున్నది. చైత్యము చుట్టును నిరాడంబరములగు స్తంభము లున్నవి. వాటి అగ్రముల శీర్షకలు లేవు. ద్వారమునకు కుడివైపున ఒక మనుష్యుని బొమ్మ కలదు. అతడు తలను కొంచెము కుడివైపుకు వంచి, కుడిచేత కటివస్త్రపు అంచును పట్టుకొని, ఎడమచేతిని పైకి ఎత్తి లీలారవిందమును పట్టుకొని నిలచియున్నాడు.

౨౦వగుహ:— ఇది విలక్షణమైన ఆలయము. దీనిని బాపకి అను భిక్షువు ప్రారంభించెను. వాసు అనునతడు సుప్రసిద్ధ సాతవాహనచక్రవర్తియగు గౌతమీపుత్రయజ్ఞశ్రీ ఏడవరాజ్యసంవత్సరమున దీనిని పూర్తిచేయించెను. గుహాముఖమున ఆరు పలకలస్తంభము లున్నవి. దీని వెనుక స్తంభములులేని విశాలమగు చావడి కలదు. దీని గోడలలో 20

గములు కలవు. ఈచావడి వెనుకగోడ మధ్య అతిమనోహరముగ చెక్కబడిన నాలుగు స్తంభము లున్నవి. ఇవి ఆమూలాగ్రమును ఆరు పలకలు కలిగియున్నవి. వీనిమధ్యను, అగ్రమునను చక్కని రేఖాశిల్పములుకల ఉద్యానము లున్నవి. వీనినుండి ముత్యాలతోరణములు వ్రేలాడుచున్నవి. ఈస్తంభములు ఎల్లోరా, అజంతాగుహలలోని స్తంభములను స్ఫురణకు తెచ్చుచున్నవి. ఈస్తంభములవెనుక మరియొక వసారా కలదు, ఈవసారా వెనుక గోడ మధ్య చక్కని శిల్పముకల ద్వార మున్నది. దీనికి రెండువైపులను ఎత్తైన పద్మపాణివిగ్రహము లున్నవి. ద్వారమునకు అవతల గర్భాలయము కలదు. దానిమధ్య ఒక పెద్ద ఎత్తైన సింహాసన మున్నది. దీనిమీద కూర్చొని బుద్ధుడు ఎడమచేత ధర్మచక్రమును పట్టుకొని కుడిచేత దానిని త్రిప్పుచున్నాడు. సలక్షణమైన ఈగుహ హిందూదేవాలయమువలె నున్నది. ఇందు ముందువసారాయు, దానివెనుక చావడియు క్రీ. శ. 2వశతాబ్దినాటివి. ఆవెనుక భాగము క్రీ. శ. 5, 6 శతాబ్దులనాటిది.

కార్లా :— ఈ పేరుగల గ్రామము పూనా బొంబాయిమార్గమున మాలవెల్లి రైలుస్టేషనుకు మూడుమైళ్ళదూరమునం దున్నది. గ్రామమునంటి ఒక కొండలవరుస కలదు. అందు ఒకకొండమీద 10, 12 గుహలు కలవు. ఇచ్చటి దృశ్యమే మిక్కిలి రంజకముగ నున్నది. వలయాకారముగనున్న పర్వతపంక్తి, దాని లోపల విశాలమైన లోయని, దీనిలో నిట్టనిలువుగ నొక కొండ. దాని అగ్రము నీలశిలామయమై వలయాకారముగ అంచువరకును చొచ్చుకొని వచ్చినది. దీనిమూలమున ఈ గుహలు చెక్కబడినవి. వీని కెదురుగ కొంత సనుపైన ప్రదేశము కలదు. ఇక్కడి గుహలన్నిటిలోను ఒక చైత్యగృహము చాలముఖ్యమైనది. దీనిలో చైత్యగృహవాస్తువు పరమావధిని గాంచినది. ఇంత పెద్దదియు, ఇంత అందమైనదియు చైత్యాలయము మరియొకటి భారతదేశమునం దచ్చటను కన్పింపదు. ఇదికాక ఇచ్చట కొన్ని చిన్నచిన్న విహారములును, రెండు రెండంతస్తుల విహారములును, రెండు స్తంభములులేని సమావేశ భవనములును కలవు. కాని ఇవి అన్నియు శిథిలావస్థయందున్నవి.

గుహముందు ప్రవేశమార్గము కలదు. దానికి రెండువైపులను రెండు ఎత్తైన అరుగు లున్నవి. అందు కుడివైపుగల అరుగుమీద లావైన 16 పలకల స్తంభమొకటి ఉన్నది. దీని అగ్రము ఒక గంటవలె నున్నది. దానిమీద నొక ఉద్యానము కలదు. దానిమీద తామర రేకులుగల పట్టీ ఉన్నది. దీనిపైన నాలుగు చతురము లున్నవి. వీనిపైన ప్రాకారశిల్ప మున్నది. దీనిమీద నాలుగు సింహము లున్నవి. మార్గమునకు ఎడమవైపునకూడ నట్టిదే మరియొక సింహస్తంభ ముండెడిది, కాని అది మధ్యకు విరిగి పోయినది. నిలచిన భాగముమీద నొక దేవీవిగ్రహమును చెక్కి ఇటీవల ఎవరో దానిచుట్టును ఒక చిన్నగుడి కట్టినారు. ఈసింహస్తంభములవెనుక గుహ కలదు. వెలుపలి అంచునుండి చైత్యము వెనుకనున్న గోడవరకును దీని లోతు 124 అడుగులు, వెడల్పు 45½ అడుగులు, నేల మట్టమునుండి పైకప్పువరకునుగల ఎత్తు 46 అడుగులు.

గుహముందు ఒక వసారా ఉన్నది. దీని పొడవు 52అడుగులు, వెడల్పు 15అడుగులు.

దీనిలో ముందుమార్గమున కిటునటు నాలుగు పలకల స్తంభము లున్నవి. వీనిపైన కొంత వెడల్పు అయిన భాగమున్నది. దానిపైన తిరిగి నాలుగు స్తంభములు కలవు. ఈవసారా గోడలమీద చక్కని శిల్పము లున్నవి. గుహ ఎడమగోడకును, మొదటి స్తంభమునకును మధ్యగల రాతిమీద దిగువ రెండు చిత్రములలో సింహాసనముమీద కూర్చొని ధర్మబోధ చేయుచున్న బుద్ధుని బొమ్మ లున్నవి. వానిపైన ఒక మిథునము కలదు. అందలి స్త్రీపురుషుల బొమ్మలు అనేకాభరణభూషితములై మిక్కిలి మనోహరములుగ నున్నవి. స్త్రీ కంఠమున నొక ముత్యాలహార మున్నది. దాని చివర పులిగోరువంటి ఆభరణము స్తనముల మధ్య వ్రేలాడుచున్నది. ఆమె హస్తములకు అనేకకంకణము లున్నవి. కాళ్ళకు కడియములు కలవు. ఆమె కుడిచేతిని మోచేతివద్ద వంచి, ముంజేతిని పైకి ఎత్తి ఒక అరవిందమును కుడిచెవివద్ద పెట్టుకొనినది. ఎడమచేయి ప్రక్కకు వంపబడి పురుషుని కంఠమును చుట్టుచున్నది. పురుషుడు రాజోచితమగు ఉష్ణీషమును, ఆభరణములను ధరించినాడు. అతడు ఎడమచేత కటివస్త్రపు అంచును పట్టుకొనినాడు. కుడిచేత స్త్రీ వీపును చుట్టినాడు.

వసారా కుడి ఎడమగోడలలోను శిల్పము లున్నవి. కుడిగోడలో దిగువ మూడు పెద్ద ఏనుగు లున్నవి. ప్రతివాని వీపుమీదను విమానమువంటి అంబారీ ఉన్నది. అందొకదానిలో అటునిటు చామరవాహికలు కొలువ సింహాసనాసీనుడగు బుద్ధుని బొమ్మ కలదు. మధ్య అంబారీలో ధ్యానిబుద్ధు డున్నాడు. అతని కిటునటు పద్మపాణులును, పైన యక్షులు నున్నారు. మూడవదానిలో ధ్యానిబుద్ధు డున్నాడు. ఈఅంబారీలపైన ఒక అంచు కలదు. దీనిపైన కొంతదూరము ప్రాకారశిల్ప మున్నది. దీనిపైన ఒకమూల విమాన మొకటి కలదు. దానిప్రక్క నొకగూటిలో ఒక మిథున మున్నది. అందలి స్త్రీ కొద్దిగ ఎడమవైపునకు వంగి కుడిచేత లీలారవిందమును పట్టుకొని, ఎడమచేత పురుషుని నడుమును చుట్టుచున్నది. పురుషుడు తన కుడిచేత స్త్రీ వీపును చుట్టి ఎడమచేత లీలారవిందమును పట్టుకొనినాడు. దీని ప్రక్కన ఒక చైత్యవాతాయన మున్నది. దానిప్రక్క మరియొక విమానము కలదు. దీనిప్రక్క ఒకగూటిలో మరియొక మిథున మున్నది. అందు స్త్రీ కుడిచేత కరిహస్తము పట్టినది. కుడిచేతిని తలపైకి వంచి అరచేయి తలపై పెట్టినది. తల కొద్దిగ ఎడమవైపుకు వాల్చియున్నది. పురుషుడు నడుమును ఎడమవైపుకు వంచి, కుడిచేతిని వ్రేలాడవేసి, ఎడమచేత స్త్రీనడుమును పట్టుకొనినాడు. ఈదృశ్యములపైన మరియొక అంచు కలదు. దీనిమీద తిరిగి ప్రాకారశిల్ప మున్నది. దీనిమీద చిత్రవిచిత్రములగు మూడు విమానము లున్నవి. ఈపైన మరియొక ప్రాకారశిల్పము కలదు. దానికి పైభాగమున మరికొన్ని విమానములు చెక్కబడినవి. కట్టకడపట మరియొక వరుసలో రెండు విమానములును రెండు వాతాయనములును కలవు. వసారా ఎడమగోడకును మొదటిస్తంభమునకును నడుమగల రాతిమీద కుడివైపున ఉన్నట్లు ఒకమిథునము చెక్కబడినది. ఎడమవైపు గోడమీదకూడ కుడివైపు గోడమీదవలెనే ఏనుగులును, విమానములును, వాతాయనములు నున్నవి. అట్లే మిథునములును చెక్కబడినవి.

వసారా వెనుకగోడమధ్య ప్రధానద్వార మున్నది. దాని కుడివైపుగోడమూలలో ఒక ఉపద్వారముకలదు. దీనివెనుక ప్రదక్షిణమార్గ మున్నది. ఆప్రక్కన ఒక మిథున మున్నది. ఈచిన్నద్వారముపైన వాతాయనము కలదు. ద్వారమును చేరి ఒక పెద్ద చట్రములో మరియొక మిథున మున్నది. దానిప్రక్కన పద్మపాణిబొమ్మ, దానిప్రక్క మరియొక మిథునము కలవు. ఆతర్వాత ప్రధానద్వార మున్నది. దానికి ఎడమవైపున మరియొక మిథునము, సింహాసనస్థుడై పాదముల నొకతామరపువ్వుమీద పెట్టి బుద్ధుడు కూర్చొనగా ఆపువ్వు కాడకు అటునిటు నాగనాగినులు, ఆమీద మరియొక మిథునము కలరు. తర్వాత మరియొక ఉపద్వార మున్నది. ఈదృశ్యములకు పైన బుద్ధులవరుస, దానిపైన ప్రాకార శిల్పము కలవు.

ఈవసారావెనుక నొక విశాలమగు గది ఉన్నది. దీని లోతు 70 అడుగులు, వెడల్పు 26 అడుగులు, ఎత్తు 46 అడుగులు. దీనిమధ్య శిలాచైత్య మున్నది. దీనిచుట్టును 38 స్తంభము లున్నవి. చైత్యముచుట్టును వలయమునందు 8 నిరాడంబరములగు స్తంభములు కలవు. మిగిలినవి రెండుప్రక్కలను ఉన్నవి. ఇవి అద్భుతముగ చెక్కబడినవి. వీనిమూలమున చతురస్రములును, ఆపైన డేగిసావంటి భాగమును కలవు. అగ్రమున గంటవంటి శీర్షికయు, దానిమీద చతురస్రములును, వాటిపైనమోకాళ్ళపైకూర్చొనినఏనుగులును, వానిమీద లీలావిహారము చేయుచున్న స్త్రీపురుషుల బొమ్మలు నున్నవి. ఈబొమ్మలలో జీవకళ ఉట్టిపడుచున్నది. ఇట్టి మనోహరశిల్పము మరియేగుహయందును, ఎచ్చటను కానరాదు.

ఎడమవరుసలో ఒక స్తంభముమీద నొక చిన్నచైత్యమును, దాని కిటునటు సింహస్తంభములును ఉన్నవి. మరియొకస్తంభముమీద ధర్మచక్రము చెక్కబడినది. చైత్యవేదిక రెండు అంతర్వ్యాలలో ఉన్నది. వీని అగ్రముల ప్రాకారశిల్పము కలదు. దీని హర్మికపైన పశ్చిమోత్తరదిశను 10 అంగుళముల లోతుగల కంత కలదు. దీనికి 10 అంగుళముల చతురమును, 4 అంగుళముల మందమునుగల రాతి పలక మూతగ అమర్పబడినది. బహుశః ఈగోతిలో ఏదైనను అవశేషము గుప్తపరుపబడియుండును. చైత్యముపైన కొయ్యతో చేయబడిన ఛత్ర మున్నది. పైకప్పు బండిగూడువలె వంపుగ నున్నది. దీనిలో వంపుగల కమ్ములు అమర్పబడినవి. ప్రధానద్వారముపైన పెద్ద వాతాయనమున్నది. దానిలోనుండి లోపలికి గాలియు, వెలుగును వచ్చుచున్నవి.

ఇతరగుహలు :— చైత్యగృహమున కుత్తరముగ 100 అడుగులు పొడవుగల సమావేశభవన మొకటి కలదు. దీనిపైన 28 అడుగుల పొడవును, 27 అడుగుల వెడల్పును, 8 అడుగుల ఎత్తును కలిగిన 13 గదులుగల విహార మొకటి ఉన్నది. దీనిప్రక్కనే, పైభాగమున మరియొకవిహార మున్నది. దీనిపొడవు 48 అడుగులు, వెడల్పు 34 అడుగులు, ఎత్తు 9 అడుగులు. ఇంకను ఉత్తరముగ ఇంకొకవిహార మున్నది. దాని పొడవు 39 అడుగులు, వెడల్పు 17 అడుగులు. దానిలో 3 గదులు ఉన్నవి. చైత్యగృహమునకు దక్షిణముగ 3i అడుగులు పొడవు 16 అడుగులు వెడల్పు కల మరియొకవిహారము కలదు. మిగిలినగుహలు శిథిలావస్థయం దున్నవి.

అజాంతాగుహలు :— అజాంతా ఎల్లోరాలు జగత్ప్రసిద్ధములు. ఇందు అజాంతా ముఖ్యముగ చిత్రములకును, ఎల్లోరా శిల్ప వాస్తుచిత్రకళలకును ప్రసిద్ధినందినవి. అజాంతా గుహాలు వింధ్యాద్రుల శాఖలో తపతీనది లోయలో ఉన్నవి. వీనిని ఇటు ఔరంగబాదు నుండిగాని అటు చాలీస్‌గాం నుండికాని చేర వచ్చును. ఈగుహాలచుట్టును చిట్టడవి ఉన్నది. ఇవి నేలమట్టమునుండి 250 అడుగుల ఎత్తుగ నిట్టనిలువుగ నున్న కొండప్రక్కలో దొలవ బడినవి. ఈకొండ గుర్రపులాడమువలె వంపు తిరిగి యున్నది. దీనిపైనుండి వాఘీరా అను ఏరు మధ్యగల లోయలోనికి దూకుచున్నది. ఇక్కడ 600 గజముల దూరములో 29 గుహ లున్నవి. ఇవి నేలమట్టమునుండి 35-100 అడు గుల మధ్యగల ఎత్తునందు ఉన్నవి. ఈగుహ లలో 8, 9, 10, 12, 13 నంబర్లు గలవి మిక్కిలి ప్రాచీనములు. వాటి వాస్తులక్షణము లనుబట్టియు, వానికిని నాసిక కార్లాలలోగల గుహాలకును గల పోలికలనుబట్టియు ఈఅయిదు గుహాలును సాతవాహనయుగమున నిర్మింప బడినవని కోవిదుల నిర్ణయము. వీనిలో వర్ణ చిత్రము లున్నవి. ఇందు మొదట కొన్ని చిత్రింపబడినవి. కొంతకాలమైన పిమ్మట వాటి పైన క్రొత్తచిత్రములు వేయబడినవి. అందు వలన బహుసూక్ష్మముగ పరిశీలించినగాని అడుగునగల చిత్రములు కనిపింపవు. ఈచిత్ర ములును సాతవాహనయుగపువే అని పండి తులు నిర్ణయించినారు.

౧౨, ౧౩వ గుహాలు :— ఇవిరెండును విహారములే. కొందరు ౧౨వగుహ ప్రాచీన తమమనియు, మరికొందరు ౧౩వగుహ ప్రాచీన తమమనియు అభిప్రాయపడినారు. ౧౩వగుహ లోని చావడి లోతు 16 1/2 అడుగులు, వెడల్పు 13 1/2 అడుగులు, ఎత్తు 7 అడు గులు. దీనిలో ఎడమగోడలో 3, కుడిగోడలో 2, వెనుకగోడలో 2 గదులు కలవు. ౧౨వ గుహాలోని చావడి 36 అడుగుల చతురము. దీని లోపలిగోడలలో 12 గదు లున్నవి. ఇందు 11 గదులలో రెండేసి అరుగులున్నవి. ఈఅరుగులకు ఒక చివర తలగడవలె ఎత్తుగ ఉన్నది. గదులగుమ్మములమీద చైత్యవాతా యనములు కలవు. గోడలమీద ప్రాకార శిల్పము కలదు.

౮వగుహ :— ఇదికూడ ఒక విహారము. దీని ముఖము శిథిలమైపోయినది. దీనిలోని చావడి పొడుగు 32 అడుగులు, వెడల్పు 17 అడుగులు, ఎత్తు 10 అడుగులు. ఇందు 8 గదు లున్నవి.

౯వగుహ :— ఇది ఒక చిన్న చైత్య గృహము. బహుప్రాచీనము. బహుశః క్రీ.పూ. 1వశతాబ్దిదేమో! దీని లోతు 45 అడుగులు, వెడల్పు 23 అడుగులు, ఎత్తు 22 అడుగులు. ఈగుహాముఖమున 3 3/4 అడుగుల వెడల్పు గల అంచు కలదు. దీనిమీద చైత్యవాతా యనములు చెక్కబడినవి. దీనిముందు కుడి ఎడమగోడలమీద పెద్ద బుద్ధుని బొమ్మలు కలవు. లోపల చైత్యముచుట్టును 23 స్తం భము లున్నవి. రెండువైపులను మొదట నున్న స్తంభముల మూలములును, అగ్రము లును చతురముగ నుండి మధ్యభాగము పల కలుతేరి యున్నది. ఈస్తంభములు 10 అడు గుల ఎత్తుగ నున్నవి. చైత్యముయొక్క వ్యాసము 7 అడుగులు. దాని వేదిక ఎత్తు 5 అడుగులు. అండముయొక్క వ్యాసము 6 అడుగులు, ఎత్తు 4 అడుగులు. దీనిపైన

11/4 అడుగుల యెత్తుగల హర్మిక కలదు. దీనిప్రక్కలు ప్రాకారమువలె చెక్కబడినవి. దీనిపైన ఆరుస్తంభములును, వానిమీద నొక పలకయు కలవు. దీనిమీద కార్లాలోవలె ఒక దారుఛత్ర మున్నది. చైత్యముపైకప్పు వంపుగ నున్నది. ద్వారముమీద 11 1/2 అడుగుల ఎత్తుగల పెద్ద చైత్యవాతాయన మున్నది. దీనిమధ్య 2 1/4 అడుగుల వెడల్పుగలిగిన ప్రాకారశిల్పము చెక్కబడిన అంచు కలదు.

ఈగుహలో కొన్ని వర్ణచిత్రము లున్నవి. ఇవి రెండుమూడుసార్లు భిన్నకాలములలో నిర్మింపబడినవి. గోడలమీద రెండువరుసల చిత్రములు కనిపించుచున్నవి. వీనిలో నాలుగు చిత్రములు మిక్కిలి పురాతనములు. ఇందలి వ్యక్తుల వేషభూషలు సాంచీఅమరావతీశిల్పములలోని వ్యక్తుల వేషభూషలను పోలియున్నవి. (i) గుహముందుగోడ లోపలివైపు కిటికీమీది చిత్రము. ఇది శిబిజాతకము. ఇందు ఒకరాజు సింహాసనముమీద ఒకకాలును, పాదపీఠముమీద ఒకకాలును ఆనుకొని కూర్చొనినాడు. ఇతడు వెడల్పైన కంఠాభరణమును, పెద్దభూషలను, కర్ణికలను, ఎత్తైన ఉష్ణీషమును ధరించినాడు. కార్లా, బేడ్సా, నాసికలలో స్తంభాగ్రముల నున్న పురుషుల భూషణము లిట్లే ఉన్నవి. అతనివెనుక అటునిటు నిర్వురు పురుషులు నిలచియున్నారు. వారితో ఒకస్త్రీ కూడ కలదు. కొంచెముదూరముగ మరి యిర్వురు పురుషు లున్నారు. పైన ఇంద్రుడు ఆకాశమునం దెగురుచున్నాడు. ఈ దృశ్యమునకు ఎడమవైపున ఒకకొండయు, దానిమీద నిర్వురు మనుష్యులును చిత్రింపబడినారు. (2) ముందుగోడ ఎడమవైపు చిత్రము, దీనిక్రిందిభాగము బెల్లులు ఊడిపోయినది. పైభాగమున ఆర్గురు బుద్ధు లున్నారు, ఒక్కొక్కనిపైన మూడేసి ఛత్రిము లున్నవి. స్తంభములమీద కూర్చొని, నిలచి ఉన్న బుద్ధుని బొమ్మలు కలవు. పైకప్పు లోపలిభాగమున చతురములలో కమలములు చిత్రింపబడినవి. (3) వెనుకగోడమీద — ఎడమచివర ఒకకొండమీద బుద్ధుడు నిద్దరు శిష్యులును కలరు. వీరిక్రింది వరుసలో ఒక వ్యక్తి ముందుకు వంగి ఒక పాత్రలోనుండి దేనినో ఇంకొక పాత్రలోనికి పోయుచున్నాడు. దీనికి కుడివైపున ఒక ప్రాసాదము ఎదుట భిక్షాపాత్రను ధరించిన బుద్ధుడును 4 భిక్షువులును నిలచి యున్నారు. ఈప్రాసాదమున కొకవైపున నిచ్చెన మీద పైకెక్కి ఒకడు లోనుండి ఒక కూజాను అందుకొనుచున్నాడు. రెండవచివర మరియొకడు కూజా తీసికొని నిచ్చెనమీద దిగుచున్నాడు. దీనికి కుడివైపుగ ఆకుపచ్చని అంచుగల తెల్లటి పంచను, లేడి చర్మమును, జటామకుటమును ధరించి ఎడమచేతి ఒక పాత్రను పట్టుకొని కుడిచేత నభయహస్తముంచిన బోధిసత్త్వుడు చిత్రింపబడినాడు. ఇంకను కుడివైపున ధర్మచక్రముద్రలో సింహాసనాసీనుడగు బుద్ధుడున్నాడు. బహుభూషాలంకృతు లైన యిర్వురు వెనుక నిలచి చామరములు వీచుచున్నారు. బుద్ధునికి ముందు జటామకుటధారియగు ఒక పురుషుడు రెండుచేతులతోను పూర్ణకలశము నెత్తిపట్టుకొనినాడు. అతని వ్రేళ్ళలో నొక దానినుండి ఒకపుష్పమాల వ్రేలాడుచున్నది. (4) క్రిందివరుసలో బుద్ధునియెదుట నొక జంత్రమును వాయించుచున్న పురుషుడును, స్త్రీయును కలరు. ఇంకను కుడివైపున పైన మూడు ఛత్రములుగల చైత్యమున్నది. ఆపైన

సింహాసనాసీనుడగు బుద్ధుడును, అతడు పాదములనాన్చిన తామరపువ్వుకాడను పట్టుకొనిన నాగులును కలరు. ఆమీద నొక బుద్ధుడును, అతని కిటునటు వజ్రచామరహస్తులగు పరిచారకులును, ఎదురుగ నొకరాజును రాణియు, నమస్కరించుచున్న బాలుడొకడును కలరు.

౧౦వ గుహ:—ఇది మరియొక చైత్యగృహము. అజంతాచైత్యాలయములన్నిటను ప్రాచీనతమము. దీని లోతు 95అడుగులు, వెడల్పు 41అడుగులు, ఎత్తు 36అడుగులు. దీనిలోభాగము అర్ధవలయాకారముగ నున్నది. ఇందు చైత్యముచుట్టును 39 పలకల స్తంభములున్నవి. ఈ స్తంభములు ఎత్తు 14అడుగులు. వీనిపైన 9¼అడుగుల ఎత్తు గోడ కలదు. దానిపైన 12 1/2అడుగుల ఎత్తున వంపు కలదు. దీనిలోభాగమున కార్లాలోవలె కర్రకమ్ములున్నవి. ప్రదక్షిణపథము వెడల్పు 6అడుగులు. చైత్యము నిరాడంబరమైనది. దాని వ్యాసము 15 1/2అడుగులు. ఇందు క్రీ. శ. 2వశతాబ్దినాటి లిపిలో శాసనమొకటి కలదు. భాజా, పితల్‌కొరా చైత్యగృహములవలె ఈ గుహకూడ క్రీ.పూ. 2వశతాబ్దిది కావచ్చును.

ఈగుహాయంతయు చిత్రింపబడినది. కొన్నిచోట్ల రెండుమూడుసార్లు చిత్రములను నిర్మించినట్లు కనిపించుచున్నది. ప్రాచీనచిత్రములలో అక్కడక్కడ కొన్నిభాగములు మాత్రము కనిపెంచుచున్నవి. గుహ కుడిగోడమీద పెద్దపెద్ద ఏనుగులు చిత్రింపబడినవి. అందొకదానిశరీరముమీద నీలిరంగు మచ్చలున్నవి. మరియొకటి ఆరుదంతములుకల శ్వేతగజము. దీనికి ఎడమవైపున అనేకవేషభూషాలంకృతులై పాదచారులుగను, అశ్వములమీదను పోవుచున్న మనుష్యుల ఊరేగింపు కలదు. దీనివెనుక గుంపులుగుంపులుగ స్త్రీలున్నారు. ఇవి క్రీ. శ. 2వశతాబ్ది మధ్యభాగమునాటి చిత్రములు. గుహ ఎడమగోడమీద సాంచీద్వారములవంటి రెండుద్వారములు కలవు. వీనిముందు ఆయుధహస్తులై కొందరు సైనికులు నడచి పోవుచున్నారు.

## ౨. ఆంధ్రదేశమునందలి గుహాలు

సాతవాహనయుగమునాటి గుహాలు మహారాష్ట్రముననే కాక ఆంధ్రదేశమునందును కలవు. కాని మహారాష్ట్రమునగల గుహాలలో చైత్యములును, భిక్షులునివసించుగదులును కొండలలోనే దొలవబడినవి. ఆంధ్రదేశమునగూడ నీసాంప్రదాయ మవలంబింపబడినది. కానిఈగుహావిహారములతోపాటుగను, చైత్యగృహగుహాలతోపాటుగను ఇటుకలతో నిర్మింపబడిన చైత్యగృహములును, విహారములును, కొండరాళ్ళతో నిర్మింపబడిన పలువిధముల చైత్యములునుకూడ గాంచనగుచున్నవి. ఇది ఆంధ్రదేశబౌద్ధతీర్థములలో కొన్నిటమాత్రము కనిపించు విశేషలక్షణము.

పైవిధమగు గుహాలు ఆంధ్రదేశమున శంఖరం, కోరుకొండ, ఎర్రంపాలెం, గుంటుపల్లి మున్నగుచోట్ల కలవు.

గుంటుపల్లి :—ఇది పశ్చిమగోదావరిజిల్లా ఏలూరుతాలూకాలో కామవరపుకోటకు 6 మైళ్ళదూరమునం దున్న పల్లె. ఈపల్లెకు ఒక మైలు దూరమున తూర్పుపడమరలుగ వ్యాపిం

చిన కొండ ఒకటి కలదు. ఈకొండ మధ్య దక్షిణముఖముగ గుఱ్ఱపులాడమున లెనుండు భాగము కలదు. దీని లోతు అరమైలు, ముఖమున వెడల్పు 500గజములు. దీనిలో పడమటిశాఖలో ఒక విలక్షణమైన చైత్యగృహమును, దానికి ప్రాగుత్తరముగ నొక విహారమును దొలవబడినవి.

చైత్యగృహము :—ఇది ఇతర స్థలముల సామాన్యముగ గాంచనగు గుహలవలె చతురస్రముగగాక వలయాకారముగ నున్నది. దీని వ్యాసము 18అడుగులు, ఎత్తు 14అడుగుల 9 అంగుళములు. దీనిమధ్య కొంచెమెక్కువ తక్కువగ గుహలో సగముభాగము న్రాక మించు శిలాచైత్య మున్నది. దీనిచుట్టును 3అడుగుల వెడల్పుగల ప్రదక్షిణమార్గ మున్నది. చైత్యవేదిక వ్యాసము 11అడుగుల 8 అంగుళములు, ఎత్తు 3 అడుగుల 9 అంగుళములు. దీనిమీద 9అడుగుల 2అంగుళముల వ్యాసమును, 4అడుగుల 9అంగుళముల ఎత్తునుగల అండము కలదు. అండము మీది హర్మికలో ఛత్రపుకాడను దించుటకుపయోగపడు గుంట ఉన్నది. ఈగుహ పైకప్పు చేజెర్లకపోతేశ్వరాలయపుకప్పువలె కోళ్ళగూడు ఆకారమున ఉన్నది. దీనిలోభాగమున వంపుగల కర్రకమ్ము లున్నవి. గుహాముఖమున పెద్ద గుర్రపులాడపు ఆకారముగల వాతాయనమున్నది. దీని అడుగున కమ్ములు ముందుకు చొచ్చుకొని వచ్చుచున్నవి. గయ వద్ద బరాబర్ కొండలలో లోమశఋషిగుహ అను ప్రాచీనగుహ కలదు. దానిముఖమును ఇట్లే ఉన్నది. ఈరెండుగుహల లోపలికొలతలును ఒకేవిధముగ నున్నవి. ఈగుంటుపల్లి గుహాముఖము సమానముగగాక అర్ధవలయాకారముగ నున్నది. బరాబర్ కొండలోని సుదామగుహాముఖముకూడ ఇట్లే ఉన్నది. ఈ యంశములనుబట్టి ఈగుంటుపల్లిచైత్యాలయము బరాబర్గుహలు నిర్మింపబడినకాలముననే, అనగా క్రీ. పూ. 200ప్రాంతమున నిర్మింపబడెనని చెప్పనగును.

విహారము :—ఈచైత్యగృహమునకు పైభాగమున ప్రాగుత్తరముగ విహారము కలదు. దీనిని చేరుటకు ఒక దారి కలదు. ఈమార్గమునకు ఎడమవైపున సాంచీద్వారమునందలి పైఅడ్డకమ్మిమీద గాంచనగు త్రిరత్న చిహ్నము చెక్కబడిన రాతిపలక కలదు. దాని నితరఫలకములతో చేర్చుటకు వీలగునట్లు వెనుక నొక కంత కలదు. దీనినిబట్టి యీగుంటుపల్లివిహారమునకు ముందు సాంచీద్వారమువంటి ద్వార ముండెడిదేమో అని సందేహము కలుగుచున్నది. ఈవిహారము అడ్డదిడ్డముగ చెక్కబడిన గదులతోను, కంతలతోను నిండియున్నది కాని మహారాష్ట్రమున కార్లా, నాసిక, బేడ్సా, భాజా మొదలగుచోట్ల గల విహారములవలె తీర్చి దిద్దినట్లు లేదు. కాని దీని నిర్మాణవిధానముమాత్రము బహుప్రాచీనతను, వైలక్షణ్యమును చూపుచున్నది. గుహకు మధ్య నొకటియు, రెండువైపులను రెండును మొత్తము మూడు ద్వారము లున్నవి. మధ్యద్వారమునకు రెండువైపులను కిటికీలు కలవు. వీనిమీదను ద్వారములమీదను చైత్యవాతాయనము లున్నవి. ఇవితప్ప మరియేయితర శిల్పమును, అలంకారమును లేవు. దీనియందు కొన్నిగదులు అసంపూర్ణములు. ఈవిహారమునందు ఒక్క చైత్యగృహమైనను లేదు.

మరియొకవిహారము :— ఈవిహారమునకు పైభాగమున మరియొక చిన్న విహారము కలదు. దానిలో 5 గదు లున్నవి. ఈవిహారము శిథిలావస్థయందున్నది.

శంఖరం* :— ఈగ్రామము విశాఖపట్టణం జిల్లాలో అనకాపల్లికి రెండుమైళ్ళదూరమునందున్నది. ఇచ్చట తూర్పుపడమరలుగ రెండు కొండ లున్నవి. అందు తూర్పుకొండకు బొజ్జన్నకొండ అనియు, రెండవదానికి లింగాల మెట్ట అనియు పేర్లు. ఈరెండుకొండలమీదను ప్రఖ్యాతమగు బౌద్ధక్షేత్రమొకటి ఉండెను. వీనిమీద అనేకవిహారములును, చైత్యాలయములును, గుహాలయములును కలవు.

౧వ గుహ :— ఇది బొజ్జన్నకొండ పడమటి అంచున కలదు. దీనిని చేరుటకు క్రింద నుండి మెట్లవరుస ఉన్నది. కొండలో కొంత భాగమును చెక్కివేసి 21అడుగుల పొడవును, 9అడుగుల వెడల్పును గల చతురస్రమును నిర్మించినారు. ఈచతురస్రమునకు ఎడమవైపున దక్షిణముఖముగ కొండ గలదు. దానిలో నొక చైత్యాలయము దొలువబడినది. ఈ గుహాముఖపు కుడివైపున కొండలో 5'5 పొడవును, 5'7 వెడల్పును, 3అడుగుల యెత్తును గల గూడు కలదు. ద్వారమునకు పైన 4అడుగుల పొడవును, 3అడుగుల వెడల్పునుగల గూడు కలదు. దాని కిరువైపులను ఒక జంతువును, ధ్యానిబుద్ధుడును చెక్కబడియున్నారు. ద్వారము ఎత్తు 0 1/2అడుగులు, వెడల్పు 4అడుగులు. దీనికి రెండువైపులను 12 1/2అడుగుల యెత్తున ద్వారపాలకుల బొమ్మలున్నవి. ఇవి మిక్కిలి మోటుగ నున్నవి. ఈద్వారమువెనుక 31 1/2అడుగుల పొడవును, 34అడుగుల వెడల్పును, 8 1/2 అడుగుల యెత్తును గల చావడి ఉన్నది. దీనిలో వరుసకు నాలుగువంతున నాలుగు వరుసల స్తంభము లున్నవి. ఈస్తంభముల మూలములు చతురములుగను, పైభాగములు పలకలుగను, అగ్రములు చతురములుగను ఉన్నవి. మధ్యనున్న రెండు స్తంభములమీదను చామరవాహకులు చెక్కబడినారు. వీని మధ్య నొక చైత్యమున్నది. దీని అడుగున నొక చతురస్రవేదిక కలదు. దీని వ్యాసము 4అడుగుల 3అంగుళములు. దీని వాస్తులక్షణములను, మోటుదనమును చూడ నిది మిక్కిలి ప్రాచీనమగు చైత్యాలయమని తోచుచున్నది.

౨వ గుహ :— ఇది మొదటి గుహపైన దొలవబడినది. దీనిని చేరుటకు సన్నని మెట్లవరుస కలదు. ఈవరుసకుడిపైపున ఏకశిలాస్తూపము లున్నవి. ఈగుహ మొదటిగుహపై అంచుకంటెను 6అడుగులు లోపలికి ఉన్నది. దీనిప్రవేశద్వారము ఎత్తు 5 1/2అడుగులు, వెడల్పు 5అడుగులు. దీనిపైన 7అడుగుల ఎత్తుగల చైత్యవాతాయన మున్నది. దీనిలో ధ్యానిబుద్ధుని విగ్రహము కలదు. అతని కిటునటు భక్తులును, పైన యక్షులును కలరు. ద్వారమునకు కుడివైపున 4అడుగుల వెడల్పును, 6అడుగుల యెత్తునుగల గూడు ఉన్నది. దీనిలో నిలచియున్న బుద్ధునియొక్కయు, భక్తులయొక్కయు బొమ్మలు చెక్క-

* Arch Sur. Ind. Rept. 1907—08. pp. 149—180.
ఆంధ్రపత్రిక సర్వజిత్తుసంవత్సరాదిసంచికలోని "బొజ్జన్నకొండలోని సంఘారామబౌద్ధనిర్మాణాలు" అనే నా వ్యాసం.

బడినవి. ద్వారమునకు వెనుక 15అడుగుల పొడవును, 5అడుగుల వెడల్పునుగల వసారా కలదు. దీని ఎడమగోడమీద పద్మముమీద కూర్చొనిన బుద్ధుడును, చామరవాహకులును చెక్కబడినారు. కుడిగోడమీద పెద్ద ధ్యాని బుద్ధునివిగ్రహ మున్నది. అతని కుడివైపున ఒక స్తూపము చెక్కబడినది. వసారావెనుక గోడమీద ఎడమవైపునుండి ధ్యానిబుద్ధుని వరుసలు చెక్కబడినవి. ఇవిగాక ఇట్టిదే ఒక పెద్ద విగ్రహమునున్నది. ఈవసారా వెనుక చావడి కలదు. దాని వెనుకగోడలో 6 1/2 అడుగుల వెడల్పును, 3 1/2అడుగుల లోతును గల గూడులో ధ్యానిబుద్ధుడు చెక్కబడినాడు. అతని కిటునటు చామరవాహకు లున్నారు. ఈ చావడి కుడియెడమగోడలలో మూడు విభాగములుగ బుద్ధుని బొమ్మలు చెక్కబడినవి. అందు కిరీటధారియై, ఎడమచేత అభయ ముద్ర ధరించిన బుద్ధుని బొమ్మ మనోహరముగ నున్నది.

3వ గుహ :—కొండపైన ఈ రెండవ గుహమీద కొంతభాగము సదునుగ చెక్కబడినది. ఆమీద కొండ కొంతదూరము నిలువుగ కోసివేయబడినది. ఈభాగమున ఈగుహ కలదు. దీని పొడవు 7అడుగులు, వెడల్పు 5 అడుగులు, ఎత్తు 5అడుగులు. దీని వెనుక గోడలో నొకగూడులో ధ్యానిబుద్ధుని బొమ్మ చెక్కబడినది.

4వ గుహ :—ఈబొజ్జన్నకొండ పైభాగమున ఏకశిలానిర్మితమగు పెద్దచైత్య మున్నది. దీనికి పశ్చిమోత్తరముగ కొండవాలులో ఈ గుహ కలదు. ఇది మిక్కిలి చిన్నది. దీనిద్వారమున కెడమవైపున గోడమీద రెండు బుద్ధుని బొమ్మ లున్నవి. ద్వారము ఎత్తు 5అడుగులు, వెడల్పు 2అడుగులు. దీనివెనుక 8 1/2అడుగుల చతురమును, 7అడుగుల యెత్తునుగల వసారా కలదు. దీనివెనుకగోడమీద ధ్యాని బుద్ధుని వరుస ఉన్నది.

5వ గుహ :—ఇది 4వగుహదగ్గర ఉన్నది. దీని చావడి పొడవు 12అడుగులు, వెడల్పు 8 1/2అడుగులు. దీనివెనుకగోడ మధ్య ధ్యానిబుద్ధు డున్నాడు. అటునిటు ద్వారపాలకులు కలరు. కుడిప్రక్కగోడమీద పెద్ద ధ్యానిబుద్ధుని బొమ్మ ఉన్నది. ఎడమవైపున ఒకనాగు డున్నాడు. దిగువ నొక సింహ మున్నది.

6వగుహ :— ఇది పై రెండుగుహలకును ఎడమవైపున ఉన్నది. దీని పొడవు 8 అడుగులు, వెడల్పు 7 1/2 అడుగులు, ఎత్తు 6 అడుగులు. దీనిలో శిల్పమేమియు లేదు.

7వగుహ :— ఇంతవరకును వర్ణింపబడిన గుహలు బొజ్జన్నకొండలోనివి. దీనికి పడమటగనున్న లింగాలమెట్టయందుకూడ ఒక గుహ కలదు. ఈకొండ పడమటిభాగమున కొంతమేర కొండనుండి వేరు చేయబడి రాతిలో రెండు పెద్దస్తూపములు చెక్కబడినవి. వీటికీవల కొండ పడమటిముఖమున ఈ గుహ కలదు. దీని పొడవు 11 అడుగులు, వెడల్పు 9 1/2 అడుగులు, ఎత్తు 6 1/2 అడుగులు. ఇది ఒక స్తంభములులేని చావడి. లోపల మూడువైపులను గోడలకు 2 అడుగుల యెత్తును, 2 అడుగుల వెడల్పునుగల అరుగు ఉన్నది. చావడిమధ్య 4 అడుగుల వ్యాసముగల చైత్యము కలదు.

# ౩. ఆంధ్రదేశ బౌద్ధక్షేత్రములు

ఇంతవరకును సాతవాహన యుగమున పర్వతములలో దొలవబడిన చైత్యగృహములను, విహారములను వర్ణించియుంటిమి. ఇవిగాక ప్రత్యేకముగ ఆంధ్రదేశమునందు అనేక చోట్ల ఇటుకలతో నిర్మింపబడిన చైత్యములు, మహాచైత్యములు, విహారములు మున్నగు బౌద్ధనిర్మాణము లెన్నియో బయలుపడినవి. వాని నీక్రింద వర్ణించుచున్నాము.

శాలిహుండం* :— ఈగ్రామము గంజాంజిల్లాలో చికకోలుతాలూకాలో వంశధారనది దక్షిణతీరమునం దున్నది. ఇది ప్రాచీనకాలమున ప్రసిద్ధమగు రేవుపట్టణముగ నుండిన కళింగపట్టణమునకు ఆరుమైళ్లదూరమునను, చికాకోల్ రోడ్డు రెలుస్టేషనుకు 12 మైళ్ళ దూరమునను ఉన్నది. గ్రామమునకు దక్షిణమున వంశధార ఒడ్డున తూర్పుపడమరలుగ 400 అడుగుల ఎత్తుగల రెండుకొండ లున్నవి. ఇందు తూర్పునగల కొండమీద బౌద్ధశిథిలము లున్నవి.

పర్వతశిఖరము :— ఈతూర్పు కొండ నెత్తిమీద అనేక చైత్యము లున్నవి. అవి చాలభాగము శిథిలములై పోయి వాని ఇటుక పునాదులుమాత్రము కనిపించుచున్నవి. కొండ తూర్పువాలుమీద ఒక గుర్రపులాడపు ఆకారముగల చైత్యగృహమును, ఒక చతురముగ నున్న ప్రదేశమును గలవు. బహుశః ఇది ఒక మంటపమై యుండవచ్చును. పర్వతాగ్రమునందున్న కట్టడములలో ఒక పెద్దస్తూపము ముఖ్యమైనది. దీని వ్యాసము 46 అడుగులు. ఇది పెద్దపెద్ద ఇటుకలతో నిర్మింపబడినది. వీని పొడవు 18 అంగుళములు, వెడల్పు 11 అంగుళములు, మందము 3 అంగుళములు. దీని చుట్టునుగల గోడమందము 3 అడుగులు. స్తూపముచుట్టును ఇటుకతో కట్టిన అరుగు కలదు. దీనికి పడమరగ 12 అడుగులదూరమునందు మరిరెండు చిన్నస్తూపము లున్నవి. వీని వ్యాసము 25 అడుగులు. ఇందొకదానియందు చితాభస్మముగల రాతిపెట్టె ఒకటి దొరకినది.

కొండవాలు :— పర్వతపు తూర్పువాలులో పైస్తూపమునకు ఉత్తరముగ 100 అడుగులు దిగువ రెండు మట్టిదిబ్బ లున్నవి. వీనివ్యాసము 35 అడుగులు, ఎత్తు 3 అడుగులు. వీనిలో ఒకదానిలో 29 అడుగుల వ్యాసముగల స్తూపము బయలుపడినది. దీని నిర్మాణవిధానము ఒక బండి చక్రమువలె ఉన్నది. మధ్యనున్న దిమ్మవ్యాసము 9 అడుగులు. ఈకట్టడమునం దుపయోగింపబడిన ఇటుకల పొడవు 11 నుండి 17 అంగుళములు, వెడల్పు 7 నుండి 11 అంగుళములు, దళసరి 3 అంగుళములు. చక్రపు ఆకులవలెనుండు గోడల పొడవు 18 అడుగులు, వెడల్పు 1 అడుగు.

చైత్యగృహము :— మరి నూరడుగులు దిగువగ నీచైత్యగృహము కలదు. దీని పొడవు 24 అడుగులు, వెడల్పు 12 1/2 అడుగులు, గోడల మందము 2 అడుగులు. దీనిలో 12 అడుగుల యెత్తుగల బుద్ధుని విగ్రహము ప్రతి

* Arch. Sur. S. Ind. Rept. 1919—20. pp. 34—38.

ష్ఠింపబడి యుండెను. ఈవిగ్రహము సున్నముతో తయారుచేయబడినది. ఇది 9 అడుగుల పొడవును, 6 అడుగుల వెడల్పును 1 అడుగు ఎత్తునుగల అరుగుమీద స్థాపింపబడెను. విగ్రహమునకును, వలయాకారముగ నున్న వెనుకగోడకును మధ్యగల భాగమును ఇటుకతో నింపివేసిరి.

శాలిహుండం గ్రామమునందు అనేక ప్రాచీనవస్తువులు చెదరి పడియున్నవి. వానిలో 12 బౌద్ధశిల్పములును, ఒక అరాధ్యచైత్యమును ముఖ్యములు. ఈశిల్పములన్నియు క్రీ. శ. 8, 9 శతాబ్దులనాటి మహాయాన శిల్పములు. వీనిలో కొన్నిటిపైన నాగరి లిపిలో శాసనము లున్నవి. మారీచీ, తారా, బుద్ధ, అవలోకితేశ్వర విగ్రహములు అందముగ నున్నవి.

రామతీర్థము* :— ఈగ్రామము విశాఖపట్టణం జిల్లాలో విజయనగరమునకు 8 మైళ్ళ దూరమునం దున్నది. గ్రామమునకుత్తరమున నిట్టనిలువుగ కొన్ని కొండ లున్నవి. అందొక దానికి గురుభక్తకొండ అని పేరు. ఈకొండ మీద 500 అడుగుల ఎత్తున ఒక సమతల మున్నది. దానిమీద నొక పెద్దబౌద్ధతీర్థము కలదు.

మహాచైత్యము :— పై సమతలమున పడమటికొనను ఈమహాచైత్యము కలదు. దీని వ్యాసము 42 అడుగులు, గోడమందము 3½ అడుగులు. దీనికి 13 అడుగుల దూరమున వలయాకారమగు గోడ కలదు. ఈరెంటికిని మధ్యగలది ప్రదక్షిణపథము. దీనివ్యాసము 84 అడుగులు. ఈచైత్యమునకు పశ్చిమదక్షిణముగ నొక చెరువుకలదు. ఉత్తరముగ 190 అడుగుల ఎత్తుగలదియు, దక్షిణముగ 120 అడుగుల ఎత్తుగలదియు రెండు గుట్టలు ఉన్నవి.

స్తూపము :— మహాచైత్యము ఎదుట నొక విశాలమగు ప్రదేశము కలదు. దీని దక్షిణభాగమున 12 అడుగుల వ్యాసముగల ఇటుకలతో కట్టబడిన స్తూపమున్నది.

చైత్యగృహము :— మహాచైత్యమునకును, పైస్తూపమునకును తూర్పుగ 20 అడుగుల ఎత్తుగల గుట్ట కలదు. దీని తూర్పువాలు ఒక సమమైన అరుగువలె చెక్కబడినది. ఈ అరుగుమీద ఇటుకలతో నొక చైత్యగృహము నిర్మింపబడినది. దీని పొడవు 40 అడుగులు, వెడల్పు 11 అడుగులు, గోడమందము 4/12 అడుగులు. చుట్టునున్న గోడలు వెలుపలికి వంగి యుండుటవలన దీనిపైన కోళ్ళగూడు వంటి కప్పు ఉండెడిదని ఊహింపనగుచున్నది. వెనుక గుర్రపులాడప్రవంపు మొదట లోభాగమున 2 అడుగుల 8 అంగుళముల మందముగల గోడ కలదు. దీనిమధ్య 3 అడుగుల 8 అంగుళముల వెడల్పుగల ద్వార మున్నది. ఈ గోడవెనుక ఒక శిలాచైత్య మున్నది. దీని వ్యాసము 5 అడుగులు, ఎత్తు 7 అడుగులు. ఇది నిరాడంబరముగ నున్నది. దీని అగ్రమున హర్మికలో రాతి అవశేషపేటిక ఉండెడిది. హర్మికపైన శిలాఛత్ర ముండెడిది. ఈఆలయములోపల ఉత్తరపుగోడనంటబడి 81/2 అడుగుల పొడవును, 31/2 అడుగుల వెడల్పును, 4 అడుగుల 9 అంగుళముల ఎత్తును గల అరుగు కలదు. దాని తూర్పుపడమర అంచులమూలలలో సింహస్తంభములున్నవి. దీని దిగువభాగమున మధ్యలో రెండు సింహము

* Arch. Sur Ind. Rept. 1910—11 pp. 78—88.

లున్నవి. ఈచైత్యగృహము ముందు 6 1/2 అడుగుల వెడల్పుగల మెట్లవరుస కలదు.

గదులవరుస :—చైత్యగృహమునకు ఉత్తరముగ నొకటియు, దక్షిణముగ నొకటియు రెండువరుసల గదు లున్నవి. ఈరెంటికి తూర్పున రెండు స్తూపము లున్నవి. దక్షిణదిశనున్న వరుసలో ఏడు గదులు కలవు. అందు ఒక్కొకదాని పొడవు 8 అడుగులు, వెడల్పు 6 1/2 అడుగులు. స్తూపముయొక్క వ్యాసము 14 అడుగులు. ఉత్తరదిశనున్న గదులు రెండు పంక్తులలో ఉన్నవి. వెలుపలి పంక్తిలో 10 గదులును, లోపలి పంక్తిలో 8 గదులును కలవు. ఈగదులు 7 అడుగుల చతురములు. ఈపంక్తులచివరగల ఇటుక స్తూపముయొక్క వ్యాసము 16 అడుగుల 8 అంగుళములు.

విహారము :— చైత్యగృహమునకు తూర్పుగ, 20 అడుగులు దిగువను ఒక సమతల మున్నది. దీనిలో వరుసలు వరుసలుగ విరిగిపోయిన స్తంభములు కలవు. ఈప్రదేశమున పొడవు 81 అడుగులు, వెడల్పు 66 అడుగులు. దీనికి ఒకవంక ఒకగుట్టయు, మూడు వైపుల ఇటుకగోడలును కలవు. వరుసకు ఆరు వంతున ఆరువరుసల స్తంభము లున్నవి. ఒక్కొకస్తంభము 11 అడుగుల పొడవు ఉన్నది. వీని అగ్రముల అడ్డకమ్ములను దూర్చుటకు వీలగునట్లు 10 అంగుళముల వెడల్పును 3 అంగుళముల లోతునుగల కంత లున్నవి. ఈవిహారమునందు అనేకచోట్ల చిన్న చిన్న ఆరాధ్యస్తూపముల ఆనవాళ్ళు కనిపించుచున్నవి.

రెండవ చైత్యగృహము :—ఇది విహారమునకు తూర్పున 5అడుగుల ఎత్తుగల దిమ్మమీద ఉన్నది. దీని పొడవు 217అడుగులు, వెడల్పు 11అడుగులు. దీనిగోడల మందము 2 1/2అడుగులు. దీనివలయములో 9అడుగుల వ్యాసముగల శిలాచైత్య మున్నది. మొదటి చైత్యగృహమువలెనే దీని ఉత్తరపు గోడలోభాగమునను 6అడుగుల పొడవును, 2అడుగుల వెడల్పునుగల దిమ్మ ఉన్నది. ఈఆలయము వెలుపల అభయముద్రాన్వితుడైన బుద్ధుని బొమ్మ కలదు. చైత్యము చుట్టును 10అడుగుల వెడల్పుగల ప్రదక్షిణ మార్గమున్నది.

మూడవ చైత్యగృహము :—ఇది పైకట్టడమునకు తూర్పుగ 20అడుగులదూరమునందున్నది. ఇందలి ఇటుక చైత్యము వ్యాసము 9అడుగుల 9అంగుళములు. దీని ప్రవేశద్వారము వెడల్పు 5అడుగులు. దీనికి సమీపమున గుండ్రని అరుగుమీద 6అడుగుల వ్యాసముగల ఇటుకస్తూప మున్నది.

నాల్గవ చైత్యగృహము :—దీని పొడవు 33 1/2అడుగులు, వెడల్పు 4 1/2అడుగులు, గోడల మందము 5అడుగులు. దీనిలోపల నొక శిలాచైత్య మున్నది. అందొక అవశేషపాత్ర దొరికినది.

ఐదవ చైత్యగృహము :—దీని పొడవు 30అడుగులు, వెడల్పు 13 1/2అడుగులు, గోడల మందము 3 1/2అడుగులు. ఇందలి చైత్యమునను ఒక అవశేషపాత్ర దొరికినది.

గదులవరుసలు :— ఈ ఐదవచైత్యగృహమునకుత్తరముగ ఒకవరుసలో 24గదు లున్నవి. ఒక్కొక్కదాని పొడవు 8అడుగులు, వెడల్పు 3 1/2అడుగులు. దీనిని ఆని 18 గదులుగల మఱియొకవరుస ఉన్నది. ఈవరుస

పడమటిచివర నొక ఇటుకతోకట్టబడిన స్తూప మున్నది.

మరియొక విహారము:—మహాచైత్యమున కుత్తరముగ నొక గుట్ట కలదు. ఈ గుట్ట దిగువ 175అడుగుల పొడవును 94అడుగుల వెడల్పును గల సమతల మున్నది. దీనిపడమట మరియొకగుట్ట కలదు. ఈగుట్టకు పడమట 22అడుగులదూరమున ఈ విహార మున్నది. దీని పొడవు 99అడుగులు, వెడల్పు 39 1/2అడుగులు, గోడల మందము 3 1/2 అడుగులు.

పైన వర్ణింపబడిన శిథిలములన్నియు గురుభక్తకొండపైన గలవు. ఈకొండకు పశ్చిమోత్తరముగ దుర్గకొండయను మరియొక కొండ కలదు. ఈకొండదిగువ దక్షిణభాగమున కొండలో నాలుగు పెద్దగుహలు వాటి యంతట నవియే ఏర్పడినవి కలవు. వీని ముందు 565 అడుగుల పొడవున ఒక దిమ్మ కలదు. దానిమీద భిక్షువులు నివసించెడి గదుల పునాదులు కలవు. ఈదుర్గకొండ శిఖరమున 30 అడుగుల వ్యాసముగల ఇటుకస్తూపమును, 60 అడుగుల పొడవును, 13 అడుగుల వెడల్పును గల ఒక చైత్యగృహమును కలవు.

ఈగురుభక్తకొండదుర్గకొండలమీద ఖననము జరిగినప్పుడు ఎన్నియో పురాతనవస్తువులు బయలుపడినవి. ఆంధ్రొకముద్రిక కలదు. దానిమీద "సిరి సివ (మక) విజయరజ (సె) ల సఘస" అను ప్రాకృత శాసన మున్నది. మరియొకముద్రికమీద "భోజస" అను శాసనము కలదు. గుర్రపుబొమ్మకల సీసపునాణె మొకటి దొరికినది. ఇవిగాక అవశేషపాత్రలు, పలువిధముల రంగులు, చిత్రములుగల కుండపెంకులు, మట్టితోను, దంతముతోను, రాతితోను చేయబడిన గృహోపకరణములును కూడ లభించినవి.

శంఖరం* :—ఈగ్రామము విశాఖపట్టణం జిల్లాలోని అనకాపల్లి రెలుస్టేషనుకు ఉత్తరముగ ఒకమైలుదూరమునం దున్నది. గ్రామమున కుత్తరమున రెండు కొండలు, ఒకదాని నొకటి అంటి తూర్పుపడమరలుగ ఉన్నవి. ఈరెండును కలసి 23 ఎకరముల భూమి నాక్రమించినవి. ఈగ్రామమునుయొక్క పూర్వనామము సంఘారామము అయి యుండును. ఇచటి కొండలమీంద గుహలును, పలువిధముల శిలాచైత్యములును, విహారములును, చైత్యగృహములును కలవు. ముఖ్యముగ నిచ్చట రాతిలోనే చెక్కబడిన చైత్యములు విస్మయజనకములుగ నున్నవి. ఈకొండలలో తూర్పున ఉండుదానికి బొజ్జన్న కొండ అనియు, పడమటనున్నదానికి లింగాలమెట్ట అనియు పేర్లు.

మహాచైత్యము :— బొజ్జన్నకొండమీంద క్రిందిభాగమున గుహలును శిలాచైత్యములు నున్నవి. దీని శిఖరమున మరికొన్ని కట్టడములున్నవి. ఈపర్వతాగ్రమంతయు సదును చేయబడినది. ఇది ఒక పెద్ద విశాలమైన రాతిచపటావలె కనిపించును. దీని పొడవు 115 అడుగులు, వెడల్పు 23 అడుగులు. ఇది కొండకు అడ్డముగ ఉత్తరదక్షిణములుగ వ్యాపించి యున్నది. దీనిమీద అనేకస్థలముల చిన్నవియు, పెద్దవియు 54 శిలాచైత్యము లున్నవి. ఇవి అన్నియు కొండరాతిలో చెక్కబడినవే. వీనిలో ఒక్కొకదాని వ్యాసము 2 అడుగులు. అన్నిటిలో పెద్దచైత్యముయొక్క వ్యాసము

* Arch. Sur. Ind. Rept. 1907—08 pp. 149—180.

10 1/2 అంగుళులు. ఈచపటాకు ఉత్తరమునను, దక్షిణముననను 12 అంగుళుల ఎత్తును, 4 అంగుళుల వెడల్పును గల రాతిస్తంభము లున్నవి. ఉత్తరపుచివర 7 అంగుళుల చతురము గల ఇటుక కట్టడ మున్నది. దాని నాలుగు మూలలను నాలుగు శిలాచైత్యము లున్నవి. చపటాతూర్పున ఉత్తరదక్షిణముగ 75 1/2 అంగుళుల పొడవును, 12 అంగుళుల ఎత్తును గల గోడ కొండలోనే దొలవబడినది. ఈగోడ ఉత్తరపు చివర 6 అంగుళుల వ్యాసముగల శిలాచైత్యము కలదు. దీనిపైన హర్మికయు, ఛత్రమునుకూడ ఉన్నవి. రాతిగోడలో మరియొక చైత్యము చెక్కబడినది.

ఈచపటాకు పడమట 76 1/2 అంగుళుల పొడవును, 70 1/2 అంగుళుల వెడల్పును 12 అంగుళుల ఎత్తును గల దిమ్మ కలదు. దీనిమీద ఒక మహాచైత్యము కొండరాతిలో దొలవబడి యున్నది. దీని వేదిక వ్యాసము 64 అంగుళుల 8 అంగుళములు. దీనిచుట్టును ఇటుకకట్టు కలదు. ఈవేదికమీద 60 అంగుళుల 8 అంగుళముల వ్యాసముగల అండము ఉన్నది. ఈ అండము మీద హర్మికయొక్క ఆనవాళ్ళు కలవు. దీనిపైన ఛత్రముకూడ నుండెయుండును. ఈచైత్యమున్న దిమ్మకు ప్రాగ్దక్షిణ దిశను 11 1/2 అంగుళులవెడల్పుగల మెట్ల వరుస కలదు. దీనికి ప్రాగుత్తరముగ ఇటుకతో కట్టబడిన చావడియు, దానివెనుక నొక చిన్న గదియు ఉన్నవి. మహాచైత్యమునకు పడమటను, దక్షిణమునను వరుసవరుసల శిలాచైత్యము లున్నవి. ఇందు రెండిటియందు చైత్యాకృతిగల అవశేషపాత్రలు దొరికినవి.

మరియొకస్తూపము :— మహాచైత్యమున్న దిమ్మకు తూర్పున నాలుగు శిలాచైత్యము లున్నవి. వీటి దిగువభాగమున ఇటుకకట్టుబడి ఉన్నది.

చైత్యగృహము :— పైన వర్ణింపబడిన కట్టడములన్నియు పర్వతాగ్రమునందలి పశ్చిమాగ్రమునం దున్నవి. వీనిలో మహాచైత్యము ప్రధానమైనది. తూర్పునగల సగమునందు ఈ చైత్యగృహము ముఖ్యము. ఈభాగము 154 అంగుళుల పొడవును, 73 అంగుళుల వెడల్పును కలిగియున్నది. ఇందు చైత్యగృహ మొకటి కలదు. దాని పొడవు 10 అంగుళులు, వెడల్పు 8 1/2 అంగుళులు, గోడల మందము 4 అంగుళులు. వెనుక వలయాకారముగనున్న భాగము లోపల చతురస్రముగు రాతితిన్నె కలదు. దాని మధ్య ఒక విగ్రహముండిన గొయ్యి కలదు.

విహారములు :— పైచైత్యగృహమునకు పడమట 44 1/2 అంగుళుల పొడవును, 30 అంగుళుల వెడల్పునుగల చావడి ఉన్నది. దీనికి ఉత్తరదక్షిణములను, పడమటను గదులవరుస లున్నవి. పడమటచివర 11 అంగుళుల వెడల్పుగల ద్వారమున్నది. దానికి రెండువైపులను 21 అంగుళుల పొడవును, 11 అంగుళుల వెడల్పును గల రెండు చైత్యగృహము లున్నవి. దీనికి క్రింద అంతరువులో మరియొక గదుల వరుస కలదు. వీని మధ్య 5 1/2 అంగుళుల వ్యాసమును, 5 అంగుళుల ఎత్తును గల శిలాచైత్య మున్నది. అగ్నే మహాచైత్యమునకు తూర్పుగ 9 గదులుగల వరుస ఒకటియు, దక్షిణమున 22 గదులుగల వరుస ఒకటియు ఉన్నవి. గుహలుగల కొండయొక్క దిగువ భాగమునకును, మహాచైత్యమున్న పర్వతాగ్రమునకును మధ్యగల కొండ అనేక అంతరువులుగ చెక్కబడినది. వీనిమీద మహాచైత్య

మునకు అన్నివైపులను చిన్నచిన్న గదుల వరుస లున్నవి. మధ్యమధ్య వీనికెదురుగ శిలాచైత్యములును, ఇటుకతో కట్టబడిన చైత్యములు నున్నవి.

బొజ్జన్నకొండకు ఎదురుగనున్న లింగాల మెట్టకూడ మిక్కిలి ముఖ్యమైనది. దీని తూర్పువాలు బొజ్జన్నకొండను కలిసియున్నది. ఈవాలుమీద రెండువరుసలలో అనేక శిలాచైత్యములు కొండరాతిలో దొలచబడినవి. అట్లే పర్వతాగ్రమునందలి తూర్పు భాగమునకూడ ఇట్టి శిలాచైత్యములు కొన్ని వందలు నిర్మింపబడినవి. ఆమీద కొంత మార్గము పర్వతశిఖరమున్నది. దానికి పడమట తిరిగి కొంతసమతలము కలదు. ఇచ్చట మరల శిలాచైత్యములు కలవు. ముందుగ 3-4 అడుగుల వ్యాసముగల చిన్న చైత్యములు రెండువరుసలలో ఉన్నవి. వీని పై భాగమున ఒకదాని ప్రక్కనొకటిగనున్న 6వరుసలలో 200చైత్యము లున్నవి. వీనికి దక్షిణముగ మరికొన్నివందల చైత్యములు వీలగు స్థలములందెల్ల నిర్మింపబడినవి.

మూడు చైత్యములు :—ఈచైత్యములకు పడమట కొండ నిట్టనిలువుగ కోసివేయబడినది. ఈవిధముగ నేర్పడిన భాగమునకు తూర్పుగ కొండ కలదు. దీనిలో ఒక గుహ దొలచబడినది. దీని ముఖమునుండి 9 1/2 అడుగుల వెడల్పును, 18అడుగుల ఎత్తునుగల దారి కలదు. ఈదారికి పడమట 55అడుగుల చతురముగల ప్రదేశమున కొండరాయి ఒక పెద్ద చైత్యమువలె చెక్కబడినది. దీనికి పడమట మరియొక బండరాయివంటి భాగమున్నది. దానికి పడమట 5అడుగుల వెడల్పుగల ప్రదక్షిణమార్గమునకు తూర్పున కొండరాతిలో ఒక గుహ దొలువబడినది. గుహకెదురుగను, మార్గమునకు పడమటను మరియొక పెద్దచైత్యము నిర్మింపబడినది. దీని వేదిక వ్యాసము 38 1/2అడుగులు. నేల మట్టమునుండి దీనిపైనగల అండమునకు అగ్రమునకుగల ఎత్తు 26అడుగులు. ఈచైత్యమునకు పడమట మరియొక చైత్యము చెక్కబడినది, దీని వేదికవ్యాసము 26అడుగులు, ఎత్తు 7అడుగులు. ఈవేదికమీదగల అండము యొక్క వ్యాసము 20అడుగులు, ఎత్తు 11 అడుగులు.

ఇట్లు ఈలింగాలమెట్ట పై భాగమంతయు మూడు పెద్దచైత్యములుగను, కొన్నివందల చిన్నచైత్యములుగను చెక్కబడినది. ఈశంఖరం బౌద్ధశిథిలముల పరిశోధన జరిగినప్పుడు అనేక ప్రాచీనవస్తువులు దొరికినవి. వీనిలో బంగారు, రాగి, సీసపునాణెములును, ముద్రికలును ముఖ్యములు. బంగారునాణెము క్రీ. శ. 4వశతాబ్దినాటి గుప్తసామ్రాట్టగు సముద్రగుప్తునిది. రాగినాణెములలో నొకటి వేంగిచాళుక్యరాజగు కుబ్జవిష్ణువర్ధనునిది. సీసపు నాణెములు గుర్రపుముద్రగల సాతవాహన నాణెములు. ముద్రికలలో కొన్ని ముక్కోణములు, కొన్ని చతురములు, మరికొన్ని కోడిగుడ్డు ఆకారము కలవి. ఇందు కొన్నిటిమీద చైత్యము చెక్కబడి యున్నది. కొన్నిటిమీద క్రీ. శ. 5, 6, 7శతాబ్దులనాటి లిపిలో వ్రాత లున్నవి. ఇవిగాక 185మట్టితో చేయబడిన ముద్రికలు లభించినవి. ఇందు కొన్ని పైముద్రికల అచ్చులు. వీనిపై అక్షరములును కలవు. ఇవిగాక ఇనుప పనిముట్లు, కంచు దీపపు సెమ్మాలు, మట్టిసెమ్మాలు, పూసలు, శంఖ వలయములు మట్టితో చేసిన ఆభరణములు,

కడుముళ్ళు, మనుష్యులయొక్కయు జంతువుల యొక్కయు బొమ్మలు, స్ఫటికములు, కుండలు, భిక్షాపాత్రములు, చైత్యఛత్రములు, చైత్యములు, స్తంభములు, అవశేషపాత్రలు, 4 1/2అంగుళముల ఎత్తు, 3 1/2అంగుళముల వెడల్పు గల బుద్ధవిగ్రహము మున్నగునవి ఎన్నియోకూడ దొరికినవి.

గుంటుపల్లి * :—ఈగ్రామమువద్ద కొండలో దొలవబడిన ప్రాచీన చైత్యగృహమును, విహారములును ఇదివరలో వర్ణింపబడినవి. ఇవిగాక వీటిసమీపమున కొన్ని ఇటుకకట్టడములును కలవు. ఇవిఅన్నియు ఇచట బౌద్ధతీర్థమునకు సంబంధించినవే.

ఇటుకస్తూపములు :—చైత్యగృహమునకు ముందు ఒక ఎత్తైన దిమ్మ కలదు. దీనిప్రక్కపైనున్న విహారగుహకు పోవు దారి కలదు. ఈదారికి సమీపమున కొండచాలుమీద అనేకస్తూపముల పునాదులు కనిపించుచున్నవి. వీనిపై భాగములు పోయినవి. ఈపునాదులైనను అక్కడక్కడ పోయినవి. ఇవి మిక్కిలి చిన్నవి. అందువలన ఇవి ఆరాధ్యస్తూపములని ఊహింపవచ్చును.

చైత్యగృహము :—ఇది పైస్తూపములకు పడమటగ ఉన్నది. ఈచైత్యాలయమునకు పడమట పెద్దపెద్ద బండ లున్నవి. తూర్పున ఒక మంటప మున్నది. ఈఆలయము గుర్రపులాడమువలె ఉన్నది. దీని పొడవు 54అడుగులు, వెడల్పు 14 1/2అడుగులు, గోడల మందము 4అడుగులు. దీని పునాదులు మిక్కిలి బలిష్టములుగ నుండుటనుబట్టి దీనిమీద కొళ్ళగూడువంటి కప్పు ఉండెనని ఊహింపవచ్చును. దీని వలయము చివర అర్ధముగ నొక ద్వారముగల గోడకలదు. ఈ గోడలోభాగమున చుట్టును గోడలవెంబడి అరుగు గలదు. ఇది ప్రదక్షిణపథము. మధ్య ఎత్తైన ఇటుకదిమ్మ కలదు. దీని ఎదుటిగోడలో మూడు గూళ్ళు ఉన్నవి. ఈదిమ్మమీద బుద్ధవిగ్రహ ముండెడిది. ఆలయద్వారముమీద చైత్యవాతాయన ముండెను. ఈవిగ్రహము అమరావతీమహాచైత్యమునందలి మూడవదశ శిల్పములలోని బుద్ధవిగ్రహమువలె ఉన్నది. దీనినిబట్టి ఈచైత్యాలయము క్రీ. శ. 1వ శతాబ్ది మధ్యభాగమున నిర్మింపబడెనని ఊహింపవచ్చును.

మంటపము :—ఇది చైత్యగృహమునకు తూర్పుగ ఉన్నది. దీని పొడవు 56అడుగులు, వెడల్పు 34అడుగులు. దీనిఉత్తరదక్షిణముల 15అడుగుల ఎత్తుగల రాతిగోడ లున్నవి. తూర్పుపడమరల ద్వారము లున్నవి. లోపల నాలుగేసి స్తంభములుకల ఆరువరుస లున్నవి. ఇది ఒక సమావేశభవనము కావచ్చును.

అనేకస్తూపములు :— పై మంటపమునకు సమీపమున ఒకచోట అనేకస్తూపముల సముదాయము కలదు. ఇవి అనేకపరిమాణములు కలవి, అనేకవిధములైనవి. ఇచట గాంచనగు వైవిధ్యము మరియెచ్చటను కానరాదు. వీనిలో చాలభాగము అంత ఎత్తులేని గుండ్రని దిమ్మలమీద నిర్మింపబడినవి. కొన్నిటికి ఇట్టి దిమ్మలు లేక పై అండముమాత్రము కలదు. ఇందొకదానిలో ఒక అవశేషపాత్రి దొరకినది. దీనినిబట్టి ఇవి అన్నియు భిక్షువుల సమాధులని తోచుచున్నది. ఇట్టివి ౫౫ స్తూపములు 600 అడుగుల పొడవును 150 అడుగుల వెడల్పునుగల ప్రదేశమునం దున్నవి.

* Arch. Sur. Southern Circle Rept. 1916—17 pp. 30—36.

వీనియన్నిటిలోను పెద్దదగు స్తూపముయొక్క వేదికకుగల మెట్లమీద క్రీ. శ. 2వశతాబ్దపు అక్షరములలో సుయజ్ఞనాథుని శిష్యురాలగు సానాదా అనునామె ఆమెట్లను కట్టించెనని తెల్పు శాసనము కలదు.

శిలాచైత్యము :— ఇది ఒక రాతి అరుగు మీాద ఉన్నది. దీనివేదిక వ్యాసము 18½అడుగులు, ఎత్తు 5 అడుగులు. పైఅంచపు వ్యాసము 16 అడుగులు, ఎత్తు 8 1/2 అడుగులు. పైన హర్మికయు, ఛత్రవలను కలవు. చైత్యము వెలుపల నంతయు చిన్నచిన్నరాళ్లు ఒకదానిలోఒకటి పేర్చి అతికినారు. దీనిలో ఒక అవశేషపాత్ర లభించినది. ఇందు ఒకరాగి పాత్ర, స్ఫటికపూస, బంగారుభిక్షాపాత్ర, రెండుబంగారుపూసలు కలవు. ఈచైత్యము అన్నివిధములను క్రీ. పూ. 2వశతాబ్దినాటి భీల్సాచైత్యములను పోలియున్నది.

గుడివాడ* —ఇది కృష్ణాజిల్లాలో సుప్రసిద్ధమైన గ్రామము. బందరుబెజవాడరైలు మార్గమునం దున్నది. ఇచట నొక దిబ్బలో బౌద్ధస్తూపమొకటి బయల్పడినది. ఈప్రదేశము 140 అడుగుల చతురము. అమరావతీ స్తూపమువలెనే దీనినికూడ జనులు ధనము దొరకునను ఆశతో త్రవ్వి ధ్వంసము చేసిరి. ఆమీాద నొక రోడ్డును వేయుటకు దీనిలోని ఇటుకలు కొన్ని తీసికొనిపోబడినవి. 1870కి పూర్వమే ఇందొక అవశేషపాత్ర లభించెనట. తర్వాత దీనిని సూఎల్ త్రవ్వి పరిశోధించెను. ఆసమయమునం దిచ్చట నాలుగుమూలలను నాలుగు రాతిపెట్టెలు దొరకినవి. వానిలో అవశేషపాత్రి లుండెను. చైత్యము లోపలి భాగమంతయు మట్టితో గట్టిచేయబడెను. దీని చుట్టును ప్రాకారముండినట్లు లేదు. ఇది అనేకవిధముల భట్టిప్రోలుస్తూపమును పోలి యున్నది.

ఈగ్రామపు పడమటి పొలిమేరలో లాలపాడు దిబ్బ అను దిబ్బ కలదు. ఈప్రాంతమొక కోటవలె కనిపించును. ఇచట భూమిని త్రవ్వగా అనేకప్రాచీనవస్తువులు దొరకినవి. వీనిలో యజ్ఞశ్రీ, చంద్రశ్రీలసీసపునాణెములును, ఓడముద్రగల పులోమావి నాణెమును ముఖ్యములు.

భట్టిప్రోలు♦ :— ఇది గుంటూరుజిల్లా రేపల్లెతాలూకాలోని గ్రామము. తెనాలి రేపల్లె రైలుమార్గమునం దున్నది. ఇచటికి కృష్ణానది నాలుగుమైళ్ళదూరమునం దున్నది. ఇచటి ఒక దిబ్బలో అతిప్రాచీనమైన బౌద్ధస్తూప మొకటి అణగి యుండెడిది. ఇచటి చలువరాతిపలకలమీాద చెక్కబడిన ప్రాకృత శాసనముల అక్షరస్వభావమునుబట్టి యీ స్తూపము క్రీ. పూ. 3వశతాబ్దినాటికి ఉండినట్లు తెలియనగుచున్నది. ఈస్తూపమును కూడ మొదట స్థానికులగు ప్రజలు కనిపెట్టి, చలువరాతిపలకలను కృష్ణ కాలువ మీాది తూమును కట్టుటకును, ఇటుకలను రోడ్డు వేయుటకును దుర్వినియోగము చేసిరి.

ఇచటి దిబ్బ అంతయు ఇటుకలకట్టడముతో నిండియుండెను. ఈఇటుకల పొడవు 2 అడుగులు, వెడల్పు 1 1/2 అడుగులు. స్తూపము యొక్క ఆవరణ వైశాల్యము 1700 చదరపు గజములు. దీనిమధ్య చుట్టును ఎనిమిది ఇటుకలుగల రంధ్రము ఆమూలాగ్రము ఉన్నది. చైత్యపు ఎత్తు 66అడుగులు, వ్యాసము 148 అడుగులు. దీనిచుట్టును ఉండిన ప్రాకారము

* Rea — South Indian Buddhist Antiquities.

♦ I bid.

యొక్క వ్యాసము 148అడుగులు. ఈప్రాకారము చలవరాతిపలకలతో నిర్మింపబడెను. దీని ఎత్తు 4అడుగులు. స్తూపము మధ్య ఒక ఎత్తైన చలవరాతి స్తంభ ముండెను. దీని అగ్రమున ఛత్రముయొక్క కామ తగల్చబడెను. ఈస్తూపము మధ్యగల రంధ్రమునను, ఇతర స్థలములను ఖననము చేయగా 5అవశేష పాత్రలు దొరకినవి.

ఘంటశాల• :—ఈగ్రామము కృష్ణాజిల్లాలో చల్లపల్లిజమీందారీలో బందరుకు 13మైళ్ళ దూరమునం దున్నది. గ్రామమునకు ప్రాగుత్తరముగ ఒక పొలములో "లంజదిబ్బ" అను దిబ్బకలదు. దానియందు ఒకస్తూపము బయల్పడినది. దాని వ్యాసము 112అడుగులు, ఎత్తు 23అడుగులు. ఈస్తూపముయొక్క నిర్మాణ విధానము విలక్షణమైనది. దీనిమధ్య 10అడుగుల చతురముగల ఇటుక స్తంభ మున్నది. దీని చుట్టును 19అడుగుల చతురమును, 3అడుగుల మందమునుగల గోడలుగల మరియొక దిమ్మ కలదు. ఈరెండుదిమ్మలను కలుపుచు నిలువుగ నొకటియు, అడ్డముగ నొకటియు రెండు గోడలు కలవు. మిగిలినభాగమంతయు ఖాళీగనే ఉన్నది. ఈరెండవ దిమ్మకు వెలుపల 56 అడుగుల వ్యాసమును, 3 1/2అడుగుల మందమునుగల వలయాకారమగు గోడ కలదు. పై అడ్డనిలువుగోడలు దీనిలోపలిఅంచును తాకుచున్నవి. ఇచటికి 11 1/2అడుగుల దూరమున 18అడుగుల మందముగల మరియొక ఇటుకవలయ మున్నది. దీని వెలుపలిభాగము సున్నము చేయబడినది. లోపలివలయమునకును, ఈవెలుపలివలయమునకును మధ్యనున్న భాగమున ఆకులవంటి 16గోడలు కలవు. ఇట్లు 32గదులేర్పడినవి. వెలుపలిగోడను తగులుచు నేలమట్టమునుండి 4 1/2అడుగుల ఎత్తున 5 1/2అడుగుల వెడల్పుగల తిన్నె ఉన్నది. ఇది ప్రదక్షిణమార్గముగ నుపయోగపడి యుండవచ్చును. దీనికి నాలుగు దిక్కులను ముందుకు వచ్చు వేదిక లున్నవి. ఇవి ఆయకస్తంభవేదికలుకావలెను. స్తూపముమధ్య 9అంగుళముల చతురమగు రంధ్ర ముండెను, దీనిలో ఒక కుండ దొరికినది. ఆకుండలో ఒక సీసపునాణెము, ఒకస్ఫటికము, మూడు పూసలు కలవు. దీనిక్రింద మరియొక కుండలో 2ఎముకముక్కలు, ఒక తెల్లపూస, ఆరు ముత్యములు. 2బంగారపు పువ్వులు దొరికినవి.

ఈచైత్యమున కొన్ని శిల్పములుగల చలవరాతిపలకలు దొరికినవి. అందొకదానిమీద బుద్ధపాదములు చెక్కబడి యున్నవి. రెండవది చైత్యవేదికయొక్క ఉష్ణీషములోని భాగము. దానిపైన సింహాసనముమీద నొక ధర్మచక్రమును, దానిచుట్టును పుష్పదామమును కలవు. మూడవదానిమీద ఒక వేదికమీద నొక కలశమును, దానినుండి పైకివచ్చు తామర తీగయు మిక్కిలి మనోహరముగ చెక్కబడినవి. ఇదే శిల్పము సాంచీద్వారములలో ఒకదాని స్తంభముమీద కలదు. నాల్గవది పలకలుగల స్తంభము. దీనిమీద అడుగున నొక సింహాసన మున్నది. అందు రెండు తామర పువ్వులు కలవు. ప్రక్కలకు రెండు తామర తీగలున్నవి. సింహాసనము వెనుక నొక ధర్మచక్రస్తంభ మున్నది. ఐదవది అర్ధకమలములు గల స్తంభము. ఆరవది గుండ్రని చలవరాతి ఆమలకము. దీనిమీద పుష్పములయొక్కయు, జంతువులయొక్కయు వరుసలు చెక్కబడి

---

• I bid.

యున్నవి. ఆరవది శిలాఛత్రము. దీనిమధ్య నొక పెద్దరంధ్రమును, వలయపు అంచుమీద ఎనిమిది చిన్నరంధ్రములును కలవు. ఏడవ దానిమీద నొక దృశ్యము చెక్కబడినది. ఇది బుద్ధుని జననఘట్టము. ఎనిమిదవది చైత్యఫలకము. తొమ్మిదవదానిమీద మారగర్భభంగ ఘట్టము చెక్కబడినది.

జగ్గయ్యపేట* :— అమరావతికి 20 మైళ్లు ఎగువను పాలేరునది కృష్ణలో కలియుచోటికి 4 మైళ్ళలో ఉత్తరముగ బేతవోలను గ్రామమున్నది. దీనికే జగ్గయ్యపేట అని నామాంతరము. గ్రామమునకు తూర్పున ఒక మైలు దూరమున ధనబోడు అను కొండ కలదు. దాని పశ్చిమదక్షిణభాగమున పెక్కు దిబ్బలు కలవు. వీనిని గ్రామస్థులు పదేపదే త్రవ్వుచుండిరి. 1881లో ఒక దిబ్బలో నొక ఇటుక స్తూపమును, కొన్ని చలవరాతి పలకలును బయటపడినవి. 1889లో బర్జెసు ఈకొండను పరిశీలించి పెక్కు బౌద్ధశిథిలములను గుర్తించెను. ఇందొకదిబ్బలో 31 1/2 అడుగుల వ్యాసముగల స్తూపముయొక్క దిగువభాగము దొరికినది. దీనిచుట్టును 10 1/2 అడుగుల వెడల్పుగల ప్రదక్షిణపథ మున్నది. స్తూపముచుట్టును శిల్పములుగల చలవరాతిపలకలు మలచబడినవి. ఒక్కొక్కపలక ఎత్తు 3 అడుగుల 9 అంగుళములు. దీనికి ప్రాగ్దక్షిణముగ 170 అడుగుల పొడవును 120 అడుగుల వెడల్పునుగల ప్రదేశ మున్నది. దీనిలో వరుసలు తీరి స్తంభము లున్నవి. ఇది యొక సమావేశభవనమై యుండును. ఇచటి పలకలలో కొన్నిటిమీద క్రీ. పూ. 2వశతాబ్ది బ్రాహ్మీలిపిలో కొన్ని శాసనములు కలవు. ఒక స్తంభము మీద ఇక్ష్వాకుశాసన మున్నది. స్తూపమునకు నాలుగువైపులను ఆయకస్తంభవేదిక లున్నవి. ఇచట దొరికిన శిల్పఫలకములలో మూడు ముఖ్యమైనవి. అందు ఒకదానిమీద ఒకపుణ్యశాల చెక్కబడినది. కట్టడము దిగువ స్తూపప్రాకారమువలె చెక్కబడిన అరుగు కలదు. దీనిమధ్య మెట్లున్నవి. రెండు చివరలను రెండు స్తంభము లున్నవి. వీని వెనుక గోడ కలదు. దానిమధ్య ద్వారమున్నది. దాని కిటుపటు పూజాద్రవ్యములను పట్టుకొని నిలచిన స్త్రీ బొమ్మలు కలవు. ద్వారములోభాగమున మధ్య బుద్ధపాదము లున్నవి. వానిపైన ఒక సింహాసనమును, ఛత్రమును కలవు. స్తంభములమీద కొంతభాగము ప్రాకారమువలె శిల్పింపబడినవి. ఆమీద రెండవఅంతస్థు కలదు. దీని ద్వారమున కిటుపటు చైత్యవాతాయనము లున్నవి. ముందున్న పిట్టగోడమీద ఏడు స్తంభము లున్నవి. వీనిపైభాగమున మరల వాతాయనములు కలవు. అగ్రమున కలశము లున్నవి. ఈకట్టడమునకు ఎడమవైపు ఒక పురుషుడు అంజలిపట్టి నిలచియున్నాడు. వెనుకభాగమున ఉద్యానవన మున్నది. ఈస్త్రీపురుషుల బొమ్మలు అజంతాలోని ౧౦వగుహలోని స్త్రీపురుషుల చిత్రములను పోలియున్నవి. ఈపుణ్యశాల మహాబలిపురమునందలి కొన్ని రథములను స్ఫురణకు తెచ్చుచున్నది. రెండవశిల్పమున రాజోచిత వేషభూషలుగల పురుషుడొకడు కలడు. అతని కుడిచేత లీలారవిందము కలదు. పైన ధర్మచక్రస్తంభ మున్నది. మరియొకస్తంభము మీద డమర మున్నది. ఇంకను పైని పెక్కు సంచులనుండి నాణెములు క్రిందకు పడు

* Burgess — Budhist Stupas of Amaravati ane Jaggayyapeta.

చున్నవి. పురుషుని ముందు ఒక స్త్రీ నిలచి యున్నది. ఆమె కుడిచేత లీలారవింద మున్నది. దిగువ నొక బాలుడు నతని వెనుక ప్రాంజలి యగు పురుషుడు నున్నారు. ఆమీద నొక ఏనుగును, గుర్రమును కలవు. మూడవపలకి మీద నొక చైత్య మున్నది. దాని అంచము మీద పుష్పదామ మున్నది. దిగువ నొక పురుషుడు నొక స్త్రీయు న మ స్క రిం చు చున్నారు.

చేజెర్ల*:— ఈ గ్రామము గుంటూరు జిల్లా నర్సరావుపేట తాలూకాయం దున్నది. ఇచటి కపోతేశ్వరాలయము సుప్రసిద్ధమైనది. ఇది మొదట నొక చైత్యగృహము. బౌద్ధ మతము క్షీణించిన పిమ్మట నిది శివాలయముగ మార్చబడినది. మనదేశమున బౌద్ధయుగము నకు సంబంధించిన చైత్యగృహము లనేకములు దొరికినవి. అందు కొన్ని పర్వతములలో దొలచబడినవి. తక్కినవి సమతలమున, ఇటు కతో కట్టబడినవి. ఈరెండవతిరగతికి చెందిన కట్టడములలో సంపూర్ణముగ నున్నది ఒక టియు దొరకలేదు. శిథిలముకాగా నిలచి యున్న భాగమునుబట్టి కట్టడముయొక్క లక్ష ణము నూహింపవలసినదే. రెండు చోట్ల మాత్రము ఇట్టి సంపూర్ణవాస్తువులు కలవు. అందొకటి టేర్ అనుచోట కలదు. రెండవది ఈచేజెర్ల శివాలయము.

ఈఆలయము పొడవుగనుండి దీనివెనుక భాగము గుర్రపుగొలుసువలె వంపు తిరిగి యున్నది. ఇది పెద్దపెద్ద ఇటుకలతో కట్టబడి నది. గోడలమందము 4 అడుగులు. ఆలయము లోపలి పొడవు 22 అడుగుల 10 అంగుళ ములు, వెడల్పు 8 అడుగుల 9 అంగుళములు. పైకప్పువరకునుగల ఎత్తు 22 అడుగులు. నేల మట్టమునుండి 7 1/2 అడుగులఎత్తున ఒక దొంగకప్పు కలదు. లోపల అటు ఐదుగును, ఇటు ఐదును స్తంభము లున్నవి. ఆలయ ద్వారముమీద చైత్యవాతాయన మున్నది. పైకప్పు కోళ్ళగూడువలె ఉన్నది. ఇది నాసిక అజంతాలలో కొండలలో దొలచబడిన చైత్యగృహములవలె ఉండి గుంటుపల్లిచైత్యా లయమును పోలియున్నది.

బుద్ధాం†:— బుద్ధాంగ్రామము గుం టూరుజిల్లా బాపట్లతాలూకాలో బాపట్లకు ఏడుమైళ్ళదూరమునం దున్నది. ఇది క్షత్రియ గ్రామము. ఆదిలో ఇది ఒక విశాలమైన మైదానము. దీనియందంతటను పెద్దపెద్ద దిబ్బ లుండెడివట. ఒక చింతచెట్టుక్రింద నొక పెద్ద బుద్ధవిగ్రహ ముండెడిదట. ఈగ్రామమునకు మొదట బుద్ధగ్రామమని పేరుండి అది క్రమ క్రమముగ బుద్ధగామము, బుద్ధగాం, బుద్ధాం గమారియుండును. ఈగ్రామము మొత్తము మీద బౌద్ధశిథిలములులేని ఇల్లు ఒక్కటి యైనను లేదు.

గ్రామము రోడ్డుకు ఎడమవైపున ఉన్నది. రోడ్డుమళ్ళుటతోడనే ఒకదిబ్బయు, దాని మీద నొక సత్రమును కనిపించును. మొదట నీదిబ్బ మిక్కిలి యెత్తుగనుండి దీనిపైన ఒక చింతచెట్టుక్రింద బుద్ధవిగ్రహ ముండెడిదట. సత్రము కట్టునప్పుడు దిబ్బను కొంతవరకును త్రవ్వినారట. గ్రామస్థులు బుద్ధవిగ్రహమును

* ASSI. Rept. 1917—18

† Jour. Audhr. Hist & culture. vol. III లోని Antiquities of Buddham అను నా వ్యాసము.

పగులగొట్టి ముగ్గు చేసుకొనిరట. ఇప్పుడైనను ఈదిబ్బను పరిశీలించినచో దీనియందొక చైత్యము పూడియున్నదని తోచకమానదు.

ఈసత్రము వెనుక చతురస్రమైన మరియొక దిబ్బ ఉన్నది. వీనిమీద పశువులపాక నిర్మించబడినది. ఈపాకను రాటలపై నిర్మించినారు. ప్రతిరాట అడుగునను చక్కని జంతుశిల్పములును, అర్ధకమలమునుగల చలవరాతిపలక ముక్క లున్నవి. ఇవి అమరావతీ మహాచైత్య ప్రాకారమునందలి నిలువుకమ్ములవలె నున్నవి. ఇందొక ముక్కమీద నొక చైత్యమును, మరియొక దానిమీద పూర్ణకలశమును చెక్కబడియున్నవి. మూడవదానిమీద అర్ధకమలమును దానిలో మనుష్యులును సింహములును కలవు. ఈపాకను వేయునప్పుడచట త్రవ్వగా పెద్దపెద్ద చలవరాతిస్తంభములు చతురస్రపు ఆకారమున పాతబడినవి దొరికినవట. అందు కొన్ని చుట్టుపట్ల ఇండ్లదొడ్లలో ఉన్నవి. ఈస్తంభముల అగ్రమున అడ్డుకమ్ములను అమర్చుటకు అనువైన తొర్ర లున్నవి. ఇవి నాగార్జునకొండలో విహారములయందు ఉపయోగింపబడిన స్తంభములను పోలియున్నవి. ఈస్థలమున పూర్వము ఒక విహారముండెడిదని తోచుచున్నది.

ఒక యింటిలో 4 అడుగుల పొడుగును 3౦ అడుగుల వెడల్పును కలిగి అంచులమీద మనోహరమైన రేఖాశిల్పముకలిగి, మధ్యలో కొందరుమనుష్యుల బొమ్మలు కల చలవరాతి పలక ఒకటి ద్వారముక్రింద బిగింపబడియున్నది. ఈమనుష్యులబొమ్మలు పలకపై భాగమున అటునిటు నున్నవి. ఈపలక అమరావతీ నాగార్జునకొండలలో దొరికిన స్తూపవేదికకు మలచబడెడి చైత్యఫలకములను పోలియున్నది.

ఇంకొకయింటిదొడ్డిలో ఆరుపలకలుగ నుండి అగ్రమున వంపును, మూలమున నేదియో శిల్పమునుగల వెడలుపైనభాగమును కల స్తంభములు రెండు గడ్డిమేటిలో నున్నవి. ఇవి నాగార్జునకొండలోని ఆయకస్తంభములను పోలియున్నవి. ఇంకొకచోట నేలమట్టముగ నున్న ఒకభావిపైని నలుపలకల చలవరాతిస్తంభ మొకటి అడ్డముగ వేయబడినది. స్త్రీలు దీనిమీద నిలచి నీళ్ళు తోడుకొనుచున్నారు. ఈస్తంభముమీద అడుగునను అగ్రమునను పూర్ణకమలములును అర్ధకమలములును మనోహరముగ చెక్కబడియున్నవి. ఇదికూడ నొక మంటపస్తంభమై యుండును. మరియొక దొడ్డిలో 7 అడుగుల యెత్తుగల చలవరాతి స్తంభ మున్నది. దీని అడుగున సింహములు పరుగెత్తుచున్నట్లు చెక్కబడినవి. మరియొక ముఖమున ఏనుగు లున్నవి. అగ్రమున తొర్రి ఉన్నది.

ఈబుద్ధాంగ్రామమునందు పళ్ళాలమ్మభావి యను నొక భావి యున్నది. దీని చపటా అనేకరకముల వంకరలు గల లేతనలుపురంగు చలవరాతిపలకలతో కట్టబడినది. ఇందు కొన్నిటిని బయటికి తీసి వాటి వంపులను అనుసరించి, కూర్చగ చక్కని వలయమేర్పడినది. మరికొన్నిటిని నిలువబెట్టగ ఒకచైత్యము యొక్క వెలుపలిభాగ మేర్పడినది. దీనినిబట్టి ఈముక్కలన్నియు నొక చిన్న చైత్యములోనివని నిశ్చయింపనగుచున్నది. మహాచైత్యము లున్నచోట్ల, విహారములును, వానిని చేరి ప్రార్థనకుపయోగించెడి చిన్న చైత్యములుగల గుర్రపులాడపుఆకారముగల చైత్యగృహములు నుండెడివి. నాగార్జునకొండలో ఇట్టి చైత్యగృహము లున్నవి. వీనిలోని చైత్య

ములు లేతనల్లరంగురాళ్ళతోనే నిర్మింపబడినవి. అందువలన బుద్ధాంలోకూడ నిట్టి చైత్యగృహ మొకటి యుండెడిదని స్పష్టమగుచున్నది.

గ్రామమునకు పడమటగ గ్రామదేవత గుడి యొకటి ఉన్నది. దీనికెదురుగ నొక చలవరాతిబండ పాతబడి యున్నది. దీనిమీద నొక పూర్ణకమలము చెక్కబడి యున్నది. దీనివెనుకభాగము వంపుగ నున్నది. నాగార్జునకొండలో దొరికిన చైత్యవేదికాఫలకము లిట్లే వంపుతిరిగియున్నవి. అందువలన నీఫలకము చైత్యవేదికలో నుండినదని ఊహింపవచ్చును. గుడి దక్షిణపుగోడను జాగ్రత్తగ పరిశీలింపగా అందొక చలవరాతిఫలక కనపడినది. దానిపైన బొమ్మలున్నట్లు తోచి దట్టముగనున్న సున్నమును కడిగించగా మనోహర శిల్పము బయటపడినది. అది సిద్ధార్థుని నగరగమనము. ఇందు రాజపుత్రుడు గుఱ్ఱముపై ఆసీనుడై యున్నాడు. పైన ఛత్రకేతనము లున్నవి. చుట్టును దేవగణము లున్నారు. ఈ ఫలక సన్నముగ నున్నది. బహుశః ఇది వేదిక ఉష్ణీషములోనిభాగము కావచ్చును.

రామిరెడ్డిపల్లి* :—ఈగ్రామము కృష్ణాజిల్లా నందిగామగ్రామమునకు ఆరుమైళ్ళదూరమునందున్నది. దీనికి రెండుమైళ్ళలో గుమ్మడిదుర్రుగ్రామము కలదు. ప్రభుత్వమువారి లెక్కలలో ఇచటి స్తూపము బయల్వెడలిన ప్రదేశము గుమ్మడిదుర్రుకు చెందినదిగ నున్నది. బెజవాడహైదరాబాదురైలుమార్గమునందున్న మధిరస్టేషనుకు ఈస్థలము ఆరుమైళ్ళదూరమునందున్నది. 1924లో మొట్టమొదట నిచట ఒక కొండమీదనున్న చైత్యమును, దానిచుట్టును కొన్ని చైత్యఫలకములును, బ్రాహ్మీ అక్షరములుగల కొన్ని చలవరాతిముక్కలును, బుద్ధుని తల ఒకటియు కనుగొనబడినవి. 1927లో ఆర్షశాఖవారు ఇచ్చట ఖననము చేసిరి. దానికి ఫలితముగ నిచట 34 శిల్పములును, రెండు ప్రాకృతశాసనములును, ఒక వేంగీలిపిలోని సంస్కృతశాసనమును, సాతవాహనరాజుల సీసపునాణెములు కొన్నియు, ఒక వెండిపాత్రయు, బంగారు కంఠాభరణమును దొరికినవి. ఇచట లభించిన ప్రాకృతశాసనములలో నొకదానినుండి యిచటిది ఒక మహాచైత్యమనియు, దీనిని దక్షిణాపథనివాసి యెవడో కట్టించెననియు, దీని నిర్మాణముననో మరియితరసందర్భముననో మూగియతెగకు చెందిన మహాతలవరులు కొందరు సహాయము చేసిరనియు తెలియుచున్నది. సంస్కృతశాశనము క్రీ. శ. ౯వశతాబ్దినాటిది కావచ్చునని నిర్ణయింపబడినది. ఇది ఒక బుద్ధవిగ్రహాశిల్పముక్రింద నున్నది. ఈశిల్పము ఆచార్యమౌద్గల్యాయనుని ప్రశిష్యుడును, ఆచార్యధర్మదేవుని శిష్యుడును అగు రాహులుడను శ్రమణునిచేత చెక్కింపబడెనని యీశాసనము తెలుపుచున్నది. దీనినిబట్టి ఈరామిరెడ్డిపల్లిస్తూపము క్రీ. శ. ౯వశతాబ్దివరకును చక్కగ నుండెననియు, నిచట బౌద్ధతీర్థమును, బుద్ధపూజలును అప్పటివరకును సాగుచుండెననియు తెలియనగుచున్నది.

చైత్యముగల కొండ రామిరెడ్డిపల్లిగ్రామమునకు ఒక ఫర్లాంగుదూరమునందున్నది. ములగేరు అను వాగు ఇప్పుడు కొంచెము దూరమునందున్నది కాని అది పూర్వము

* MER. 1926—27; JAARS vol. III—I.

ఈకొండప్రక్కనుండి ప్రవహించెననుటకు నిదర్శనములు కనిపించుచున్నవి. కొండపైని 1ఫర్లాంగు పొడవును 1½ఫర్లాంగు వెడల్పును గల సమతలము కలదు. ఇది ఉత్తరదక్షిణములకు వ్యాపించి యున్నది. దీని కుత్తరమునను, తూర్పునను కొండ లున్నవి. దక్షిణపశ్చిమముల కొండపైకి పోవుటకు మార్గములు కలవు. ఈసమతలముయొక్క దక్షిణపుకొనలో చైత్య మున్నది. వలయాకారముగనున్న ఈ కట్టడము 30అడుగుల చదరపు అరుగుమీద నిర్మింపబడినది. వేదికయు దానిచుట్టును మలచబడిన శిల్పఫలకములునుమాత్రమే నేడు కాంచనగుచున్నవి. వేదికపైన ఉండిన అండమును, హర్మికయు, ఛత్రమును పడిపోయినవి. ఈవేదిక 4అడుగుల ఎత్తున ఉన్నది. ఈచైత్యమునకు ఉత్తరముగ నేలమట్టమున ఒక విహారముయొక్క పునాదులు కనిపించుచున్నవి. ఈవిహారము నంటి ఉత్తరముగ కొండ కలదు. విహారమునకు తూర్పుగ నొక చెరువు ఉన్నది. దీనికి దక్షిణముగ మరి రెండు చిన్నవిహారములున్నవి.

ఈకొండమీద ఖననము చేయగా మొత్తముమీద 41శిల్పములు దొరికినవి. వీనిలో 21 చైత్యవేదికకు మలచబడిన పలకలు. వీనిమీద అమరావతీనాగార్జునకొండలలోవలెనే చక్కని చైత్యములు చెక్కబడియున్నవి. 16 చలవరాతి స్తంభములు. వీనిమీదను శిల్పము లున్నవి. రెండు వేదికపైనుండిన ఉష్ణీషఖండములు. మరిరెండు సాదా పలకలు.

ఈచైత్యఫలకములు అనేకరకములుగ నున్నవి. సామాన్యముగ అన్నిటిమీదను శిల్పశోభితమైన స్తూపమే చెక్కబడియున్నను దానిపైనగల బుద్ధుని విగ్రహములును, అతని జీవితగాథలును, జాతకకథలును వివిధములుగ నున్నవి. వీనిలో ఒకదానిమీద ప్రధానద్వారమున కెదురుగ ధ్యానిబుద్ధుని బొమ్మ కలదు. మరియొకదానిమీద నిలచియున్న బుద్ధుడున్నాడు. ఇంకొకదానిమీద శూన్యసింహాసనమును నటుపై ధర్మచక్రస్తంభము నున్నవి. ఇంకొకదానిపైన సింహాసనమును దాని కిటునటు లేళ్ళును కలవు. ఇచ్చట దొరికిన చలవరాతి స్తంభములలో కొన్నిటిమీద చక్కని శిల్పము లున్నవి. అందు ఒకదానిమీద నిలచియున్న పద్మపాణి బొమ్మ కలదు. దాని క్రింద నొకవైపున లేడియు, ఇంకొకవైపున భక్తుడు నున్నారు. పైభాగమున ఒక మహానాగముమీద కూర్చొనిన ధ్యానిబుద్ధుడున్నాడు. మరియొకదానిమీద నాగమును దీనిపై నొక సింహాసనమును చెక్కబడినవి. ఇంకొకదానిమీద క్రిందివరుసలో లేళ్ళున్నవి. ఆపైన చేతులు జోడించి పైకెత్తి నమస్కరించుచున్న భక్తులు కలరు. మధ్యలో ఒక సింహాసన మున్నది. ఆపైన తామరతీగెయు, సింహములును చెక్కబడినవి. మరియొక స్తంభముమీద మధ్య బోధివృక్షము మున్నది. అందులమీద జంతుశిల్పము లున్నవి. మరియొక చలవరాతి స్తంభము ఆరుపలకలుకలది. దీని అగ్రము వంపుతిరిగి యున్నది. బహుశః ఇది ఆయకస్తంభమేమో. పైశిల్పములుగాక ఇక్కడ ఉష్ణీషములోని రెండు బొరుపలకలు దొరికినవి. అందు ఒకదానిమీద రెండును, ఇంకొకదానిమీద మూడును దృశ్యములు చెక్కబడియున్నవి.

చేబ్రోలు§ :— చేబ్రోలుగ్రామము గుంటూరుజిల్లా తెనాలితాలూకాలో గుంటూరుకు ఎనిమిదిమైళ్ళదూరమునం దున్నది. ఇందు బహుప్రాచీనములైన ఆలయములును, అంతకంటెను ప్రాచీనతరమగు స్థలమును కలవు. ఈగ్రామమునకు తామ్రపురియని మరియొకపే రుండెడిది. ఇచటి కుమారస్వామి ఆలయము పూర్వము బహుప్రసిద్ధముగ నుండెడిది. ఇచటి ఆలయములలో భీమేశ్వర కేశవాలయములలో పల్లవయుగపు శిల్పములు కనిపించుచున్నవి. ఆకాలమున ఇంతప్రసిద్ధ కెక్కిన కుమారస్వామిఆలయ మాంధ్రదేశమునం దిక నెచ్చటను ఉండినట్లు కనపడదు. పల్లవతామ్రశాసనములలో నొకటి విజయతామ్రాపస్థానమునుండి ఈయబడినది. పల్లవరాజవంశమున స్కందవర్మయనుపేరు మిక్కిలి తరచుగ గన్పించుచున్నది. ఈతామ్రాపస్థానము తామ్రపురి కావచ్చును. ఈకారణములనుబట్టి ఈస్థలము క్రీ. శ. 4వశతాబ్దినుండియు ప్రాముఖ్యముగలదై యుండెనని చెప్పవచ్చును.

గ్రామపు ప్రాగుత్తరభాగమున ఒక ఫర్లాంగు నైఋత్యమున పెక్కుదేవాలయము లున్నవి. వీనిలో ఎన్నియో శాసనము లున్నవి. ఇచ్చట నొక దిబ్బ కలదు. దానిమీద నొక మూల చోడేశ్వరాలయమును, మధ్య నాగేశ్వర, భీమేశ్వర కేశవాలయములును కలవు. చిరకాలము సుప్రసిద్ధముగ నుండిన ఇచటి కుమారస్వామిఆలయము మాత్ర మిప్పు డిచట కనవచ్చుట లేదు. అందలిభాగములు మాత్ర మచ్చటచ్చట చెదరి పడియున్నవి.

ఇచటి ఆలయములను జాగ్రతగ పరిశీలించినయెడల వీనియందు బౌద్ధయుగపు అవశేషము లనేకములు కనవచ్చుచున్నవి. ఇచటి నాగేశ్వరాలయప్రాంగణమునందు ఎన్నియో రాతిపలక లున్నవి. ఇందు కొన్ని చలవరాతి పలకలు. వీనిపైన అర్ధకమలములు చెక్కబడినవి. కొన్నిటిపై తరువాతకాలపు శాసనము లున్నవి. భీమేశ్వరాలయపుధ్వజస్తంభము యొక్క వేదికమీద స్తంభము అడుగున నొక చలవరాతిఆమలక మున్నది. దీనిచుట్టును మనోహరమగు కమలములలత చెక్కబడియున్నది. దీనిమధ్యనున్న గాడిలో ధ్వజస్తంభము దింపబడినది. ఈఆమలకము ఆరాధ్యచైత్యముయొక్క అగ్రమున హర్మికకు బదులుగనుండెడిదేమోయని తోచుచున్నది. ఇట్టిదే మరియొక ఆమలకము ప్రక్కనున్న ఒక ఇంటి దొడ్డిలో కలదు. ధ్వజస్తంభముముందు రెండు చలవరాతిస్తంభము లున్నవి. వాని అగ్రములమీద పూర్ణకలశము చెక్కబడియున్నది. వానివెనుక అడ్డకమ్ముల నుంచుటకు తగిన గాడి ఉన్నది.

ఈ గ్రామమునందలి భీమేశ్వరాలయము విస్మయజనకముగ నున్నది. అమరావతీ ద్రాక్షారామములయందువలెనే ఈయాలయమును రెండుఅంతస్తులుగ నున్నది. మొదటి అంతస్తు చుట్టును గోడలతో మూయబడినది. రెండవ అంతస్తునందే ముఖమంటపమును, గర్భాలయము నున్నవి. ఇందుగల లింగముకూడ మిక్కిలి పొడవైనదే. అసలుఆలయమే ఒక పెద్దదిబ్బమీద నున్నది. ఈకారణములను బట్టి యీదిబ్బలో నొక బౌద్ధస్తూపము మణగి యున్నదనియు, దానిపైననే అమరావతిలో వలె నీభీమేశ్వరాలయము నిర్మింపబడెననియు ఊహింపనగుచున్నది.

§ Proc. AIOC. 1939. లోని The Antiquities of Chebrolu అను వ్యాసము.

ఈఆలయముల కెదురుగ విశాలమైన ప్రదేశ మున్నది. ఇందు ఇప్పుడు పొగాకు పండించు చున్నారు. ఈభాగమునందు త్రవ్వినప్పుడెల్లను (20" × 10" × 3") పెద్దఇటుకలు దొరకు చున్నవి. ఒకచోట ౫ అడుగుల లోతున త్రవ్వగా ఒకవైపు నలుపురంగును, మరియొక వైపు ఎరుపురంగునుగల కుండపెంకులు దొరికి నవి. ఇంకొకచోట ఎముకలతోను, శంఖము తోను చేయబడిన గాజుల ముక్కలు లభించి నవి. మరియొక స్థలమున నొక చిన్నకుండలో కొన్ని సాతవాహననాణెములు దొరికెనవి. వీనిలో రెండు గౌతమీపుత్రసాతకర్ణివి, రెండు యజ్ఞశ్రీవి. ఇవిగాక ఇటీవల నిచట మనోహర మైన, చక్కని పనితనమును చూపు ఒక స్త్రీ మృణ్మూర్తిమ దొరికినది. నాగార్జునకొండ, కొండాపురములలో నిట్టి అవశేషములు దొర కినవి ఈకారణములనుబట్టి యీ విశాల భాగము పూర్వమొకమహానగరముగ నుండె ననియు, నిదియే పల్లవయుగపు తాంబ్రాప నగరమనియు నిది సాతవాహనయుగమున కూడ ప్రముఖముగ నుండెననియు ఊహింప వచ్చును.

వేల్పూరు* :—ఈగ్రామము గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకాలో నున్నది. సత్తెన పల్లిక్రోసూరురోడ్డుకు కుడివైపుననున్న యిది ఒక కుగ్రామము. ఇందు అనేకస్థలములలో సాతవాహనయుగ బౌద్ధనిర్మాణముల శిథిల ములు కనవచ్చుచున్నవి

అచ్చంపేటరోడ్డుకు తూర్పుగ 150అడు గుల యెత్తుగల గుట్ట యొకటి ఉన్నది. దీని పైన రామలింగేశ్వరస్వామి ఆలయమున్నది. దీనిచుట్టును విరిగిపోయిన చలవరాతి స్తంభ ములును, పలకలు నున్నవి. వీటిమీద అర్ధ కమలములును, పూర్ణకమలములు నున్నవి. కొన్నిటికి తోరణలున్నవి. గ్రామస్థులు మరి కొన్ని స్తంభభాగములను చూచి వానిని శివ లింగము లనుచున్నారు. ఇందుకొన్ని అడు పలకలుగనుండి వాటి యగ్రము లింగమువలె వంపుతిరిగి యున్నది. ఇవి బౌద్ధస్తూపములలో నాలుగుదిక్కులను ఎత్తబడు ఆయక స్తంభ ముల అగ్రభాగములని చూచినతోడనే తెలి యుచున్నది. ఆలయమున కుత్తరముగ సమ తలము కలదు. ఇందు చతురస్రములును, గుర్రపులాడము వంటి ఆకారముకలవియునగు కట్టడముల పునాదులు నేలమట్టమున కనిపెంచు చున్నవి. ఒక పెద్ద చలవరాతిపలకమీద వరుసలలో నాగములు చెక్కబడియున్నవి. ఆలయముఖమంటపమునాని ఎత్తైన చలవ రాతి స్తంభము లెన్నియో కలవు.

కొండకు పడమటగ నొక పొలమున్నది. అందొక భావి కలదు. దీనిగోడలో అర్ధకమల మును, పూర్ణకమలమును చెక్కబడిన చలవ రాతిపలక లెన్నియో బిగింపబడి యున్నవి.

గ్రామమున కెదురుగ రోడ్డుకు ఆవలివైపున పోతరాజు గుడి కలదు. ఈగుడిఆవరణ మునందును ఎన్నియో విరిగిన చలవరాతిపలక లును, స్తంభములు నున్నవి. ఇందొకదాని మీద క్రీ. శ. 3వశతాబ్దినాటి మహారాజ హారీతీపుత్రముదానందుని శాసనము కలదు.

కనుపర్తి♦ :—ఈగ్రామము గుంటూరు జిల్లా బాపట్లతాలూకాలో సముద్రతీరమున చినగంజాంరైలుస్టేషనుకు తూర్పుగ ఎనిమిది

---

* JAHC vol. IV—i లోని శ్రీ ప్రయాగ శేషాద్రిశాస్త్రిగారి అను వ్యాసము.

♦ Ibid.

మైళ్ళదూరమునం దున్నది. ఈగ్రామము చుట్టునుగల ఇసుకపఱ్ఱలలో ఎన్నియో శిల్పములుగల చలువరాతిముక్కలు గాంచనగు చున్నవి. గ్రామములో స్మశానముదగ్గర 30 అడుగుల యెత్తును, 100అడుగుల చుట్టుకొలతయుగల పెద్ద దిబ్బ ఒకటి ఉన్నది. దీని చుట్టును వలయాకారముగ ప్రదక్షిణపథపు అంచులయందువలె రాతిపలక లున్నవి. దీని నింతవరకును ఆర్క శాఖవారు త్రవ్వి పరిశోధింపలేదు. ఈదిబ్బలో నొక స్తూపము అణగియున్నదనుటకు సందేహము లేదు. ఈప్రాంతమున కొన్ని బంగారు రోమను నాణెములు దొరికినవి. గ్రామమునందు అచ్చటచ్చట విడిగ కొన్ని శిల్పములు దొరకుచున్నవి. ఇందు ఒక మహానాగముగల స్తంభమొకటియు, యక్షిణీవిగ్రహముగల స్తంభమొకటియు ముఖ్యములు.

మోటుపల్లి♦:— దీనికి ముకుళపురమని నామాంతరము కలదు. ఇది చిరకాలము ప్రఖ్యాతిమైన రేవుగనుండి ఆంధ్రుల విదేశ వాణిజ్యమునకు కేంద్రముగ నుండెను. నాటి వైభవముయొక్క చిహ్నములు నేటికిని ఇచ్చట కనిపించుచున్నవి. ఈరేవుచుట్టునుగల చినగంజాం, కొల్లితిప్ప, ఫిరంగిదిబ్బ మొదలయిన చోట్లు దిబ్బలలో విడివిడిగ ఎన్నో బౌద్ధశిల్పములు దొరికినవి. మోటుపల్లి రేవులో ఒక చిగురుకు దగ్గరగ చాకలివాని దిబ్బ యను దిబ్బ కలదు. దీనిమీద కొన్ని రోమనునాణెములు దొరికినవి. ఈప్రదేశముల నన్నిటిని శాస్త్రీయముగ పరిశీలించినచో ఎన్నియో చైత్యములును, శిల్పములును బయల్పడగలవు.

మంచికల్లు‡:— ఈగ్రామము గుంటూరు జిల్లా పల్నాడుతాలూకాలో రెంటచింతలకు రెండుమైళ్ళలో ఉన్నది. గోలివాగు అను ఒక వాగు ఈగ్రామముగుండ ప్రవహించి కృష్ణానదిలో కలియును. ఈవాగు ఒడ్డున రెండు ప్రాచీనస్థలములు కలవు. అందొకటి సమతల మునం దున్నది. దీనిలో నేలమట్టమున ఒక విహారముయొక్క పునాదు లున్నవి. అచ్చటచ్చట విరిగిపోయిన చలువరాతి స్తంభములు భూమిలోనిలచియున్నవి. వాగుఒడ్డున 100అడుగుల యెత్తుగల గుట్ట ఒకటి ఉన్నది. దీని మీదకూడ విహారముల పునాదులును, విరిగిపోయిన స్తంభములు నున్నవి.

సమాధానపురం†:— ఈగ్రామము పల్నాడు తాలూకాలోని గొట్టుముక్కలను అంటియున్నది. ఇందు స్తంభాలమూల అను నొక ప్రదేశమున్నది. ఇది గోలివాగు కృష్ణానదిలో కలియుచోట నున్నది. ఈస్థలమున పెక్కుచలవ రాతి స్తంభము లున్నవి. వీనిలో కొన్నిటి మీద పరుగెత్తుచున్న జంతువులు చెక్కబడియున్నవి. ఈప్రాంతమంతయు నొక విహార ముగనుండెనని ఈనిదర్శనము నిరూపించుచున్నది.

మాదుగుల*:— ఈగ్రామము గుంటూరు జిల్లా పల్నాడుతాలూకాలో గురిజాలకు మూడుమైళ్ళదూరమునం దున్నది. ఇందొక మూల దేవాలయముల ఆవరణ కలదు. దీనిలో రెండు జీర్ణదేవాలయములును, పూజా

♦ Ibid. ‡ Ibid. † Ibid.

* ఈస్థలమును నేనును నామిత్రులు శ్రీ వావిలాల సోమయాజిగారును 1942 లో పరిశోధించితిమి.

దీకము జరుగుచున్న ఒకశివాలయమునుకలవు. ఈశివాలయము ఆవరణలో అతిప్రాచీనములైన శిల్పము లనేకములు కలవు. అందు ఒకే రాతిలో చెక్కబడిన 3 అడుగుల యెత్తుగల రథమున్నది. ఇది మహాబలిపురములోని ద్రౌపదీరథమును పోలియున్నది. ఆలయము లోపల శివపార్వతులును, కుమారస్వామియు గల శిల్పఫలక మున్నది. ఈరెండును ప్రాచీన పల్లవయుగపు శిల్పములు. ఇవిగాక ఆలయావరణలో పదెనిమిది పొడుగైన చలవరాతిస్తంభము లున్నవి. వాటిమీద అర్ధపూర్ణకమలములున్నవి. అగ్రములలో అష్టమూలముల నమర్చుటకు వీలగు తొర్రలున్నవి. రెండు మూడు నాగస్తంభము లున్నవి. పైస్తంభములు చైత్యప్రాకారములోనివని స్పష్టముగ చెప్పవచ్చును. ఇందు కొన్ని భూమిలో పాతుకొని యున్నవి. వానిమీద గుండ్రముగ శంఖములవలెనున్న అక్షరములలో శాసనము లున్నవి. గ్రామము వెలుపల దక్షిణముగ నొక దిబ్బ కలదు. స్థానికులు పై ప్రాకార స్తంభములు ఈదిబ్బలోనే దొరకినవని చెప్పుచున్నారు. ఈదిబ్బను త్రవ్వినయెడల తప్పక ఒకచైత్యము బయల్పడగలదు.

రెంటాల* :— ఈగ్రామము గుంటూరు జిల్లా పల్నాడుతాలూకాలో గుంటూరు మాచర్ల రైలుమార్గమున రెంటచింతల స్టేషనుకు రెండుమైళ్ళదూరమునందున్నది. గ్రామము వెలుపల రెండు కొండలు కలవు. అందు ఒకదానిపైభాగము విశాలముగను సమముగను ఉన్నది. దీనిని చేరుటకు క్రింద నుండి రాతిమెట్లు కలవు కొండమీద నొక ఎత్తైన ప్రదేశ మున్నది. దానిమీద ఇటుకలతో కట్టబడిన చైత్యము శిథిలమై ఉన్నది. దీనిచుట్టును ప్రాకారము కలదు. దీనిఅంచుల మీద చలవరాతి పలక లున్నవి. చైత్యము మీద అర్ధకమలములుగల చలవరాతిస్తంభమున్నది. దానిమీద ఇక్ష్వాకురాజగు రెండవ శాంతమూలునినాటి ప్రాకృతశాసన మొకటి ఉన్నది. మరియొకస్తంభశకలముమీద నింకొక శాసనఖండ మున్నది. ఇచటనే సిద్ధార్థుని మహాభినిష్క్రమణము చెక్కబడిన ఒకపలక ఉన్నది. చైత్యమునకు దగ్గరగ నేలమీద నాలుగైదు గజముల పునాదులు కనిపించుచున్నవి. ఇది యొక విహారము అయియుండును. ఈ ప్రదేశమును పరిశోధింపవలసియున్నది.

ఆదుర్రు• :— ఆదుర్రుగ్రామము తూర్పుగోదావరిజిల్లా రాజోలుతాలూకాలో వైనతేయమను గోదావరీశాఖతీరమునందున్న చిన్నగ్రామము. మామిడికొబ్బరితోటలమధ్య నున్న యీగ్రామము మనోహరముగ నుండును. చిరకాలమునుండియు ఈకోనసీమ వేదశాస్త్రకోవిదులకు నిలయమై సుప్రసిద్ధమైన విద్యాకేంద్రముగ నుండినది. సముద్రము ఇచటికి కొలదిమైలుదూరమునందున్నది. ఈ ప్రాంతము వర్తకమునకును ప్రసిద్ధమైనది. క్రీ. శ. 5వశతాబ్దినాటికే ఈభాగ మొకరాజ్యముగనుండి పృథ్వీమూలుడను రాజు పరిపాలనమునందుండెను. విజయకాండవలి అను నేటి కడలిగ్రామ మానాడు దీనికి కేంద్రము. ఈకాలమునందిచట వైదికధర్మము వర్ధిల్లుచుండెను. పిమ్మట నిది వేంగిచాళుక్యరాజ్యమున చేరిపోయెను. నందంపూడి, రాలితామ్ర

---

* Ibid.

• JAHC vol. III pp. 45-50 లోని Buddhist Antiquities of Adurru అను వ్యాసము.

శాసనములు ఈకాలమువందు కోనసీమ వేద వేదాంగకోవిదులతో నిండియుండెనని తెలుపు చున్నవి. ఆమీదట నీసీమపై కోనవంశీయులగు హైహయులు రాజ్యము చేసిరి. క్రీ. శ. 13, 14 శతాబ్దులలో నిది కాకతీయసామ్రాజ్యాంతిర్భాగమై ఇందులూరి అన్నయదేవుని పాలనమునం దుండెను. అటుపైన కొంతకాలము కోరుకొండనాయకులయొక్కయు కొండవీడురాజమహేంద్రవర రెడ్డి రాజులయొక్కయు పరిపాలన మీప్రదేశముపై సాగెను. ఈకోనసీమలో వైదికధర్మమేకాక జైనమతము నుచిరకాలము వర్ధిల్లెను. తాటిపాక నేదునూరు గ్రామములలో నెన్నియో జైనశిథిలములు బయల్పడినవి. ఇచట బౌద్ధముకూడ వర్ధిల్లెననుటకు ఈఆదుర్రుగ్రామమున దొరికిన చైత్యములు ప్రబల నిదర్శనములు. ఈగ్రామ మొకప్పుడు బహువిస్తృతమై ఒక ప్రబలదుర్గముగ నుండెను.

ఆదుర్రుగ్రామము క్రీస్తుశకారంభకాలమున ఒక విశాలబౌద్ధక్షేత్రముగ నుండెను. నేటికిని గ్రామమునందును, చుట్టుప్రక్కలను భూమిని త్రవ్వినప్పుడు ఆనాటి అవశేషము లెన్నియో బయలుపడుచున్నవి.

వైనతేయనదీతీరమున నదికి సుమారు ఒక ఫర్లాంగుదూరమున గ్రామమునకు ప్రాగ్భాగమున బౌద్ధశిథిలములు దొరికినవి. ఇచ్చట 110 అడుగుల చదరముగల చెరువు ఒకటి ఉన్నది. దీనికి ఇటుకతోకట్టబడిన మెట్లు కలవు. ఈచెరువుకు ప్రాగ్దక్షిణముగ 35 అడుగుల దూరములో ఒక చైత్యమున్నది, దీనిపైభాగమంతయు పోయి నేలమట్టమును పునాదులును మాత్రము కనిపించుచున్నవి. ఈ చైత్యము వ్యాసము 32 అడుగులు. చుట్టుకొలత 102 అడుగులు. వెలుపలిగోడ మందము 4 అడుగులు. వలయాకారముగనున్న దీని మధ్యభాగమునగల దిమ్మనుండి అంచువరకును బండిఆకులవంటి ఎనిమిది సన్నని గోడలు కట్టబడి యున్నవి.

ఈచైత్యమునకు దక్షిణముగ 32 అడుగులదూరమునందు ఒకమహాచైత్యమున్నది. ఇది 240 అడుగుల చుట్టుకొలతగల దిబ్బలో ఉండెడిది. మొదట దీని యెత్తు 40 అడుగులు. దీనికి మాబరాజుగుడి అని పేరుండెడిది. గ్రామస్థులు ఇక్కడ మేకలను, కోళ్ళను బలి ఇచ్చుచుండెడివారు. ఇటీవల దీనియందొకగుడి పూడుకొనిపోయి యున్నదను భ్రమతో స్థానికులు దీని అగ్రమునందుండిన మర్రిచెట్టును కొట్టివేసి దిబ్బను త్రవ్విరి. మూడడుగుల లోతు త్రవ్వగనే గుల్లసున్నముతోను, గులకరాళ్ళతోను నిర్మింపబడిన చపటా కనవచ్చెను. గోతిని వెడల్పుచేయుచు పోగా అండాకారముగ కొంతదూరముపోయి ఈ చపటా ఒకగోడ అంచును చేరుట కనపడినది. ఆమీద ఈచపటాను త్రవ్వివేసిరి. అంతట కుంచమువంటి ఇటుకకట్టడము కప్పించెను. దీనిచుట్టునున్న ఇటుక గోడ మందము 5అడుగులు ఉండెను. దీనిమధ్య నొక స్తంభమును, దానినుండి వలయపు అంచులవరకును పోవు ఆకులవంటి గోడలు నుండెను. ఈకట్టడపు గోడలచుట్టును తిరిగిలోతుగత్రవ్విరి. సుమారు 5అడుగుల లోతున బండిఆకులవంటి సన్నని గోడలు బయలుపడినవి. వీనివెంబడి త్రవ్వుచు పోగా వలయము కనబడెను. మునుపటివలెనే ఈవలయపుగోడవెంబడి 6అడుగులలోతుకు త్రవ్విరి. అక్కడ ఇంతకంటెను పెద్దదగు మరియొక వలయము కనిపించెను. ఈవలయము

కుంచమువంటి మరియొక కట్టడపు పై అంచు. ఈకట్టడము 6అడుగుల యెత్తున ఉన్నది. దీని క్రింద ఒక అడుగు ఎత్తు వేదిక కలదు. ఇది అదుర్రు మహాచైత్యము.

ఇప్పటికి 10_12అడుగుల యెత్తుగ ఉన్నది. ఈదిబ్బలో 3_4అడుగులలోపల మహాచైత్య మున్నది. నేలమట్టమునుండి ఒకఅడుగు ఎత్తుగ నొక వేదిక కలదు. దానిపైన ఆరుఅడుగుల యెత్తున వలయాకారమగు ఇటుక కట్టడము న్నది. దీనిగోడ మందము 5అడుగులు. చుట్టు కొలత 206అడుగులు, వ్యాసము 65అడు గులు. ఈకట్టడమున నాలుగుదిక్కులను 15 అడుగుల ఎత్తు, 5అడుగుల వెడల్పు, 3అడు గుల మందముగల దిమ్మలు ముందుకు చొచ్చు కొని వచ్చుచున్నది. కట్టడము పై భాగమున మధ్యలో నొక దిమ్మయు దానినుండి వల యపుఅంచులకు వచ్చు సన్నగోడలు నున్నవి. ఈదిమ్మచుట్టును 60అడుగుల వ్యాసమును, 190అడుగుల చుట్టుకొలతయు, 5అడుగుల మందమునుగల గోడయు గల కుంచమువంటి మరియొక కట్టడ మున్నది. దీనిమధ్య 3అడు గుల యెత్తును, 35అడుగుల వ్యాసమును, 112 అడుగుల చుట్టుకొలతయు గల మరియొక కట్ట డమున్నది. అడుగునగల కట్టడము నాలుగు వైపులనుగల దిమ్మలు ఆయక స్తంభవేదికలు. ఈకట్టడపు గోడ లోపలిఅంచునుండి చైత్యము యొక్క అండము ఉండియుండవలెను. రెండు మూడువరుసలలోని కట్టడములు ఈ అండ ములో ఉండియుండును. ఈపై రెండువరుసల కట్టడముచుట్టును దాని సన్నగోడలమధ్య భాగమును మట్టితోను, ఇటుకముక్కలతోను నింపివేసిరి. ఇట్లు మట్టితో ఏర్పడిన అండము వెలుపల ఇటుకలను మలిచి చపటా చేసిరి. అండాగ్రమున సున్నముతోనుగులకరాళ్ళ తోనుపోతపోసిన పలకలను మలచిరి. మధ్యలో స్తంభమును, దానిపైన హార్మికయు, దానిపైన ఛత్రము నుండియుండును. ఈమహాచైత్యము నిర్మాణపద్ధతిలో నాగార్జునకొండమహాచైత్య మును పోలియున్నది.

పైన వర్ణింపబడిన చైత్యమును, మహా చైత్యమునేగాక మరియొక చైత్యముకూడ నుండెననియు, అది పునాదులతోగూడ త్రవ్వివేయబడెననియు స్థానికులు తెలుపు చున్నారు. మహాచైత్యముచుట్టును 2అడుగుల లోతుకు త్రవ్వినచో ఇటుక చపటాయును, దానిమీద అడుగునిలువుగోడల పునాదులును కనిపించుచున్నవి. ఇవి భిక్షువులు నివసించెడి విహారములోని గదులని తోచుచున్నది. ఇచ్చట సన్నికల్లులు, పాతకుండపెంకులు దొరికినవి. ఒకకుండలో క్రీ. పూ. 1, క్రీ.శ. 1, 2శతాబ్దులనాటి సాతవాహన తామ్రనాణె ములును, గౌతమీపుత్రసాతకర్ణి యొక్క చైత్యముద్రగల సీసపునాణెమొకటియు దొరికినవి.

ఈఅదుర్రుగ్రామము క్రీ. పూ. 1వశతాబ్ది నుండియు ఒక ప్రఖ్యాతబౌద్ధక్షేత్రముగ నుండె డిది. ఇది సముద్రమునకు సమీపముననుండి వైనతేయనది ఈగ్రామమువరకును రాకపోకల కనువుగనుండుటవలన విదేశములనుండియు బౌద్ధయాత్రికులిచటికి వచ్చుచుండిరని ఊహింపనగును.

గోలి* :— గోలి అను గ్రామము గుం టూరుజిల్లా పల్నాడుతాలూకాలో ఉన్నది. దీని సమీపమున ఇటీవల ఒక చైత్యమును

* T. N. Ramachandran — Buddhist sculptures from a stupa near Goli.

దానికి మలచబడిన కొన్ని చలవరాతి శిల్పములును దొరికినవి. ఈశిల్పములు అమరావతీ సాంప్రదాయమునకు చెందిన మనోహరములై ఉన్నవి.

గొల్లేరను వాగు ఒకటి కృష్ణలో కలియుచున్నది. ఈయేటి ఒడ్డున గోలి అను గ్రామమున్నది. ఇది గుంటూరుమాచెర్ల రైలుదారి మీది రెంటచింతల రైలుస్టేషనుకు రెండుమైళ్ళ దూరమునందున్నది. ఈగోలిగ్రామమునకు ప్రాక్పశ్చిమముగ 1½ మైళ్ళదూరమందును, మల్లవరం గ్రామమునకు పడమటగ మూడుమైళ్ళ దూరమునను ఒక పొలమున్నది దానిలో ఈ స్తూపము బయల్పడినది. 1882 లో సూయల్ ఈప్రాంతమున సంచారముచేయుచుండగ నిచటి దిబ్బలోనుండి శిల్పములుగల చలవ రాతిపలకలు రెండు దొరికినవి. 1926 లో డుబ్రొయిల్ అను ఫ్రెంచిదేశీయుడు ఈ దిబ్బను త్రవ్వి ఇరువది శిల్పఫలకములను బయల్వెడలించెను. వీనిలో నాలుగు తప్ప తక్కిన వన్నియు మదరాసుమ్యూజియమునకు తీసికొని పోబడినవి. నాలుగు శిల్పములు మాత్రము ఇచటనే ఒక గదిలో జాగ్రత్తపెట్టబడినవి. అందు ఒక మహానాగముగల పలక గదిమధ్య స్థాపించబడినది. మూడు శిల్పములు గదిగోడలలో బిగించబడియున్నవి.

ఈగోలీస్తూపమున దొరికిన శిల్పములలో పదిహేను ఖండములు కలవు వీనిలో కొన్నిటిమీద బుద్ధుని జీవితమునందలి ముఖ్యఘట్టములును, మరికొన్నిటిమీద జాతకకథలును కలవు. ఇవిగాక రెండు చైత్యఫలకములును, బుద్ధపాదములు గల పలక ఒకటియు, మహానాగము కలది ఇంకొకటియు, చైత్యారాధనమును చూపునది ఒకటియు కలవు.

ఈస్తూపముయొక్క కాలమును సూక్ష్మముగను, నిస్సందేహముగను నిర్ణయించుటకు తగిన ఆధారములు లభింపలేదు. అందువలన వీనిలో దొరకిన శిల్పముల లక్షణమును బట్టియు, వానిని ఇతరస్థలముల లభించిన శిల్పములతో పోల్చియు ఈస్తూపము నిర్మింపబడిన కాలమును ఒకవిధముగ ఊహింపవలెను. ఈ గోలీస్తూపము ఏకకాలముననే నిర్మింపబడినది. శిల్పములు అమరావతిలో నాల్గవదశలో నిర్మింపబడిన క్రీ. శ. 3వశతాబ్దినాటి శిల్పములను పోలియున్నవి. అవిగాక ఇచట దొరకిన ఒక చైత్యఫలకముమీద అక్షరముల బ్రాహ్మీ శాసనమొకటి కలదు. ఈఅక్షరములు ఇక్ష్వాకు శాసనముల అక్షరములను పోలి యున్నవి. ఈకారణములనుబట్టి ఈగోలీస్తూపము క్రీ. శ. 3వశతాబ్దినాటిదని ఊహింపవచ్చును.

ఇచ్చట దొరికిన శిల్పముల నీక్రింద వర్ణించుచున్నాము.*

చద్దంతజాతకము:—ఇది రెండు దృశ్యములలో ఉన్నది. మొదటిదానిలో ఎడమదిగువను తామరపుష్పములుగల కొలను కలదు. కొన్ని యేనుగులు దానిలో స్నానము చేయుచున్నవి. మరికొన్ని గట్టున విహరించుచున్నవి. మధ్యలో ఒకయేనుగు అందిచ్చుచున్న కమలమును తన తొండములో తీసికొనుచున్న షడ్దంతములుగల గజరాజు కలదు. కుడిదిగువను ఒక గొయ్యిఉన్నది. దానిలో గజరాజు పడుకొనినాడు. ఒకమనుష్యుడు రంపముతో అతని దంతమును కోయుచున్నాడు. గజరాజు

* Ibid. plates I C, D; II F; III H; IV—A; V B, C, D; VI E F, G, H; VII A; VIII C: IX no 5; XI nos. 9; 10.

తొండముతో రంపపు చివర పట్టుకొని దానినిటునటు లాగుచున్నాడు. గోతిపైన ఈమనుష్యుడు రెండుపెద్దదంతములను ఒక కర్రకు రెండు చివరలను కట్టి దానిని కావడివలె భుజముమీద పెట్టుకొని పోవుచున్నాడు. ఈ దృశ్యమునకు రెండువైపులను పైన చైత్య వాతాయనముల మాదిరిగల సన్నని గోడలు కలవు. రెండవదృశ్యము మధ్యభాగమునందొక విశాలమైన ఆసనమున్నది. దాని కుడి దిగువ నొకమనుష్యుడు ఒక దాగరిలో రెండు వంశములను పెట్టుకొని మోకాళ్లు మడచుకొని కూర్చొని నాడు. ఆసనము వెనుక ముగ్గురును, ఎడమవైపు ఒకతెయు పరిచారికలు నిలచి ఆత్రముతో చూచుచున్నారు. ఆసనముమీద ఎడమకాలు క్రిందకు చాచి కుడి కాలు మడచుకొని ఒక రాజు కూర్చొని తన ఒడిలో పడిపోవుచున్న రాణిని పట్టుకొనుచున్నాడు.

(2) బుద్ధుడు యశోధరవద్దకు వచ్చుట:— ఇది యొక మనోహరమగు దృశ్యము. కుడి చివర నొక ద్వారము దాటి ఎడమచేతనుత్తరీయమును పట్టుకొని, కుడిచేత నభయ ముద్ర ధరించి బుద్ధుడు వచ్చుచున్నాడు. విదూషకుడు నొక పరిచారికయు అతనిని లోన ప్రవేశపెట్టి నమస్కరించుచున్నారు. అతని కెదురుగ వెనుకభాగమున కొందరు పరిచారికలున్నారు. ముందుభాగమున రాహులుడును మరియొకబాలుడును ఒకరిపైనొకరు యెక్కి ఆడుకొనుచున్నారు. బుద్ధుడు ప్రవేశింపగనే రాహులుడు పరుగెత్తిపోయి అతని ఉత్తరీయము పట్టుకొని అతనిని లోనికి తీసికొని వచ్చుచున్నాడు. ఒక సింహాసనమున కూర్చొని సిద్ధార్థుని పెంచిన గౌతమి అతడిప్పుడు ఏమి చేయునో చూతమని నిరీక్షించుచున్నది. ఇంతలో రాహులుడు పరిగెత్తిపోయి తల్లియగు యశోధరకు బుద్ధుని రాకను తెలిపినాడు. ఆమె వెంటనే తాను కూర్చొనిన ఆసనము నుండి లేచి దానిని కుడిచేతి బుద్ధునికి చూపుచున్నది. ఇతర పరిచారికలు [illegible] జాలిగ చూచుచున్నారు.

(3) నలగిరిదమనము:— ఇది యొక చక్కని శిల్పము. దేవదత్తుడను బుద్ధుని బంధువు అతనియెడ ఈర్ష్య వహించి అతని కెన్నియోసార్లు ప్రాణాపాయము కల్పించెను. ఒకసారి బుద్ధు డొక మిత్రుని యింటికి భిక్షార్థము పోవునని ముందుగనే తెలుసుకొని దేవదత్తుడు రాజగు అజాతశత్రుని మావటి వానిని వశపరచుకొని నలగిరియను పొగరుబోతుఏనుగును బుద్ధుడు వచ్చుదారిలో విడిచి పెట్టించెను. ఈదృశ్యమునందు ఎడమవైపున నలగిరి ఒక స్త్రీని క్రిందపడవేసి కాలితో త్రొక్కుచున్నది. ఆమెభర్త గాబోలును ఆమెకెదురుగ కూర్చొని విలపించుచున్నాడు. ఏనుగు మరియొకనిని తొండముచుట్టబెట్టి పైకి ఎత్తినది. ఒక పురుషుడు భయముతో వెనుకకు పడిపోవుచున్నాడు. మరియొకడు పరు గెత్తుచున్నాడు. నలువురు కర్రలు తీసుకొని పారిపోవుచు వెనుకకుతిరిగి చూచుచున్నారు. దృశ్యము కుడివైపు బుద్ధుడును అతని శిష్యులును వచ్చుచున్నారు. నలగిరి అతనిని చూచిన వెంటనే ముందుకు వచ్చి వంగి అతనికి నమస్కరించుచున్నది. దీనిని చూచి వెనుక కొందరు సంభ్రమాశ్చర్యములతో చేతులు పైకెత్తి "హా" అనుచున్నారు. కొందరు నమస్కరించుచున్నారు.

(4) వెస్సంతరజాతకము :— ఈజాతకకథ ఇచ్చట సవివరముగను మనోహరముగను చిత్రింపబడినది. పూర్వజన్మలో బోధిసత్వుడు వెస్సంతరుడను రాజపుత్రుడుగ జన్మించి మహాదాతగ నుండెను. అతని దాతృత్వము బహుకఠినముగ పరీక్షింపబడెను. ఇది యీ శిల్పమునకు కథావస్తువు. మొదటిదృశ్యమున గజారూఢుడై వెస్సంతరుడు దానశాలకేగుచున్నాడు. అతనికి ముందుగ నొకడొక కలశమును, మరియొకడు ఒక వెడలుపైన పాత్రను ఇంకొకడు ఖడ్గమును పట్టుకొని పోవుచున్నారు. వెనుక మరియొక ఖడ్గవాహకుడును కొందరు పరిజనులును అనుసరించుచున్నారు. రెండవ దృశ్యమున వెస్సంతరుడు గజమును దానము చేయుట చూపబడినది. అతని యేనుగు ఎక్కడనుండిన అక్కడ సమృద్ధిగ వర్షములు కురియునట. ఒకప్పుడు కళింగదేశమున వర్షములు కురియక క్షామము వచ్చెనట. కొందరు కళింగబ్రాహ్మణులు వెస్సంతరునివద్దకు వచ్చి అతని యేనుగును యాచించిరట. దృశ్యము కుడిచివర శ్వేతఛత్రము నొకడును ఖడ్గము నొకడును పట్టుకొని పరిజనులు నిలచియున్నారు. వారిముందు ఒక వామనుడు కలశమును పట్టుకొని యున్నాడు. మధ్యలో ఏనుగు కలదు. దాని తొండము ఒక బ్రాహ్మణుని కుడిచేతనున్నది. రాజు ఒక జారీతో దానిమీద ఉదకము పోసి దానము చేయుచున్నాడు. నీళ్ళు పడుచోట పెద్ద పాత్ర కలదు. దానము పట్టుచున్న బ్రాహ్మణుని వెనుక మరియిద్దరు బ్రాహ్మణులున్నారు. వారివెనుక చాలమంది నిలచి వింతగ చూచుచున్నారు. మూడవదృశ్యమున పైగజమును దానము చేసినందులకు కోపించి తనతండ్రి తనకు దేశాంతరగమన శిక్షను విధింపగ వెస్సంతరుడు భార్యను, బిడ్డలను తీసికొని ఒకబండిలో అరణ్యమార్గమున పయనము చేయుటయు, మార్గమునందు బండి యెద్దులను దానముచేసి అతడును, భార్యయు బండిని తామే లాగుకొని పోవుటయు చూపబడినవి. నాల్గవదృశ్యమునందీరాజపుత్రుడు బండిని సహితము దానము చేసి, తానును భార్యయు బిడ్డల నెత్తుకొని నడచి పోవుటయు, భార్య దగ్గరలేని సమయమున అతడు తన బిడ్డల నొక బ్రాహ్మణునికి దానము చేయుటయు శిల్పింపబడినవి. ఐదవదృశ్యమునందు భార్య తిరిగివచ్చునప్పటికి అతడు ధ్యానమున కూర్చొని యుండుట చూపబడినది. కడపట వెస్సంతరుని బిడ్డలు తమ తాత తొడలమీద కూర్చొనియుండుట కలదు.

(5) మారగర్వభంగము :—దృశ్యము మధ్యలో బుద్ధుడు ధ్యానముద్రలో కూర్చొని యున్నాడు. అతని కిటునటు మారుని కుమార్తెలు చక్కని భంగిమలలో నిలచి యున్నారు. దూరమున నిలచి మారుడు ఈవృత్తాంతమును చూచుచున్నాడు. ఆపైన ఏనుగుమీద కూర్చొని, వెనుకకు తిరిగి బుద్ధునికి నమస్కరించుచు మారుడు వెడలిపోవుచున్న దృశ్యము గలదు. దిగువ నిద్దరుకుబ్జు లితనిని హేళన చేయుచున్నారు.

(6) సుజాత బుద్ధునికి ఆహారము నిచ్చుట:- ఒకప్పుడు బోధిసత్వగౌతముడు ఉరువెల్వగ్రామమువద్ద ఒక చెట్టుక్రింద కూర్చొని, నిరశనవ్రతముబూని ధ్యానమున ప్రవేశించెను. కొన్నిదినములైనపిమ్మట నతడు స్మృతితప్పి పడిపోయెను. ఉరువెల్వగ్రామాధిపతి కూతురు సుజాత అనునామె యితనిని చూచి, యితని

కాహారమును పెట్టి స్వస్థుని చేసెను. ఈకథ యీశిల్పమున చెక్కబడినది. దృశ్యము మధ్య బోధిసత్వుడు ఒకరాతిమీద కూర్చొని యున్నాడు. అతనివెనుక నొక స్త్రీ చామరము తోనో, విసనకర్రతోనో విసరుచున్నది. అతని యెదుట నొకస్త్రీ అతనిపాదములకు మోక రించి నమస్కరించుచున్నది. మరియొకస్త్రీ కలశముతో అతని చేతులలో నీరు పోయు చున్నది. ఇంకొక స్త్రీ ఏదియో పాత్రను అం దించుచున్నది. మరిముగ్గురు స్త్రీలు నిలచి నమ స్కరించుచున్నారు.

(7) ధర్మబోధ :— దృశ్యము మధ్య బుద్ధుడు పద్మాసనస్థుడై, యెడమ చేతిని వడిలోనుంచి, కుడిచేత అభయ ముద్ర ను ధరించినాడు. వెనుక నిటునటు చామరవాహ కులున్నారు. క్రింద రెండువైపుల నిద్దరు కూర్చొని నమస్కరించుచున్నారు. మధ్య మరియొకడు వెనుకకు తిరిగి కూర్చొని నమ స్కరించుచున్నాడు. ఈముగ్గురి వేషభూష లును రాజోచితములుగ నున్నవి.

(8) మాతృపోషకజాతకము :— బోధి సత్వుడొకప్పుడు ఏనుగుగ అవతరించెను. కొంతకాలమునకు అతని తల్లి ముసలిదై లేవ లేని స్థితికి వచ్చెను. అంతట బోధిసత్వుడు ఆమెను చక్కని సరస్తీరమునం దున్న ఒక గుహయందుంచి జాగ్రతగ సంరక్షణ చేసెను. దృశ్యము ఎడమవైపున ముసలి యేనుగు కూర్చొని యున్నది. దానికెదురుగ బోధి సత్వుడు నిలచి తొండమును చాచి తల్లిపై నీరు పోయుచున్నాడు.

(9) శశజాతకము :— బోధిసత్వుడు ఒక సారి కుందేలుగ నవతరించి ఒకఅరణ్యమునం దొక ఆశ్రమప్రాంతమున నివసించెను. అతనికి ఒకకోతియు, ఒకనక్కయు మిత్రులుగ నుం డిరి. ఒకప్పుడు పూర్ణిమకు ముందుదిన ముప వాసము వచ్చెను. అంతట నీమిత్రులు మరు దిన మెవరైనను అతిథులు వచ్చినచో వారి కాహార మీయవలెననియు, వానిని ప్రతి యొక్కరును ముందుగనే జాగ్రత పెట్టుకొన వలెననియు తీర్మానించుకొనిరి. వానరము ఒక మామిడిపండును సంపాదించెను. నక్క ఒక బల్లిని, పుల్లపాలను సంపాదించెను. కుం దేలు తాను గడ్డి తిని బ్రతుకుచుండుటను, గడ్డిని మరియొకరి కాహారముగ నిచ్చుట భావ్యము కాకుండుటను గమనించి అతిథికి తననే సమర్పింప నిశ్చయించెను. ఇంద్రుడు ఈవృత్తాంతమును కనిపెట్టి కుందేలును పరీ క్షింపనెంచెను. మరుసటిదినము అతడు బ్రాహ్మణవేషమును ధరించి కుందేలువద్దకు వచ్చి భిక్ష నర్థించెను. అంతట కుందేలు బ్రాహ్మణునితో "ఓయీ! కట్టెలు తెచ్చి, నిప్పుచేయుము. నేను దానిలో కాలి ఉడికె దను. అప్పుడు నీవు నన్ను తినవచ్చును" అని చెప్పెను. బ్రాహ్మణుడు నిప్పు చేసెను. కుం దేలు దానిలో దూకెను. అంతట నింద్రుడు నిజరూపమును చూపి కుందేలు నభినందిం చెను. ఈకథ యీశిల్పమున చెక్కబడినది. దృశ్యము ఎడమదిగువ నక్కయు, చేతులలో మామిడిపండుగల కోతియు ఉన్నవి. వాని ముందు వెనుకకాళ్ళపై నిలచి ముందుకు దూకబోవుచున్న కుందేలు ఉన్నది. దాని ముందు మంటలు పైకెగయుచున్న అగ్ని హోత్ర మున్నది. దానికావల బ్రాహ్మణుడు కూర్చొని కుడిచేత నేదియో అగ్నిలో హోమము చేయుచున్నాడు. అతనివెనుక నొక కుటీరమును, దూరమున నొక స్తూప

మును, మరియిద్దరు వ్యక్తులు నున్నారు. కుందేలు వెనుక రెండుచేతులను పైకియెత్తి నిలచిన ఇంద్రుడున్నాడు.

(10) ధర్మచక్రప్రవర్తనము :— ఇది సాంకేతికశిల్పము. దృశ్యముమధ్య నొక శూన్యాసనము. దానిమధ్య స్వస్తికగల గుండ్రని దిండు. క్రింద పాదపీఠము. దిగువ రెండు లేళ్ళు. ఇది మృగదావనమున మొట్టమొదట బుద్ధుడు చేసిన ధర్మచక్రప్రవర్తనము.

కొండాపురము‡ :— కొండాపురగ్రామము నైజాంరాజ్యములో మెదకుజిల్లా కలబగూరు తాలూకాలో ఉన్నది. హైదరాబాదు-బిదరు రోడ్డున 38 మైళ్ళు పోయిన తర్వాత రోడ్డుప్రక్కగ కొద్దిదూరమున నీగ్రామము కలదు. గ్రామమునకు దక్షిణముగ అరమైలు దూరమునందు దిబ్బ కలదు. ఇది చుట్టుప్రక్కల గల భూమికంటెను, సుమారు 30 అడుగుల యెత్తుగను, సముద్రపుమట్టమునకు 1800 అడుగుల యెత్తుగను ఉన్నది. ఈదిబ్బయొక్క వైశాల్యము 84 ఎకరములు. ఈ దిబ్బకు తూర్పుగ నొకటియు, పశ్చిమోత్తరముల నొకటియు రెండువాగులు ప్రవహించుచున్నవి. దక్షిణముగ పల్లపుప్రదేశ మున్నది. వీనిలో తూర్పున ఉన్న యేటిలో ఎల్లప్పుడును నీరు ఉండును. వర్షాకాలమున నీరెండేరులును జలప్రపూర్ణములై ప్రవహించునపుడు ఈదిబ్బ ద్వీపమువలె నుండును. పూర్వకాలమున ఈ రెండేరులును కలిసి యిచటికి 12 మైళ్ళదూరమునందున్న మంజీరానదిలోనికి ప్రవహించెడివి. తర్వాతకాలమున ఈయేరుల నీటిని నిలువచేయుటకు కావలెను, ఈదిబ్బకు దక్షిణముగ నొకగట్టు కట్టబడినది. దిబ్బచుట్టును కొంచెముదూరములో కొన్నిగుట్టలును, వానికి మరికొంతదూరమున వలయాకారమగు పర్వతపంక్తియు గలవు. ఇచటి మైదానమునందు ఇట్టివే మరికొన్ని దిబ్బలు కలవు. వాటిని ఇంకను ఎవరును పరిశోధింపలేదు.

ఈకొండాపురము దిబ్బలో దొరికిన వస్తువులలోనెల్ల అమూల్యమైనవి నాణెములు. ఇవి కొన్ని అంగుళములలోతుకు త్రవ్వుటతోడనే బయటపడినవి. వీనిసంఖ్య 1800కు పైబడి ఉన్నది. వీనిలో రోమనుచక్రవర్తి (క్రీ. పూ. 37 – క్రీ. శ. 14) అగు ఆగస్టసుయొక్క బంగారునాణెమొకటి కలదు. పది వెండితో చేయబడిన Punch Marked నాణెములు, 100 క్రీ. శ. 2వశతాబ్దినాటి పోటిన్ నాణెములు, 50 రాగినాణెములు. మిగిలిన వన్నియు సీసపునాణెములు. ఈనాణెములలో చాల భాగము ఆంధ్రసాతవాహనరాజులవి. ఇందు కొన్నిటిమీద చిహ్నములుమాత్రముండి శాసనములు కానరావు. కొన్నిటిమీద బ్రాహ్మీలిపిలో శాసనము లున్నవి. కాని అవి యింతవరకును ప్రకటింపబడిన సాతవాహన నాణెములకంటె భిన్నములుగ నున్నవి. కొన్ని మాత్రము సుప్రసిద్ధములైన రాజులవి. గౌతమీపుత్రసాతకర్ణి, పులోమావి, శివశ్రీ, యజ్ఞశ్రీల నాణెములు కొన్ని ఇందు కలవు. సూక్ష్మముగ పరిశీలించినచో ఈనాణెములు క్రీ. పూ. 1వశతాబ్దికిని క్రీ. శ. 2వశతాబ్దికిని మధ్యకాలమునాటివి అని తెలియుచున్నది. ఈనాణెములేకాక ఇందు కొన్నిటిని పోతపోసిన మూసలు సహితము ఇచ్చట దొరికినవి. ఈమూసలు ఆంధ్రరాజుల నాణెములవే కాక Punch Marked నాణెములవి కూడ

‡ ABORI vol. XXII pp. 171–185 లోని శ్రీగులాం యజ్దానీగారి సచిత్ర వ్యాసము.

నైయున్నవి. ఈకారణములను బట్టి ఈప్రదేశమున సాతవాహనయుగమునందు ఒక టంకశాల ఉండెడిదనియు, నిది ముఖ్యమైన ఒక మహానగరమనియు నిర్ణయింపవచ్చును. ఈ నాణెములుకాక ఇక్కడ పదిహేండ్రెండు మృన్ముద్రికలును దొరికినవి. అవియునుగాక మూడు బ్రాహ్మీలిపిలోని అక్షరములుగల కుండముక్కలుకూడ నిచట దొరికినవి. ఈ అక్షరములు క్రీ. శ. 1వశతాబ్దినాటివి. ఈనిదర్శనములనుబట్టి యిచటి నగరము క్రీ. పూ. 3వశతాబ్దినుండి క్రీ. శ. 2వశతాబ్దివరకును వర్ధిల్లినదని చెప్పవచ్చును.

ఈదిబ్బలో ఇనుముతో చేయబడిన కొడవళ్ళు, కత్తులు, ఈటెమొనలు, ఉలులు, మేకులు మొదలగు వస్తువులు ఎన్నియో దొరకినవి. ఈదిబ్బలో ఒకమూల ఎన్నియో కమ్మరి దుకాణములు బయలుపడినవి. ఒకచోట కొలిమి దొరికినది. దీనిచుట్టును కాల్చిన వస్తువులను చల్లబరిచుటకుగాను ఇటుకలతో కట్టిన నీటితో నింపబడెడి కుండీలు కలవు.

ఇచ్చట కనిపించు అనేకకట్టడముల నిర్మాణమునందు అనేకవిధములైన ఇటుకలు ఉపయోగింపబడినవి. వీనిలో కొన్ని చదరము గను, కొన్ని చతురస్రములుగను మరికొన్ని మొదలువెడల్పుగను చిగురుసన్నముగను ఉన్నవి. విహారములయందును గృహముల యందును ఉపయోగింపబడినవి 22 × 11 × 3 అంగుళములును, నేలమాళిగలు కట్టుటలో ఉపయోగింపబడినవి 17 × 8 × 4అంగుళములును, గోడలమూల తిరుగుడులలో నుపయోగింపబడినవి 15 × 15 × 2అంగుళములు నున్నవి. ఈయిటుకలమధ్య మట్టితో కలపబడిన అడుసు ఉన్నది కాని సున్నము ఎచ్చటను కనిపింపదు.

ఇచ్చట బయలుపడిన కట్టడములు మూడు రకములు. ఒకరకమువి నివాసగృహములు. రెండవతరగతివి దుకాణములు. మూడవతరహావి బౌద్ధుల కట్టడములు.

నివాసగృహములలో ప్రతిదానియందును 5, 6 గదులుండెడివి. ఒక్కొక్కగది పదిహేను అడుగుల పొడవును, ఎనిమిదిపది అడుగుల వెడల్పును కలిగియుండెడిది. నేల ఇటుకలతో చపటా చేయబడికాని, ఇటుక కంకరతో దుమిశా చేయబడిగాని ఉండెడిది. ఈయిండ్లకుపైన వెదురుతడకలను అల్లివానిపై పెంకులు బోర్లించుచుండిరి. కొన్నియిండ్లకు గులకరాళ్ళతోను, మట్టితోను కట్టిన గోడలు కలవు. వీటిపైని పూరితో నేసిన కప్పులు ఉండియుండును.

ఇచటి దిబ్బమీద ఒకవైపున ఒక దుకాణముల వరుస కలదు. ఇవన్నియు కర్మాగారము లైయుండును. ఇందు కొలుములును, చిట్లముక్కిపోయిన లోహములు, మూసిగట్టలును, కొన్నిమూసలును దొరికినవి. ఈదుకాణములలో ఇటుకచపటా చుట్టును ఇటుకగోడలు గల ఒకగది, దానిపైన పెంకుటికప్పును కలవు. ప్రతిదుకాణమునకును దగ్గరగ చపటా చేసిన విశాలమగు ప్రదేశమున్నది. దానివద్ద నీటితొట్టె లున్నవి.

ఈస్థలమునందు రెండు చైత్యగృహములును, మూడు స్తూపములును, మూడు విహారములును బయలుపడినవి. ఇవి దిబ్బమీద ఉత్తరముననను, పడమటను, పశ్చిమోత్తరముననను ఉన్నవి. పశ్చిమోత్తరముగ నొక విహారము కలదు. దాని ఉత్తరపుగోడకు 10అడు

గుల చతురముగల ఆరు గదులున్నవి. వాని యెదుట పైన కప్పును, కింద చపటాను గల ఒక వరండా కలదు. ఇది బహుశః కర్ర స్తంభములమీద ఆని ఉండియుండును. తూర్పు గోడకును కొన్నిగదులు కలవు. పడమటి గోడలో ఒకేగది ఉన్నది. ఈవిహారము మధ్య 19అడుగుల వ్యాసముగల చైత్యమొకటి ఉన్నది.

పై విహారమునకు దక్షిణముగ రెండుచైత్య గృహములు ఉన్నవి. ఇవి తూర్పుపడమరలుగ నున్నవి. దిబ్బపడమటకొనను మరియొక చైత్య మున్నది. దీనిచుట్టును ఒకవిహారము కలదు. ఈచైత్యమునకు దక్షిణదిక్కున ముందుకు వచ్చు వేదిక ఒకటి ఉన్నది. దీనిముందునుండి క్రిందికి పోవుటకొక మెట్లవరుస కలదు.

తర్వాత పేర్కొనదగినవి నేలమాళిగలు. ఇవి అనేకములు ఇచట బయలుపడినవి. వీనిలో కొన్ని విడివి, మరికొన్ని జంటలు. వీని లోతు 5నుండి 25అడుగులవరకును కలదు. అన్నిటి అడుగుభాగమును చపటా చేయబడినది. ఈ మాళిగలలో నాణెములు, ముద్రికలు, నాణెములమూసలు దొరికినవి. బహుశః ఆనాటి ప్రజలు విలువగల వస్తువులను వీటిలో జాగ్రత చేసికొనుచుండెడివారేమో !

కొండాపురిశిథిలములలో అనేకరకములైన మృత్పాత్రలు దొరికినవి. వీనిలో చట్టీలు, బొచ్చెలు, కుండలు, బానలు, దీపపుసెమ్మెలు, ధూపవాహికలు మొదలగునవి కలవు. ఇవి 7అంగుళములు ఎత్తు, 10_18 అంగుళముల వ్యాసము మొదలు ౪అడుగుల యెత్తు 9అడుగుల వ్యాసము వరకును కలవి. ఇందు కొన్ని నేలమీద విడిగ ఉన్నవి. కొన్ని భూమిలో పాతబడియున్నవి. కొన్ని పాత్రలు నిరాడంబరముగ నున్నవి. కొన్నిటిమీద రంగులును, చిహ్నములు నున్నవి. పల్చని పాత్రలకు ఎర్రటి రంగును, లేత నీలిరంగును కలవు. కొన్నిటిమీద Red Oxideను, మ్యాంగనీసును కలిపిన ముదరబూడిదరంగు వేయబడినది. ఇట్టివి నీరు ఇంకనివై ధాన్యము, పప్పులు మొదలగువానిని జాగ్రతపెట్టుకొనుట కుపయోగించెడివి. కొన్నిటికి లోభాగమున నలుపు రంగును, వెలుపల ఎరుపును ఉన్నవి. ఈపాత్రల మీద రకరకముల చిత్రములును, చిహ్నములును, నగిషీలును కలవు. కొన్నిటిమీద రేఖలు కలవు. కొన్నిటిపైన త్రిరత్నచిహ్నము కలదు. మరికొన్నిటిపైన అర్ధకమలమును, కొన్నిటిమీద పూర్ణకమలము నున్నవి. ఇంకనుకొన్నిటిమీద ధర్మచక్రము కలదు.

ఇచ్చట దొరికిన అమూల్యములగు వస్తువులు మృత్ప్రతిమలు. వీనియందు అద్భుతమైన శిల్పకౌశలము కనిపించుచున్నది. ఈ బొమ్మలలో రెండురకములు కలవు. అందు ఒకరకము లోపల బోలుగనున్నవి. వీటిని కెయొలిన్ (Kaolin) అను మెత్తని తెల్ల మట్టిని మూసలలో పెట్టి, ముందువైపు ఒకభాగమును, వెనుకవైపు ఒకభాగమును వేర్వేరుగ అచ్చులు తీసి పిమ్మట ఈరెండుభాగములను అతికి తయారు చేసిరి. అందువలననే కొన్నిబొమ్మల లోభాగమున వ్రేళ్ళ ముద్రలు కనిపించుచున్నవి. వీనిపైన ఎరుపు, ఆకుపచ్చ, పసుపుపచ్చ రంగుల ఆనవాళ్ళు ఇంకను నిలిచి ఉన్నవి. అనేకములగు స్త్రీపురుషవిగ్రహములును, జంతువుల బొమ్మలు నిట్లు తయారు చేసినవి కలవు. రెండవరకపు బొమ్మలు బంకమట్టిని ఇసుకను కలిపి చేతులతో తయారు చేయబడినవి. వీనిలోపల బోలు లేదు. ఇవి

మిక్కిలి మోటుగ నున్నవి. మొదటిరకపు బొమ్మలలో చక్కని కళ ఉన్నది. వీనిలో కొన్నిటి నీక్రింద వర్ణించుచున్నాము :—

(1) బోధిసత్త్వునిముఖము :— మనోహరమగు నీముఖము ప్రశాంతగంభీరభావమును సూచించుచున్నది. నుదుటిపై గుండ్రని రెండు వరసల అలక లున్నవి. నడినెత్తిని అయిదు పాయలుగ శిరోజబంధమున్నది. తల వెనుకభాగమంతయు గుండ్రని అలకలతో నిండియున్నది. చెవులకు కర్ణభూషణము లున్నవి.

(2) మరియొక బోధిసత్త్వునిశిరము:—దీని ముఖమైఖరి ప్రసన్నభావమును సూచించుచున్నది. ఇందలి శిరోభాగమంతయు చక్కని యుష్ణీషముచే కప్పబడినది. నుదుటిమీద మధ్యను ప్రక్కలకును మూడు గుండ్రని మణు లున్నవి. నడినెత్తిని మరియొక ఆభరణ మున్నది. చతురస్రముగనున్న దీనినుండి ఏడు వరుసల సరములు వ్రేలాడుచున్నవి. ఆపైన నడినెత్తిని ముత్యముల వరుసలు గల కిరీటము వంటి భాగమున్నది. వెనుకభాగమునను సరములుండి, దానిక్రింద అడుగువరకును రెండు కమలములును ఇతరనగిషీయు ఉన్నవి. ఈ యుష్ణీషము టోపి వలె తొడగబడినదని స్పష్టమగుచున్నది.

(3) యక్షవిగ్రహములు:—వీనిముఖమున మందహాస మున్నది. కేశములు ప్రక్కలకు చెవులమీదుగ గిరజాలు తిరిగియున్నవి. నడినుదుట నొకముఖమున నలుపలకలదియు, మరిరెండుముఖములపైన వర్తులాకారము కలదియు రెండురకముల లలాటికలు కలవు. వీటి శిరస్సులమీద మూడురకముల ఉష్ణీషము లున్నవి.

(4) మరియొక యక్షశిరస్సు:—ఇది అన్నిటి కంటెను మనోహరముగ నున్నది. నుదుట మూడు బొట్లు ముక్కోణాకారముగ నున్నవి. నడినుదుటిపై భాగమునుండి అటునిటు నాలుగువరుసల తీగలవలెనున్నవి. వీనిపైభాగమంతయు రెండుప్రక్కలను వలయములతో నిండియున్నవి. నడినెత్తిన సర్పశీర్షమువలె నున్నది. చెవులనుండి ఒక్కొకవైపున రెండేసి గుండ్రటి ఆభరణములు వ్రేలాడుచున్నవి. పెదవులమీద మందహాసము గాంచనగుచున్నది.

(5) కుబేరుని ప్రతిమ:—ఇది మొదటిలో పూర్తియైన విగ్రహమై యుండును. దీనితలపై నున్న యుష్ణీషము పైన పేర్కొనినవానికంటె భిన్నముగ నున్నది. దీనిచుట్టును 6వరుసల పూసలసరములవలె నున్నది. మధ్యభాగమున వంపుగ అర్ధచంద్రాకృతిలో ఒకతీగయు, ఒక పూసలసరమునువంతుస నెన్నియో కలవు. ప్రక్కలను వెనుకభాగమునను ఈయుష్ణీషము నుండి వెడల్పుగల అంచుఉన్న సన్నని వస్త్రము వ్రేలాడుచున్నది. చెవులకు కములములవంటి కర్ణిక లున్నవి. మెడలో రెండు వరుసల ముత్యములసరములున్నవి. దండలకు చక్కని దండకడియములు కలవు. ముంజేతులకు ఐదారువరసల కంకణములును మురిడీ గొలుసులు నున్నవి. ఉదరమున యజ్ఞోపవీతమువలె వెడల్పయిన ఆభరణవిశేష మున్నది. నడుమునకు మూడువరుసల సరములో, తీగెలో గల పట్టా ఉన్నది. ఆభరణములు నుష్ణీషమును ముందునువెనుకనుకూడ చక్కగ తీర్చియున్నవి. శరీరమునందలి అవయవములును, కండరములును తీర్చిదిద్దినట్లు, సహజముగ కనిపించుచున్నవి.

(6) హారీతిప్రతిమ:—సర్వాంగసుందరయు, సర్వాభరణభూషితయునగు నొక స్త్రీ యెడమ కాలుఅడ్డుగ మడచుకొని, కుడికాలుక్రిందకు వ్రేలవేసుకొని కూర్చొనియున్నది. ఆమెఎడమ తొడపైన చక్కని బాలుడొకడు కూర్చొని యున్నాడు. ఎడమచేతితో అమె అతనిని పట్టుకొని యున్నది.

(7) సింహము:— ఇది కొంచెము మోటుగ నున్నది. కాని ముఖము బాగుగ తీర్పబడినది. మెడమీద జూలుకు బదులుగ ఎనిమిదివరసల వంకరలుగల సరముల సముదాయము ఒక పట్టీవలె అమర్పబడినది.

(8) గుఱ్ఱము:—చక్కని జీనుతోను ఇతరాలంకారములతోను మిక్కిలి అందముగ నున్నది.

(9) ఎద్దు:—ఈబొమ్మ కొండాపురమున దొరికిన జంతుప్రతిమలన్నిటికంటెనుకూడ మిక్కిలి మనోహరముగను, జీవకళ ఉట్టిపడునదిగను ఉన్నది. ముఖము గంభీరముగ నున్నది. కొమ్ములకును, మెడకును మనోహరములగు నలంకారములు కలవు. మూపు చక్కగ తీర్పబడి దానికిని భూషణములమర్పబడినవి. ఈజంతువు మంచిబలిష్ఠముగ నున్నది.

ఈకొండాపురశిథిలములలో నాటి ప్రజలు ధరించిన ఆభరణము లెన్నియో దొరికినవి. ఇవి విలువైన రాళ్ళతోను, వెండిబంగారములతోను, దంతముతోను, రాగితోను, శంఖముతోను చేయబడి అనేక ఆకృతులు, పరిమాణములు కలవిగనున్నవి. పదార్థము వేరైనను శంఖముతోను, మట్టితోనుచేయబడిన ఆభరణములు శిల్పకౌశలమున వెండిబంగారు నగలతో సమానములుగ నున్నవి. వీనిలో కంఠమాలలు, మేఖలలు, కర్ణభూషలు, శిరోభూషణములు పలురకములవి కలవు. ఇవిగాక అనేకవందలరకముల రంగురంగుల పూసలతో చేయబడిన ఆభరణములు వేలకొలది ఉన్నవి. నేటి కంసాలులకు సహిత మాశ్చర్యముకలిగించు అనేకవిధముల చిత్రములును, పనితనముగల గాజులున్నవి. ఇవిగాక బహువిధములు, బహురూపములునైన రక్షరేకులును, తాయీజులును కూడ నిచట దొరికినవి. ఇందు కొన్నిటియందు రోమనునాణెముల మృదనుకరణము లున్నవి.

పణిగిరి*:—పణిగిరిగ్రామము నైజాం రాజ్యములో సూర్యాపేటకు పోవు రోడ్డుమీద జనగాంరైలుస్టేషనుకు 30మైళ్ళదూరమునందున్నది. గ్రామమున కొకమూలగ సుమారు 500అడుగుల ఎత్తుగల కొండ కలదు. ఈకొండమీద తుప్పలు మొలచి యుండెడివి. ఇక్కడ నేవియైనను పురాతన వస్తువులును, శిథిలములు నుండునేమో అను అనుమానముతో ఈకొండను పరిశీలింపగా పెద్దపెద్ద ఇటుకలముక్కలును, పాతకుండపెంకులును కనిపించినవి. వీనినాధారముగ చేసికొని పైపైన కొంచెముగ ఖననము చేయబడెను. దానికి ఫలితముగ సాతవాహనయుగమునాటి బౌద్ధశిథిలము లెన్నియో లభించినవి. ఇచటి చలవరాతిస్తంభములు కొన్ని విరుగగొట్టబడి యుండుటనుబట్టి తరువాత కాలమున నెవరైనను ఇచ్చట వర్ధిల్లిన కట్టడములను ధ్వంసముచేసిరా అని సందేహము కలుగుచున్నది.

ఇక్కడి శిథిలములలో ముఖ్యమైనది ఒక సమచతురమైన భాగము. దానిమీద ఇటుక

* JAHC. vol. . pp. లో శ్రీ ఖాజామహమ్మద్ అహమద్ గారి వ్యాసము.

లతో కట్టబడిన భవనములు కలవు. వీని చుట్టును బలమైన ప్రాకార మున్నది. గోడ లోభాగమున ఒకవిశాలమైన ప్రాంగణము కలదు. దానికి మూడువైపుల చిన్నచిన్న గదులున్నవి. ఇవి బహుశః భిక్షువులు నివసించు గదులు కావచ్చును. అగుచో ఇది యొక విహారమగును. ఈగదులలో ఎన్నియో పెంకులు దొరికినవి. వీటిపైకప్పు వెదురుతో నేయబడి పెంకులతో కప్పబడెనని తోచుచున్నది. ఈకట్టడములలో నుపయోగింపబడిన ఇటుకలు చాలపెద్దవి. అందు కొన్ని 2అడుగుల పొడుగును 1అడుగు 3 1/2అంగుళముల వెడల్పును కలిగియున్నవి. వీనిలో అక్కడక్కడ గీతలును గుంటలును ఉండుటను బట్టి ఊక గడ్డి కలిపి తొక్కిన బంకమట్టితో ఇవి చేయబడినవని ఊహింపనగుచున్నవి. ఈ స్థలమున ఎన్నియో సాతవాహనయుగపు నాణెములు దొరకినవి.

పణిగిరిలో చక్కని శిల్పఖండములు కొన్ని లభించినవి. ఇందు ఒకపురుషుని బొమ్మ మిక్కిలి ముఖ్యమైనది. నడుముపై భాగము మాత్ర మిందు కలదు. దీనిలో నరములును, కండరములును చక్కగ తీర్పబడినది. చెవులకు బరువైన ఆభరణము లేవియో ఉండుట వలన అవి క్రిందకు సాగియున్నవి. నుదురు మీద నేదియో పుష్పమాలిక చుట్టినట్లున్నది. ముఖము ప్రశాంతగంభీరభావమును సూచించుచున్నది. ఇక్కడ దొరికిన రెండవశిల్పము ఒకప్రాకారములోని ఫలకము. ఇది యంతయు మనోహరముగ చెక్కబడినది. దీనిపై అంచున గల అడ్డకమ్మిమీద తామరతీగ ఉన్నది. అందు రెండేసి కమలముల మధ్య అత్యుత్సాహముగ తోకను శరీరముమీదికి మడుచుకొని పరుగెత్తుచున్న సింహములు కలవు. మూడు నిలువుకమ్ములలో కొనలనున్న వాని మీద పైనను క్రిందను అర్ధకమలములును మధ్య అరుముఖముల స్తంభ భాగమును కలవు. మధ్యకమ్మిమీద అడుగునను పైనను అర్ధకమలమును, మధ్య పూర్ణకమలము నున్నవి. మధ్యకమ్మికి రెండువైపులనుగల ఖాళీస్థలమున రెండు పూర్ణకమలము లున్నవి. మూడవశిల్పము స్తూపవేదికచుట్టునుగల ఫలకములలో నొకటి కావచ్చును. దీని అంచుల మీద చక్కని చెక్కడపుపని ఉన్నది. మధ్యలో ఉష్ణీషమును అనేకాభరణములను ధరించి పెద్ద ఉదరముతోనున్న వామనుని బొమ్మ ఉన్నది. బహుశః ఇది కుబేరుని బొమ్మఅయినను కావచ్చును. దీనిలో కడు సూక్ష్మములైన వివరములు సహితము మనోహరముగ చిత్రింపబడినవి. ఇవిగాక మరియొక స్తూపప్రాకారఫలకము దొరికినది. దీనిమీద చక్కని రేఖాశిల్ప మున్నది.

పైపైన చేసిన ఖననపరిశోధనయే ఇంతవిలువైన వస్తువులను లభింపచేసినది. ఈస్థలమును జాగ్రతగను, యథావిధిగను పరిశీలించినచో ఇంకను ఎన్నియో అమూల్యములగు వస్తువులు లభించితీరును. ఇది సాతవాహనయుగమున నొక మహానగరముండిన స్థలమని తెలియనగుచున్నది.

గాజులబండ :—ఈపేరుగల గుట్ట నైజాం రాజ్యములో నల్లగొండజిల్లాలోని సూర్యాపేటతాలూకా ఏటూరుగ్రామమున జనగాం రైలుస్టేషనునుండి సూర్యాపేటకుపోవురోడ్డుకు ప్రక్కగ నొకమైలుదూరమునం దున్నది. దీని

* I bid

కిని పణిగిరికిని ఐదుమైళ్ళదూరము. ఈగుట్ట సుమారు 50 అడుగుల యెత్తు గలది, బహు విశాలమైనది. ఫణిగిరిలోవలెనే దీనిపైన ఇటుకలు, చిళ్ళపెంకులుగల కుప్ప లుండెడివి. ఈ చిళ్ళపెంకులలో కొన్ని రంగులువేయబడినవి, మరికొన్ని చిత్రములు కలవి. ఒకవైపున ఏనుగ, రెండవవైపున స్వస్తిక గల సాతవాహననాణెము ఈకుప్పలలో నొకదానియందు దొరికినది. మరియొక కుప్పలో మూడడుగుల చతురస్రముగనున్న కుండపెంకు లభించినది. దీనిమీద బ్రాహ్మీలిపిలో మూడక్షరము లున్నవి. ఇవి క్రీ. శ. 1, 2 శతాబ్దులనాటి లిపిలోనివి అని నిర్ణయింపబడినవి. ఈఅవశేషములనుబట్టి యీస్థలము ఆంధ్రసాతవాహనయుగమునాటిదని నిస్సందేహముగ చెప్పవచ్చును.

ఈగుట్టలో దక్షిణ భాగమున ఒక స్తూపము బయలుపడినది. దీని అడుగుభాగము 30 అడుగులవ్యాసము కలిగి చక్రమువలె నున్నది. దీనిమధ్యనుండి అంచులవరకును ఆకులు కలవు. గుట్టపడమటివైపున ఒక చైత్యగృహాపు పునాదు లున్నవి. ఇది 24 అడుగుల పొడుగును 12 అడుగుల వెడల్పును కలిగి ప్రాఙ్ముఖముగ నున్నది. పశ్చిమోత్తరదిశను మరియొకస్తూపము యొక్క పునాదు లున్నవి. 2 అడుగుల పొడుగు, 1 అడుగు వెడల్పు 3 అంగుళములమందముగల ఇటుకలతో ఇచటి కట్టడములు నిర్మింపబడినవి.

ఇక్కడ దొరికిన చిళ్ళపెంకులు విలక్షణమైనవి. పై అడుగుపొరలు గట్టిగను, లోభాగము మెత్తగను ఉండును. కాల్చినతర్వాత వీనికి లేతనలుపురంగు వచ్చును. కొన్నిటిమీద ముదురు ఎరుపురంగు కలదు. వీనిపైన అనేకరకముల రేఖాచిత్రము లున్నవి.

ఇవికాక గాజులబండకొండమీద ఎన్నియో మృత్ప్రతిమలు దొరికినవి. వీనిలో మనుష్యుల తలలు పరమాద్భుతములుగ నున్నవి. వీని ముఖలక్షణములు చక్కని పనితనమును చూపును.

ఇచటకూడ యథావిధిగ ఖననాదిపరిశోధన జరిగినచో అమూల్యములగు శిల్పములు బయల్పడలుననుటకు సందేహము లేదు.

## ౪. సాంచీస్తూపద్వారములు*

ప్రాచీనభారతీయశిల్పక్షేత్రములలో సాంచీ మిక్కిలి ముఖ్యమైనది. అశోకమౌర్యునికాలమున ప్రారంభమైన ముగ్ధవాస్తుశిల్పములనుండి క్రీ. శ. 11వ శతాబ్దినాటి అన్హిల్‌వాడ్ చాళుక్యుల స్నిగ్ధశిల్పములవరకును గల వాస్తుశిల్పవైచిత్రి ఇచ్చట గాంచనగుచున్నది. ఇచ్చట ఇన్నిరకముల వాస్తుప్రలును శిల్పములును ఉన్నను వీటిననిన్నటిని తలదన్ననవి ఇచటి నాలుగు ద్వారములు. తరతరముల శిల్పాచార్యులు ఈపవిత్రక్షేత్రమున కృషిచేసియుండినను ప్రాచీనాంధ్రశిల్పుల కళాసృష్టికి వారందరి కళాకృషియు జోహారు చేయుచు

* ఈసాంచీస్తూపమును గురించి కన్నింగుహాం, మార్షలు, హావెలు, కుమారస్వామిమున్నగు పండితు లెందరో అనేక వ్యాసములను, గ్రంథములను వ్రాసియున్నారు. ఇటీవల మార్షలు సాంచీస్తూపమును సవివరము

న్నది. మనోహరములైన సాంచీద్వారములు ఆంధ్రసాతవాహనసామ్రాజ్యకాలపు ఆంధ్ర శిల్పుల అసమానకల్పనాకౌశలమునకును, భావనావైచిత్రికిని నిరుపమాననిదర్శనములు.

సాంచీగ్రామము నేటి భోపాల్‌సంస్థానమున దీవాల్‌గంజి సబ్‌డివిజన్‌లో భీల్సాకు 5 1/2 మైళ్ళదూరమునం దున్నది. ఈభీల్సాకు దగ్గరగ బేస్ బేత్వానదుల సంగమము వద్దనే సుప్రసిద్ధమైన విదిశానగర మున్నది. ఇది ఆకర అను విభాగమునకు రాజధాని. సాంచీ గ్రామమును, శిథిలములును 300 అడుగుల యెత్తుగల కొండమీద నున్నవి. సాంచీ యొక్క ప్రాచీననామము కాకనావ లేక కాకనాయ. క్రీ. శ. 7వశతాబ్దినాటికి సాంచీకొండ శ్రీపర్వతమని ప్రసిద్ధిచెందినది. క్రీ. పూ. 4వ శతాబ్దినాటికే ఇచ్చట కొందరు బౌద్ధులు నివాసము లేర్పరచుకొనిరి. అశోకచక్రవర్తి ఈస్థలమునెడ మిక్కిల శ్రద్ధ వహించెను. ఇచట నతని శాసనమొకటి గలదు. అది యవనసాంప్రదాయమునను సరించి నిర్మింపబడిన ఒక శిలాస్తంభముమీద చెక్కబడినది. మౌర్యసామ్రాజ్యపతనానంతరము శుంగరాజులకు విదిశ ఒక ఉపరాజధానిగ నుండెను. ఆ కాలపు శిల్పము లెన్నియో సాంచీస్తూపములలో గాంచనగుచున్నవి. క్రీ. పూ. 1వశతాబ్దిలో ఈప్రాంతమున శుంగులప్రతిభ అంతరించినది. ఆంధ్రసాతవాహనులు ఆకరరాజ్యమునకు ఏలికలైరి. ఇచటి మహాస్తూపము యొక్క దక్షిణద్వారముమీద దానిస్తంభమొకటి సాతకర్ణి కార్మికులనాయకుడగు వాసిష్ఠీపుత్రఆనందుని ధర్మమని తెలుపుశాసనమొకటి కలదు. ఈసాతకర్ణి సాతవాహనరాజులలో ఆరవవాడగు రెండవసాతకర్ణి అని పండితులు నిశ్చయించియున్నారు. అంతేకాక ఈరాజువిగనే పరిగణింపవలసిన గజవృషచిహ్నములుగల నాణెములు కొన్ని విదిశవద్ద దొరికినవి. సాంచీ చరిత్రలో ఈసాతకర్ణి పరిపాలనాకాలము స్వర్ణయుగము. ఈకాలముననే ప్రాచీనభారతీయశిల్పకళ ఒకపరమావధిని గాంచినది. ఈకాలముననే సాంచీలోని వాస్తువులలోనెల్ల అగ్రగణ్యములగు మహాచైత్యద్వారములు నాలుగును నిర్మింపబడినవి. మౌర్యశుంగవాస్తువులును శిల్పములును ఇంతకు బహుకొద్దికాలమునకు పూర్వపువే అయినను వాటికిని ఈ ఆంధ్రశిల్పములకును కళాదృష్ట్యా హస్తిమశకాంతర మున్నది. ఈసాంచీ ద్వారములమీదగల శిల్పవైవిధ్యమును, కళానైపుణ్యమును వాటినిర్మాతలు సిద్ధహస్తు

---

గను, సచిత్రముగను వర్ణించుచు వ్రాసిన ఉద్గ్రంథ మొకటి మూడు సంపుటములుగ ముద్రింపబడినది. ఇదిగాక ఈయనదే Guide to Sanchi అను చిన్న పుస్తక మొకటి కలదు. V. A, Smith పండితుడు తన History of Fine Art in India and Ceylon అను గ్రంథమున సాంచీని గురించి వ్రాసి కొన్ని చిత్రములను చేర్చినాడు. సాంచీ శిల్పములు ఈ క్రింది గ్రంథములలో గాంచనగుచున్నవి. Marshall—Guide to Sanchi - pp. I, VI. సాంచీస్తూపము ప్రాగ్దక్షిణమునుండి కనపడునట్లు, pp. II ఉత్తరద్వారము; pp. III పశ్చిమద్వారము - తామరతీగె; pp. IV దక్షిణద్వారముమీది చద్దంత జాతకము, బుద్ధావశేషములకై జరగిన తగవు; pp. V పశ్చిమద్వారముమీది ఇవే దృశ్యములు— V. A. Smith—Hish. Art. Ind; Ceylon—pp. 10. సాంచీ పశ్చిమద్వారము లోవైపు; pp. 11 ప్రాగ్ద్వారము లోవైపు; pp. 12 ప్రాగ్ద్వారము స్తంభములు లోవైపు; pp. 13 ప్రాగ్ద్వార స్తంభములు, వెలుపలివైపు.

లైన శిల్పాచార్యులని వేనోళ్ళ చాటుచున్నవి. ఇంతకుపూర్వపు శిల్పములలోగల అభిముఖ దృష్టిప్రాధాన్యతయు, స్మృతిచిత్రణమును ఈ శిల్పమున కానరావు. ఇచటి ఆంధ్రశిల్పులు ప్రకృతిని చక్కగ పరిశీలించి, మానవకోటి యొక్క వివిధాంగవిన్యాసములను తత్ఫలితముగ నేర్పడు రేఖావలయసంపదను సూక్ష్మదృష్టితో గమనించి వ్యక్తులను సహజస్థితులలో చిత్రించియు, సాముదాయక చిత్రణమున ఒకతూకమును కుదిర్చియు, దృశ్యములకు క్రొత్తలోతులను విస్తీర్ణతను ఘటించియు శిల్పమునకు నవ్యత్వమును చైతన్యమును కల్పించిరి. ఈశిల్పములలో కొంతవరకును కొన్ని కొన్ని విదేశీయసాంప్రదాయముల ఛాయలు కనిపించుచున్నవి. కాని ఈశిల్పులు వాటి ప్రాశస్త్యమును పూర్తిగ గ్రహించి వాటిని దేశీయ సాంప్రదాయములతో చక్కగ మేళవించి వానిని తమవానిగ చేసికొనిరి. అయినను ఈవిదేశీయసంపర్కము బహు కొద్దిగ కన్పించుచున్నది. మొత్తము మీద ఇది దేశీయము, ఈఆంధ్రశిల్పుల ఉపజ్ఞానిర్మితము. ఇందు వారి మతవిశ్వాసములు, ప్రకృతిపరిజ్ఞానమును ప్రతిబింబించుచున్నవి. ఇందలి ప్రతిశిల్పమునందును శిల్పియొక్క మతాభినిరతియు, కళాకౌశలమును పరిపూర్ణమగు స్వేచ్ఛయు గాంచనగుచున్నవి. మధ్యయుగ శిల్పులవలె ఈనాటిశిల్పులు పరంపరాగతములగు నియమములకు బద్ధులై అనుకరణసృష్టి చేయలేదు. ఒక్క కథావస్తువుమాత్రము అన్యముగాని దానిచిత్రణమునకు సంబంధించిన కలాపమంతయు శిల్పియొక్క ఉపజ్ఞానిర్మితమే. ఇది యీసాంచీద్వారశిల్పముల విశిష్టత.

సాంచీలో పరమప్రధానమైనది మహాచైత్యము. దీనిచుట్టునుగల ప్రాకారమున నాలుగు దిక్కులనే పైన పేర్కొనబడిన నాలుగు ద్వారములు నున్నవి. ఈమహాచైత్యమును ప్రథమమున అశోకచక్రవర్తి నిర్మింపజేసెను. ఇందు ఒక వేదికయు, దానిపైన ఒక అండమును, దానిమీద నొక పేటికయు, దానిమీద నొక ఛత్రము నుండెడివి. ఛత్రము వరకును గలభాగమంతయు ఇటుకలతో కట్టబడెను. వేదిక అంచుకును అండమునకును నడుమగల భాగము ప్రదక్షిణమార్గముగ నుపయోగపడుచుండెను. దీనినెక్కుటకు దక్షిణమున రెండు మెట్లవరుస లుండెడివి. వేదికకు కొంతదూరమున చుట్టును ఒక రాతిపిట్టగోడ ఉండెడిది. వీనిమధ్యభాగము మరియొక ప్రదక్షిణపథముగ నుండెను. ఇందు నాలుగు దిక్కులను నాలుగు ఖాళీలుండి వాటి కిరువైపులను అడ్డగోడ లుండెడివి. శుంగుల కాలమున చైత్యము చుట్టును ఒక శిలాప్రాకారము కట్టి, మధ్యభాగమును రాళ్ళకంకరతోను, మట్టితోను నింపి చైత్యమును వెడల్పు, ఎత్తు చేసిరి. అందువలన అండముమీద మరియొక ప్రదక్షిణపథమును నిర్మింపవలసి వచ్చినది. చుట్టును అదివరలోనుండిన దారుప్రాకారమును తీసివేసి శిలాప్రాకారమును ఈకాలముననే నిర్మించిరి. ఆమీద క్రీ. పూ. 1వశతాబ్దిలో నాలుగుదిక్కులను మనోహరములగు ద్వారములు నిర్మింపబడినవి.

ఈనాలుగుద్వారములలో దక్షిణద్వారము మొట్టమొదట నిర్మింపబడినది. ఆమీద వరుసగ ఉత్తర ప్రాక్పశ్చిమద్వారములు నిర్మితములైనవి. వీటిశిల్పముల స్వభావమునుబట్టియు, వీనిలో రెండుమూడుద్వారముల వివిధభాగ

ములను ఒకవ్యక్తియే చెక్కించియుండెనని వీనిపైగల శాసనములు తెలుపుటనుబట్టియు ఇవి బహుకొద్దికాలముననే ఒకేసాంప్రదాయమునకు చెందిన ఒకేపురుషాంతరపు శిల్పులచే నిర్మింపబడినవని నిస్సందేహముగ చెప్పవచ్చును.

ద్వారములన్నియు ఒకేవిధముగ నున్నవి. వీనిలో రెండు సమచతురస్రములగు స్తంభములు. వీనిపైన శీర్షికలు, శీర్షికలపైన ఒకదానిమీద ఒకటిగ మూడు అడ్డకమ్ములు, ఈకమ్ములమధ్య చతురస్రములగు బంధములు, మూడునిలువు కమ్ములు, కమ్ములచివరల సింహములు, మధ్యలో ఏనుగులు, గుఱ్ఱములు, పైకమ్మి మీద రెండువైపులను ధర్మచక్రత్రిరత్నములు, మధ్యలో ధర్మచక్రము ప్రతిద్వారమునను గాంచనగుచున్నవి. మిగిలినభాగమంతయు బౌద్ధజాతకకథలలోని దృశ్యములతో నిండి యున్నది. అడ్డుదూలముల కొనలనున్న జంతువులును, స్తంభశీర్షికలపైనగల ఏనుగులును, వానికి ఐమూలగ పైదూలమును మోయుచున్నటులున్న యక్షిణీ విగ్రహములు మిక్కిలి మనోహరములుగనున్నవి. శిల్పములలో విరివిగ గాంచనగు రేఖాచిత్రములు అద్భుతములుగ నున్నవి. బుద్ధునిజీవితములో ముఖ్యఘట్టములగు జననము, మహాభినిష్క్రమణము, మారధర్షణము, మహాసంబుద్ధి, ధర్మచక్రప్రవర్తనము, మహాపరినిర్వాణము ప్రాయకముగ నీద్వారశిల్పములలో గాంచ నగుచున్నవి.

### దక్షిణద్వారము

మొదటిఅడ్డదూలము — ముందువైపు:— ఈదూలము మధ్యలో బుద్ధుని జననము అందముగ నిరూపింపబడినది. దృశ్యముమధ్య నొక తామరపువ్వుమీద మాయాదేవి నిలచి యున్నది. ఆమెకు ఇటునటు రెండుఏనుగులు నిలచి, తొండములు పైకెత్తి కుంభములతో ఆమెమీద నీళ్ళు పోయుచున్నవి. దూలము మీది తక్కినభాగమంతయు తామరతీగె అల్లిక ఉన్నది. ఇందు ఆకులకును పువ్వులకును మధ్య ఎన్నోపక్షులు వివిధగతులలో శిల్పింపబడినవి.

మొదటిఅడ్డదూలము — వెనుకవైపు:— ఈదూలముమధ్య వరుసగా నాలుగు వృక్షములును, మూడు చైత్యములును కలవు. ఇందు ప్రతిదానికిని ముందు ఒక శూన్యసింహాసనమున్నది. వీనిచుట్టును ఆరాధకులగు మనుష్యులును, దేవతలును కలరు. ఈవృక్షములును చైత్యములును కలసి గౌతమబుద్ధుని, అతనికి పూర్వముండిన ఆర్గురు మానుషీబుద్ధులను సూచించుచున్నవి. బుద్ధులలో నొక్కొకరు ఒక్కొక వృక్షముక్రింద సంబోధి నందిరి. క్రకుచ్ఛందుడు శిరీషవృక్షము క్రిందను, కనకముని ఉదుంబరవృక్షము క్రిందను, కాశ్యపుడు న్యగ్రోధము క్రిందను, శాక్యముని బోధివృక్షముక్రిందను బుద్ధులైరి. ఈశిల్పమునందలి నాలుగు చెట్లును ఈవృక్షములే. రెండేసి చెట్లకు మధ్య నొక చైత్యమున్నది. వీనిలో మధ్యనున్న చైత్యముయొక్క అండముమీద మూడుపంక్తులలో (1) రాజో సిరి సాతకణిస (2) ఆవెసణిస వాసిఠీపుతస (3) ఆనందస దానం" అను బ్రాహ్మీలిపిలోని శాసనమొకటి కలదు. ఈదూలము రెండు చివరలను సముచితపరివారముతో, పైన శ్వేతఛత్రముతో ఒక గుఱ్ఱము నగరద్వారమును దాటి పోవుచున్న దృశ్యము ఉన్నది. ఇది గౌతముడు కపిలవస్తు

నగరమును వీడి కంథకమను తన అశ్వముపై మహాభినిష్క్రమణము చేయు ఘట్టము.

మధ్యఅడ్డదూలము — ముందువైపు :— బుద్ధదేవుని అవశేషములను మొదట ఎనిమిది భాగములు చేసి నిక్షేపించిరట. అశోకుడు ఇందు ఏడుభాగములను తీసుకొని మరల విభజించి వాటిపై 84000 స్తూపములు కట్టించెనట. ఎనిమిదవభాగము రామగ్రామమునందుండెను. దానిని రక్షించుచున్న నాగులు దానిని కదల్పనీయలేదు. అందువలన అశోకుడు తానే రామగ్రామమునకు యాత్రచేసి అచటి అవశేషచైత్యము నారాధించి వచ్చెను. ఈఅడ్డదూలము మధ్య ఈదృశ్యము గాంచనగుచున్నది. ఇందు మధ్యలో నొక చైత్యమున్నది. దాని పైభాగమున రెండు వైపులను పుష్పమాలికాహస్తులైన కిన్నరులు కలరు. చైత్యమునకు కుడివైపున గజతురగపదాతివర్గము వెంటరా రథారూఢుడై వచ్చుచున్నఅశోకచక్రవర్తి, ఎడమవైపున చైత్యము నారాధించువారు కొందరును, ఫలపుష్పాదులను తెచ్చువారు కొందరును, ప్రక్కనున్న కొలనునుండి పైకి వచ్చుచున్నవారు కొందరును నాగనాగినులు ఉన్నారు. ఈదూలము యొక్క రెండుకొనలలోను ఏనుగులున్నవి. చక్కని కమలములతో నిండియున్న కొలనులో నడచివచ్చుచున్న ఒక యేనుగు మీద ఒకపురుషుడును ఇద్దరు స్త్రీలును ఆసీనులై ఉన్నారు. మరి ఒక స్త్రీ వెనుకనుండి ఏనుగపైకి ప్రాకి వచ్చుచున్నది. తీరమున అనేకమంది స్త్రీలు ఒకమంటపమున నిలచి ఈదృశ్యమును వేడుకతో చూచుచున్నారు.

మధ్యదూలము — వెనుకవైపు :— ఇచట ఛద్దంతజాతకము శిల్పింపబడినది. బోధిసత్వుడు ఒకప్పుడు షడ్డంతియు మహాబలిష్ఠమునైన గజరాజుగ జన్మించెను. ఈగజరాజు హిమాలయములలో ఛద్దంతమను చెరువు గట్టున నొక వటవృక్షముక్రింద నివసించుచుండెను. అతనికి మహాసుభద్ర, క్షుద్రసుభద్ర అను నిర్వురు భార్యలుండెరి. భర్త పెద్దభార్యయందనురక్తుడగుటచే అసూయాపరయై రెండవభార్య తాను ఉత్తరజన్మలో కాశీరాజు పట్టమహిషి కావలెననియు, అప్పుడు ఈగజరాజుపై కసి తీర్చుకొనవలెననియు ప్రార్థించెను. ఆమె మనోరథము ఈడేరెను. కాశీరాజమహిషి అయిన పిమ్మట నామె అనేకమంది వేటకాండ్రను సమకూర్చి, సోనుత్తరుడను వానిని వారికి నాయకుని చేసి, ఛద్దంతసరస్సుకు పోయి గజరాజును చంపి రమ్మని పంపెను. ఈవృత్తాంత మీశిల్పమున నిరూపింపబడినది. ఇందు ఎడమప్రక్కన కొలనులో నిలచి గజరాజు అందలి తామరపువ్వులతో ఆడుకొనుచున్నాడు. రెండువైపులను రెండేనుగలు శ్వేతఛత్రమును, చామరిని ఎత్తి పట్టినవి. మధ్యలోనున్న వటవృక్షముక్రిందనుండి ఈగజరాజు కుడివైపుకు నడచి పోవుచున్నాడు. సమీపమున ఒక రాతివెనుక నిలచి సోనుత్తరుడు విల్లు ఎక్కుపెట్టుచున్నాడు.

క్రిందిదూలము — ముందువైపు :— ఇది మనోహరమైన చిత్రముగలభాగము. కుంభాండులను కుబ్జులు చేతులతో పుష్పమాలికలు పట్టుకొని ఉన్నారు. వారినోటినుండి చక్కని తామరతీగె వెలుపలికి వచ్చి అటునిటు వలయముకొనుచున్నది. ఈదూలము కొనలను కొండలకును, లతలకును ముందు ఠీవిగ నిలచిన మయూరములు కలవు.

క్రిందిదూలము—వెనుకవైపు :— ఇచ్చట బుద్ధుని అవశేషములకొరకై జరిగిన కలహము చిత్రింపబడినది. బుద్ధుడు కుశీనగర గ్రామమువద్ద మరణించెను. ఆగ్రామవాసులైన మల్లులను తెగవారు అతని అవశేషములు తమకు రావలెననిరి. మరి యేడు ఇతర తెగల వారు అవి తమకు కావలెననిరి. రెండు పక్షములవారికిని ఈవిషయమై తగవు వచ్చెను. ఈశిల్పము మధ్యభాగమున కుశీనగర దుర్గమున్నది. దుర్గద్వారమును సాయుధుడైన యోధుడు రక్షించుచున్నాడు. దాని ప్రక్క గోడక్రింద ఇద్దరుయోధులు పోరాడు చున్నారు. మరి యిద్దరు ద్వారమువైపుకు పోవుచున్నారు. కోట లోపలనుండి కొందరు ఆయుధములను వదలుచున్నారు. దుర్గమునకు కుడివైపున క్రిందివరుసలో గజతురగారూఢు లైన యోధులును, పదాతులును ద్వారము వైపుకు వచ్చుచున్నారు. ఇది కుశీనగరదుర్గపు ముట్టడియొక్క-దృశ్యము. ఎడమవైపు పైవరుసలో ఏనుగులమీదను, క్రిందివరుసలో గజ తురగరథములమీదను కుడివైపు పైవరుసలో గజములమీదను ఎక్కి ఎందరో యోధులు మరలిపోవుచున్నారు. ఇందు ఒక ఏనుగపైని ఛత్రముక్రింద అవశేషపేటిక ఉన్నది. ఇది ఏడు తెగలవారును యుద్ధమున గెలచి అవశేషములను తీసికొని పోవు దృశ్యము.

ఎడమవైపుస్తంభము—ముందువైపు :— ఇది మూడు భాగములుగ నున్నది. ఇందు పై భాగమున మధ్యలో ఒక అంతర్వాలుగల వేదికమీద పొడుగైన స్తంభమున్నది. స్తంభముపైన ముప్పదిరెండుఆకులుగల ధర్మచక్రమున్నది. ఈచక్రము వెలుపలిఅంచున ముప్పది రెండు త్రిరత్నచిహ్నములు కలవు. స్తంభము క్రిందిభాగమున రెండువైపులను స్త్రీజనపరివృతుడైన రాజును, ఇతరభక్తులును నిలిచి ఉన్నారు. వీరు లోకపాలకులు కావచ్చును. ఈవరుసక్రింద ఇటునటు లేళ్ళు గలవు. స్తంభాగ్రమునకు రెండువైపులను చేతులలో పుష్పమాలికలు, యక్షులున్నారు. ఇది బుద్ధుడు జేతవనమున చేసిన ధర్మచక్రప్రవర్తనమునకు చిహ్నము. రెండవభాగమున మంత్రులు ఏనుగులపై నెక్కి అనుసరింప తాను రథముపై నేగుచున్న సిద్ధార్థుడు చిత్రింపబడినాడు. ఇది సిద్ధార్థుని కపిలవస్తునగరసందర్శనము కావచ్చును. అట్టడుగునగల మూడవభాగమున సిద్ధార్థుని శిరోజములు స్వర్గమునకు తీసికొని పోబడుచుండగా వానిని వివిధదేవతలు ఆరాధించుచుండు దృశ్యము కలదు. వీరిలో గజారూఢుడైన ఇంద్రుడును శచీదేవియు కలరు. మనోహరమగు నీదృశ్యమును విదిశావాస్తవ్యుడగు నొకదంతకారుడు చెక్కెనని యిచట నున్న శాసనము తెలుపుచున్నది.

ఎడమవైపుస్తంభము — వెనుకవైపు :— ఇందు మొదటిభాగమున పైయెత్తైన ఒక ఆలయమున్నది. దీనిలోపల నొకసింహాసనమును దానిమీద మూడు త్రిరత్నచిహ్నములును కలవు. దీనిప్రక్కన ఒక బోధివృక్షమున్నది. దానిపైన ఛత్రములును, పుష్పమాలికలును కలవు. దీనిక్రిందిభాగమున పరివారపరివృతుడై ఆలయమునకు పోవుచున్న ఒకరాజు కలడు. దీనిక్రిందగల అట్టడుగుభాగమున త్రయస్త్రింశస్స్వర్గము చూపబడినది. మధ్యలో సిద్ధార్థుని శిరోజములును ఉష్ణీషమును ఉన్నవి. చుట్టును వాటినారాధించుచున్న దేవత లున్నారు.

కుడివైపు స్తంభము – ముందువైపు :— దీనిపై భాగమున బోధివృక్షముక్రింద నొక శూన్యసింహాసన మున్నది. దీనిముందు నాగ రాజగు ముచిలిందుడును అతని నలుగురు భార్యలు నున్నారు. స్తంభము మధ్యభాగ మున బోధివృక్షము. దీనిక్రింద బుద్ధుడున్నట్లు భావన. ఇతనికి రెండువైపులను లోకపాలకులు నిలువబడి భిక్షాపాత్రములను సమ ర్పించుచున్నారు. వారివెనుక వారి పరివా రము. అందొకడు వీణ వాయించుచున్నాడు. అట్టడుగుభాగమున బుద్ధుడు రాజాయతన వృక్షముక్రింద నుండగ నతనికి గొట్టెలను, తేనెను సమర్పించిన తపుస్సభల్లుకులను వణి జులు ఉరువిలవనములో ఎడ్లబండిలో పోవు చున్న దృశ్య మున్నది.

కుడివైపు స్తంభము – లోపలివైపు :— స్తంభాగ్రభాగమున విపశ్యుడను బుద్ధుని సంబుద్ధి కలదు. దాని క్రిందభాగమున బుద్ధుడు తనసంబుద్ధి అయిన నాల్గవవారము నివసించు టకై దేవతలు నిర్మించిన రత్నగృహము, దానిమధ్య శూన్యసింహాసనము నున్నవి. దీని క్రింద భాగమున బుద్ధుని సంబుద్ధి చిత్రింప బడినది. కుడివైపున స్వస్తికుడను కార్మికుడు గడ్డికోయుచున్న దృశ్యము. ఎడమవైపున అతడు కోసినగడ్డిని ఆసనార్థమై బుద్ధునికి సమ ర్పించుచున్న దృశ్యము. మధ్యలో సింహాస నము. నాల్గవభాగమునందు ఈ ఘట్టమే కలదు. చుట్టును స్త్రీపురుషులెందరో ఆరాధ కులు కలరు. అట్టడుగుభాగమున బుద్ధగయలో జరిగిన ప్రదక్షిణాదృశ్యము. మధ్యలో బుద్ధుడు, చుట్టును ఆరాధకులు, పైన నాగదంతములు నుండి వ్రేలాడుచున్న పుష్పమాలికలు.

ఉత్తర ద్వారము.

పైఅడ్డదూలము–ముందువైపు :—మధ్యలో కడపటి ఏడుగురు మానుషీబుద్ధులకును సాంకే తికముగ ఐదుచైత్యములును, రెండువృక్షము లును కలవు. వీని ఎదుటను శూన్యసింహాస నము లున్నవి. చుట్టును ఆరాధకులును, పైన గంధర్వులును కలరు. దీని కొనలను సింహము లున్నవి.

మధ్యఅడ్డదూలము – ముందువైపు :— మధ్యలో ఏడు వృక్షములు, వాటిముందు శూన్యసింహాసనములు, అటునిటు ఆరాధ కులు, పైన యక్షులు. ఈవృక్షములు పాటలీ వటసాలసిరీషఉదుంబరన్యగ్రోధఅశ్వత్థము లు కావలెను.

అడుగుఅడ్డదూలము – ముందువైపు :— దీని కుడిచివర అలంబుసాజాతకము చిత్రింప బడియున్నది. బోధిసత్వుడు ఒకప్పు డొక సన్యాసిగ అవతరించెను. ఒకలేడి అతనిని ప్రేమించెను. కాలక్రమమున దాని కొక పుత్రుడు కలిగెను. అతని కొక కొమ్ము ఉం డుటవలన ఏకశృంగుడని పేరు వచ్చెను. పెద్ద వాడైన పిమ్మట నితడు గొప్ప తపమాచ రించి మహిమను సంపాదించెను. ఇంద్రుడు భయాక్రాంతుడై ఇతని నియమభంగ మొన ర్పుమని అలంబుసా అను అప్సరను పంపెను. ఏకశృంగుడు ఆమెవలలో పడెను. మూడేండ్లు గడచినపిమ్మట నామె తన నిజోదంతమును తెల్పి ఏకశృంగునిచే క్షమింపబడి తిరిగి స్వర్గ మునకు పోయెను. ఈశిల్పములో కుడివైపున ఏకశృంగుడు తామరకొలనులో స్నానము చేయుచుండగ నతని తల్లియగు లేడి వెనుక నిలచిచూచుచున్నది. మధ్యభాగమున నీబా లుడు తండ్రివద్ద విద్యనేర్చుట చూపబడినది.

ఈఅడ్డమూలము మధ్యభాగమున వెస్సంతరజాతక మున్నది. కపిలవస్తులో పుట్టుటకు పూర్వపు జన్మలో బోధిసత్వుడు వెస్సంతరుడను రాజపుత్రుడుగ నుండెను. అతడు మహాదాత. ముందుగ తన ధనమును, పిమ్మట శ్వేతగజమును, రథాశ్వగజములను, తనబిడ్డలను, తుదకు తనభార్యనుకూడ దానము చేసెను. ఈజాతకకథను శిల్పి అద్భుతముగ నిరూపించినాడు. ఈచిత్రము దూలపుముందువైపునను, వెనుకవైపుననుకూడ గలదు. ముందుగ వెస్సంతరుడు గజమును దానము చేయుట కలదు. పిమ్మట నగరబహిష్కృతుడై సకుటుంబముగ రథము నెక్కి అతడు నిష్క్రమించుట కలదు. ఆమీద ఆరథాశ్వములను బ్రాహ్మణుల కిచ్చివేయు దృశ్యము. తర్వాత పాదచారులై అతడును కుటుంబమును పోవుచుండగా స్త్రీపురుషులు మార్గమునకు ఇటునటు నిలచి చూచుచున్నదృశ్యము కలదు. పైభాగమున ఈకుటుంబము నివాసముగ నేర్పరచుకొనిన కుటీర మున్నది.

అడుగుఅడ్డమూలము—వెనుకవైపు:—పైకథ ఇక్కడ అనువర్తింపబడినది. వెస్సంతరుడు కుటీరమును వదలి అడవులలోబడి సకుటుంబముగ వంకపర్వతమునకు పోవుట మొదటి దృశ్యము. కుడి చివర నున్నది. మధ్యభాగమున రాజపుత్రుడు ఆపర్వతముమీద అరటితోటలో నిర్మింపబడిన కుటీరమున నివసించుచున్న ఘట్టమున్నది. పిమ్మట వెస్సంతరుడు తన బిడ్డలను చూజుకుడను బ్రాహ్మణునికి దానము చేయుచున్నాడు. పైభాగమున సింహము, వ్యాఘ్రము, చిరుతపులిరూపములు దాల్చిన ముగ్గురు దేవతలు ఆబిడ్డలతల్లిని నిరోధించుచున్నారు. ఆమె వెనుక నిలచి ఒక విలుకాడు బ్రాహ్మణునిపై బాణము నెక్కుపెట్టుచున్నాడు. క్రిందివరసలో బ్రాహ్మణుడు దండహస్తుడై ఆబిడ్డలను తోలుకొని పోవుచున్నాడు. దీనికి ఎడమవైపున వెస్సంతరుడు తన భార్యను దానము చేయుట, అతని బిడ్డలు తాతగారి యింటికి చేర్చబడుట, ఇంద్రుడు వచ్చి వెస్సంతరునికి అతని భార్యను తిరిగి నప్పగించుట, చిట్టచివర వెస్సంతరుని బిడ్డలు తాతగారియింట ఆడుకొనుచుండుట చూపబడినవి.

మధ్యఅడ్డమూలము – వెనుకవైపు:—దీని మధ్యభాగమున మారధర్షణము చిత్రింపబడినది. ఎడమభాగమున బోధివృక్షముక్రింద శ్వేతఛత్రఛాయను బుద్ధుడు కూర్చొనిన వజ్రసింహాసన మున్నది. ఒకమూలగ అతనికి సంబుద్ధికి ముందు ఆహారమిచ్చిన సుజాత ఉన్నది. క్రిందిభాగమున సేవకపరివృతుడై సింహాసనముమీద కూర్చొనిన మారుడు, బుద్ధవంచనకై అతని అనుజ్ఞ వేడుచున్న అతని పుత్రిక కలరు. బోధివృక్షమువద్ద ఎడమవైపున మారుడు పుత్రికతో కలసి నిలువబడి యున్నాడు. వారికెదురుగ సర్వవ్యసనములకును, కామములకును, భయములకును సంకేతములైన మారుని అనుచరులు భీభత్సహాస్యజనకములగు విధముల చిత్రింపబడి యున్నారు.

పైమూలము – వెనుకవైపు:—దీనిమీద మరల ఛద్దంతజాతక మున్నది.

కుడివైపుస్తంభము – ముందువైపు:— దీనిపైభాగమున బుద్ధుడు తనతల్లి మాయాదేవి ఉన్న త్రయస్త్రింశస్వర్గమునకు పోయి, ధర్మబోధచేసి తిరిగి వచ్చు ఘట్టము చెక్కబడియున్నది. దృశ్యము మధ్యలో నొక

నిచ్చెన కలదు. దాని అగ్రమున బోధివృక్షమును, శూన్యసింహాసనమును కలవు. నిచ్చెన కిరుపార్శ్వములను అనేకమంది దేవతలున్నారు. అందొకడు, బహుశః బ్రహ్మ కావచ్చును, పద్మము చేతపట్టుకొని యున్నాడు. నిచ్చెనక్రింద తిరిగీ వృక్షమును, సింహాసనమునున్నవి. ఇవి బుద్ధుడు క్రిందికి దిగి వచ్చినట్లు తెలుపును. వాని కిటునటు మనుష్యులు నిలచి నమస్కరించుచున్నారు. స్తంభము రెండవ భాగమున సిద్ధార్థుని నగరదర్శనమును, మహాభినిష్క్రమణమును సాంకేతికముగ చూపబడినవి. స్తంభము దిగువభాగమున శాక్యులకు ధర్మబోధచేయుటయు, కపిలవస్తునగరిమున జరిగిన అద్భుతమును చెక్కబడి ఉన్నవి. బుద్ధుడు తన తండ్రి శుద్ధోదనుడు తనకిచ్చిన న్యగ్రోధవనమున కూర్చొని అతనికిని అతని పరివారమునకును ధర్మబోధ చేయుచున్న దృశ్యమిచట నున్నది. ముందు జరిగిన కథ స్తంభము వెనుకవైపు కలదు.

కుడివైపు స్తంభము—వెనుకవైపు :—ఇందు పైభాగమున మల్లగణమువారు బుద్ధుని అవశేషములపై చైత్యమును నిర్మించి దానికొరకై యుత్సవము చేసిన దృశ్యము కలదు. ఇందు గల అనేకమంది మనుష్యులలో ఒక్కొక్కరి నొక్కొక్కవిధమున చిత్రించి శిల్పి ప్రతివానికిని ప్రత్యేకతను కలిపించినాడు. ఇందు నాట్యగానములు, వివిధవస్త్రభూషలును మనోహారముగ చిత్రింపబడినవి. స్తంభము రెండవ భాగమున ఒక వానరము బుద్ధునికి ఒక పాత్రతో తేనె నిచ్చిన దృశ్యము కలదు. బుద్ధునికి బదులుగ బోధివృక్షమును శూన్యసింహాసనమును ఉన్నవి. వానిచుట్టును ఆరాధకులు కలరు. మొదట పాత్రహస్తగను, పిమ్మట రిక్తహస్తములతోడను కోతి రెండుతడవలు చిత్రింపబడినది. దీనిక్రిందనున్న భాగమున ముందువైపు మూడవభాగమున కనిపించు ఘట్టమునకు ముందునడచిన వృత్తాంతము కలదు. బుద్ధుడు కపిలవస్తునగరమునకు రాగా అతని తండ్రి శుద్ధోదనుడు సపరివారముగ నతనికి ఎదురు వచ్చెను, అంతట నెవరు ఎవరికి నమస్కరింపవలెనని సందేహము రాగా బుద్ధుడు ఆకాశమునకు లేచి నిలచెను. ఈ శిల్పమునం దొకమూల వృక్షమును, సింహాసనమును కలవు. వాని యెదుట పైయెత్తున నొక అరుగు కలదు. దానిచుట్టును మాలాహస్తులైన యక్షు లున్నారు. ఒకప్రక్కగ సపరివారుడైన శుద్ధోదనుడు నిలచి యున్నాడు.

ఎడమవైపు స్తంభము — ముందువైపు :— స్తంభము పైభాగమున బుద్ధుడు మామిడిచెట్టుక్రింద ధర్మబోధ చేసిన ఘట్టము కలదు. దృశ్యముమధ్య మామిడిచెట్టు, దానికి ఎదురుగ నొక సింహాసనము, వాటి కిటునటు మాలాహస్తులై ఏదియో శ్రద్ధగ వినుచున్న భక్తులు. వీరికి ముందు నలుగురు రాజులవంటి వారు కూర్చొని ఉన్నారు. వారు ప్రసేనజిత్తును అతని అనుచరులును కావచ్చును. వారిపైన నలుగురు లోకపాలురును ఇతర దేవతలును ఉన్నారు. ఒకమూలగ నొకడు డప్పు వాయించుచున్నాడు. జాతకకథలు బుద్ధుడు ఈసందర్భమున నొక యద్భుతమును చేసినట్లు చెప్పుచున్నవి. ఉన్నటులుండి అతడు ఆకాశమున కెగిరెను. అంతట నతనిపాదముల నుండి మంటలును, శిరమునుండి జలమును బయల్వెడలనట. స్తంభపు రెండవభాగమున శ్రావస్తినగరమువద్దగల జేతవనమును, అందు

బుద్ధుడు నివసించిన మూడుకుటీరములును చూపబడినవి. ఈవనమును అనాథపిండికుడను వర్తకుడు దాని నేలమీద నెన్ని కార్షాపణములను నాణెములు పరవనగునో అన్నిటినిచ్చి కొని బుద్ధునికి సమర్పించెనట. ఈ దృశ్యములో ముందుభాగమున నేలమీద నాణెములు పరచినట్లున్నది. వెనుకభాగమున మూడు కుటీరములును, వానిలో నొక్కొక దాని కెదురుగ నొక్కొక సింహాసనమును కలవు. పాళీగాథలలో చెప్పబడినట్లు ఈకుటీరములు గంధకుటి, కోశంబకుటి, కరొరికుటి అను కుటీరములు కావలెను దీనిక్రిందిభాగమున తిరిగీ ప్రసేనజిత్తుమున్నగు వారియెదుట బుద్ధు డాకాశమున కెగురుట చిత్రింపబడినది. దీనిక్రిందగల నాల్గవభాగమున నొకరాజు సపరివారముగ నగరద్వారమునుండి బయటికి వచ్చుట చూపబడినది. ఇతడు బహుశః బుద్ధుని కలియుటకై కోసలనగరమునుండి వచ్చిన ప్రసేనజిత్తు అయి యుండును. స్తంభము అట్టడుగుభాగమున ఇంద్రుని నందన వనమును అందుగల వినోదములును చెక్కగ చిత్రింపబడినవి.

ఎడమవైపు స్తంభము — లోపలివైపు:— ఇందు పైభాగమున బుద్ధుడు రాజగృహమునం దొక గుహాలో నుండగ ఇంద్రు డతనిని సందర్శించిన ఘట్టము చెక్కబడినది. దృశ్యములో పైభాగమున పర్వతవిహారము వంటి గుహ కలదు. దాని ద్వారము ముందు సింహాసన మున్నది. చుట్టునుగల రాళ్ళవెనుక నుండి అనేకజంతువులు తొంగి చూచుచున్నవి. క్రిందిభాగమున వినమ్రులై నిలచిన ఇంద్రుడు నతని పరివారమును కలరు. స్తంభము రెండవభాగమున నగరమునుండి వచ్చుచున్న సపరివారుడగు రాజు కలడు. ఇదియంతయు రాజగృహమున జరిగిన వృత్తాంతములను చూపునది అగుటచే ఈరాజు అజాతశత్రువని ఊహింపవచ్చును. దీనిక్రిందిభాగమున మధ్యలో నొకసింహాసనమును అటునిటు వెదురుపొదలును, ముందు భక్తులును కలరు. ఇది బుద్ధుడు రాజగృహమువద్ద వేణువనమున కొంతకాలము నివసించియుండుటను నిరూపించుచున్నది.

## పశ్చిమ ద్వారము*

పైదూలము — ముందుభాగము:— దీనిపైన కడపటి ఏడ్గురు బుద్ధులును సాంకేతికముగ చిత్రింపబడినారు. మొదటి బుద్ధునికిని కడపటిబుద్ధునికిని బదులుగ వారివారివృక్షములును, వానియెదుట సింహాసనములు నున్నవి. మిగిలిన ఐదుగురికిని బదులుగ ఐదుచైత్యములున్నవి.

మధ్యదూలము — ముందుభాగము:— ఇందు సిద్ధార్థుని మహాభినిష్క్రమణము నిరూపింపబడినది. దృశ్యమునందు ఎడమభాగమున కంథకమును, ప్రాకారమునుగల కపిలవస్తునగర మున్నది. నగరద్వారమునుండి సిద్ధార్థుని ప్రియవాహనమైన కంథకమను గుర్రము నడిచి వచ్చుచుండగ, ప్రక్కన నడచుచుండు ఛండకుడను దాని కావలివాడు పైన కూర్చొనిన సిద్ధార్థునికోయన ఛత్రము నెత్తి పట్టుకొనుచున్నాడు. గుర్రము వెనుక కొందరు దివ్యులు వచ్చుచుండగా మరికొందరు గుర్రపు డెక్కల క్రింద చప్పుడుకాకుండగ తమచేతులను పెట్టుచున్నారు. గుర్రముయొక్కగమన

* ఈద్వారపు అడ్డదూలముల లోభాగపు దృశ్యములు Smith-Hist. Art Ind. Cey. p. 11లో కలవు.

మును చూపుటకై ఈదృశ్యమే నాలుగుపార్లు చూపబడినది. ఆమీద గుఱ్ఱమును, ఛండకుడును వెనుకకు తిరుగుట కలదు. అచ్చటనుండి సిద్ధార్థుడు పాదచారియై పోయెననుటకు గుర్తుగ క్రింద అతని పదచిహ్నములు చెక్కబడినవి. వానిపైన ఛత్ర మున్నది. కడపట నొక జంబూవృక్ష మున్నది. ఇల్లు విడచినపిమ్మట సిద్ధార్థు డొక నేరేడుచెట్టునీడను కూర్చొని మొట్టమొదటి ధ్యానము నారంభించెనను అంశమును ఈవృక్షము జ్ఞాపకము చేయుచున్నది.

అడుగుదూలము — ముందుభాగము :— ఇచట అశోకచక్రవర్తి బోధివృక్షమును దర్శింపనేగిన ఘట్టము చెక్కబడినది. దృశ్యము మధ్య నొక ఆలయమును, బోధివృక్షమును కలవు. ఎడమవైపు బాజాభజంత్రీలును, జలకలశములను తెచ్చుచున్న మనుష్యులును ఉన్నారు. కుడివైపున పెద్దపరివారముతో ఏనుగు నెక్కి వచ్చి, క్రిందకు దిగి ఒకరాజును రాణియు వృక్షమువద్దకు వచ్చి ఆరాధించుచున్నట్లు చిత్రింపబడినది. ఇది గయలోని దృశ్యము. వృక్షము సిద్ధార్థునికి సంబుద్ధికొసంగిన బోధివృక్షము. రాజదంపతులు అశోకుడును అతనిరాణి తిష్యరక్షితయు. దూలముయొక్క రెండుకొనలను రెండు చక్కని నెమళ్లుకలవు.

పైదూలము — లోభాగము :— ఇచటిది కడపటి యేడ్గురుబుద్ధుల సాంకేతిక చిత్రము. వారి వృక్షములును, సింహాసనములును మాత్రమే ఉన్నవి.

మధ్యదూలము — లోభాగము ;— ఇచట జంతువులన్నియు బుద్ధుని ఆరాధించిన ఘట్టము చెక్కబడినది. దృశ్యముమధ్య అశ్వత్థ వృక్షము, దానిక్రింద నొక సింహాసనము నున్నవి. దానికి రెండుప్రక్కలనుండియు అనేకవిధములైన వాస్తవకల్పితజంతువులును, పక్షులును, నాగులును వచ్చుటకలదు. ఇది సంబుద్ధి అయినవెంటనే బుద్ధునికి సర్వప్రాణుల మీదను స్వామిత్వము వచ్చెననుటకు సాంకేతికము.

అడుగుదూలము — లోభాగము :— ఇందు మధ్యలో నొక చైత్యమున్నది. దానికి రెండువైపులనుండియు ఏనుగులు తొండములతో తామరపువ్వులను తీసికొని వచ్చుచున్నవి.

కుడివైపుస్తంభము — ముందుభాగము :— ఇచ్చట దేవలోకములు నిరూపింపబడినవి. దృశ్యముమధ్య ఆరు అంతస్తుల సౌధమున్నది. ప్రతి అంతస్తును స్తంభములతో మూడువిభాగములుగ నున్నది. ఈస్తంభములలో కొన్ని నిరాడంబరములు, మఱికొన్ని శిల్పకలు కలవి. ఈవిభాగములలో మధ్యదానిలో ఒకచేత వజ్రమును, మరియొకచేతి కలశమునుకల దివ్యుడు కూర్చొని యున్నాడు. అతనివెనుక ఛత్రచామరములు పట్టువారును మరికొందరు స్త్రీలును కలరు. ఇతడు బహుశః ఇంద్రుడు కావచ్చును. అతని కుడివైపు విభాగమున మరియొక దివ్యుడు కలడు. ఎడమవైపు విభాగమున గాయకవాదకులు ఉన్నారు. అన్నిటికంటెను పై అంతస్తులో ఇద్దరు దివ్యులు సపరివారులై కూర్చొని ఉన్నారు. ఇందొకడు మారుడు కావచ్చును. బౌద్ధుల గ్రంథములలో ఆరు స్వర్గములున్నట్లు చెప్పబడినవి. అందు మొదటిది చతుర్మహారాజిక. దీనిక నలుగురు లోకపాలకులు పాలకులు. రెండవది శక్రుని త్రయస్త్రింశస్వర్గము. మూడవది రాత్రింబవళ్ళ మార్పులేని యమలోకము. నాల్గవది తుషిత స్వర్గము. మనుష్యలోకమున ప్రజాహితార్థ మవతరించుటకు పూర్వము బోధిసత్త్వులిచట

షుందురు. ఐదవది నిర్మాణరతిస్వర్గము. ఇచటి వారు తమకు తామే సర్వవస్తువులను సృష్టించుకొని ఆనందింతురు. ఆరవది పరినిర్మితవశవర్తిస్వర్గము. దీనికి మారుడు అధిపతి. ఈ స్వర్గము లారిటికిని పైన బ్రహ్మలోకము లుండును.

కుడివైపుస్తంభము — లోభాగము* :— ఈ భాగమంతయు కపిలవస్తునగరమున జరిగిన వృత్తాంతములను చూపుట కుపయోగింపబడినది. స్తంభముపై భాగమున తుషితస్వర్గమున ఇంద్రాదిదేవతలు బోధిసత్త్వుని మనుష్యలోకమునం దవతరించి అచటి దుఃఖములను నివారింపమని ప్రార్థించుట చిత్రింపబడినది. రెండవభాగమున రెండుఘట్టములు కలిపి చూపబడినవి. అందు మొదటిది మాయాదేవిగర్భధారణము. రాజసౌధమునందలి ఒకమంటపమున రాణి పండుకొని యుండగా శ్వేతగజరూపమున క్రిందికి దిగివచ్చి బోధిసత్త్వుడామెగర్భమున ప్రవేశించుచున్నాడు. దీని క్రిందివరుసలో సపరివారుడై శుద్ధోదనుడు బుద్ధుని కలియుటకై కపిలవస్తునగరవీథులలో గుండా పోయి నగరద్వారమును దాటుట చూపబడినది. దీనిక్రింద ఆరాజు బుద్ధుని కలియుటయు, బుద్ధు డాకాశమున కెగిరి నిలచుటయు కలవు. రాజును పరివారమును నివ్వెరపడి ఈదృశ్యమును చూచుచున్నారు. దీనిక్రింద సర్వాలంకారభూషితుడై లీలారవిందమును కుడిచేతి ధరించిన రాజు కలడు.

ఎడమస్తంభము — ముందుభాగము :— ఇందు నాలుగు విభాగము లున్నవి. మొదటిదానిలో బుద్ధుడు వాహ్యాళిచేయుట చూపబడినది. రెండవభాగమున గౌతముని సంబుద్ధి కలదు. పైన ఒక ఆలయమున్నది. దానిమధ్యలో నొక సింహాసనము. దానివెనుక నొక వృక్షము. ఈచెట్టుకొమ్మలు ఆలయగవాక్షములలోనుండి బయటికి వచ్చుచున్నవి. ఆలయమునకు రెండువైపులను లోకపాలకు లున్నారు. మూడవభాగమున బుద్ధుడు నీటిమీద నడచిన ఘట్టము చూపబడినది. దృశ్యము మొదటివరుసలో నైరంజరనది అవలిగట్టుకు బుద్ధుడు రాగా ఈవలియొడ్డు నుండి కాశ్యపుడు అతనిని నది దాటించుటకు పడవలో వచ్చుచున్నాడు. దానిక్రిందివరుసలో బుద్ధు డానదీజలముపై అవలీలగ నడచి పోవుట చూపబడినది. మూడవవరుసలో కుడిమూల సింహాసనమునగల బుద్ధునికి కాశ్యపాదులు నమస్కరించుచున్నారు. కడపటిభాగమున బింబిసారమహారాజు బుద్ధదర్శనార్థమై రాజగృహమునుండి వెడలుట చూపబడినది.

ఎడమస్తంభము — లోభాగము :— ఇందు పైభాగమున బుద్ధుడు ఉరువిల్వగ్రామమునం దుండగా ఇంద్రుడును, బ్రహ్మయు అతనిని చూడవచ్చిన ఘట్టము కలదు. దృశ్యము మధ్యలో ఛత్రచ్ఛాయక్రింద నొక సింహాసనమున్నది. దానివెనుక ఇంద్రుడును, బ్రహ్మయు వినయవినమ్రులై, నిలచి యున్నారు. వెనుకభాగమున ఉరువిల్వగ్రామమును వారివారి పనులలో నిమగ్నులై యున్న గ్రామీణులును చిత్రింపబడినారు. ఎడమభాగమున నలుగురు స్త్రీలు ఉన్నారు. అందొకతె తిరుగలిలో నేదియో విసరుచున్నది. మరియొకతె ఒక అరుగుమీద దేనినో కలుపుచున్నది. మూడవ స్త్రీ రోటిలో నేదియో దంపుచున్నది. నాల్గవ స్త్రీ చేటతో చెరుగుచున్నది. ముందుభాగ

* Smith, pl. 12. B.

మున నైరంజననది ఉన్నది. దాని యొడ్డున పశువులు మేయుచున్నవి. ఒకస్త్రీ పాత్రలో నీరు తీసుకొని పోవుచున్నది. అనాటి గ్రామ జీవితము ఈదృశ్యమున చక్కగ చిత్రింపబడి నది. స్తంభము రెండవభాగమున మరియొక హృద్యమగు దృశ్యము కలదు. ఇది బుద్ధుడు ఒక నాగుపామును లొంగదీసినఘట్టము. ఉరువిల్వగ్రామమునందుండుచు ఒకప్పుడు బుద్ధుడు కశ్యపుడను ఋషియొక్క అగ్నిహోత్రగృహమున నొకరాత్రి గడపుట కనుజ్ఞపొందెనట. కొంతసేపటికి కొక మహానాగము వచ్చి బుద్ధుని పైకి మంటలను, పొగను వదలెనట. కాని అతని శరీరమునుండి వచ్చిన మంటలకును, పొగకును తాళజాలక ఆనాగము బుద్ధుని శరణుకొచ్చి, అతని భిక్షాపాత్రమున దూరెనట. దృశ్యము మధ్యభాగమున అగ్నిగృహమున్నది. ఒకవైపున అగ్నికుండమును, మరియొకవైపున సింహాసనము నున్నవి. సింహాసనము వెనుక మహానాగము కలదు. గృహగవాక్షములనుండియు, కప్పుమీదనుండియు మంటలు వచ్చుచున్నవి. గృహమున కటునిటు వినమ్రులైన కశ్యపశిష్యు లున్నారు. దీనిక్రింది వరుసలో కుడివైపున నొక పర్ణశాల ఉన్నది. దానిద్వారమువద్ద జటామకుటధారియైన కశ్యపుడు కూర్చొని యున్నాడు. అతనిముందు ఏమియో చెప్పుచున్న మరియొక బ్రాహ్మణుడు కలడు. ప్రక్కగ అగ్నికుండ మున్నది. ఎడమవైపున నైరంజరనది. దానిలో నొక తాపసి స్నానము చేయుచున్నాడు. ముగ్గురు యువకులు నీరు తీసికొని పోవుచున్నారు. ఈ దృశ్యమునందు ఆశ్రమజీవితము చక్కగ చూపబడినది. దీనిక్రిందిభాగమున బుద్ధుడు చూపిన మరియొక అద్భుతము అతిరమ్యముగ చూపబడినది. ఇదియును కశ్యపుని వశపరచుకొనుటకు సంబంధించినదే. ఒకప్పుడు కశ్యపుడు ప్రతిదినమును చేయునట్లు అగ్న్యారాధన చేయబోవ అడుగడుగునకు విఘ్నములు వచ్చెనట. బుద్ధుని ఆజ్ఞఅయినగాని ఈవిఘ్నములలో నొకొక్కటియు తొలగలేదట. దృశ్యములో ఒకచోట క్రింద చిన్న దుంగ ఉన్నది. ఒకడు దాని వెనుక గొడ్డలి పైకెత్తి నిలచి నాడు. కొంత దూరమున అతడు గొడ్డలి వేటుపెట్టుట, దుంగ చీలుట కలవు. అట్లే ఒక అగ్నికుండమును, దాని యెదుట దానిని విసరుచున్న వ్యక్తియు కలవు. కాని కుండమునుండి మంటలు వచ్చుటలేదు. తర్వాత నిదే ఘటనమున్నది. ఈసారి కుండమునుండి మంటలు పైకి ఎగయుచున్నవి. వీని వెనుక నొక తపస్వి అగ్నిలో హోమము చేయుట కలదు. మరికొందరు కట్టెలను, ఇతర వస్తువులను తెచ్చుచున్నారు. దృశ్యములోభాగమున ఒక ఆవరణలో శంఖచిత్రావృతమైన చైత్య మున్నది.

పశ్చిమ ద్వారము.

పైమూలము—ముందువైపు :— దీనిపైన వృక్షసింహాసనసంకేతములమూలమున కడపటి ఏడుగురు బుద్ధులలో ఆర్గురును, భావిబుద్ధుడగు మైత్రేయుడును సూచింపబడినారు.

మధ్యమూలము — ముందువైపు :— దీని మీద బుద్ధుడు జేతవనమున ధర్మచక్రప్రవర్తనము చేసిన ఘట్టము కలదు. దృశ్యమధ్యమున సింహాసనముపై ధర్మచక్ర మున్నది. చుట్టును లేళ్ళును, ఆరాధకులును కలరు.

అడుగుమూలము—ముందువైపు :— ఇచ్చట ఛద్దంతజాతకము చెక్కబడినది. మూలము రెండుకొనలయందును చైత్యమున్నది.

**అడుగుమూలము — లోనివైపు :—** బుద్ధుని నిర్యాణానంతరము మల్లులు అతని అవశేషములను తీసుకొని తమనివాసమగు కుశీనగరమున కేగిన దృశ్య మిచట కలదు. దృశ్యమునందు మల్లులరాజు ఏనుగనెక్కి తననెత్తిమీద అవశేషముల నుంచుకొని పోవుచున్నాడు. నగరద్వారము ముందు సాలవృక్ష మున్నది. మూలము కొనలలో మాలాహస్తులైన మనుష్యులు చిత్రింపబడినారు.

మధ్యమూలము — లోనివైపు :— ఇచట బుద్ధుని అవశేషములకొరకై జరిగిన తగవు చూపబడినది. దృశ్యముఎడమచివర కుశీనగరమున మల్లరాజు సింహాసనాసీనుడై యున్నాడు. కుడివైపు ఏడ్గురు నాయకులు సైన్యపరివృతులై నగరాభిముఖులై పోవుచున్నట్లు చిత్రింపబడినది.

అడుగుమూలము—లోవైపు :— ఈమూలము మీద మూడుభాగములలో మారధర్షణము చెక్కబడియున్నది. దృశ్యము మధ్యలో బోధివృక్షముక్రింద బుద్ధసంకేతమగు సింహాసనమున్నది. కుడివైపున పరాభూతులైన మారానుచరులు మరలిపోవుట కలదు. ఎడమవైపున దేవతలు బుద్ధవిజయమున కానందము వెలిబుచ్చుచున్నారు.

కుడివైపుస్తంభము — ముందువైపు :— ఇది నాలుగుభాగములుగ నున్నది. పైభాగమున మహాకపిజాతకము చెక్కబడినది. బోధిసత్వుడు ఒకప్పుడు వానరముగ బుట్టి 80000 వేల కోతులకు రాజయ్యెనట. గంగాతీరమున నివసించుచు నీవానరు లొక పెద్దమామిడిచెట్టు పండ్లను తినుచుండిరట. వానరములన్నియు చెట్టుమీదనుండగ నొకప్పుడు బ్రహ్మదత్తుడను కాశీరాజు సైనికులతో వచ్చి ఆచెట్టును ముట్టడించెనట. అంతట బోధిసత్వుడు తనశరీరమును పెంచి గంగ కడ్డుగ పండుకొని కోతులనన్నిటి నావలి యొడ్డుకు దాటించెనట. ఈకోతులలో సిద్ధార్థుని పినతల్లి కొడుకును, అతనియెడ తీరని అసూయకలవాడునగు దేవదత్తు డొక వానరమై యుండెనట. ఈయదనున దేవదత్తుడు బోధిసత్వుని శరీరముపై నడచుచు నతని గొంతుక నొక్కివేసెనట. ఈయద్భుతమును చూచి, తాను సంకల్పించిన దౌష్ట్యమునకు పశ్చాత్తప్తుడై బ్రహ్మదత్తుడు మరణించుచున్న వానరరాజుకు సర్వోపచారములను చేసి, అనంతర మతనికి రాజోచితసంస్కారమును చేయించెనట. దృశ్యములో క్రిందిభాగమున గంగానది ఉన్నది. పైయెడమభాగమున మామిడిచెట్టున్నది. దానికి రెండుకోతులు వ్రేలాడుచున్నవి. చెట్టువద్దనుండి నదిమీదుగ వానరరాజు శరీరమున్నది. ఆవలియొడ్డున కొన్ని వానరములున్నవి. దృశ్యము క్రిందిభాగమున ఎడమవైపు యోధపరివృతుడై గుర్రముమీద కూర్చొనియున్న బ్రహ్మదత్తుడు. ఒక యోధుడు ధనుస్సులో బాణము నెక్కుపెట్టి వానరరాజుపై విడువనున్నాడు. కొంచెము పైగా మామిడిచెట్టుక్రింద మరణించుచున్న వానరరాజు, ప్రక్కనకూర్చొని అతనితో సంభాషించుచున్న బ్రహ్మదత్తుడు. స్తంభము రెండవభాగమున బ్రహ్మేంద్రాదులు స్వర్గమునకు పోయి మానవలోకమునం దవతరింపుమని బోధిసత్వుని ప్రార్థించుట చెక్కబడినది. మూడవభాగమున బుద్ధు డొకగుహయందుండగ ఇంద్రుడతని దర్శింపవచ్చిన ఘట్టము కలదు. అడుగుభాగమున జీవితసంకేతమగు

తామరతీగ, దానినుండి వెలికి వచ్చుచున్న సింహములు అత్యద్భుతముగ చిత్రింపబడినవి.

కుడివైపుస్తంభము — లోవైపు:— ఇందు మొదటిభాగమున మారధర్షణ మున్నది. ఈ దృశ్యమున అదనముగ కనపడు నగరద్వారము కపిలవస్తునగరముద్దై యుండి, సిద్ధార్థుని జీవితమునందు సంబుద్ధికి పూర్వము జరగిన ముఖ్యవృత్తాంతమగు మహాభినిష్క్రమణము నకు సూచకము కావచ్చును. రెండవభాగమున కపిలవస్తునగరమున న్యగ్రోధవనములో బుద్ధుడు శాక్యులకు ధర్మబోధచేసిన ఘట్టము చెక్కబడినది.

ఎడమవైపుస్తంభము — ముందువైపు:— ఇక్కడ పై భాగమున మందాకినీతీరమునందలి నందనవనము చూపబడినది. దీనిక్రిందభాగమున శ్యామజాతకము చెక్కబడియున్నది. ఒక తపసియు నతనిభార్యయు అంధులుగ నుండిరట. వారికి శ్యాముడను ఏకైకపుత్రుడుండి సర్వవిధములను తల్లిదండ్రులను కని పెట్టుచుండెనట. ఒకనాడు నదిలో నీరు తెచ్చుట కేగిన శ్యాముని కాశీరాజు బాణముతో కొట్టెనట. రాజు నిజము తెలిసి పశ్చాత్తప్తుడయ్యెను. అతనిపై కరుణించి ఇంద్రుడు శ్యాముని గాయమును మాన్పి, అతని తల్లితండ్రులకు దృష్టి నొసగెనట. దృశ్యమునందు పైభాగమున కుటీరముల రెండుకుటీరములును, వాని కెదురుగ శ్యాముని తల్లితండ్రులును కలరు. వీనిక్రిందగల గడిలో నీరు తెచ్చుటకై శ్యాముడు వచ్చుచున్నాడు. ఎడమవైపున క్రిందభాగమున బాణము వేయుచున్న రాజు, ఆమీద ధనుర్హస్తుడై ముందుకు వచ్చుచున్నాడు. పిమ్మట నిజము తెలిసి అతడు పశ్చాత్తప్తుడై నిలచి యున్నాడు. ఈమెడమవైపు పైభాగమున శ్యాముడు, నతని తల్లితండ్రులును, ఇంద్రుడును కలరు. స్తంభము రెండవభాగమున బుద్ధునికి నాగరాజగు ముచిలిందుడు భార్యలతోకూడి నమస్కరించుచున్న దృశ్యము కలదు. మూడవభాగమున బుద్ధుడు రాజగృహమునుండి వైశాలికి పోవుచు మధ్యమార్గమున గంగను దాటిన దృశ్యము చెక్కబడియున్నది.

ఇట్లు సర్వాంగసుందరములును, సుందరశిల్పశోభితములునైన ఈసాంచీద్వారములు భారతీయశిల్పసాంప్రదాయమున కుత్కృష్టనిదర్శనములు, ఇట్టిద్వారములు భారతదేశమునమరిఎచ్చటను లేవు. మధ్యయుగమున కాకతీయాంధ్రసామ్రాజ్య కేంద్రమగు ఏకశిలానగరమున నాలుగు మనోహరములగు ద్వారములు నిర్మింపబడినవి. వాని విన్యాసమును, నిర్మాణమును ఈసాంచీద్వారములనిర్మాణవిన్యాసములకు భిన్నములుగ నున్నవి. వానియందు అడ్డదూలముల కొనలయందు హంసలును, దూలములపైని మాలికామాలికలును తప్ప శిల్పము లేదు. అయినను ఈఏకశిలానగరిద్వారములవంటి ద్వారములు మరియెచ్చటను కానరావు. ప్రాక్తీరమున కృష్ణాకూలమున ధాన్యకటకమునందొక శిల్పకళాపీఠము వర్ధిల్లి అచటి ఆంధ్రశిల్పాచార్యులు జగత్ప్రసిద్ధమైన అమరావతీమహాచైత్యమును నిర్మించుచుండగ, మరియొక ఆంధ్రశిల్పాచార్యసంఘము నేటి మహారాష్ట్రమున నింకొక శిల్పపీఠమును నెలకొల్పి గుహాలయములను విహారములను నిర్మించుచుండగ, మూడవ ఆంధ్రశిల్పిసంఘము సాంచీలో మరియొక కళాపీఠము నేర్పరచి ఈనాలుగు ద్వారములను నిర్మించినది. ఆంధ్రసాతవాహన

-యుగము కార్లాచైత్యాలయము, సాంచీద్వారములు అమరావతీమహాచైత్యము అను మూడువిలక్షణశిల్పరత్నములను భారతదేశమునకు కానుకగనొసంగినది.

## ౫. అమరావతీ స్తూపము

గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలో కృష్ణాతీరమునందున్న అమరావతీగ్రామము యొక్క పేరు నేడు జగత్ప్రసిద్ధమైనది. ఈప్రసిద్ధికి ఆగ్రామమునందు బయల్వెడలిన ఒక మహాచైత్యమును, దానివైభవమును కారణములు. నేటికి రెండువేలసంవత్సరములకు పూర్వ మిచ్చట బుద్ధుని శరీరావశేషమువిూద నిర్మింపబడిన ఒక మహాచైత్యమును, దానికనుబంధముగ నొకవిద్యాపీఠమును, ఒక శిల్పవిద్యాకేంద్రమును ఉండెడివి. ఉత్తరాపథమున బౌద్ధము నవలంబించిన యవనశిల్పులు బౌద్ధజాతకకథలను తమ సాంప్రదాయము ననుసరించి రాళ్ళపై ననువదించుచుండ ప్రాచీనాంధ్రశిల్పి పావనకృష్ణవేణీతీరమున కళాసమాధిని మునిగి నిరుపమమైన నిర్మాణకౌశలము నార్జించి అపూర్వమును విస్మయజనకమునగు శిల్పసత్రయాగమును సాగించెను. విలక్షణమైన ఈశిల్పసాంప్రదాయ మాంధ్రదేశమంతటను వ్యాపించి వందలకొలది సుందరశిల్పములను సృష్టించినది. ఈపవిత్రక్షేత్రమున శిక్షనొంది సిద్ధహస్తులైన నాటి ఆంధ్రశిల్పాచార్యులును, వారి శిష్యబృందములును సముద్రములను దాటి ప్రాచ్యదేశములకు పోయి యాశిల్పసాంప్రదాయమునకు నూతనశోభను ఘటింపజేసిరి. సుప్రసిద్ధములైన అజాంతాచిత్రములయందుసహిత మీ అమరావతీకళాసాంప్రదాయముయొక్క ఛాయలు కనిపించుచున్నవి. అమరావతీస్తూపమువంటి విస్తృతిని, సౌందర్యమునుగల కట్టడము మరియొకటి ఎచ్చటను ఉండియుండదని కళావేత్తలయిన విజ్ఞులు ప్రశంసించియున్నారు.

అమరావతి అర్వాచీనమైన గ్రామము. క్రి. శ. 1796లో నిది యొక చిన్న పల్లె. ఆయేట చింతపల్లిజమీందారగు శ్రీరాజా వెంకటాద్రినాయుడు కారణాంతరములవలన తన యునికి నీగ్రామమునకు మార్చుకొని యాగ్రామము నభివృద్ధికి తెచ్చెను. అన్నివర్ణములవారిని ఇచటికి వచ్చి నివాసము లేర్పరచుకొనమని ప్రోత్సహించెను. అంతటనుండియు నిది కొంతకాలము అమరావతీపట్టణమయ్యెను. ఆజమీందారుల అధికారము క్షీణించినతర్వాత నిది నేటి పల్లెటూరుగ నిలచినది. పైన పేర్కొనిన మహాచైత్యము కాక ఈగ్రామమున సుప్రసిద్ధమైన అమరేశ్వరాలయము కలదు. దీనికి అమరేశ్వరమనియు, అమరవటీశ్వరమనియు పేర్లుండెను. భీమారామ కొమరారామ క్షీరారామ ద్రాక్షారామ అమరారామములను ప్రశిద్ధశైవపంచారామములలో నిది యొకటి. శాసనాధారమునుబట్టి వేంగీచాళుక్యయుగమున బహుశః క్రీ. శ. 7, 8 శతాబ్దులనుండి అమరేశ్వరము సుప్రసిద్ధముగ నుండినట్లు తెలియనగుచున్నది. ఆమీదట కాలక్రమమున నీక్షేత్రముయొక్క ప్రాముఖ్యమును, వైభవము నభివృద్ధి నందినవి. ఈఅఖు

రేశ్వరాలయము విలక్షణముగ నున్నది. సాధారణముగ నితరాలయములలో భూమట్టమున వేదికయు, దానిపైన ఆరాధ్యమగు విగ్రహము నుండును. కాని అమరేశ్వరమున క్రింది యంతస్తు మూయబడి యున్నది. దాని పైభాగముననే ముఖమంటపము, నంతరాళమంటపమును, గర్భాలయము నున్నవి. గర్భాలయమునందు వేదికయు, దానిపైన పొడవైన చలవరాతి లింగము నున్నవి. లింగము అగ్రతలమున మూరెడు లోతు గొయ్యి కలదు. ఈనాడు కనిపించు లింగము ఆదిలో ప్రతిష్ఠింపబడినదికాదు. మొదటి లింగము భిన్నము చేయబడుటచే మరయొకటి ప్రతిష్ఠింపబడినది. కాని రెండవది మొదటిదాని అనుకరణమే అని యూహింప వచ్చును. ఆలయము యొక్క అడుగుభాగము మూయబడియుండుటను, లింగముయొక్క పొడవును, తదగ్రతలమున గల గుంటనుబట్టి చూడ నిది మొదట నొక బౌద్ధస్తూపముగనుండె పిమ్మట నొక శివాలయముగ మార్చబడెనేమో అని సందేహము కలుగుచున్నది. ఈఆలయము మహాచైత్యమునకు సమీపముననే ఉన్నది. ఇచ్చట నొక మహాచైత్యమేకాక ఎన్నియో ఇతరచైత్యములుకూడ నుండియుండును. వీనిలో నొక చైత్యము పైవిధమున మార్చబడుట సంభవమగును. సాధారణమున చైత్యాగ్రమున అండముమీద నొక పేటికయు దానిమీద నొక స్తంభమును, ఈస్తంభాగ్రమునందు ఛత్రము నుండెడివి. ఈఛత్రము మధ్య అడుగుభాగము బొగడవలె నుండెడిది. స్తంభాగ్రతలమున నీబొగడ పట్టునంతటి గొయ్యి ఉండెడిది. ఈ బొగడను ఆగోతిలోనికి దింపుటతో ఛత్రము నిలచెడిది. చైత్యముచుట్టును నేలమట్టము నుండి పేటికవరకును మూసివేసి, ఈపైన మంటపప్రాకారాదులను నిర్మించి, పేటికపైని స్తంభముమీది ఛత్రమును తీసివేసినచో పైన వర్ణింపబడిన అమరేశ్వరాలయ మేర్పడును. ఇట్టిదే, ఇదేవిధమగు అనుమానమును కలిగించునదే గుంటూరునకు ఎనిమిదిమైళ్ళదూరమునందున్న చేబ్రోలు గ్రామమునందలి భీమేశ్వరాలయము. అదియునుగాక గుంటూరు జిల్లా నరసరావుపేటవద్ద చేజెర్లగ్రామమున కపోతేశ్వరాలయ మున్నది. ఇది మొదట బౌద్ధుల చైత్యగృహము. పిమ్మట కట్టడము నట్లే యుంచి దానిమధ్యనుండిన చైత్యమును తీసివేసి దానిస్థానమున నొక శివలింగమును ఎవరో ప్రతిష్ఠించిరి. ఇదే పద్ధతి అమరేశ్వరాలయనిర్మాణమునందును అనుసరింపబడియుండుట అసంభవముకాదు. మరియును ఆంధ్రదేశమున క్రీ. శ. ౬వశతాబ్దము వరకును బౌద్ధము ప్రబలముగ నుండెను. ఆమీద వైదికధర్మము ప్రబలినది. క్రీ. శ. 7వశతాబ్దిలో హ్యూయన్‌త్సాంగ్ అను చైనాయాత్రికుడు ఈప్రాంతమునకు వచ్చునప్పటికే ఇచటి బౌద్ధ నిర్మాణములు చాలవరకును క్షీణావస్థలో నున్నట్లు తెలియుచున్నది. బహుశః ఆప్రాంతముననే ఇచటి చైత్య మొకటి అమరేశ్వరముగ మారి యుండవచ్చును. ఇచటి మహాచైత్యముమాత్రము క్రీ. శ. 12, 13 శతాబ్దుల వరకును చక్కగ నుండెను.

నేటి అమరావతీగ్రామమునకు అరమైలు దూరమున ధరణికోటయను గ్రామ మున్నది. దీనికి ధాన్యవాటియనియు, ధాన్యకటకమనియు, దన్నాలకోటయనియు, కోటయనియు, కటకమనియు పేర్లుండెను. ధరణికోట అనుపేరు అర్వాచీనము. క్రీ. శ. 1౬వశతాబ్ది

నాటి కృష్ణరాయల శాసనమునందు "ధరణి
కోటఅమరేశ్వరానకు విచ్చేసి" అని యున్నది.
అంతకుముందు దన్నాలకోట, ధరణికోట,
ధాన్యవాటీ అను పేర్లు కనిపించుచున్నవి. క్రీ. శ.
5వశతాబ్దినాటి ఆనందగోత్రశాసనమున ధాన్య
కటమను పేరు కలదు. క్రీ. శ. 3వశతాబ్దినాటి
ఒక పల్లవప్రాకృతశాసనమునందు "కడకే"
అని మాత్రి మున్నది. అంతకుపూర్వపు
ప్రాకృతశాసనములలో ధనకట, ధజకట అను
రూపములు కనబచ్చుచున్నవి. అందువలన
ప్రాచీనకాలమున నేటి ధరణికోట అమరావతీ
గ్రామములున్న ప్రాంతమంతయు ధాన్యకటక
మను నొక నగరమున చేరియుండెనని స్పష్ట
మగుచున్నది. చైనాయాత్రికుడగు హ్యూయన్
త్సాంగు ధనకటకము మహాంధ్రమునకు రాజ
ధానియనియు, అది 40వేల నైశాల్యము కలిగి
యుండెననియు వ్రాసియున్నాడు. మెకంజీసేక
రించిన ఆధారములనుండి ప్రాచీనధాన్యకట
కము కృష్ణవెంబడి 3 1/2 మైళ్ళ పొడవుగను,
సుమారు 2 మైళ్లు వెడల్పుగను వ్యాపించి
యుండెనని తెలియుచున్నది. ఈవైశాల్యమున
పెక్కుతావుల మట్టిగోడలును, ఇటుకగోడ
లును కనిపించుచున్నవి. భూమిని త్రవ్వినపుడు
అచ్చటచ్చట చలవరాతిపలకలును, స్తంభము
లును బయల్వెడలుచున్నవి. వర్షముకురిసిన
రోజులలో నేలమీదనే ఎన్నో సాతవాహన
యుగపు నాణెములు దొరకుచున్నవి. ఇందు
వలన ప్రాచీనధాన్యకటకనగరము ఆరుఏడు
చదరపుమైళ్ళవైశాల్యమును కలిగియుండెనని
చెప్పవచ్చును.

ధనకటకమను పేరు అమరావతీమహా
చైత్యమున మౌర్యలిపిలో చెక్కబడిన రెండు
శాసనములలో కనిపించుచున్నది. దీనినిబట్టి
క్రీ. పూ. 200 నాటికే యీనగర ముండెనని
చెప్పవచ్చును. చైనాదేశమునగల కొన్ని
ప్రమాణముల నాధారము చేసికొని తారా
నాథుడను ఇతిహాసరచయిత ధాన్యకటకమహా
చైత్యము బహుప్రాచీనకాలముననే బౌద్ధులకు
ప్రధానస్థానముగ నుండెనని వ్రాసియున్నాడు.
సుప్రసిద్ధమౌర్యచక్రవర్తియగు అశోకుడు
భారతదేశమునం దంతటను బౌద్ధమతప్రచా
రము చేయించెను. అతని శాసనములు కళింగ
దేశమునందలి ధౌలీ, జౌగడాలలోను, నేటి
మైసూరురాజ్యమునందలి సిద్ధాపురమునను,
నైజాంరాజ్యమునందలి మస్కీలోను,
కర్నూలుజిల్లాలోని యెఱ్ఱగుడివద్దను దొరికి
నవి. మస్కీవద్ద సువర్ణగిరిలో అతని ప్రతినిధి
యొకడుండెను. ధాన్యకటకనగర మీశాసన
ములుగల ప్రదేశమునందే ఉన్నది. గుంటూరు
జిల్లా భట్టిప్రోలుగ్రామమున దొరికిన ఒకస్తూప
మున గల శాసనముల లిపిస్వరూపమునుబట్టి
కొందరు ఆంధ్రదేశమున బౌద్ధమతము అశో
కునికిపూర్వమే ప్రచారమునందుండెనని చెప్పు
చున్నారు. ఇది నిజమే అయినను ఆచక్రవర్తి
దీక్షతో చేయించిన ధర్మప్రచారము ఆంధ్ర
దేశమునందలి బౌద్ధమతమునకు నూతనోత్తే
జము కలిగించెనని నిరభ్యంతరముగ చెప్ప
వచ్చును. ఈయూహకు ఇంకను కొన్ని యాధా
రము లున్నవి. గౌతమబుద్ధుని శరీరమునకు
అంత్యసంస్కారములు జరిగినపిమ్మట నతని
అవశేషములను అతని యనుచరులు ఎనిమిది
స్తూపములలో భద్రపరచిరట. అశోకుడు బౌద్ధ
ధర్మప్రచారము నారంభించిన పిమ్మట పైస్తూప
ములలో నేడింటిని తెరిపించి వానియందలి
బుద్ధావశేషములను దేశమంతటికిని పంచిపెట్టి
వాటిపైన 8400 స్తూపములను కట్టించెనట.

ఒక్క ఆంధ్రదేశముననే భట్టిప్రోలు, అమరావతి, నాగార్జునకొండలలో ఈఅవశేషములు దొరికినవి. ఇదియును ధాన్యకటకనగరముయొక్క ప్రాముఖ్యమును సూచించుచున్నది. అదియునుగాక మహావంశమను బౌద్ధగ్రంథమున అశోకచక్రవర్తి మహాదేవుడను బౌద్ధభిక్షువును మహిషమండలమునకు ధర్మప్రచారముచేయుటకై పంపెననియు, సతడు కొంతకాలమైనపిమ్మట పల్లవభోగమునకు వచ్చి యచటగూడ ప్రచారము సాగించెననియు, అటుపైన అతడు 14 లక్షల 60 వేలమంది భిక్షువులతోగూడి పల్లవభోగమునుండి సింహళద్వీపమునకు పోయి అచట అనూరాధపురమున చేయబడిన సువర్ణమాలకస్తూపస్థాపనమును గాంచెననియు చెప్పబడియున్నది. ఈపల్లవభోగము నేటి పల్నాడు. ధాన్యకటకనగరము దీనికి సమీపమునందున్నది. ఈవివరములనుబట్టి మహాదేవభిక్షువు నతని శిష్యులు నీప్రాంతమున క్రీ. పూ. మూడవశతాబ్ది యుత్తరార్థమున బౌద్ధప్రచారము సాగించిరనియు, బహుశః అదేకాలమున నిచటి అవశేషచైత్యములు నిర్మింపబడిన వనియు ఊహింపవచ్చును. ధాన్యకటకనగరముయొక్క అచటి మహాచైత్యమూలకమైన మతవిషయిక ప్రాముఖ్య మిట్లు తెలియనగుచున్నది.

ధాన్యకటకముయొక్క రాజకీయప్రాముఖ్యము వివాదాస్పదముగ నున్నది. ఆనగరము శాతవాహనరాజులలో కొందరికైనను కొంతకాలము రాజధానిగ నుండెనని కొందరును, ఒకప్పు డిదియే శాతవాహనుల ప్రధానకేంద్రముగనుండి గోదావరీతీరమున పశ్చిమోత్తరదిశనున్న ప్రతిష్ఠాననగరము వారి కుపకేంద్రముగ నుండెనని కొందరును, మరికొందరీనగరమున కట్టి ప్రాముఖ్య ముండియుండలేదనియు వాదించుచున్నారు.

నేటి కృష్ణాతీరమున శ్రీకాకులమను ప్రసిద్ధస్థలమున్నది. అచటి దైవమునకు ఆంధ్రవిష్ణువనియు, ఆంధ్రవల్లభుడనియు పేర్లు కలవు. శ్రీకాకొలను అను పదము సిరిక, కొలను అను రెండుమాటల కలయికవలన నేర్పడినదనియు, ఇందలి సిరిక శబ్దము శ్రీక లేక శ్రీముఖ అను మొదటి సాతవాహనరాజు పేరనియు నొక వాదము కలదు. ఇటీవల "సాతవాహన" అను రాజుయొక్క నాణెములు కొన్ని దొరికినవి. సాతవాహనరాజులలో మొదటివాడుగ పరిగణింపబడుచున్న శ్రీముఖుడును సిముకసాతవాహనుడని పేర్కొనబడినాడు. అతని తమ్ముడగు కృష్ణుడు సాతవాహనకులజుడుగ వర్ణింపబడినాడు. ఈకారణములనుబట్టి పై సాతవాహనుడను రాజు సిముకునికి పూర్వుడని చెప్పవలసియున్నది. ఇతని నాణెములు నాలుగు దొరికినవి. అందు ఒకటి ఔరంగబాదులోను, మరియొకటి పూనాలోను కొనబడినవి. అవి దొరికిన స్థలమేదియో తెలియదు. మూడవనాణెము ఓరుగల్లులో దొరికినది. సిముకాదుల శాసనాదికములు మహారాష్ట్రమున కనిపించుచున్నవి. ఇందుమూలమున సాతవాహనులు మహారాష్ట్రమును జయించుటకు పూర్వము ఆంధ్రదేశమునం దధికారమును సాగించిరని తెలియనగుచున్నది. అప్పటికే ధాన్యకటకనగరము మహావైభవోపేతమై ప్రధానాంధ్రనగరముగ నుండెను. సాతవాహనుల అధికారము మహారాష్ట్రమున కొంతకాలము సాగినపిమ్మట క్షహరాటులనువారు వీరిని అటనుండి తరిమివేసి ఆప్రాంతము నాక్రమించిరి. గౌతమీ

పుత్రశాతకర్ణి యను సాతవాహనరాజు క్షహరాటులను నిర్మూలించి, యీప్రాంతమునంతను జయించి పరిపాలించెను. అతడు జయించిన దేశములపట్టిక గల యొక నాసికశాసనమునందు ఆంధ్రదేశమునందలి యేభాగమును పేర్కొనబడలేదు. కాని అతని పతిత్వమునందున్న పర్వతముల పట్టికలో తూర్పుకనుమలలోని మహేంద్రచకోరశ్రీస్థానపర్వతములు పేర్కొనబడియున్నవి. ఈపర్వతములకిటునటుగల ఆంధ్రదేశ మతనికి విజితము కానిచో పూర్వులనుండి సంక్రమించినది కావలెనుకదా! అప్పుడు క్షహరాటులు మహారాష్ట్రము నాక్రమించినప్పటినుండి గౌతమీపుత్రుడు దానిని తిరిగి జయించినప్పటివరకును గల మధ్యకాలపు అతని పూర్వులు ఆంధ్రదేశముననే పరిపాలించియుండవలెనుకదా! ఈరాజైనను తన 18వరాజ్యసంవత్సరము ప్రాంతముననే పశ్చిమదిగ్విజయము చేసియుండెను. అంతకు పూర్వ మితడును ఆంధ్రదేశమున పరిపాలించి యుండవలెను. అగుచో ఈరాజుల కేదైన నొకరాజధాని ఉండియుండవలెనుకదా. అట్టియోగ్యతకు ధాన్యకటకనగరము సర్వవిధములను తగియున్నది. ఇటీవల నీస్థలమున గౌతమీపుత్రుని చైత్యనామములు లభించుట ఈయూహను బలపరచుచున్నది. గౌతమీపుత్రుని కుమారుడగు పులోమావి పైఠాను లేక ప్రతిష్ఠానపురమునుండి రాజ్యమేలెనని ఒక ఆధారమున కలదు. ఇతనికి పూర్వము కొంతకాల మీనగరము సాతవాహనులకు కొందరికి కేంద్రముగ నుండెననుటకాధారములు కలవు. కాని పులోమావి నవనర లేక నవనగరస్వామీ అని వర్ణింపబడినాడు. ఈయంశములను సమన్వయించి క్షహరాటులు ప్రతిష్ఠానమును ధ్వంసముచేసియుందురనియు, పిమ్మట దీనిని పులోమావి తిరిగి కట్టించి, యటనుండి పాలించుటచే నవనగరస్వామి అయ్యెననియు కొందరు పండితులు ఊహించినారు. అప్పుడీనవనగరనిర్మాణమునకు పూర్వము పులోమావికిని ధాన్యకటకము రాజధానిగనుండెనని చెప్పవచ్చును. గౌతమీపుత్రయజ్ఞశ్రీకి పిమ్మట సాతవాహనరాజులు మహారాష్ట్రమును కోల్పోయి ఆంధ్రదేశమునే పరిపాలించిరి. వారికి ధాన్యకటకమే రాజధానిగ నుండియుండును. సాతవాహన సామ్రాజ్యము చెల్లిపోయిన పిమ్మట కొంతకాలము విజయపురి (నాగార్జునకొండ) నుండి ఇక్ష్వాకులును, ఆమీద నాలుగు శతాబ్దముల కాలము పల్లవులు నీప్రాంతము నేలిరి. ప్రాచీన పల్లవుల యేలుబడిలో కడకము లేక కటకము అను ధాన్యకటకమున వారిప్రతినిధి యొకడుండెను. కాంచీపురము రాజధానిగనుండెను. పల్లవులకు పిమ్మట నీ ప్రాంతమును ఏలిన తూర్పుచాళుక్యులకు వేంగీ, విజయవాడ, రాజమహేంద్రవరములు రాజధానులుగ నుండినవి. అందువలన ధాన్యకటకముయొక్క రాజకీయప్రాముఖ్యము తగ్గిపోయెను. క్రీ. శ. 12, 13శతాబ్దులలో కోటవారను రాజవంశీయులు ధరణికోట కేంద్రముగ నొక రాజ్యము నేర్పరచుకొని పరిపాలించిరి. ఆమీద నీప్రాంతము కాకతీయసామ్రాజ్యమున చేరిపోయెను. అనంతరము కొండవీటిరెడ్ల ఏలుబడి వచ్చెను. ఆకాలమున ధరణికోట వారికి ముఖ్యమగు సీమాకేంద్రముగ నుండి రెడ్లకును వెలమవారికిని జరిగిన యుద్ధములకు రణక్షేత్రమయ్యెను.

అమరావతీమహాచైత్యము క్రీ. పూ. 3వ శతాబ్ది ఉత్తరార్ధమునాటికే ఉండినట్లు అందలి ప్రాచీనప్రాకృతశాసనములు తెలుపుచున్నవి. దీని స్థాపనకు మహాదేవుడను బౌద్ధభిక్షువు కారణమై యుండవచ్చునని పైన చెప్పియుంటిమి. అట్లే దీని అభివృద్ధికి సుప్రసిద్ధబౌద్ధాచార్యుడును, అపరబుద్ధుడని ప్రసిద్ధినందినవాడు నగు ఆచార్యనాగార్జునుడు కారణమయ్యెను. హ్యూయాన్‌ప్వాంగు దక్షిణకోసలకు 300లీల దూరమునందున్న ఒక కొండమీద ఆచార్య నాగార్జునునికొరకై సాతవాహనరాజొకడు ఒక సంఘారామమును నిర్మించెనని వ్రాసి యున్నాడు. అమరావతీమహాచైత్యము చుట్టు నుండిన ప్రాకారమును ఈబౌద్ధాచార్యుడు కట్టించెనని తారానాథుడు వ్రాసినాడు.

ఈయాచార్యుడు శ్రీపర్వతమునందలి తన విహారమున చిరకాలమునివసించి అచటనే మరణించెనని టిబెట్‌లోని గాథలు చెప్పుచున్నవి. సాతవాహనరాజులగు వాసిష్ఠీపుత్రి పులోమావి, శివమకసాతకర్ణి, యజ్ఞశ్రీల ప్రశంస ఇచటి శాసనములలో కనిపించుచున్నది. హ్యూయాన్‌ప్వాంగు వ్రాతలలో నీస్తూపము ప్రశంసింపబడినది. మంజుశ్రీమూలకల్పమను బౌద్ధగ్రంథమునందు ఈచైత్యము జినధాతుధరమని చెప్పబడినది. గండవ్యూహమను నొక ముఖ్యమహాయానగ్రంథమునందు ధాన్యకటకమునకు సమీపమున నొక ఆరామమును, మాలాధ్వజవ్యూహవిహారమును కలవనియు, ఆర్యమంజుశ్రీ అందునివసించి ధర్మబోధ చేసెననియు పేర్కొనబడినది. ఈస్తూపము చైత్యకులను భిక్షుసంఘమువారిదని యిచటి శాసనములవలన తెలియుచున్నది. క్రమక్రమమున బౌద్ధులలో క్రొత్తక్రొత్త శాఖలు బయలువెడలి తుదకు శాక్తములోని వామాచారమువంటి శాఖ ఒకటి వచ్చినది. ఈసంఘారామములలో భిక్షువులతోపాటు భిక్షుణీలు నుండుచుండిరి. ఈకారణమున కడపటిదశలో సౌజన్యసౌశీల్యములకును, ఉన్నత జీవితమునకును ఆటపట్టులుగనుండిన ఈవిహారములు అవినీతికిని, అక్రమప్రవర్తనమునకును ఆకరములైనవి. ప్రజాదరము పోయెను. రాజాదర మసలే లేకుండెను. బౌద్ధప్రాబల్యమును నశించెను. అందువలన భిక్షుభిక్షుణీలు మతాంతరము నవలంబించుటయో లేక స్థలాంతరమున కేగుటయో జరిగి ఇచటి కట్టడములు పాడుపడి దిబ్బదేరి పోయినవి. మహాచైత్యము దీపమాలికలతో శోభించిన విధమును, విహారములయందు ప్రబలిన అవినీతియు ప్రజాహృదయమున హత్తుకొని పోయి మహాచైత్యమును కప్పిన దిబ్బ దీపాలదిన్నెయనియు, తక్కినదిబ్బలు "లంజదిబ్బ" లనియు పేరందినవి.

చింతపల్లినుండి అమరావతీగ్రామమునకు రాజా వెంకటాద్రినాయుడు తన యునికిని మార్చువరకును ఇచట దిబ్బలుమాత్రమే ఉండెను. ఆజమీందారు ఇక్కడ నొకసౌధమును నిర్మించుచు రాళ్ళకొరకు చుట్టుప్రక్కల వెతికించెను. దీపాలదిన్నెయను దిబ్బలో పెద్దపెద్ద యిటుకలును, శిల్పములుగల చలువరాతి పలకలు నున్నవని యెవరో చెప్పగ నిందు ధనమేమైన దొరకునేమోఅని దీనిని త్రవ్వించెను. పాతు ఏదియు దొరకలేదు. దొరికిన కొన్ని పలకలను పగులగొట్టి సున్నము చేసిరి. కొన్నిటిని ఒక చెరువుకు మెట్లు కట్టుట కుపయోగించిరి. మరికొన్నిటిని శిల్పములన్నియు పోవునట్లు అరగదీసి మహమ్మదీయులు ఒక్క

మసీదులో గోడలలో చేర్చుకొనిరి. 1797లో కల్నల్ మెకంజీ అనునత డీ స్తూ ప ము ను చూచెను. 1830లో సిబ్బందితో వచ్చి ఇతడు దీపాలదిన్నెను మరికొంత త్రవ్వి కొన్ని పలకలను బందరుకును, కొన్నిటిని మదరాసుకలకత్తాలకును పంపెను. అందు కొన్ని లండను చేరినవి. మెకంజీ వదలివెళ్ళిన వానిని గ్రామస్థు లుపయోగించుకొనిరి. 1830లో రాబర్టుసన్ అను బందరు కలెక్టరు ఆనగరమున తన పేర కట్టబడిన పేట నలంకరించుటకు అమరావతినుండి 33పెద్ద చలవరాతిపలకలను తెప్పించెను. 1835లో అప్పటి మదరాసుగవర్నరు అమరావతి వచ్చి యచటి శిల్పములను చూచి వాటిలో కొన్నిటిని తనరాజధానికి పంపవలెనని కోరగా వానిని కృష్ణాకలెక్టరు డా॥ అలెగ్జాండరు అను మిషనరీవద్ద బందరులో దాచెను. ఈచలవరాతిపలకలను చూచి వ్యామోహితుడై ఆడాక్టరు వానిలో మూడిటిని తాను దాచుకొని మిగిలినవానిని చన్నపట్టణము పంపుటకు ఇచ్చెను. 1859లో ఇవి లండనుకు పంపబడి ఇండియామ్యూజియంలో ఉంచబడెను. 1882లో ఈడాక్టరు మరణించిన పిమ్మట ప్రభుత్వమువారు అతనిభార్యవద్ద వానిని కొనుకొ్నిరి. 1845లో వాల్టర్ ఎలియట్ అను గుంటూరుకమీషనరు దీపాలదిన్నెను త్రవ్వి మరికొన్ని పలకలు సంపాదించి మదరాసు పంపెను. మహా చైత్య ప్రాకారమునందలి భాగములును, మనోహర శిల్పశోభితములునగు నీశికములును లండనుకు చేర్చబడి బ్రిటిష్‌మ్యూజియం మేడమెట్లకు ప్రక్కన పిట్టగోడగ న మ ర్ప బ డె ను. 1876లో సూయల్ అమరావతిలో మరికొంత ఖననము చేసెను. ఈపని ఒడ్డెవారిచేత చేయించుటవలన చాలపలకలు ధ్వంసము చేయబడెను. 1881లో బర్జెస్ ఇచ్చటికి వచ్చునప్పటికి స్తూపముండినచోట నొక పెద్దగొయ్యి మాత్రముండి, దాని కట్టడమునందలి రాయి ఒక్కటైనను కనిపింపలేదు. సూయల్ త్రవ్వించి బయటవేయించినవి 255శకలము లుండెను. దిబ్బలో మరియొకచోట ఖననము చేసి బర్జెసు మరి 90పలకలను సంపాదించెను. ఇవియు మదరాసు చేర్పబడి రెండేండ్లు ఒకమూల పడియుండినవి. ఆమీద అందలి హాలులో నివి యేదోఒకవిధమున అమర్పబడినవి. 1891లో అలెగ్జాండరు రీ అమరావతికి వచ్చి మరి 200పలకలను మదరాసు పంపెను. 1906_09లో మరికొంత ఖననము చేసి మరికొన్ని పలకలు సంపాదించెను. ఇవిగాక ఇతనికి ఇచ్చట చక్కని కంచువిగ్రహములు దొరికినవి. ఇవి దక్షిణాపథమునందంతటను దొరికిన కాంశ్యప్రతిమలలో ప్రాచీనతమములు. ఈవిధమున నీఅమరావతీమహాచైత్యము దిక్కులేనిబిడ్డవలెనయి అందలి శిల్పములు ఎవరికిదొరికినవి వారు సంగ్రహింపగా పలుతావులకు చెదరిపోయినవి. అమరావతిలో మాత్రము పెద్దగొయ్యిని, దాని అంచున ఒకచిన్నశాలలో విరిగిపోయినవియు, ఎవరికిని పనికిరాకుండినవియు కొన్ని చలవరాతిపలకలు మాత్రము ఉన్నవి.

అమరావతిలోని ముఖ్యనిర్మాణము మహాచైత్యమని ఇదివరలో చెప్పియుంటిమి. ఏదైన నొకచోట పెక్కుచైత్యములుండి అందొకటి ముఖ్యమైనదయినప్పుడు దానికి మహాచైత్యమని వ్యవహారమేర్పడును. చైత్యములు శారీరకములనియు, ఉద్దేశికములనియు, పారిభోగికములనియు మూడువిధములు. ఇందు శారీ...

కములు శరీరమునందలి అవశేషములమీద నిర్మింపబడినవి. అమరావతీమహా చైత్యము బుద్ధుని అవశేషముమీద నిర్మింపబడినది. ఇచ్చట మొత్తము చైత్యమంతయు శిల్పింపబడిన చలవరాతిపలకలు దొరికినవి. వాని నుండి యీమహాచైత్య మెట్లుండెడిదో ఊహింపవచ్చును.

ముందుగ నేలను సదును చేసి దానిమధ్య వలయాకారముగ మట్టి పోసి దానిని దిమిశా చేసిరి. ఇట్లు వరుసపైవరుసగ మట్టి పోసి దానిని గట్టిపరచుచు పోగా ఒక గుండ్రటి దిబ్బ యేర్పడును. ఆనురుద్రినాగార్జునకొండ మున్నగు కొన్నిచోట్ల ఈవలయము మధ్య నుండి అంచులవరకును బండిచక్రములో కుంచమునుండి అంచువరకును వచ్చు ఆకులవంటి సన్నని గోడలుండి వాటిమధ్యగలభాగము ఇటుకకంకరతోను, మట్టితోను పూడ్చబడెడిది. అమరావతిలో ఈవలయపు లోభాగ మెట్లుండెడిదో తెలియదు. ఈవలయాకృతికల భాగమునకు వేదిక అని పేరు. దీని యెత్తు 6 అడుగు లుండెను. చుట్టుకొలత 521 అడుగులు. ఈవేదికకు అడుగునను పైనను అంచులు కట్టబడి యుండెను. ఈఅంచులును, వీని మధ్యనుండెనభాగమునుకూడ చక్కని శిల్పములుగల చలవరాతిపలకచే మలచబడెను. ఈవేదికమీద చుట్టును కొంతభాగము వదలబడి లోభాగమున తిరిగీ వరుసలువరుసలుగ వేసి గట్టిచేయబడిన మట్టితోనో లేక చక్రపు ఆకులవంటి గోడలతోనో బోర్లించబడినగిన్నె ఆకారము వచ్చు అండము నిర్మింపబడెను. దీని చుట్టుకొలత 435 అడుగులు. అండము అగ్రమున చతురస్రమో, చతురశ్రమో అయిన పెట్టెవంటి హార్మిక ఉండెను. ఈహార్మిక మధ్యనుండి పైకి పోవు స్తంభ మొకటి యుండెను. దానిపైని ఛత్ర ముండెను. అండముపైన అడుగునుండి కొంతవరకును చలవరాతిపలకలు మలచబడినవి. ఆపైన కొంతదూరము శిల్పములు లేని పలకలును, పిమ్మట మరికొంతభాగము శిల్పఫలకములును ఉండియుండెను. పైన ఉండిన హార్మికకూడ చక్కగ చెక్కబడియుండెను. మహాచైత్యము చుట్టును సుందరమైన ప్రాకార మొకటి యుండెడిది. దీనికిని చైత్యమునకును మధ్య 30 అడుగుల ఖాళీస్థల ముండెడిది. ఆనాటి యాత్రికులు దీనిని ప్రదక్షిణపథముగ నుపయోగించెడివారు. ఈప్రాకారము అడుగున ఒక అడుగు ఎత్తుగల అధిష్ఠానమను అరుగుండెడిది. దీనిపైన 9 అడుగుల ఒక అంగుళము ఎత్తుగల ఊర్ధ్వపుటములను నిలువు స్తంభము లుండెడివి. వీనికడ్డముగ 3 అడుగుల 6 అంగుళముల వెడల్పుగల సూచులను అడ్డకమ్ములు మూడేసివరుస లుండెడివి. ఈస్తంభములకు పైన 1 1/2 అడుగుల ఎత్తున మకురువలె గోడుగనుండిన ఉష్ణీషముండెను. నిలువు స్తంభములమధ్య కొట్టబడిన కంతలగుండా అడ్డకమ్ములు దూర్చబడినవి. అట్లే ఉష్ణీషపు అడుగుభాగమున చెక్కబడిన కంతలలోనికి నిలువుస్తంభముల అగ్రములు అమర్చబడినవి. ఈప్రాకారమువెలుపలివైపు 13 అడుగులును, లోవైపు 10 అడుగులును ఎత్తు కలిగియుండెను. ఈప్రాకారమున నాలుగు దిశలను ఖాళీ లుండెను. ఇచ్చట ప్రాకారమున కడ్డముగ కోణ మేర్పడునట్లు రెండువైపులను రెండుగోడ లుండెడివి. ఇవికూడ ప్రాకారమువలెనే 22 ఊర్ధ్వపుటములతోడను, 63 సూచులతోడను నిర్మింపబడెను. ఈగోడముందు 3 నిలువుస్తం

-భములును వానికడ్డముగ 12 సూచులును రెండువైపులనుండి యాస్తంభాగ్రములమీద సింహములు నుండెడివి. ఈవిధమున ప్రాకారమున నలుదిశలను నాలుగు సింహద్వారములుండెడివి. ఈద్వారముల వెడల్పు 26 అడుగులును, లోతు 16 అడుగులు నుండెను. లోపల చైత్యవేదికకు ఈద్వారములకెదురుగ కొంచెము ముందుకు చొచ్చుకొని వచ్చునట్టు నాలుగువైపులను నాలుగు దిమ్మ లుండెడివి. ఈదిమ్మలలో నొక్కొకదానిమీద ఐదేసి వంతున మొత్తము ఇరువది ఆయకస్తంభములుండెడివి. ఈస్తంభముల అధోభాగము చతురస్రముగను, మధ్యభాగ మెనిమిది ముఖములు కలదిగను అగ్రము అర్ధవలయాకారముగను ఉండును. ఇట్లు 192 అడుగులవ్యాసమును, 600 అడుగుల చుట్టుకొలతను, కలిగిన ప్రాకారముతోను, 162 1/2 అడుగుల వ్యాసమును, 100 అడుగుల యెత్తును కలిగిన చైత్యముతోను మొత్తముమీద 16,800 అడుగుల వైశాల్యముగల సుందరశిల్పసంపదతోను ఈఅమరావతిమహాచైత్యము అనుపమమగు కట్టడమై యుండెను.

ఈమహాచైత్యమునందలి పైన పేర్కొనబడిన అన్నిభాగములును మనోహరములగు చిత్రములతో శోభించుచుండెడివి. చైత్యము చుట్టునుండిన ప్రాకారముయొక్క వెలుపలి భాగమున అట్టడుగుననుండెడి అధిష్ఠానమను అంచులోగల రాళ్ళమీద సింహములు, ఏనుగులు, ఎద్దులుమున్నగు జంతువులు జవముతో పరిగెత్తుచున్నట్లు చిత్రింపబడినవి. మధ్యమధ్య హాస్యజనకములగు అవస్థలలో బాలురు చెక్కబడినారు. ఈఅధిష్ఠానముమీదగల ఊర్ధ్వపుటములను నిలువుస్తంభములమీద అడుగున నొక అర్ధకమలము, దానిమీద నొక కథాదృశ్యము, ఆమీద పూర్ణకమలము, ఆపైని మరియొక దృశ్యము, అగ్రమున మరియొక అర్ధకమలము నున్నవి. రెండేసి స్తంభములకు మధ్యగల మూడువరుసల అడ్డుకమ్ముల మీదను పూర్ణకమలములు కలవు. ఈస్తంభములమీదనున్న ఉష్ణీషమను మదురుమీద కెరటములవలెనున్న పుష్పమాలిక కలదు. ఈమాలిక పైకి వంపుతిరిగినచోట దానిని భుజముపై మోయుచున్నట్లున్న మనుష్యులును, అది క్రిందికి వంగినచోట ఆవంపుపైన బోదివృక్ష, ధర్మచక్ర, త్రిరత్న, నాగయక్ష చిత్రములును కలవు. ఈప్రాకారము లోభాగమున నేలమట్టము వెలుపలికంటెను 3 అడుగుల ఎత్తైనది. నేలమట్టమునుండియే నిలువు స్తంభముల అడుగునగల అర్ధకమలము కలదు. ఆమీద నొక దృశ్యము జాతకథలలోనిదో, బుద్ధజీవితములోనిదో ఉండును. దీనిపైన వెలుపలివైపున ఇదే స్థానముననుండు పూర్ణకమలమునకు బదులుగ నీవైపున పూర్ణవలయమున్నది. ఈవలయమునం దొక జాతకకథ శిల్పింపబడియుండును. దానిపైన అర్ధకమలముండును. రెండేసి స్తంభముల మధ్యగల మూడు అడ్డుకమ్ములలో మధ్యదానిమీద నొక పూర్ణవలయమునం దొక జాతకథ ఉండి తక్కిన రెండుకమ్ములమీదను పూర్ణకమలము లుండును. ఉష్ణీషముమీది జాతకములలోని కథలో, బుద్ధజీవితమునందలి ఘట్టములు చెక్కబడియుండును. మహాచైత్యము అట్టడుగున వేదికక్రిందిభాగమున చక్కని అంచు కలదు. దానిమీద వడిగా పరుగెత్తుచున్న సింహములవరుస మనోహరముగ చిత్రింపబడినది. ఈఅంచుమీద 6 అ[illegible]డు

ఎత్తును 11/2 అడుగుల మందమును గల శిల్పఫలకములు చైత్యముచుట్టును ఉండెడివి. వీనిపై సర్వాంగసుందరమగు చైత్యము చెక్కబడియున్నది. ఇట్టి రెండేసి చైత్యఫలకములకు మధ్య సన్నని పలకలున్నవి. వీనిపై ధర్మ చక్రమో, బోధివృక్షమో, చైత్యమో అగ్రమునగల స్తంభములు చెక్కబడియున్నవి. ఈస్తంభములమీదను, చైత్యఫలకములమీది ఆయకస్తంభముల క్రిందిభాగమునను జాతక కథలో బుద్ధచిత్రములో ఉండును. ఈవేదికా ఫలకముల అగ్రభాగమున వెడల్పయిన అంచు కలదు. ఇది అడ్డుగ అయిదువిభాగములుగ నున్నది. అందు పైవిభాగమున పుష్పములును, రెండవదానిలో గోడయు, మూడవదానిలో పరుగెత్తుచున్న సింహవరాహావృషభోష్ట్రములును, నాలుగవదానిలో గూళ్ళును, ఐదవదగు అట్టడుగుభాగమున శాసనములును కనిపించుచున్నవి. ఈవేదిక వెనుక అండము కలదు. ఈఅండము అడుగు అంచునుండి దీని మధ్యగల హార్మికవరకును చుట్టునుగలభాగము ఏడువిభాగములుగ లున్నది. అట్టడుగు విభాగమున బోధివృక్షములో లేక పూర్ణకుంభములో వరుసగ చుట్టును ఉండును. దానిపై నుండు రెండవవిభాగమున ధర్మచక్రములును, మూడవదానిలో చైత్యములును, నాల్గవదానిలో సింహములును, అయిదవదానిలో త్రిరత్నచిహ్నమును ఉండును. ఆరవవిభాగమునం దేశిల్పమును లేక శూన్యముగ నుండును. దానిపైన పుష్పమాలికయు అందందు మనుష్యులయొక్కయు, జాతకబుద్ధగాథలయొక్కయు చిత్రము లుండును. ఈఅండము మధ్యనుండు హార్మిక చతురముగనో చతురస్రముగనో ఒక క్రమ్మరపువలె నగిషీపనికలిగి యుండును.

ఇట్లు మహాచైత్యముమీదను, ప్రాకారము మీదను వేలకొలది మనోహరములగు శిల్పములు చెక్కబడియున్నవి. ఇవిగాక విడిపలకల మీద శిల్పింపబడిన కొన్ని విగ్రహములు కూడ అమరావతిలో దొరకినవి. ఇందు బుద్ధుని ప్రతిమ మిక్కిలి ముఖ్యమైనది. ఇది ఉత్తరదేశమున గాంచనగు విగ్రహములకు భిన్నముగ నుండి కొన్ని ప్రత్యేకలక్షణములను కలిగియున్నది. మరికొన్ని యక్షులవిగ్రహములు దొరికినవి. కొన్ని బుద్ధపాదములు చెక్కిన పలక లున్నవి.

శిల్పములును, నిగిషీలునేకాక ఈమహాచైత్యముమీద పెక్కు శాసనములును కలవు. ఈశాసనములు బ్రాహ్మీలిపిలో, ప్రాకృత భాషలో చెక్కబడియున్నవి. తరువాతకాలపు దేవాలయములలో ఆయాఆలయములకు చేయబడిన దానములను తెలుపుటకును, వానిలోని స్తంభమంటపగోపురాదుల నిర్మాణమును తెలియచేయుటకును తరువాతకాలపు వారు శాసనములను చెక్కించినట్లే ఈమహాచైత్యమునందలి వివిధభాగములను చెక్కించి దానము చేసిన దాతలును వారివారి పేర్లను, చేసినదానములను ఆయాశిల్పముల అంచుల మీద చెక్కించెడివారు. ఈ అమరావతీ ప్రాకృతశాసనములు అట్టిదానశాసనములే. ఈశాసనములలోని అక్షరములలో అనేక భేదము లున్నవి. అవి ఒక్కొకకాలమున నొక్కొక విధముగ నుండును. ఈశాసనాక్షర విన్యాసమునందలి భేదములనుబట్టియే ఇవి క్రీ. పూ. 200 క్రీ. శ. 250 వరకు చెక్కబడినవని నిశ్చయించుటకు వీలు కలుగుచున్నది. ఈశాసనములున్న శిల్పములును ఆయాకాలములవే కావలెను. లిపిభేదమున కనుగుణ్యా

ముగ శిల్పములందును భేదము కనవచ్చుచున్నది. అందువలన నీమహాచైత్యముయొక్క నిర్మాణము నాలుగు కాలములలో నాలుగు దశలలో జరిగెననియు తెలియనగుచున్నది. ఈశాసనములలో చాలభాగము యాత్రికులు, భక్తులు వేయించినవి. అందుకొన్ని మాత్రము వాసిష్ఠీపుత్రపులోమావి, శివమక సాతకర్ణి, గౌతమీపుత్రయజ్ఞశ్రీ అను ముగ్గురు సాతవాహనరాజులను పేర్కొనుచున్నవి. వాకోటక అను తెగపేరు ఒకశాసనమున కలదు. ఇది వాకాటకశబ్దము కావచ్చును. అగుచో నిది చరిత్రప్రసిద్ధమగు వాకాటకరాజవంశపు పేరు అగును.

అమరావతీమహాచైత్యము అందుదొరికిన శాసనములమూలముగను, అందలి శిల్పములలోగల పరస్పరభేదములమూలమునను, ఈ శిల్పములను ఇతరస్థలములలో గాంచనగు శిల్పములతో సరిపోల్చుటవలనను నాలుగు వివిధకాలములలో నిర్మింపబడెనని తెలియనగుచున్నది. ఇందు మొదటిదశ క్రీ. పూ. 200ప్రాంతపుది. ఈకాలమున నిర్మింపబడిన శిల్పములు మోటుగను, సంకేతములలోకూడి నవిగను ఉండి శిల్పి బహునియమములకు లోనై వర్తించెనని చూపుచున్నవి. రెండవదశ క్రీ. శ. 100ప్రాంతవుది. ఈకాలపు శిల్పములలో మునుపటికంటె అభివృద్ధియు, సౌందర్యమును, శిల్పియొక్క స్వేచ్ఛావృత్తియు గాంచనగుచున్నవి. మూడవదశ క్రీ. శ. 150 ప్రాంతపుది. నాలుగవదశ క్రీ. శ. 200–250 కాలపుది. ఈకడపటి రెండుదశలయందును శిల్పి తనకౌశలము నపారముగ చూపినాడు. మహాచైత్యమున అంతకు పూర్వముండిన నిరాడంబర శిల్పములకు బదులుగ వైభవోపేతములగు శిల్పములను మలచుటయేగాక నాటి ఆంధ్రశిల్పు లీకాలమున మహోజ్జ్వలమును, నిరుపమమునుఅయిన చైత్యప్రాకారమును నిర్మించిరి. అమరావతీశిల్పములలో నెల్ల ఎక్కువభాగము మూడవదశలో నిర్మింపబడినవి. ఇవి అన్నింటికంటెనుకూడ మనోహరములైనవి. అమరావతీశిల్పసాంప్రదాయమున కివి ఉత్తమోత్తమ నిదర్శనములని చెప్పవచ్చును. ఈశిల్పములలో చాలభాగము మహాచైత్యప్రాకారమున బిగింపబడినవి. ఈప్రాకారము ఒకసాతవాహనచక్రవర్తి ఆదరప్రోత్సాహములతో ఆచార్యనాగార్జునుని పర్యవేక్షణలో నిర్మింపబడెనని ఐతిహ్యము. ఈశిల్పముల సౌందర్యము ఆచక్రవర్తియొక్క, ఆఆచార్యుని యొక్క మహత్వమునకు తగియున్నది.

ఇచటి శిల్పములు బహువిధములైనవి. వీనిలో పూరిగుడిసెలు మొదలు మహాప్రాసాదములవరకునుగల అనేకవిధముల వాస్తువులున్నవి. శిలావేదికలు మొదలు శోభాయమానములగు మంటపములవరకునుగల విశ్రమస్థానము లున్నవి. బహువిధములగు నదీనదములును, వృక్షలతాగుల్మములును, జలచరపక్షి జంతుజాలములును, అన్నిశ్రేణులకును చెందెడి మానవజీవితమునందలి దృశ్యములును, యక్ష కిన్నరగరుడాదులును, దేవతలును, స్త్రీపురుష బాలబాలికలును, కుబ్జవామనాదులును, కల్పితజంతువులును, పలురకముల బౌద్ధమత చిహ్నములును, వీనిలో గాంచనగుచున్నవి. కొన్ని శిల్పములు ప్రత్యేకముగ నొక చిహ్నమునో, ఒక వ్యక్తినో, ఒకజంతువునో చూపునవి. కొన్ని కథాశిల్పములు. ఈకథాశిల్పములలో కొన్ని బోధిసత్త్వుని పూర్వజన్మలలో జరిగిన వృత్తాంతములను చిత్రించు జాతకపేడు

అవదాన శిల్పములు. మరికొన్ని బుద్ధుని జీవితమునందలి వివిధఘట్టములను చూపు బుద్ధశిల్పములు. ఈకథావస్తువులను చిత్రించుటలో నాటి ఆంధ్రశిల్పులు ప్రశంసనీయమగు ఉపజ్ఞను, కళాకౌశలమును చూపినారు. అట్టి కథాశిల్పములు పైన పేర్కొనబడిన నాలుగుదశలలో నిర్మింపబడిన చెక్కడములందును గాంచనగుచున్నవి. వానిని ఆయానిర్మాణకాలముల ననుసరించి యీక్రింద వివరించుచున్నాము.

మొదటిదశ క్రీ. పూ. 200—100

ఈకాలపు శిల్పములు తరువాతవానితో సరిపోల్చి చూచినచో మోటుగను, ప్రారంభావస్థయందున్నట్లును కనిపించును. వీనిలో కనిపించు మానవాకృతులు కొయ్యబారిన ట్లున్నవి. వాని చిత్రణమునందు సహజములగు వంపులును, భంగిమములును కనిపింపవు. అందువలన ఆయాసందర్భములలో ఆయాఅవస్థలలో చూడనగు మానవుల బొమ్మలు వికారములుగ కనిపించును. అవయవవిన్యాసమును మోటుగ నుండును. ముఖములు కళావిహీనములై మొద్దుబారి యున్నవి. పెదిమెలు తుట్టపెదిమలు. చేతుల వ్రేళ్ళు వంకరలు లేక కర్రలవలె పొడుగుగ నుండును. ఆభరణములు ఎక్కడివక్కడ అవయవములకు అతికినట్లుండును. కాని ధరింపబడి సహజస్థితియందున్నట్లు కనిపింపవు. పాదములుకూడ మొద్దుగనే ఉండి రెండుమడమలును ఒకదానికొకటి తగిలియుండి విసనకర్రవలె విప్పుకొని యుండును. బహువిధముల వామనులును, కుబ్జులు నీశిల్పమున గాంచనగుచున్నారు. మానవశిల్పములలోవలెనే జంతుశిల్పములయందును స్తబ్ధత్రక్షమును, మోటుతనమును గాంచనగుచున్నవి. హంసలు మున్నగు పక్షులలో ఠీవి, వేగము, లేదు. ఈకాలపు మనుష్యేతరశిల్పములలో ముఖ్యముగ గమనింపదగినవి రెండు కలవు. అందొకదానిలో బానకడుపుతో, కురుచలయిన కాళ్లుచేతులతో, సదునైన ముఖముతో, క్రిందకు పడుచున్నట్లున్న నుదురుతో చేటలవంటి పెద్దచెవులతో నొకవిగ్రహము కలదు. ఒకతొండము మాత్రము తగిలించినచో ఇది తర్వాతకాలపు గణపతివిగ్రహమగును. కాననిది గజాననవిగ్రహముయొక్క ప్రాథమికస్థితి యని చెప్పవచ్చును. అట్లే పాపిటకెదురుగ అర్ధచంద్రాకృతిగల ఆభరణముతో, చేతులకు వలయములతో, కాళ్ళకు కడియములతో తొడలనుమాత్రము మూయు లాగువంటి అర్ధోరుకముతో ఒక కమలముమీద కూర్చొని కుడికాలు కొద్దిగను, ఎడమకాలు పూర్తిగను వంచి దేనినో తన్నిపెట్టి, ఒక మకరమునోటి నుండి ఒక పుష్పమాలను బలముగ లాగు చున్న స్త్రీ చిత్ర మున్నది. ఇది శ్రీ లేక లక్ష్మియొక్క బొమ్మఅని నిరూపింపబడినది.

ఈదశకు చెందిన శిల్పములు విడిపలకలమీదనో, స్తంభములమీదనో లేక ఉష్ణీషము మీదనో ఉన్నవి. వానియందు ఈక్రింది కథాదృశ్యములు చెక్కబడియున్నవి :—

మహాభినిష్క్రమణము :— ప్రపంచమునందలి దుఃఖమునుబాపి, మానవకల్యాణము సమకూర్చు నుద్దేశముతో సిద్ధార్థుడు ఒకనాటి అర్ధరాత్రమున కంటకమను తన గుఱ్ఱము నెక్కి, చన్నుడను అశ్వరక్షకుని తనతో తీసికొని ఇల్లు విడచి పోయి, నెరంజరా నదీతీరమును చేరి, అచ్చట తన వేషభూషలను తీసి వేసి గుఱ్ఱమును, చన్నుని వెనుకకు పంపి వేసెనని కథ. దీనికే బౌద్ధులు మహాభినిష్క్రమణ

యని పేరు పెట్టిరి. ఆరుముఖములుగల ఒక స్తంభము అడుగున కుడివైపున ఈఘట్టము చెక్కబడినది. దృశ్యము పైవరుసలో మధ్య నుండి కుడివరకును కెరటములు కలవు. వీని అంచున నెరజరా అని నదిపేరు చెక్కబడినది. దృశ్యము మధ్య ఎడమవైపున నొక నగర ప్రాకారమును, దానిలోని ఒకద్వారమును కలవు. ఈద్వారము సాంచీద్వారమును పోలి యున్నది. ఈద్వారమునుదాటి ఒక గుర్రము ముందుకు పరుగెత్తుచున్నది. దానికి ముందు తన కుడిభుజముమీద ఆన్ని యొక ఛత్రమును పట్టుకొని ఒక మనుష్యుడు పరుగెత్తుచున్నాడు. ఈగుర్రము కంటకమును, ఈమనుష్యుడు చన్నుడు నని స్పష్టమగుచున్నది. ఈకాలమున కింకను బుద్ధునివిగ్రహము శిల్పము లో నికి రాకుండుటవలన చన్నుని భుజముమీది రాజ చిహ్నమగు ఛత్రమును బట్టి గుర్రముమీద గౌతము డున్నట్లు ఊహించుకొనవలెను.

మారధర్షణము :— ఈదృశ్యము క్రింద మరియొక దృశ్యమున్నది. అందు కుడివైపున నొక రాయి కలదు. దానిమధ్య నలుచదర మైన మరియొక వస్తువున్నది. వీటికి కుడివైపున ఉష్ణీషధారియైన ఒకవ్యక్తి నిలచి కుడిచేతితో చిన్న చతురమువంటి వస్తువును పట్టుకొను చున్నాడు. ఈపెద్దచతురము అడుగున దీన వదనయై కూర్చొని ఒక స్త్రీ విచారించు చున్నది. ఆమెకు ఎదురుగ మరియొక స్త్రీ నాట్యభంగిమములో నిలచియున్నది. ఈశిల్పముయొక్క సమన్వయమునుగూర్చి పండి తులలో అభిప్రాయభేదమున్నది. కాని ఇది మారధర్షణఘట్టమని తోచుచున్నది. చతుర ములలో చిన్నది బుద్ధుని ఆసనము. ప్రక్క నున్న ఉష్ణీషధారి మారుడు. ఎదురుగ నాట్యముచేయుచున్నది అతని కూతురు. బుద్ధుని ఏకాగ్రతకు భంగము కలిగించుటకై ఆమె చేసిన యత్న మీనాట్యము. తన యత్నము విఫలమగుటచే విచారించుచు కూర్చొనిన స్త్రీవ్యక్తియు ఆమెయే.

అస్త్రవిద్యాప్రదర్శనము:—అదే స్తంభము మీద మరియొక దృశ్యమున్నది. పైభాగ మున ముందుకు వాలియున్న కప్పును, దాని పైన స్తూపప్రాకారమువంటి పిట్టగోడయుగల డాబాయిల్లును ఉన్నవి. దాని ద్వారమున కెదురుగ చతురస్రమగు ఫలకము నిటు ఇద్ద రును, అటు ఇద్దరును పట్టుకొని నిలచియు న్నారు. వీరికి ఎడమవైపున కుడిచేత నేదియో వంకరగనున్న వస్తువును పట్టుకొని, ఎడమ చేతిని పైకి మోచేతివద్ద వంచి యెత్తి, కుడి కాలు తిన్నగను ఎడమకాలు మోకాళ్ళ వద్ద వంచియు నిలచిన ఒక మనుష్యుడున్నాడు. అతని కాళ్ళమధ్య ఖడ్గము వ్రేలాడుచున్నది. ఇది బాణవిద్యాప్రదర్శనము కావలెను. దీనికి సంబంధించిన కథాభాగ మిది. గోపుడను నత నికి సౌందర్యవతియగు కుమార్తె ఉండెను. అతడు ఆమెను విజ్ఞానమునను, ధనుర్విద్య యందును అందరిని మించినవానికే యిచ్చి వివాహము చేసెదనని చెప్పెను. అంతట ఆనం దుడు, దేవదత్తుడు, సుందరనందుడు, దండ పాణి, సిద్ధార్థుడును పోటీకి నిలచిరట. విజ్ఞాప పరీక్ష అయినపిమ్మట ధనుర్విద్యాపరీక్ష జరిగెనట. అప్పుడు ఒక ఇనుపఢంకా గురిగా ఏర్పరుప బడెనట. సిద్ధార్థుడు దానిని అందరికంటెను దూరమున నుంచుకొని సింహహనువుయొక్క ధనస్సును, ఇతరులు ఎత్తలేనిదానిని, తీసికొని దానికి బాణము సంధించి వదలగా అది ఆయినపఢంకాను దూసుకొని పోయి పీడు

తాళవృక్షములను మొదలులలోనికి నరికివేసె నట. ఈకథ శ్రీమద్రామాయణములోని శ్రీరాముడు శివధనుర్భంగమును, సప్తతాళ భంజనమును చేయుటను స్ఫురింపచేయు చున్నది. ఈకథనుబట్టి పైదృశ్యములో ఎడమ వైపున నిలచినది సిద్ధార్థుడనియు, మధ్య చతు రస్రముగ నున్నది ఢంకా అనియు, దానిని పట్టుకొనినవారు పైన పేర్కొనబడిన నలుగురు యువకులు ననియు ఊహింపనగును.

జటిలగర్వభంగము :— ఈదృశ్య మొక శిల్పఖండముమీద నున్నది. ఇందు పైభాగమున అడ్డుగను నిలువుగను గీతలుగల బండ ఉన్నది. దానిచుట్టును చేతులు జోడించి నమస్కరించు జటాకౌపీనధారులు న్నారు. మధ్యలో నొకడు నిలిచి రెండుచేతులును తల పైకి ఎత్తి నమస్కరించుచున్నాడు. ఈదృశ్యమునకు సంబంధించిన కథ మిక్కిలి రసవంతమైనది. ఉరువెలమను గ్రామమువద్ద నొక యాశ్రమమునందు కశ్యపుడను జటిలు డుండెను. అతడు నతని శిష్యులు నెప్పుడును యజ్ఞయాగాదులను చేయుచు జనుల గౌరవాదరములకు పాత్రులుగ నుండిరి. ఒకసారి బుద్ధుడీయాశ్రమమునకు వచ్చి యుండెను. ఒక రాత్రి కశ్యపుని అగ్నిగృహమున కొక మహానాగము వచ్చెను. దానిని చూచి అందరును భయపడిరి. బుద్ధుడు దానిని వశపరచుకొనెను. ఎల్లరు నతనిని మహాత్ముడని పొగడిరి. కశ్యపుడుమాత్రి మతడు తనకంటెను గొప్పవాడు కాదనెను. పిదప బుద్ధుడీయాశ్రమము ప్రక్క నొక తోటలో కొన్ని రోజు లుండెను. ఒక రాత్రి లోకపాలురును, ఒక రాత్రి ఇంద్రుడును, మరియొకరాత్రి బ్రహ్మయు నతనిని చూడవచ్చిరి. ఈమూడుసమయములందును పరిసరమంతయు పగటివలె ప్రకాశవంతమయ్యెను. ఇదిచూచి కశ్యపుడు ఇకమీదట బుద్ధుడచ్చటనుండినచో తనగౌరవము తగ్గిపోవునని అనుకొనెను. ఇది కనిపెట్టి బుద్ధుడుత్తరకురుదేశమునకేగి భిక్షాటనము చేసి వచ్చెను. బుద్ధుడు తనమనోగతమును తెలిసికొనెనని యెరిగి కశ్యపు డాశ్చర్యపడెను. ఒక నాడు బుద్ధుడు తనవస్త్రమును నుతుకుకొనవలెనని అనుకొనగా శక్రుడొక చెరువు నిర్మించి, బట్టలుతుకు రాయిని కలిపించి యిచ్చెను. బుద్ధుడు చెరువునుండి వచ్చుచుండగా ప్రక్క నున్న కకుదవృక్ష దేవత అతనికి ఊతముగ నొక కొమ్మను వంచి యిచ్చెను. ఇంకొకసారి బుద్ధుడు జంబూద్వీపమునుండి జంబూఫలమును తవతింశస్వర్గమునుండి పారిజాతకుసుమమును తెచ్చెను. అయినను కశ్యపుడు వినమ్రుడు కాలేదు. అంతట బుద్ధుడు కశ్యపుని శిష్యుల గొడ్డలులు కట్టెలను నరకకుండగను, అగ్ని మండకుండగను చేసెను. శిష్యులు చలికాలమునందు రాత్రులు నిరంజరనదిలో స్నానముచేయుచు చలిలో బాధపడుచుండగ బుద్ధుడు అయిదువందలకలశముల వేడినీళ్ళు సృష్టించి యిచ్చెను. ఒకసారి అకాలమున పెద్దవర్షము కురిసి చుట్టుప్రక్కల నేలలంతయు జలమయమై పోయెను. బుద్ధుడు నిలచిన చోటుమాత్రము పొడిగ నుండెను. అతడు నీట పడిపోయెనను భయముతో కశ్యపు డొక పడవవేసుకొని వచ్చెను. బుద్ధుడంతట ఆకాశమున కెగిరి అందుండి పడవలోనికి దిగెను. ఈపైని వినమ్రుడై కశ్యపుడతనికి శిష్యుడయ్యెను.

అంగులిమాలుని కథ :— ఈదృశ్యమున మధ్యలో క్రింద బుద్ధపాదములును దానిని

వెనుక అగ్రమున త్రిరత్నచిహ్నముగలిగి మంటలువచ్చుచున్న స్తంభము నున్నవి. దానికి కుడిప్రక్కగ ఖడ్గహస్తుడైన మనుష్యుడొక డున్నాడు. ఎదుటివైపున తలపైన ఒక ఘటముగల స్త్రీ ఉన్నది. కొంచెముక్రిందుగ నొకమనుష్యుడు మోకాళ్ళమీద కూర్చొని బుద్ధపాదములకు నమస్కరించుచున్నాడు. ఈ మనుష్యుడు అంగులిమాలుడను నతడు. అతడు ఒకప్పుడు తనతల్లిని చంపబోగా బుద్ధుడడ్డము వచ్చెను. అంగులిమాలుడు పశ్చాత్తప్తుడయ్యెను. ఇది ఈదృశ్యమునందలి ఐతిహ్యము.

బుద్ధావశేషములకొరకు జరిగిన తగవు :— ఈదృశ్యము నాలుగుభాగములుగ నున్నది. మొదటిదానిలో ఒక పురుషుని రెండు చేతులు మాత్రము కలవు. అవి ధనుస్సున బాణము నెక్కపెట్టుచున్నట్లున్నది. రెండవభాగమునం దొక స్త్రీ కూర్చొని వీణవాయించుచుండ మరియొక స్త్రీ నాట్యము చేయుచున్నది. నాల్గవదానిలో అనేకమంది కేతనములు తీసికొని పోవుచున్నారు. రాజచిహ్నములతో ఒకపురుషు డేనుగు నెక్కి పోవుచున్నాడు. నాల్గవదానిలో ఒకడు రెండు చేతులతో బాణములు గుచ్చుచున్నాడు. ఈదృశ్యమునకు సంబంధించిన కథ ఇది. బుద్ధుడు మరణించినపిమ్మట నొక కరుణాజనకమగు నాట్యము జరిగెనట. సంస్కారమయిన పిమ్మట అతని అవశేషములకై ఏడుతెగలవారు తగువులాడిరట. అందు మల్లులనువారు ఆఅవశేషములను గైకొని తమ నగరమున కేగి దానిని బాణములతో సంరక్షించుకొనిరట. దృశ్యమునందు గీతనృత్యము లున్నవి. ధనుర్బాణములు తగవుకు చిహ్నము. పైన బాణములు గుచ్చుట నగరరక్షణకు చిహ్నము. ఇది చక్కని స్ఫోరక (Suggestive) శిల్పము.

ఇతరశిల్పములు :— ఈ కథా శిల్పములు కాక ఈదశలో చెక్కబడిన యక్ష, వామన, కుబ్జ, యక్షీ, కిన్నెర, వృక్షచైత్యములయొక్కయు, బుద్ధపాదములయొక్కయు, హంసలయొక్కయు, మనుష్యులయొక్కయు, సింహములు, ఏనుగులు, ఎద్దులుమున్నగు జంతువులయొక్కయు బొమ్మలును, పుష్పమాలికలును త్రిరత్నములును చైత్యములయొక్క ప్రాచీన ప్రాకారభాగముమీద చెక్కబడినవి ఎన్నియో దొరికినవి.

రెండవదశ క్రీ. శ. 100 ప్రాంతము.

ఈదశలోని శిల్పములు మునుపువానికంటెను పరిణతములై కళాకౌశలమును చూపుచున్నవి. మానవవ్యక్తులుకొయ్యబారి యుండక భంగిమములలో కనిపించుచున్నారు. చిత్రములు చాలభాగము సహజములుగనున్నవి. వేషభూషాదులును రంజకములుగ నున్నవి. బుద్ధుని చూపవలసివచ్చినపట్ల సంకేతములే కనిపించుచున్నను, రెండుస్థలములలోమాత్రమతని విగ్రహమున్నది. స్త్రీల చిత్రములు పూర్వముకంటెను చక్కగ నున్నవి. ఈశిల్పములన్నియు చైత్యవేదికలో మలచబడిన స్తూపఫలకములమీద నున్నవి. ప్రాయికముగ ఈశిల్పములలో మొదటిదశ లక్షణములు కొన్నియు, తరువాతిదశలలక్షణములు కొన్నియు కనిపించుచున్నవి.

ఈదశలో చెక్కబడిన శిల్పములలో నీక్రిందివి ముఖ్యములు.

మాయాదేవిఅభిషేకము :— ఈదృశ్యము ఒక వేదికాఫలకమున చెక్కబడినది. ఇందు

ఎడమవైపుపైన నొక వృక్షమున్నది. క్రింద తామరపువ్వులుగల కొలను కలదు. దాని ప్రక్కన ఒక స్త్రీ కలశముతో నీరు పట్టుకొనుచున్నది. దృశ్యముమధ్య నొక స్త్రీ ద్విభంగిలో కుడికాలు కొంచెముగ వంచి నిలచి, ఎడమచేతితో ప్రేలాడుచున్న కేశములను పట్టుకొని, కుడిచేతితో తల దువ్వుకొనుచున్నది. ఆమెవెనుక నీటిని క్రింద పోయుచున్నట్లు కలశమును పట్టుకొని ఒక స్త్రీ నిలచియున్నది. ముందు ఒక స్త్రీయును, ఎడమప్రక్కన మరి యిర్వురు స్త్రీలును నిలచియున్నారు. ఈదృశ్యమునకు సంబంధించిన కథ ఇది — ఒకప్పుడు కపిలవస్తునగరమునందొక ఉత్సవము జరిగెను. అందు కడపటి రోజున శుద్ధోదనుని భార్యయగు మాయాదేవి స్నానము చేసి, చక్కగ నలంకరించుకొని మంచముమీద పండుకొనెను. కొంతసేపటి కామెకొక స్వప్నము వచ్చెను. అందు నలుగురు లోకపాలకు లామెను అమంచములోనే తీసికొనిపోయి హిమాలయములలో నొక సాలవృక్షముక్రింద దింపిరి. పిమ్మట దిక్పాలకుల భార్యలు వచ్చి అనోతత్తసరస్సునందలి జలములను తెచ్చి, ఆమెకు స్నానము చేయించి, వేషభూషలతో అలంకరించిరి. ఆమీద నామె నొక మహాప్రాసాదమున బంగారుమంచము మీద పండుకొనబెట్టిరి. అప్పుడు కమలహస్తుడై బోధిసత్వుడచటికి వచ్చి, మూడుసార్లు ఆమెకు ప్రదక్షిణము చేసి ఆమె గర్భమున ప్రవేశించెను. ఈకథను బట్టి దృశ్యమున కేశసంస్కారణము చేసికొనుచున్న స్త్రీ మాయాదేవి అనియు, ఆమెచుట్టునున్న నలుగురు స్త్రీలును లోకపాలుర భార్యలనియు, కలశముతో నీరు ముంచి పోయుచున్న స్త్రీ ప్రక్కనున్న అనోతత్తసరమునుండి ఆజలమును తెచ్చెననియు నూహింపవచ్చును. ఇది చక్కని స్ఫురణచిత్రము.

మారప్రలోభనము :— ఇదియు నొక వేదికాఫలకము మీదనే ఉన్నది. దృశ్యమున మధ్యభాగమునందు బోధివృక్షముక్రింద నొక వేదికమీద కుడిచేయి అభయముద్రలో నుంచి గౌతముడు కూర్చొని యున్నాడు. అతని వెనుక రాతివలయ మున్నది. కుడివైపున వేషభూషాలంకృతుడైన పురుషుడున్నాడు. ప్రక్కన సౌందర్యవతియగు స్త్రీ లీలగా నిలచియున్నది. పురుషునిపైని ఖడ్గహస్తుడై ఒక వామనుడున్నాడు. బోధివృక్షముక్రింద తపశ్చర్యనుండగా మారుడు తన పుత్రికలను ప్రదర్శించి అతనిని వ్యామోహితుని చేయ ప్రయత్నించెనని ఐతిహ్యము. ఈదృశ్యమునందలి పురుషుడు మారుడు. స్త్రీ అతని కూతురు. వామనుడు నమస్కరించుచుండుట గౌతముని విజయమును సూచించును. ఇదియు నొక స్ఫురణ శిల్పము.

బుద్ధకథాశిల్పము :— ఇది యొక పెద్ద పలకమీద చెక్కబడిన దృశ్యముల వరుస. అడుగువరుసలో సిద్ధార్థుని మహాభినిష్క్రమణమున్నది. ఎడమవైపున నొక నగరద్వారమును, దానిముందర నొక తోరణము నున్నవి. ఈ తోరణము సాంచీద్వారములను పోలియున్నది. ఈతోరణములోనుండి యొక గుర్రము ముందుకు పరుగెత్తి పోవుచున్నది. దానిముందు ఇర్వురు పరుగెత్తుచు నొకడు వెనుకకు తిరిగి అంజలిఘటించియు, నింకొకడు కుడిప్రక్కకు తిరిగియు గుర్రమును చూచుచున్నారు. గుర్రమువెనుక ఎడమప్రక్కగ దానిపై ఛత్రమును పట్టి వెంట పరుగెత్తు

చున్నాడు. పైన ఇర్వురు ఎగురుచున్నారు. అందొకడు నమస్కరించుచున్నాడు. రెండవవాడు కుడిచేతిని మోచేతివద్ద వంచి పైకెత్తి, ఎడమచేతిని అటులే యెత్తి వ్రేళ్ళ మీద బొచ్చవంటిదానిని పెట్టుకొనినాడు. దీనికథ మహాభినిష్క్రమణము. చన్నునితోకూడి, కంటకమను గుర్రముమీద ఇల్లు వెడలి పోయిన సిద్ధార్థుడు నెరంజరానదీతీరమును చేరి, అచ్చట తన యుష్ణీషమును వేషభూషలను త్యజించెను. అతని యుష్ణీషము నొక గంపలో పెట్టుకొని దేవతలు దానిని స్వర్గమునకు తీసుకొనిపోయిరట. దృశ్యమునందలి ద్వారము కపిలవస్తు నగరద్వారము. ఛత్రము పట్టువాడు ఛన్నుడు. ఛత్రము బుద్ధునికి సంకేతము. గుర్రము కంటకము. ముందు పోవువారు దేవతలు. పైన ఎగురువారు యక్షులు కావలెను. అందు ఒకని చేతి వ్రేళ్ళమీదగల బొచ్చలో బుద్ధుని యుష్ణీషమున్నదని భావించవలెను. ఇది మనోహరముగ చిత్రింపబడిన దృశ్యము.

మారధర్షణము :— దృశ్యము మధ్యలో బోధివృక్ష మున్నది. దాని మొదట త్రిరత్న చిహ్నము, దాని కెదురుగ శూన్యసింహాసనము. దానియందు పాదపీఠముపై రెండుపాదము లున్నవి. కుడిభాగమున వెనుకవైపు సవిలాసముగ సిలచిన ముగ్గురు స్త్రీలు. వారియందు మోకాళ్ళపై వంగి అంజలిపెట్టి నమస్కరించుచున్న ఒక స్త్రీ. ఎడమవైపు లోభాగమున గదను పైకెత్తి ఎవరినో కొట్టబోవుచున్న వామనుడు. అతనికి ఎడమగ స్వస్తికాకృతిని కాళ్లుపెట్టుకొని కూర్చొనిన ఒక పురుషుడు. అతనిముందు ఇద్దరు వామను లున్నారు. అందొకడు నోరు తెరచి నాలుక పైకి పెట్టి నమస్కరించుచున్న స్త్రీని ఎక్కిరించుచున్నట్లున్నాడు. రెండవవాడు చేతులు ముందుకు చాచి మొగ్గ వేయుచున్నట్లున్నాడు. వృక్షమునకు రెండువైపులను ఎడమచేత నొక పాత్రను పెట్టుకొని కుడిచేయి ముందుకు వంచి చాచి ఎగురుచున్న ఇద్దరు వ్యక్తులు. సింహాసనము, పాదములు బుద్ధునికి చిహ్నములు. అతడు బోధివృక్షముక్రింద కూర్చొనియున్నట్లు భావన. ఎడమవైపు కూర్చొనినవాడు మారుడు. కుడివైపు నిలచిన స్త్రీలు గౌతముని వంచింప యత్నించుచున్న మారదుహితలు. ముందు వంగి నమస్కరించుచున్న స్త్రీ పరాజయము నంగీకరించుచున్నట్లు సూచన. ఆమెను వామనుడు హేళన చేయుచున్నాడు. ఇది చక్కని సాంకేతిక శిల్పము.

రామగ్రామస్తూపము :— దృశ్యము మధ్యగ పైభాగమున నాగబంధము నటునిటు మూడుపడగల నాగములునుగల చైత్యమున్నది. దాని కిటునటును ఐదు పడగల నాగరాజులును నాగినులును నమస్కరించుచు నిలచియున్నారు. చైత్యము అడుగున నిద్దరు మనుష్యులు గొడ్డలులవంటి సాధనములతో దానిని త్రవ్వుటకు ప్రయత్నించుచున్నారు. అశోకుడు బుద్ధుని అవశేషముల కొరకై రామగ్రామస్తూపమును త్రవ్వించిన ఘట్టము ఈదృశ్యము. ఈచైత్యము చుట్టునుగల ప్రాకారమున స్తంభము లున్నవి. వాని అగ్రముల ఒకశరీరమునుండి వెడలు రెండేసి జంతువు లున్నవి. ఇట్టిస్తంభములే నాసిక, కార్లాలలో సాతవాహనయుగపు గుహలముందు గాంచనగుచున్నవి.

సాంకేతికశిల్పములు :—ఇవిగాక ధర్మచక్రము, బోధివృక్షము, శూన్యసింహాసనము, త్రిరత్నచిహ్నము, జ్వాలాస్తంభము మున్నగు

బుద్ధసంకేతములు విడివిగను, కలసియు చెక్కబడిన వేదికాఫలకములు అనేకములు కలవు.

ఇతరశిల్పములు :—ఇక్లే వివిధజంతువులును, చిహ్నములును, పక్షులునుగల స్తంభములును, ఉష్ణీషశకలములును, సన్ననిఫలకలునుకూడ కలవు. ఇతరఫలకములమీద పూర్ణకలశమును, పుష్పమాలికలును కలవు. అనేక నాట్యభంగిమములలోనున్న యక్షుల చిత్రములును, వెక్కివికారావస్థలలోనున్న వామనుల చిత్రములును గల ఫలకలు నున్నవి. ఇందొక ఫలకమీద నొక వేదికపైన ఒక రాజును, ఇద్దరు రాణులును నిలచియున్నట్లు చెక్కబడినది. ఈవేదిక వెలుపలివైపు స్తూప ప్రాకారమువలె నున్నది. ఇది కన్హేరీ, కార్లా గుహాలలో. ముందువైపు గోడఅడుగుభాగమును పోలియున్నది. దానిచుట్టును ప్రాకారమువంటి గోడ అడుగుభాగమునం దున్నది. దానిపైన పొడుగైన స్తంభము లున్నవి. పైన గుర్రపులాడమువంటి గూళ్ళున్నవి. ఇది అన్నివిధములను పిటల్‌కోరా, భాజా, నాసిక గుహాలయొక్కయు, అజంతాలోని తొమ్మిదవగుహయొక్కయు ముందుభాగములను పోలియున్నది.

మూడవదశ క్రీ. శ. 150 ప్రాంతము.

ఇది అమరావతీశిల్పనిర్మాణముననేగాక భారతీయశిల్పకళాచరిత్రమునందే స్వర్ణయుగము. ఈకాలపు దివ్యశిల్పములలో భారత శిల్పియొక్క ఊహాబలము, విన్యాసకౌశలము, కళావైదగ్ధ్యమును పరమావధిని గాంచినది. సాతవాహనయుగమును చిరస్మరణీయమొనర్పుట కిందలి ఒక్క శిల్పము చాలును. ఈ శిల్పములన్నియు ఆచార్యనాగార్జునుని పర్యవేక్షణలో నిర్మింపబడిన మహాచైత్యప్రాకారమున కలవు. నాటి సాతవాహన చక్రవర్తియు, బౌద్ధాచార్యుడును లోకరంజనార్థము నిర్మించిన యీ అనుపమశిల్పములలో చాలాఖండములు దొరికినవి. వీనియందలి ఆకృతులలో జీవముట్టిపడుచున్నది. అంగవిన్యాసము సహజమును మనోహరమునైనది. ప్రత్యంగుళమునను చైతన్యము, ఉత్సాహము ఉట్టిపడుచున్నవి. మరియొకముఖ్యలక్షణము దృశ్యములలోని అంతరువులను చెక్కుటలో కనిపించుచున్నది. చిత్రకారుడు లేతముదురురంగులతో దూర సామీప్యములను చక్కగ చూపగలడు. అట్లే ఈకాలపు అమరావతీశిల్పి మెరకపల్లములతో నీభావమును కలిపించినాడు. దూరపువస్తువులు మెరకగ నున్నవి. దగ్గరదృశ్యములు లోతుగ చెక్కబడినవి. అదేవిధమున పక్కలకు తిరిగి నిలచిన వ్యక్తుల శరీరములకుకూడ కొంచెము ఎత్తుపల్లములుగ చెక్కబడియున్నవి. ఉష్ణీషముమీది పుష్పమాలికను వామనులును, కుబ్జులును కాక సర్వాంగసౌందర్యశోభితులైన యువతీయువకులు లీలగా భుజములపై మోయుచున్నట్లు చిత్రింపబడినది. పూర్వపుదశలలో మోటుగను, అస్పష్టముగను చూపబడిన వామనాదులును, మకరములును, జంతువులును తీర్చిదిద్దిన అవయవములతో శోభావంతములుగ చెక్కబడినవి. బృందశిల్పమునందు ఈనాటిశిల్పి ఎనలేని కౌశలమును చూపినాడు. ప్రత్యేకముగ నొక్కొక వ్యక్తియు మనోహరము. సాముదాయికముగ బృందమంతయు మనోజ్ఞము. చలనమును, భావశబలతను ఈశిల్పిచూపినంత హృదయంగమముగను, సుకరముగను మరియేప్రాంతిమునను, ఏకాలముననను ఏశిల్పియు చూపలేదు.

ఈవిశాలవిశ్వమునందు గాంచనగు సర్వవిధములవై విధ్యమును, సౌందర్యమును భావశబలతయు నీశిల్పమునందు కనిపించుచున్నవి. వైశ్వామిత్రియగు ఆంధ్రశిల్పి ఈచలవరాతి పలకలలో సృష్టికి ప్రతిసృష్టి చేసి అన్వర్థాన్వయుడైనాడు.

ఈదశకు చెందిన శిల్పములనేకములు లభించినవి. వీనిని జాతకావధానకథాశిల్పములనియు, బుద్ధశిల్పములనియు, వివిధశిల్పలనియు మూడువిధముల విభజింపవచ్చును. ఈమూడుతరగతులలోను ముఖ్యములైన కొన్ని ఈక్రింద వర్ణింపబడుచున్నవి—

మాయాదేవిస్వప్నము :— దృశ్యమున మధ్యభాగమున రాజు సింహాసనము మీద కూర్చొని యున్నాడు. ప్రక్కగ మరియొక ఆసనముమీద రాణి కూర్చొనినది. వీరి వెనుక చామరవాహకు లున్నారు. ఎడమవైపున కొందరు పురుషులు కూర్చొనినారు. వారు రెండువ్రేళ్ళు పైకి ఎత్తి చూపుచున్నారు. దీనికి సంబంధించిన కథాభాగ మిది. ఒకనాటి రాత్రి మాయాదేవికి తెల్లటి ఏనుగ ఒకటి తొండముతో తెల్లటి తామరపువ్వు పట్టుకొని తన దగ్గరకువచ్చి, మూడుసార్లు ప్రదక్షిణము చేసి, ఒక ఘీంకారము చేసి తన గర్భమున ప్రవేశించినట్లు కల వచ్చెను. మరునాటి ఉదయము ఆమె రాజగు శుద్ధోదనునికి ఈవృత్తాంతమును తెలిపి జ్యోతిష్కులను విచారింపమని కోరెను. రాజును వారిని పిలిపించి మృష్టాన్న భోజనములతోడను, సువర్ణాది దానములతోడను తృప్తులను చేసి ఆమీద స్వప్నవృత్తాంతమును వారి కెరిగించెను. అంతట వారు మాయాదేవి గర్భవతి అయ్యెననియు, ఆమెకు చక్కని కుమారుడు కలుగుననియు, అతడు గృహస్థుగనే ఉండినచో చక్రవర్తి యగుననియు, లేక నివృత్తిమార్గము ననుసరించుచో బుద్ధుడై విశ్వమానవకల్యాణమును సమకూర్చుననియు చెప్పిరి. ఈకథ ననుసరించి దృశ్యమున సింహాసనస్థుడుగనున్న వ్యక్తి శుద్ధోధనుడు. ప్రక్కగ మరియొక ఆసనమున కూర్చొనిన స్త్రీ మాయాదేవి. ఎడమవైపున నున్న వారు జ్యోతిష్కులు. వారు చూపుచున్న రెండువ్రేళ్ళను పుట్టబోవు బిడ్డ అనుసరింపతగిన రెండుమార్గములను సూచించును.

శుద్ధోధనుడు అశోకవనమున కేగుట :— ఈదృశ్యము ఒక అష్టకమ్మిమధ్యమున్న వలయమునందు చెక్కబడినది. ఇందు మిక్కిలి వెనుకభాగమునందు ఒక వరుస చెట్లున్నవి. వానిముందొక భవనమును, ప్రాంగణమును కలవు. ముందుభాగమునందు కుడివైపున నొక స్త్రీ ఒకకుర్చీవంటి ఆసనమున కూర్చొని యున్నది. ఆమెవెనుకను ప్రక్కలను ఎందరో పరిచారిక లున్నారు. కొందరు ఆమె నలంకరించుచున్నారు. కొందరు భూషణములను తీయుచున్నారు. ఒకతె వెనుక ఛత్రముపట్టినది. మరియొకతె పాదములు పట్టుచున్నది. ఎడమవైపున నొక పురుషుడు వెనుకనున్న గుర్రము నానుకొని సవిలాసముగ కుడిచేయి నడుమున చేర్చి కర్తరీజానువై నిలచినాడు. అతనివెనుక నొకడు ఛత్రముపట్టినాడు. వాని వెనుక నెందరో భటులున్నారు. దీనికి సంబంధించినకథ యిది. పైన పేర్కొనబడిన స్వప్నము వచ్చిన రాత్రి గడచిన మరునాడుదయమున వెంటనే మాయాదేవి రాజును వచ్చి తనను కలవమని చెప్పి తాను అశోకవనమున కేగెను. శుద్ధోధను డామె నచట కలసి స్వప్నవృత్తాంతము వినెను. దృశ్యమునందలి చెట్లు-

అశోకవనసూచకములు. కుర్చీపై స్త్రీ మాయా దేవి. గుర్రము నానుకొని నిలిచిన పురుషుడు శుద్ధోధనుడు. జావాద్వీపమునందలి బరా బొదుర్ స్థూపమునందుకూడ ఇదే దృశ్యము ఇదే విధమున చెక్కబడియున్నది.

బోధిసత్త్వుని అవతరణము :— ఒక ఊర్ధ్వపుటమున పైనున్న అర్ధకమలముక్రింది ప్రధానదృశ్యము. దీని మధ్యలో ఒక విమాన మున్నది. దానిలో నొక యేనుగు కలదు. దీనిని వామనులు మోసుకొని పోవుచున్నారు. విమానము కుడిభాగమున నొకడు చామరము వీచుచు వచ్చుచున్నాడు. ఈదృశ్యమునకు అటునిటు నున్న రెండుదృశ్యములలో అనేక మంది ఆడుచు, పాడుచు, నమస్కరించుచు కేతనముల నెగురవేయుచు పరిగెత్తుచు విమా నమును వెంబడించుచున్నారు. దీనికి సంబం ధించిన కథ ఇది— దేవతలచే ప్రార్థింపబడి బోధిసత్త్వుడు భూమియందవతరింప నిశ్చయిం చుకొని సర్వాంగసుందరమును, గులాబీరంగు ముఖమును, ఆరు తెల్లని కోరలునుగల తెల్ల యేనుగు రూపమును దాల్చి నిలచెను. దేవత లొక విమానమును తెచ్చిరి. అతడు దాని నెక్కెను. అంతట పరావేక్షలేకయే వాద్య ములు మ్రోగెను. కొందరు దేవతలు విమా నము నెత్తుకొనిరి. మరికొందరు దానిని వెంబ డించిరి. వేలకొలది అప్సరసలు గానము చేసిరి. ఈపరివారముతో ఈ శ్వేతగజము భూమికి దిగి మాయాదేవిగర్భమున ప్రవే శించెను.

భిక్షాపాత్రారోహణము :— ఈదృశ్యము ఒక అడ్డు కమ్మిమీద చెక్కబడినది. ఇది ఒక మనోహరమైన బృందశిల్పము. దృశ్యము మధ్యలో నొకడు కాళ్ళు ఎడముగ పెట్టుకొని నిలచి రెండుచేతులను పైకెత్తి వానిమీద నొక గంపను పట్టుకొనినాడు. గంపమధ్య నొక పాత్ర ఉన్నది. ఇతని చుట్టును వందల మంది స్త్రీపురుషు లున్నారు. కొందరు గీత వాద్యములను సాగించుచున్నారు. కొందరు ఆడుచున్నారు. ఇతరులు అనేకభంగిమము లలో నిలచి నమస్కరించుచున్నారు. మరి కొందరు నాట్యము చేయుచున్నారు. ఇంత మంది వ్యక్తు లీదృశ్యమున చేరియున్నను, ప్రతివ్యక్తియు స్పష్టముగను ఒక్కొక ఉద్దేశ్య మును, భావమును స్ఫురింపచేయు నట్లును చిత్రింపబడినాడు. ఇది బుద్ధుని భిక్షాపాత్ర మును దేవతలు తుషితస్వర్గమునకు తీసికొని పోవు దృశ్యము.

బుద్ధజీవితఘట్టములు :— ఒక ఉష్ణీషము మీద నీ వివిధఘట్టములు చెక్కబడినవి. ఇం దలి శిల్పము మిక్కిలి మనోహరమైనది. ఇందు మొత్తముమీద తొమ్మిది భాగములు కలవు. మొదటిదానిలో రాహులునిపై చేయి వేసి నిద్రించుచున్న యశోధర కలదు. రెండవ భాగమున మహాభినిష్క్రమణ మున్నది. మూడవదానిలో జేతవనమున జరిగిన ధర్మ చక్రప్రవర్తనమును, నాల్గవదానిలో అంతః పురమున యశోధర భోగములతోను నృత్త గీతాదులతోను పొద్దుపుచ్చుటయు, ఐదారు భాగములలో యశోధర సర్వభోగములను త్యజించి సామాన్యజీవితమును గడపుటయు, మరిరెండుభాగములలో శుద్ధోధనుడు బుద్ధుని తీసికొనిరమ్మని వార్తాహరుల నంపుటయు, కడపటిభాగమున కపిలవస్తునగరమునకు వచ్చిన బుద్ధుడు న్యగ్రోధవనమున ధర్మబోధ చేయు టయు చూపబడినవి.

పై నవర్ణింపబడినవిగాక మనోహరములగు శిల్పములు, చలవరాతి పలకలు అనేకములు నీఅమరావతీ మహాచైత్యమున దొరకినవి. వీనిలో కొన్ని లండన్ బ్రిటిష్ మ్యూజియం లోను, కొన్నిమదరాసు గవర్నమెంటు మ్యూజియంలోను, మరికొన్ని బందరు బెజవాడల లోను ఉన్నవి.

కళావేత్తలును, కళాప్రియులు నీశిల్పములను అనేక విధముల కొనియాడినారు. బార్ హుట్, గయ, సార్నాథ్ మున్నగుచోట్ల అశోక చక్రవర్తికాలపు శిల్పములు దొరికినవి. కాని వానిలోని మనుష్యులయందును, జంతువులయందును చైతన్యము లేక ఆ బొమ్మలన్నియు బిగుసుకొని పోయినట్లున్నవి. సాతవాహనయుగమున ఈశిల్పకళ దక్షిణాపథము నందు అద్భుతముగ పరిణతి చెందినది. అశోకునికాలపు వాస్తుశిల్పములలో పర్షియను సాంప్రదాయ ప్రభావము కనిపించుచున్నది. తర్వాతకాలమున గ్రీకులు అనేకమంది నేటి పంజాబులోను, ఆఫ్ గనిస్థానమునందును స్థిర పడిరి. వారు బౌద్ధము నవలంబించిరి. వారిలో కొందరు శిల్పులుండిరి. ఈ యవన శిల్పులు బౌద్ధ జాతక కథలను, బుద్ధజీవిత ఘట్టములను, రాళ్లమీద చెక్కనారంభించిరి. కథావస్తువు బౌద్ధమత సంబంధమే అయినను శిల్పపద్ధతి మాత్రము యవనపద్ధతి. ఇందు సర్వాంగములను యథా వాస్తవముగ తీర్చి దిద్దుటయే. ప్రధానలక్షణము. ఈ యవనశిల్పములు భౌతిక సౌందర్యమును అద్భుతముగ నిరూపించుచున్నవి. వీనిని చూచినవారికి సజీవులగు స్త్రీ పురుషులు హఠాత్తుగ శిలారూపము నందిరా అను భ్రమ కలుగుచున్నది. కాని వీటిలో ఆదర్శత్వము, స్ఫోరకత్వము లేవు ప్రేక్షకుల మనస్సులకు శిల్పముద్వారా ఏదైన నొక ఆదర్శమునో, సందేశమునో వివరించు లక్షణము వీనిలో కానరాదు. ఈ శిల్పములకు గాంధారి శిల్పములని పేరు. ఉత్తర దేశమున ఈ పర్షియను యవన సాంప్రదాయములు వ్యాపించి, విదేశీయ లక్షణ పరివృతములగు శిల్పములు నిర్మింపబడుచుండిన కాలమున దక్షిణాపథమున ఆంధ్రశిల్పులు సాంచీ ధాన్యకటకములలో సోపజ్ఞమగు నొక శిల్పసాంప్రదాయమును సంకలనముచేసి, వాస్తవికతకు భంగములేని విధమున దానిని ఆదర్శకత్వ స్ఫోరకత్వములతో సమ్మేళనచేసి జీవకళయు, చైతన్యమును ఉట్టిపడునట్టి శిల్పములను నిర్మించిరి. ఈ అమరావతీ శిల్పకళ అమరము, అపూర్వము, అద్భుతము.

---

# గోలీ శిల్పము

కొమరగిరి నరసింహారావు

పురాతన బౌద్ధశిల్ప నిక్షేపముల కాంధ్రదేశము ప్రపంచప్రఖ్యాతి గాంచినది. ఉత్తరమున శాలిహుండము, దక్షిణమున చినగంజాము, పశ్చిమమున గుత్తి, తూర్పున భట్టిప్రోలు గాగల యీమధ్యాంధ్రదేశ మంతయును క్రీస్తుపూర్వ మెన్నియో శతాబ్దముల [illegible]తమే పవిత్రబౌద్ధభిక్షువుల స్వార్థరహిత జీవనమున కాలయమై మనోహర బౌద్ధారామ విహారచైత్యాదులతో వెలుగొందినది. రామతీర్థము, సంఘారామము, కోడవలి, అరుగోలను, గుంటుపల్లి, జగ్గయ్యపేట, రామిరెడ్డిపల్లి, అల్లూరు, విజయవాడ, గుడివాడ, ఘంటసాల, నాగార్జునకొండ, చేజర్ల, గరికపాడు, గోలి, అమరావతి, పెదమద్దూరు, పెదగంజాము, కపురి మొదలగు ప్రదేశములలో ప్రాచీనాంధ్రసంస్కృతిని నిరూపించు అమూల్యశిథిలశిల్పశేషములు లభించినవి. వీటిలో విశేషభాగము కృష్ణా గుంటూరు మండలములలో, అందును కృష్ణవేణీ ప్రాంతములయందు దొరకినవి. ఇందుకు కారణము లేకపోలేదు. బౌద్ధుల ప్రశాంతసాధుజీవితమునకు ప్రకృతిరమ్యములు ననవరతలభ్యములగు నిర్మల నదీతోయము లత్యంతావశ్యక మైనవి. ఇంతేకాక నేటివలె నన్నివిధముల ప్రయాణ సౌకర్యములు లేని ఆకాలమున నిరంతర దేశసంచారులగు బౌద్ధులకు నౌకాయానమే సులభసాధ్యమైనది. అందుకు నదీప్రాంతముల నివాసము తప్పనిసరియైనది. మరియును వీటి అన్నిటికంటెను ముఖ్యమైన కారణమొకటి యున్నది. శిల్పకళారచన కుపయుక్తమగు పాలరాయి కృష్ణాతీరముననే విరివిగా దొరకెడిది.(1) అందువలననే శిల్పులపని తేలికయైపోయినది. అమరావతి, నాగార్జునకొండ, గోలి, జగ్గయ్యపేట మొదలగు ప్రదేశములలోని శిల్ప మీపాలరాతితో చెక్కబడుట యిందుకు ప్రబలనిదర్శనము.

1926వ సంవత్సరమున డాక్టరు దుబ్రాయిల్ మహాశయుని కృషి ఫలితముగా గుంటూరుమండలములోని గోలీగ్రామ సమీపమున కొన్ని బౌద్ధశిల్పములు బయటబడినవి. ఈగోలీగ్రామము పల్నాడు తాలూకాలో రెంటచింతలకు మూడుమైళ్ళ దూరమున కృష్ణానదికి ఉపనదియైన గోళ్లేరు అనువాగు ఒడ్డున ఉన్నది. నాగార్జునకొండ దీనికెగువను పదునెనిమిదిమైళ్ళ దూరమున నున్నది. ఈగోలిగ్రామమునకు వాయువ్యముగ ఒకటిన్నరమైళ్ళ దూరముననున్న ఒకపొలములోని దిబ్బను త్రవ్వగా కొన్ని శిల్పభాగములు దొరకినవి. వీనిలో ఏడు పడగలనాగు బొమ్ము శిల్పముగల శిలాఫలకమును, స్తూపదక్షిణభాగపు ముఖబంధ శిలాఫలకము ((Frieze)ను, మరి రెండు చిన్న శిల్పఖండములును తప్ప తక్కిన

1. ఈ అభిప్రాయమును స్ఫురింపజేసిన డాక్టరు మారేమండ రామారావు గారికి కృతజ్ఞుడను.

వన్నియును మదరాసు పురావస్తు ప్రదర్శన శాలకు చేరినవి.(2)

ఈగోలీస్తూప మేనాడు నిర్మితమైనదో యింతవఱకును నిశ్చితముగా తేలలేదు. అమరావతి నాలుగవకాలపు శిల్పమునకును దీనికిని గలసాదృశ్యమును బట్టి యిది ఆకాలముననే చెందియుండునని శ్రీ టి. యన్. రామచంద్రన్‌గారు ఊహించినాడు. ఇదే అభిప్రాయమును డాక్టరు డుబ్రాయిలుకూడ వెలిబుచ్చినాడు. ఇది సాతివాహన యుగమునందలి కడపటి శతాబ్దము అనగా క్రీ. శ. ౩వ శతాబ్దము అగును.

ఇచ్చట దొరకిన చైత్యశిలాఫలకమును(3) బట్టిచూడ గోలీస్తూప నిర్మాణమున ప్రత్యేక విశేషమేమియు నున్నటుల గోచరింపదు. భార్హూత్, సాంచీ, అమరావతీ స్తూపములకు వలె చుట్టును ప్రాకారముగాని, నాలుగుదిక్కులను ద్వారములుగాని ఈ స్తూపమునకులేవు. స్తూపపరిమాణమే చాలస్వల్పము (ఎత్తు ఎనిమిది అడుగులు మాత్రమే). మూడు మెట్లు వలెనున్న అధిష్ఠానముపై వేదికయును, వేదికపైన అండమును, దానిపైన హార్మికయును నిర్మింపబడినవి. వేదిక మూడుకక్ష్యలు (Panels)గ విభక్తమైనది. పైకక్ష్యలలో వేదికలపై బోధివృక్షము లున్నవి. మధ్యకక్ష్యలో పద్మాధిష్ఠానముపై శూన్యాసనమును, దాని మీద రెండు పద్మములును ఉన్నవి. ఆసనముపై వెనుకభాగమున పొడుగుగనున్న త్రిశూల చిహ్నమున్నది. హార్మిక పైభాగమున ఒకదానిపై నొకటిగ అయిదేసి ఛత్రములున్నవి. ఆదిలో యీఛత్రము కేవలము రాజలాంఛనముగనే పరిగణింపబడినను క్రమముగ బౌద్ధశిల్పసాంప్రదాయమున దీనికొక సాంకేతిక ప్రాముఖ్యము ఏర్పడినది. హార్మికాంతరము లధోలోకములను, ఛత్రము లూర్ధ్వలోకములను సూచించును.(4) ఇంతేకాక ఈఛత్రములు జీవన్ముక్తికి దారిచూపు సోపానములని కూడ నొకయభిప్రాయము కలదు.[5]

వేదికపైన నాలుగువైపులను అయిదేసి ఆయక స్తంభము లుండెడివి. అమరావతిలోవలె వీటిపై విశేషమగు శిల్పము కనిపింపదు. ఈ స్తంభములు పృథివ్యాపస్తేజోవాయురాకాశము లనెడి పంచభూతములకును సూచకములు. ఈ కంభము లాంధ్రదేశమునందలి స్తూపములయందే గాని ఇతరత్రగల వానిలో కానరావు.[6]

బౌద్ధ సాంప్రదాయానుసారము స్తూపమునకును, అందలి ప్రతిభాగమునకును సాంకేతికార్థము కలదు. అండము ఉదయభానునకో ఆకాశమునకో చిహ్నమని ఒక

---

2. పూర్వోక్త ముఖబంధఫలకమును, నాగశిలాఫలకమును, మరిరెండు చిన్నఫలకమును నేను గోలీగ్రామమున ప్రత్యేకముగా నిర్మితమైన ఒకచిన్న ఆలయమున నున్నవి.

3. T. N. Ramachandran : Buddhist sculptures of Goli (Bulletin of the Madras Government Museum Pl. X,

4. Kern : Manual of Indian Buddhism, P. 92. 'The two, three, five, seven, nine and thirteen umbrellas, and the gradations of the inverted pyramid suggest divisions of the Universe."

5. Aryan Rule in India, p. 110.

6. K. R. Subrahmanian. Buddhist Remains in Andhra, p. 18.

అభిప్రాయము.[7] స్తూపముయొక్క ఆకృతి బుద్బుదరూపమున భావింపబడిన విశ్వము యొక్క స్థాపత్యనిర్వచనము అని మరియొక అభిప్రాయము.[8] స్తూపప్రాకారము యజ్ఞవేదిక చుట్టునుండెడి ప్రాకారము వంటిదే. ఇందలి మూడుసూచులును హిందూమత దృష్ట్యా సూర్యుని త్రికాలస్థితిని, త్రిమూర్తులను సూచించును. ఇవే బౌద్ధసాంప్రదాయమున బుద్ధ, ధర్మ, సంఘ అను త్రిరత్నములకు చిహ్నములైనవి. అమరావతీ చైత్యమునందు వలె కొన్ని స్తూపములలో నాలుగు సూచు లుండెడివి. బ్రాహ్మణమతదృష్ట్యా నాలుగువేదములకును బౌద్ధమత దృష్ట్యా బుద్ధుని జీవితమునందలి నాలుగు ప్రధాన ఘట్టములగు జనన, సంబుద్ధి, ధర్మచక్రప్రవర్తన, మహాపరినిర్వాణములకు చిహ్నములు.

గోలీశిల్పమున ప్రధానములైనవి నాలుగు ముఖబంధపలకములు. వీనిపైన బుద్ధజీవితమునకును జాతకకథలకును సంబంధించిన దృశ్యములు శిల్పితములైనవి. ఈదృశ్యములు వరుసగా కాక కక్ష్యలుగా చెక్కబడినవి. నడుమ చిన్నచిన్న ఆవరణలలో వివిధభంగిమలలో మిథునములు చిత్రితములైనవి. వీని నుండి ఆనాటి సంఘమునందలి అనేక వర్గములకు చెందిన స్త్రీపురుషుల వేషభూషాదులను తెలిసికొనవచ్చును.

ఒకకక్ష్యకును మరియొక కక్ష్యకును మధ్య నున్న నిలువుకమ్ములమీద అమరావతిలో వలె సమానదూరమున మూడేసిపద్మములు ఉబ్బెత్తుగా చెక్కబడియున్నవి. ఒకేకక్ష్యలో ఒకదృశ్యమునకును మరియొక దృశ్యమునకును మధ్య కుడ్యములును వాటిపై చైత్యవాతాయనములును ఉన్నవి. వీటి యాకారములు సూర్యుని అనుసరించి నిర్మింపబడిన వగుటచే వీటిని సూర్యవాతాయనము లందురు. హిందూశిల్పమునందలి మకరతోరణములకును వీటికిని మూలభావము ఒకటే. వీటి సాంకేతికలక్షణమును గ్రహింపజాలని పాశ్చాత్యరచయితలు కొందరు వీటిని గుఱ్ఱపులాడములవంటి కిటికీలని వర్ణించినారు.

ప్రథమముఖబంధమున[9] కిరువైపులను సారూప్యములుగా శిల్పితములైన సర్పశీర్షాచ్ఛాదనముగల పురుషవిగ్రహములు గమనింపదగినవి. ఈసర్పశీర్షము లోకవైపున మాత్రమే సంపూర్ణముగ నున్నవి. రెండవ వైపున పురుషునిశిరస్సు మాటున ఒకవలయము మాత్రమే ఉండి శీర్షములు లేక శిల్పమసంపూర్తిగా నున్నది. కుచ్చులుగ వ్రేలాడునట్లు కటివస్త్రములు మాత్రమే యుండి తక్కిన దేహమంతయు నగ్నముగా నున్నది. వీరు హిందూదేవాలయములలోని ద్వారపాలకులవలె నున్నారు. ఇవి నాగరాజు విగ్రహములని శ్రీ టి. యన్. రామచంద్రన్ అభిప్రాయము. కాని బోధిసత్త్వుని విగ్రహములనుట కెక్కువ అవకాశమున్నది. సర్పశీర్షములు శిరస్సున కాచ్ఛాదనములవలె నున్నవి. కాని కేవలము నాగరాజు విగ్రహములకువలె శిరస్సునలేవు. అనంతుని ఆచ్ఛాదనము

7. E. B. Havell. History of Ancient and Medival Indian Architecture, "The dome was the symbol of the sky, the blue lotus flower envelopin, the earth with its inverted petals"

8. ఆగధ్రివిజ్ఞాన సర్వస్వము : అమరావతీ స్తూపము, పు. ౨౭౭.

9. Buddhist sculpture of Goli. pls. IA and IV J.

మహాపురుషలక్షణము వెనుకనున్న బోధివృక్షము గూడ ఇతడు బోధిసత్త్వుడనుటకు ప్రబలకారణ మగుచున్నది. వామపాదముతో పామును త్రొక్కిపట్టుట ఆతనికాలాతీతతను సూచించును. మకుటకుండల కంకణాది ఆభరణములు ఆభిజాత్యమునకు ద్యోతకములు.

ముఖబంధఫలకములయొక్క రెండుకొనలను అందమైన భంగిమలలో స్త్రీపురుషవిగ్రహాములను చిత్రించుట బౌద్ధశిల్పములలో కనుపించు ఆచారము. ద్వితీయ ముఖబంధఫలకమున చిట్టచివరభాగమున సాంచీద్వారమునందువలె ఒక యక్షిణిచెట్టునానుకొని ఒక విధమగు జంత్రివాద్యమును మీటుచు ఆలాపపారవశ్యమున ఒకకాలుమకరముపైనుంచి మనోహరమైనభంగిమలో నిలిచినది. ఈముఖబంధమున రెండవచివరగూడ నిట్టి యక్షిణీవిగ్రహ ముండియుండును. ఆభాగము శిథిలమైపోవుటవలన నిప్పుడది కనిపించుట లేదు. డాక్టరు డుబ్రాయిలు దానిని చూచెనట !

తృతీయ ముఖబంధఫలకము[10] అడుగుభాగమున ఆద్యంతము విస్తరించియున్న ద్రోణము (sunk band) లో ఒండొంటికి అరఅడుగు దూరమున చెక్కబడియున్న మకరములు గమనింప దగినవి. వీటి స్వరూపస్వభావాదులను తెలిసికొనజాలక పాశ్చాత్యవిమర్శకులు కొందరు తికమకపడినారు.[11] ఈమకరములు ముఖబంధఫలకముయొక్క భారమునంతటిని వహించుచున్నవని చూపుట శిల్పి ఉద్దేశము. ఇట్టి మకరములు అమరావతీ నాగార్జునకొండ శిల్పములందును కానవచ్చుచున్నవి. బార్హూట్, సాంచీ మొదలగు ఉత్తరభారతశిల్పములలో ఇవి కానరావు.

గోలీశిల్పమున చాలచోట్ల కుబ్జచిత్రము లున్నవి. వీటిని ఒక ప్రత్యేకప్రయోజనము నాశించి చిత్రించినారు. ముఖ్యముగా ఆయా దృశ్యములలోని ఇతరవ్యక్తుల ఔన్నత్యమును, సౌందర్యమును దీపింపజేయు నుద్దేశముతో ప్రతియోగము (contrast) నకై శిల్పు లీకుబ్జులను సృష్టించినారు. అంతేకాక శిల్పమున వీనివలన హాస్యరస పోషణకూడ జరుగును.

ఈశిల్పమున కనిపించు బుద్ధవిగ్రహముల వస్త్రధారణ ద్వివిధముగ నున్నది. ప్రథమము ముఖబంధములో రెండుచోట్ల చిత్రితమైన బుద్ధుని వస్త్రము సాధారణరీతినిగాక గాంధారశైలిలోవలె కంఠమునుండి పాదములవరకును ఆచ్ఛాదనముగ నున్నది. ఇతరప్రదేశముల యందు బుద్ధఉత్తరీయము సాధారణరీతిని యజ్ఞోపవీతమువలె నున్నది. వస్త్రధారణ గాంధారశైలిలో వలెనున్నంత మాత్రమున ఆంధ్రబౌద్ధశిల్పము గాంధారప్రభావ సమ్మోహితము అనుట సమంజసముకాదు. మధురలోని బుద్ధవస్త్రధారణవిధానమునకును ఇచటి వస్త్రధారణవిధానమునకును ఎంతయో భేదమున్నది. ఇచట వస్త్రమంతయు ముడుతలు ముడుతలుగ నుండును. అచట ముడుతలవలె గాక ఎక్కువ నగిషీపనికలిగి చారలుచారలుగా నుండును. అసలు బుద్ధవిగ్రహమే గాంధార (గ్రీకోరోమను) ప్రభావ జన్యమని కొందరు పాశ్చాత్యవిమర్శకులు పొరపడ

10. Buddhist sculptures of Goli, pls. VII VIII.

11. Burgess The Buddhist Stupas of Amaravati and Jaggyyapeta (A. S. S. I. vol. I—1887). Described as "non descript Sphinx-like animals".

నారు. మహాయానబౌద్ధప్రచారమునకును బుద్ధవిగ్రహప్రదర్శన మత్యంతావశ్యకమైనది. తన్మూలమున ఒకేకాలమున గాంధారమున గ్రీకుసాంప్రదాయము ననుసరించియు, దక్షిణ భారతమున మహాపురుషలక్షణములను, స్థానిక సాంప్రదాయమును అనుసరించియు బుద్ధవిగ్రహములు సృష్టింపబడినవి.[12] గాంధార బుద్ధప్రతిమకంటెను ప్రాచీనములగు బుద్ధగయలోని బుద్ధవిగ్రహమువంటివి మనదేశమున కలవు మహాపురుషలక్షణములు బౌద్ధమునకు పూర్వమునుండియు భారతీయులకు పరిచితములే. విగ్రహనిర్మాణజ్ఞానము మోహెంజోదారోలో క్రీ. పూ. 3000నాడే వ్యాప్తియందుండెను.

గోలీస్తూపమునకు చెందినఒక ఫలకముపై సప్తశీర్షుడగు నాగుని చిత్రమొకటి అత్యంత సుందరముగా శిల్పితమైనది.(13) అమరావతి శిల్పమున కనుపించు నాగములన్నిటికిని సామాన్యముగ అయిదుపడగలే కలవు. ఇట్లు ఏడుపడగలుగల నాగములు అరుదు. ఇందలి శిల్పచాతుర్యము ప్రశంసనీయము. నాగము కాలమును, శాశ్వతత్వమును, జన్మపరంపరావలయమును సూచించుచు అనంత, ప్రాణ, వాయు, దిక్సూచకముకూడ నగును.

గోలీశిల్పకళ అమరావతి నాలుగవకాలపు శిల్పమువలెనే పరిణతస్థితిని పొందినది. భారతీయ శిల్పకళ భార్హూత్‌లో ఉద్భవించి సాంచీలో కొంతనిలకడనుండి, స్వాతంత్ర్యమును సంపాదించి క్రీస్తుశకము మూడవశతాబ్దమున అమరావతిలో పరమోచ్చస్థితిని పొందినది.

అమరావతీ శిల్పములలో ఉత్తమశిల్పములే భారతదేశశిల్పములందెల్ల ఉత్తమములని గ్రన్‌వీడెల్ పండితుడు ప్రశంసించినాడు.(14) ఈ శిల్పమునగల కళాసౌష్టవమునకును, రచనావైవిధ్యమునకును అజంతా, బాఘ్ చిత్రములలో కొన్ని మాత్రమేమైన సాటి వచ్చునేమో అని బర్జిస్ పండితుని అభిప్రాయము.(15) శిల్పనైపుణ్యమున ఇవి అనన్యములు కావచ్చును; కాని తత్పూర్వ శిల్పమునందలి పరిమాణాధిక్యతకాని స్వచ్ఛందతకాని వీటిలో లేవని హావెల్ పండితుని అభిప్రాయము.(16) నిజమే. సాంచీద్వారములను బోలిన సున్నితమైన శిల్పము అమరావతిలో లేకపోవచ్చును. కాని ఇది స్వర్ణకారుని జిలుగు నగిషీపనివంటిది. ప్రతిరేఖలోను, ప్రతివంపులోను విశేషనైపుణ్యము, సౌకుమార్యము వెల్లివిరియును. చైతన్యము, భావానుగుణమైన వేగము, జీవము, అంగసౌష్టవము, రేఖావిన్యాసము, మూర్తిచిత్రముల రూపలావ

12. A. C. Coomaraswamy History of Indian and Indonesian Art. p. 60, "The only possible conclusion is that the Buddha figure must have been produced simultaneously, probably in the middle of or near the beginning of the first century A. D. in Gandhara and in Mathura in response to a demand created by the internal development of Buddhism which was common ground in both areas, in each case by local craftsmen, working in the local tradition.
13. Buddhist Sculptures of Goli, pl. XII,
14. Grunwedel Buddhist Art in India, p. 157.
15. The Buddhist Stupas of Amaravati and Jaggayyapeta, p. 26.
16. Ideals of Indian Art, p. 19.

-ణ్యము, వాస్తవికత, ఆధ్యాత్మికభావశబలత, అమరావతీశిల్పముల ప్రత్యేకలక్షణములు.

ఆకాలపుదేయగుట - గోలీశిల్పమునగూడ ఈయుత్తమ లక్షణములన్నియు కనిపించుచున్నవి. ముఖబంధఫలకముల విభజనలోను, మిథునచిత్రములయందును ఇది నాగార్జునకొండశిల్పమును బోలియున్నది. కాని ఆ శిల్పమునందు చెక్కడము ఇంతకంటెను లోతుగనుండి త్రిముఖరూపమును వ్యక్తము చేయుచున్నది. గోలీశిల్పమున అద్యంతము బౌద్ధమతాదర్శసాంకేతికములు సహితములై నాటిబౌద్ధుల ఆధ్యాత్మిక పరతను ప్రతిఫలింపజేయుచున్నవి. యశోధరసందర్శనము,[17] నలగిరిదమనము,[18] విశ్వాంతరజాతకము,[19] మారధర్షణము[20] మొదలగుఘట్టముల నిరూణలో శిల్పులు సాముదాయక దృశ్యముల నత్యంతరమణీయముగ చిత్రించినారు. శిల్పమున సమవాయము సముంచితముగానుండి మిక్కిలి నేత్రపర్వము చేయుచున్నది. వివిధ ప్రకృతులు కలిగి వివిధభావోద్దేశ్యముల బ్రకటించు స్త్రీపురుషులను, ఒకచోటజేర్చి ఆవైవిధ్యమునందే తత్త్వైక్యతను చిత్రింపగలిగిన గోలీశిల్పుల కళావైదగ్ధ్యము మిక్కిలి ప్రశంసనీయము. యశోధరసందర్శన దృశ్యమున మందస్మితవదనముతో చేయిజాచి బుద్ధుని ఆహ్వానించుచున్న యశోధర సుందరభంగిమ, అజంతాచిత్రములకు వన్నెబెట్టజాలియున్నది. వెస్సంతర జాతకమున వెస్సంతరుని సుఖదుఃఖానుభవములలో సానుభూతిని చూపునట్లు మృగపశుపక్ష్యాదులు వివిధవైఖరులలో రమ్యముగ శిల్పితములైనవి. వృషభశకటములు, ఆనాటివిప్రుల వస్త్రాలంకరణములును కూడ బాగుగ చిత్రితములైనవి. ఈగోలీశిల్పములలో స్త్రీపురుష వేషభూషాలంకరణరీతులు, ఉష్ణీషములు, కేశాలంకరణశైలులు అమరావతీశైలిలోవలెనే ఉన్నవి.

నాగార్జునకొండ శిల్పకళావైభవముతో అంతగా సాటిరాజాలకపోయినను గోలీశిల్పము ఉత్తమశిల్పకళాఖండములలో ఒకటియని చెప్పకతప్పదు. శిల్పసమవాయము (Composition) నందును, ప్రమాణముల (Proportions)యందును నిర్దుష్టము. దృక్కోణ (Perspective) ప్రదర్శనమున కొద్దిలోపము లుండి యుండవచ్చును. ఈలోపములు ముఖ్యముగా ఛద్దంత[21] మాతృపోషక[22] జాతకములయందు కానవచ్చును. అయినను శిల్పమున చిత్రరచనలో దృక్కోణమును నిర్దుష్టముగను విస్ఫుటముగను ప్రదర్శించుటకు వీలు కలుగదు. అంతేకాక బౌద్ధధర్మములను సంజ్ఞామాత్రముగా ప్రదర్శించుటను ప్రధానముగ పరిగణించిన శిల్పులు దృక్కోణము నంతగా పాటింపకపోవచ్చును. ఈ దృక్కోణప్రదర్శనము ఆధునికకళాపరిభాషా ప్రయుక్తమేనని విజ్ఞుల అభిప్రాయము.[23] అంతిమాత్రమున

---

17. T. N. Ramachandran; Buddhist Sculptures of Goli, pl. II F.
18. I bid, pl. III H. 19. I bid. pls. IV, V and VI.
20. I bid, pl. VII A.
21. T. N. Ramachandran; Buddhist Sculpture of Goli, pl. I C and D.
22. I bid, pl. XI No. 9
23. A. K. Coomaraswamy; Introduction to Indian Art, p. 21.

ప్రాచీనశిల్పులకిది పరిచితము కాదని యను కొనుట సాహసము. శిల్పమున ఇతర ప్రధాన లక్షణములకు లోపములేకుండ ఎంతవఱకు వీలగునో అంతవఱకును దీనిని ప్రదర్శించి నారు.

ఈశిల్పము ప్రాచీనబౌద్ధశిల్పసాంప్రదాయ మునకు లొంగి ప్రవర్తించినను ప్రాంతీయ స్వాతంత్ర్యమును ప్రకటించుచున్నది. ఇందు ద్యోతితమగు భావోద్దీపనము, రూపలావణ్యము, అంగసౌష్టవము రేఖాసౌలభ్యమే ఈశిల్పమును ఉత్తమశిల్పములగు అమరావతీ నాగార్జునకొండ శిల్పములతో తులదూగించి స్థానికపరిమితిని మించినప్రాశస్త్యమును గడించినది. అందువలననే భారతీయబౌద్ధశిల్పములలో దీనికొక విశిష్టత ఏర్పడినది.

---

# సాతవాహనుల నాణెములు

శ్రీమతి వి. వై దేహి బి. ఏ. ఆనర్సు.

చరిత్రను రచించుటకు అనేకములగు ఆధారము లుపకరించును. వానిలో శాసనములకు పిమ్మట నాణెములు ముఖ్యముగ పేర్కొనదగినవి. అందునను సాతవాహనవంశచరిత్రమును తెలిసికొనుటకు ఇవి అమూల్యములగు ఆధారములు. ఇవి లభించియుండనియెడల ఎన్నియో సమస్యలు అపరిష్కృతములై చరిత్రము అసంపూర్ణముగ నుండెడిది.

నాణెములు అనేకవిధముల నుపకరించును. కొందరురాజులపేర్లు వానివలననే తెలియుచున్నవి. ఇతరాధారములు పేర్కొనురాజులను ఇవియు పేర్కొని వారి వాస్తవత్వమును రూఢిపరచుచున్నవి. ఈనాణెములమీద గల చిహ్నములను బట్టియు, వాని బరువును బట్టియు, రాజుల పూర్వాపౌర్వ్యమును నిర్ణయింపవచ్చును. పునర్ముద్రితములగు నాణెములనుండి విజయము ఊహింపనగును. నాణెములు దొరకిన స్థలములనుబట్టి ఆయాకాలములలోని రాజ్యవిస్తృతి తెలియనగును.

సాతవాహనరాజుల నాణెములు ఇంతవరకును అనేకములు దొరకినవి. ఇంకను దొరకుచున్నవి. ఉత్తరహిందూస్థానమున అల్లాహాబాదు వద్దనున్న భీటాలోను, పాట్నావద్ద ప్రాచీన పాటలీపుత్రముండిన స్థలమునను, బరోడాలోను, మాలవవిదిశలలోను; దక్షిణాపథమునందు, సి. పి., బేరారు, మహారాష్ట్ర, కళింగ, ప్రాగాంధ్ర, తెలంగాణ, రాయలసీమలలోను; మైసూరుసంస్థానమునందును; దక్షిణమున మదరాసుకడలూరులమధ్యగల సముద్రతీరమునను ఈనాణెములు దొరకినవి. వీనిలో కొన్ని ఆకాలపు బౌద్ధస్థూపములలో లభించినవి. చాందా, కొల్హాపూర్, జోగల్తెంబి, తరహాలా అనుచోట్ల పాతులు దొరకినవి.

ఈనాణెములలో చాలభాగము సీసపునాణెములు. కొన్ని పాటిన్ అను మిశ్రితలోహములోను, కొన్ని రాగిలోను, చాలతక్కువసంఖ్య గలవి వెండిలోను వేయబడినవి. మిక్కిలి ప్రాచీనములు సీసపువి. గౌతమీపుత్రసాతకర్ణి, గౌతమీపుత్రయజ్ఞశ్రీ అనురాజుల వెండి నాణెము లున్నవి.

సాతవాహననాణెములు బహుఆకారములు గలవి. కొన్ని గుండ్రముగ నున్నవి. కొన్ని చతురములు, కొన్ని చతురస్రములు, మరికొన్ని అండాకృతి గలవి. గుర్తులను బట్టియు వీటిలో భేదము లున్నవి. కొన్నిటికి ఒకవైపుననే చిహ్నములుండి రెండవవైపు శూన్యముగ నుండును. కొన్నిటికి ఒక్కొకవైపున ఒక్కొకగుర్తుమాత్ర ముండును. ఇతర నాణెములమీద రెండువైపులను రెండు, మూడు చిహ్నములుండును. కొన్నిటిమీద శాసనముండును, కొన్నిటిమీద ఉండదు.

ఈనాణెములమీద అనేక విధ ము ల గు చిహ్నము లున్నవి. వానిలో ముఖ్యములు — (1) ఏనుగ — ఇది కుడివైపునకుగాని, ఎడమవైపునకుగాని తిరిగి యుండును. తొండము క్రిందికి వాల్చి గాని, పైకి ఎత్తబడిగాని ఉం

డును. కొన్నినాణెములమీద తల, తొండము మాత్ర ముండును. కొన్నిటిమీద ఏనుగు అలంకారముతో ఉండును. కొన్నిపట్ల ఏనుగు మీద ఒకమనుష్యుడో లేక గుండ్రని వస్తువో కలదు. (2) గుర్రము — ఇదియును కుడి యెడమలకు తిరిగి నిలచియుండును. కొన్నిటి పైన అలంకారములతోను, కొన్నిటిపైన నిరాడంబరముగను ఉండును. (3) వృషభము — ఈచిహ్నము కొద్దినాణెములమీదనే కలదు. సామాన్యముగ నీవృషభము నిలచియుండును. (4) సింహము — ఇది ప్రాచీన నాణెముల మీదను, తర్వాతకాలపు వానిమీదను కూడ కలదు. ఇందును కుడియెడమ తేడా లున్నవి. ఒకప్పు డీ సింహము నిలచియుండును, ఒకప్పుడు పైకి దుముక బోవున ట్లుండును, మరికొన్నిటిమీద వీని తోక శరీరముమీదికి ఎత్తబడి వంపుతిరిగి యుండును. (5) మనుష్యుడు— నాణెముమధ్య నొకమనుష్యుడు రెండుచేతులను పైకివెత్తి నిలచియుండును. (6) చైత్యము— ఇది మూడు, ఆరు, ఎనిమిది పది వంపులు కలిగియుండును. కొన్నిటిమీద దీనిపైన చంద్రరేఖయు, అడుగున తరంగచిహ్నము నుండును. (7) వృక్షము— ఈవృక్షముచుట్టును కంచె యుండును. (8) వృషభరాశి చిహ్నము. (9) త్రిరత్నచిహ్నము (10) మూడుఅగ్రముల ధ్వజము. (11) స్వస్తిక (12) నందిపాదము. (13) అటునిటు అడ్డగీతలుగల సున్న. (14) డమరు. (15) గుండ్రని వస్తువు. (16) అంకుశము. (17) కిరణములతో సూర్యబింబము. (18) చేపలుగల నది. (19) శంఖము. (20) కమలము. (21) నాగ చిహ్నము.

సాతవాహనవంశజులలో అందరురాజుల నాణెములును ఇంతవరకును లభించలేదు. కొందరివిమాత్రమే దొరకినవి. ఈనాణెముల వలన తెలియదగినవారిలో కొందరు శాసన వాఙ్మయాద్యాధారములనుండియు తెలియనగుచున్నారు. కొందరుమాత్రము ఈనాణెములనుండియే తెలియనగుచున్నారు. మొత్తముమీద నీక్రిందిరాజులనాణెములు* లభించినవి— (i) సాతవాహనుడు, మొదటి సాతకర్ణి, రెండవసాతకర్ణి, ఆపీలకుడు, మేఘస్వాతి, గౌతమీపుత్రసాతకర్ణి, వాసిష్ఠీపుత్ర పులోమావి, వాసిష్ఠీపుత్రశివశ్రీ, వాసిష్ఠీపుత్ర సాతకర్ణి, గౌతమీపుత్రయజ్ఞశ్రీ, శకసేనుడు, వాసిష్ఠీపుత్రచంద్రసాతకర్ణి, శ్రీసాతకర్ణి, రుద్ర సాతకర్ణి, కృష్ణసాతికర్ణి, కుంభసాతకర్ణి, కర్ణ సాతకర్ణి, కౌశికీపుత్రసాతకర్ణి.

*

---

* సాతవాహన నాణెములు Rapson — Catalogue of Andhra Coins; Smith — Coins in the Indian Museum; Journal of the Bengal Branch of the Royal Asiatic Society — Numismatic Supplement, అను గ్రంథములలో పరిశీలింపబడినవి. కొండాపురమున దొరికిన నాణెములు Hyderabad Museum లోనున్నవి. ఇదిగాక కొందరు వస్తుశోధకులవద్ద నాణెముల సంచయము లున్నవి.

నిర్గత్య నగరా త్తస్మా చ్ఛిష్యద్వయ సమన్వితః
తపసే నిశ్చితో ద్రష్టు మాగతో వింధ్యవాసినీం

* * *

పులిందవాక్యా దాసాద్య సార్థం దైవా త్కథంచన
ఇహ ప్రాప్తో ఽహ మద్రాక్షం పిశాచాన్ సుబహూ నమూన్
అన్యోన్యాలాప మేతేషాం దూరా దాకర్ణ్య శిక్షితా
మయా పిశాచ భాషేయం మానమోక్షస్య కారణం

* * *

తత్రైవ చ గుణాఢ్యేన పైశాచ్యా భాషయా తయా
నిబద్ధా సప్తభి ర్వర్షైః గ్రంథలక్షాణి సప్త సా
మైత్రాం విద్యాధరా హార్షు రితి తా మాత్మశోణితైః
అటవ్యాం మష్యభావాచ్చ లిలేఖ స మహాకవిః

* * *

అథైకో గుణదేవాఖ్యో నందిదేవాభిధః పరః
త మూచతు రుపాధ్యాయం శిష్యా వనుగతా వుభౌ
తత్కావ్యస్యార్పణస్థాన మేకః శ్రీసాతవాహనః
రసికో హి వహే త్కావ్యం పుష్పామోద మివానిలః
ఏవమ స్త్వితి తౌ శిష్యా వంతికం తస్య భూపతేః
ప్రాహిణో త్పుస్తకం దత్వా గుణాఢ్యో గుణశాలినా
స్వయం చ గత్వా తత్రైవ ప్రతిష్ఠానపురా ద్బహిః
కృతసంకేత ఉద్యానే తస్థౌ దేవీవినిర్మితే
తచ్ఛిష్యాభ్యాం చ గత్వా తత్ సాతవాహనభూపతేః
గుణాఢ్యకృతి రేషే తి దర్శితం కావ్యపుస్తకం
పిశాచభాషాం తాం శృత్వా తౌ చ దృష్ట్వా తదాకృతీ
విద్యామదేన సాసూయం సరాజైవ మభాషత
ప్రమాణం సప్తలక్షాణి పైశాచం నీరసం వచః
శోణితే నాక్షరన్యాసో ధిక్ పిశాచకథా మిమాం
తతః పుస్తక మాదాయ గత్వా తాభ్యాం యథాగతం
శిష్యాభ్యాం తద్గుణాఢ్యాయ యథావృత్త మకథ్యత
గుణాఢ్యోఽపి తదాకర్ణ్య సద్యః ఖేదవశోఽభవత్
తత్త్వజ్ఞేన కృతావజ్ఞం కోనామాం తర్నతప్యతే
సశిష్య శ్చ తతో గత్వా నాతిదూరం శిలోచ్చయం

వివిక్తరమ్యభూభాగ మగ్నికుండం వ్యధాత్పురః
తత్రాగ్నౌ పత్రమేకైకం శిష్యాభ్యాం సాశ్రు వీక్షితః
వాచయిత్వా స చిక్షేప శ్రావయన్ మృగపక్షిణః
నరవాహనదత్తస్య చరితం శిష్యయోః కృతే
గ్రంథలక్షం కథా మేకాం వర్జయిత్వా తదీప్సితాం
తస్మింశ్చ తాం కథాం దివ్యాం పఠత్యపి దహత్యపి
పరిత్యక్త తృణాహారాః శృణ్వంతః సాశ్రులోచనాః
ఆసన్నభ్యేత్య తత్రైవ నిశ్చలా బద్ధమండలాః
నిఖిలాః ఖలు సారంగవరాహమహిషాదయః
అత్రాంతరే చ రాజాభూ దస్వస్థః సాతవాహనః
దోషం చాస్య వదన్ వైద్యాః శుష్కమాంసోపభోగజం
ఆక్షిప్తా స్తన్నిమిత్తం చ సూపకారా బభాషిరే
అస్మాక మీదృశం మాంసం దదతే లుబ్ధకా ఇతి
పృష్టాశ్చ లుబ్ధకా ఊచు ర్నాతిదూరే గిరా వితః
పఠిత్వా పత్ర మేకైకం కోఽప్యగ్నౌ క్షిపతి ద్విజః
తత్సమేత్య నిరాహారాః శృణ్వంతి ప్రాణినోఽఖిలాః
నాన్యతో యాంతి తేనైషాం శుష్కం మాంస మిదం క్షుధా
ఇతి వ్యాధవచః శ్రుత్వా కృత్వా తానేవ చాగ్రతః
స్వయం సకౌతుకా ద్రాజా గుణాఢ్యస్యాంతికం యయౌ
దదర్శ తం సమాకీర్ణం జటాభి ర్వనవాసతః
ప్రశాంతశేషశాపాగ్ని ధూమికాభిరవా భితః
అథైనం ప్రత్యభిజ్ఞాయ సబాష్పమృగమధ్యగం
నమస్కృత్య చ పప్రచ్ఛ తం వృత్తాంతం మహీపతిః
సోపి స్వం పుష్పదంతస్య రాజ్ఞే శాపాది చేష్టితం
జ్ఞానీ కథావతారం త మాచఖ్యౌ భూతభాషయా
తతో గణావతారం తం స్తుత్వా పాదానతో నృపః
యయాచే తాం కథాం తస్మా ద్దివ్యాం హరముఖోద్గతాం
అథోవాచ తం భూపం గుణాఢ్యః సాతవాహనం
రాజన్ షడ్గ్రంథలక్షాణి మయా దగ్ధాని షట్కథాః
లక్షమేక మిదం త్వస్తి కథైకా సైవ గృహ్యతాం
మచ్ఛిష్యౌ తవ చాత్రైతే వ్యాఖ్యాతారౌ భవిష్యతః
ఇత్యుక్త్వా నృప మామంత్ర్య త్యక్త్వా యోగేన తాం తనుం
గుణాఢ్యః శాపనిర్ముక్తః ప్రాప దివ్యం నిజం పదం

అథ తాం గుణాఢ్యదత్తా మాదాయ కథాం బృహత్కథానామ్నా
నృపతిర గా న్నిజనగరం నరవాహనదత్త చరితమయీం

* * *

గుణదేవనందిదేవౌ తస్య చ తౌ తత్కథాకవేః శిష్యౌ
క్షితికనకవస్త్రవాహనభవనధనైః సంవిభేజే సః
తాభ్యాం సహ చ కథాం తా మాశ్వాస్య స సాతవాహన స్తస్యాః
తద్భాషయా౽వతారం వక్తుం చక్రే కథాపీఠం

## గుణాఢ్యుని వృత్తాంతము.

ప్రతిష్ఠానమునందు సుప్రతిష్ఠితమను నగర ముండెను. అందు సోమశర్మయను బ్రాహ్మణు డుండెను. అతనికి వత్స, గుల్మక అను నిద్దరు పుత్త్రులును, శ్రుతార్థ అను పుత్త్రికయు కలిగిరి. కొంత కాలమున బ్రాహ్మణుడు నాతని భార్యయు మరణించిరి. వత్సగుల్మకులు చెల్లెలితో కలసి కాలము గడపుచుండిరి. అకస్మాత్తుగ వారికి ఆమె గర్భవతియయ్యెనని తెలియవచ్చెను. ఇంట మఱియొక పురుషు డెవ్వడును లేకుండుటవలన వారు ఒకరినొకరు అనుమానించుకొనిరి. అంతట శ్రుతార్థ వారితో ఒకనాడు తాను స్నానార్థమేగినప్పుడు నాగరాజగు వాసుకి సోదరుని పుత్త్రుడు కీర్తిసేనుడు తనను చూచి మోహించి, గాంధర్వవిధిచేత తనను పెండ్లాడెననియు, అతనివలననే తనకు గర్భము కలిగెననియు చెప్పెను. ఆమె సోదరు లీకథను విశ్వసింపలేదు. అప్పు డామె రహస్యముగ కీర్తిసేనుని స్మరించెను. అతడు వారియెదుట సాక్షాత్కరించి, ఆమెచెప్పినదంతయు నిజమనియు, వారు మువ్వురును శాపభ్రష్టులై యీలోకమున జన్మించిరనియు, శ్రుతార్థకు పుత్త్రుడు కలుగుననియు, అంతటితో మువ్వురికిని శాపవిముక్తి కలుగుననియు చెప్పెను. కొంత కాలమునకు శ్రుతార్థకు పుత్త్రుడు పుట్టెను. అప్పుడు "రుద్రగణములోని ఒకడు ఇట్లు పుట్టెను, ఇతడు గుణాఢ్యుడని ప్రసిద్ధినందును" అని ఆకాశవాణి పలికెను. త్వరలోనే గుణాఢ్యుని తల్లియు, మేనమామలును మరణించిరి. బాలుడైనను ధైర్యము వహించి గుణాఢ్యుడు విద్యాభ్యాసమునకై దక్షిణాపథమునకు పోయెను. అక్కడ విద్యలను నేర్చి తిరిగి స్వస్థానమగు సుప్రతిష్ఠితనగరమునకు వచ్చెను. అంతట నితడు శిష్యులతో కూడి రాజభవనమున కేగి శర్వవర్మమున్నగు మంత్రులచే పరివేష్టింపబడి రత్నసింహాసనమున కూర్చునియున్న సాతవాహనుడను రాజును చూచెను. శర్వవర్మాదు లితనిని సర్వవిద్యావిశారదునిగ రాజున కెరుకపరచిరి. రాజును సంతసించి గుణాఢ్యుని మంత్రిగ నియోగించెను. అంతట శిష్యులకు విద్యనేర్పుచు, రాజకార్యములను నిర్వహించుచు గుణాఢ్యు డట స్థిరపడెను. ఒకప్పుడు వసంతోత్సవ కాలమున రాజు ఉద్యానవనమున భార్యలతో కలసి జలక్రీడావినోదము ననుభవించుచు చేతులతో రాణులమీదికి నీళ్ళను కొట్టుచుండెను. అంతొకరాణి అలసిపోయి "మోదకైరేవ తాడయ" అనెను. వెంటనే రాజు ఉండ్రాళ్ళను తెప్పించెను. అంతట రాణి "జలక్రీడాసమయమున మోదకములెందులకు. 'మా ఉదకైః తాడయ' అనికదా అంటిని నేను. ఈ చిన్న సంధినియమమే తెలియని మూర్ఖుడవా" అని పరిహసించెను. పరిజనులును నవ్విరి. లజ్జితుడై రాజు నీటినుండి యీవలికి వచ్చి అంతఃపురమునకు పోయి, ఖిన్నుడై మౌనము వహించెను. గుణాఢ్యశర్వవర్మ లీసంగతి తెలిసికొని రాజువద్దకు పోయిరి. మంచిమాటలతో అతని నోదార్చి గుణాఢ్యు డతనిని పండితుని చేసెదనని ధైర్యము చెప్పి సర్వవిద్యామూలమును, పండ్రెండుసంవత్సరములు పరిశ్రమచేసిన కాని లభించనిదియునగు వ్యాకరణమును తాను ఆరేండ్లలో చెప్పెద ననెను. శర్వవర్మ ఆవిద్యను ఆరుమాసములలో చెప్పెద ననెను. అంతట గుణాఢ్యుడు ఇది నిజమేయగుచో తాను సంస్కృతప్రాకృతదేశీలను మూడు భాషలను వదలెదనని శపథము చేసెను. శర్వవర్మ తానట్లు చేయలేనియెడల పండ్రెండు ఏండ్లు గుణాఢ్యుని పాదుకలను శిరమున మోసెదననెను. పిమ్మట శర్వవర్మ కుమారస్వామి నుపాసించెను. ఆదైవ మతనికి సాక్షాత్కరించి, అతని వాంఛితమును కనిపెట్టి "సిద్ధో వర్ణసమామ్నాయః" అను సూత్రము నుపదేశించెను. అంతట మనుష్యచాపల్యమువలన తర్వాతిసూత్రమును శర్వవర్మ చెప్పెను. అప్పుడు కుమారస్వామి "నీ వీసూత్రమును చెప్పకుండినచో

చేనుపదేశించు వ్యాకరణము పాణినీయవ్యాకరణమును మించినది అయ్యెడిది. అయినను పోయినదిలేదు. ఇది 'కాతంత్రమనియు, కాలాపకమనియు ప్రసిద్ధిచెందును'' అని మిగిలిన శాస్త్రమును చెప్పి అంతర్హితుడయ్యెను. ఇంటికి తిరిగివచ్చి శర్వవర్మ గడువుదాటకపూర్వము రాజునకు ఆశాస్త్రమును చెప్పి అతనిని వ్యాకరణపండితుని చేసెను. సాతవాహనుడును గురుదక్షిణగ శర్వవర్మకు రత్నభూషాదులనిచ్చియు, నర్మదాతీరమందున్న భరుకచ్ఛవిషయమున కధిపతిని చేసియు సత్కరించెను.

పిమ్మట గుణాఢ్యుడు మౌనము వహించి, రాజునకు నమస్కరించి ఆస్థానమును వీడెను. ఇద్దరు శిష్యులతో కూడి ప్రతిష్ఠానగరమునుండి వెడలి వింధ్యవాసిని వద్దకు పోయెను. కొంతకాలమునకు పిశాచులు మాటలాడుకొనుచుండగ విని వారి భాషను గ్రహించి, ఆ పైశాచీభాషలో తన రక్తముతో పత్రములమీద బృహత్కథ అను గ్రంథమును రచించెను. శిష్యులు ఆ కావ్యమును సమర్పించుటకు సాతవాహనుడే తగినవాడని సూచించిరి. ఆసూచన నంగీకరించి గుణాఢ్యకవి గ్రంథమును వారికే యిచ్చి రాజువద్దకు పంపెను. తాను నగరము వెలుపల నొకచోట ఆగెను. శిష్యులు పుస్తకమును సాతవాహనునికి చూపి అది గుణాఢ్యకృతి అని చెప్పిరి. విద్యోన్మత్తుడై రాజు "గ్రంథమా ఏడులక్షలు. భాషయా నీచమగు పైశాచి. అక్షరములా రక్తముతో వ్రాయబడినవి. ఛీ. ఎందుల పిశాచకథ" అని నిరసించెను. శిష్యులు తిరిగి గుణాఢ్యునివద్దకు వచ్చి నడచిన వృత్తాంతమును నివేదించి గ్రంథము నిచ్చివేసిరి. గుణాఢ్యుడు మిక్కిలి దుఃఖించి హతాశుడై దగ్గర నొకచోట అగ్నిని ప్రజ్వరిల్ల చేసెను. దానివద్ద కూర్చొని ఒక్కొక పత్రమునే తీసి చదువుచు దాని నగ్నిలో పారవేయ నారంభించెను. సారంగవరాహమహిషాది జంతువులును, పక్షులును గుంపులుగుంపులుగ జేరి ఆకథను వినుచు, కన్నీటితో గ్రంథదహనమును చూచుచుండినవి. గ్రంథము చాలభాగము దగ్ధమై పోయెను. కడపటిలక్షలో చెప్పబడిన నరవాహనదత్తచరిత్రమును మాత్రము శిష్యులపై అనుగ్రహమువలన గుణాఢ్యుడు దహింపనని వాగ్దానము చేసెను. ఇదేసమయమున సాతవాహనునికి జబ్బు చేసెను. వైద్యులు శుష్కమాంసమును తినుటవలన ఆరోగము కలిగెననిరి. విచారింపగా మృగములన్నియు నిరాహారముగ గుణాఢ్యునివద్ద నిలచియున్నవనియు, నందువలన మంచిమాంసము దొరకుటలేదనియు తెలిసెను. చకితుడై రాజు వారిని వెంటనిడుకొని వారు చూపిన స్థలమున కేగెను. కొంతసేపటికి గుణాఢ్యుని గుర్తించి సాతవాహనుడు పశ్చాత్తప్తుడై, ముందుకు వచ్చి అతనికి నమస్కరించెను. గుణాఢ్యుడు పైశాచీభాషలో తనవృత్తాంతమునంతను తెల్పి తాను శివగణములలో నొకడననియు, తన శాపవిమోచన మయ్యెననియు చెప్పెను. ఆగ్రంథము నెట్లైనను చెప్పుమని రాజు యాచించెను. అంతట గుణాఢ్యుడు "రాజా! ఆరులక్షలగ్రంథములుకల ఆరుకథలు కాలిపోయినవి. లక్షగ్రంథ పరిమితమైన ఒక్కకథమాత్రము మిగిలినది. దీనిని తీసికొనుము. నాశిష్యులిర్వురును దీనిని వ్యాఖ్యానింతురు." అని చెప్పి యోగమార్గమున శరీరమును వదలెను. రాజును బృహత్కథ అను నాగ్రంథమును తీసికొని, తనయింటికి వచ్చి, గుణదేవనందిదేవులను గుణాఢ్యశిష్యుల ననేకవిధముల సత్కరించి, వారిసహాయముతో గ్రంథమును చదివి దానికి పైశాచీభాషలోనే కథాపీఠమను అవతారికను చెప్పెను.

## సాతవాహనకథా

ఏవముక్తే గుణాఢ్యేన కాణభూతి రభాషత
సాతవాహన ఇత్యస్య కస్మాన్నామా భవత్ప్రభో
తతో௨బ్రవీ ద్గుణాఢ్యోపి శృణ్వేత త్కథ యామి తే
దీపకర్ణిరితి ఖ్యాతో రాజా భూత్ ప్రాజ్యవిక్రమః
తస్య శక్తిమతీనామ భార్యా ప్రాణాధికా భవత్
రతాంతసుప్తా ముద్యానే సర్ప స్తాం జాతు దష్టవాన్
గతాయా మథ పంచత్వం తస్యాం తద్గతమానసః
అపుత్రోపి స జగ్రాహ బ్రహ్మచర్యవ్రతం నృపః

తతః కదాచి ద్రాజ్యార్హపుత్రాసద్భావదుఃఖితం
ఇత్యాదిదేశ తం స్వప్నే భగవా నిందుశేఖరః
అటవ్యాం ద్రక్ష్యపి భ్రామ్యన్ సింహారూఢం కుమారకం
తం గృహీత్వా గృహం గచ్ఛ స తే పుత్రో భవిష్యతి
అథ ప్రబుద్ధ స్తం స్వప్నం స్మరన్ రాజా జహర్ష సః
కదాచి చ్చ యయౌ ఘోరా మటవీం మృగయారసాత్
దదర్శ తత్ర మధ్యాహ్నే సింహారూఢం స భూపతిః
బాలకం పద్మసరస స్తీరే తపనతేజసం
అథ రాజా స్మరన్ స్వప్న మవతారితబాలకం
జలాభిలాషిణం సింహం జఘా నైకశరేణ తం
స సింహ స్త ద్వపు స్త్యక్త్వా సద్యోఽభూ త్పురుషాకృతిః
కష్టం కిమేత ద్బ్రూహీతి రాజ్ఞా పృష్టో జగాద చ
ధనదస్య సఖా యక్షః సాతో నామాస్మి భూపతే
సోఽహం స్నాంతీ మపశ్యం ప్రా గ్గంగాయాం ఋషికన్యకాం
సాపి మాం వీక్ష్య సంజాతమన్మథాఽభూ దహం తథా
గాంధర్వేణ వివాహేన తతో భార్యాకృతా మయా
తచ్చ తద్బాంధవా బుద్ధ్వా తాం చ మాం చాశపన్ క్రుధా
సింహౌ భవిష్యతః పాపౌ స్వేచ్ఛాచారౌ యువా మితి
పుత్రజన్మావధిం తస్యాః శాపాంతం మునయో వ్యధుః
మమ తు త్వచ్ఛరాఘాతపర్యంతం తదనంతరం
అథావాం సింహమిథునం సంజాతౌ సాపి కాలతః
గర్భిణ్యభూత్తతో జాతే దారకేఽస్మిన్ వ్యపద్యత
అయం చ వర్ధితోఽన్యాసాం సింహీనాం పయసా మయా
అద్య చాహం విముక్తోఽస్మి శాపా ద్బాణాహత స్త్వయా
తత్ గృహాణ మహాసత్త్వం మయా దత్త మముం సుతం
అయం హ్యర్థః సమాదిష్ట స్తైరేవ మునిభిః పురా
ఇత్యుక్త్వాంతర్హితే తస్మిన్ సాతనామని గుహ్యకే
స రాజా తం సమాదాయ బాలం ప్రత్యాయయౌ గృహం
సా తేన యస్మా దూఢోఽభూ త్తస్మా త్తం సాతవాహనం
నామ్నా చకార కాలేన రాజ్యే చైనం న్యవేశయత్
తత స్తస్మిన్ గతేఽరణ్యం దీపకర్ణౌ క్షితీశ్వరే
సంవృత్త స్సార్వభౌమో సౌ భూపతిః సాతవాహనః

"ఈ రాజునకు సాతవాహనుడను పేరు ఎట్లు వచ్చెను" అని కాణభూతి అడుగగా గుణాఢ్యుడు ఇట్లు చెప్పెను. పూర్వము దీపకర్ణి అను రాజు ఉండెను. అతనికి శక్తిమతియను భార్య ఉండెను. ఒకనాడు రతిశ్రాంతయై ఉద్యానవనమున పడుకొనియుండగ ఆమెను ఒక పాము కరచి చంపెను. ఆమెపైగల ప్రేమవలన, తాను అపుత్రకుడయ్యు రాజు బ్రహ్మచర్యము నవలంబించెను. తనయనంతరము రాజ్యమునకు రాగల పుత్రుడు లేడని దుఃఖించుచుండగ రాజునకు స్వప్నమున శివుడు సాక్షాత్కరించి "నీకు అడవిలో సింహమునెక్కి తిరుగుచున్న బాలుడు కనిపించును. వానిని తెచ్చి పుత్రునివలె పెంచుకొనుము" అని చెప్పెను. ఒకనాడు అతడు వేటకై అడవికి పోయెను. మధ్యాహ్నమున తనపై నొక తేజస్వియగు బాలుని ఎక్కించుకొని వచ్చి, అతని నొక సరస్తీరమున దాచి, దాహము తీర్చుకొనుటకై ఒక సింహము నీటిలోనికి పోవుట కనిపించెను. వెంటనే ఒక బాణమును వేసి రాజు ఆసింహమును చంపెను. వెంటనే దానినుండి యొక పురుషుడు వెలుపలికి వచ్చెను. రాజు ఇది యేమని అడుగగా ఆపురుషుడు తాను కుబేరుని మిత్రుడగు సాతుడను యక్షుడననియు, తాను గంగలో స్నానముచేయుచున్న ఋషికన్య నొకతెను చూచి మోహించి గాంధర్వముగ వివాహమాడితిననియు, ఈసంగతివిని ఆమె బంధువులు వారిర్వురను సింహములు కండని శపించిరనియు, పుత్రజన్మతో ఆమెకును శరాహతితో తనకును శాపావధి నొసంగిరనియు, తనపై స్వారి చేసిన పిల్లవాడు పుట్టగనే ఆమె మరణించెననియు, ఇతరసింహముల పాలతో తానీబాలుని పెంచెననియు, తన కానాటికి విముక్తి అయ్యెననియు చెప్పి అంతర్ధానము నందెను. రాజును శివాజ్ఞను తలచుకొని బాలుని తీసుకొనిపోయి సాతుని స్వారిచేసినవాడు గనుక సాతవాహనుడని పేరుపెట్టెను. కొంతకాలమునకు రాజ్యము నీసాతవాహనునికి వప్పగించి దీపకర్ణి అరణ్యమున కేగెను. సాతవాహనుడు సార్వభౌముడై పరిపాలింపసాగెను.

## పుష్పదంతకథా

గంగాతీరేఽగ్రహారోఽస్తి నామ్నా బహుసువర్ణకః
తత్ర గోవిందదత్తాఖ్యో బ్రాహ్మణో భూద్బహుశ్రుతః
తస్య భార్యా గ్నిదత్తాచ బభూవ పతిదేవతా
స కాలేన ద్విజ స్తస్యాం వంచపుత్రా నజీజనత్
తే చ మూర్ఖాః సురాపాశ్చ బభూవు రభిమానినః

* * *

తద్దృష్ట్వా దేవదత్తాఖ్యః తస్యైక స్తనయ స్తదా
సనిర్వేదః స తపసే యయౌ బదరికాశ్రమం

* * *

దదౌచ దర్శనం తస్య శంభుః తీవ్రతపోర్జితః

* * *

స దేవదత్తః ప్రయయౌ ప్రతిష్ఠాన మతెంద్రితః

* * *

కృతవిద్యం చ తం తత్ర దదర్శ నృపతేః సుతా
సుశర్మాఖ్యస్య శుభగం శ్రీర్నామ శ్రీరివాచ్యుతం
సోఽపి తాం దృష్టవాన్ కన్యాం స్థితాం వాతాయనోపరి

* * *

తచ్ఛ్రుత్వా శాపభీతేన రాజ్ఞా తస్మై నిజా సుతా
సా దత్తా దేవదత్తాయ తతః . . . . .

గంగాతీరమున బహుసువర్ణకమను అగ్రహార ముండెను. అందు విద్వాంసుడగు గోవిందదత్తుడను బ్రాహ్మణు డుండెను. అతనికి ఐదుగురు పుత్రులు కలిగిరి. వారు మూర్ఖులును, త్రాగుబోతులును అయిరి. ఒకనాడు ఇంటికి వచ్చిన అతిథిని వారు అవమానించిరి. తల్లిదండ్రు లీదుర్మార్గమునకై వారిని త్యజించిరి. వారిలో దేవదత్తుడనువాడు పశ్చాత్తప్తుడై శివునిగూర్చి తప మొనర్చి అతనిని మెప్పించి వరముల నందెను. అమీద నతడు విద్యాభ్యాసమునకై ప్రతిష్ఠానమున కేగెను. ఒకనాడు మేడమీద నిలచి సుశర్మయను రాజు పుత్రిక అతనిని చూచెను. అతడును ఆమెను చూచెను. వారిద్వరును బద్ధానురాగులైరి...... కొంతకాలమైనవెనుక సుశర్మ తనపుత్రికను దేవదత్తున కిచ్చి పెండ్లి చేసెను.

## విక్రమాదిత్యకథా

అస్త్యవంతీషు విఖ్యాతా యుగాదౌ విశ్వకర్మణా
నిర్మితోజ్జయినీనామ పురారాతనతిః పురీ
మహేంద్రాదిత్య ఇత్యాసీ ద్రాజా తస్యాం జగజ్జయీ

* * *

నానావ్రతధరః శర్వ దభవ త్సుత్రికామ్యయా

* * *

స్థితం కైలాసశైలేంద్రే పురారిం పార్వతీయుతం
ఉపాజగ్ముః సురాః సేంద్రాః మ్లేచ్ఛోపద్రవదుఃస్థితాః

* * *

ఇతి దేవైః స విజ్ఞప్తః పురారాతి రువాచ తాన్
యాత యూయం న చింతాఽత్ర కార్యా భవత నిర్వృతాః

* * *

గతేషు తేషు చాహూయ మాల్యవత్సంజ్ఞకం గణం
సపార్వతీకో భగవా నేవ మాదిశతి స్మ సః
పుత్రావతీర మానుష్యే జాయస్వ చ మహాపురి
ఉజ్జయిన్యాం సుతః శూరో మహేంద్రాదిత్యభూపతేః
స చ రాజా మమైవాంశః తద్భార్యా చాంబికాంశజా
తయో ర్గృహే సముత్పద్య కురు కార్యం దివౌకసాం
మ్లేచ్ఛాన్ వ్యాపాదయాశేషాన్ త్రయీధర్మవిఘాతినః
సప్తద్వీపేశ్వరో రాజా మత్ప్రసాదా చ్చ భావ్యసి

* * *

గత్వా చోజ్జయినీం తత్ర మహేంద్రాదిత్య భూభుజః
దేవ్యా ఋతుజుషో గర్భం సమభూత్ స గణోత్తమః
తత్కాంచన నిశాకాంతకలాకలిత శేఖరః
దేవో మహేంద్రాదిత్యం తం నృపం స్వప్నే సమాదిశత్

తుష్టోస్మి తవ తద్రాజన్ స తే పుత్రో భవిష్యతి
ఆక్రమిష్యతి సద్వీపాం పృథివీం విక్రమేణ యః
భవిష్యతి స ఏవైష విక్రమాదిత్యసంజ్ఞకః
తథా విషమశీలశ్చ నామ్నా వైషమ్యతోఽరిషు

* * *

జాతే చ తస్మిన్నిపతత్ పుష్పవృష్టిపరిహాసినీ
ద్యౌ రరాజత గీర్వాణదుందుభిధ్వనినాదినీ

* * *

నామ్నా తం విక్రమాదిత్యం హరోక్తేనాకరోత్పితా
తథా విషమశీలం చ మహేంద్రాదిత్య భూపతిః

* * *

తతశ్చ యౌవనస్థం తం విలోక్య ప్రాజ్యవిక్రమం
మహేంద్రాదిత్యనృపతిః సభార్యాసచివోఽపి సః
వృద్ధో వారాణసీం గత్వా శరణం శిశ్రియే శివం
సోఽపి తద్విక్రమాదిత్యో రాజ్యమాసాద్య పైతృకం
నభో భాస్వానివానేషే రాజా ప్రతపితుం క్రమాత్
ఏకదా చ తమాస్థానగతం భద్రాయుధో నృపం
ప్రవిశ్య విక్రమాదిత్యం ప్రతీహారో వ్యజిజ్ఞపత్
ప్రేషితస్య ససైన్యస్య దక్షిణాశావినిర్జయే
పార్శ్వం విక్రమశక్తేర్యో దేవేన ప్రేషితోఽభవత్
స సిద్ధార్థోఽనంగదేవోఽయ మాగతో ద్వారి తిష్ఠతి

* * *

ఇతి భూమిభృతా పృష్టోఽనంగదేవో జగాద సః
శివం విక్రమశక్తేశ్చ సైన్యస్య సకలస్య చ
సాపరాంతశ్చ దేవేన నిర్జితో దక్షిణాపథః
మధ్యదేశః ససౌరాష్ట్రః సవంగాంగా చ పూర్వదిక్
సకశ్మీరా చ కౌబేరీ కాష్ఠా చ కరదీకృతా
తాని తాన్యపి దుర్గాణి ద్వీపాని విజితాని చ
మ్లేచ్ఛసంఘాశ్చ నిహతాః శేషాశ్చ స్థాపితా వశే

* * *

అథాహం సింహలాధీశమాతేన సహ తేన తత్
అగచ్ఛం సింహలద్వీపం వహన్నే వాబ్ధివర్త్మనా

* * *

తస్యాం చ వీరసేనం తమద్రాక్షం సింహలేశ్వరం

* * *

అన్యేద్యు రాస్థానగతో మా మాహూయ స భూపతిః
యుష్మాసు దర్శయన్ భక్తి మవోచన్ మంత్రిసన్నిధౌ
అస్తి మే దుహితా కన్యా మర్త్యలోకైకసుందరీ
నామ్నా మదనరేఖేతి తాం చ రాజ్ఞే దదామి వః

* * *

తతః స విక్రమాదిత్యో జయసైన్య మవాప తత్
అధిష్ఠితం స్వసేనాన్యా తేన విక్రమశక్తినా
అగ్రగేన తేనైవ సోత్కేన ప్రణతాత్మనా
సరాజకేన సహితః స్వబలం సవివేశ చ
గౌడః శక్తికుమారోఽయం కర్ణాటోఽయం జయధ్వజః
లాటో విజయవర్మాఽయం కాశ్మీరోఽయం సునందనః
గోపాలః సింధురాజోఽయం భిల్లోవింధ్యబలోఽస్త్యయం
నిర్మూకః పారశీకోఽయం నృపః ప్రణమతి ప్రభో
ఇత్యాస్థానే నృపాన్ సోఽత్ర ప్రతీహార నివేదితాన్
సంమాన్య సంమానయామాస సామంతాన్ సైనికానపి

* * *

శృణు తద్వచ్మి తే మిత్ర జ్ఞాతం తావ దత స్త్వయం

* * *

తద్భద్రాయుధే దాసీం చిత్రే స్వప్నే చ దృష్టవా
తయా మలయవత్యాఽహం వినా జీవితు ముత్సహే

* * *

కిం త్వయా నగరం సత్యం తద్దృష్ట మితి భూభృతా
తత్ర శంబరసిద్ధిః స పరిపృష్టోఽబ్రవీ దిదం
దృష్టం మయా తన్మలయపురం నామ మహాపురం
భ్రమతా భువ ముత్తీర్య వారిధిం ద్వీపమధ్యగం
తస్మి న్మలయసింహాఖ్యో నగరేఽస్తి మహీపతిః
తస్యాస్తి నామ్నా మలయవతీ త్యనుపమా సుతా

* * *

ప్రతస్థే విక్రమాదిత్యః సైన్యేన లఘునా వృతః
గత్వా క్రమేణ తీర్ణాబ్ధి ర్యావత్ప్రాప్తః పురం స తత్

* * *

తత్కాల ముత్క్షిప్య భుజం తేన శంబర సిద్ధినా
ఉచ్చై రవపరజ్ఞేన బంది నేద మపఠ్యత

జయ నిజతేజఃసాధితభూతగణమ్లేచ్ఛవిపినదావాగ్నే
జయ దేవ సప్తసాగరసీమమహీమానినీనాథ
జయ విజితసకలపార్థివవినతశిరోధరితాతిగుర్వాజ్ఞ
జయ విషమశీల విక్రమవారినిధే విక్రమాదిత్య

ఇత్యుక్తే వందినా తం స విక్రమాదిత్య మాగతం
బుద్ధ్వా మలయసింహోఽత్ర రాజా జగ్రాహ పాదయోః
వివేశ చ కృతాతిథ్యః తేన సాకం స్వమందిరం
తయా మలయవత్యా చ దుహిత్రా మృత్యుముక్తయా
దదౌ చ తాం సుతాం తస్మై విక్రమాదిత్యభూభృతే

అవంతిలో ఉజ్జయిని అను నగర ముండెను. అందు మహేంద్రాదిత్యుడు రాజుగ నుండెను. పుత్రులకొరకై అతడు అనేకవ్రతములు చేసెను.

ఒకప్పుడు ఇంద్రాదిదేవతలు మ్లేచ్ఛోపద్రవబాధితులై కైలాసమున కేగి శివుని దర్శించి మొరపెట్టుకొనిరి. అతడును వారిని ఊరడించి, నిశ్చింతగనుండుడని చెప్పి పంపివేసెను. ఆమీద శివుడు తనగణములలో నొకడగు మాల్యవంతుని పిలచి ఉజ్జయినిలో మహేంద్రాదిత్యునికి కుమారుడుగ జన్మించి, సప్తద్వీపేశ్వరుడవై, మ్లేచ్ఛులను నశింపచేసి, దేవకార్యమును తీర్పుమని ఆజ్ఞాపించెను. అట్లే మాల్యవంతుడు ఆరాజు భార్య గర్భమున ప్రవేశించెను. శివుడును స్వప్నమునందు ఆరాజుతో "ఓయీ! నీ కొకపుత్రుడు కలుగును. అతడు సద్వీపయుత పృథ్వి నాక్రమించి విక్రమాదిత్యుడనియు, శత్రువులయెడ వైషమ్యము వహించి విషమశీలుడనియు ప్రసిద్ధి నందును" అని చెప్పెను.

కొంతకాలమునకు మహేంద్రాదిత్యునికి కుమారుడు కలిగెను. అతడా బాలునికి విషమశీలుడని పేరు పెట్టెను. ఇతనికి యౌవనము వచ్చినమీదట అభిషిక్తుని చేసి రాజు కాశి కేగెను.

ఒకప్పుడు భద్రాయుధుడను ప్రతీహారి విక్రమాదిత్యునివద్దకు వచ్చి "దేవా! దక్షిణదిగ్విజయముకై విక్రమశక్తితో నీచే పంపబడిన అనంగదేవుడు దర్శనమునకై వేచియున్నాడు" అని చెప్పెను. రాజానుజ్ఞాతుడై వచ్చి అనంగదేవుడు సాపరాంతమగు దక్షిణాపథమును, మధ్యదేశమును, సౌరాష్ట్రమును, అంగవంగములును, కాశ్మీరమును, దుర్గములును, ద్వీపములు జయింపబడినవి. మ్లేచ్ఛసంఘములు నాశనము చేయబడినవి అనిచెప్పెను. విశేషము లేమైననున్న చెప్పుమని విక్రమాదిత్యుడు అడుగగా అనంగదేవుడు తాను సముద్రము దాటి సింహళద్వీపమున కేగి దాని రాజగు వీరసేనుని చూచితిననియు, ఆరాజు విక్రమాదిత్యునియెడ భక్తిగౌరవములను చూపి, తన కుమార్తెయగు మదనలేఖను ఆచక్రవర్తికి తనపరముగ అర్పించెననియు చెప్పెను.

పిమ్మట విక్రమాదిత్యుడు మరలివచ్చుచున్న తన సైన్యమును కనిసెను. అంతట ప్రతీహారులు అతనికి తనసామంతులలో గౌడరాజగు శక్తికుమారుని, కర్ణాటపాలకుడగు జయధ్వజుని, లాటరాజగు విజయవర్మను, కాశ్మీరపాలకుడగు సునందనుని, సింధురాజగు గోపాలుని, భిల్లరాజగు వింధ్యబలుని, పారసీకరాజును పరిచయ మొనర్చిరి.

ఒకప్పుడు విక్రమాదిత్యుడు ఒకసుందరిచిత్రమును చూచెను. ఆమె అతనికి స్వప్నమునను కనిపించెను. మలయవతియను ఆమెకొరకై అతడు మిక్కిలి బాధ నందెను. శంబరసిద్ధియనునతడు ఆసుందరి వాస్తవముగ నున్నదనియు, ఆమె సముద్రమున కావలనున్న మలయపురపాలకుడగు మలయసింహుని కుమార్తె అనియు చెప్పెను. పిమ్మట కొలది సైన్యముతో సముద్రమునుదాటి విక్రమాదిత్యుడా నగరమును ప్రవేశించెను. అప్పుడు శంబరసిద్ధి అతని బిరుదనామములను, గుణగణమును కీర్తించెను. వెంటనే మలయసింహుడు విక్రమాదిత్యుని పాదములకు నమస్కరించి, తనయింటికి తీసికొనిపోయి, సత్కరించి తనకుమార్తెయగు మలయవతి నతనికి సమర్పించెను.

# గాథాసప్తశతీ*

తం ణమహ జస్స వచ్ఛే లచ్ఛిముహం కోత్థుహమ్మి సంకన్తం।
దీసఇ మఅపరిహీణం ససిబిమ్బం సూరబిమ్బ వ్వ॥ ౫-౫౧

వక్షమునందున్న కౌస్తుభమణియందు మచ్చలేని చంద్రబింబము సూర్యబింబమును చేరినట్లు చేరి శోభించుచున్న రమాముఖముగల విష్ణువుకు నమస్కారము.

వణదవమసిమఇలఙ్గో రేహఇ విఞ్ఝో ఘణేహి ధవలేహిం।
ఖీరోఅమత్థణుచ్ఛలిఅ దుద్ధసిత్తో వ్వ మహుమహణో॥ ౨-౧౬

అడవులలో బయల్వెడలిన దావానలముయొక్క పొగచేత నల్లబడిన వింధ్యపర్వతము తెల్లని మేఘములతో క్షీరసాగరమథనమున బయల్వెడలిన పాలతో తడిసిన మధుమథనునివలె ప్రకాశించుచున్నది.

పేచ్ఛన్తి అణిమిసచ్ఛా పహిఆ హాలిఅస్స పిట్ఠపణ్డురిఅం।
ధూఅం దుద్ధసముద్దుత్తరన్తలచ్ఛిం విఅ సఅణ్హా॥ ౬-౭౫

పథికులు పిండి అంటుకొనుటవలన తెల్లగ కనిపించు కృషీవలుని పుత్రికను క్షీరసముద్రమునుండి పైకి వచ్చిన లక్ష్మిని దేవతలువలె ఆశతో చూచుచున్నారు.

అప్పహుప్పన్తం మహిమణ్డలమ్మి ణహసంఠిఅం చిరం హరిణో।
తారాపుప్ఫప్పఅరిఞ్చిఅం వ తఇఅం పఅం ణమహ॥ ౬-౧౧

భూమండలము చాలక ఆకాశమునకు పోయి అచ్చట నక్షత్రములను పుష్పములచే అలంకరింపబడినట్లు ప్రకాశించు హరియొక్క మూడవపాదమునకు నమస్కారము.

పఢమం వామణవిహిణా పచ్ఛా హు కఓ వి అమ్బుమాణేణ।
థణజుఅలేణ ఇమీఏ మహుమహణేణ వ్వ వలిబన్ధో॥ ౬-౧౪

మధుమథనుడు మొదట హ్రస్వరూపమునుండి పిమ్మట విజృంభించి బలిబంధము చేసినట్లే ఈమె స్తనయుగళము వళిబంధమొనర్చెను.

మణ్ణే ఆసాఓ చ్చిఅ ణ పావిఓ పిఅఅహరరసస్స।
తిఅసేహిం జేణ రఅణాఅరాహి అమఅం సముద్ధరిఅం॥ ౬-౯౦

ప్రేయసి అధరరసాస్వాదనభాగ్యము లభింపకపోవుటవలననే కాబోలును పాపము దేవతలు రత్నాకరము నుండి అమృతమును తెచ్చుకొనినారు!

ముహమారుఏణ తం కణ్హ గోరఅం రాహిఆఏ అవణేన్తో।
ఏతాణం వల్లవీణం అణ్ణాణ వి గోరఅం హరసి॥ ౧-౮౯

కృష్ణ! నోటితో గాలిని ఊది నీవు రాధిక కంటిలోని నలకను పోగొట్టి గోపికల గౌరవమును లేక తెల్లదనమును పోగొట్టితివి.

అజ్జవి బాలో దామోఅరో త్తి ఇఅ జమ్పిఏ జసోఆఏ।
కణ్హముహపేసిఅచ్ఛం ణిహుఅం హసిఅం వఅహూహిం॥ ౨-౧౨

---

* సాహిత్యాచార్య శ్రీ మథురనాథశాస్త్రిగారిచే సంకలనము చేయబడి, బొంబాయి నిర్ణయసాగర ముద్రాలయమున ముద్రింపబడిన ప్రతి.

ఇంకను దామోదరుడు బాలుడే అని యశోద చెప్పగా గోపికలు కృష్ణుని ముఖములోనికి చూచి గూఢముగా నవ్వుకొనిరి.

ణచ్చణసలాహణణిహేణ పాసపరిసంఠిఆ ణిఉణగోవీ ।
సరిసగోవిఆణం చుమ్బఇ కవోలపడిమాగఅం కణ్హం॥ ౭-౧౪

అనేకమంది గోపికలమధ్య ఉండియు నిపుణురాలయిన ఒకగోపిక మఱియొక గోపిక ప్రక్కకు చేరి, ఆమె నృత్యమును శ్లాఘించుమిషమున ఆమె కపోలమునగల కృష్ణుని ప్రతిబింబమును చుంబించెను.

కరిణాహత్థొవ్విఅ కహంచి మోఆవిఅజఇ మాహవస్స మిలిఏణ ।
భీమేణ జహిచ్ఛిఅఏ దాహిణవాఏణ ఛిప్పన్తో॥ ౫-౮౩

మధుమాసమున దక్షిణానిలముచే స్పృశింపబడిన పథికుడు మాధవునితోకూడిన భీముని దక్షిణపాదముచేత తన్నబడిన దుర్యోధనునివలె బాధ పడుచున్నాడు.

జఇ భమసి భమసు ఏమేఅ కణ్హ సోహగ్గగవ్విరో గామే ।
మహిలాణం దోసగుణే విచారఅఇఉం జఇ ఖమో సి॥ ౫-౮౭॥

కృష్ణ! సౌభాగ్యగర్వితుడనై గోకులమున తిరిగెదవా! స్త్రీలగుణదోషములను విచారించుటలో సమర్థుడవేని అట్లే తిరుగుము.

అచ్ఛాసణ్ణవివాహే సహసం జసోఆఇ తరుణగోవీహిం ।
వడ్ఢన్తే మహుమహణే సంబన్ధా ణిణ్హువిజ్జన్తి॥ ౭-౫౫॥

పెరుగుచున్న మధుమథనుని వివాహము మిక్కిలి సమీపించగా గోపికలు యశోదతో తమకు అతనితోగల సంబంధములను చెప్పకొనుచున్నారు.

దిఅరస్స అసుద్ధమణస్స కులవహూ ణిఅఅకుడ్డలిహిఆఇం ।
దిఅహం కహేఇ రామాణులగ్గ సోమిత్తి చరిఆఇం॥ ౧-౩౫॥

కలుషితమనస్కుడగు మరిదికి కులవధువు ప్రతిదినమును ఇంటిగోడమీద చిత్రింపబడిన రామానుజుడగు సౌమిత్రి పుణ్యచరిత్రమును చెప్పచున్నది.

* * *

రఇకేలిహిఅణిఅంసణకరకిసలఅరుద్ధణఅణజుఅలస్స ।
రుద్దస తఇఅణఅణం పవ్వఇపరిఉమ్బిఅం జఅఇ॥ ౫-౫౫॥

రతికేళిలో వివసనీకరింపబడిన పార్వతిచే రెండుకన్నులను కరకిసలయములచే మూయబడినపిమ్మట పరిచుంబింపబడిన శివుని తృతీయనేత్రమునకు జయమగుగాక !

పసువఇణో రోసారుణపడిమాసంకన్తగోరిముహఅన్దం ।
గహిఅగ్ఘపంకఅం విఅ సంఝాసలిలఞ్జలిం ణమహ॥ ౧-౧॥

కోపముచేత ఎర్రనైన గౌరీముఖచంద్రబింబమువలన ఎర్రతామరపువ్వా అను భ్రమ కలిగించు పశుపతి సంధ్యార్ఘ్యాంజలికి నమస్కారము.

పాణిగ్గహణే చ్చిఅ పవ్వఈఏ ణాఅం సహీహిం సోహగ్గం ।
పసువఇణా వాసుఇకఙ్కణమ్మి ఓసారిఏ దూరం॥ ౧-౬౯॥

పశుపతి తన చేతి సర్పకంకణమును దూరముగా జరపుటను చూచి పాణిగ్రహసమయముననే చెలులు పార్వతి సౌభాగ్యమును ఊహింపగలిగిరి.

సంఝాసమఏ జలపూరిఅంజలిం విహడిఏక్కవామఅరం।
గోరీఅ కోసపాణుజ్జఅం వ పమహాహివం ణమహ॥ ౫-౪౮॥

సంధ్యాసమయమున ఎత్తబడిన అంజలిలో ప్రతిబింబితమైన గౌరీముఖపద్మమును చూచి, మంత్రమును మఱచి, ఊరకనే పెదిమ కదుపుచున్న హరుని నమస్కరింపుడు.

జో సీసమ్మి విఇణ్ణో మజ్ఝ జుఆణేహిం గణవఈ ఆసీ।
తం చ్చిఅ ఏణ్హిం పణమామి హఅజరే హోహి సంతుట్ఠా॥ ౪-౭౨॥

ఓ వార్ధక్యమా! ఏగణపతి ఒకప్పుడు యువకులచేత నాతలక్రింద తలగడగ ఉంచబడెనో ఆగణపతికి నేను నమస్కరించుచున్నాను. నీవు తుష్టినందుము.

హేలాకరగ్గఅడ్ఢిఅ జలరిక్కం సాఅరం పఆసన్తో।
జఅఇ అణిగ్గఅవడవగ్గిభరిఅ గఅణోవ్వ గణణాహో॥ ౫-౩॥

లీలగా తొండపు చిగురుచేత సాగరజలమంతయు ఆకర్షించి, అనీద విజృంభించిన బడబాగ్నిచేత ఆకాశము నావరింపజేసిన గణాధిపతి జయించుగాక!

జారమసాణసముబ్భవభూఇసుహప్ఫంససిజ్జిరంగీఏ।
ణ సమప్పఇ ణవకావాలిఅఇ ఉద్ధూలణారంభో॥ ౫-౮।

జారప్రియుని చితాభస్మస్పర్శవలన కలుగు సుఖముచే ఆనంగడుగునకును శరీరమంతయు చమటపట్టుటవలన క్రొత్తగ కాపాలికమతమును స్వీకరించిన స్త్రీకి భస్మలేపనమే పూర్తికాలేదు.

కీరముహసచ్ఛహేహిం రేహఇ వసుహా పలాసకుసుమేహిం।
బుద్ధస్స చలణవన్దణపడిఏహిం వ భిక్ఖుసంఘేహిం॥ ౪-౮॥

బుద్ధచరణములకు నమస్కరించుచు క్రింద సాష్టాంగముగ పడిన భిక్షుసంఘమువలె శుకముఖములతోను, పలాశపుష్పములతోను భూమి ప్రకాశించుచున్నది.

కిం రుఅసి ఓణఅముహీ ధవలాఅన్తేసు సాలిచ్ఛేత్తేసు।
హరిఆలమణ్డిఅముహీ ణడి వ్వ సణవాడిఆ జాఆ॥ ౧-౯॥

ఈ తెల్లని వరిభూమిలో ముఖము వంచుకొని ఏల ఏడ్చెదవు? ఈ శనగచేను అర్దళము పూయబడిన నటిముఖము వలె అయినది.

ఆఅరపణామిఓట్ఠం అఘడిఅణాసం అసంహఅణిడాలం।
వణ్ణఘిఅతుప్పముహీఏ తీఏ పరిఉమ్బణం భరిమో॥ ౧-౨౨॥

ముఖమున రంగుగల నేతిని ధరించుటవలన లలాటమును, ముక్కును తగులకుండునట్లు ముందుకు చాపబడిన ఆమె అడుగుపెదవిని పెట్టిన ముద్దును నేడు స్మరించుచున్నాము.

ణ్హాణహలిద్దాభరిఅన్తరాఇం జాలాఇం జాలవలఅస్స।
సోహన్తి కిలిఞ్జిఅకణ్ణఏణ కం కాహిసీ కఅత్థం॥ ౧-౮౦॥

స్నానము చేయునప్పుడు చిల్లులగాజులయొక్క చిల్లులలో చేరినపసుపును వెదురుపుల్లతో తీసివేయుచున్న నీవు ఎవనిని కృతార్థుని చేతువు?

ణుజ్జంగరాఅసేసేణ సాసుల్లీ తహా ఖరేణ సోహూరా ।
సా కిర గోలా ఊలే ణ్హాఅ జముబ్బకసాపేణ॥ ౨-౮౯॥

ఆమె సుకుమారి అయినను తీక్ష్ణమును శేరెసుపండ్లకషాయముతో కలిసినదియు అగు నీలంగరాగశేషముతో గోదావరి ఒడ్డున స్నానము చేసినది.

గిజ్జన్తే మజ్జలగాఇఆహిం వరిగోత్తదిణ్ణఅణ్ణాఏ।
సోఅం వ ణిగ్గఓ ఉఅహా హోన్తస్సహుఆఇ రోమఞ్చో॥ ౭-౭౨॥

స్త్రీలు మంగళగీతికలు పాడుచు వరుని పంశప్రశంస చేయుచుండగా నవవధువుకు వానిని వినుటకోయన గోమాంచము పొడసూపెను.

మణ్ణే ఆఅణ్ణన్తా ఆసణ్ణవివాహమఙ్గలుగ్గాఇం॥
తేహిం జువాణేహి సమం హసన్తి మం వేఅసకుడఙ్గా॥ ౭-౮౩॥

నావివాహమంగళగీతికలు సమీపించినవని విని పెదురుపొదలు ఆ యువకులతో కలసి నన్ను పరిహసించుచున్న వని అనిపించుచున్నది.

ఉఅగఅచఉత్థిమఙ్గలహో ఘి ఏఓ అసవిసేసలగ్గేహిం।
ఠీఅ వరిస్స ఆ సేఅం సుఏహిం దుణ్ణం వ హత్థేహిం॥ ౭-౮౪

త్వరలో నిర్వర్తింపబడు చతుర్థీమంగళము అయిన పిమ్మట రాబోవు విరహమును ఊహించి ఒండొరులను దృఢముగ ఆలింగనము చేసుకొనిన ఆమెయొక్కయు వరునియొక్కయు చేతులమీది స్వేదబిందువులు కన్నీటిబిందువులవలె కనిపించుచున్నవి.

కరిమురి అ ఆలగ్గజలఅణివడనపడిరవో ఏసో।
పఇణో ధణురవకఙ్ఖిరి రోమఞ్చం కిం ముహా వహసి॥ ౧-౫౭

నీ భర్తయొక్క ధనుష్టంకారమునకు ఎదురుచూచుచున్న ఓ బందీ! ఇది అకాలమేఘగర్జనముయొక్క శబ్దము, వృథగా ఎందుకు రోమాంచము కలిపించుకొందువు.

విజ్ఝావిజ్జఇ జలణో గహవఇధూఆఇ విత్థఅసిహోవి।
అణుమరణఘణాలిఙ్గణపిఅఅమసుహసిజ్జిరఙ్గీఏ॥ ౫-౭

మంటలు విస్తారముగ పైకి లేచినను, మరణించువరకును ప్రియుని గాఢముగ ఆలింగనము చేసుకొనుటవలన జనించిన చెమటతో ఆ స్త్రీచేత అగ్ని అణచివేయబడుచున్నది.

[cf. ౫-౮౯; ౭-౩౩]

పాణఉడీఅ వి జలిఊణ హుఅవహో జలఇ జణ్ణవాడమ్మి।
ణ హు తే పరిహరిఅవ్వా విసమదసాసంఠిఆ పురిసా॥ ౩-౭౭

పానశాలలో వెలిగిన అగ్నియే యజ్ఞశాలయందును వెలుగును. స్థిత్యంతమును పొందినంతమాత్రమున నీవు పురుషులను నిరాకరింపరాదు.

[cf. ౬-౫౦]

కారిమమాణన్దవడం భామిజ్జన్తం బహూఅ సహి ఆహిం।
పేచ్ఛఇ కుమారి జారో హాసుమ్మిస్సేహి అచ్ఛీహిం॥ ౫-౫౭

వధువుయొక్క కృత్రిమానందపటమును ఆమె చెలులు ప్రదర్శింపగా జారుడు చిరునగవులతో చూచుచున్నాడు.

గేహూహ పతోఅహ ఇమం పహాసిఅవఅణా సఆస్స అప్పేఇ।
జాఅ సుఅపఢ ముబ్భిణ్ణద న్తజుఅలజ్కిఅం బోరం॥ ౨-౧౦౦

భార్య బాలింత గా వచ్చిన పల్లెలో కుమారుడు కొరికిన రేగ బుగ్గను నవ్వుచు "ఇదిగో చూడండి" అని భర్తకు చూపుచున్నది.

ఏక్కోవి కహ్ణసారోణ దేఇ గన్తుం పఆహిణవలన్తో
కిం ఉణ బాహా ఉలిఅం లోఅణజుఅలం పిఅఅమాఏ ౧.౨౬.

ఒక్క లేడియే కుడినుండి యెడమకు తిరిగిన ప్రయాణము జరుగదు. అట్టియెడ రెండు మృగములు తిరిగినచో ప్రయాణము ఎట్లగును ?

మహమహఇ మలఅవాఓ అత్తా వారేఇ మం ఘరాణే న్తిం।
అజ్కోల్లపరిమలేణ వి జో క్ఖు మఓ సో మఓ చ్చేఅ॥ ౫-౯౭.

మలయపవనము తహతహ చెందించుచున్నది. అత్తగారు ఇంటినుండి బయటికి పోనిచ్చుట లేదు. ఇంటి ముందుగల అంకోటవృక్షపరిమళము నంపివేయుచున్నది.

పఞ్జరసారిం అత్తా ణ ణేసి కిం ఏత్థ రఇహరాహిన్తో।
వీసమ్భజమ్పిఆఇం ఏసా లోఆణం పఅడేఇ॥ ౬-౫౧.

అత్తా ! రతిగృహమునుండి ఈపంజరములోని చిలుకను మరియొకచోటకి ఏల మార్చవు ? రహస్యముగ అను కొనిన మాటలను ఇది లోకమునకు చాటుచున్నది.

వణ్ణక్కమరహిఅస్స వి ఏస గుణో ణవరి చిత్తకమ్మస్స।
ణిమిసం పి జం ణ ముఞ్చఇ పిఓ జణో గాఢమువఊఢో॥ ౭-౧౨.

రంగులులేక కేవలమును గీతలలోనే ఉన్న ఈచిత్రమునందుసహితము ప్రియుడు ప్రియను ఒక్కనిమిష మైనను వదలుట లేదు.

అహ సా తహిం తహిం చ్చిఅ వాణీరవణమ్మి చుక్కసంకేఆ।
తుహ దంసణం విమగ్గఇ పబ్భట్ఠణిహాణఠాణం వ॥ ౪-౧౮.

ఆమె అనవాలు మరచి పాతిపెట్టిన స్థలమును మరచినవానివలె ఆవెదురుపొదలలో నిన్ను అడుగడుగునను వెదకుచున్నది.

ణీఆఇం అజ్జ ణిక్కివ పిణద్ధణవరఙ్గఆఇ వరాఈఏ।
ఘరపరివాడీఅ పహేణఆఇం తుహ దంసణాసాఏ॥ ౪-౨౮.

ఓనిర్దయుడా ! నీవు కనిపించెదవను ఆశతో ఆమె ఇంటింటను తిరిగి లెక్కపెట్టి వాయనములను పంచి పెట్టినది. (cf. 3.3)

ఉప్పహపహావిహాజణో పఙ్కిల్లమ్మి అకలఅలో పహఅతూరో।
అబ్బో సో చ్చేఅ ఘణో తేణ విణా గామడాహోవ్వ॥ ౭-౩౫.

గంతులు వేయుచు పరుగెత్తుచున్న జనులతో, ఎక్కువ అగుచున్న కలకలముతో, ఘోషింపబడుచున్న తూర్యములతో ఈ ఉత్సవము అతడు లేకుండుటవలన గ్రామదహనమువలె ఉన్నది.

ఉప్ఫల్లిఆఇ ఖేల్లఉ మా ణం వా.రేహి హోఉ పరి ఊఢా॥
మా జహణభారగరుఈ పురిసాఅ న్తి కిలిమ్మిహిఇ॥ ౨-౯౭.

ఆమెను ఉత్ఫుల్లికా అను ఆటను ఆడునట్లు ఆడనిమ్ము. జఘనభారమువలన అంతనులభముగ ఆమెకు అలసట కలగను.

ణవలఅపహారం అఙ్గే జహి జహి మహఇ దేవరో దాఉం।
రోమఞ్చదణ్డరాఈ తహిం తహిం దీసఇ బహూఏ॥ ౧-౫౮

శరీరమునందు ఎచ్చటనెచ్చట నవలతికతో దేవరుడు కొట్టుచున్నాడో అచ్చటచ్చట ఆమెకు రోమాంచము కలుగుచున్నది.

ఇఅరో జణో ణ పావఇ తుహంజఘణారుహణసంగమ సుహేల్లిం।
అణువహఇ కణఅడోరో హుఅవహరుణాణం మాహప్పం॥ 3-౧౧.

అగ్నివరుణులమహాత్మ్యమువలన (అగ్నిపానీయపరీక్షము చేసియుండుటవలన) బంగారుమొలత్రాడు నీజఘనారోహణాదిసుఖము ననుభవించుచున్నది. అది ఇతరునికి లభ్యము కాదు.

ఫగ్గుచ్ఛణణిద్దోసం కేణ వి కద్దమపసాహణం దిణ్ణం।
థణ అలసముహపలోట్టన్తసే అధోఅం కిణో ధుఅసి॥ ౪-౬౯.

ఫాల్గునోత్సవకాలమున నిర్దోషముగ పరిగణింపబడుటవలన ఎవడో నీపైని బురద చల్లినాడు. ముఖమునుండి స్తనములవరకును చెమటకారుచున్న నీవు ఇంకను ఏల పరుగెత్తుదువు?

దఇఅకరగ్గహాలులిఓ ధమ్మిల్లో సీహుగన్ధిఅం వఅణ।
మఅణమ్మి ఏ త్తిఅం చిఅ పసాహణం హరఇ తరుణీణం॥ ౬-౪౪.

ధమ్మిల్లము ముడి ప్రియునిచే విప్పబడినది. నోరు మధువువాసన కొట్టుచున్నది. మదనోత్సవమునందు ఇట్టిదే అభూషణము.
cf. ౬. ౪౫.

ఘేత్తూణ చుణ్ణముట్ఠిం హరిసూససిఆఏ వేపమాణాఏ।
భిసిణేమి త్తి పిఅఅమం హత్థే గన్ధోదఅం జాఅం॥ ౪-౧౨.

గుప్పెట నిండ రంగుముగ్గును తీసికొని ప్రియునిపై చల్లవలెనని అనుకొనిన ఆమె చేతిలో అతనిని చూడగనే అది గంధోదక మయ్యెను.

మహిసక్ఖన్దవిలగ్గం ఘోలఇ సిఙ్గాహఅం సిమిసిమ న్తం।
ఆహఅవీణాఝుంకారసద్దముహలం మసఅవున్దం॥ ౬-౬౦.

గేదెభుజమున వ్రేలాడుచు, కొమ్ముచే కొట్టబడుచు, వాయింపబడుచున్న వీణనుండి వచ్చు శబ్దమువలె సిమసిమయని ధ్వనిచేయుచు దోమలగుంపు ఎగురుచున్నది.

అలీఏణో దోమఃహాఓ తా ముహురో భోఅణం ముహే జావ।
మురఓ వ్వ ఖలో జిణ్ణమ్మి భోఅణో విరస మారసఇ॥ 3-93.

అకులీనుడగు వీడు మృదంగమువలె రెండుముఖములు కలవాడును, ముఖమునందుండునంతకాలమును మధుర మాగనుండి అన్నము పోవుటతోడనే నీచభాషియునై ఎంతవిరసముగ నున్నాడో చూడుము.

అణత్తం తేణ తుమం పఇణో పహాఏణ పడహసద్దేణ।
మల్లిణ లజ్జసి ణచ్చసి దోహగ్గే పాఅడిజ్జన్తే॥ 2-79.

నీభర్త పటహము వాయించి నీదౌర్భాగ్యమును చాటుచుండగా నీవు సిగ్గుపడక నృత్యము చేయునట్లు గంతులు వేయుచుంటివే?

అజ్జవ్వేఅ పఉత్థో అజ్జవ్విఅ సుణ్ణఆఇం జాఆఇం।
రత్థాముహదేఉలచత్తరాఇం అహ్మం చ హిఅఆఇం॥ 2-90.

అతడు నేడే స్థలాంతరమునకు పోయినాడు. అందువలన వీథిమొదటగల దేవాలయప్రాంగణమును, మా హృదయములును శూన్యములైనవి

జన్తిఅ గులం విమగ్గసి ణ అమే ఇచ్ఛాఇ వాహసే జన్తం।
అణరసిఅ కిం ణ అణసి ణ రసేణ వినా గులో హోఇ॥ 6-98.

ఓయీ! నేను చెప్పునట్లుకాక కేవలము బెల్లముకొరకే గానుగను ఆడుచున్నావు. అరసికుడా! రసములేనిదే బెల్లము కాదని తెలియదా?

ణిప్పణ్ణసస్సరిద్ధీ సచ్ఛన్దం గాఇ పామరో సరఏ।
దవిఅణవసాలితణ్డులధవలమిఅఙ్కాసు రాఈసు॥ 2,79.

చంద్రుడు పొట్టలు చీల్చి పైకివచ్చిన క్రొత్తశాలిధాన్యమువలె తెల్లగ ప్రకాశించుచున్న శరద్రాత్రులలో పామరుడు సహితము స్వేచ్ఛగా పాడుచున్నాడు.

సంవాహణసుహరసతోసిఏణ దేన్తేణ తుహ కరే లక్ఖం।
చలణేణ విక్కమాఇత్తచరిఅం అణుసిక్ఖిఅం తిస్సా॥ 9-64.

చక్కగా కాళ్ళను పట్టుటయందు సమర్థుడవగు నాచేతికి లాక్షారాగమును అంటించిన ఆమెపాదము నాకు విక్రమునరెండ్రని చరితమును తెల్పెనది.

సత్తసతాఇం కఇవచ్ఛలేణ కోడీఅ మజ్ఝ ఆరమ్మి।
హాలేణ విరఇఆఇం సాలఙ్కారాణం గాహాణం॥ 1-3.

సాలంకారములగు కోటిగాథలలోనుండి కవివత్సలుడగు హాలునిచేత ఏడువందలు ఏరి కూర్పబడినవి.

రిసిఅజణహిఅఅదఇఏ కఇవచ్ఛలపముహసుకఇణిమ్మవిఏ।
సత్తసఅమ్మి సమత్తం పఢమం గాహాసఅం ఏఅం॥

రసికజనహృదయదయితుడగు కవివత్సలుడుముఖ్యులగు కవులు సంకలనముచేసిన సప్తశతకమున మొదటిశతకము సమాప్తము.

అవణ్ణాణం కులాణం దోవ్వి అ జాణన్తి ఉణ్ణాణం నేఉం
గోరీఅ హిఅఅదఇఓ అహవా సాలాహణారిన్దో॥ ౫-౬౭.

ఆపన్నులసమూహములను ఉద్ధరించుట గౌరీభర్తకును, శాలివాహనరేందునికిని మాత్రము తెలియును.

ఇఅ సిరిహాలవిరఇఏ పాఉఅకవ్వమ్మి సత్తసఏ।
సత్తమసఅం సమత్తం గాహాణం సహావరమణిజ్జం॥ ౭-౧౦౧.

ఇట్లు శ్రీహాలునిచే రచింపబడిన సప్తశతియను ప్రాకృత కావ్యమున స్వభావరమణీయమగు ఏడవశతకము పూర్తి అయినది.

# ఆవశ్యకసూత్రం*

సంవేళత్తిగయం ఇమాణం పణిహిత్తి పణిహీ,
నామ మాయా సా దువిహా దవ్వపణిహీ య భావ—
పణిహీయ దవ్వపణిహీఏ ఉదాహరణగాహా :—

భరుయచ్ఛే జిణదేవో భయంతమిచ్ఛే కులాణభిక్ఖూ య।
పఇట్ఠాణ సాలవాహన గుగ్గులభగవం చ ణహవాణే॥

వ్యాఖ్యా కథానకా దవసేయా, తచ్చేదం— భరుయచ్ఛే ణహరే నహవాహణో రాయా కోససమిద్ధో, ఇఓ య పఇట్ఠాణే సాలవాహణో రాయా బలసమిద్ధో, సో నహవాహణం రోహేఇ, సో కోససమిద్ధో జో హత్థం వా సీసం వా ఆణేఇ తస్స సయసహస్సగం విత్తం దేఇ, తాహే తేణ నహవాహణమణూసా దివే వి మారంతి, సాలవాహణమణూస్సావి కేవి మారిత్తా ఆణేంతి, సో తేసిం న కించి దేఇ, సో ఖీణజణో పడిజాఇ, నాసిత్తా పుణోవి బితియవరిసే ఏఇ, తత్థవి తహేవ నాసఇ, ఏవం కాలో వచ్చఇ, అణ్ణయాఅమచ్చో భణఇ— మయం అవరాహేత్తా నివ్విసయం ఆణవేహ మ ణుపగాణి య బంధాహి, తేణ తహేవ కయం, సోవి నిగ్గంతూణ గుగ్గులభారం గహాయ భరుయచ్ఛమాగఓ, ఏగత్థ దేవఉలే అచ్ఛఇ, సామంత రజ్జేసు ఫుట్టం— సాలవాహణేణం అమచ్చో నిచ్ఛూఢో, భరుయచ్ఛే ణాఓ, కేణతి పుచ్ఛిఓ కో సోత్తి, భణఇ— గుగ్గులభగవం నామ అహంతి, జేహింణా ఓతాణ కహేఇ జేణ విహాణేణ నిచ్ఛూఢో, అహలహు సే గణత్తి, పచ్ఛా నహవాహణేణ సుయం, మణుస్సా విసజ్జియా నేచ్ఛఇ కుమారామచ్చత్తణస్స గంధంపి సోఢం, సోయ

* శ్రీమద్భద్రబాహుస్వామిప్రణీత నిర్యుక్తియుక్త శ్రీమద్ధరిభద్రసూరిశేఖరసూత్రిత వృత్తిపరివృతము. ఆగమోదయసమితి ప్రచురణము—JBORS. vol. XVI. pp. 200—201.

ఆవశ్యకసూత్రనిర్యుక్తి క్రీ. పూ. 58—క్రీ. శ. 150 నాటిది. చూర్ణి క్రీ. శ. 9వశతాబ్దిది. భాష్యము క్రీ. శ. 5, 6 శతాబ్దులనాటిది. హరిభద్రసూరి 9వ శతాబ్దియందుండెను.

రాయా సయం ఆగఓ, కవిఓ అమచ్చో, వీసంభం జాణి ఊణ భణఇ— పుణ్ణేణ రజ్జం లబ్భఇ, పుణోవి అణ్ణస్స జమ్మస్స పత్థయణం కరేహి, తాహే దేవకులాణి థూభతలాగవా వీణ ఖణావణాది ఏహిం దవ్వం ఖఇయుం సాలవాహణో ఆవాహిఓ పుణోవి తావిజ్జఇ అమచ్చం భణఇ తుమం పండిఓ త్తి సో భణఇ ఘడామి అంతే ఉరియాణో ఆభరణేణంతి పునో గఓ పఇట్ఠాణంతి పచ్ఛా పుణో సంతే ఉదిఓణివ్వాహేఇ, తమ్మి ణిట్ఠియే సాలవాహణో ఆవాహిఓ, నత్థి దాయవ్వం సోవిణట్ఠో, నట్ఠం నయరం పిగహియం, ఏసా దవ్వపణిహీ భావపణిహీప ఉదహారణం—

# అభిధానరాజేంద్రే*

...మాయాయాం సా చ ద్వివిధా ద్రవ్యప్రణిధిః
భావప్రణిధ శ్చ తత్ర ద్రవ్యప్రణిధా ఉదాహరణం :—

భరుఅచ్ఛే జిణదేవో భయంతమిత్తో కుణాలభిక్ఖూ అ।
పఇట్ఠాణ సాలవాహణ గుగ్గులభగవం చ నహవాణే॥

భరుకచ్ఛపురే ఽత్రాఽసీ ద్భూపతి ర్నరవాహనః।
స సమృద్ధాఽఽత్మకోశస్య శ్రీమద ప్యవమన్యతే॥
ఇతః ప్రతిష్ఠానపురే పార్థివః శాలవాహనః।
బలేనాపి సమృద్ధః స రురోధ నరవాహనం॥
ఆనయ త్యరిశీర్షాణి య స్తస్యాఽఽదా న్మహార్థికః।
లక్షం విపక్షం త త్తస్య నిత్యం నిఘ్నన్తి తద్భటాః॥
హా తస్యాఽపి భటాః కేఽపి ఆనిన్యుః సోఽదాన్న కించన।
సోఽథ క్షీణజనో నష్ట్వా పున రేతి సమాంతరే॥
పున ర్నష్ట్వా తథైవైతి నాఽభూ త్త ద్గ్రహణక్షమః।
అథైకో మాయయా హేలం సచివో నిరవాస్యత॥
స పరంపరయాఽజ్ఞాసీ ద్భరుకచ్ఛనరాధిపః।
అపాస్తోఽల్పాపరాధోఽపి నిజామాత్య స్తతః కృతః॥
జ్ఞాత్వా విశ్వ స్తం సోఽవ క్తం రాజ్యం పుణ్యేన లభ్యతే।
త దన్యస్య భవస్యార్థే పాథేయం కురు పార్థివ॥

* vol. V. p. 313; JBORS. vol. XVI pp. 291—92.

ధర్మస్థానవిధానాద్యై ర్ద్రవ్య మప్యాయయ త్తతః।
ఆగా న్మన్త్రిగిరా హాలః పార్థివో౽థా౽హ మన్త్రిణం॥
మిలితో౽సి కి మస్య త్వం సో౽వద న్న మిలామ్యహం।
అథా న్తఃపురభూషాదిద్రవిణై స్తం తదా౽క్షిపత్॥
హాలే౽థ పునరాయాతే నిర్ద్రవ్యత్వా న్ననాశ సః।
నగరం జగృహే హాలో ద్రవ్యప్రణాధి రేషికా॥

* * *

## ఐతరేయ బ్రాహ్మణము

తస్య హ విశ్వామిత్ర స్యైకశతం పుత్రా ఆసుః పంచాశత్ ఏక జ్యాయాంసో మధుచ్ఛందసః పంచాశత్ కనీయాంసః తద్యే జ్యాయాంసో న తే కులం మేనిరే తాన్ అనువ్యాజహార తాన్ వః ప్రజా భక్షీష్టేతి త ఏతే౽ంధ్రాః పుండ్రాః శబరాః పుళిందా మూతిబా ఇత్యుదంత్యా బహవో భవంతి వైశ్వామిత్రా దస్యూనాం భూయిష్ఠాః।



కార్లా - చైత్య గృహా ముఖము



కార్లా - చైత్యగృహము, వసారాగోడమీది శిల్పములు



కార్లా – చైత్య గృహ స్తంభములు.



కార్లా - చైత్య గృహము



నాసిక : యజ్ఞశ్రీ నాటి చైత్య గృహము




శంఖరం - లింగాల మెట్టమీది చైత్యములు.



శంఖరం - బొజ్జన్నకొండమీది శిలాచైత్యము, విహారములు.



బేడ్సా - చైత్యగృహములో వసారా గోడలమీది శిల్పములు



అమరావతి - చైత్యఫలకము




అమరావతి - బుద్ధ విగ్రహములు




రామతీర్థము – కొండమీఁద విహార శిథిలములు.



Amaravathi - Cornice Sculptures.



Gummadidurru Cornice Sculptures.



భాజా - గుహాంతర్భాగము



భాజా - విహారాంతర్భాగము